శ్రీ ర స్తు

# శ్రీ నవకోసల రామాయణము

## హ రి క థ.



శ్రీరామపుత్ర విరచితము



[ దీనివెల రు. 2

వెలకు దొరకు చోటు:—

శ్రీ లక్ష్మీనారాయణస్వామి భజనమందిరము,
అత్తితోట అగ్రహారము—నెల్లూరు

శ్రీ సాధన ముద్రాశాల,
అనంతపురము.

శ్రీరామజయం.

# విజ్ఞప్తి.

ఆర్యులారా! సోదరసోదరీమతల్లులారా!

నేను భగవద్గుణానుసంధానముచేయుచు, శ్రీకృష్ణ శ్రీరామ చరిత్రములను చిన్నచిన్న కథలుగా రచించి, యానందించుచుంటిని. శ్రీమద్రామాయణమును పూర్తిగా వ్రాయవలయునను కుతూహలము, చిరకాలమునుండి నాహృదయంబున నాటియుండెను. కాని ఆమహాకావ్యంబును వ్రాయ అసమర్థతగల్గియు, శ్రీరామచంద్రు డాజ్ఞనీయమియు, నూరకుండి సదా సద్గురుండైన రామచంద్రుని ధ్యానించుచుండ, ఒకానొకప్పుడు నామిత్రులంగూడి, నవకోసలంబున చిరపరిచితురాలైన విడవలూరి కామమ్మతో, నిష్టాగోష్ఠి కావించుచుండ ఆయమ "అమ్మా! మీరనేకపుస్తకములు రచించితిరి. శ్రీమద్రామాయణమును కీర్తనరూపముగ రచింపుడని వేడుకొనెను. అందుకు నేనీదినమున రాము డాజ్ఞయొసంగిన వ్రాసెదనంటిని. అంత నానాటి వేకువ శ్రీహరిధ్యానము జేయునెడ అంజనేయుం డెదురనిలచి, "అమ్మా! శ్రీమద్రామాయణము రచింపుము, నేను తోడుపడెద" నని వక్కాణించె. అంత నే సంతసించి హితులకెఱిగించి శ్రీమద్రామాయణ హరికథను నవకోసల కోదండరామార్పితంబుగ వ్రాయంబూనితి. అది మొదలు విడవలూరి కామమ్మ ప్రోత్సాహము బలపడినది. మఱియును నిరంతర హరిభజన కుతూహలాయత్త చిత్తయు, పరమభాగవతోత్తమయు, నా చిరమిత్రము, రుక్మిణియను సాధ్వి నాకు తోడ్పడ ఈరామచరితము వ్రాయగలిగితి. ఈ చరితంబును వ్రాయుచు శ్రీయుతులును శ్రీరామపదసేవాసక్త చిత్తులు, శివపూజా ధురంధరులు, ఉభయభాషాకోవిదులు, బ్రహ్మశ్రీ ప్రయాగ వెంకటరామశాస్త్రి గారీనవకోసల రామాయణమున పొసంగిన దోసంగుల నరసి సవరణగావించి ప్రచురింపజేసిరి. ఇట్టి మహోపకారంబు గావించిన యాసాధు శిఖామణికి శ్రీరామ చంద్రమూర్తి ఆయురారోగ్య ఐశ్వర్య సత్సంతాన సౌభాగ్య సకలసంపదలొసంగి

సర్వకాల సర్వావస్థలయందు సమస్తశుభంబులిచ్చి రక్షించుగాత. మరియు కీర్తిశేషురాలును, శ్రీరామ భక్తురాలయిన నూకలపాటి రామమ్మ ఆత్మశాంతికై ఆయమ ప్రియపుత్రియైన విడవలూరు కామమ్మ ఈ రామాయణంబును ప్రచురింపదగిన ధనసాహాయ్యమును గావించుటయే కాక మఱియు ననేకవిధములఁ దోడ్పడినది. ఆకాంతామతల్లికి నవకోసల పురాధివాసుడగు శ్రీకోదండ రామస్వామి యభిమతములొసంగి ఆయురారోగ్య సంపదలిచ్చి మోక్షసామ్రాజ్యమును ప్రసాదించుఁగాత !

ఈశ్వర జ్యేష్ఠ
శుక్ల పంచమి.

ఇట్లువిన్నవించు సాధుజన విధేయురాలు,
శ్రీ రామ పుత్రి.

---

# శ్రీ

# పీఠిక

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్॥

పరి త్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే॥

అని భగవంతుఁడు భాగవతోత్తముఁడయిన యర్జునునితో నుడివిన వడువున సర్వ లోకస్థితి కాశ్రయమయిన ధర్మవృక్షము నధర్మ జంఝామారుత ముద్ధూత లాగింప సాధువుల కసాధువులచే నొత్తిడికలుగునప్పు డీశ్వరుం డతనిమై నవతరించి యధర్మమును దొలఁగించి ధర్మమును సంస్థాపించు చుండును. అట్టి భగవద్విలాసములనే యవతారము లందురు. అట్టి యవతారములు విభూతి యోగమున జెప్పిన చొప్పున ననేకములు గలవు గాని యన్నిటిలో శ్రీరామ కృష్ణావతారములే ప్రధానములుగ నెంచఁబడుచున్నవి. ఆర్యులయిన మహర్షులా యా యవతారము లందలి విలాసములను దమ దివ్యజ్ఞాన నేత్రముల నవలోకించి యానంద పరవశులై పలువిధములఁ బాడుచు వచ్చిరి. ఆ పాటలే శ్రీమద్రామాయణాది గ్రంథరాజములు. అయినను భారతీయులలో ననేకులు కవులు రామాయణకథ నధికరించియే కావ్యములు, చంపువులు, నాటకములు, మున్నగు కృతులను గూర్చుచు వచ్చిరి. సుప్రసిద్ధుఁడగు భట్టమురారి కవి తన యనర్ఘరాఘవమున "యదిక్షుణ్ణం పూర్వైరితి జహాతి రామస్యచరితం గుణైరేవా వద్భిర్జయతి పునరన్యోజగతికః" అని శ్రీరామ చంద్రుని లోకోత్తర చరిత్రునిగాఁ జాటిచెప్పి యున్నాడు. ఆంధ్ర కవులందును భారతాదుల కథలకంటె రామాయణకథను గైకొని గ్రంథరచన గావించినవారి సంఖ్యయే హెచ్చనుట సత్యదూరముకాదు. రంగనాథ రామాయణము, భాస్కర రామాయణము, గోపీనాథ రామాయణము, ఆనంద రామాయణము, ఆంధ్ర వాల్మీకి రామాయణము, శ్రీమదాంధ్ర రామాయణము మున్నగు గ్రంథము లాంధ్ర వాఙ్మయమున కలంకార ప్రాయములై యలరారు చున్నవి కదా. మొల్ల

మున్నగు కవయిత్రీమతల్లులును శ్రీరామ చరిత్రమునే సరసముగ వర్ణించి యాంధ్ర సారస్వత ప్రపంచమున శాశ్వతజీవనము నందియున్నారు.

ఆంధ్రమునగల రామాయణ కృతిరత్నములలో రామపుత్రీ విరచితమైన యీ నవకోసల రామాయణ మొకటి. ఈ రామాయణము తొల్లిటివానివలె పద్య రూపమును దాల్పక చాలవఱకు గేయరూపమున వెలయుచున్నది. ఈ కృతియందు పెక్కు కీర్తనలు త్యాగరాజు కృతుల ననుకరించి యున్నవి. ఇందు ఆయా ఘట్టముల యథోచితముగ నాయా రసములు మనోహరముగఁ బోషింపఁ బడినవి. రసానుగుణములగు రాగములతో తదనుగుణములగు తాళములతో నిండలి కీర్తన లింపుగులుకు చున్నవి. మచ్చున కొండు రెండు:-

(భరతుడు అన్నను వేడుట.)

శంకరాభరణం — ఆది

ప॥ నమ్మితి గొనుమన్నా సాకేత నిలయులకు సంతన మొదవ ॥న

అ॥ నెమ్మనమున నెనరుంచి నాపై నేరములెంచక నీక్షితినేల ॥న

చ॥ ఇంత పిన్నవానిపై నీకెందుకు దయరాదో
పంతముజూప నెంతవాడ నీపాదముల నమ్మితి నవకోసలరామ ॥న

ఇం దేకాండమున కాకాండము ఏ ఘట్టమున కాఘట్టము రసోల్లసితమై భాగవతుల హరికథా కాలక్షేపములందు శ్రోతల యుల్లంబుల పల్లవింపఁజేయు గలవని ముమ్మాటికిఁ జెప్పనొప్పును.

"నాహం వసామి వైకుంఠే నయోగి హృదయే రవౌ
మద్భక్తా యత్రగాయంతే తత్రతిష్ఠామి నారద"

అని శ్రీ మహావిష్ణువు వచించినట్లు ఇట్టి యుత్తమకృతిని గానముచేయు నపుడు శ్రీహరి యచ్చట తాండవించు చుండునని నానమ్మకము.

ఇది గేయమైనను పెక్కుచోట్ల వాల్మీకి రామాయణమును సర్వవిధముల ననుకరించు చున్నది. కొన్నియెడల అధ్యాత్మ రామాయణ సందర్భములను బోలియున్నది. ఉదా॥

ధారయామి తవపాదపంకజే నాథ దారు దృషదోః యదంతరం
మానుషీ కరణ చూర్ణమస్తి తే పాదయో రితి కథాప్రథీయతే.

శ్రీమనోహర — ఏక.

ప॥ చరణాంబుజముల నిటు లిమ్మా శ్రీ రఘుకులవర నీ ॥చ

అ॥ కరుణాలయ నీపదయుగళంబుల గడిగి ధన్యుడ నయ్యెద నీ ॥చ

చ॥ నీపద పరాగముల నిల్ల నేర్పుమీఱర పడతియయ్యెగా
ఏపగిది తరుణిగాకుండు నీదారుమయమగు తరణి నీ ॥చ

(2) సరోజభవ భవాదిసురముని సన్నుతచరితా
ధరాధిపతి నవకోసలపుర కోదండరామ బ్రోవ నీ ॥చ

ఈ గేయ ప్రబంధ మామూలాగ్రముగ భక్తి రసోల్లసితమై వినఁ జదువఁ దటస్థించిన భక్తజనుల చిత్తముల హర్షపరవశములఁ గావించుననుట యథార్థ కథనము.

రామపుత్రికలగు రుక్మిణీ సుబ్బమాంబ లిట్టి యుత్తమ కృతిరత్నముల నింక నెన్నిటినో రచించి, తమకును తమ కన్నదేశమునకును వన్నె గూర్చునట్లు పరమేశ్వరుం డనుగ్రహించుఁగాక.

రాజమండ్రి,
ఈశ్వర, జ్యేష్ఠ శుద్ధ పంచమి.

ఇట్లు విన్నవించు బుధజనవిధేయుడు,
ప్రయాగ వెంకటరామశాస్త్రి.

# కృతిసమర్పణప్రశంస

స్వస్తిశ్రీ చాంద్రమాన ఈశ్వర సంవత్సర జ్యేష్ఠ శుక్ల చతుర్దశీ పూర్ణిమా దినములయందు (1937 సం॥రం జూను 22, 23 తేదీలలో) నవకోసలమను ప్రసిద్ధి వడసిన బుచ్చిరెడ్డిపాళెములో ఏతత్కృతి సమర్పణోత్సవము జయప్రదముగ జరిగినది. తత్పూర్వ దినముననే నెల్లూరు మున్నగు పట్టణములనుండియు, సమీప గ్రామముల నుండియు పండితులు, భక్తులు అనేకులు విచ్చేసిరి. పురప్రముఖులగు రెడ్లు పెక్కండ్రు తమ సంతసమును దెల్పుచు వారి నాదరించిరి.

చతుర్దశినా డుదయమున నవకోసల పురాధీశ్వరుడయిన శ్రీ కోదండ రామస్వామి యాలయమున మహాజనసభ సమావేశమయ్యెను. శ్రీ స్వామివారు బాలభోగము (ప్రాతఃకాల పూజ) జరిగినవెనుక నూతన వస్త్రాలంకార శోభితులయి కళ్యాణమండపమున కొలు వమరియుండిరి. అత్తఱి వైదికోత్తముల స్వస్తి వచనములతో కృతిసమర్పణోత్సవము ప్రారంభమయ్యెను. మేళతాళము లెల్ల యెడల బోరుకలగుచుండెను. అర్చకులయిన యాచార్యస్వాములు శ్రీ స్వామి వారికి షోడశోపచారములతో పూజలొనర్చిరి. ఆసమయమున హరిభక్తులగు శ్రీయుతులు నేలనూతల లక్ష్మీనారాయణయ్యగారు స్వభావమధురమగు తమ శ్రావ్య కంఠములో భక్తిరసము వెల్లివిరియ శ్రీ నవకోసల రామాయణమునందలి కొన్ని భాగములను హరికథారూపమున శ్రీ స్వామివారి సమక్షమున వినిపించి సభాస్తా రుల యుల్లముల పల్లవింపఁజేసిరి. అనంతరము ఈ నవకోసలరామాయణ రచ నకు ప్రోత్సాహ కర్త్రియగు కామమ్మగారిని ప్రశంసించుచు కొందరు పద్యములు చదివిరి. హరికథాసక్తచిత్తులగు సభాస్తారులకు తెలియకయే అప్పటికి మధ్యా హ్నము దాటవచ్చెను. శ్రీ కోదండరామస్వామికి మంగళహారతు లర్పించిన వెనుక సదస్యుల జయజయధ్వానులతో సభముగిసెను. ఏతదుత్సవ నిర్వహణమున సంపూర్ణబాధ్యతను వహించిన శ్రీమతి కామమ్మగా రంతకుముందే నిపుణులగు సూదవరులచే సంసిద్ధపఱిపించిన షడ్రసోపేతమగు మృష్టాన్నము నారగించి యెల్ల వారును ఆనందపరవశులయిరి. ఆరాత్రి భోజనానంతరము మరల నవకోసల రామాయణమున పాదుకాపట్టాభిషేకము వఱకును హరికథా కాలక్షేపము జరిగెను.

మఱునాడు ఉదయమున యథాపూర్వముగ శ్రీ కోదండ రామస్వామివారి కళ్యాణమండపమున మహాజనులు సమావేశమయిరి. పౌరముఖ్యులు కొందఱు రెడ్లు సభ నలంకరించిరి. రాజమహేంద్రపుర రాజకీయ కళాశాలా పండితులు బ్రహ్మశ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారు శ్రీమద్రామాయణ ప్రశస్తి నుగ్గడించుచు తద్రచయితలను ప్రశంసించి శ్రీ నవకోనలరామాయణ విశేషములను సదస్యులకు తేటతెల్లము గావించిరి. ఆసందర్భమున రెడ్డి రాజుల వైదుష్యమును ధార్మికత్వమును, భాషాపోషణమును ప్రశంసించుచు శ్రీమతి కామమ్మగారికి తొల్లింటి రెడ్డి రాజులతో సాధర్మ్యమును జూపుచు ఆమె యౌదార్యమును గొని యాడిరి. సభాసదుల హర్షధ్వానులతో సభాసదనము మాఱుమ్రోగెను. పిమ్మట శ్రీ లక్ష్మీనారాయణయ్యగారు నవకోనల రామాయణమునందలి తక్కిన భాగముల నచ్చటచ్చట 7గానముచేయుచు శ్రీరామ పట్టాభిషేకాంతము వఱకును కథాంశమును శ్రీ స్వామిసన్నిధిని నివేదించిరి. పదంపడి శ్రీ శాస్త్రులవారికి బంగారు పతకములతోడి జల్తారు పట్టువస్త్రములను శ్రీ లక్ష్మీనారాయణయ్యగారికి జల్తాను పట్టువస్త్రములను ఇచ్చి బహూకరించిరి. ఆవెనుక సభలో నితరులు కొందఱు మార్దంగికులు మున్నగువారును యథోచితముగ సత్కరింపఁబడిరి. శ్రీ స్వాములవారికి మంగళహారతు లిచ్చినవెనుక వైదికోత్తముల మంగళాశాసనములతో సభ ముగిసెను. ఆనాడును వచ్చిన యతిథులందఱును శ్రీమతి కామమ్మగారి పంచభక్ష్య పరమాన్నములతోడి యాతిథ్యమును గైకొని సంతోషిత స్వాంతులయి యథేచ్ఛం జనిరి.

శ్రీమతి కామమ్మగారిపై రచింపఁబడిన

# పంచ రత్నములు.

ఉ॥ శ్రీ నవకోసలాధిపతి । శ్రీ రఘురాముఁడు దీనబంధుఁ డ
న్న్యూన దయాబ్ధిసోముఁ డల । నూఁకలపాటి వరాన్వయోద్భవన్
దాన గుణాభిరామకృత । ధర్మవివర్ధన రామ మాత్మజన్
మానవతీ మణిన్ సుగుణమానిని । కామమ నోముతన్ సదా.

సీ॥ తరతరంబుల నాఁటి ధర్మగుణంబులఁ । బోసీక నిల్పి రేపుణ్యతములు
నిరతిశయానంద నీరధిఁ దేలుచు । నుండి రేదంపతు లొక్కరీతి
సంతత ద్విజభక్తి శాంతి మానసయుక్తిఁ । గ్రాలి రెవ్వ రఖండ రామభక్తి
బుధజనసేవ సంపూర్ణంబుగా సల్పి । ధన్యతఁ గాంచి రే ధర్మమతులు
అట్టి రామమ సేతురా మార్యగర్భ । శుక్తి ముక్తాఫలంబయి శోభఁదెచ్చె
తనదు సద్వంశమునకు నేసాధు హృదయ । యట్టి కామమ జగతి జిరాయువగుత

గీ॥ తల్లి తండ్రి గురువు తనర సఖీగణ । మరయు రామమయము ధరణి నట్టి
భాగ్యమంది మనసుఁ బరఁగ రామునకిచ్చి । ఘనత ధన్యయయ్యె కామమాంబ.

క॥ కృతిపతి నవకోసలపతి । కృతికర్త్రియు రామపుత్రి కృతిపోషకురా
లతులిత గుణవతి కామమ । నుతి పాత్రము లౌరవీరి నోము ఫలంబుల్.

మ॥ ధనమున్నన్ నరుఁడౌను ధర్మగుణ మీ । ధాత్రిస్థలిన్ దేహి దు
ర్వినయుండౌట స్వభావ మీయమ యెడన్ । వీక్షింప మారీతి, స
ద్వినయం బుత్తమగోష్ఠి ధర్మరతియు । న్వేదాంత సంచింతనం
బనయం బున్నవి కామమాంబయెడ । వంశాచార సార్థక్యతన్.

ఆకిలి శంకరయ్య.

---

ఆ సమయంబున శ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారిని ప్రశంసిం
చుచు పండితుఁడైన ఆకిలి శంకరయ్యగారు రచించిన పద్యము.

సీ॥ శ్రీరామ పాద రాజీవభంభర మతి । వినయ సౌశీల్య సద్వినుత యశుఁడు
సంస్కృతాంధ్ర జ్ఞాన సంపన్నుఁ డున్నత । విద్యా ప్రబోధైక విశ్రుతుండు

సుగమబోధన ధీసుశోభితుం డశ్రాంత । మాశ్రమ ధర్మ బోధాశయుండు
ఓరిమిగల్గిన యుత్తమోపాధ్యాయుఁ । డతులిత సత్పథా చరణ చణుఁడు
గీ॥ దోస మెఱిఁగియు నెన్నని దోషరహితుఁ । డీ సెఱుంగని సమరసుఁ డిద్ధ చరితుఁ
డీ ప్రయాగ కులాబ్ధి రాకేందుఁ డమల । రమ్యగుణ భస్త్రి, వేంకటరామశాస్త్రి.

## కృతజ్ఞత.

దేశసేవా దురంధరులును, సాధుశిఖామణియు నగు అనంతపురం జిల్లా సాధనప్రెస్ ప్రొప్రైటరుగారగు శ్రీయుత పప్పూరు రామాచార్లుగారు ఈ నవకోసల రామాయణమును శ్రద్ధాభక్తితోడ సంపూర్ణముగ అచ్చొత్తించి కృతిసమర్పణ సమయంబునకు మాకొసంగిరి. వారిని కృతజ్ఞతాపూర్వకముగ కొనియాడుచున్నాము. మరియు శ్రీరామచంద్రమూర్తి ఆయురారోగ్య ఐశ్వర్యాది సకల సంపద లొసంగి వారిని రక్షించుగాత.

ఇట్లు విన్నవించు,
బుధజనవిధేయురాలు,
శ్రీరామపుత్రి.

---

సీ॥ శౌనక సద్గోత్ర సంజాతు లశ్రాంత మతిథిపూజా తత్పరాత్ములవని
వర మల్లవరపు సద్వంశ ముక్తామణు లవిరత హరికథాలాప నిరతులు
శ్రీలింగయ సుపుత్ర శ్రీ సుబ్బయార్యాది ఘనులు తత్కులమందు జననమంది
వితరణఖనియని సతతశాంతుండని యుత్తమ సత్కీర్తి నుర్వినిల్పి
అక్షర బ్రహ్మరూపంబునందినట్టి మల్లికార్జును నా మనోవల్లభు నెద
నిశ్చలంబైన సద్భక్తి నిల్పి తత్పదాబ్జముల నాత్మఁగొల్తు ననారతంబు.

సీ॥ ఆమల్లవరపు వంశావతంసంబులు సుబ్బరామాద్యులు శుభ యశస్కులు
ఆ జన్మపావను లఖిల విద్యానిధు లతిథిపూజారతు లఖిలమతులు
రామలింగయ ముఖ్యు లీమహి రహిమీరఁ బుత్ర పౌత్రాదులు పొదలికొలువ
నిత్యసంతుష్టులై నిర్మలశీలురై హరిభక్తి నిరతులై యతిశయింత్రు
తత్కుటుంబు లవనిపైఁ దరతరంబు సిరియు విద్యయు యశమును సరవిఁగాంచి
వృద్ధి పెనుపొంది తామరతంపరగుచు అల్ల రఘురామ కరుణ వర్ధిల్లుఁగాత!

---

# సవరణ పత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| విజ్ఞప్తి | 1 | అర్యులార. | ఆర్యులార |
| పీఠిక | 8 | దతనిపై | దవనిపై |
| vi | 20 | గాయంతే | గాయంతి |
| vii | 2 | ప్రిధీయతే | ప్రితీయతే |
| ,, | 9 | బ్రోవ | ప్రోవ |
| 1 | 11 | భరాది | భవాది |
| 2 | 5 | వ్రాయ | రచింప |
| 4 | 17 | లోకేశ్వరు | లోకేశ్వర |
| 6 | 2 | కౌసల్య | కౌసల్యా |
| 7 | 11 | పక్షి | పక్షిం |
| ,, | 15 | త్వమి | త్వ |
| ,, | 16 | కామి | కాము |
| ,, | 17 | దగు | దాది |
| 8 | 14 | విరించివెడలిపోయె | పరమేష్ఠి యేగ దివికి |
| ,, | 15 | రంభై | రంభయి |
| ,, | ,, | బలికి | పల్కి |
| ,, | 27 | దశరథుడాది | దశరథులాది |
| 13 | 9 | మొనరింపనీ | మునను |
| ,, | 22 | వరపుత్రినిం | పుత్రికకాంతసెం |
| ,, | 28 | నానందముగను | నాహ్లాదముగను |
| 14 | 4 | జేయవారా | చేయ సా |
| ,, | 5 | చరితా్ర | చరిత్ర |
| 19 | 19 | సర్వంబుపరంధాము | నలపరంధాముని |
| 22 | 4 | ముద్దులయ్య | ముద్దులయ్య సీవిటం |
| 31 | 27 | జేరియతిజాగరణ | చేరి జాగ్రత్తతో |
| 32 | 2 | యనుచు | యంచు |
| ,, | 4 | ధ్వనులు చెలరేగ | ధ్వనులెసఁగను |
| ,, | 7 | సుగుణాభి | నభి |
| 33 | 18 | బహుకీర్తి | సత్కీర్తి |
| ,, | 20 | వంశుడ | వంశ్యుడ |
| 37 | 17 | పూజ్యుడతిప్రి | పూజ్యుండుప్రే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 37 | 17 | కర్ణముల | కర్ణాన |
| ,, | 19 | రానుల్ | రాశి |
| 42 | 3 | కాలాంబుశ్యామ | కాలాంబుదశ్యామ |
| 52 | 2 | కంకణాంగదములుచెలగ కరకమలములతో | కంకణమ్ములుమెరయ కరమ్ముచాచి |
| 54 | 13 | అహల్యశాపముదీర్చియు నతిముదమున | మానిసతిశాపమున్బాపి మాన్యులిపుడు |
| ,, | 26 | సర్వశుభములు గలిగె | సర్వశుభంబులు |
| ,, | ,, | ప్రీతిమీరనాదు బిడ్డలకును | పాండవేద్ర నాదు నందనులను |
| 67 | 4 | గంధకస్తూరి | గందపొడియును |
| 74 | 25 | జేరియిట్టుల | జేరియునిట్ల |
| 78 | 27 | గృహాము | గృహామును |
| 82 | 8 | మహా | యధి |
| ,, | 9 | రమ్మనె వసిష్ఠుండు మిమ్ము | రమ్మను వసిష్ఠుడిప్పుడు |
| 87 | 18 | హితము | హితమ్ము |
| 92 | 5 | వార్ధిచంద్రి | రత్నరాము |
| 94 | 1 | పాదఛాయను | పాదములచెంత |
| 112 | 15 | చేకొనియు | చేకొని |
| 114 | 12 | జేయు | చేయుము |
| 117 | 3 | మును నాదు | నాదు |
| 165 | 6 | నిధుడు | విధుడు |
| ,, | 18 | తనివినకగాంచి | ను దనివి చనక |
| ,, | ,, | మానులు | వారు |
| 178 | 24 | భైరవారంబున | భైరవాకారంబున |
| 220 | 17 | యుచున్న | యుచునున్న |
| ,, | 24 | చెచ్చెలకపిందుృిడ | చెలగి వాలియ |
| ,, | ,, | వదనమునను | సదనమునను |
| 221 | 11 | దనని | దమని |
| 224 | 19 | కృపకు | కృపకును |
| 272 | 12 | నివిమోహాన | నుచుమోహాన |
| 278 | 7 | వేసవేల్వానరుల | లగందావానరులను |
| 239 | 23 | జేసెను | జేసె |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 298 | 4 | నేను నీ | నేను |
| ,, | 5 | జొచ్చితిని | జొచ్చితి |
| 300 | 11 | రామ | రాము |
| 308 | 20 | జూచితివి | చూచితి |
| 320 | 11 | సంఖ్యత | సంజ్వర |
| ,, | 13 | దృష్టి | వృష్టి |
| ,, | ,, | దనుపుచు | దన్పుచు |
| 341 | 25 | వర్ణా | ధామా |
| 347 | 13 | గల్గినదియు | గల్గియు నుదధినద్ది |
| ,, | ,, | మగుచు | మరొయ్యె |
| 378 | 29 | యింపలు | యంపలు |
| 3[illegible]5 | 21 | రించితి | రించి |
| 398 | 1 | ప్రాప్తమా | వచ్చునాపదల్ |
| 415 | 1 | విమలచరిత | నిద్ధచరిత |
| ,, | 2 | నిపుడు | యిపుడు |
| ,, | 3 | మయ్యె | మయ్యా |
| 419 | 19 | ప్రీతి | సంప్రీతి |
| 421 | 17 | ప్రముఖస్తోత్ర | ముఖ్యగణ్య |
| 422 | 21 | శ్రీమార్పణమస్తు | శ్రీరామార్పణమస్తు |

శ్రీరస్తు
శ్రీవిఘ్నమస్తు
శ్రీరామ జయం
శ్రీ సీతా లక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# నవకోసల రామాయణము హరికథ.

## బాలకాండము.

శ్లో॥ శ్రీరామం రఘువంశ జలధి చంద్రం - సీతామనోనాయకం
ధీరం సుందర మందహాస రుచిరం - దివ్యాంబరా శోభితం
కారుణ్యాంబుధి నీలనీరదతనుం - కల్యాణ సద్భూషణం
నీరేజాత సురాది పూజితపదం - నిత్యంభజే రాఘవం॥

శ్లో॥ వైదేహీ సహితం సురద్రుమతలే - హైమే మహామణ్డపే
మధ్యేపుష్పకమాసనే, మణిమయే - వీరాసనే సంస్థితం
అగ్రేవాచయతి ప్రభంజనసుతే - తత్వంమునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం - రామంభజే శ్యామలం॥

వ. భక్తజన బృందంబులారా, శ్రీ మద్రామాయణ మహాకావ్యంబు చతుర్విధ పురుషార్థంబుల నొసంగునని పెద్దలు వక్కాణించి, తామభ్యసించి, తరించి, యితరుల దరింపజేసిరి, గావున,

శ్లో॥ శ్రీ రామాయణ మాదికావ్య మృషిణా - వాల్మీకినా నిర్మితం
వేదాంతార్థ విశారదై రనుదినం - స్తుత్యం సురై రర్చితం
శ్రోత్రూణా మఘనాశనం - సురతరో స్తుల్యంతు ముక్తిప్రదం
యేశృణ్వంతి పఠంతి, రామచరితం - తేయాంతి విష్ణోఃపదం.

శ్లో॥ రామేతి రామచంద్రేతి రామభద్రేతి వా మనుమ్
యావజ్జీవం జపన్మర్త్యో - జీవన్ముక్తో నసంశయః

శ్లో॥ రామాయణస్య మాహాత్మ్యం వక్తుం వర్షశతైరపి
అశక్యం విస్తరాద్వక్తుం సంక్షేపాద్వచ్మి సాంప్రతం॥

శ్లో॥ రామాయణస్యవాక్యం వా - పాదం వా పదమేవ వా
భక్త్యాన్తేతుప్రయుంజానో - బ్రహ్మభూయాయ కల్పతే॥

శ్లో॥ రామాయణకథామేవ యేశృణ్వంతి నరోత్తమాః
విధూత పాపాస్తేయాన్తి బ్రహ్మలోక మనామయమ్॥

శ్లో॥ సంసారతాప యుక్తానాం జంతూనాం హతచేతసాం
శ్రీ మద్రామాయణాఖ్యాన పీయూషంభేషజం స్మృతం॥

వ. ఇట్టి రామాయణంబు వ్రాయ సదాస్మరించు నేను,

సీ॥ కౌశిక గోత్రాబ్ధి కల్పభూమిరుహంబు - శ్రీరాములన ధాత్రి జెలగుచుండు
అతనికి ప్రియపత్నియైన విశాలాక్షి - సత్యదానవ్రత సాధుచరిత
ఆదంపతుల గర్భమందు జన్మించినే - సతతంబు శ్రీరామచంద్రుభజన
జేయుచుం బెద్దల సేవించుచును భక్త - జనులతో సత్కథల్ వినుచుమనుచు

తే॥ కాలమును గడపుచు హరి కరుణచేత - సాధుసమ్మతి వరలు న౯ సాదరముగ
సరసజేరిచి కామమ్మ సాధ్వి రామ - కథను కీర్తనరూపముగను రచింపు.

క॥ ఆమ్మా రామాయణకథ - సమ్మతి గీర్తింపనీదు జన్మ సఫలమా
ని మ్మాకృతి రఘువరునకు - నిమ్మ హి నవకోసలమున నెసగు నతనికి౯॥

వ. అని పల్కిన నే సీయకొని,

సీ॥ శ్రీరామచంద్రుని శ్రీచరిత్రరచింప - దలచి నేను నవకోసలమునందు
కోదండరాముని కోవెల నాదేవు - గోర్కితీర్పు మటంచు గోరి మ్రొక్కి
ధ్యానంబు చేయంగ నానందమగ్నుడౌ - శ్రీయాంజనేయుండు చేరవచ్చి
జానకీరమణుని చరిత రచింపుము - నేడు మొదలు నీకు దోడుపడుదు

తే॥ ననుచుబల్కిన నామోదమతిశయిల్ల - శరణు శరణని సర్వేశు శరణువేడి
యాంజనేయుని - కరుణారసాబ్ధిమ్రొక్కి - పల్కెదను రాముచరితంబుభక్తిమీఱ

తే॥ పూర్వకవులెందఱో రాముపుణ్యకథను-నుడివియున్నారు మధురంపు నుడులతోడ
అయిననను పద మమృతమై యలరునట్టి రామచరితంబు తనుపునే భూమి జనుల॥

ఆ॥ ఎరిగియైన భక్తి నెరుగకయైనను - రక్తినైన మరి విరక్తినైన
రామరామరామ రామరాఘవయంచు - బలుక భుక్తి ముక్తి గలుగు భువిని॥

తే॥ మింటజరియించు ఖగముల జంటగాంచి-యిలను విహరించు బాలకు-డెగురగోరు
చందమున నేను - రఘువీరు చరితమెల్ల - నేర్చనేరనిమాటలు - గూర్చియిపుడు॥

తే॥ వ్రాయబూనితి నీకథ వసుధలోన - సత్కవీంద్రులు సాధులు సర్వసములు
అరసి తప్పులు సవరింపు డాదరమున - విమలమతులార మ్రొక్కుచు-వేడుదాన॥

తే॥ విద్య లెఱుగను శాస్త్రంపు విధుల నెఱుగ - బద్య గద్యంబులిక నేనుబలుకనెట్లు
విద్యలకు దైవతము రామవిభుడు తెలుప-భక్తివర్ణింతు శ్రీరాముభవ్యకథను॥

జో॥ (1) జయజయ రామ జానకిరామ - జయజయ జగదభిరామా
జయజయ నవకోసలపురిధామా - జయజయ దశరథరామా ॥జ॥

(2) సీతాలక్ష్మణ సహితశుభాకర - శ్రితజనావన శ్రీరమణా
వాతాత్మజనుత వందిత చరణా - వరదా కరుణా భరణా ॥జ॥

(3) బృందారక మునిగణ సంప్రార్థిత - సుందర రఘుకులదీపా
ఇందిరాప్రియా నంద నిలయ - గోవింద ముకుందా భూపా ॥జ॥

(4) నవకోసలపురనాథ పరాత్పర - నారాయణ కరిరాడ్వరదా
భవభయంబులను బారగద్రోలుము - భక్తజనాశ్రితపాదా ॥జ॥

హిందూస్తాని - ఏకతాళం.

ప॥ శ్రీకరగజముఖ శరణం శరణం, శ్రితజనకలుష విదారా జయజయ ॥శ్రీ॥

చ॥ అద్రిసుతాసుత అమరవందితనుత, భద్రిమొనగిబ్రోవు పావనచరితా జయ ॥శ్రీ॥

(2) మూషకవాహన మోదక ప్రియఘన, దోషహరణజయ దురితనివారణ ॥శ్రీ॥

(3) వరనవకోసల పురవాసా శరణం, కరుణాకరనిజదాసపోషా జయ ॥శ్రీ॥

కల్యాణి - ఆది.

ప॥ సరస్వతి వందనముల్ గొను సరసిజపత్రాక్షి శారదాంబ శ్రీ ॥స॥

అ॥ వరదాయినీ వాగ్విలాసినీ పరమశుభము లిమ్మా పద్మజునిభామా ॥స॥

చ॥ వాణీబంభరవేణీ కల్యాణి ఆణిముత్యరత్న హారభూషణీ
వీణాపుస్తకపాణీ గీర్వాణీ మాణిక్యమకుట మహితాలంకారిణీ ॥స॥

(2) ఆదిదేవి నీపాదములిమ్మా మోదమలరనే పూజింతునమ్మా
సాసరముగా సరసవాక్కులిమ్మా కోదండరాముగ కీర్తింతునమ్మా ॥స॥

క॥ పలికెడిది రామచరితము అలరగ బలికించువాడు అంజనసుతుడౌ
యిల నాదుజన్మసఫలత గలిగెను సందియములేదు గాంచితిముదముగ॥

హిందూస్థాని - ఏకతాళం.

ప॥ హనుమంతాధీమంతా అంజనసుత బలవంతా జయజయ ॥హ॥

చ॥ కరుణాకరతవ చరణం స్మరణం సరసిజభవనుత చరణం శరణం ॥హ॥

(2) భూతభావనం భూతశరణ్యాం నీతికోవిదం నిత్యవరేణ్యాం ॥హ॥
(3) రామభక్త నవకోసల ధామం రామపుత్రీ మనోభీప్సితవరదం ॥హ॥

సీ॥ ఆనంద నిలయుడౌ నాత్మనాధుండైన సద్గురుస్వామిని సంస్మరించి
భాగవతశ్రేణి పలుమారు ప్రార్థించి సాధుబృందంబుల సన్నుతించి
వ్యాసవాల్మీక్యాది ప్రాచీనమునులను కాళిదాసాది సత్కవుల గొలిచి
తల్లి విశాలాక్షి తండ్రి శ్రీరాముని ముదముమీరంగ నా మదినినిల్పి
కోరి నవకోసలేశు కోదండరాము కర్పితంబుగ నీకృతి నమరజేసి
పరమ సుఖమును బొందెద భవముబాసి కామదాయిని మహాలక్ష్మి కరుణచేత।

షష్ఠ్యంతములు.

క॥ రామునకును ముఖనిర్జిత సోమునకును నీలమేఘసుశ్యామునకున్
గామితఫల నవకోసల ధామునకును జానకీ హృదయ ధామునకున్.

క॥ ధీరునకును సాగర గంభీరునకును యోగి హృదయ బిసరుహరవికిన్
శూరునకును నవకోసల పౌరవరప్రదున కార్త పరిపాలునకున్.

క॥ వరదునకును శాంతునకును పరమేష్ఠి ప్రముఖ సేవ్య పదకమలునకున్
కరుణాబ్ధికి నవకోసల పురనిలయుండైన రామ భూపాలునకున్.

క॥ శ్రీకరునకు నిర్జరరిపు భీకరునకు సకలసుజనప్రీతి కరునకున్
లోకేశ్వరు నవకోసల కాకుత్స్థకులాబ్ధిచంద్రు కల్యాణునకున్.

వ॥ సమర్పణంబుగా నేజేయంబూనిన నవకోసలరామాయణంబునకు, కథాక్రమం బెట్టిదనిన:—

క॥ శ్రీరాముని చరితంబును ధీరుడు వాల్మీకిమౌని తేటపడంగా
కూరిమి సద్గురుకరుణను చేరియు మృదుమధుర సరణి జెప్పెను భక్తిన్.

వ. ఒకానొక సమయంబున తపోధనుండగు వాల్మీకి మహర్షి పరమార్థం బెరుంగం గోరియుండ బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండగు నారదమహామునీంద్రుం డరుదెంచిన నతనింగాంచి,

ఆరాణ - రూపకం.

ప॥ నారదగురుస్వామీ నమస్కరించితి దేవ ॥నా
అ॥ నారాయణ తత్త్వార్థము నాకుపదేశింపుము ॥నా
చ॥ పరమోదార కరుణాకర పరతత్త్వము నెరుగింపుమ
అరయ సంసారవిముక్తి ధరణిని యెటు గల్గునుకృప

పురుషోత్తము మహిమలెల్ల బుధవరేణ్యా కీర్తింపుము
వరనవకోసలపుర వాసులకు ముదముగూర్ప ॥నా

హిందూస్థాని

(1) ఈ లోకంబున శ్లాఘనీయుడు విమలయశుండు ధర్మాత్ముండు
చాలపరాక్రమశాలి సద్గుణుడు సత్యసంధుడు సాధుసమ్మతుడు ॥శ్రీ

(2) నిర్వికారుడు నిత్యనిర్మలుడు నిపుణుడు శాంతుడు నిరుపమతేజుడు
సర్వభూత శరణ్యుడు ప్రియకరుడు సదాచార సంపన్నుండు ॥శ్రీ

(3) శౌర్యధైర్యగుణ సాహసబలవీర్య సంగరభీముడు కాంతియుతుండు
ఆర్యసేవితు డసూయరహితుడు శూరాగ్రణియౌ పురుషుడెవ్వాడు ॥శ్రీ

(4) కరుణాకరయిట్టి యుత్తమోత్తముఁ ఎరిగింపుము దయ యనుచునువేడ
పరమహర్షంబున నారదమౌనియు నెరిగింతును విను సాధువరేణ్యా ॥శ్రీ

వ॥ అని తన మనంబున ఊహించి, నీవడిగిన గుణంబులుగల పురుషుడు, శ్రీమన్నా రాయణుండుదక్క సామాన్యులయందును సార్వభౌమాదుల యందును లేడు. అట్టి కీర్తనీయుండగు, పురుషుండు, ఇక్ష్వాకు వంశోద్భవుండగు రాముండు,

భైరవి – రూపకం.

ప॥ రఘురాముడు జయరాముడు రవికులాంబుధి సోముడు ॥ర

అ॥ అగణితగుణధాముడు ఆనందరాముడు ॥ర

చ॥ సర్వజ్ఞుడు ధర్మజ్ఞుడు సకలశాస్త్ర కోవిదుడు
నిర్వికారు డజేయుడు నిగమార్థ విశారదుడు
సర్వగుణసంపన్నుడు సాధులోక సమ్మతుడు
సరసుడు సదయాపరుడు సత్యవ్రతుడు నుతచరితుడు
నిర్వైరు డఖిలజన ప్రియకరు డాశ్రితపరతంత్రు
డుర్వీశు డుదధిగంభీరు డూర్జితయశస్కుడు ॥ర

(2) శరదిందు వదనుడు శ్యామసుందర శరీరుడు
అరవిందదళనేత్రుడు ఆజానుబాహుడు
హరిమధ్యుడు ఘనవక్షుడు అంబుజోదరు డసమానుడు
కరిరాజగమనుడు కంబుగ్రీవుడు కల్యాణుడు
శరణాగత రక్షణుడు శమదమక్షమాయుతుడు
శౌర్య ధైర్యబల విక్రముడు వరనవకోసల వరదుడు ॥ర

అగా.

గద్య॥ ధరణీతలమున నిక్ష్వాకువంశమున నరరూపంబున శ్రీహరి యుదయించి ॥
కౌసల్య దశరథుల కానందము గల్పించి, కౌశికముని యాగముగాచి, అహల్య
బ్రోచి, ధనుర్భంగముగావించి, జానకిని వరించి, పరశురాముని భంగపరచి,
చేరి సాకేతమున సుఖయించి, యువరాజ్యాభిషేకముజేయ, అవనీశుడు మది
నెంచ, కైకవరంబున సతితో, కానకునేతెంచి, గుహుని ప్రేమించి, చిత్రకూట
మునజేరియు సంతోషించి, భరతుడువేడిన పాదుక లనుగ్రహించి, హర్షంబున
అత్రిమహాముని సతిగాంచి, మొక్కియు అంగరాగమిచ్చిన గైకొని యాదేవిని
పూజించి, దండకాటవి ప్రవేశించి, దానవులను బరిమార్చి, తపసివరులను
మన్నించి, రక్కసిముక్కును చెవులను ఖండించి, మాయామృగమగు మారీచుని
మర్దించి, దశకంఠుడు సీతను గొనిపోవగ, ననుజునిగాంచి ధరణిసుతను గానక తపి
యించి, మదిశోకించి, వెదకుచు జటాయువు నాలోకించి, యనుగ్రహించి, కబం
ధుని దెగటార్చి, కామినియా శబరిగని యుత్తమపదంబిచ్చి, ఘనుడగు రవి
సుతునితో సఖ్యముగావించి, వాలిని వధియించి, కపులబంపి సీతను వెదకించి,
గనివచ్చిన హనుమంతుని బహూకరించి, వననిధి గర్వంబడగించి, శరణన్న విభీ
షణుని రక్షించి, వనచరులతోగూడియు వారిధినిర్మించి, లంకను ప్రవేశించి,
దనుజవీరులతో దశకంఠుని, హతమొనరించి, ధరసుతనగ్ని ప్రవేశముజేయించి,
గైకొని సీతను హర్షించి, కమలాసనుడాదిగగల సురమునులను దశరథు భూవరు
గని సేవించి, ప్రార్థించి, జనకజసౌమిత్రి యనుచరులతో పుష్పకమారోహించి
వచ్చియు భరద్వాజమునికి నతులొనరించి, కైకసుతునకు ఆదేశము బంపించి,
భరతుని ప్రార్థనగొని పాదుకలను గ్రహియించి, కరుణించి, తమ్ములుగొలువగ,
ధరణిజతో, పట్టాభిషిక్తుడై వినోదించి, ధర్మముదప్పక ధరపాలించి, ప్రజపై
నెనరుంచి, బ్రాహ్మణోత్తముల సాధువర్తనుల శాంతుల పరమభక్తిని పూ
జించి, శ్రీరఘురాముడు చిద్విలాసముగ సీతతోడ గ్రీడించి, సుఖముండె
నయోధ్యను, సురుచిరలీలల మించి ।ధ

సంక్షేప రామాయణం సంపూర్ణం.

# బాలకాండము.

వ॥ జ్ఞానసంపన్నుండైన వాల్మీకి నారద మహామునివలన వేదాంతార్థముల దెలిసి కొని బ్రహ్మానందముబొంది దేవర్షిని పూజించిన నతండు గాఢాలింగనమున ప్రాచేతసుని సంతోషపఱిచి దేవలోకంబుచేరె. అంత నొకనాడు వాల్మీకి మాధ్యాహ్నిక స్నానంబునకై తమసానది తీరంబునకేగి,

తే॥ తనదు ప్రియశిష్యు నాభరద్వాజుగాంచి, పలికెనతిరమ్య మీతీర్థమరసిచూడు
నిర్మలంబగు జలములు నిండి యిచట, సాధుహృదయంబువలె దోచు స్వచ్ఛమగుచు

తే॥ నాయనా యిమ్ము నాదగు నారచీర, స్నానమొనరించెదను శుద్ధ జలమునందు
అనుచు నాఛాత్రు డొసఁగిన యట్టి వల్కలమును చేకొని వాల్మీకి ప్రమదమునను.

వ॥ ఆతీరంబునంగల రమణీయంబగు తరుతరంబులజూచుచు, అందు గ్రీడించు క్రౌంచ మిథునంబుగనియె. అంత,

క॥ చేరి నిషాదుండచటను క్రూరుండై పురుషపక్షి గూల్చినయంతన్
ధారుణి బడియుండినపతి నారసి యాక్రౌంచి యప్పుడాక్రోశించెన్.

వ॥ అదిగని శాపానుగ్రహ శక్తి యుక్తుండును, ధర్మస్వభావుండునగు వాల్మీకి మహర్షి యాబోయవానిని,

శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాంత్వమి మగమ శ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్.

తే॥ పండితుండైన యట్టియా పరమమౌని మానిషాదను వాక్యముల్ మదినిదలఁచి
క్రౌంచ మిథునంబుఁగనినేను కరుణతోడ నేల బల్కితినిట్టు లిదేమొ యనుచు.

వ॥ భరధ్వాజుంగని,

## హిందూస్తాని

(1) సమసంఖ్యలుగల యక్షరములతో సరవినినాల్గు పాదంబులుగను
విమలశ్లోకము నాముఖనిర్గతమై యెటులగల్గెనో వింతగుచున్నది ॥శ్రీ

(2) వీణయందు నారోపించియు వేడ్కను స్వరలయగీతంబులతో
గానముజేయగ దగియున్నదిమరి గనుమా శ్లోకరూపంబుగను ॥శ్రీ

(3) భరద్వాజుండు వినియా శ్లోకము భక్తిశ్రద్ధతో పరియించియును
అరయగ నిది రామాయణసారం బగుచున్నది సర్వానందదమై ॥శ్రీ

వ. అని పల్కిన వాల్మీకియు మాధ్యాహ్నిక స్నానమాచరించి శిష్యునితో నాశ్రమంబుజేరి, ఆకస్మికంబుగ తననోట ఛందోబద్ధంబును, పరమార్థ ప్రతిపాదకంబునగు శ్లోకము వెడలినందుకు యోచించుచుండ, పరమేష్ఠియు యోగిజనంబులు దన్నుగొలువ గవితిలకంబగు వాల్మీకి చెంతకు జేరవచ్చిన,

హిందూస్తాని

(1) వనజాసనుగని మోదంబునను మునికుల తిలకుడు నమస్కరించియు
వినయము మీర పూజించియు వేడ గని యిట్లనెను ఘనుడు విరించి ॥శ్రీ

(2) వాణిని నీదువాక్కునను నిల్వగ నేనేబంచితి నిర్మల హృదయ
ఘనముగ రాముని కథ నతిభక్తిని కావ్యముజేయుము నారదోక్తిని ॥శ్రీ

(3) ధీమహిత శ్రీరాముని చరితము తేటతెల్లంబుగ దెలియు నీమదికి
ఆమహనీయుని యద్భుత చరితము ప్రేమనుజేయుము శ్లోకరూపంబుగ ॥శ్రీ

(4) తరణి శశాంకులు నదీనదములుగ వర కులగిరులును వెలయునందాక
ధరణీతలమున వినుతి కెక్కుచు స్థిరముగనుండు నీ మహాకావ్యము ॥శ్రీ

తే॥ ఇట్లుదెల్పియు విరించి వెడలిపోయె, అంత వాల్మీకిమదిలోన హర్ష మొదవ
శ్రీకరంబైయొప్పు నీ శ్లోకమనగ చిత్రమనిబలికె రామాని శిష్యులంత.

జోరా.

(1) అనియిటు శిష్యులు ముచ్చటింపగ వినిముదమున మునివరుడు
ఘనమగు రామాయణమను కావ్యము కడువేడ్కజేతునని యపుడు ॥జ

(2) సారంబౌ వాక్యోదారమనోహర సమవర్ణ వృత్తములతోడ
ఆరసి గూఢార్థంబులనెల్లను యీమాని రచించెనువేగ ॥జ

(3) భవకల్మషభయ పరిహారము శుభచరితము మోక్షప్రదము
భువనపావనము రామాయణము పుణ్యదాయకము జయకరము ॥జ

(4) సరసనమాస విలాస భాసురము సాధుసమ్మతమిదియు
వర మృదు మధుర రచనగల్గు రఘు వరుచరితము విన శ్రీకరము ॥జ

వ. ధర్మాత్ముండగు వాల్మీకి శ్రీరామచరితంబు యథార్థంబు నెరుంగగోరి శ్రద్ధాన్వితుడై, ప్రాగగ్రంబుల దర్భలపై నాసీనుండై, సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న దశరథుడాదిగా గలవారి వృత్తంబులెల్ల దృగ్గోచరంబుగాగ,

జోర:- యోగనిష్ఠచే జూచెనప్పుడు బాగుగాను మునివరుడు
శ్రీగురుముఖమున వినినటు భక్తిని జెప్పెను సర్వమెరుంగుమను ॥జ

ధన్యాసి — చాపు.

ప॥ రామాయణ కావ్యము రచియించె మహాఋషి రమణీయంబుగను ॥రా

అ॥ రాము జననము బలవిక్రమమును భూమిజన ప్రియ భూరిసత్వమును ॥రా

చ॥ కౌశికుయాగము గాచి యహల్యను కడువడి బ్రోచుటయు
యీశుని విలుద్రుంచి సీతను జేకొనుట వీరుని భార్గవు మదమణచుటయు ॥రా

(2) కైకవరంబున గానకు బోవుట కామిని మైథిలి గోల్పోవుటయు
భీకరబలుడౌ వాలిని దుంచుట ప్రేమను సుగ్రీవుని నేలుటయు ॥రా

(3) జనకజన్వేదుకగ వనచరులోవ్వపుట వననిధి దాటుటయు
హనుమంతుడు వైదేహిని గనుటయు మనమలరగ ముద్రిక నిచ్చుటయు ॥రా

(4) రావణుజూచుట లంకగాల్చుట రఘువీరుని మరి జేరుటయు
భావముప్పొంగ మణి నిచ్చుటయు ప్లవగ వీరులు సేతుగట్టుటయు ॥రా

(5) చేరి విభీషణుడు శరణొందుటయు సేనలతో లంకజేరుటయు
శ్రీరాముడు రావణుని వధించుట ధారుణిసుత గైకొనుటయు మరియు ॥రా

(6) భాసురముగ యావిభీషణునకు పట్టముగట్టుటయు
భూసుతగూడి పుష్పకమునను పురిజేరుటయు భరతుని గనుటయు ॥రా

(7) అతిమోదంబున తల్లుల జూచుట అనుజుల గూడుటయు
హితమతి పట్టము గట్టుకొనుట రఘు వీరుడు నవకోసలము పాలించుట ॥రా

(8) రామరాజ్యమున సర్వసంపదల రంజిలుటయు ప్రజలు
శ్రీమంతులునై పుత్రపౌత్రాదుల చెలగి సుఖించెదరని హర్షరంబున ॥రా

వ. మరియు భావికథ ఉత్తరభాగంబును రచియించె.

హిందూస్తాని

(1) ఆరున్నొక కాండము రచియుంచియు శ్రీ రామాయణమను కావ్యంబు
జేరియు జగముల వ్యాపింపగను జేసెడు ధీరులు యెవరని దలపగ ॥శ్రీ

(2) ఘనముగ నిటుచింతింపుచు నుండగ మునిపుంగవు పదపద్మంబులకు
మునివేషధరుల్ బాలకులిరువురు వినయంబున నతిభక్తిని మ్రొక్కిరి ॥శ్రీ

(3) ధీరుల రాజకుమారుల సుందరదేహుల మంజుల స్వరసంపన్నుల
వీరుల ప్రాజ్ఞుల వేదపారకుల విద్యానిపుణుల లవకుశులంగని ॥శ్రీ

(4) మునివరు డిట్లు దలచెను మదిలో అనువగు శ్రీమద్రామాయణ మీ
ఘనులు పఠింప గలరని ప్రియమున జనకజ సుతులను సన్మానించియు ॥శ్రీ

భైరవి - రూపకం.

ప॥ కృపమీరగ కుశలవులకు ఉపదేశించెను రామాయణం ॥కృ

అ॥ నృపవర కుమారులకు తపసియు నతి వైభవమున ॥కృ

చ॥ కారుణ్యహాస్యాద్భుత శృంగారరౌద్ర భయభీబత్స
వీరశాంతరసములతో వేడుక నభినయముతోను ॥కృ

(2) గానవిశారదులకు కమనీయగాత్రులకు
వీణాప్రవీణులైన వీరులౌ నవకోసలులకు ॥కృ

జోర:- నిపుణతమీరగ వాఙ్మధురంబుగ నేర్చియు లవకుశులంత
అపరిమితానురక్తిని బాడిరి అందందును వేడుకతోడ ॥జ

(2) సాధులు విప్రులు మహర్షులుండెడు స్థలముల సభలలో నపుడు
మోదంబునను గానముజేసిరి మునివేషధరులు బాలకులు ॥జ

(3) అనువుగ మధురస్వర యుక్తంబై అర్థపుష్టి గల్గియును
వినవిననెంతయు నింపు సొంపుగ ఘనమగు పదములు గలవగుచు ॥జ

(4) వీనులవిందుగ వినియందరును వినుతించిరి సంతోషమునన్
మనము లలరగ పరవశులౌచు మరిమరిమెచ్చుచు బాలకులన్ ॥జ

(5) జండెమిచ్చెను యొకవిప్రుండు జలకలశమిచ్చె మరియొకడు
అందముగ వల్కలమును మౌంజియు అక్షమాలిక నిచ్చిరి మునులు ॥జ

(6) ఆయుష్యంబునుకోరిరి కరుణను మునులందరు నానందమున
శ్రీయుతులగు నా కుశలవులకు తమ చిత్తమురంజిల ప్రేమ ॥జ

వ. ఇవ్విధంబుగ సర్వస్థలములయందు మనోహరంబుగాను, ఆశ్చర్యముగను పాడుచు
సాకేతంబు జేరి,

హిందూస్తాని.

(1) రాజకుమారులు మునివేషులుమరి రాజమార్గముల పాడుచుండ రవి
తేజుడురాముడు బిలువబనిచె నా రాజీవాక్షుల బాలుర నిరువుర ॥శ్రీ

(2) కూరిమి తమ్ముల్ రాజులు మంత్రులు గొలువగ సింహాసనమును జేరియు
మారాకారుల నతి సుకుమారుల ధీరులవీరుల తనతోతుల్యుల ॥శ్రీ

(3) ఘనులను విద్యాపారంగతులను మునివరు శిష్యుల వనజముఖులను
గని శ్రీరాముం డాదరమూరగ వినగోరెను దత్కథ తెల్లనపుడు ॥శ్రీ

(4) పరమ హర్షంబున బాలకులిరువురు స్వరలయరాగ క్రమమును దప్పక
మఱియు మంద్ర మధ్యతార స్థాయులతో వరి వరి విధముల పాడిరివేడుకఁ ॥శ్రీ

(5) దినకర తేజులు దేవసమానులు అనఘులు వీణాగాన కుశలులు
వినువారలకు వీనులవిందగు వినుడీయని రాముండనుజులకు బల్కె ॥శ్రీ

సీ॥ భూమండలమునందు పూర్వకాలంబున నెల్ల సస్యమ్ము లుల్లసిల్ల
మనువాదిగాఁగల జనపతుల్ ధార్మికుల్ సత్త్వసంపన్నులు సద్యశులు
సత్యదానవ్రత సద్ధర్మ నిరతులు నిత్యనిర్మలులును నీతిపరులు
బలపరాక్రమయుతుల్ భాస్కర తేజులు దీనజనావనుల్ జ్ఞాన నిధులు
సర్వభూత శరణ్యులు నిర్వికార ధీరచిత్తులు శూరులు వీరవరులు
సకల రాజన్యసేవితుల్ సార్వభౌము లవని పాలించు చుండిరి యధికయశులు.

జోరా.

(1) సాగరమును ద్రవ్వించె నెవ్వడు సదయుడు సుతులచే నట్టి
సగరుండెందుల నధికుండయ్యెను సత్యవ్రతుడీ భువిని ॥జ

(2) అట్టి ఘనులగు యిక్ష్వాకువంశమున అవతరించి జగములను
శిష్టజనానందుండై వెలసిన శ్రీరాముని చరితం బతిఘనము ॥జ

(3) రచియించెను వాల్మీకి మహర్షి రమణీయము ఆనందమును
సుచరిత్రంబౌ రామాయణ కావ్యము సుఖదము మోక్షప్రదము ॥జ

(4) కమలాసనుడు దెల్పినదిదియు కలుషహారము శుభకరము
ప్రమదంబున అధికారము బొంది ప్రచురపరచెద మేమిందు ॥జ

(5) పరమ భక్తిని వినవలెనందరు బ్రహ్మానందముతోడ
స్థిరమనంబులను చింతనువిడచి శ్రీ రామభద్రు కృపమీఱ ॥జ

హిందూస్థాని.

ప॥ శ్రీరామంభజ సీతారామం జయజయరామం శ్రీరఘురామంభజ మంగళనామం॥ శ్రీ

చ॥ మాధుర్య నవ మంజులభాషం మాయావిలాసం మానుషవేషం
మర్దితదానవ మాని హృత్తోషం మాణిక్యమణి కుండలభూషం ॥శ్రీ

(2) పవనాత్మజనుత భవభయ హరణం శివసనకాది సేవితచరణం
నవకోసలపురనాథ శ్రీరమణం దివిజార్చితపద దివ్యాభరణం ॥శ్రీ

(3) పారావార గభీరవరాత్పరం నారదవందిత నగవర ధీరం
మారకోటి సుకుమార శరీరం శ్రీరామ సుతనుత కరుణాసాగరం ॥శ్రీ

తే॥ వసుధ కోసలదేశంబు వన్నెకెక్కె సకలజనములు సౌభాగ్య సంపదలు
గలిగి మెలగుచు నుందురు కౌతుకమున నట్టిదేశంబులో ఘనమైనయట్టి.

కమాసు – ఆది.

ప॥ సాకేతపురవరము వరమహేంద్ర సదనము రమణీయము ॥సా

అ॥ శ్రీకరమై లక్ష్మీనిలయంబగు వైకుంఠముపలె వన్నెకెక్కిన ॥సా

చ. సరసోద్యాన వనంబులదనరి సరయూ నది తీరంబునను
కరిభట రథతురగంబులచేత వరలుచుండె నతివైభవమలర ॥సా

(2) కనకగోపుర ప్రాకారంబులును ఘనమగు విజయ పతాకంబులతో
దినమణి ప్రభలను దీప్తిచెలంగెడు మణిమయ సౌధముల్ గల పురవీథుల సా॥

(3) బ్రహ్మతేజులు బ్రాహ్మణోత్తములు నిర్మలు లతిశాంతులు సుస్థిరులు
ధర్మవర్తనులు ధరణీపాలురు దాంతులు రణశూరుల్ సుకుమారులు గల ॥సా

(4) భాసురముగ ధనధాన్య సంపదల ప్రబలినట్టి వైశ్యోత్తములు
వాసుదేవపద సేవానిరతులు వసుసంపద లొప్పు హరిపదజుల్గల ॥సా

(5) సంతతమును దానధర్మ ప్రీతులై సద్భక్తిని పతిని పూజించుచును
అంతరంగ పరిశుద్ధలై మెలగెడు అంగనలునుగల నవకోసలమున ॥సా

మధ్యమావతి – ఏక.

ప॥ ఆపురవరమేలు భూపవరేణ్యుడు పుణ్యుడు మాన్యుడు ॥ఆ

అ॥ శ్రీపతి పదపద్మ చింతనరతుడు శ్రీమంతుడు అతిరథుడు ॥ఆ

చ॥ సత్యదాన వ్రత సజ్జనశీలుడు నిత్యనిర్మలుడు నీతికోవిదుడు
శౌర్య ధైర్య గాంభీర్య శమముఖ సర్వసద్గుణ సంపత్కరుడు
ప్రజలను దయతో పరిపాలించెడు సుజనరంజనుడు సుఖదాయకుడు
దశరథ నృపుడతి ధార్మికుండు నవకోసలేశుడు ఘనుడు మహాత్ముడు ॥ఆ

ద్వి.

(1) కలరతనికి కౌసల్య సుమిత్రియు కైకేయియు ననుపత్నుల్
అలరగ జేయుదు రాత్మవల్లభుణ్ అనయంబును నార్యార్యల్ ॥జ

(2) సకల భోగభాగ్యంబులు గల్గియు సంతతి లేదని చింతణ్
వికలేంద్రియుడై యారాజేంద్రుడు వెక్కసమందుచు నంతణ్ ॥జ

(3) గురువరుడైన వసిష్ఠునిజేరి కూరిమితో నిట్లనియెన్
అఱువదివేల యేండ్లు భోగముల అనుభవించితిని మరియున్ ॥జ

(4) ఏలా నాబ్రతుకేలా భోగమిదేలా రాజ్యమిదేలా
చాలు చాలు సుఖసంతతిలేని యిల నాజన్మమిదేల ॥జ

(5) కరుణామయ సత్పుత్రులు గల్గెడు తెరవేదో మరి యిపుడున్
యెరుగబల్కవే యోమహాత్మ నా వెతదీరగ మరియనుడున్ ॥జ

వ. దశరథ మహారాజుంగాంచి, వసిష్ఠుండిట్లనియె.

ఆ॥ సార్వభౌమ నీకు సంతతిగల్గెడు యుక్తి యొకటి గలదు భక్తితోడ
సర్వభూతములకు సంతోషకరమగు జన్నమొనరింపు నీకోర్కె సఫలమగును.

వ. అన విని సుమంత్రుండు, మహారాజా ! విభాండక సుతుండైన, ఋశ్యశృంగుడు శాంతాసహితుండై రోమపాదుని యింట నున్నవాడు. ఆతపోధనుని తోడ్కొని తెచ్చి, యాగంబొనరించిన, నీకు నల్వురు సుతులు గల్గెదరు. నే మున్ను బ్రహ్మసభయందు వినియున్నవాడ ననవుడు, అతని చరిత్రంబు సవిస్తరంబుగ జెప్పుమని యడుగ సుమంత్రుండు,

జోర:— భూమీశా విను నంగదేశమున రోమపాదుండను నృపతి
భూమిని పాలింపగ ధర్మముతో క్షామముగల్గెను నొకతఱిని ॥జ

(2) అరసియు మది చింతించియు నపుడు ధరణీ సురుల రావించి
సరగున దేశ క్షేమముగల్గగ బరికించుడి మీరొకయుక్తి ॥జ

వ. అనవుడు భూసురులు రాజుంగని భూవరా ! విభాండక పుత్రుండైన ఋశ్య శృంగుడు తపోవనంబున జనకునకు శిశ్రూషలు జేయుచున్నవాడు. తపోధ్యయనంబులందాసక్తి గలవాడు. స్త్రీ పురుష భేదంబు లెరుంగనివాడు.

తే॥ ఆమహాత్ముని రప్పించి యధికభక్తి నీదు వరపుత్రి నింతేని ప్రీతి
నిచ్చి పెండ్లిని సేయుమీ యీతి తొలగు, గురియు సంపూర్ణవృష్టియు, కువలయేశ.

వ. అనవుడు రోమపాదుండు బ్రహ్మచర్యవ్రతంబున నుండు యామహాత్మునిటకెటుల దోడి తేగలమని చింతించునెడ, మంత్రివరులు వేశ్యాంగనలం బిలిపించి యాతని యాశ్రమంబునకు బంపిన యుపాయంబున వారు తోడిదెత్తురన రాజునిపుణలైన వారాంగనలం బంపె నప్పుడు. వారు ఋశ్యశృంగుని యాశ్రమంబు చెంత,

తే॥ చిత్తమలరంగ వేశ్యలు జేరియచట ఆడుచును బాడుచుండ నానందముగను
మునికుమారుడు వచ్చిన గనియు ప్రీతి యెవ్వడవునీవు వచ్చితివేల యిటకు

వ॥ అని యడిగిన.

తే॥ ఋశ్యశృంగుండననువాడ, ఋషివరేణ్యుడగు విభాండక సుతుడనో: యార్యులార
రండు మాయాశ్రమముజూడ రండటంచు వారిదోడ్కొనిపోయి యాధీరుడంత

తే॥ అతిథి సత్కారములు జేయ వా రాదరమున ఇదుగో మాయాశ్రమ ఫలంబు
లివియటంచు భక్ష్యభోజ్యంబులిచ్చియు పరమప్రీతిగ్రుచ్చి కౌగిటజేర్చి యా సచ్చరిత్ర

తే॥ పోయివచ్చెదమనిబల్కి బోయిరంత వారలదలంచి మదిలోన వాంఛతోడ
చపలుడై ముని వనమెల్ల సంచరించి జేరవచ్చెను వేశ్యల చిత్తమలర.

హిం॥ వచ్చినమునిగని మచ్చికతోను విచ్చేయుము మాయాశ్రమమునకన
సచ్చరితుడువిని సంతోషంబున వచ్చెను వారల మెచ్చుచు మౌనియు ॥శ్రీ

(2) హర్షంబునను ఋషివర్యుండు అంగదేశమున అడుగిడినంతనె
వర్షముగురిసెను రోమపాదుడంత సరసత నెదుర్కొని సన్నుతిజేసెను ॥శ్రీ

(3) సంతోషమ్మున ఋషిపుంగవునితో అంతిపురముజేరి అవనివిభుండు
శాంతనతనికిచ్చి పెండ్లిజేయగవేడ్క సర్వసౌఖ్యముల బొందుచున్నాడట ॥శ్రీ

వ॥ కావున నో దశరథ మహారాజా! యా మహాత్ముండగు ఋశ్య శృంగుని బిలచు
కొనివచ్చి, పుత్రకామేష్టి నెరవేర్చుమన మంత్రివర్యులతో సపరివారంబుగ అంగ
దేశముజేరి హితుండగు రోమపాదునిచే కృతస్వాగతుడై,

కన్నడ - అది.

ప॥ మునిచంద్రుని పదవనజములవ్రాలి ॥ము

అ॥ మనుకులభూపతి యభివాదనముగ్ జేసె ॥ము

చ॥ వినయంబుతోమౌనిగ్ వినుతించిపూజించి, తననగరంబునకు దయచేయుమని వేడి

(2) అనఘా తపోధన అశ్వమేధముజేయ మనమున నెంచితి ఘనులు నిర్ణయింప ॥ము

(3) నవనమునకుశాంతా సహితుండవై వచ్చి నవకోసలమును నలంకరింపుము దేవ

జోర:-అనియిటువేడగ రాజేంద్రునికి హర్షమొదవగ నపుడు
అనువుగ ధర్మపత్నీయుతుడై అరిగె నయోధ్యకు ముదమునను ॥జ

(2) సరగున పతులతో వరమౌనికిని సత్కారంబులుజేసి
పరమప్రీతిని పరిపరివిధముల పరిచర్యలు జేయుచునుపొంగి ॥జ

వ॥ అంత కులగురుండగు వసిష్ఠానుమతంబున,

జోర:-సర్వసంస్కారముల్ సవనంబునకు సమకూర్చగ ప్రియమునను
నిర్వైరుండగు నృపవర్యుండు నియమించె మంత్రివరులకును ॥జ

(2) సరయూనది తీరంబున శాలను సత్వరముగ నిర్మించి
పురమెల్ల నలంకారముజేసిరి తురగము శృంగారించి ॥జ

జోర:-దీక్షవహించెను మోదముమీరగ దినకరవంశజుడంత
అక్షీణబలాఢ్యులు పుత్రులు లోకరక్షకు లుదయింతురనియెంతో ॥జ

(2) వసుధీశుడు యాగముజేసెను పర వాసుదేవు మదినుంచి
ఋశ్యశృంగ వసిష్ఠులాదిగల ఋషివర్యుల సేవించి ॥జ

ధన్యాసి — ఆది

ప॥ అశ్వమేధమును జేసెను నృపుడు అతివైభవమునను ॥అ

అ॥ విశ్వంబునగల సర్వజనంబులు వేవేవిధముల గొనియాడగను ॥జ

చ॥ దిక్కుదిక్కుల రాజులుగొల్వగ దివిజవరులు బొగడ
పక్వాన్నంబులు భక్ష్యభోజ్యంబులు పాయస దధిఘృత ఫలముల నిడుచు ॥అ

(2) కోరికల్ దీరగ మధురపదార్థముల్ సారెసారెకు గొనుచు
ఆరగించిరి యతివలు పురుషులు అతిరుచ్యములని యానందించుచు ॥అ

(3) అవనీసురులతి తృప్తులైరి మరి నవవిధాన్నములతో
అవనీపతిని దీవించిరి ముదమున నవకోసల పురవాసులు మెచ్చగ ॥అ

హిం. వేదవిదితముగ వివిధయాగంబులు సాదరమున జేయింపగ నపుడు
మోదమున భూపతియు ఋత్విజులకు సదయు డొసంగె సర్వరాజ్యంబును ॥శ్రీ

(2) ధనము నొసగుమాకు ధరపాలింపగ దగుదువు నీవేయని బల్కగను
ధనహేమ రత్నరాసులనిచ్చి నెనరున వారికి నమస్కరించియు ॥శ్రీ

(3) తనివిదీర ధరామర విభులను ధనకనకంబుల దృప్తులజేసి
మునికుంజరుడౌ ఋశ్యశృంగుని గని వినయముతోడ కరములు మోడ్చి ॥శ్రీ

శంకరాభరణం చాపుతాళం.

ప॥ మానీంద్రచంద్రమా మనవిని వినుమా ॥మా

అ॥ ఘనుడౌ యిక్ష్వాకు వంశమునిల్ప అనఘా నీవేదగు ఆర్యపూజిత చరణా ॥మా

చ॥ సుతులు లేకున్న గతులులేవని బల్కు శ్రుతివాక్యమువిని వెతలం జెందితినయ్యా

(2) పుత్రోత్సవముగల్గ పుణ్యాత్మకృపజూడు ధాత్రి నవకోసలేశుని దలచి
ధన్యుడనౌదు ॥మా

హిం॥ అనవిని మౌనియు ఆహ్లాదంబున జనియింతురు నీకు నల్వురు సుతులు
జననాథా పుత్రికామేష్టిని నే జరిపించెదను మంగళకరముగ ॥శ్రీ

తే॥ సరసముగ పుత్రికామేష్టి జరుపుచుండ అమరవరులెల్లఁగూడియు నజుని జేరి
తాళలే మిక రావణుదర్పమునకు అనుచు మొరలిడువారి దోడ్కొనియు బ్రహ్మ

వ॥ శ్రీ మహావిష్ణునిజేరి యిట్లు నుతియించె.

భైరవి — ఆది.

ప॥ వందనంతే జగన్మంగళ విగ్రహ వందనంతే శ్రీహరి వాసుదేవ ॥వం

అ॥ వందనంతేయనాది పూరుష వరదశుభదాయక పరమేశ్వర కరుణాకర ॥వం

చ॥ జగదేక నాథాయ విగళిత భయశోకాయ
నిగమ నిశ్వాసాయ నిరుపమకల్యాణ గుణాయ ॥వం

(2) సాధుహృన్నివాసాయ సచ్చిదానందాయ
వేదాంత వేద్యాయ విశ్వపరిశాశాయ ॥వం

(3) భవభయ హరణాయ భవ్యచరిత్రాయ
నవపల్లవ కరకమలాయ నవకోసల నిలయాయ ॥వం

జోర:-నారాయణ దామోదరశౌరి పరమపురుష సర్వేశ
కారుణ్యముతో నమరులమొరవిను కావుము కావుము జగదీశ ॥జ

(2) రావణుండు మద్వర గర్వితుడై రాక్షసవీరులతోడ
కావరమున సురగణ మునిజనముల గారియబెట్టెడుతేడా ॥జ

(3) తెరవుదెల్పి మమ్మేలుముయీశా దీనావనలక్ష్మీశా
ధరణి భారముదీర్పుము వేగమె తామసింపకు దేవేశా ॥జ

వ॥ ఇట్లు వినుతించు వారింగాంచి, ప్రసన్నవదనుండై, మేఘగంభీర భాషణంబుల
శ్రీహరి యిట్లనియె.

ధన్యాశి — ఆది.

ప॥ చింతవలదు మీ కికను జెప్పెదనువినుకమలసంభవ ॥చి

అ॥ అంతములేని మీయాధులకునుమరి అంతముగల్గును సంతసింపుడీ ॥చి

చ॥ వరముబొందు తరి రావణుండు కపి వరులను నరులను మరచెగా
నరుడనగుచు నే దశరథ భూవరునకు వరసుతుడై వర్ధిల్లెద ॥చి

(2) వానర భల్లుకములై మీయంశంబుల వసుధను జన్మింపుడీ యిపుడు
పూనియు నవకోసలవాసుని ధ్యానముజేయుచు జనుడిక వేగ ॥చిం

వ॥ ఇట్లు శ్రీహరి యానతీయ బ్రహ్మాదిదేవతలు ముదమంది హవిర్భాగంబులుగొని
తమ తమ స్థానంబుల కరిగిరి. వారివారి యంశంబుల వానర భల్లూకంబులై,
భూవలయంబునంబుట్టి అతిబలాఢ్యులై గిరి గుహాంత రాళంబుల సంచరించుచుండిరి.

జో॥ర:- పుడమినిగల జనులెల్లరు బాగడగ పుత్రికామేష్టినిజేయగను
వెడలెను హోమగుండమునందు వేగమె ప్రాజాపత్యుడును ॥జ

(2) దిక్కుల తనుకాంతులు వెలుగగ దివ్యపురుషు డొక్కరుడు౯
గ్రక్కున జాంబూనద మయపాత్రిని చక్కగపాయస మిడుకొనియు౯ ॥జ

కల్యాణి - ఆది.

ప॥ భూపాలచంద్ర యిదుగో యీపాయసమునుగొను ॥భూ
అ॥ శ్రీపతి సమానులు శ్రీకరాంగులు అతి రూపవరేణ్యు లుద్భవింతురువేగ ॥భూ
చ॥ దేవవరులుప్రీతి దీనినొసంగిరి దేవనిర్మితము దివ్యామృతము ధన్యము ॥భూ
(2) వీరులు శూరులు విమలచారిత్రులు ధీరులు వనధిగంభీరు లుదయింతురు ॥భూ
(3) నీదుసతులకు నిపుడు నెమ్మితో నొసంగుము
శ్రీదయితుడు నవకోసలేశుడు చేరి నీతనయుండగు ॥భూ

వ॥ అనిజెప్పి పరమాన్న పాత్రంబు రాజునకొసంగి, దివ్యపురుషుం డంతర్ధానంబు
నొందెనంత,

హిం॥ ఆనందంబున నాపాయసము ఆత్రతతో చేకొనుచును వేగ
భూనాథుడు కౌసల్యకు ప్రీతి నుప్పొంగుచు నిచ్చె౯ అర్ధభాగంబును ॥శ్రీ
(2) మరియు శేషించిన దానిలోనర్ధము కరుణతో సుమిత్రకు నిచ్చియు నంత
సరగున కైకేయికి నందున సగమిచ్చియు మిగత౯ సుమిత్రకు నొసగెను ॥శ్రీ
(3) సరసిజనేత్రలు పాయసమునుగొని పరమానందముతో భుజియించి
వరమానులకును కులగురువునకును వందనముల్జేసి దీవనలందిరి ॥శ్రీ

తే॥ పాయసంబిడి సతులకు పార్థివుండు యాగమీక్షింప వచ్చిన యవనిసురుల
కుచితసత్కారములుజేసి యొప్పమీఱ భూరిదక్షిణ లొసగె దా భూప్రజలకు.

వ॥ ఇట్లు సప్తతంతువు నిరంతరాయముగా నెరవేర్చి, యెల్లవారల తమతమ నివాసం
బులకనిపి, తానును నగర ప్రవేశముజేసి యంతఃపురముజేరె.

క॥ పరమాత్ముండు హరివిష్ణుడు సరసిజ గర్భాండమెల్ల జఠరములోనన్
ధరియించియుండునత డాతరుణుల గర్భంబునందు దానటుజేరెన్.

వ॥ ఆ సతీమణులు గర్భంబు ధరియించి, సంపూర్ణ చంద్రబింబంబులబోలిన ముఖ కమలంబులు వికసింప, రాజు మదిసంతసింప ప్రకాశించుచుండి రంత.

జోర:-నెల నెలకును యాసతుల గర్భములు సలలితముగ చెలువొంద
చెలగుచు నైదవనెలయందున వేడుకల్ జేసిరి శుభ ముహూర్తమున ॥జ

(2) గంధపుష్ప వస్త్రాభరణంబుల కడువడి శృంగారించి
సుందరాంగులకు పూలుముడిచిరి సుదతులందరునుగూడి ॥జ

వ॥ అంతనాఉవ మాసంబున.

సౌరాష్ట్రం - ఆది.

ప॥ సీమంత మహోత్సవము జేసె శ్రీమంతుడు దశరథుడు ॥సీ

అ॥ సామాదివేదముల్ జగివి బుధులు సంస్కరింపగ గర్భముల ॥సీ

చ॥ బ్రహ్మాండములు సృజించి బ్రహ్మాదుల నియమించు
బ్రహ్మస్వరూపుడౌ పరాత్పరునకు బ్రహ్మరంధ్రమున ప్రాణముజేర్చి ॥సీ

(2) వీణామృదంగ తాళ వేణుగానములు జెలగ
మాణిక్యరత్న పాత్రమున మౌక్తిక హారతులీయ ॥సీ

(3) నానాదేశాధీశులు కానుక లర్పించియు బొగడ
పూనీ నవకోసలపుర పుణ్యాంగనల్ గొనియాడ ॥సీ

హిం॥ అంతట నవమాసంబులు నిండగ అతివలకు ప్రసవవేదనగల్గగ
చెంతనిలచియు చేడియలప్పుడు జేయుచునుండిరి యుపచారంబులు ॥శ్రీ

(2) కస్తూరిరతులు, కడుమోదంబున బెట్టిరి నుదుటను కుంకుమరేఖయు,
పట్టపురాణి కౌసల్యయుగనె గ్రహపంచకము ఉచ్చపదముల నుండగ ॥శ్రీ

ఆరాణ - రూపకం.

ప॥ జననమందె శ్రీహరి జగన్మంగళ విగ్రహుడై ॥జ

అ॥ వనజభవాది సురమునులెల్లరు వినువీధిని వినుతిసేయ ॥జ

చ॥ ఘనమగు చైత్ర శుద్ధనవమి కర్కాటక లగ్నముునను
వనరుగాను శుభదినమున పునర్వసు నక్షత్రంబున

దినకర వంశోద్ధారుడై మనుకుల భూపతికి ముద్దు
తనయుండై ధర్మంబును ధరణిని నెలగొల్ప ॥జ

(2) గంధర్వ కిన్నరులు గానంబును జేయగాను
అందముగా రంభాధులాడ దుందుభిరవముల్ మింటజెలగ
పొందుగా సుమవృష్టిగురియ భూసురవరుల్ గొనియాడ
సుందరుడై నవకోసలమందు వెలయ రాముడై ॥జ

జో॥ కైకేయియు గనె పుష్యమియందు ఘనుని సుపుత్రుని మరియున్
శ్రీకరాంగి సుమిత్రియు నిరువుర సుకుమారుల గనె నాశ్లేషమునన్ ॥జ

(2) పుత్రుల నల్వుర గని రాజేంద్రుడు పూర్ణోత్సాహముతోడ
పుత్రోత్సవ మొనరించెను వేడుక పురోహిత మంత్రులు బొగడ ॥జ

(3) గోవుల భూముల నవరత్నంబుల కోరినవస్తువు లెల్లన్
భూవల్లభుడు మోదంబునను భూసురకోటికి నిచ్చెన్ ॥జ

(4) ఈరాజ్య విభవ మీపుత్రసంపద లెల్లనిపుడునే గంటిన్
ధారుణి సురవరులారా మీదగు దయచే ధన్యుడనైతిన్ ॥జ

వ॥ దశరథుండిట్లు వినుతించిన, యా భూసురోత్తములు దీవించిరంత. ద్వాదశ రాత్రింబులు గడచిన, వసిష్ఠుండు సంతోష స్వాంతుండై పుణ్యాహవాచనంబు గావించి, నామకరణంబు జేయించెనిట్లు.

సీ॥ రమణుడై జగముల రమియించు గావున రామచంద్రుండని నామమిడియె
భరియించు సర్వంబు పరంధాముపదభక్తి భరతుడీతండని బలికె మరియు
సర్వలక్షణముల సంపన్నుడగుగాన లక్ష్మణుండితడనె లక్షణముగ
శత్రుంజయుడు సాధుసమ్మతుడగుగాన శత్రుఘ్నుడనుచును సంతసమున
నామకరణంబులిటుజేసి ప్రేమమీర, అన్నదానంబు రత్నభూషాంబరాది
దానములుజేసె జనులకు తనివిదీర, ధరణికాంతుండు సంతోష భరితుడగుచు.

వ॥ ఇట్లు దశరథమహారాజు! సర్వభూతంబులను తృప్తిగాపించి, తానును దృష్టుండై, యానందపరవశుడై, సతీమణులతో,

కాంభోజి - చాపు.

ప॥ ఎంతటి భాగ్యంబుగల్గెను యీచిన్ని బాలురగని ముద్దిడ ॥ఎం

అ॥ సంతోషమూరెనేడు సత్యము బ్రహ్మానందము సౌఖ్యము ॥ఎం

చ॥ అరుణ కిరణ చరణకమలులు సరసీరుహ దళనేత్రులు
సురుచిరలావణ్యయుతులు సుందర ముఖజితచంద్రులు వీరు ॥ఎం

(2) నవమోహనాంగులు వీరు నాదువంశపావనులు
దివిజులు ప్రార్థింప భువిని అవతరించిరి నవకోసలవాసుని దయ ॥ఎం

వ॥ అని బొగడుచు మురిపంబు మీరనుండ, అంతఃపురాంగనలు బాలురకు
జోలోత్సవము జేయసమకట్టి,

జోర॥ ఆణిముత్యముల నవరత్నంబుల నమర్చిన బంగరుజోలన్
నాణ్యముగా శృంగారించిరి యా నాతులు సుందరలీలన్ ॥జ

(2) బాలురనెత్తుక తల్లులు మువ్వురు పసిడివుయ్యాలల నునచి
జోలలు బాడిరి వేడుకలలర చాలగ మది సంతోషించి ॥జ

### లాలిపాట.

ప॥ లాలి శ్రీరామలాలి లక్ష్మణ భరత శత్రుఘ్నలాలి.

అ॥ లాలిజయరామలాలి కోదండ రామ రఘురామ లాలి ॥లా

చ॥ బంగారు తొట్లలోను పవళింపుమయ్య శ్రీరామచంద్రా,
శృంగార మొప్పగాను చేరి నిజ తమ్ములతో గూడివేడ్క ॥లా

(2) సరసిజాసనుడు వేడ బుట్టితివి ధరణి భారముదీర్పగ,
కరుణచే బుధులబ్రోవ వెలసితివి పరమాత్మ రామచంద్ర ॥లా

(3) నవకోసలపుర విహార, నవమోహనాకార, దశరథ కుమార
భవదూర వీరశూర భక్తమందార మేరుధీర ॥లా

### లాలిపాట

ప॥ రామలాలి జగదభిరామలాలి, కామకోటిసుందర మేఘశ్యామలాలి ॥రా

చ॥ ముద్దుగుల్క మోమునందు ముంగురులాడ, చిద్విలాస రూపభూప శ్రీశ లాలి॥రా

(2) రాజీవదళనేత్ర రమణీయగాత్ర రాజరాజసేవిత శ్రీరఘురామలాలి ॥రా

(3) ఇందు ధరవందనార్చిత సుందరపాదా, యిందిర హృదయారవింద ముకుందలాలి॥రా

(4) పరమపావన నవకోసలధామ కరుణనేలురామపుత్రి కల్యాణరామ ॥రా

తే॥ బాలకులగాంచి సంతోష భరితులగుచు, యెత్తిముద్దాడు తల్లుల యింపుజూచి
యేమిపుణ్యంబులొనరించిరి జేసి రీమగువలు యీకుమారుల గనుభాగ్య మిపుడు గలిగె.

శంకరాభరణం - ఆది.

ప॥ ఎంత శృంగారులేయమ్మ యీ చిన్ని బాలులమ్మ ॥ఎం

అ॥ కంతునియల జయంతునిమించు కమనీయ సుందరులమ్మ ॥ఎం

చ॥పూర్ణేందువదనులు పుండరీకదళనేత్రులు అరుణాబ్జచరణులు ఆజానుబాహువులు॥ఎం

(2) కాకుత్స్థవంశజులు కంబుకంధరులు శ్రీకారమువలె చెలువంపు కర్ణములమ్మ ॥ఎం

(3) దినకరసన్నిభ తేజులు ఘనభుజు లతిగంభీరులు
వనరుహ నవకోసల వాసులు మోహనమూర్తులు ॥ఎం

వ॥ ఇట్లు చేడియలందరు కొనియాడి బిడ్డలనెత్తి ముద్దిడి రంత బాలురు దినదినప్రవర్ధమానులై శుక్లపక్ష చంద్రునివలె ప్రకాశించు చుండిరి. అట్టియెడ నాఱవ మాసంబున, అన్నప్రాశన మహోత్సవము గావించిరి.

జోర॥ నవ్వుచు బాలురు వూకొట్టుచును నగుమొగములతో మరియు
అవ్వాయత్తయని బల్కుచు వేడుక నటునిటు దోగాడుచును ॥జ

(3) ముద్దులమొగముపై ముంగురులాడ మురిపము చెలువముమీఱ
మద్దికాయలు ఘలుఘలు మ్రోయ కడువడి తల్లులజేర ॥జ

(3) అందముగ వరపుత్రులనెత్తి అంకపీఠములనుంచి
సుందరాంగులు చనుబాలిచ్చిరి చుబుకము బుడుకుచు ప్రేమించి ॥జ

(4) అడుగులు తడబడ నడకలునేర్చిరి అసురులమద మణచగను
వెడవెడ గంతులువైచుచు వేడుక పరువులిడిరి ముదమునను ॥జ

నోటు — ఏక.

ప॥ చిన్నచిన్న నడకలఁ జేరియాటలాడిరి ॥చి

అ॥ కన్నతల్లి చెంతజేరి గంతులిడుచు వింతగాను ॥చి

చ॥ దామెద్దామె చందమామ దాయిదామె దామెయనుచు
దాదుల చెయిబట్టివేగ చందమామ నిందుదెమ్మని ॥చి

(3) జలకలశములోనజూచి తులువ పిల్లవాడిదెయని
జలముల చెయిదట్టుచును జలజాక్షులతి ముదమున ॥చి

(3) కరకంకణములు జెలగ గజ్జెలుమొలనూళ్ళు మెఱయ
నురమున హారములుగదల వరనూపుర ధ్వనులుమీఱ ॥చి

(4) పరమ కల్యాణులు వరనవకోసలమునందు
మరిమరిముద్దు పల్కులతో ధరణీశుని చెంతనిలచి ॥చి

సీ॥ చిన్నవాడ రార కన్నవాడరార చిన్నారి పొన్నారి చిలుకరార
అయ్యారార ముద్దులయ్యారార బంగారుకొండరా భానువంశ
లాలబోసెదరార పాలుద్రావుమురార జోలపాడెదరార నీలవర్ణ
చక్కనయ్యారార చుక్కబెట్టెదనిటు చెక్కిలిముద్దీర శ్రీరమేశ
ఏలవరుగిడెదిటులు రావేల బాల, రార నాకూర్మిసుత యిట రారవేగ
రార రఘువంశతిలక శ్రీరామచంద్ర, రార రాజీవదళనేత్ర రాజవదన.

వ. ఇట్లు లాలనజేయుచు బాలుని జేరదీసి,

జోర. కురులు దువ్వెను బాలచంద్రులకు పరిమళతైలముబూసి
విరులు జుట్టియు గొండెవేసెను జారగ కుచ్చులుగట్టి ॥జ

(2) ఆణిముత్యముల రావిరేక దా నమరిచి ముఖకమలమున
నాణెముగాను తిలకముదీర్చె నతి ప్రీతిని కౌసల్య ॥జ

(3) ఘలుఘలుమని మొలగజ్జెలుమ్రోవ కడువడి తల్లులజేరి
పలువిధంబుల గంతులువైచుచు పరమానందము మీరి ॥జ

(4) ఆటలనాడుచు పాటలబాడుచు అమ్మా యాకలియనుచుకా
మాటిమాటికిని పరువులెత్తుచు మరుగున దాగుచు నగుచుకా ॥జ

తే. ముద్దుబాలుర గనుగొని మోహమునను చుబుకమును బుణ్కి ముద్దిడి చుంచు దువ్వి
పసిడిగిన్నెలలో పంచభక్ష్యములను కుడువబెట్టిరి సుతులకు కూర్మితోడ ॥జ

జోర॥ సారెసారెకు దధిఘృతాన్నములు సరగున కరముల లిడగకా
ఆరగించుచు అటునిటుజల్లుచు అట్టె పరువులిడగకా ॥జ

(2) పొసగగ భువి నాపుణ్యఫలంబీ పుత్రుల బడసితిననుచుకా
దశరథనరపతి మది ముదమందుచు నాయాక్రీడలు గనుచుకా ॥జ

వ. ఇట్లాబాలురు తమ యాటలబాటల తల్లిదండ్రుల యుల్లంబులు పల్లవింప, లీలా
వినోదంబుల ప్రొద్దుల బుచ్చుచు ముద్దుల జూపుచుండి రట్టియెడ,

హిం॥ పంచాబ్దంబుల బాలురగని మరి పరమ హర్షంబున నృపుడతివేడ్క
అంచితముగ విద్యాభ్యాసము జేయించగవలెనని గురువరుతోబల్క ॥శ్రీ

(2) అంత వసిష్ఠుడా రాజపుత్రులకు అక్షర స్వీకారముజేయగను
సంతసంబున నాబాలకులు సకల విద్యలు క్రమమున జదివిరి ॥శ్రీ

(3) వేదశాస్త్రము లితిహాస పురాణముల్ విలువిద్యలు రాజనీతి శాస్త్రంబులు
మోదకంబగు సంగీత సాహిత్యముల్ ఆదిగగల విద్యలన్నియు నేర్చిరి ॥శ్రీ

కోలు — ఏక.

ప॥ ఆటలాడిరి బాలకులు ఆనందంబున జతగూడి ॥ఆ

అ॥ కోడి బాలకులతో గూడి వాటముగ నొక తోటునజేరి ॥ఆ

చ॥ రామలక్ష్మణులు కోకయుగ్మ పూనీయంబుగ పరువిడుచు
శ్రీమంతులు భరత శత్రుఘ్నులు దిక్కుల తనుకాంతులు మెరయగ ॥ఆ

(2) బిగిగుసు గుసుగుసు గుసగుసయని చూర పదములతోఁ గాల్ గొట్టుచును
వంపులదారుల కంతగ దిరుగుచు గెలిచితిమేమని గేలిసేయుచు ॥ఆ

(3) గాపుడు మూగబోవుచును బాగుగ గంతులు వైచుచును
రాగముతో నవకోసలపురి రాజకుమారులు రఘుకుల తిలకులు ॥ఆ

హిం॥ నగుమొగములను కుఱుల్ నాట్యములాడగ సొగసగు చెక్కుళ్ళు సొంపుదీపింప
నిగనిగమనుమేని కాంతులు వనజ నీరజనేత్రులు నేరుపుమీరగ ॥శ్రీ

(2) వాసంబున శ్రీరామ లక్ష్మణులు భరత శత్రుఘ్నులు జతపై గూడి
సారంగముల వేటాడు వేడుక తురగము లెక్కి వనులకు బోదురు ॥శ్రీ

(3) వేటలాడి శ్రీరఘునందనులు వేగ మెనచ్చియు వన్యమృగంబుల
వాటముగ తండ్రి వద్ద కొనవచ్చియు వందనములు గావింతురు ప్రియమున ॥శ్రీ

(4) అతి సుకుమారుల సుతులనల్వుర నంకతలంబున జేర్చియు నృపుడు
అనుపమ ముదమున శ్రీ మములుమూర్ఘ్ని ఆనందించెను పులకాంగితుడై ॥శ్రీ

వ. ఇవ్విధంబున అనేక లీలావినోదంబుల జననీ జనకుల కుల్లాసంబు గల్గించుచుండిరి.
అంత,

కీరవాణి-రూపకం.

ప. ఉపనయనము గావించెను భూపతి తన తనయులకును ॥ఉ

అ. అపరిమితానందముతో అమరవరులు గొనియాడ ॥ఉ

చ. పంచశిఖలు విడిపించియు బ్రహ్మదండ మొసగిచేత
అంచితముగ మౌంజి కృష్ణాజినమును గప్పి యపుడు ॥ఉ

(2) వాసిగ యజ్ఞోపవీతము వేసియు బ్రహ్మోపదేశము
జేసి యుపదేశంబుల యభ్యాసము జేయించియును ॥ఉ

(3) రాజవరులు కానుకలిచ్చి రఘుకుల దీపకుల బొగడ
భూజనములు సన్నుతింప భూసురు లాశీర్వదింప ॥ఉ

(4) మంగళవాద్యములు మ్రోయ శృంగారవతులు నాడ
రంగుగ నవకోసలపురి రమణులు హారతులీయ ॥ఉ

జోర. వరమంత్రులు సామంతులు గొలువగ ధరణీశుడు విభవమున
గురువర్యునితో ఋషులను గూడి కొలువుండెడు సమయమున ॥జ

(2) వచ్చెను విశ్వామిత్రు డయోధ్యకు జెచ్చెర దశరథుజేర
మచ్చికతోడుత నర్ఘ్యపాద్యముల నిచ్చియు మోదముమీర ॥జ

(3) ధన్యుడనైతిని మీరిట వచ్చుట తాపసోత్తమా యిపుడు౯
యెన్నగ మీమది కోరిక దెల్పుడు యిపుడే జేసెద ననెనృపుడు౯ ॥జ

(4) అన విని మునిశార్దూలుం డిట్లనియెను వేడుకలలర౯
అనఘా క్షేమమె రాజ్యంబును నీ తనయులు ప్రజలును సిరిదనర౯ ॥జ

కమాసు-ఏకతాళం

ప॥ భూప వినుము దెల్పెద౯ భువిని శుభముగల్గును ॥భూ
అ॥ శ్రీపతి శ్రీరామచంద్రుని శీఘ్రమె నాతోడబంపుము ॥భూ
చ॥ అనఘులు రామలక్ష్మణుల్ అతిశూరులు వీరులు
ఘనముగ నాయజ్ఞ విఘ్నకరులను వధియింపగాను ॥భూ

(2) మారీచ సుబాహులు క్రూరదనుజవీరులు
చేరి హోమగుండములను చెరుతురు రక్తమాంసములను ॥భూ

(3) ఆగ్రహింప తగదు నే యాగదీక్ష నుండగ౯
అగ్రిసుతుడు రాము డాయసురుల దునుమాడు వేగ ॥భూ

(4) ధీరుడు నాయజ్ఞ మిపుడె దీర్చును సంపూర్ణముగను
కూరిమి నవకోసలపురి కోదండరాము సాక్షిగ ॥భూ

హిం॥ మునివర్యుండిటుపల్క రాజేంద్రుడు మూర్ఛిలి యంతట తెలివొందియును
ఘనదుఃఖముతో మనసున గుందుచు కౌశికుతో నిట్లనియెను వేడుచు ॥శ్రీ

ఆనందభైరవి – ఆది.

ప॥ స్వామీ నామాటగైకొనుమా నామీద దయగనుమా ॥స్వా
అ॥ రాముని బంపజాలను రక్కసులతోబోరాడ ॥స్వా

చ॥ కన్నతల్లినివదలి కనుమూయడు బాలుడు
చిన్నపాప్రాయముగాన చీకటి నదరిబెదరుడు ॥స్వా

(2) అనఘు శ్రీరాముడు అనిసేయనేరడు
ననుగొని పొమ్మిదేమో మునికులాంబుధిచంద్ర ॥స్వా

(3) అడవులగుట్టల అడుగిడ జాలడు
గడుసురాక్షసులను ఖండింపగలడె చెపుమా ॥స్వా

(4) వరసుతున్విడిచినే నరనిముస మోర్వ నీ
చరణములకు మ్రొక్కెద కరుణజూడుమయ్యా ॥స్వా

(5) దానవమాయలు దాటగలడె చెపుమ
ఊనషోడశవయస్కుడు శ్రీరఘురాముడు ॥స్వా

(6) ధీరుడె మీవెంట దిరిగి దైత్యులగెల్వ
కూరుకుపట్టునా పసికూననువిడిచి కంట ॥స్వా

(7) బంగారు గిన్నెలో పక్వాన్నము లారగించు
శృంగారు డడవికుంపల సాధ్యమానే దిన ॥స్వా

(8) అరవిందనేత్రుని అతిసుకుమారుని వరనవకోసల వాసునితో వత్తునే ॥స్వా

వ॥ ఇట్లు వచియించు రాజేంద్రునిగని కుశికపుత్రుండు, కోపోద్దీపిత మానసుండై.

బిలహరి - ఏక.

ప॥ ఔరా యెంత ఘనుడవు ఆడి తప్పువాడవీవు ॥ఔ

అ॥ కోర్కెదీర్తునచు బలికి కుమతివై కులము జెఱుచు

చ॥ సుతులు లేరె జగతిని భూపతుల కెల్లను
అతిగారవమున బెంచరె అధిప నీవె యధికుడవో ॥ఔ

(2) ఋతుమత మెరిగించువారని అతి త్వరితమె వచ్చితి
మతిహీనుడ అనృతపరుడ మరలిపొమ్మను టెఱుగనైతి ॥ఔ

(3) యెరుగుదు రీ రామచంద్రుని యీ మునీంద్రులు
పరమాప్తుడు నీ కులగురు బల్కువినుము నిజము దెలియు ॥ఔ

(4) రఘువంశోద్ధారుల కపయశము గల్గగ
సుఖముండుము నేబోయెద సుతహితులనుగూడి మరియు. ॥ఔ

(5) భాసురమౌ నవకోసలవాసు రాము జనకునకు
వాసిగ ధరణీశునకిక జేసిన మాహాత్మ్య దలతు ॥బో

వ॥ యీరీతిని కుపితుండై ధిక్కరించి మాటలాడు గాధేయునికి హితంబుగా దశరథుం గాంచి, వశిష్ఠమునీంద్రుం డిట్లనియె.

జంఝూటి - ఆది.

ప॥ దశరథ రాజేంద్రా వినుము తడబడవల దిపుడు

అ॥ శశిధరు డనుదినమును వినుతించు శ్యామలగాత్రుడు శ్రీరఘురాముడు ॥ద

చ॥ ఆదినారాయణుడు నీయింటను అవతరించెను అసురుల ద్రుంచను
సాధువులన్బ్రోవ సత్యచరిత్రుని మోదమున బంపు మునివర్యునితో ॥ద

(2) ప్రభుడవు నీవు బలికి బొంకకు శుభముగల్గు నీసుతులకు కౌశికు
డభయమొసగును అతిదయతోడను వైభవ మలరగ వత్తురు వేగమె ॥ద

(3) రామ లక్ష్మణులు రణశూరులు మరి భీమపరాక్రమ దైత్యభీకరులు
సామజగమనులు నవకోసలపురిధాముల బంపుము ధైర్యముతోడ ॥ద

జోర:-ఘనముగ గురుడిటు బల్కిన పల్కులు విని నృపు డతిమోదమున
అనఘా నాప్రియతనయుల బంపెద మనమలరగ వేగమున ॥జ

(2) రామలక్ష్మణుల రావించియు నతిరయమున కౌగిటజేర్చి
యీ మహాత్ముని వెంబడి జనుడి వేడుకలర ప్రేమించి ॥జ

(3) శిరమును మూర్కొని చెక్కిలి ముద్దిడి శ్రీ రామలక్ష్మణులజూచి
సరగునబోయి రండని ముదమున వరపుత్రుల దీవించి ॥జ

మధ్యమావతి - రూపకం.

ప॥ తమ్మునిగూడి బోయిరమ్ము తరణివంశ జలధిచంద్ర ॥త

అ॥ నెమ్మదితో తపసియాజ్ఞ నెరవేర్పుము రామచంద్ర ॥త

చ॥ అనఘుండతి ధర్మాత్ముడు అస్త్రశస్త్ర కోవిదుడు
మనమున భయమింతవలదు మౌనివర్యు డభయమొసగు ॥త

(2) నవనీరజపత్రాక్ష నాదుముద్దు వరతనయా
నవకోసల తిలకనీవు సవనము రక్షింపుమయ్యా ॥త

వ॥ అనవుడు రామలక్ష్మణులు కౌసల్యాసుమిత్రలం జేరి నమస్కరించి,

హిం॥ అమ్మా కౌశిక మునివరువెంట యాగముజూడ జనకుని యాజ్ఞను
తమ్మునితోడ బోయివచ్చెదను యిమ్మహినిగల వింతల గనుచు ॥శ్రీ
వ॥ అనిబల్కిన పుత్రునిగని సంతసించి కౌసల్య,

ధన్యాశి – ఆది.

ప॥ రాజీవనేత్ర శ్రీరామచంద్ర రమ్మావేగమె సర్వశుభముల్గొని ॥రా
అ॥ తేజోరాశియా కుశికసుతునితోడ ధీరుడవై సౌమిత్రితోను ॥రా
చ॥ శ్రీకరనిన్నుచేరి రక్షింతురు లోకంబులును లోకేశులున్
భీకరాటవులయందు భీతివలదు భీమవిక్రముడు మునిసార్వభౌముడు ॥రా
(2) నవమోహనాంగ నానోముపంట నవకోసల కోదండరామ
అవనీసురులు ఆశీర్వదింప భువిని సత్కీర్తితో బోయిరమ్మ తండ్రీ ॥రా
హిం॥ రక్షనుగట్టెను రామలక్ష్మణులకు రక్షింపుండని యమరుల వేడియు
అక్షీణబలులను నాశీర్వదించి ఆనందంబున బంపెను వారల ॥శ్రీ
(2) గురువరుజేరి రఘుకుంజరులు పరమభక్తిని వందనముల్ జేయ
కరుణతో వారికి మంత్రాక్షతలిడి గురుబలయుతులై గొనుడీ విజయము॥శ్రీ
(3) అనియాబాలుర దీవింపగను జనకునిచెంత నిలువగ భక్తిని
ఇనకులపతి యాదశరథుడు తన తనయులనొసగెను మునిచంద్రునకు ॥శ్రీ
(4) పరమ హర్షంబున గాధేయుండు నరవర నీకు మంగళమగునని
తరలగ రాజకుమారులతోడ సురలు సుమవృష్టి గురిపించిరి వేడ్క ॥శ్రీ

తోడి – రూపకం.

ప॥ వెడలిరి యతి వేడ్కతోడ శ్రీరామ లక్ష్మణులు ॥వె
అ॥ కడువడి ముద్దునడకలతో కౌశికుని వెంటనంటి ॥వె
చ॥ చందమామ గేరుమోమున సుందరముగ ముంగురుల్గదుల
అందముగా తిలకంబు మెరయ ఆనందము మీరవేగ
మందహాస రుచులు బర్వ పొందుగ నవకోసలేశుల్
కందర్ప లావణ్యయుతులు కరమున శరచాపములతో ॥వె
వ. ఇవ్విధంబున తనవెంట ననుసరించివచ్చు శ్రీరామలక్ష్మణుల గని గాఢానందకంద
ళిత హృదయారవిందుండై సప్రేమంబుగా నమ్మునీంద్రుం డిట్లనియె.

కమాసు - ఏక

ప॥ రారా శ్రీరఘురామ రారా దశరథరామ సుగుణాభిరామ శ్రీరామ ॥రా

అ॥ వీరాజిత రణశూరా ధీరా మారకోటి సుకుమార శరీర ॥రా

చ॥ సుందరముఖజితసోమా రామా మందహాస మనోహరరామ
యిందుశేఖర చింతననామా మందరధర సురకామ పరంధామ ॥రా

(2) శ్రీకరమౌ బల అతిబలయను విద్యల్ నీ కుపదేశించెద ప్రేమ శ్రీరామ
ఆకలి దప్పియు యలసట నిద్రలేకుండగ నిదెగైకొనువేగమె ॥రా

(3) దూర్వాంకుర సన్నిభ శుభ గాత్రా సుచరిత్ర తోయజదళనేత్ర పరమపవిత్ర
సర్వేశభవలతాలవిత్ర సార్వభౌమ నవకోసల జనస్తోత్ర ॥రా

వ॥ అంత శ్రీరామ లక్ష్మణులు శుద్ధాచమనంబుజేసి విశ్వామిత్రునివలన విద్యలు గ్రహించి సంతోషించి సరయూనదీ తీరంబున తృణశయ్యాంబరుండి మునీంద్రునిచే లాలితులై యారాత్రి సుఖముగ నిదురించిరంత సూర్యోదయమగుటయు గాధేయుండు శ్రీరాముని డగ్గరి కాంతియుక్తంబగు ముఖారవిందం బవలోకించుచు సంతోష స్వాంతుండై.

మేలుకొలుపు.

(1) కౌసల్యవరపుత్ర కంజదళనేత్ర కాకుత్సకులతిలక మేలుకో
వాసుదేవకృష్ణ పద్మనాభాచ్యుత భాసురాంగ శ్రీశమేలుకో ॥రామ మేలుకో॥

(2) ఉదయాద్రిపై భాను డుదయించెరఘువీర మదనమోహనరూప మేలుకో
సదయప్రాతస్సంధ్య సమయమయ్యెగాన సంధ్యోపాసనజేయ మేలుకో ॥రా

(3) మధుకైటభులదుంచి వేదములుగైకొన్న మత్స్యావతార మేలుకో
కుధరముకిందను కూర్మమై నిలచిన గోవిందమాధవ మేలుకో ॥రా

(4) ధరనుద్ధరించియు హిరణ్యాక్షుబొరిగొన్న వారాహమూర్తి మేలుకో
నరశింహరూపమై ప్రహ్లాదుగాచిన పరంధామ శ్రీహరిమేలుకో ॥రా

(5) ధరణి మూడడుగులు దానంబుగైకొన్న వరద వామనరూప మేలుకో
పరశురాముడవై నరపతుల ద్రుంచిన సురమునివందిత మేలుకో ॥రా

(6) ధరనన్ను పాలింప దశకంఠుమర్దింప దాశరథివౌ రామ మేలుకో
పరమదయాళో నిరతిశయానంద పద్మదళేక్షణ మేలుకో ॥రా

(7) ముద్దుల కృష్ణుడవై మద్దులగూల్చెడు మోహనాంగశౌరి మేలుకో
బుద్ధుండవై సర్వసిద్ధులదెల్పెడు పురుషోత్తమా దేవమేలుకో ॥రా

(8) ఖలులను మర్దింప కల్కివై బుట్టెడు కమలకళత్రి మేలుకో
చెలువము మీరగ నవకోసలంబున వెలసిన రఘురామ మేలుకో ॥రా

డోర॥ మునిచంద్రుండిటు మేలుకొలుపగ జనపతి పుత్రులు వేగ
అనువుగలేచి స్నానసంధ్యల నొనరించియు సంతోషముగ ॥జ

(2) కౌశికుచెంతకు వచ్చినిలువబడి ఘనులు రామలక్ష్మణులు
భాసురగాత్రులు పరమ పవిత్రులు పయనమైరి మునితోను ॥జ

(3) సరయు గంగసంగమ స్థలమున అరసియు భాగీరథినీ
మరియునందొక యాశ్రమంబు రఘువరులు గనియు ముదమంది ॥జ

(4) స్వామీ యీయాశ్రమ మెవరిది మాకు ప్రేమతో దెల్పుండనిన
రామావినుమిది కామాశ్రమము రవికులాంబునిధిసోమ ॥జ

వ॥ మున్ను యీశ్వరుండిచ్చట తపంబు సేయునెడ మన్మథుండు పరిచర్యాతత్పర యగు పార్వతిపై యతని మనంబు చలింపజేయ ఫాలాక్షుండలిగి వాని దగ్ధంబు గావింప అతడిందు నంగంబు బాసెగాన దీనిని యంగదేశమని యందురు యిం దుండు ఋషులు ధర్మరతులును పరమేశ్వరుని శిష్యపరంపరలునై యున్నవారు గాన మనము స్నాన సంధ్యాద్యనుష్ఠానంబులొనర్చి యీరాత్రి యిందుండుద మనునెడ అచ్చటిమౌనులు వీరువచ్చు టెఱింగి యెదురేగి.

డోర:-ముందుగ కౌశికు పూజించియు రఘుకుల చంద్రుల నభినందించియును
అందరు కుశలప్రశ్నలతోడ ఆనందించిరి ప్రియముననను ॥జ

(2) మధురములైన కథలు దెల్పుచు మౌనీంద్రుడు ముదముననను
నిదురబుచ్చె శ్రీరామలక్ష్మణు మదిని బొంగుచునపుడు ॥జ

వ॥ అంత వేకువను మేల్కాని కాల్యకృత్యంబుల దీర్చి గంగాతీరంబుజేరి మనోహర మైన పడవనెక్కి బోవుచు గొప్ప ధ్వనివిని రాముడు స్వామీ! యిది యేమిధ్వని యన విశ్వామిత్రుండు రామా! బ్రహ్మమనసుచె నిర్మించిన మానస సరోవరము నందుండి ప్రవహించుటవలన, సరయూనది యని పేరుగలిగి, అయోధ్యయందు ప్రవహించెడు ఆనది పై భాగమునుండి గంగలో బడుటవలన యీధ్వనిగలిగె. రామా! భక్తితో యీనదులకు నమస్కరింపుడన, వారు నమస్కరించిరంత. గంగ యవ్వలితీరము జేరి యటనుండి బయలుదేరిబోవుచు,

డోర:-క్రూర మృగాది సంకులమగుచు భూరిభయావహమైన
ఘోరాటవిగని రాముడనియెనిటు కూరిమి కౌశికుతోడ ॥జ

(2) ఘనమగు నానావిధతరులతలతో జనసంచారములేమిఁ
వనమును గన భీకరమైయున్నది యనవిని ముని యిట్లనియెఁ ॥జ

(3) పాకశాసనుడు బ్రహ్మహత్యచే ఆకలి దప్పులకడలి
శ్రీకర గంగాస్నాన మహిమనిట చింతవిడచె హత్యనుదొలగి ॥జ

(4) మలదకరూశంబని యీదేశము వెలయగ ధనధాన్యములఁ
గలుగునట్లు వరమొసగె నిందు్రిడు గావున శుభకరమైయుండఁ ॥జ

వ॥ రామా! యిందు తాటకయను రక్కసియున్నది. అది సుకేతుడను యక్షుని కూతురు; సుందునిభార్య. బ్రహ్మవరంబున వే యేనుగుల బలంబుగలిగి యుండె. మారీచుండు దీనిపుత్రుండు. సుందుడు హతుండైన వెనుక తాటక మారీచుని గూడి, మహాత్ముండైన కుంభసంభవుని మిర్రింగబోవ నతండు వారల ఘోర రాక్షసులై యుండుడని శపియించె. అదిమొదలు కూ్రరంబుగ మారీచుతోడ యీపుణ్య ప్రదేశమును పాడుగావించు చున్నది. ఇందెవ్వరిని జేరనీయక యుండు రక్కసిని వధించి, లోకంబులకెల్ల మేలు గావింపుము గోబ్రాహ్మణుల రక్షింపుము.

తే॥ స్త్రీవధంబని నీమది చింతవలదు పరమదుష్టుల గూల్ప పాపంబులేదు
భూమి ప్రజలకునెల్లను క్షేమమొదవ జంపుమీ రక్కసిని రామ జాగులేక.

తే॥ అనిన శ్రీరాముడిట్లెంచె మనములోన మౌనియాజ్ఞను నెరవేర్పబనిచె తండ్రి
గాన నేకార్యమైన గావింపవలయు అసురజంపెద ఋషులు సంతసపడంగ.

వ॥ ఇట్లు నిశ్చయించి, దేవా! మీయాజ్ఞను శిరసావహించెదనని ధనుష్టంకారంబు జేసిన నాశబ్దంబువిని తాటకకోపాటోపంబున మైమరచి గర్జించుచు పరువిడివచ్చి రామునిమీదికి దుముకబోవ విశ్వామిత్రుండు హుంకారంబుననాపి రామ లక్ష్మణులకు జయము గలుగుతమని దీవించి,

జోర॥ ఆలస్యంబిక జేయవలువ దీయసుర జంపుమో రామా
చాలబలము నిశివేళ దనుజులకు చాలునింక దయరణభీమా ॥జ

(2) ముని యిటుబల్కగ రామచందు్రిడు సునిశిత శరజాలమునఁ
వనిత తాటకగూల్చెను ముని మనములరగ మరివేగఁ ॥జ

(3) ఘోర హావమున బడియెను తాటక ధారుణి తల్లడమందఁ
సారెసారెకు జయజయధ్వనులు మీరుచు దివిభువిజెలగఁ ॥జ

(4) సరగ మునియు శ్రీరఘువీరుని చేరదిగిచికౌగిటజేర్చి
శిరము మూర్కొని చెక్కిలి ముద్దిడి శ్రీరామునిపై దయమించి ॥జ

(5) సురలెల్లరు రఘువీరుని బొగడుచు గురిపించిరి సుమవర్షమును
పరిపరి విధముల ముని గొనియాడుచు బలికిరిటుల ముదమునను ॥జ

(6) అసదృశబలుడగు రామునిచేనిక నయ్యెడు కార్యముల్ గలవు
భృశాశ్వపుత్రుల నస్త్రజాలముల నొసగుము మునివర యనుడు ॥జ

వ. అంత విశ్వామిత్రుండు సంతుష్టాంతరంగుడై శ్రీరామచంద్రునకు భృశాశ్వపుత్రులగు జృంభకాస్త్రంబుల ప్రయోగోపసంహారంబు సమంత్రకంబుగ సాధుసమ్మతి నుపదేశించె. అంత నాయస్త్రజాలంబులు ప్రత్యక్షంబై రామా! నీకింకరుల మైతిమి, యేమియాజ్ఞ యన రామభద్రుండు నాకు వలయునప్పుడు దలచెద వచ్చి సహాయ మొనరింపుడన, నవి వల్లెయని యంతర్హితంబులయ్యె. అంత శ్రీరాముండు

జోర:-ఉపదేశించెను తమ్మునకపుడవి తపసియాజ్ఞగైకొనియు
అపరిమితానందంబున గదలిరి ఆమునివెనుకొని మరియు ॥జ

(2) గాధేయునితో రాముడిట్లనె కరుణామయ యీవనము
ఆదికాలమున యేపురుషునిదో అతిరమ్యము శోభకరము ॥జ

వ. స్వామీ! మీరిచ్చట యాగముజేయు నాశ్రమమెయ్యది యన,

(1) అనేక యుగంబులు విష్ణుమూర్తియిట ఆచరించె ఘనతపముల్
అనువుగ యోగసిద్ధి గలుగవామనుడిట నిలచెను మరియున్ ॥జ

(2) సిద్ధాశ్రమమని పేరుగలిగె తపస్సిద్ధిగల్గు నిచ్చటను
శ్రద్ధతోడ నేనిందు వసించుచు జన్నమొనర్చెద నిచ్చటను ॥జ

తే॥ ఆశ్రమముజేర గనుగొని యచటిమునులు యెదురు జనుదెంచి యాతిథ్య మిచ్చి వేడ్క
కుశలప్రశ్నలు గావించి కొంతతడవు విశ్రమించగ రాముడిట్లనియెమునికి.

జోర॥ యాగదీక్షగైకొను మికదేవా జాగ్రతతో మేమిపుడున్
బాగుగ దైత్యులబట్టి దునిమెదము భద్రము గలుగగ ననుడున్ ॥జ

(2) లోకకంటకనుగూల్చి తాటకను వీకనుయశమందితిరామ
శ్రీకరయజ్ఞ విఘ్నకరుల చెండాడుము గుణధామ జ॥

వ॥ అని బల్కు విశ్వామిత్రుండు, నియతేంద్రియుండై దీక్ష వహించి, యాగము ప్రారంభించె నప్పుడు.

సీ॥ శ్రీరామ లక్ష్మణుల్ జేరియతి జాగ్రతన్ గాచియుండిరి వేడ్క గడలుకొనగ
అంతనాఱవ దినమారంభమున వేగ రాక్షసులపుడు బల్ రభసముగను

మాంసశోణితముల పాంసువృష్టియు చాల కురిపించిరాహోమ గుండములను
అదిజూచి శ్రీరాము డాగ్రహంబునుబూని చూడు లక్ష్మణయనుచు చోద్యముగను
మానవాస్త్రంబువేయ మారీచుడుదధి బడియెనంత సుబాహుని మడియజేసి
తక్కుగల రక్కసులనెల్ల నుక్కడంచె జయజయ ధ్వనులు చెలరేగె సకల దిశల.

తే॥ సురలు సుమవృష్టిగురిసిరి సొంపుమిగుల మునులు దీవించిపొగడిరి మోదమునను
సరసముగ పూర్ణమాయె నీసవనమనుచు కౌశికుని మనమలరెను కౌతుకమున.

తే॥ రాము సుగుణాభిరామునంబుదశ్యాము జేరజేరి ప్రేమను కౌగిటంజేర్చి మిగుల
పరమపావన నాతపఃఫలమునీవె యనుచు గాధేయు డానందమలర బలికె.

వ॥ అపు డా రామలక్ష్మణులు విశ్వామిత్రాది మునులకు నమస్కరించి, స్వామీ!
మీ కింకరులము! మేము జేయంగల కార్యంబెద్దియో యెఱింగింపుడనిన,

జో॥ తరలిపోవుదము మిథిలకు నిప్పుడు పరమ పావనులార
హరువిలుగలదు జనకునియింట అది గనుటకు వేడుకమీర ॥జ

(2) అధిక తేజమున వెల్గుచునుండెడి యావిల్లును నిర్జరులు
సదయులై యిచ్చిరి దేవరాతునికి సవనమునందునమున్ను ॥జ

(3) గరుడ గంధర్వసుర నరకిన్నర వరులకు సాధ్యముగాక
వరలుచునుండెడి యాచాపముమీ రరయుడిపుడు వేగమునక ॥జ

(4) అనిపల్కుచు మునులందరు కౌశిక మౌనిని సేవించుచును
ఘనులగు శ్రీరఘువీరులగూడి గదలిరి మోదంబునను ॥జ

వ॥ ఇట్లు ప్రయాణంబై సూర్యాస్తమ సమయంబున శోణనదీ తీరంబుజేరి స్నానాద్య
నుష్ఠానంబులుదీర్చి రామలక్ష్మణులు ఋషులకు నమస్కరించి విశ్వామిత్రునిగని
దేవ! దట్టములగు వనములతో మనోహరమై కానవచ్చు నీ దేశము పేరేమి?
అనవుడు, మునియిట్లనియె.

తే॥ ధరణియేలెను కుశుడను ధార్మికుండు గలిగిరతనికి నల్వురు ఘనులు సుతులు
తండ్రియానతి వడసియా ధర్మరతులు పురములను వేఱువేఱ యేర్పరుచుకొనిరి.

వ. కుశాంబుడు కౌశాంబియు కుశనాభుడు మహోదయమును, ధూర్తరజుడు ధర్మా
రణ్యంబును వసువనువాడు గిరివ్రజమును నేలుచుండిరి. శ్రేష్ఠములయిన పర్వ
తంబులు నలువ్రక్కల నుండుటచే నీపట్టణమునకు గిరివ్రజమని పేరు కలిగినది.
రామా! ఈ ప్రవాహము తూర్పునుండి పడమటికి బారుచున్నందున నిది
నదమై పుణ్యక్షేత్రంబై యున్నది. మఱియు కుశనాభునకు ఘృతాచియను
భార్యయందు నూర్గురు పుత్రికలు గల్గిరి.

హిం. సుందరాంగులు యౌవనవతులై పొందుగ సర్వాలంకారంబుతో
అందమైన యుద్యానవనంబున ఆడుచు బాడుచు వీణలమీటుచు ॥శ్రీ

(2) సంతోషంబున సంచరింపగ వింతగ డగ్గరి పవనుడు పల్కెను
కాంతలార మిము గామించితిని గైకొనుడీనను కరుణతో వరునిగ ॥శ్రీ

(3) అరయుగ దేవతాస్త్రీలై యుందురు వరియింపుండన కుపితలు కన్యలు
పరము దుష్టుండవై బల్కిటనీతియె పవనా మాతండ్రి యాజ్ఞ జరింతుము ॥శ్రీ

(4) పవనుడు వారల పరమరోషంబున అవయవములజేరి కుబ్జలజేయగ
అవమానంబున జనకునితోడ అతి దుఃఖంబున నంతయు దెల్పిరి ॥శ్రీ

వ॥ అదివిని కుశనాభుండు తన బిడ్డలగని, క్షమగల్గి యుండుటయే స్త్రీల కలంకారంబు గాన మీరు సుఖయింతురు. అని తన కులంబునకుదగు కులశీల గుణయుతు డయిన వరుని యోచించి, చూళియను మహర్షివలన సోమదయను గంధర్వ స్త్రీయం దుద్భవించిన బ్రహ్మదత్తుండను వానికి నూర్వుర కన్యలనిచ్చి వివాహంబు గావించిన అతని కరస్పర్శంబున వారు తమ కుబ్జురూపంబులు విడచి సురూపులై ప్రకాశించిరి.

సీ॥ కుశనాభుడంతట కొడుకులు లేకున్న పుత్రకామేష్టిని పొసగజేయ
కుశుడరుదెంచి యా కొమరుని దీవించి సద్గుణముల నీకు సదృశుడైన
సుతు డుదయించు నీ కతిధార్మికుండునై గాధినామంబిలఁ గల్గువాడు
అతనిచే బహుకీర్తి అవనిబొందెదవంచు బల్కిబోయె కుశుండు బ్రహ్మపురికి
అంత కుశనాభు డాత్మలో నంతసింప, గాధియనుపుత్రుడుదయించె నాదుతండ్రి
కుశికవంశుడ నగుటచేఁ గూర్మితోడ గౌశికుండందు రనను జనుల్ గౌరవమున.

జో॥ మరి నాసోదరి సత్యవతియను తరుణిని రుచుకున కియ్యగ
పరమసాధ్వి సుఖముండి ధాత్రిలో యరిగె దివికి దేహముతోడగ ॥జ

(2) పరమపావని కౌశికి నదియై బారెడు హిమవంతమునగ
పరిశుద్ధంబౌ జలమున జగముల పావన మొనరించుచు నచటగ ॥జ

(3) సల్పుచుండు తపమందున నెప్పుడు సహోదరిపై గల ప్రేమగ
చెలగి యజ్ఞము జేయదలచి నే జేరితి సిద్ధాశ్రమముగ ॥జ

వ॥ రామా! నీ ప్రభావమున యాగము పూర్తిజేసి కృతార్థుడనైతి.

క॥ అనవుడు కౌశికు చరితము విని వీనులవిందుగాగ వేడ్కబొగడిరో
యనఘా నీసోదరిపావన యశముంగూర్చె తనదు వంశమ్మునకున్.

వ॥ అనిరంత నర్ధరాత్రింబగుటయు నందరు సుఖ సు ప్తింజెంది ప్రభాతంబున మేల్కాంచి కాల్యకృత్యంబులుదీర్చి ప్రయాణోన్ముఖులై శోణనదముందాటి నానావిధవనంబులం జూచుచు మధ్యాహ్న సమయమునకు గంగానదింజేరి శ్రీరామ లక్ష్మణులు శ్రేష్ఠంబగు త త్తీర్థంబున స్నానాద్యనుష్ఠానంబులు మునుల తోడం దీర్చికొని అమృతోపమానంబులైన వన్యాన్నంబులు భుజియించి సుఖోప విష్టులై యున్న యెడ.

డోర॥ కనియు కౌశికుని రామలక్ష్మణులు కరుణామయ మోదమునన్
ఘనముగ త్రిపథగామినియైన గంగా మహిమము దెల్పు మనన్ ॥జ

(2) మంగళమూర్తులు కూతుండిరువురు మహనీయుడు హిమవంతునకు
గంగయు పార్వతియని విఖ్యాతిని గాంచిరి త్రిభువనములను ॥జ

తే॥ దివిజులందరు గంగను దేవనదిగ గోరి యిమ్మని హిమవంతుజేరి యడుగ
నిచ్చె గంగను సురలకు నిచ్చమెచ్చి, దివికి గొనిపోయి రమరులు తివిరిదాని.

డోర॥ పర్వత శ్రేష్ఠుండగు హిమవంతుడు పరమేశ్వరునికి యపుడు
పరమతపస్విని పార్వతినిచ్చి పరిణయ మొనర్చెను మరియు ॥జ

వ॥ అంత పరమేశ్వరుండు బహుదివ్య వర్షంబులు పార్వతింగూడియుండ దేవతలు యీశ్వరునిజేరవచ్చి, దేవోత్తమ! నీ తేజంబు లోకంబులు భరించంజాలవుగాన లోకంబులకు హితముగావింప పార్వతితోడ తపంబుజేయుమని ప్రార్థించిన నతండట్లనే యగుంగాక యిప్పుడీ వీర్యంబు ధరించువారెవ్వరనిన అగ్ని ధరించె. దివిజులు సేనానింగోరి బ్రహ్మనువేడిన అతనియాజ్ఞచే నగ్ని హరుని తేజంబు గం గలో విడిచె. గంగభరింపజాలక శ్వేతాద్రియైయున్న రుద్రని తేజంబునన్ విడచిన శరవణమందు కుమారు డుదయించి షట్కృత్తికలు పాలీయరాగా షణ్ముఖుం డయ్యె. అతని విరించి దేవసేనానిగ నియమించె. రామా! యిదిస్కంధుని జనన ప్రకారంబు. రామా! మఱియును వినుము మీవంశంబున పూర్వము సగరుం డనురాజు సంతానహీనుండై తపంబుజేసి భృగు మునీంద్రునివలన వరంబువడసె. ఆతని పెద్దభార్యయగు కేశినికి వంశకర్తయగు నొక్క కొమరుండును రెండవ భార్యయగు సుమతికి నఱువదివేల సుతులు బలపరాక్రమశాలులు నుదయించిరి.

డోర॥ సగరుని పుత్రుడు జ్యేష్ఠుడు దుష్టుడు సరయూనది లోపలను
పొగరుసపురిగల బిడ్డలవైచుచు పొంగుచుండు లోపలను ॥జ

(2) పరమసాధులను హింసించుచుమటి దిరుగుచుండ పురమునను
ధరణీశుడు తన తనయునిపాపిని దరిమెను పురివెడలగను ॥జ

(3) వాని సుతుండగు నంశుమంతు డనువాడు సద్గుణయుతుడు
భూనాథుడు మనుమని మన్నించును పుడమిజనులు బొగడగను ॥జ

(4) ధరణీధవుడు సవనము జేయగ దలచియు తురగము విడువన్
సురనాథుండది యపహరించిన సుమతిజుల ననిపెను వెదకన్ ॥జ

(5) భూమండలమంతయు గ్రుమ్మరి బొడగానక వారశ్వమును
భూమిద్రవ్వి దిగ్గజములగనియు బోయిరి పాతాళమును ॥జ

(6) కపిల మహాముని పార్శ్వంబున మరి గనవుమేయు తురగమును
నృపతిపుత్రులు గని దిట్టుచు మానిని కపిలుని తేజంబునను ॥జ

వ॥ నీఱై నేలంగూలిరి. అంత సగరుండు తనపుత్రు లఱువది వేవురును రామికి వగచి సాధువర్తనుడైన అంశుమంతుని అశ్వంబు వెదకి తెమ్మన నతండు దిగ్దేశంబు లన్నియు వెదకి నెందుగానక పాతాళంబు జేరె. అందు తపంబు జేయుచుండు కపిల మహామునిని గుఱ్ఱంబును భస్మరాసులై యున్న పినతండ్రులనుగని దుఃఖితుండై,

తే॥ తండ్రులకు తర్పణము జేయ దలఁచి జలము లరయ నీరంబులెందును దొరకదయ్యె
అంత దిక్కులు వీక్షించు నతనిగాంచి పలికె గరుడుండు వానితో బరమదయను.

ద్విర॥ భావింపగ నీభస్మరాసులును భూవరతనయా యిపుడు
దేవనదీ జలముల దడపగ దివము జేరెదరు వారనుడు ॥జ

(2) ఘనుడగు కపిలుని ప్రార్థించియు మరి అనఘుడు హయమును గొనియు
వినయంబున తన తాతకు సర్వము నెరుగింపగ చింతించియును ॥జ

వ॥ సగరుండంత క్రమముదప్పక యాగపరిసమాప్తిగావించి గంగను దెచ్చు నుపాయంబుగానక చింతించుచు పెద్దకాలంబు రాజ్యంబుచేసి దివంబుజేరిన అంశుమంతుండు కొంతకాలము పుడమిని పాలించి దిలీపుండగు తన పుత్రునకు పట్టంబుగట్టి బహువత్సరంబులు హిమాలయంబున దపంబాచరించి గంగను దేలేకయె దివంగతుడయ్యె. ఆత్మజ్ఞానియైన యాదిలీపుండు గంగను దెచ్చుట కాలోచించుచు పెక్కేండ్లు రాజ్యంబుజేసి యమరలోకముజేరె. అంత నతని తనూజుండు భగీరథుండు,

హిం॥ సంతతిలేకను భగీరథుడు చింతించుచుమది రాజ్యమువిడచి
పంతముతో వియద్గంగ దెచ్చుటకు పార్థివుండు గోకర్ణముజేరి ॥శ్రీ

(2) ఘోరతపము గావించుచు నుండగ ధారుణిని వేయి వత్సరంబులు
వారిజాసనుడువచ్చియు సురలతో వరముగోరుమన నతడిట్లనెను ॥శ్రీ

(3) దేవానాపై దయగలదేని గావుము కరుణను సద్గతిగల్గగ
దేవనదీగంగ బ్రవహింపజేయుము దేవనాపితరుల భస్మరాసులపై ॥శ్రీ॥

(4) మరియును నాకు సంతతిగల్గగ వరము లిమ్మనివేడిన యంత
సరసిజాసనుడు ప్రీతుండగుచు వరములిచ్చియు మరి యిట్లనెను ॥శ్రీ॥

(5) ధరణీశావిను గంగాభరమును భరియింపజాల దీభూదేవియును
హరునిగూర్చి తపమాచరింపుమని సురలోకమున కరిగె విరించియు ॥శ్రీ॥

తే॥ అంత పరమేశ్వరునిగూర్చి యధికతపము సల్ప నొక వత్సరంబైన చంద్రధరుడు
పార్వతీదేవితోగూడి ప్రమదమునను వచ్చిరాజును వీక్షించి మెచ్చియపుడు

వ॥ రాజోత్తమా! నీ తపంబునకు హర్షించితిని నీవు కోరినయట్ల గంగను శిరంబున ధరించెదనన అంత గంగాదేవి బ్రహ్మ యాజ్ఞానుసారంబుగ బయలుదేరి ఆకాశమునుండి పరమేశ్వరుని జటాజూటంబునబడి యతనితోడ పాతాళంబున కేగెదనని మహావేగంబున నాతని శిరంబున బడెను. ఆమె గర్వంబెరింగి యీశ్వరుం డామె పొడవడంగజేయ నెంచిన,

జో॥ పరమేశ్వరుని శిరమునుండి భువి బడజాలకమరి గంగా
దిరుగుచునుండె జడల మధ్యమున తెరవెరుగక పుణ్యతరంగా ॥జ

(2) అంతననేక వర్షముల్ గడచెను అమరనదినిగానకను
చింతించియు మరి తపముజేసెను శివుని గూర్చియా నృపుడు ॥జ

(3) హరుడు ముదంబున బిందు సరోవరమందు విడువగను గంగా
ధరణిని సప్తశాఖల బారెను సరగున కలుషవిభంగా ॥జ

వ॥ నళిని, హ్లాదిని, పావని, యను మూడుపాయలు మంగళకరములయి, తూర్పు ముఖంబున బారెను. సుచక్షువు, శీత, సింధువు. అను గొప్పపాయలు పడమటి దిక్కుగా ప్రవహించెను. తక్కిన పాయయొక్కటి భగీరథుని వెంబడించె.

హిం॥ శ్రీకరమైన శుద్ధజలంబుతో చెలువముమీర తుంపురులెగయ
భీకరమా మత్స్యమకర కూర్మంబుల నాకమునుండి ధరణికి దిగియెను ॥శ్రీ॥

(2) మెరుపుతీగలవలె మిణుమిట్లు గొల్పుచు మేఘగర్జనంబన ఘోషించుచును
ఉరగముదీతిని కరితుండంబన పరిపరివిధముల ప్రవహించుచును ॥శ్రీ॥

(3) గరుడ గంధర్వ సురముని సంఘముల్ హరుసముమీరగ గుమ్ములై నిలచి
హరిచరణోద్భవ దురితవిదారిణి పరమపావని గంగను ప్రస్తుతించిరి భక్తి ॥శ్రీ॥

నీలాంబరి — ఆది.

ప॥ శ్రీహరి చరణోద్భవ శృంగారిణి శ్రితజన కలుష విదారిణి ॥శ్రీ

అ॥ శ్రీహరజటామకుట సంచారిణీ హిమగిరితనయ సుధీమణి
శ్రీకరి దయాకరి త్రైలోక్య మనోహారిణి సురలోక విహారిణి ॥శ్రీ

చ॥ మందమందవిలాస విభ్రమ సుఖగమనే
చందన కుంకుమ రేఖావిలసిత శుభవదనే వరచరణే
ఇందు ధరాలింగన పులకాంగిత సౌందర్యసదనే
వందనార్చిత నవకోనల నిలయరంజనే సురభికుసుమశోభనే ॥శ్రీ

వ॥ ఇవ్విధంబున బృందారక మునివర్గంబులు వినుతించి యాగంగా ప్రవాహంబున స్నానంబుజేసి కృతార్థులై నిజనివాసములకుం జనిరి. శాపగ్రస్తులైన మరికొందరు స్నానం బాచరించి శాపవిముక్తులై తమతమ స్థానంబుల నలంకరించిరి.

జో॥ పరమపావనమగు గంగానదిలో ధరణినిగల జనసంఘములు
పరమహర్షమున స్నానముల్ జేసి దురితముల్ బాసిరి యపుడు ॥జ

(2) రథమును నారోహించిపోవునా రాజును వెనుకొనిజనుచు
అధికుడు జహ్నుని యాగభూమిదా నాక్రమించె వేగముతోను ॥జ

సీ॥ అతికోపమున జహ్ను డాగంగ ద్రావిన సురమునుల్ వెరగంది వరమునీంద్రు
పూజించి నుతియింప పూజ్యు డతిప్రతుడై కర్ణముల విడచెను గంగనపుడు
జహ్నుమహాముని సత్పుత్రియనిరంత జాహ్నవియనుపేర జగతివెలసె
అపుడు గంగాదేవి యాభగీరథువెంట పాతాళమునుజేరి భస్మరాసుల్
పైన ప్రవహింప పాపముల్ బాసివేగ జనిరి స్వర్గంబునకురాజ తనయులెల్ల
కమలభవుడు భగీరథు కడకువచ్చి మెచ్చి సంతోషమునబలికె మచ్చికలర

జో॥ సగరులమరులై స్వర్గముజేరిరి సాధుచరిత నీమహిమగా
జగతినంబుధు లుండెడు వరకును స్వర్గము నుందురు ఘనతగా ॥జ

(2) ధరణికి నీవీగంగ దెచ్చుటను పరమపవిత్రవినుము
బరగెను నీదగు వరపుత్రికయై భాగీరథి నామముతోను ॥జ

(3) త్రివిధంబుగ ప్రవహించునుగాన త్రిపథగామిని యనగ
భువనంబులలో పూజ్యతగాంచెను భూరి మహాత్త్వమువలన ॥జ

(4) పరికింపగ నీతాతలు తండ్రియు నెరవేర్పగలేని
పరమపావని గంగ దెచ్చితివి ప్రతిష్ఠబొందితి భువిని ॥జ

(5) గంగోదకమున స్నానముజేసి మంగళకరముగనీవు
బొంగుచు పరిశుద్ధుడవై భూవర బొందుము పుణ్యఫలంబు ॥జ

(6) చేరబోయెదను సత్యలోకముఁ గూరిమి మీమీపితరులకు
ధారుణీశ తర్పణమొనరిచి తరలుము పురమునకనియు ॥జ

ఆ॥ తరలిపోయెవేగ సరసిజోద్భవుడంత ధరణివిభుడు స్నాన దానములను
పరగజేసి తనదు పట్టణంబునుజేరి ధరణినేలె ధర్మతత్పరతను.

హిం॥ ఘనమైనట్టి గంగమహాత్మ్యము వినిన పఠించిన విశ్వంబునను
ధన మాయుష్యము యశమును సంపద అనువుగ సత్సంతానము గల్గును ॥శ్రీ

(2) రామలక్ష్మణులు కథలువినుచు వేడ్కఁ రాత్రినిదురించి మేల్కాంచియును
నేమముతో ననుష్ఠానముల్ దీర్చి యామునుల్ దెచ్చిన నావపై నెక్కియు ॥శ్రీ

వ॥ కౌశికాది మహర్షులతో గంగను త్తరించి యచటికి నావనడిపిన ఋషుల పూజించి
వారిననిపి మనోహరంబగు విశాలనగరము జేరిరి.

తే॥ దేవ యీపుర మెవరిది తెలియబల్కు
మనిన మునిబల్కె ముదమున వినుము రామ
కృతయుగంబున పూర్వమం దతిబలాఢ్యు
లయిన యసురులు ధర్మాత్ములయిన సురలు

జోర॥ ముదిమియు రోగము మరణములేని సదుపాయము నరయుచును
మథియించిరి క్షీరాంబుధి నందరు మందరగిరి కవ్వముగాను ॥జ

(2) అమృతముగోరుచు తరుచుచు నుండగ హాలాహల ముదయింప
సదయుడు శంకరుడది భక్షించెను జగములు సంతసమంద ॥జ

(3) అఱువదికోట్లు అప్సరోంగనలు వారుణియను కన్యకయు
మఱి యుదయించె కామధేనువుఁ సురతరువును చింతామణియు ॥జ

(4) సిరియును కౌస్తుభమణి యుదయించి జేరెను హరివక్షమున
కరమున నమృతపు కలశముగొని ధన్వంతరి జనియించెను వేగమున ॥జ

తే॥ అసురులంత బలాఢ్యులై యమృతకలశి గొనుచుఁ బరువిడ శ్రీహరి కనికరమున
మోహినీరూపమున వారి మోసగించి సురల కమృతంబుబోసెను చోద్యముగను

వ॥ అపుడు దేవాసురులకు ఘోరంబగు పోరుగలిగె. ఇంద్రుడా దితిసుతులనడప
పుత్రశోకంబున దితి కశ్యపమహర్షిం జేరి ఇంద్రుని జంపు పుత్రుని బ్రసాదింపు

మన నామహర్షి చింతించి దితినిగాంచి వేయివత్సరములు శుచివై తపంబు గా
వించిన మూఁడులోకంబుల కజేయుండైన పుత్రుని నాయనుగ్రహంబున బడయు
గలవని వచించి తపంబునకు జనియె. దితియు సంతోషించి కుశప్లవంబుజేరి
దపం బాచరించుచుండె. అప్పుడా వృత్తాంతం బెఱింగి యింద్రుండు సపత్నీమాతకు
సపర్యలొనర్చుచుండ అల్పావశేషంబుగ సహస్రవత్సరంబులు నిండ గర్భవతి
యగు దితి ముక్తకేశయై మధ్యాహ్నకాలంబున పాదతలంబున శిరసునిడి నిదు
రించె నప్పుడు అశుచియగు దితినిగని ఆమె యుదరంబున ప్రవేశించి యాఖండ
లుండు గర్భంబును సప్త ఖండములుగా ఛేధించు సమయంబున ఆపిండంబులు
రోదనంబుసేయ మారుద! మారుద! యని యింద్రుండు బల్కెనప్పుడు,

జో॥ దితిమేల్కొనగని యింద్రుడు భయమున ధృతిజెడి దితికిట్లనెను
మతిహీనుడ నాబ్రతుకునకై నీసుతు ద్రుంచితి కరుణజూడనెను జ॥

(2) అనివేడిన దుఃఖించుచు మదిలో అనెనిటు యింద్రునిగనియు
తనయా నీదగు తప్పుగాదు నా దౌర్భాగ్యము విధికృతము ॥జ

(3) చంపవలదు నాగర్భమందుగల సప్త ఖండముల నింద్రా
కంపమువిడచి శిశువుకుమేలు గావింపుము సద్గుణసాంద్ర జ॥

(4) దేవ సదృశులయి నాకుమారులు తేజరిల్లవలయు
భావింపు మరుత్తులను పేరున ప్రబలజేయుము దిక్కులను ॥జ

(5) తనయా నీకు మంగళవచానన జననీ కానిమ్మనుచు
జనియెను దివమున కింద్రుడప్పుడు సంతసమున పొంగుచును జ॥

వ॥ రామా! వాసవుడు దితికి సపర్యలు గావించిన స్థలంబిది. మరియు, ఇక్ష్వాకు
పుత్రుండు విశాలుడు తన పేరన పట్టణంబు నిర్మించెను. యాసద్వంశోద్భవుండైన
సుమతియనువాఁడీవిశాలనగరంబును యిప్పుడేలుచున్నవాడు.

తే॥ రాత్రి యిందుండి వేకువను రయముమీర జనకు జూడంగబోవుద మనగనపుడు
కౌశికుని రాకవిని సుమతి కౌతుకమున హిత పురోహిత బంధులతో నెదురువచ్చి

వ॥ నమస్కరించి దోడ్కొనిచని పూజించి మహాత్మ! మీదర్శనంబున నే ధన్యుండ
నైతి ననుచు,

హరికాంభోజి — ఆది.

ప॥ ఇంద్రనీలహేమ రుచులనొప్పెడు యీబాలురెవరు మహనీయతేజ ॥ఇం

అ॥ చంద్రసూర్యప్రభ సంకాశులై సర్వభూత మనోరంజనులౌ ॥ఇం

చ॥ పల్లవారుణ పాణి పద్మముల విల్లునమ్ములు వేడ్క-మీరబట్టి
యెల్లలోకముల రక్షించుచుండు విష్ణు సన్నిభులు వీరవిక్రములు ॥ఇం

(2) సురుచిర లావణ్య సుందరమూర్తులు పరమధర్మనిరతుల్ భద్రయశస్కులు
వరనవకోసలాధీశులబోలు కరుణాకరులు కల్యాణులు ॥ఇం

హిం॥ అతికోమలమగు పదపద్మములతో అడవులలో నెటు నడచివచ్చిరి
అతిసుకుమారులు రాజకుమారులు ఆయుధధరులై రాగతమేమి ॥శ్రీ

(2) జననాథావిను మీబాలకులు మనుకులపతియగు దశరథ పుత్రులు
దనుజులదున్రించి నాయాగముగాచిరి దినకర తేజులు ఘను లతిబలులు ॥శ్రీ

(3) ఆమాటలువిని సుమతియు ప్రీతిని రామలక్ష్మణుల పూజించెనప్పుడు
రామునితో మునులా రాత్రియుండియట రవి యుదయింప పయనము జేసిరి ॥శ్రీ

(4) కనియును మిథిలా నగరమునప్పుడు గొనియాడుచు బలువేడుక నందరు
జన సంచార రహితంబైన వనమునబోవ శ్రీ రాముండిటులనె ॥శ్రీ

(5) మునికులతిలకా యీవనమెవరిది మనమున కడునుత్సాహము గల్గెడి
గననిది పద్భృతు ఫలకుసుమంబుల గల్గియు జనవిరహితమై యున్నది ॥శ్రీ

నాయకి – రూపకం.

ప॥ గౌతము నాశ్రమమిది మును కౌతుకమున వినుమా రామ ॥గౌ

అ॥ ఆతపోధనుడు మహాత్ముడు అహల్యతో తపమాచరించెనిట ॥గౌ

చ॥ సరసీ జోద్భవుడుమున్ను సౌందర్యములరసిగూర్చి
తరుణి అహల్యగా సృజించె త్రైలోకముల్ మోహింప ॥గౌ

(2) భూవలయము దిరిగివచ్చు పుణ్యపురుషుకిచ్చెదనన
భావించి గౌతముడు గోవును వలగొనియువచ్చి ॥గౌ

(3) నవయౌవ్వనురాలగు నాతిని చేకొనియు నపుడు
నవకోసలనాథు దలచి భువనసుందరి నుండె యుండె ॥గౌ

హిం॥ సుందరియగునా సుదతిని కోరి ఇంద్రుడు గౌతమవేషంబునను
మందయాననుగూడి యుండగను మౌనియు వాసవు దుశ్చరితముగని ॥శ్రీ

(2) అతిరోషంబున హరిహయుగనుగొని మతిహీనుడ నీబీజముల్ వీడి
క్షితిబడునని శపియించియు వేగమె సతికిట్లనెను సాధువరేణ్యుడు ॥శ్రీ

(3) పరమచండాలీ పాపీనుర్మతి పడియుండుము యిట శిలవై నీవు
యొరులకుగనరాక వాయుభక్షణమున ధరణి ననేకశతవత్సరములు ॥శ్రీ

(4) ఘనుడు శ్రీరాముని పాదరజంబున వనితా నీవు పవిత్రత గాంతువు
అనఘుండిటకు వచ్చునందాక ఆచరింపుమీ యుగ్రతపంబును ॥శ్రీ

తే॥ రఘుకులాంబుధిసోముడౌ రామభద్రు పూజసేయుము భక్తినపూతచరిత
శ్రీరమేశుని మదిని చింతింపుమనుచు వెడలిపోయెను గౌతము డడవులకును

జోర॥ ఘనశిలయై యిటకదలకున్నది నినుధ్యానించుచు నదియు
అనఘా నీపదరజముసోకగ మునిశాపము దీరును-ధరియు ॥జ

ముఖారి — రూపకం.

ప॥ పతిసేవ సతీమణులకు పరమభాగ్యము రామ ॥ప

అ॥ పతియే దైవంబనియెంచి హితమాచరింతురు దివిభువి ॥ప

చ॥ శాంతలై యేకాంతంబున కాంతుని దివ్యపదకంజముల్
స్వాంతంబున ధ్యానించుచు నంతరంగమరసి మెలగు ॥ప

(2) సతతము పతివ్రతలనుగని సకలదేవతలును వెరతురు
నతులొనరిచి పూజింతురు నవకోసలరామా ॥ప

వ॥ అట్టి పతిసేవ నేమరినందున యీసతికి యీగతి సంప్రాప్తంబయ్యె.

జోర॥ అని పల్కుచు మునియుసమున వారితో ఆవనమున నడుగిడి నంతట
కనువారికి నత్యాశ్చర్యంబుగ కల్కియు పొడసూపెను మరి చెంతట ॥జ

గౌరీమనోహరి — ఆది.

ప॥ పరమపావనమగు పదరజమున శిలయు పడతియై నిలిచెను ॥ప

అ॥ గిరిజాధవుడును వాక్పతిహరి సిరిసురమునులును శిరములదాల్చు ॥ప

చ॥ నారద శుక శౌనక భీష్మార్జున వసిష్ఠ రుక్మాంగదవ్యాస
పారాశర పుండరీక ప్రహ్లాదాంబరీషులకు పవిత్రంబగు ॥ప

(2) సతతంబును నవకోసల పతిని సంతసమున దలచి
అతిభక్తిని రామతనయ రుక్మిణి యనవరతము ముదమున ధరియించు ॥ప

వ॥ శ్రీరామలక్ష్మణులాతపస్వినినిజూచి మ్రొక్కి నిలిచియుండిన అహల్యయు గౌత
మ వాక్యంబులు దలచి భగవంతుండైన శ్రీరామమూర్తి యితండేయని మది
నెంచి యాతిథ్యమొసగి పూజించి యిట్లని నుతియించె.

భైరవి — ఆది.

ప॥ జయజయ శ్రీరఘురామ జయజయ సుందరరామ ॥జయ

అ॥ జయసద్గుణధామ జయకాలాంబుశ్యామ ॥జ

చ॥ రమణీయ శుభగాత్ర రాజీవదళనేత్ర
కమనీయ శుభచరిత్ర కమలాసనాదిస్తోత్ర ॥జ

(2) వరరత్నమణిభూషణ వాసవసన్నుతచరణ
కరుణాకర భూరమణ కాకుత్స్థకులాభరణ ॥జ

(3) దానజనపరిపాల శ్రీశా యోగీంద్రలోల
భాసురశృంగారలీల పరమేశమాయాజాల ॥జ

(4) నవమోహనాకార నగధీరసుకుమార
నవకోసలపురవిహార భవహర శ్రీకరవీరా ॥జ

సీ॥ శరణు శ్రీరఘురామ శరణుసద్గుణధామ శరణు పావననామ శరణు శరణు
శరణు సుందరపాద శరణురమానాధ శరణు భక్తవినోద శరణు శరణు
శరణు మౌనిస్తోత్ర శరణు మంజులగాత్ర శరణు సత్యపవిత్ర శరణు శరణు
శరణు పద్మదళాక్ష శరణుకౌస్తుభవక్ష శరణు దుర్జనశిక్ష శరణు శరణు
శరణు సంశ్రితరక్షణ శరణు శరణు
శరణు మానుషవేషాఢ్య శరణు శరణు
శరణు శరచాపభూషణ శరణు శరణు
శరణు జితకామ శ్రీరామ శరణు శరణు.

వ॥ అంత గౌతముండరుదెంచి కౌశికాదులగు మునీంద్రులను శ్రీరామ లక్ష్మణులను సత్కరించి కృతార్థుండనైతినని,

లతాంగి — చాపు.

ప॥ శ్రీలలిత సుందరపాద శ్రీలక్ష్మీకరయుగ సేవ్యపదపద్మ ॥శ్రీ

అ॥ లీలగా జగముల నెలకొనియున్న బాలార్క తేజ శ్రీరామచంద్ర ॥శ్రీ

చ॥ శంఖచక్రపద్మ ఛత్రచామరమత్స్య అంకుశవజ్రాలంకృతమైన ॥శ్రీ

(2) దురితతిమిరచంద్ర దుష్టకంజచంద్ర
మర్దిత[illegible]కుముదచంద్ర [illegible] ॥శ్రీ

(3) విధిశివసనకాది విమల [illegible] సదయ నవకోసల సార్వభౌమ [illegible] ॥శ్రీ

జో॥ సంతసమున పూజించి నుతియించుచు సకల ఫలంబుల నిడుచున్
అంతరంగమున నుప్పొంగుచుదా నహల్యగూడి సుఖముగ నుండెన్ ॥జ

(2) జనకుని యాగము జూడబోవుదము సరగున మనమందరమనుచు
ఘనులు మునుల్ రఘువీరులగూడి జని రతి శీఘ్రింబునను ॥జ

(3) అతిమోదంబున మిథిలజేరి నృపు యజ్ఞవాటమునుజూడ
పతితపావనులు పోవుచుండఁబుర సతులును వేడుకతోడ ॥జ

తే॥ రారెచూతము రండని రమణులెల్ల నొకరినొక్కరు పిలుచుచు నొప్పుమీర
భర్మహర్మ్యంబులనునిల్చి పరమప్రీతి జూచి రాముని లక్ష్మణుం జోద్యమంది

బ్యాగ్-ఏక.

ప॥ రాచకుమారులమ్మ రమణీయగాత్రులమ్మ
వాచామగోచరులు వనరుహనేత్రులమ్మ ॥రా

చ॥ శృంగారమూర్తులమ్మ సంగీతలోలురమ్మ
మంగళాకారులమ్మ మహనీయతేజులమ్మ ॥రా

(2) పూర్ణేందువదనులమ్మ పుండరీకాక్షులమ్మ
అరుణాబ్జ చరణులమ్మ ఆజానుబాహులమ్మ ॥రా

(3) భూరిబలాఢ్యులమ్మ శరచాపపాణులమ్మ
కరుణాంతరంగులమ్మ గజరాజగమనులమ్మ ॥రా

(4) నవకోసలవాసులమ్మ నవమోహనాంగులమ్మ
భువిని శ్రీరామపుత్రిన్ బ్రోచినబాలురమ్మ ॥రా

సీ॥ ఎందుండి వచ్చిరో యీచిన్ని బాలురు సుందరాంగులుగదె సుదతులారా
యీమనోహరరూప మీతనుకాంతులు నీ ముద్దుమోములు వెలదులార
యీనవ్వు లీపల్కు లీహాయి లీతళ్కు గంటిమే యెందైన గాంతలార
యీయందమీ చంద మీమందగమనంబు మన్మథ మన్మథులు మగువలార
యెంత లావణ్య సుకుమార మీవిలాస మేమి గాంభీర్య సౌజన్య మెంచదరమె
యీమహాత్ములఁ గనుట కిచ్చతోడ నేమినోచితిమో తొల్లి యింతులార॥

వ॥ అని గొనియాడుచుండ శ్రీరామలక్ష్మణులు విశ్వామిత్రునితో యజ్ఞశాలకుం
బ్రవేశించిన మిథిలాధీశుండు కౌశికురాక నెఱింగి యెదురేగి తోడితెచ్చి,

జో॥ ఆసనమిచ్చియు నర్ఘ్యపాద్యముల నర్పించియు దానా నృపునుఁ
భాసురాంగు లీ బాలకు లెవరని బలికెను హర్షంబునను ॥జ

(2) ధన్యుడనైతిని ధరలో నిపుడు, ధారుణి సురవరయనుచుఁ
సన్నుతించుచు సరసతమొక్కెను జన్మము సఫలతయనుచుఁ ॥జ

వ॥ జనకుండు యాబాలకుల రూప వయో విలాసంబులకు యిచ్చమెచ్చుచు వారి
చారిత్రంబు లెరుంగంగోరి విశ్వామిత్రునితో యిట్లనియె.

ఖరహరప్రియ — చాపు.

ప॥ ఏరాజుపుత్రులు యీముద్దుబాలురు ధీరులు వనధిగంభీరులు వీరలు ॥ఏ

చ॥ అరవింద నేత్రులు ఆజానుబాహులు తరుణేందు వదనులీ పరమపురుషులెవరు ॥ఏ

(2) యీమనోజ్ఞతనువు లీవిలాసంబును యీమహోల్లాసు లెవరిపుత్రులు దెల్పు ॥ఏ

(3) దేవసమానులీ దినకర తేజులు లావణ్యమూర్తు లీ రాచకొమరులెవరు ॥ఏ

(4) నిరుపమాలంకారుల్ నిత్యకల్యాణులు శరచాపపాణులీ సత్యచరిత్రులెవరు ॥ఏ

(5) నవకోసలపురి నవమోహనాంగులు భువనసుందరులు భూరివిక్రములెవరు ॥ఏ

వ॥ అనిబల్కు జనకమహారాజుంగాంచి విశ్వామిత్రు డిట్లనియె.

హిందూస్తాని కాపి — చాపు.

ప॥ రామలక్ష్మణులు రఘుకుల దీపకులు రాజ ॥రా

అ॥ శ్రీమంతులు ధీమంతులు ఘనులు భీమపరాక్రములు
భూమీశుడు దశరథవరపుత్రులు కామితప్రదులు కౌసల్యానందులు ॥రా

చ॥ అసుర తాటకఁ హతముజేసి మారీచుని మదమణచి
ఆసుబాహుని వేగము దునిమి నా యాగముగాచిన చతురులు వీరు ॥రా

(2) గౌతమసతి శాపముబాపి యా కాంతచే పూజితులై ప్రేమఁ
అతులితముదమున హరువిలుజూడగ అరుదెంచిరి నవకోసలవాసులు ॥రా

వ॥ అని నుడివిన పరమానందమునంది జనకుండు మహర్షిని గొనియాడ శతానందుడు
విశ్వామిత్రుని మాటలువిని సంతోషించి,

హిం॥ అనఘాసీదయఁ శ్రీరఘురాముని గనిసేవించినె నాజననియు మరి
మునివరుశాపము దీరి పవిత్రయై జనకుడౌ గౌతముఁ జేరిసుఖించెనె ॥శ్రీ

(౨) అని యిటులడుగగ గాధేయుండనె వనరుహనేత్రుని పదరజమునని
జననియును గాంచి సీతజానకిని జేరి ఘనుడా రాముని కాతిథ్యమిచ్చెను ॥శ్రీ

వ॥ అనవుడు శతానందుడు శ్రీరామునిగని నతియించి మరియు,

సీ॥ ఈ మహాత్ముడు నీకతి హితముగాను రక్షణము జేయుగాన శ్రీరామచంద్ర
ధన్యుడవు మాన్యుడవు నీవు ధరణిలోన నితనిచరితంబు జెప్పెద నింతవినుము.

ప॥ గాధికిగల్గెను కుశవంశంబున కౌశికుపతి పూజ్యుండు
ఈ క్షితి పాలించెను బహుకాలము విమలయశుడు పుణ్యుండు ॥జ

(౩) సేనలతో నీమహాత్ముడొకతఱి నానాదేశములరిగి
మౌనివర్యుడు వసిష్ఠగురువరు గాంచగ వేడుకమీరి ॥జ

(౪) అందవ బ్రహ్మలోకంబన ఋషి మండలములు సేవింప
నిందు వేడుకగా శాంతస్వరూపుడై యుండు వసిష్ఠునిగనియంత ॥జ

(4) వందనంబు గావింప మౌని నృపచంద్రుని దీవించియును
పొందుగ నతిథి సపర్యలచే పూజించెను మోదంబునను ॥జ

(5) క్షేమలాభములరసియు నరపతి చిత్తముపొంగల నప్పుడు
కామధేనువిడ మృష్టాన్నంబులు శ్రీమనోజ్ఞగ సేనకురాజునకు ॥జ

(6) హర్షించియు షడ్రసములచేతను పరమప్రీతిని కౌశికుడు
కరుణాకర నాకిమ్ము కపిలనని వరమౌనిని వేడగను ॥జ

(7) హవ్యకవ్యములు జేయగ నాకిది యాధారంబై యుండు
ఇయ్యజాలనిది సర్వసంపదల నిచ్చుచుండు నాకెపుడు ॥జ

(8) హరులును రథములు గజములనేకములిచ్చెద మణి హేమచయంబు
మరిగోవుల నేకము లిచ్చెదనన ధరామరుడు వలదనెను ॥జ

(9) బలవంతంబుగ ధేనువునంత బట్టి కట్టుకొనిపోవగా
విలపించుచు నంబాయనియరచుచు పరువిడివచ్చెను మునిజేరగా ॥జ

వ॥ మహాత్మా! నన్నేల యుపేక్షించితివి! నా కనుజ్ఞయిమ్మా! అతని సేనల దును
మాడి అవమానించెదనన ఋషి సమ్మతించెను. అప్పుడు తన దేహమునుండి
యనేకవిధములైన కోట్లకొలది సైన్యంబు లుత్పత్తిజేసి విశ్వామిత్రుని సేనల
నిర్మూలంబు జేయింప, నాతని పుత్రులు నూర్వురు వసిష్ఠుని డాయ హుంకారం
బున వారి నతండు హతము గావించెనంత విశ్వామిత్రుండు దుఃఖించి

సీ॥ పుడమి యేలుట కాత్మపుత్రుని నియమించి శివునిగూర్చి తపంబు జేయుచుండ
హరుడు ప్రత్యక్షమై అస్త్రజాలములియ్య గైకొని యాముని కడకువచ్చి
బాణవృష్టి వనమ్ము పాడుగావించియు మునిచంద్రు నొప్పింప గినిసి యంత
బ్రహ్మదండముబట్టి బ్రహ్మాస్త్రమాదియా నస్త్రజాలముమ్రింగ నపుడు నృపతి
చేయునదిలేక చింతించి ఛీయటంచు
క్షత్రతేజంబు నింద్య మీ జగతి నెపుడు
బ్రహ్మబలముల కెనయౌనె ప్రాభవమున
ననుచుశమమూని వరతపంబునకు దొడగె॥

తే॥ వేయివత్సరములుజన వేధవచ్చి రాజఋషివైతివనివల్క రాజవరుడు
తాపమును లజ్జవొడమంగ కోపమొంది బ్రహ్మఋషి పదవినిగోరి ప్రబలతపము॥

వ॥ చేయుచున్నంత త్రిశంకుండనురాజు సశరీరంబుగ స్వర్గంబున కేగనెంచి గురువరుం
డగు వసిష్ఠునివేడిన నతండిది యసాధ్యంబన నేడు తత్తనయులవేడ వారు గర్వి
తుండగు నానృపుని చండాలుడవగుమనిన నారాజు విశ్వామిత్రుంజేరి శరణొం
దిన నతండు తన తపోమహిమచే త్రిశంకుని స్వర్గంబుకనుప యింద్రుండు వానిని
నిటవచ్చుట కర్హుండవుగావని తలక్రిందుగా బడద్రోయ, గాధేయుం డానృపతిని
క్రింద బడనీయక తన తపోబలంబున వినువీధిని సప్తఋషులాదిగాగల నక్షత్రం
బుల గల్పించి ధృవునివలె స్థిరముగా నుండునట్లు దివిజుల యనుమతిని నియ
మించె. ఇది త్రిశంకు స్వర్గంబందురు. ఆవెనుక నచ్చోటుబాసి పశ్చిమమున
పుష్కరముజేరి ఘోరతపంబాచరించునెడ శునశ్శేపుండను వానిని అంబరీషుడు
యాగపశువుగా గొని పోవుచుండ నావిప్రకుమారుడు విశ్వామిత్రుని శరణు
జొచ్చిన తనపుత్రుల యాగపశువుగా బొమ్మన వారునిరాకరింప వారిని నరకం
బున గూలుండని శపియించి యబ్బాలునకు మంత్రోపదేశంబుజేసి దీవించి
యింద్రాగ్నుల ప్రార్థించిన చిరాయువుగల్గునని జెప్పి బనుప వాడు రాజుతో
యాగశాల ప్రవేశించి కౌశికుం డుపదేశించిన స్తోత్రంబు పఠింప పాకశాసను డరు
దెంచి యాబాలునికి దీర్ఘాయువొసంగి అంబరీషునకు యాగఫలంబిచ్చి అంతర్హి
తుండయ్యె. మరల నతండు వేయివత్సరములు ఉగ్రతపం బాచరింప పరమేష్ఠి
ఋషివైతివని వచించిన చిన్నబోయి యాతండు మరల నుగ్రతపంబాచరింప,

సీ॥ మెరుపుతీగనుబోలు మేనకయనుసతి వచ్చినగని ఋషి వలచిదాని
పదియేండ్లు మరియు నాపడతితోనుండియు మదినెంచి సురల దుర్మార్గమపుడు
కోపంబు వహియించి కోమలివిడనాడి హిమవంతమునుజేరి హితవుమీర
కౌశికుం డచెంత ఘనతప మొనరింప కమలాసనుడు వచ్చి గాధిపుత్రి

అగుదువు మహర్షి విపుడీవటంచు బల్క యింద్రియ జయంబుగల్గనా యిపుడనంగ
గల్గలేదింకనని వినిధి కౌశికుండు మరల తపమాచరించెదా మహిమమీఱ

వ॥ శీతవాతాతపంబులోర్చి గాలి యాహారంబుగాగొని సహస్రవత్సరములు ఉగ్రత పంబాచరింప వాసవుండు రంభను తపోభంగము గావింపుమని బంప కౌశికుండు దాని మోసంబెఱింగి పదివేల సంవత్సరములు శిలయైపడియుండుమని శపించి తపస్సు వ్యర్థంబయ్యెనని చింతించి మౌనవ్రతుండై కష్టనష్టంబులకోర్చి తపోనిష్ఠుండై తపంబు పూర్తియగుటయు పారణసేయం దలంచిన యింద్రుండు బ్రాహ్మణవేషంబున యాచించి సిద్ధాన్నము గొనిపోయెను. అంత మౌనియు శాంతుండై ఆహారంబులేకయే శ్వాసబిగించి తపంబు సేయుచుండ,

జో॥ పొగలెగసెను మునిశిరమున నుండి భువనంబులు భయమందగ
దిగులొందియు సురనర యతులు దీనత ధాతను వేడగ ॥జ

(2) అంత హంసోదనువచ్చి విరించి అతిముదమున దీవించి
శాంతుడ నీవును బ్రహ్మఋషివైతివి యుండుమని హర్షించి ॥జ

(3) అరవిందోద్భవ బ్రహ్మఋషివని నన్ననిననేని యిపుడు
స్థిరమై యోంకార వషట్కారంబులు వరియింపగ వలెనగ మరియు ॥జ

(4) బ్రహ్మపుత్రుడు బ్రాహ్మణశ్రేష్ఠుడు బ్రహ్మఋషి వసిష్ఠుడనగ
బ్రహ్మఋషియని పలికినగాని నమ్మను నిశ్చయమిది యనినగ ॥జ

(5) అమరులు చనియట కోరికనిచ్చిరి యావసిష్ఠుని సంగతి
ప్రమదంబున కౌశికుగని యోముని బ్రహ్మఋషివైతివి నీవనగ ॥జ

వ॥ మరియు యజన యాజనాధ్యయనాద్యధికారంబు లన్నియు నీకు గల్గెనన కౌశికుడు వసిష్ఠుని పూజించి సంతసింప బ్రహ్మాది దేవతలందరును తమతమ నివాసంబులు జేరి రామా! యీ మహాత్ముండిట్లు బ్రాహ్మణ్యమును సంపాదించెనని సవరుడు జనకు నాదిగాగల వారందఱును రామలక్ష్మణులను అతని చరిత్రంబువిని ఆశ్చర్యపర వశులైరి. అంత జనకుడు మహాత్మా! నీదర్శనంబున పరిశుద్ధుడనైతినని నమస్కరించి దేవా! కర్మానుష్ఠానకాలము సమీపించెనని వారిని విడిదలకనిపి సత్కర్మానుష్ఠాన తత్పరుండై యుండె.

జో॥ దశరథసూనులు రామలక్ష్మణులు తాపసశ్రేష్ఠమునితోడగ
శశిధరు చాపముజూడవచ్చిరని సఖులు పల్కిరవనిజతోడగ ॥జ

ఖరహరప్రియ - ఆది.

ప॥ చక్కని రాజచంద్రుడమ్మా విను సార్వభౌముడు శ్రీరాముడు ॥చ

అ॥ ముక్కువతో నీచెట్టబట్టనెంచి మహేశ్వరుని విలువంపవచ్చెనమ్మా ॥చ

చ॥ నిగనిగ మెరయు సొగసుమేనివాడు తగునమ్మా నీకతడు తామరసనేత్రుడు
సుగుణాభిరాముడు సరసుడు సుందరుడు జగదీశుడీతడు జనరంజనుడు ॥చ

(2) శ్రీశుడు నవకోసలనాథుడు భాసురాంగుడమ్మా భక్తమందారుడు
దాసుల హృదయనివాసుడు పూజ్యుడు భూసుత నీవరుడు పురుషపుంగవుడమ్మా

వ॥ అని చెలులుబల్క నంత సీతాదేవి

ధన్యాశి — చాపు.

ప॥ ఏలనే యిలనాగలార చాలునెయికపోరె
నీలవేణులార హేళన లేలనాపై వలదు వలదు ॥ఏ

చ॥ బాలరో వినవమ్మ నీతో బల్కుదుమె పరిహాసముల్
నీలవర్ణుడు రాజపుత్రుడు బాలుడు శృంగారుడు ॥బా

(2) ఎచటనున్నా డెపుడువచ్చెను ఎవరి పుత్రుడు దెల్పరె
యిచటికెవరు తోడితెచ్చిరి వేగము యెఱిగింపరె ॥ఏ

(3) దశరథవరపుత్రుడు ధర్మశీలుడు సరసుడు
కుశికపుత్రునితోడ వచ్చెను కోమలినినుగోరియు ॥బా

(4) సుందరుడె సుకుమారుడె యందగాడెదెల్పునా
డెందమున నానంద మొదవెను కందునె కనులారను ॥ఏ

(5) నవమోహనాంగుడె నవకోసలపురవాసుడె
భువిని భక్తవరులబ్రోచు పుండరీక దళాక్షుడే ॥బా

సీ॥ శృంగారుడోయమ్మ సుకుమారుడోయమ్మ సంగీతలోలుడు సరసుడమ్మా
రాజీవనేత్రుడు రఘువంశతిలకుండు రాజసేవితుడు శ్రీరాముడమ్మా
ఆనంద నిలయుడు ననహాయశూరుడు భూనాథతనయుండు పూజ్యుడమ్మా
భువనమోహనమూర్తి పుణ్యచారిత్రుడు నవకోసలేశుడు నాధుడమ్మా
అతని లావణ్యమతని యుదారమహిమః వాని మధురంపు మృదుళంపు వాగ్విలాస
మెంచదరమానె భువిలోన నెవరికైన వచ్చె నీభాగ్య మేమనవచ్చునమ్మా.

వ॥ అని చెలులుబల్క మైథిలి యానంద కందళిత హృదయారవిందయై శ్రీరామ చంద్రుని మనంబున నిడి ధ్యానించుచుండె నప్పుడు. అరుణోదయంబగుటయు జనక చక్రవర్తి సకల దేశాధీశుల రావించి కొల్వుకూటంబుజేరి పురోహిత వర్గముననుజూచి కౌశికునితోడ శ్రీరామ లక్ష్మణుల తోడితెమ్మని బుత్తెంచిన వార లతిత్వరితంబున జని కౌశికునితో రామలక్ష్మణుల దోడ్కొని వచ్చునెడ,

జో॥ రామలక్ష్మణులు రాజమార్గమున రాగని వేగమె చెలులు
భూమిజయిదెగను రాజపుత్రుల భూరివిక్రముల నిపుడు ॥జ

సీ॥ కోటి సూర్యప్రభా కుండలంబులకాంతి గండభాగంబున గంతులిడగ
మాణిక్యమణిమయ మౌక్తికహారముల్ వక్షస్థలంబున వలను జూప
నిగనిగన్మొగమున మృగమద తిలకంబు నందమై శృంగారమతిశయిల్ల
కరపల్లవంబుల కంకణాంగదములు కటిమణిరశనల కాంతులలర
విల్లునమ్ములుబట్టియు వింతగొల్ప నీలనీరద తనురుచుల్ నింగిబర్వ
పసిడివన్నెల శాల్వలు పైని జార వచ్చుచున్నారు మునివెంట వైభవమున

జో॥ అనవిని జానకి మనమలరగ గనుగొనె శ్రీరఘురాముగ
మనసిజకోటి సుందరాంగుని అనుజసహితు శ్రీరాముగ ॥జ

వ॥ కని యతని రూపలావణ్యంబుల కిచ్చమెచ్చుచు

సీ॥ నీలమేఘచ్ఛాయ బోలు దేహమువాని చారు విశాలనేత్రములవాని
కోటిసూర్యప్రభా కోమలాంగమువాని హాటకాంబర రుచు లలరువాని
తళుకుచెక్కుల ముద్దుగుల్కుసోయగమున నలరంగ చిఱునవ్వు లొలుకువాని
హారకేయూరాది కాలంకృతులవాని గంభీరభావంబు గల్గువాని
విల్లునమ్ములు చేబూని వేడ్కమీర తమ్మునినిగూడి వచ్చెడు దంతిగమను
రాజపూజితు శ్రీరఘురామచంద్రు గాంచె సీతమ్మ కన్నుల కఱవుదీర.

శంకరాభరణం — చాపు

ప॥ ఎంతసుందరుడె యీ రాజాధిరాజ కుమారుడు రాముడు ॥ఎం

అ॥ సంతోషమాయెను వరసునిజూడ భూ కాంతుని కాకుత్స్థవంశాబ్ధిసోముని ॥ఎం

చ॥ బాలుడు శృంగారలోలుడు అతిసుకుమారుడు లీలావినోదుడు ధీరుడు ॥ఎం

(2) నీలకంఠునివిల్లు నెక్కుబెట్టునె యీ బాలార్కతేజుడు భాసురదేహుడు ॥ఎం

(3) పున్నమచంద్రునిబోలు మొగమువాడు వన్నెకాడు నవకోసలవాసుడు ॥ఎం

యదుకులకాంభోజి _ ఆది.

ప॥ రఘునందనా నన్ను చేపట్టినంగానీ జగమందు నిలువజాల ॥ర
అ॥ సుగుణాభిరామ సుందరఘనశ్యామ నిగమవినుత నిత్యనిర్మల చారిత్రి ॥ర
చ॥ మనసిజకోటి లావణ్య మోహనరూప నినుజేరిసేవింపనినా
తనువున్న ఫలమేమి దశరథకుమార కనకాంబరధర కౌస్తుభాలంకార ॥ర
(2) సనకాదిమునినుత చరణపంకజ నిన్ను అనుదినము పూజింపని
ఘననీలగాత్రి నా కరయుగ్మమిదియేల కంజాతదళనేత్ర కమలాకళత్రి ॥ర
(3) శ్రీశసీతోగూడి భాషింపనేరని నాజిహ్వకు ఫలమేమి
భాసురాంగ నవకోసలవాస నాపాలిభాగ్యరాశి భక్తకల్పద్రుమ ॥ర
వ॥ అనియెంచి మనమున వరియించి సఖీజనంబుల దిలకించి,

జంఝూటి _ రూపకం

ప॥ ఏలజేసెనాదుతండ్రి యీపత్రిజ్ఞయుఙ్
జాలునో యీవిలువంప జాలడో మరి యీతడు ॥ఏ
చ॥ సరసిజదళనేత్రుడు కరుణారసభరితుడు
నిరతిశయానందుడు నను వరియించునె చెలియా ॥ఏ
(2) ధీరుడు శృంగారుడు రఘువీరుడు సుకుమారుడు
కూరిమి శివువిలుదునిమి నాకోర్కెదీర్చునె సఖియా ॥ఏ
(3) మచ్చిక నాతండ్రివాని మెచ్చునే నన్నిచ్చునే
ముచ్చటలర నితనిగూడి ముటియుచుందునెబాల ॥ఏ
(4) కౌసల్యవరపుత్రుడు మరి ఘనరత్నాభరణుడు
వాసిగ నవకోసలపుర వాసుడు రమేశుడు ॥ఏ
వ॥ అని చింతించు వైదేహికి సఖీమణు లిట్లనిరి.
తే॥ బాలుడని యెంచవలదు శ్రీలోలుడమ్మ బలపరాక్రమశాలి భూపాలుడమ్మ
శూరు డీతడు జగదేకవీరుడమ్మ హరునివిలుద్రుంచుఁ గైకొనుఁ దరుణి నిన్ను.
వ॥ సఖీజనంబులిట్లు సీత నూరడించునట్టి సమయంబున,
జో॥ జేరవచ్చి రాసభకు వేగమె శ్రీరామలక్ష్మణులు మునియుఙ్
కూరిమితో పూజించి వారల గొనియాడెను భూవరుడుఙ ॥జ

(2) తారాగణ పరివృతుడగు చంద్రునితీరున సభ వెలగంగ
శ్రీరాముడు సభ నలరఁజేసెను భూరమణుని మదిపొంగగ ॥జ

(3) విలుదెప్పింపుము రాజచంద్రిక నీవేడుకతో వేగమున
జలపరాక్రముడు రామచంద్రుడు విల్లెక్కిడునని మునియనగ ॥జ

(4) అనవిని జనకుడు మంత్రులబంపి హరువిలు దెమ్మను డనగ
ఘన బలాఢ్యులయిదు వేల భటుల్ గొనితెచ్చిరి చాపము వేగ ॥జ

(5) మునికులచంద్రా శివధనువిదిగో గనుపించుము రఘువీరులకు
మనురాజేంద్రులు విలుగన నెంచుచు మనముల గుందిరి మరియు ॥జ

(6) ఋషులు నెక్కిడువారికి నాసుతను యిచ్చెదనని బల్కితిని
దేవనరులసురులు యక్షులు రక్షులు దీనిని గనఁబలేరైరి ॥జ

వ॥ మహాత్మా! మున్ను దక్షప్రజాపతి యాగంబున తన్ను నిరాకరించి వచ్చిన దేవతల్పైగినిసి ఈశ్వరుండీ ధనుస్సుచే వారలను దునుమాడెదనన యమరులు భయంబున నతని బ్రార్థించిన ప్రీతుడై యా ధనస్సును దేవతలకిచ్చిపోవ మా పూర్వీకుండైన దేవరాతునివద్ద వారుంచిరి. అది మొదలు వంశపరంపరగా నావిల్లును గంధపుష్పాక్షతల పూజించుచున్నారము.

హిం॥ వనసము జేయదలచియు నేను అవని దున్నింప నాగేటిచాలున
భువనసుందరి కూతు కన్యారత్నము భూరితేజంబున పొడగనయ్యెను ॥శ్రీ

(2) నాకీమెయును నావరపుత్రికగాను నాగృహమందును నర్తించుచును
సీరపుచాలున పేరియుంచితిని సీతయనుచు వెలుగుచున్నది ॥శ్రీ

(3) గాఢప్రతిజ్ఞ యీధనువారోపణ గావించునట్టియు శుల్కమునకునుగ
మోదంబున శ్రీరాముడు పిలువంగ నాదుపుత్రి నర్హునిగ నొసందించెద ॥శ్రీ

(4) జనకుని పల్కులు విని కౌశికుడు గనుమా విల్లును శ్రీరామాయన
మనమలరగ గురువాజ్ఞను గైకొని ఇనకులోత్తముడు వేగమె లేచి ॥శ్రీ

తే॥ కుశిక సుతునకు మ్రొక్కియు కూర్మితోడ జనకభూపతి సచివులు సంతసింప
దేవవేల్ రాజసుతులెల్ల వెరగుపడగ ధనువు పూనించి వలగొని తడయకపుడు॥

సీ॥ నీలనీరద మెచుకు నింపి బన్నగదికల్ మందహాస ముఖారవిందమందు
కరుణలు నర్తింపంగ కుండలంబుల కాంతి తళుక్కు చెక్కుల మీరి దా[illegible]
మాణిక్యమై మూర్త్య ముక్తికహారముల్ గళమున మెరయుచు గద[illegible]

బంగరుశాల్వతో శృంగారముసమీర రఘువంశతిలకుండు రాముడపుడు
కంకణాంగదిములు చెలగ కరకమలములతో కార్ముకముబట్టియవలీల ఘనముగాను
చెఱకువిఱిచెడు కరివలె చెలువుమీర నారిసారించె పఠిబలటంకార మెుప్ప.

తే॥ వీరుడై రామచంద్రుడావిల్లువంప పుడమి వడకెను భూపతుల్ భయావిపడిరి
ఘనపథంబున కడుపఠిసిద్ధ్యులుగలిగె వరమునీంద్రులు సంతోషభరితులైరి.

మోహన - ఏక

ప॥ విల్లువిఱిచెను రామచంద్రుడు వేడుకలలర శివు ॥వి

అ॥ పెళ్ళుమనుశబ్దంబు దిక్కులపిక్కటిల యసురుల మనముల్బెగడ

చ॥ పల్లవాధరి జానకిమది పల్లవింపగను
యెల్లలోకముల్ సన్నుతింపగ యుల్లమున హర్షింప మానియు ॥వి

(2) దుందుభిరవమందుజెలగ గంధర్వులు బాడ
అందముగ రంభాదులాడ అమరులు పువ్వులవర్షము గురియగ ॥వి

(3) నారద తుంబురులు వీణ నాణ్యముగ మీటగ
మీరిన యానందముతో మిథిలేశు డుప్పొంగగ శివు ॥వి

(4) కోరియు నవకోసల కోదండరాముడు
శూరుడు సుకుమారుడు శృంగారుడు రఘువీరుడు శివు ॥వి

వ॥ అంత సభాజనులెల్లరు వినుతించిరిట్లు.

సీ॥ జయజానకీనాథ జయభక్తసమ్మోద జయసురార్చితపాద జయము జయము
జయదీనమందార జయజగదాధార జయరఘుకులవీర జయము జయము
జయ మేరుగిరిధీర జయసింధుగంభీర జయమోహనాకార జయము జయము
జయ సర్వగుణధామ జయదాశరథిరామ జయసుమంగళనామ జయము జయము
జయము కౌసల్యవరపుత్ర జయము జయము
జయము బుధజనపూజిత జయము జయము
జయము శుభకర శ్రీకర జయము జయము
జయము శ్రీరామభూపాల జయము జయము.

వ॥ అంత జనకుండు శ్రీరామచంద్రుని కౌగలించుకొని సంతసించి కౌశిక మునివరునిగని

హిందూస్తానితోడి - జంపె.

ప॥ దేశ[illegible]బాలుడు ధీరుడు అసమానబలుడు ॥దే

[illegible]పరమాద్భుతము భవానీపతి విలుదుంచుట ॥దే

(2) నీమహామహిమంబునఁ నేధన్యుడనైతిని ॥ దే
(3) నవకోసలరామునకు నావరసుత నిచ్చెదప్రీతి ॥ దే
హిం॥ కూరిమినాసుతఁ ప్రాణసమానఁ కోసలపతి శ్రీరామునకొసగెద
యీరఘువీరున కీయగ సీత నాకోరికదీరెను మునికులతిలకా ॥శ్రీ
(2) రఘురాముని వరియింపగజానకి రంజిలెనాదు చిత్తము మరియును
రఘుకులమునకును నిమికులమునకును రయమున యశము గలిగించెను సీత ॥శ్రీ
వ॥ అనిబల్కి- అవనిజను దోడ్కొనిరమ్మని బిలువనంప చేడియలు కనకరత్నాభరణంబుల సర్వాలంకారంబు గావింప సఖులతో వెడలి,

పూరికల్యాణి – రూపకం.

ప॥ శ్రీరమణీమణిజానకి చెలువముగ పుష్పహారముగొని ॥శ్రీ
అ॥ శ్రీరాము నలంకరింప జేరె సభకు చెలులుగొల్వ ॥శ్రీ
చ॥ భేరీమృదంగపణవ భూరినాదములు జెలగ
వారాంగనలు నాట్యమాడ వైభవంబు మీరగను ॥శ్రీ
(2) మందహాస వదనంబున మృగమదతిలకంబు మెరయ
అందమగు హంసగమనముతో ఆనంద మతిశయిల్ల ॥శ్రీ
(3) మణిరత్నా భరణములు మంజీరధ్వనులు జెలగ
ఘనముగ మొలనూలుగజ్జెలు ఘలుఘల్లుమనిమ్రోయ ॥శ్రీ
(4) కర్ణాభరణ కాంతులలర కరకంకణ ప్రభలుమీర
స్వర్ణచేలమమరగట్టి జగన్మోహన రూపంబున ॥శ్రీ
(5) భువనసుందరి జగన్మాత భూపుత్రి సంభ్రమమున
నవకోసలరాముని భక్తి సేవించి పూజింప ॥శ్రీ

హంసధ్వని – ఆది.

ప॥ శ్రీరామునిచెంత జేరి సీత శ్రీమీర పుష్పహారమువేసె ॥శ్రీ
అ॥ క్షీరాబ్ధికన్య శ్రీమహావిష్ణుని కోరినరీతిఁ కువలయసుపుత్రీ ॥శ్రీ
చ॥ బృందారకులు మౌనివర్యుల్బొగడ దుందుభిరవముల్ సొంపుమీర జెలగ
సుందరుడౌ నవకోసలేశుజూచి మందయాన డెందమందు మోదమంది ॥శ్రీ
దోర॥ జనకుండంతట గాధేయునిగని అసఘామీదయ వలనఁ
ఘనమగునాదు ప్రతిజ్ఞజెల్లెను వనజాక్షుడు రాముని చేతఁ ॥జ

(2) అనిగొనియాడి మునివరునాజ్ఞను గొని వేగమె భూవిభుడుఁ
ఘనులగు మంత్రుల బంపెను దశరథజనపతి బిలువగ నపుడుఁ ॥జ

వ॥ అంత వారతిత్వరితగమనంబునం జని అయోధ్యానగరంబుఁజేరి దశరథ మహీపాలుని గాంచి,

అరభి - ఏక.

ప॥ రాజరాజ దశరథ మహారాజ శ్రీరాజపూజిత ॥రా

అ॥ రాజ శ్రీరఘుకులపతి రవితేజ రయమున మామనవిచేకొను ॥రా

చ॥ భూతలపతి జనకుడు తన పుత్రినియ్యదలచె రామునకు
సీతనయులు మునివెంటవచ్చి భూతేశుని విలుద్రుంచెను రాముడు ॥రా

(2) మిమ్ము బిల్వబంచెను మాజనపతి మీపుత్రమిత్ర మంత్రి పురోహితబంధులగూడి
నెమ్మితోదయచేయుము వేగమె నిర్మలాత్మ నవకోసల నాథామరి ॥రా

తే॥ మౌనివరునాజ్ఞ తాటకమడియజేసి యాగమునుగాచి యసురుల హత మొనర్చి
అహల్యశాపంబుదీర్చియు నతిరయమున మిథిలజేరిరి మునితోడ నీదుసుతులు.

జో॥ అనియిటు మంత్రులు బల్కినపల్కులు విని ముదమున దశరథుడు
తనపుత్రులకు పరిణయమగునని దలచి పొంగి యపుడు ॥జ

(2) తరుణీమణులగు ధర్మపత్నులకు నెరుగించియు వేగమున
గురుబుధ మంత్రి మిత్ర బాంధవుల కెరుగదెల్పి మోదమున ॥జ

(3) అందరి దోడ్కొని యానందంబున అవనీపాలుండపుడు
వందిమాగధ నటనటిగాయక బృందము గొలువగ మరియు ॥జ

(4) చేరవచ్చిరా మిథిలానగరము శీఘ్రముగను వారపుడు
ధారుణీశ్వరుని జనకుడెదుర్కొని కూరిమి బూజించియును ॥జ

తే॥ దశరథేశ్వర నీయగ్రసుతుడువేడ్క శివునివిలుద్రుంచె భూపతులు సిగ్గుపడగ
రామచంద్రుని వరియించె భూమిజాత నీదువియ్యంబు నెయ్యంబు నేడుదొరికె.

వ॥ ఇట్లొకరినొకరు కుశల ప్రశ్నంబుల నానందించి దశరథుండు విశ్వామిత్రునింగని నమస్కరించి

కం॥ స్వామి నీదుకృపను సర్వశుభములు గలిగె ప్రేమమీఱ నాదు బిడ్డలకును
యీమహీశు జనకు వియ్యంబు దొరికె నాకామితంబుదీర గాధిపుత్ర

జో॥ అతులిత ముదమున రామలక్ష్మణుల ఆలింగన మొనర్చియును
మితిమీరిన యానందముతోడను మిథిలేశునిగని దశరథుడు ॥జ

(2) ఓ మునిపుంగవ కృపగల్గెను మన కింపుసొంపు లొలుకమన
రామచంద్రునకు సీతనిచ్చుటకు [illegible]తెనామది వేడుకల ॥జ

వ॥ అంత జనకుండు ముదమంది దశరథమహారాజ! రేపు యాగము పూర్తిగావించి
వివాహ ముహూర్తము జరిపింపవలయుననిన ఋషివరులును దశరథుండును
సంతోషించి జనకు డేర్పరచిన విడిదికింజని యారాత్రి యచ్చో సుఖంబుండిరంత
జనకమహీపతి మరునాడు ప్రభాతంబున మహర్షులతోడ యాగాదిక్రియలు
పూర్తిగావించి తన తమ్ముండగు కుశధ్వజుని రావింపనతండు

హిం॥ జనకునకును మరి శతానందునకు సంతసమునను మ్రొక్కంగ భక్తిని
అనుజుని గావించియు దశరథజనపతిన్పిలువగ బనిచెను మంత్రిని ॥శ్రీ

(2) ధరణీశ మహారాజేంద్రుడు నిను తోడ్కొనిరమ్మనెనని బల్కగ ముదమున
దానానులతోడ తనయులతోడ సాగిన వచ్చెను జనకుని కడగ ॥శ్రీ

వ॥ దశరథుండంత జనకమహీపాలుంగాంచి రాజా మాకులగురుండగు వసిష్ఠమహా
ముని విశ్వామిత్రాది ఋషుల యనుమతిని మా వంశావళి నెఱింగించునని వసి
ష్ఠుండు సంతోషించి జనకచక్రవర్తి కిక్ష్వాకు కులక్రమంబు జెప్పెద. శ్రీమన్నా
రాయణు నాభికమలంబున బ్రహ్మజన్మించె. అతనికి మరీచియు మరీచికి కశ్య
పుడు కశ్యపునకు సూర్యుడు సూర్యునకుమనువు మనువుకిక్ష్వాకు వానికికుక్షి
కుక్షికి వికుక్షి ఇట్లు వంశవగ బాణుడు అనరణ్యుడు పృథువు త్రిశంకుడు దుందు
మారుడు మాంధాత సుసంధి ధ్రువసంధి అసితుడు సగరుడు అసమంజసుడు
అంశుమంతుడు దిలీపుడు భగీరథుడు కకుత్స్థుడు ప్రవృద్ధుడు శంఖణుడు అగ్ని
వర్ణుడు శీఘ్రుడు మరువు ప్రశుశ్రుకుడు అంబరీషుడు నహుషుడు నాభాగుడు
అజుడు అజునికొడుకు దశరథుడు యీదశరథుని కొడుకులు శ్రీరామలక్ష్మణులు
యిక్ష్వాకువంశజు లందరు సత్యరతులు ధార్మికులై ధర్మంబుదప్పక రాజ్యపరి
పాలనంబు జేయువారు,

జో॥ కావున రాజానీపుత్రికలను కడు మోదంబున యిపుడు
యీవలయును శ్రీరామలక్ష్మణుల కని విని మదిపొంగుచును ॥జ

(2) జనకుండిట్లనె వినయముతోడ మునివరమీ యనుమతినీ
జనకులోత్తములు రామలక్ష్మణుల కిచ్చెద నాసుత లిరువురినీ ॥జ

వ॥ నావంశాను క్రమంబె తెలింగించెద. మూడులోకములలో ప్రసిద్ధుడగు నిమియను రాజుగలడు. అతనికి మిధియనువాడు పుత్రుండై యీమిథిల నిర్మించె. మూల పురుషుండగు నితనికే జనకుండను నామంబు జనకునకు ఉదావసుడు వానికి నంది వర్ధనుడు అతనికి సుకేతువు వానికి దేవరాతుండును ఇట్లు క్రిమంబుగ మావంశంబున రాజర్షి యగు స్వర్ణరోముండును అతనికి ధర్మజ్ఞుండగు మాతండ్రి హ్రస్వరోముండును ఆమహాత్మునికి నేనును నాతమ్ముడు కుశధ్వజుడనువాడును గల్గితిమి. నాతండ్రి నాకు రాజ్యంబిచ్చి వనంబున తపంబాచరించి దివంబుజేరె అంత కొంత కాలంబునకు సుధన్వుడను రాజు మిధిల ముట్టడించి సీతనిమ్మనిగోర నేసీయకొనకున్న కదనంబున నాచే వాడు హతుండయ్యె నంత సాంకాశంబను నతని పురంబునకు నాతమ్ముని రాజుగా నియమించితి. వసిష్ఠమహామునీంద్రా! మీ యాజ్ఞ శిరసావహించి నాకన్యల నిరువురను శ్రీరామ లక్ష్మణుల కిచ్చెదననిబల్క దశరథుని గాంచి,

హిం॥ సీతాదేవిని శ్రీరామునకు ప్రీతిని నూర్మిళ లక్ష్మణునకును
చేతోముదమున యిచ్చెదనిపుడు ఖ్యాతిమీరగ దశరధభూవర ॥శ్రీ

(2) మంగళకరముగ రామలక్ష్మణుల శృంగారించి వివాహకార్యముజేసి
పొంగుచు గో భూ హిరణ్యాదులను భూసురవరులకు దానముసేయుము ॥శ్రీ

(3) వనరుగ ఉత్తర ఫల్గునియందు వైవాహికము జరుగును ప్రియముగ
ఘనముగ పెండ్లి కుమార్తెలజేసియు గావించెదనే సకల దానంబులు ॥శ్రీ

వ॥ ఇట్లుబల్కు జనకుని పల్కులాలించి విశ్వామిత్రుండు జనకమహారాజా! ఇక్ష్వాకు విదేహరాజుల కులములు నిర్మలంబై ఆశ్చర్యమును గలుగజేయుచున్నవి. సీతారాములకు ఊర్మిళా లక్ష్మణులకు రూపసంపద్గుణంబు లెంతయు నొప్పియున్నవి. మరియు నొక్కవిషయంబు నెఱుంగించెద.

తే॥ నీదు తమ్ముని తనయుల నెమ్మితోడ భరత శత్రుఘ్నులకు నిమ్ము పార్థివేంద్ర
మీదు సంబంధమునుజూడ మిగుల ఖ్యాతిగల్గె జగముల నన రాజుకౌతుకమున

తే॥ అనఘ నీవును నీవసిష్ఠర్షివరుఁడు ననుమతింపగ నీవియ్య మమరెనాకు
భరత శత్రుఘ్నులకు నాయవరజసుతుల నిచ్చి పరిణయమొనరింతు నిపుడు ప్రీతి

వ॥ దేవా! ఉత్తరఫల్గుని నక్షత్రంబున నేనీ నల్వురి వివాహంబులు గావించెదను.

హిం॥ దశరథ సుతులకు కన్యల నిచ్చి నే ధన్యుడనయ్యెద మీ యనుగ్రహమున
యశముగల్గె మావంశంబునకు ననుచునుతించె వారల జనకుడు ॥శ్రీ

నాట - రూపకం

ప॥ ఏభవమలర దశరథుడు వెడలెను పెండ్లికుమారులతో ॥వి

అ॥ సొబగుమీర సతులగూడి శుభముగ మంగళద్రవ్యముల్ గొని ముదమున ॥వి

చ॥ వసుధామర మంత్రి సామంతరాజులు గొలువగను వసిష్ఠాది కౌశికమౌని
వరులు దీవింపగను పొసగగ రధగజ తురగముల్ భటుల్నడువ
వందిమాగధుల్పొగడ దశవిధవాద్యంబులు నలుదిశల జెలగ జయభేరులు
ధణధణమ్రోయగ వారాంగనలతిగతుల నటింపగ
శశివదనలు కుసుమంబులు జల్లగ నవకోసలపురవాసులు
మంగళహారతులీయగ రమణులు బాడగ ॥వి

వ॥ ఇట్లు తరలివచ్చిన దశరథమహీపాలు మొదలుగాగలవారి నందరిని జనకచక్రవర్తి పూజించి, పెండ్లికొమార్తెల దోడ్కొని వచ్చెనంత వధూవరులు.

నోటు - ఏక.

ప॥ అందముగ సతీపతుల్ పుష్పహారములను మార్చుకొనిరి ॥అం

అ॥ ఇందుముఖులు ఇటునటు వేడ్కను ఇంపుసొంపు మీరనపుడు ॥అం

చ॥ పరమ కల్యాణులను భాసురముగ భుజములనిడి
సరసముగను మాతులు లతి సంతసమున నటియింపగ ॥అం

(2) వరమణి వజ్రహారముల్ వరుసగాను గదలి మెరయ
కరకమల కంకణముల కాంతుల్ దనర వింతగాను ॥అం

(3) నవకోసల నిలయులు నాణ్యముగను మాలవేయ
నవనీరజపత్రాక్షులు నగుమొగముల నేర్పుమీర ॥అం

ఊంజల్.

ప॥ ఆణిముత్యమణిసరముల్ జాలరిలాడ రాణించుకుందనపు గొలుసుల్ మెరయ
మాణిక్యమరకత పలకపైన నాణ్యముగ రఘువరులు ఆడిరూంజల్ ॥ఆ

(2) శ్రీరామచంద్రుడు సీతగూడి కూరిమిని లక్ష్మణుడు ఊర్మిళనుగూడి
చేరి భరతుడు మాండవితోడ వేడ్క శ్రీరమ్యముగ శృతకీర్తి శత్రుఘ్నులాడి
[రూంజల్ ॥ఆ

(3) [illegible] గాయకులం [illegible]గనర వేణువూద సరసముగ విలాసినులు వీణల్మీటి
[illegible] [illegible]పుష్పహారము,లున్నదలిర్పగూడ నిరుపమకల్యాణముా ర్తులాడి రూంజల్ ॥

(4) సుందరీమణు లతిసొగసుమీార డెందముల సుప్పొంగి: పాడియూాచ
మందహాసమున నవకోసలేశుల్ అందముగ శృంగారు లాడి రూంజల్ ॥ఆ

లాలిపాట.

ప॥ లాలిసీతారామ లాలిజయరామ లాలిజగదభిరామ లాలిగుణధామా ॥లాలి

(1) సురుచిరశుభగాత్రి పరమపవిత్రా అరవింద దళనేత్ర సురమునిస్తోత్రి ॥లాలి

(2) దనుజకులమదహరణ యినకులాభరణ సనకాదినుతచరణ జానకీ రమణా ॥లాలి

(3) నిరతిశయానంద నిరుపమ తేజ వరనవకోసల వాసజగదీశా ॥లాలి

వ॥ ఇవ్విధంబున లాలియూాంజలులు బాడి వధూవరులకు మంగళహారతులిచ్చి దృష్టి
దీసి వివాహమంటపమునకు జేరవచ్చిరంత,

హిం॥ రమణీయంబగు మణిమంటపమున అమర్చిన వజ్రింపు టరుగులపైని
ప్రమదంబున హేమపీఠములందు క్రమమున నల్వురు గూర్చుండిరివేడ్క ॥శ్రీ

(2) జనకుని పత్నియు సఖులుగొల్వగ జనకజ మొదలా కన్యల తోడ
ఘనమగు కల్యాణమంటపమునజేరి మణిపీఠంబుల నునిచిరి ముదమున ॥శ్రీ

(3) అంతట జనకుడు శ్రీరఘురాముని చెంతజేరియు వినయముమీార
సంతసమున వస్త్రమాల్యాభరణముల్ యెంతయు ప్రియమున అర్పించియుమరి

(4) జెలగుచు మైథిలి జేర్చి యంకంబున ఫలములు టెంకాయ బట్టియు కరమున
పలువిధ రత్నాభరణము లొసగి అలరుచు గోభూహిరణ్యముల నిచ్చి ॥శ్రీ

ఖరహరప్రియ - రూపకం

ప॥ ఈసీత నాసుత యిదె చేకొనురామ ॥ఈ

అ॥ భాసురాంగి నీకు సహధర్మచారిణియా ॥ఈ

చ॥ పతితపావనీ పరమకల్యాణీ సతతము సద్వ్రత శీలసాధుజన హృత్తోషణీ ॥ఈ

(2) అతిలావణ్యయుత అలివేణి యంబుజపాణి
స్మితరుచిరశుభానన సితకమలపత్రేక్షణ ॥ఈ

(3) శృంగారీ సుకుమారి సకలగుణాలంకారి
మంగళకరి వరకోసల మైథిలి కరుణాకరి ॥ఈ

కల్యాణి — ఆది.

ప॥ కన్యాదానముజేసె కౌసల్యసుతునకు జనకుడు ॥క

అ॥ ధన్యుడనైతినేనని దలపోయుచు నుప్పొంగుచును ॥క

చ॥ సురుచిర శుభగాత్రిని సరసీరుహ దళనేత్రిని
వరరత్నాభరణను కరముబట్టి జానకిని
పరమపావన శ్రీరామనా వరపుత్రిని నీకరముబట్టి
వరియింపుము భరియింపుము పరమప్రీతితోడ ననుచు ॥క

(2) బంగారు పళ్ళెమున రాముని శృంగార పదములునచి
అంగనామణి ధర్మపత్ని అక్షతోదకములుబోయ
పొంగుచు పాదముల్గడిగి పూని జలము శిరములనిడికొని
మంగళకర నాత్మజ శ్రీరామమూర్తి కర్పించి ॥క

(3) భాసురముగ బ్రహ్మాదులు ప్రస్తుతించి విరులుగురియ
భూసురులు దీవించ పుణ్యాత్ములు గీర్తించ
వాసిగ నవకోసల పురవాసులు గొనియాడివేడ
శ్రీశుడు శ్రీరాముండని శ్రీలక్ష్మియె శ్రీజానకియని ॥క

వ॥ ఇట్లు జనకచక్రవర్తి శ్రీరామునకు కన్యాదానంబు గావించి,

హిం॥ ఇచ్చెను నూర్మిళ లక్ష్మణునకును మచ్చిక మాండవి శృతకీర్తులను
సచ్చరితులగు భరత శత్రుఘ్నులకు సంతసముననిచ్చె జనకుడు ముదమున ॥శ్రీ

(2) భూషణాంబర పుష్పహారమ్ముల పూజించియు వారి సమ్మోదమున
వాసిగ పాణిగ్రహణోత్సవమును జేసెను ప్రేమను వేడుకలలర ॥శ్రీ

(3) రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు రమణీమణుల కంఠంబులను
ప్రేమనుగట్టిరి మంగళసూత్రముల్ శ్రీమంతులు ధీమంతులు ముదమున ॥శ్రీ

(4) సరగున ముత్యపు తలంబ్రాలను నాసతీపతులానందము మీరగ
శిరములపైని బోసికొనిరి మరి ముఱియుచును అతివేగంబునను ॥శ్రీ

వ॥ అంతట పురకాంత లావధూవరులను కొనియాడం దొడంగిరి.

శ్రీరాగము — ఆది.

ప॥ చూడచూడ వేడుకాయె సుందరశ్రీరాముల కల్యాణమహోత్సవము ॥చూ

అ॥ చేడియ లిరుపార్శ్వములను నిలచి జేరి ముత్యాలహారతులీయ ॥చూ

చ॥ శ్రీరాముడు జానకినిగూడి కూర్చున్న చెలువమును
ఊర్మిళా లక్ష్మణుల ఒప్పగు లావణ్యమును
చేరి భరతుడు మాండవితో నున్న శృంగారమును
కూరిమి శత్రుఘ్న శ్రుతకీర్తుల రమణీయముగన ॥చూ

(2) సరసిజభవసురవరులెల్లరు పరమహర్షంబున దివి బొగడ
మొరసెను మింటను దుందుభిరవములు గురిసెను సొంపుగ సుమవర్షంబులు
సరసత రంభాదికాంత లాడగ గరుడ గంధర్వులు కిన్నరులు బాడగ
వరమానులు భూసురులు నుతింపగ మరిమరి మంగళ తూర్యముల్ ఘోషింప॥చూ

(3) భేరీమృదంగ పణవ భూరినాదముల్ గగనంబులపర్వ
ధారుణి జనులెల్లరు జయజయ ధ్వానంబుల చెలరేగ
సారెసారెకు నవకోసలపురవాసులు కానుకలీయగ
శ్రీరామసుత హితబృందంబుల జేరియుముదమును చెంతనునిల్వగ ॥చూ

అనందంపాట.

ప॥ ఆనంద మానందమాయెను మనజానకి పెండ్లి కూతురాయెను
శ్రీరాముడు పెండ్లికొడుకాయెను
భక్తజనులకు సంతోషమాయెను
ఆనందరూపులైన ఆత్మారాములగాంచ ॥ఆ

(2) కామాదిరిపుల ఖండింపగ హరిని కామించి సురలు ప్రార్థింపగ యిలను
కౌసల్యగర్భమునజేరియు రాముడై యుద్భవించ రఘువంశమున వేడ్క ॥ఆ

(3) పరతత్వజ్ఞాన మార్జించియు యోగులు బ్రహ్మానందామృతము గ్రోలుచు భక్తి
స్థిరులై మదినిలకడ బొందియు నిరతిశయ నిర్మల పరిపూర్ణ హృదయులకు ॥ఆ

(4) నవవిధ భక్తిగల్గి మెలగుచు సాధుల్ నవకోసలేశు ధ్యానించుచు
మరియు భవ బంధములు దుంచివేయుచు భువిరామపుత్రి బోచిన భూమిజ
రాములగాంచ ॥ఆ

వ॥ ఇవ్విధంబున నానందించుచు మంగళహారతులిచ్చిరి.

కళాను – ఏక.

ప॥ రామచంద్ర మంగళం భూమిజాత మంగళం.

అ॥ కామకోటి సుందరాంగ కౌస్తుభాలంకార ॥రా

చ॥ సరసీరుహ దళనేత్ర పరమపురుష శ్రీకళత్ర
సరసిజాస నాదిస్తోత్ర నిరుపమగుణ సచ్చరిత్ర ॥రా

(2) బుధజనానందరూప సదయ నవకోసలేశ
చెదరక మాహృదయమందు చేరియుండు శ్రీరమేశ ॥రా

వ॥ తదనంతరంబ దశరథుండు భూరిదక్షిణలచే భూమిసురుల దనిపి ఫలతాంబూలంబు లొసంగె. వసిష్ఠుండంత పెండ్లి కుమారులచే ప్రధాన ప్రవేశ లాజ హోమంబు స్థాలీపాకంబును అరుంధతీ దర్శనంబును గావించె. అంత బువ్వముబంతికి సతీమణు లందరుజేరి.

సౌరాష్ట్రము – చాపు.

ప॥ రామచంద్రుల బువ్వము రమణీయము నానందము ॥రా

అ॥ భూమిసుతగూడి యున్నాడిపుడు రాముడు నవకోసలధాముడు ॥రా

చ॥ కుందనంపుకూటములలో అందముగ రత్నపీఠముల్ వేసి
అందు బంగారు ఆరటాకులమర్చి సుందరాంగులు వడ్డించిరపుడు ॥రా

(2) పలువిధ భక్ష్యభోజ్యంబులు బాగుమీర సూపశాఖములు
నళినాక్షులు మధురసఫలముల్ చెలగుచు వడ్డించిరి వేడ్క ॥రా

(3) ఘనమైన అప్పడములు వడియములు అనువగు చిత్రాన్నములు పాయసము
మనములలర మధుఘృతము దధియు వనితలు వడ్డించిరి వేడ్క ॥రా

(4) రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల్ రమణీమణులతో అందమలర
ప్రేమచే బంధుమిత్రులగూడి శ్రీమంతులు విందారగించిరి ॥రా

వ॥ అంత మరునాడు వధూవరుల హేమరత్నపీఠంబులపై నునిచి నలుంగులిడుచు

నలుగుపాట

ప॥ రారా శ్రీరఘువీర నలుగుకులేచి రమణి జానకిగూడి వేగమె నలుగిడ ॥రా

అ॥ ధీరా రాజకుమార శృంగారా నీరజాక్షి నిన్నుకోరి పిలచెను వేడ్కమీర ॥రా

చ॥ పరిమళ ద్రవ్యములు పసుపుకుంకుమతోను సరససల్లాపమున జక్కగనలుగిడ వేగ

(2) వరనవకోసలవాసా రమేశా కరుణించి రమ్మిపుడు కాకుత్స్థవరతిలకా ॥రా

నలుగుపాట 2

ప॥ నలుగిడరారా నగవరధీరా కలికి జానకి కాచియున్నది ॥న

చ॥ చిత్తమందు నీకె జేర్చియుబాగా అత్తరు పన్నీరలదగ వేగ ॥న

(2) [illegible] తేనెలొల్కగబల్కు చిలుకలకొల్కి సీతతోడను ॥న

(3) కోరియు నవకోసలేశ్వర కూరిమి నీదు చరణములిమ్ము ॥న

### గంధము పాట

ప॥ గంధమలదు రామ యిందుముఖి శ్రీ జానకిగూడియు ॥గం

అ॥ ఇందుధరార్చిత సుందరపాదారవింద ముకుంద గోవింద రఘునందన ॥గం

చ॥ ఘనసార కస్తూరి యత్తరు పన్నీరు పునుగు జవ్వాజులతో మిళితమైన శ్రీ ॥గం

(2) నీలమేఘవర్ణ నిత్యకల్యాణ లీలావినోద శ్రీలోలా కరుణాలవాల ॥గం

(3) వరనవకోసలధామా శ్రీరఘురామ సరసిజ పాద సన్నుతనామా శ్రీ ॥గం

### ఆరగింపు పాట

ప॥ ఆరగింపుడీ యిపుడు రఘుకులవరులారా మీరు ॥ఆ

అ॥ సారమైన ఫలరసముల సతులగూడి సంతసమున ॥ఆ

చ॥ కదళిచూతపనసజంబు ఖర్జూరద్రాక్షఫలముల ॥ఆ

(2) కండచక్కెర సారపప్పు కలిపియున్నది ప్రీతితోడ ॥ఆ

(3) నవకోసల నిలయులార నాగీను బలమర్పిన ఫలము ॥ఆ

### విడెము పాట

ప॥ పుడమిసుతయుగూడి రామ విడెముసేయుమా
కడుముదమున రామచంద్ర కరుణనేలుమా ॥పు

చ॥ చిగురుటాకుల వక్కలును జేర్చియున్నది
సుగంధపరిమళద్రవ్యములను సుదతి యిచ్చెను ॥పు

(2) శృంగారి సీత యొసగు సుగంధపుష్పములు
మంగళాంగ నైవేద్యము మదినిగాంచరా ॥పు

(3) నవకోసల నిలయ రఘువరకులతిలకా భువనసుందర రాజచంద్ర పుండరీకాక్ష ॥వి

వ॥ ఇవ్విధంబున వధూవరులకు వేడుకలుజేసి హారతులిచ్చి హారిబువ్వమును శేష హోమము నాగబలి మొదలుగాగల వివాహ కార్యములన్నియు క్రమంబున గావించి ఫలతాంబూల దానంబులొసంగి బంధుమిత్రులాదిగాగల వారల సత్కరించి తృప్తుండైయుండు జనకమహారాజును విశ్వామిత్రుండు ఆశీర్వదించి

తే॥ రాజపుత్రుల దీవించి తేజములర బోయివచ్చెద దశరథభూపయనుచు
బలికి కౌశికు డానందభరితుడగుచు జేరె హిమవంతమున కతిశీఘ్రముగను

ద్వి॥ జనకునితో దశరథుడను ప్రీతిని నా తనయుల భార్యలతోడ
బనుపు మయోధ్యకు ఆనందంబున జననాయక వేగమున

(2) అనవిని జనకుడు మోదంబున ప్రియతనయల జేరగదీసి
జనవలె మీరలయోధ్యకు ముదమున ఘనులగు మీభర్తలగూడి ॥జ

(3) అత్తకుమామకు నెదురాడకుడు మీరు భర్తయాజ్ఞ మీరకుడీ
చిత్తమలరగ గురు బుధవరులను సేవింపుడు మీరతిభక్తి ॥జ

(4) అంతట వాత్సల్యంబున బిడ్డల చెంతజేర్చి జననియును
సంతసమున నానందబాష్పములు జడిగురియగ ముద్దిడియు ॥జ

ఆభోగి – ఆది

ప॥ నిన్ను విడిచి మేమెటులుందుమమ్మ నిత్యానందస్వరూపిణీ ॥నిన్ను

అ॥ కన్నతల్లి నాచిన్ని ముద్దుబాల కరుణాలవాల సద్గుణజాల ॥నిన్ను

చ॥ అలికులవేణి అంబుజపాణి కలికీ మధుర వాణి కల్యాణి
జలజాక్షి నవకోసలేశురాణి తలిరుబోణి శ్రీరమణీమణీ ॥నిన్ను

హిం॥ ప్రియతనయులకు బుద్ధులుజెప్పియు ప్రేమమీరగ జనకుం డప్పుడు
రయమున రత్నాభరణములాదిగ రమణీయముగ అరణంబిచ్చెను ॥శ్రీ

(2) ధనకనకాదిక వస్త్రమాల్యములు దాసీజన భటవర్గంబులును
ఘనముగగోవుల గజతురగంబుల గారవముననిచ్చి పంపెను ముదమున ॥శ్రీ

(3) శృంగారంబు చెలువముమీర మంగళవాద్యముల్ చెలగగ నప్పుడు
బంగరురథముల నెక్కియు గదలిరి అంగనల్ మంగళహారతు లియ్యగ ॥శ్రీ

(4) అల్లురతోడ అనుగు తనయలను అనుపుచు జనకుడు కూరిమిమీర
ఉల్లాసంబున దశరథుగూడి ఒప్పుగ కొంతదూరంబరిగి ॥శ్రీ

(5) యీరీతిని మరి సాగనంపియును యినకులపతియనుమతిచేకొనియు
జేరె గృహమునకు మంత్రులగూడి శీఘ్రంబునను జనకమహీపతి ॥శ్రీ

జో॥ తనయుల బంధులతోడ దశరథుడు జనునెడ మార్గంబునను
గనియెనునపశకునంబులు చాల తనమది కలవరమునను॥జ
గడగడవడకుచు భూకాంతుడు గనుగొని తన కులగురునీ
కడుభయమయ్యెడు నపశకునములిటు గలుగ కారణంబేమి ॥జ

వ॥ అనిన వశిష్ఠమహామునీంద్రుం డిట్లనియె.

క॥ చింతచేయవలదు శీఘ్రంబ యాపదల్ దొలగిపోవు నిపుడు దూరముగను
సంతసంబుగల్గు సార్వభౌముడనీదు మంతనమున భయము మానుమయ్య.

వ॥ అనునవసరంబున,

జో॥ చాలగపెనుచీకట్లుగ్రమ్మూచు ధూళినిండె దిక్కులను
ఏలగల్గెనోకో ప్రళయంబిపుడని వెతజెందిరి ప్రజలంతటను ॥జ

(2) దశరథ నృపతియు పుత్రులు మునులును దక్కగమరి అందరును
వసుధాతలమును వణకగ భీతిలి వ్రాలిరి స్మృతిదప్పియును ॥జ

సీ॥ నిప్పుపైనజడలును నిండుతేజంబును కడుభయంకరమూర్తి గలుగుమేటి
గండ్రగొడ్డలిపూని కడువడి నృపతుల ఖండించినట్టి కాలాంతకుండు
జమదగ్ని సూనుండు శత్రుభీకరుఁడును విజ్ఞానఘనుఁ డతివిమలయశుఁడు
భార్గవరాముండు పరమతపోనిధి వీరుండు శూరుండు విబుధవరుడు
వచ్చినప్పుడు కోపాగ్ని పెచ్చుపెరుగ ఆమహామహుగని మును లాదరమున
అర్ఘ్యపాద్యాదివిధులపుడాచరింప పరమశాంతిని గైకొని భార్గవుండు.

వ॥ దశరథ మహీపతిని డగ్గరిన పరశురామునిగని భయకంపితగాత్రుండై,

శంకరాభరణం — ఆది.

ప॥ ధరణీసుర దండంబులయ్యా ॥ధ

అ॥ సరసిజదేవ పారిజాతముల చరణయుగళము పూజింతునయ్యా ॥ధ

చ॥ పరుషవాక్యములు బలుకకుమయ్యా పరశురామ నిన్ను ప్రార్థింతునయ్యా
సరసమున నవకోసలేశుజూచి కరుణనేలుము నావరపుత్రులను ॥ధ

జో॥ దశరథుడిటు ప్రార్థించిన పెడచెవినిడి ధరసుతపతిగని రామా
శశిధరువిలువిరిచితినని మది పొంగెదు క్షత్రియాధమా వినుమా ॥జ

కమాసు — ఏక.

ప॥ భృగుకులోద్భవ నీమాటల్ బలువేడుకవిను నామాటల్ ॥భృ

అ॥ ఉగ్రవైరము క్షత్రియులపై బూని నిగ్రహించితివి నీకిదియుక్తము ॥భృ

చ॥ వీర్యహీనుడనని వచించునీ వెడవెడ మాటలవినను నిజమునా
శౌర్యము విక్రమ మిదెగను భార్గవ పరిభవమోర్వను నవకోసలపతిసే ॥భృ

వ॥ ఇవ్విధంబుగ బల్కు రామచంద్రుని చుఱచుఱం జూచుచు

కల్యాణి - ఆదితాళం

చ॥ క్షత్రియుడవై గానవచ్చెవుర క్షాత్రముదీర్చెద రఘురామ
ధాత్రీసురవరుడవై గనుపించితివిగాని పాత్రముగావయ్య పరశురామ

(2) తాటకయనుస్త్రీతో తగవులాడుట తగునా ధరణీశులకు రామా
వేటగానివలె విలుబట్ట విధియౌన విప్రులకు దెల్పు పరశురామ

(3) నారిని వధియింప న్యాయమ నీకిది నగుబాటుయౌగాదె రఘురామ
ఔరౌర భళిభళి తల్లిని జంపుట ధర్మమౌనె నీకు పరశురామ

(4) ధర్మమా ననుగన్నతండ్రి యాజ్ఞనుదీర్ప తల్లివధయౌనటరా శ్రీరామ
మర్మమునరసి గురువాక్యముమీరక ఘోరరాక్షసిజంప స్త్రీహత్యయౌ భృగురామ

(5) త్రుప్పుబట్టిన విల్లు ద్రుంచితినని చాల త్రుళ్ళకు నా మ్రోల శ్రీరామ
ఒప్పైన విప్రోత్తముడవని యోర్చితి తబ్బిబ్బులాడకు పరశురామ

(6) ఆవిల్లు విరచితి పీవిల్లిదె గొనివంపు క్రొవ్వేదవేలర రఘురామ
ఈవిల్లిదొ వంచితి యీశరమునకేమి యిచ్చెదవొ దెల్పు పరశురామ

(7) అమ్మునకాహార మేమిత్తు ద్విజుడను అనుగ్రహింపుమునన్ను రఘురామ
ముమ్మాటికి రామబాణము వృథబోదు మొరమానుము వేగి పరశురామ

(8) ఇచ్చితి జపతపస్సంధ్యాది ఫలముల యీశరమునకిపుడు శ్రీరామ
వచ్చినదారిని బొమ్ము నవకోసలవాసుని దలచుచు పరశురామ

వ॥ ఇట్లుబల్క రామచంద్రుని శ్రీమన్నారాయణుడని యెఱింగి పరశురాముండిట్లు నుతియించె.

సావేరి — ఆది.

ప॥ సరసీరుహపత్రాక్ష శరణుశరణు కోదండరామ ॥స

అ॥ కరుణాకర వరదాయక కాకుత్స్థవంశోద్భవ ॥స

చ॥ మును వననిధినిజొచ్చి మధుకైటభులను దునుమగలేదా
మూపున గిరిదాల్చి సురకార్యము దీర్పగలేదా
కనకాక్షునిగూల్చి కొమ్మున ధరణి పైకెత్తగలేదా
ఘనముగ కంబమున వెడలి కనకకశిపుని ద్రుంచితివిగాదా ॥స

(2) పొట్టివడుగవై భువిని వెలసి నీగట్టితనముజూపగలేదా
మట్టుమీరిన భూపతులకులమును బట్టిగొట్టనేనీవెగాదా
పట్టుకేతనములు మింటనెగురు నవకోసలమునబుట్టి జనకునిముద్దు
పట్టిని చేపట్టిన కౌసల్యపట్టీ రిమరిసపా సనిదపమగరిన రిమపదా ॥ప

జోర॥ రామచంద్రునిటు వినుతించియు భృగురాముడు మోదంబునను
భూమిజపతి యనుమతిగొని వేగమె బోయె మహేంద్రము జేరగను ॥జ

వ॥ శ్రీరాముండంత దశరథుని డగ్గరి తండ్రీ! లెమ్ము! భార్గవుండు వెడలిపోయెనని నమస్కరించిన నతండు నిర్భీరపడి పుత్రుని కౌగిలించి సైన్యంబులు గొలువ బంధుమిత్ర పురోహిత మంత్రివరులతో నిజపురంబు జేరవచ్చె నట్టియెడ,

తే॥ మార్గమధ్యమునందందు మరియు వేడ్క గంధ కస్తూరి పన్నీరు కలియజల్లి అగరు కర్పూర ధూపాళిహారతిచ్చి కానుకలర్పించి పొగడిరా ఘనుని జనులు.

శో॥ పురజనులందరు యెదురేగిరియా భూమీశుడు ముదమందగ మరియును మంగళహారతు లిచ్చిరి మగువలు సంభ్రమమలరగ ॥జ

(2) మంగళతూర్య రవంబులు జెలగగ శృంగారంబును మీర పొంగుచు పురిజేరిరి వారలు చతురంగబలంబులు గొలువ ॥జ

(3) కొడుకుల కోడండ్రను నిజపత్నులగూడియు కూరిమితోడ కడువడి యంతఃపురముజేర నా భూమీశుడు హర్షమునమీరగ ॥జ

వ॥ అంత రాజపత్నులు,

సీ॥ ముద్దు కోడండ్రతో ముదమార దేవతామందిరంబునుజేరి మనములలర పూనికఁ గులదైవముల పూజగావించి భూసురులకు తనివిదీర వస్త్రధాన్యాధిక వస్తువాహనములు ఘనముగ నిప్పించి కడుముదమున పుష్పగంధాక్షతములఁ బూజలొనరించి మృష్టాన్నములనిడి మిగులనపుడు వారి దీవనలందియు వైభవమున భవ్యహర్మ్యంబులనుజేరి భాసురముగ వరసుతులగూడి యానందభరితలగుచు నారగించిరి సుపక్వాన్నముల్ హర్షమొదవ

భోజనము పాట

ప॥ ఆరగించిరి వేడ్క నాదంపతులు మరి ॥ఆ

అ॥ చేరి హితబృందములతో సరసముగ ॥ఆ

చ॥ బంగారు పళ్ళెరముల భక్ష్యభోజ్యంబులునచి అంగనల్ వడ్డింప నానందమునుమీర

(2) సురుచిరగాత్రులు సుందరాకారులు తరుణులగూడియు పరమహర్షంబున ॥ఆ

(3) సరసాన్నములుమరి షడ్రసయుతంబుగ పరమాన్నములతోడ బాంధవులగూడి॥

(4) నవకోసలేశులు నతివేడుకలతోడ వివిధపదార్థముల్ గొని వినోదించుచునపుడు

వ॥ తదనంతరంబ మరియు ననేకవిధ వేడుకలుజేసి సంతోషభరితులై యుండిరి.

సీ॥ శ్రీరామచంద్రుడు సీతాసమేతుడై యుద్యానవినోదమ్ము లింపుమీర పాదరింపఁగఁదూరుచు పుష్పాదిజల్లుచు జలకేళి జేలుచు సంభ్రమమున

పొన్నగున్నలచెంత క్రీడించుచు వనమయూరములాడ గనుచు ప్రేమ
రమణీయమగుచుండు ప్రమదావనంబుల విహరించుచును బలువేడ్క మీర
చేరి యన్యోన్యమైత్రిని చెలువమునుర సరస సల్లాపముల చాల హర్ష మొప్ప
భేదమించుకయునులేక ప్రీతితోడ అలరుచుండును సతతమానంద మెసగ.

హిం॥ ఈరీతినిమరి లక్ష్మణుండును చేరియు భరత శత్రుఘ్నులును
కూరిమిమీరగ సతులనుగూడి కోరికల్దీరగ గ్రీడించిరివేడ్క ॥శ్రీ

(2) పరగగనిటు సుఖముండగ నప్పుడు భరతునిజూచి నృపుడతిప్రేమను
చిరకాలమునుండి నినుబిల్చుటకై చేరియున్నాడు యుధాజిత్తు ॥శ్రీ

(3) ఆతనిగూడి తమ్మునితోడ అరుగుముప్రీతిని కేకయపురికిన
మాతులుతోడను వెడలెను భరతుడు మహానీయుడుదా తమ్మునితోడుత ॥శ్రీ

(4) మానసమలరగ మేనల్లురతో ఆనందంబున పురమునజేరియు
భూనాథుండౌ నశ్వపతినిగని భూరివిక్రములు నమస్కరించిరి భక్తి ॥శ్రీ

వ॥ తాతను సేవించుచు రాజపుత్రులు సుఖంబుండిరి. అంతనిట శ్రీరామభద్రుడు,

హిం॥ జననీజనకుల మదిరంజిల్లగ సకలోపచారముల్ జేయుచు భక్తిని
జనకజగూడి సద్ధర్మంబులన్ జరుపుచు నుండెను సత్యవ్రతుడై ॥శ్రీ

(2) గురుశుశ్రూషలు గావించుచును పరమహర్షంబున ప్రజలకు హితముల
సరసత జేయుచు జనరంజనుడై వరమునులను సేవించుచునుండెను ॥శ్రీ

(3) శ్రీరామచంద్రుని నుత్తమగుణముల ధారుణి సురులును మునులును ప్రజలున్
సారెకును గొనియాడుచు నుండగ భూరమణుడును సుప్పొంగుచునుండె ॥శ్రీ

మంగళహారతి

ప॥ శ్రీరామచంద్రునకు జయమంగళము సదా సీతాసమేతునకు శుభమంగళము॥శ్రీ

చ॥ పరమ భక్తితోడ బ్రహ్మాదులునువేడ ధరణి భారముద్దీర్ప దశరథుపట్టివై
ఘోరరాక్షసిన్ దునిమి మారీచుని మదమునణచి
వీరమౌని యాగముగాచిన కల్యాణునకు ॥శ్రీ

(2) మరియు నహల్యశాపమునుదీర్చి హరువిల్లు విఱచియు వరియించి సీతను
పరశురాముని భంగపరచియు సాకేతపురమున జానకితో సుఖలీల రమియించు॥శ్రీ

తే॥ భానువంశాబ్ధి శ్రీరామభద్రుచరిత మాంజనేయుని కరుణ సేనతిముదమున
రామచంద్రాభివర్ణనంబుగ ప్రేమతోడ బాలకాండము వ్రాసితి భక్తిమీర

సీ॥ ధరమన్నెత్రప కాశీవరగోత్ర సంభవుండగు సంతాన రామయంగారు
అధికవిద్యానిధి యాతని సతి సర్వసద్గుణోపేత యా జానకమ్మ
ఆ సతీపతులకు నానందకంబుగా జన్మించె రుక్మిణి సాధుశీల
హరికథామృతపానమందు నాసక్తియు గురుదైవముల భక్తి గొల్పునదియు
సాధుజనమైత్రి మెలగెడు సచ్చరిత్రి చేరి సాహాయ్యమొనరించి చిత్తమలర
రాగతాళంబుల నమర్చి రమ్యముగను సరవి రామాయణంబున బరమభక్తి

సీ॥ వసుధ నూకలపాటివంశ వర్ధని సాధ్వి రామమ్మయను కాంత ప్రేమదనర
ధారుణీసురులను దైవతమ్ములటంచు సేవించు సతతంబు చిత్తమలర
ధన భూమి గోవస్త్ర ధాన్యాదుల నొసంగి బీదసాదల బ్రోచు ప్రీతితోడ
అన్నసత్రములుంచి యతిథి సత్కారముల్ కావించు నతిభక్తి కడలుకొనగ
ధర్మమార్గానువర్తిని దానశీల వివిధ రామాయణంబులు వేడ్కతోడ
వినుచువలచు ధ్యానించు విమలహృదయ గురులపూజించుచుండు సద్గుణగణాఢ్య

తే॥ అట్టి రామమ్మ కడుపునబుట్టి భువిని సాధుసంగతి కాలంబు జరుపుచెపుడు
శ్రీరమేశ్వరు ధ్యానము జేయునట్టి సరసగుణయుత కామమ్మ స్థిరమనీష॥

క॥ శ్రీమద్రామాయణముల్ వేమఱు బుధవరులవలన వినుచు మనమునన్
రాముని ధ్యానించుచు మది నీమహి నవకోసలంబ యిరవై యుండున్॥

క॥ వరమోత్సాహముతో రఘువరుచరితము వ్రాయ నన్ను బురికొల్పిన
సుస్థిరమతి యగు నావనితను సతతము రక్షించు రామచంద్రుడు కరుణన్॥

శ్లో॥ నమోస్తు రామాయ సలక్ష్మణాయ నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మ భువే వరాయ నమోస్తు వల్మీకభవాయ తస్మై॥

గద్య.

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షవీక్షణ
లబ్ధకవిత్వ శౌనకసగోత్ర పవిత్రి
శ్రీరామపుత్రి విరచితము
నవకోసల రామాయణము హరికథ
బా ల కా ం డ ము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ
శ్రీ రామార్పణమస్తు.

శ్రీరస్తు.
శ్రీరామ జయం.

# నవకోసల రామాయణము.
# హరికథ.

## అయోధ్యాకాండము.

కం॥ శ్రీమహిజావరుఁడు భక్తజనామర
భూరుహావతంసుఁ డార్తార్తి హరుండౌ
రాముఁడు నవకోసల ధాముఁడు
మమ్మోముగాత దయ నెల్లపుడున్.

సీ॥ శ్రీరామచంద్రుఁడు సీతాసమేతుఁడై నాయూయిలీలల హాయినంద
కౌసల్యయును ఱేఁడు కడుప్రేమ వారల సౌమిత్రి నూర్మిళఁ గామితముల
గారవింపుచు సదా భరత శత్రుఘ్నుల మదినెంచుచుండ్రిట మమతమీఱ
ఘనుడు యుధాజితుఁ డనురాగమేపారఁ దన కన్నసుతులట్లు తలఁచి తనదు
సదనమున నల్లురను చాల సత్కరింప నుండి రానందభరితులై నిండుభక్తిఁ
దండ్రి నన్నలఁ దలఁచుచు ధర్మరతులు భరత శత్రుఘ్నులేవేళ భావమలర.

హిం:-నలువురు పుత్రులు జనపాలునకును నాల్గుభుజంబులవలె విలసిల్లిరి
చెలువముమీఱ శ్రీరాముడధికముగఁ జేయును ప్రియమును తండ్రికి సతతము॥

(2) అగణిత గుణగణుఁ డాశ్రితవరదుఁడు ఆదినారాయణుఁ డవతరించె భువి
రఘుకులమున నరాకృతిని వెలసె రావణవధకై దివిజుల మొఱ విని ॥శ్రీ

కాంభోజి — ఆది.

ప॥ శ్రీరాము మహిమ బొగడతరమా శ్రితమందారుడు శ్రీరఘువరు ॥శ్రీ

అ॥ ధీరాగ్రగణ్య దీనశరణ్య నీరజమిత్రకులవరేణ్య మారకోటి లావణ్య ॥శ్రీ

చ॥ భువననిర్మాణ స్థితిలయనిపుణు భూరి మాయావిలసిత విహరణు
నవనీరజ పత్రేక్షణు నారాయణు నఖిల జగత్కారణు ॥శ్రీ

(2) గిరిజాపతి మెరుగు నామరుచియును, తరుణియహల్య మెరుగు పదరజప్రభావమును
పురవైరి చాపమెరుగు భుజాబలమును, శరనిధి మెరుగు శరధాటియును ॥శ్రీ

శ్రీ) అమరాది సేవిత పదకమలు కమలాలయాశ్రియ ఘనవక్షు
కమనీయ శుభానను కరుణానిలయు నవకోసలేశు ॥శ్రీ॥

డో॥ర:-తలచెను దశరథుడిటు తనమదిలో పలిత శిరస్కుడనైతిఁ గదుర
చెలగుచు యువరాజ్యాభిషేకమును జేసెద శ్రీరామునకుర ॥జ

(1) అతులిత వైభవ మలర నొనర్చెద ఆనందంబున మరియుర
హితమతి మంత్రి పురోహిత బుధవరు లెల్లరు సమ్మతి నరయుర ॥జ

వ॥ ఇట్లు తలపోసి దశరథేశ్వరుం డొక్కదినంబున మంత్రులతో నాలోచించి సామంత భూకాంతులను, పౌర జానపదముఖ్యులను, రావించి సభాస్థానంబున వారింగని,

డో॥ర:-ఇంతకాలమును పాలించితి ధర నింపుగ ధర్మముతోడర
ఎంతయు వృద్ధుడనైతినింక జన హితమెంచుచు నేనెపుడుర ॥జ

(2) కడుపునఁబుట్టిన బిడ్డలవలె మాపూర్వులు ఘనముగ నేలిరి ప్రజలర
దృఢబలుఁడు శ్రీరాముఁడు పెద్దల నడువడి విడువడు గానర ॥జ

గీ॥ ప్రేమమీర నాదు కామిత మెరిగింతు రామచంద్ర సుగుణధాము నిపుడు
భూమిపతిగఁజేయ బుద్ధిఁదలంచితి మీతలంపు లెట్టివో తెలుపుడి॥

గీ॥ ఈమహీజనమ్ము లెల్ల గోరెద రెప్డు రామచంద్రమూర్తి రాజుగాగ
భూమినాథ నీవు ప్రేమతోఁబల్కితి మామనోరథంబు మహిపయిదియె.

డో॥ర:-సంతసమున బల్కితిరిటు మీరలు సదమల మతులై వేడ్కర
మంతన మెఱిగింపుడి నిజముగ నెంతయు నాపై ప్రేమర ॥జ

వ॥ అనిన పౌర ప్రముఖులు దశరథు నవలోకించి,

డో॥ర:-పుత్రులవలెను ప్రజల బ్రోచుచు పుణ్యవర్తనుడవగుచు
ధాత్రి నేలితివి దశరథ నృపవర ధర్మమార్గమున నెపుడు ॥జ

శంకరాభరణం—ఆది.

ప॥ మహారాజ రాజ వినుమయ్య మా మనవిని ॥మ

అ॥ మహనీయమూర్తి రామచంద్రుడు శ్రీ మహిజా ధవుడు మహినేలదగు ॥మ

చ॥ [illegible] భూరిసత్త్వముడు సద్ధర్మపరుడు సత్యసంధుడు
వృద్ధులఁ[illegible] విప్రులర బ్రోచు బుద్ధిని బృహస్పతి బోలువాడు ॥మ॥

(2) అపరాధనైన నాదరించిబ్రోచు కృపయుంచు జనకృతము మఱవడెపుడు
ఉపమానరహితు డుత్తమోత్తముడు నిపుణుడు రాజనీతికోవిదుడు ॥మ॥

(3) అరసి ప్రజలకెల్ల సుఖముగల్గజేయు శరణన్న యంత శత్రువైన నన్గాచు
కరుణాపయోధి గాంభీర్య వార్ధి పురుషసింహుడు సకోసలరాముడు ॥మ

జోర:-అనవిని దశరథుడతి మోదంబున ఘనుడు వసిష్ఠునిగనియు
అనఘా రాముని యభిషేకమును కరసి చల్పు లగ్నంబనుడు ॥జ॥

అ॥ శ్రీమనోహరుండు శ్రితపారిజాతము రామచంద్రమూర్తి రాజు జేయు
భూమిపాల రేపు పుష్యమిగాన సీతారామునకం బొనర్పు గాంచుసుఖము

జోర:-అనువుగ శుభలగ్నము పుష్యమి రేపన విని సంతోషముతో నపుడు
ఘనులు వసిష్ఠ వామదేవుల గని యిట్లనియెను నృపుడు ॥జ

సీ॥ వరమునీశ్వరులార పరమపావనులార! రామాభిషేకంబు రమణమీరా
నేమికావలయునో యెల్ల పదార్థంబుల తీర్పుచేయుడీ యొలమితోడ
ననినంత మంత్రులం గని వారువల్కిరి సర్వసంభారముల్ సచివులార!
సమకూర్పుడిప్పుడ సర్వనదీనద జలములు మున్నుగా సకలమలమతి
దేవళంబుల నన్నిట దేవపూజ లుత్సవంబులు నటపుడీ యొప్పమీరా
పురము శృంగారించుడిప్పుడమాంగలిక గజ రథములం గైసేయుడరుదుగాను

జోర:-అంత సుమంత్రునితో దశరథుడిట్లనియెను వేడుకమీర
సంతసమున శ్రీరాముడోడి తెమ్మింటియు తడయక రహిమీర ॥జ

(4) అనగ సుమంత్రుడు కనకరథముగొని జని కడువేడుకమీర
జనకజరమణుని సన్నిధిజేరి సంతసంబు చేకూర ॥జ

కానడ. రూపకం.

ప॥ శ్రీరఘుకుల కుంజరు శ్రీరాముని కనరారగన ॥శ్రీ

అ॥ సారసదళనేత్రుని శ్యామసుందర శరీరుని ॥శ్రీ

చ॥ సనకాదినుత చరణుని జనమనోహరుని
వినుత గుణశీలుని అనుపమగుణాంబుధిని

(2) భానుకోటి సప్రభాయుతుని భానురాంశుని కల్యాణుని
జానకీ మనోహరుని జగదేకవీరుని ॥శ్రీ॥

(3) కమల భవాది సురసేవితుని కామితఫలదాయకుని
అమితోత్సాహుని నవకోసల ఆనందనిలయుని ॥శ్రీ

జోర:-కరములు ముకుళించి సుమంత్రుడు కమలారుణ దళనేత్రా
పరమోదారుడు భూపాలుడు నిను త్వరితంబుగ రమ్మనె సత్యచరిత్రా ॥జ

(2) అనవుడు సచివునిగూడియు రథ మారోహించియు నపుడు
జనకుని చెంతకు జేరవచ్చియు మనమలరగ రాముండు ॥జ

(3) విభవ మొప్ప నమస్కారము జేసెను విశ్వమోహనుడు ప్రేమన్
అభివాదన మొనరించుచు తండ్రికి అంజలిబద్ధుడై నిలచెన్ ॥జ

(4) మురియుచు సల ముద్దులవరతనయుని కరముబట్టి ప్రమదమున
సురుచిర రత్నపీఠముపైన సరసత నునిచియు ప్రేమ ॥జ

నాయకి – ఆది.

ప॥ రఘురామానాదు ముద్దుకుమార జగన్మోహన రామా విను ॥ర

అ॥ సుగుణాలయ సుందరముఖ సూరివినుత సుప్రకాశ శ్రీ ॥ర

చ॥ కౌసల్యవరగర్భ శుక్తి మౌక్తికమా రామ
భాసురగాత్ర నాపాలి భాగ్యమగు రామచంద్ర శ్రీ ॥ర

(2) నవకోసల పురవాసుల యనుమతిగొని నే
యువరాజ్యాభిషేకము నొనరింపగ దలచితి నీకు ॥ర

జోర:-రామభద్రవిను వృద్ధుడనైతిని భూమిపతిగ నినుజేయన్
నామదినెంచితి ప్రకృతి జనంబులు భూమీశులు ముదమందన్ ॥జ

వ॥ రామా! మన గురువరుండైన వసిష్ఠమహర్షి, రేపే శుభ ముహూర్తంబు నిశ్చయించెఁ గావున పుష్యమి నక్షత్రంబున నీకు పట్టాభిషేకము గావించెద. నీ రాత్రి భార్యా సహితుండవై నీ వుపవసింపుము. పోయిరమ్ము నాయన! యన వల్లెయని నమస్కరించి రామచంద్రుడు వెడలెనంత,

క॥ ఆరాజు మాటలనువిని శ్రీరాముని మిత్రులపుడె శీఘ్రగతిఁ దగన్
నారీమణి కౌసల్యను జెరి యిట్లనిరి ప్రీతిచెలగగ భక్తిన్.

జోర:-అమ్మావినుమన రామచంద్రునకు నెమ్మదిమీరగ నిపుడు
ఇమ్మహీరాజ్యము పట్టముగట్టెడు నినవంశోత్తము డనుడు ॥జ

(2) ఆమాటలువిని కౌసల్య ముదంబున ఆదిదేవు ప్రార్థించి
భూమిపుత్రిని సుమిత్రను లక్ష్మణు ప్రేమతోడ రావించి ॥జ

(3) శుభవార్తను వారల కెఱిగించియును శుచియై భక్తినివేగ
శుభదాయకుడౌ శ్రీపతిపూజ విభవ మలరజేయంగ ॥జ

వ॥ అట్టియెడ,

తే॥ తండ్రియాజ్ఞను గైకొని తరలివచ్చి తల్లిఁ గౌసల్య కవ్వార్త యెల్ల దెలుప
స్యందనంబెక్కి జనయిత్రి మందిరమున కరిగె వేవేగ శ్రీరాము డతిముదమున.

వ॥ అట దేవదేవుని ప్రార్థించు జననింగని, సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి,

జో॥ ర:-తల్లి వినుము యువరాజ్యమిచ్చునట తండ్రినాకు నెయ్యమునన్
ఉల్లాసంబున నీకోడలితో నను, నుపవసింపుమని నేమమునన్ ॥జ

(2) శ్రీమీరగ దీవింపుము రాజ్యశ్రీ నొందగ నమ్మిపుడు
ప్రేమను శుభకార్యము లొనరింపుము క్షేమముగోరియు నీవిపుడు ॥జ

(3) అనవిని మహదానందంబున కనుగొనలను బాష్పము లొలుకన్
అనువుగ చిరకాలాభికాంక్ష నా కొనగూడెను మది రంజిల్లన్ ॥జ

(4) ఇనకుల రాజ్యలక్ష్మికి పతివై యింపుమీరగ నిపుడున్
మనగదయ్య చిరంజీవి వగుచును ఘనులగు తమ్ములతోడన్ ॥జ

కథనకుతూహలం — ఆది.

ప॥ రమణీయమూర్తి రామచంద్ర శ్రీ కమనీయగాత్ర కంజదళనేత్ర ॥ర

అ॥ సౌమిత్రిహిత జానకీప్రియ సాకేతనగర సార్వభౌమ శ్రీ ॥ర

చ॥ అసురవినుత సద్గుణశోభిత అఖిలజనమోహన ఆనందసాంద్ర
నసుగై కశూర సౌజన్యధామ విమలతేజ శ్రీశ విశ్వపాలనా శ్రీ ॥ర

(2) భువనమోహన బుధరంజనా అవని నేలుమయ్యా యువరాజవై
నవకోసల కోదండరామ ననుగన్న తండ్రీ నాభాగ్యమా శ్రీ ॥ర

వ॥ అని జనని దీవింప దరహాసిత ముఖారవిందుండై ముకుళిత కరకమలుండై యున్న
లక్ష్మణుంగని,

తే॥ తమ్ముఁడా! యౌవరాజ్య పదమ్మునందు నిన్ను నభిషిక్తుఁజేసెద నెమ్మినంచుఁ
జెప్పె జనకుండు నాతోడ నిప్పుడీవు నందునాతోడ రాజ్యసౌఖ్యములనెల్ల.

వ॥ అని జనయిత్రులకు మ్రొక్కి రాముండు జానకీసహితంబుగ నిజనివాసమునకుం జనియె. అంత దశరథుడు వసిష్ఠునితో నిట్లనియె.

జోర:-వరమునీంద్ర నీవరిగి వేగమున ధరసుతను రామునకు
సరగున నుపవాసవ్రత నియమము సలుప దెలిపిరమ్మనుడు ॥జ

వ॥ వసిష్ఠమునిపుంగవుండును రథంబెక్కి శ్రీరామచంద్రు భవనంబున కేగుటయు, రాముండెదుర్కొని, తోడితెచ్చి అర్ఘ్యపాద్యాసనంబులిచ్చి పూజించి, గురువరుని పాదతోయంబుల శిరంబునం జల్లుకొని,

జోర:-ధన్యుడనైతిని మీపదసేవను దాపసోత్తమా యిపుడున్
మాన్యత సర్వశుభంబులు మీదగు మన్ననచే పెంపొందెననన్ ॥జ

(2) మునివరుడనెనిటు శ్రీరామా నను మోహవార్ధిని ముంచకుము
అనఘా నీపద కమలతీర్థమే యఖిల జగములకు శుభము ॥జ

(3) పరమ పవిత్రము సుఖదాయకము బ్రహ్మానందము మరియు
బరమశివుడు శిరమందు ధరించెను భద్రమనుచు సంతతము ॥జ

తే॥ శ్రీమనోహర నీమాయ నామనంబు జేరనీయకుమని మదిం గోరి యిట్టు
లరయ రవివంశమున కేను గురుడనైతి రామ శ్రీరామ శుభనామ రామభద్రా

హిం॥ అని కొనియాడుచు శ్రీరామా వినుమనుకుల వర్ధన నీజనకుడు మరి
అనువుగాను నుపవాసవ్రతంబును అవనిజతోగూడి చేయుమనెను వేగ ॥శ్రీ

వ॥ అనుచు నుపవాసనియమముల నుపదేశించి వసిష్ఠ మునిపుంగవుం డరిగినంత

హిం॥ జనకజరమణుని యభిషేకముగన జనితానందముతో పురవీధుల
జనులెల్లరు కడు గుంపులుగూడియు ఇనుడుదయించు టెపుడెపుడోయన ॥శ్రీ

(2) రంగుగ రంభాస్తంభముల్ గట్టియు రంగవల్లులుదీర్చి గమనీయముగను
పొంగుచు జనకోలాహలములతో శృంగారంబుగ రాజమార్గంబమరె ॥శ్రీ

వ॥ జనసమ్మర్దంబగు రాజమార్గంబు దాటి, వసిష్ఠుండు రాజమందిరంబు ప్రవేశించి, తాంబోయివచ్చిన సమాచారంబు నృపున కెఱింగించె నప్పుడు దశరథుండు, మంత్రి ప్రధానుల వారివారి సదనంబులకు బోవనియోగించి, తన అంతఃపురంబు ప్రవేశించె.

జోర:-మునివరుడటుబోవగ శ్రీరాముడు తన హితబృందముగని ప్రేమన్
అనిపియు వారినదనంబులకు దినకరాన్వయుడు వేగన్ ॥జ

(2) రంగనాథస్వామిని పూజించియు భక్తిని రాముడు సీతనుగూడి
పొంగుచు కుశశయ్యను పవళించెను భోగిశయనుదావేడి ॥జ
(3) వందిమాగధ సూతవరులు అభినందించగ మేల్కొనియు
సుందరాంగుడు స్నానాది సంధ్యల సొంపుగ దీర్చెను మరియు ॥జ

వ॥ ఇట కైకేయీ గృహంబున సుందరంబగు నొక మేడపై కైకేయి పుట్టినింటి దాసియగు మంథర సర్వశోభనాలంకృతంబుగానుండు నగరంబును గని అందొక దాసితో,

జో॥ర:-ఈనగరమిటు అలంకరించుట కేమికారణము చెలియా
పూనికతో కౌసల్యముదమున దానముల్ జేయగనేలా ॥జ
(2) అనవిని దా దిట్లనియెను వేగమె వినుమమ్మా చెప్పెదను
జనకుడు రాముని పట్టముగట్టును గనుక నీవేడుకలసెను ॥జ
(3) విని యాపల్కులు ముల్కులై సోకగ గనలుచు సౌధము డిగియు
కనకశయ్యపై పవళించియున్నయా కైకేయిని గని మరియు ॥జ

సీ॥ మూఢురాలా, విను మురియుచు నీభర్త కౌసల్యాసుతునకు ఘనముగాను
యువరాజ్యమిచ్చును భువనముల్ ముదమంద మొనగించెనునిన్ను మోహానాంగి
భరతు నంపియు నట ప్రేమదమ్ముననను రాము పట్టభద్రునిజేయ విభుడు దలచె
కడుప్రేమతో నిన్ను గారవించుటలెల్ల కల్లరితనముగా గానవచ్చె
అరయ నాల్కను బెల్ల మంగిటను విషము
నంచి సర్పంబు పగిది ప్రేమించె చాల
పరిభవించెను భరతుని తరుణి నిన్ను
భయము వాటిల్లె నీకు దౌర్భాగ్యమొదవె.

వ. ఇట్లు బల్కు మంథరనుగని కైకేయి,

జో॥ర:-ఎంతటి శుభవార్తను వినఁగల్గితినే నీదినముననో సఖియా
సంతోషము సంతోషము మణిమయ సరములు ఇవె చేకొనుమా ॥జ
(2) రాముఁడే యిల యువరాజై యుండిన నేమికొఱత యికవినుమా
రాముఁడె భరతునికంటె నధికముగ ప్రేమించును నను గనుగొనుమా ॥జ

సింధుమందారి—ఏక.

ప॥ భయమేలనే సఖి రామభద్రుడు రాజై యుండ మనకు ॥భ
అ॥ జయశీలుడు శత్రుభీకరుడు శౌర్యధైర్య గుణ శుభ లక్షణుడు ॥భ

చ॥ శమదమాదియుతుడు శాంతుడు సముడు సత్యపాలనుడు సాధుసమ్మతుడు
విమల మానసుడు విబుధ విధేయుడు విజ్ఞానఘనుడు విశ్వమోహనుడు ॥భ

(2) నిరుపమ కల్యాణగుణ శోభితుడు నీతికోవిదుడు శ్రీరాముడు
పరమపావనుడు కరుణామయుడు వరనవకోసల జనరంజనుడు ॥భ

వ॥ అని యిట్లు సంతోషిత స్వాంతయై పలుకు కైకేయింగాంచి ఆశ్చర్య భయ
విషాదంబులు మనంబునం బెనంగొన, మంథర, హారంబుల నేలబాఱవైచి,

గౌరీమనోహరి – ఆది.

ప॥ ముచ్చటాయెనే ముదితరో నీమాటల్ ॥ము

అ॥ పిచ్చితనము నేనెటులు వాపుదును భీతిలేదా భరతుణ్ణ పరతంత్రుజేయ ॥ము

చ॥ సకల రాజ్యభోగ సౌఖ్యములన్నెల్ల సవతి సుతునకియ్య సంబ్రబపడెదవార
అకట దాసివై కౌసల్యచెంత అధమురాలవై నవకోసలమున బ్రతుక ॥ము

జోర:-కైకేయియు మంథర దుర్బోధన కౌతుకంబున వినుచుణ్ణ
నీకంటెను నాకాప్తులెవ్వరింక నిక్కము పల్కుతి వనుచుణ్ణ ॥జ

(2) ఇంతటి యోచన గలగుణశాలిని యేమని నినుబొగడుదు నిపుడు
అంతర్యంబున హితము దెల్పితివి అవనిని సరియే నీకొరులు ॥జ

(3) రామునకును రాజ్యము వలదనుటకు నిపు డేమియుపాయము తెలుపు
భూమీశుని నేనేమి యడుగుదును ప్రేమమీర నెఱిగింపు ॥జ

(4) అనవిని మోదంబతిశయిల్ల నిట్లనియె మంథరప్రీతిణ్ణ
మును దేవాసుర సమరంబున నీకు అనువగు వరములు వరుడిచ్చెణ్ణ ఖ్యాతిణ్ణ ॥జ

(5) శ్రీరాముని వనవాసము బంపగ గోరు మబల యొక వరము
చేరి భరతునకు పట్టాభిషేకము చేయగోరు మొక వరము ॥జ

(6) చెలియా సకలాభరణము లూడ్చుక మలినాంబరమును దాల్చి
యిలఁబరుండు మీకోపగృహమున నే తెంచును విభుఁడెంచి ॥జ

తే॥ వచ్చినంతనె ప్రియునితోఁ బలుకకుండు మోముజూపకు నవ్వకు మోహమునను
రాజు నినుజేరి ప్రార్థింప రమణియింత గోరుమీ రెండువరములు కూర్మితోడ॥

తే॥ రాజు ప్రియభాషణములాడ రక్తిమీర మోసపోవకు బేలవై మోహనాంగి
యనిన నవ్వుచు నాశక్తి గనుమటంచు కోపగృహము జేరె నాకోమలాంగి.

వ॥ అచ్చట సకలాభరణంబులు దీసి, మలిన వస్త్రముగట్టి గినుకంబూని భూమిపైఁ
బండియుండె నట్టియెడ దశరథమహీపాలుండును మహోత్సాహంబున నివ్వార్త
వినిపింప నంతిపురంబున కరిగి,

జోర॥ ప్రియసతికై కనుగానక వగచుచు భీతిలి దాసిని గని యడిగెన్
ప్రియురా లెచటికి బోయెను దెల్పుము ప్రియమారఁగ వడివడిగన్ ॥జ

(2) వినుము దేవర దేవియిప్పుడె యలుకో తెలియదు వేగ
ఘనముగ కోపగృహమ్ము జేరెనన కడువడి సతిజేరంగ ॥జ

(3) క్రోధాగారము జేరి దశరథుడు మోదము వీడియుభీతిన్
మేదినిపై బడి యున్న సతినిగని మేనునిమిరి కడు భ్రాంతిన్ ॥జ

కాఫి—రూపకం.

ప॥ పలుకవిదేల నాతో భామామణీ ॥ప

అ॥ కలికీ మరుముల్కు చిల్కుకొల్కు తేనెలొల్కు పల్కుల ॥ప

చ॥ ఇందువదన కుందరదన డెందమానంద మొంద
సుందరి ననుజూచియు మందహాస చంద్రికల్ జిలుక ॥ప

(2) నెమ్మనమున నీవ ప్రాపని నెఱనమ్మియున్నవాడ
కొమ్మరో నవకోసలపతి కోర్కె దీర్చకోపమేల ॥ప

జోర॥ భూతముసోకిన దానిపగిది నీ భూమిపరుండగ నేలా
యీతీరున భూషణములు దీసియు వెతలుపొంద నీకేలా ॥జ

(2) ఎవ్వరు నీకపకారము చేసిరి యెఱిగింపుము నాకోబేలా
ఎవ్వరినైనను శిక్షించెదనే నింతవగవు నీకేలా ॥జ

(3) ఏలనె నాపై నింతకోపమిక చాలును నను గృపఁగనవే
నీలవేణి యిటు బలుకకున్న నిక నిలువదు ప్రాణము వినవే ॥జ

(4) తరుణీమణి నీకన్న నధికు లీ ధరలోనెవ్వరులేరు
పురుషులలో శ్రీరామునికన్నా కరయగనధికులులేరు ॥జ॥

(5) భూములు రాజ్యంబులు భూషణవస్తువుల్ యేమైననిచ్చెదనువినుమా
రాముడు సాక్షిగఁబల్కితినిక నీ కెమువలయునో చెపుమా ॥జ

వ॥ ఇట్లు దీనుఁడై ప్రార్థించుచున్న వల్లభుంగని, యల్లన కైకయిట్లనియె

తే॥ చిత్తమలరంగ నేమైన నిత్తుననుచు బలికితివిగాన జేయుము ప్రీతినయిపుడు
సత్యవాక్యంబుదప్పకు సార్వభౌమ సర్వభూతచయంబును సాక్షిగాగ

జో॥ నీకోరికదీర్చెద నేసత్యంబుగ నీకీసందియమేలా
శ్రీకరుడగు మన శ్రీరామునిపైఁ జేసితి బాస సుశీలా ॥జ

వ॥ ఇట్లతనిని సత్యపాశ బద్ధునిగావించి, సంతుష్టాంత రంగయై,

హిందూస్తాని కాపీ=అది.

ప॥ కోరికదెల్పెదవిను భూపాలా నా ॥కో

అ॥ కూరిమితో వరద్వితయమొసగు వారిజభవ ప్రముఖు లెఱుగనా ॥కో

చ॥ మునుదేవాసుర సమరంబుననే నినుగాపాడగ నిచ్చిన వరములను ॥కో

(2) పరమహర్షంబున యువరాజ్యము భరతునకొసగి పట్టముగట్టుము ॥కో

(3) నారచీరతాల్చి మునివేషధారియై శ్రీరాముడు కారడవిని జేరవలయు నా ॥కో

(4) వాసిగ నవపంచాబ్దంబులు వనవాసముజేయ నవకోసలరాముడు నా ॥కో

వ॥ అన

తే॥ పలుకులవి వీనుదోయికి ములుకులట్టులయిన వికలేంద్రియుండై యవనివిభుఁడు
పుడమిపైఁబడి యటకొంత వడికిలేచి రోషరక్తాక్షుఁడై కైక రోసియనియె

కాంభోజి – చాపు.

ప॥ పాతకీ నీకెటుల నోరాడెను కులఘాతకీ ॥పా

అ॥ భీతిలేకయు లజ్జవిడచిన నీతిలేనిదుష్టబుద్ధీ

చ॥ కన్నతల్లికన్న నిన్నతిగౌరవంబునఁ బూజసేయు నెన్నగాశ్రీరామచంద్రుడు
ఏమియపకృతి చేసెను నాకన్నకొమరుని కానకంపి నన్ను జంపగఁదలచితివి ఛీ ॥పా

(2) క్రూరసర్పమటంచు దెలియక కువలయేశునిపుత్రివనినే కూరిమిని నాయింటనుంచితి
కుమతినైకనుగానక జేరియీయిక్ష్వాకువంశము జెఱుపబుట్టిన చెనటివి ఛీ ॥పా

3॥ నెపమునేమి చూపిపంపుదు నీతికోవిదు రామచంద్రుని
విపినవాటికిఁ బనుపు సుతుడకులవిషము చిత్త విడువుమీమతి
కపటముగ నవకోసలేశుని కాననంబున కనుపగోరకు ॥పా

వ॥ అని తన్నుదిరస్కరించి పల్కు రాజుంగని, క్రోధారుణితలోచనయై కైకేయియు

జో॥ అనఘా! సత్యము త్యజించి నీవు నను దూరెదవిటులేలా
వినుమా రాముని వనములకంపుము క్షణముండిన నోర్వగజాలా ॥జ

(2) ఘనముగ రామున కభిషేకంబు గావించిన నేనిటు వినుమా
కనజాలను కౌసల్యవిభవము జనిపోయెదనిదె గనుమా ॥జ

(3) మునుమీపూర్వీకు లాడిదప్పరే యినకుల నీవిటుభృశము
ఘనమగుధర్మముఁ దప్పిచరించిన గల్గును కులమున కపయశము ॥జ

వ॥ అని కైక యాడినమాటలు హృదయపుటభేదనంబులుగాఁగ మూర్ఛిలి భూమిపైబడి, మరల తెలివొంది తేడు, యిల్లాలింగని దీనవదనుండై యల్లన,

తే॥ భరతునకు రాజ్యమిమ్మంట భావ్యమగును, కరుణలేకిటు రాముని కానలకును బంపుమని బల్కెదిదియేమి పడతియిపుడె, చావనున్నాడ విడువుమీ సాహసంబు

జో॥ సభలోబల్కితి నందరిలో నే సత్యము నిల్పవెలేమా
అభిషేకింపుము అఖిలము నొసఁగితి నతివానీవేప్రేమా ॥జ

వ॥ అనివలికి కైకేయియదుగులపై వ్రాలిన,

జో॥ చాలుచాలునీ వృథాబ్రగల్భములు సత్యము తప్పెదవిటు లౌరా
ఏలనన్ను బతిమాలెదు మాటికి నీమాటలు నే విననేర ॥జ

వ॥ అనినవిని దశరథుండు దుఃఖసాగరంబున మునిగి పొరలుచు ఛీ రక్కసీ

జో॥ ఘనుడగురాముని వనమునకంపియు ననుజంపఁగ నెదఁదలచితివి
వెనుకొనిరామునిఁ బురజనులెల్లరు వనములకరుగుదు రిదె వనవి ॥జ

(2) కనుగొననిఁక నీముఖము ఘాతకీ మనజాలను నే దుఃఖముతో
జనరహితంబగు విధవారాజ్యము అనుభవింపు నీ తనయునితో ॥జ

(3) అతి ముదమున నీకోర్కె దీర్చుచో నా సుతుడుగాఁడు భరతుండు
హితమతి నాకత డూర్ధ్వదైహికము నెంచి జేయఁ దగడెపుడు ॥జ

వ॥ ఇట్లు పల్కుచు కైకేయి ముఖంబు జూడనొల్లక, విముఖుండై వైతాళిక వంది మాగధులు తన్ను మేలుకొలుప, వలదని వారించి తపించుచుండె నంత,

హిం॥ అరుణోదయమున లేచి వసిష్ఠుడు హరిని మనంబున ధ్యానించియును
సరసత స్నానసంధ్యలొనర్చి నృపుసదనము జేరవచ్చియువేగ ॥శ్రీ

(2) ఘనుని సుమంత్రునిగని వసిష్ఠుడు గనుమిదె శ్వేతఛత్రచామరలు
కనకమణిమయ సింహాసనముల్ గంగాజలసింధుపూర్ణ కుంభములు ॥శ్రీ

(3) భాసురముగను శృంగారించిన భద్రగజంబును అష్టకన్యలుఁ
వాసిగ దధిఘృత హోమ ద్రవ్యములు వనరుగ ఫలపుష్పవస్తువు లివిగో ॥శ్రీ

(4) కడుసంబ్రమమున అభిషేకము గన గాచియున్నారిదె దశరథురాకకై
పుడమినిగల జనులెల్లరు ముదమున భూసురులును సర్వదేశాధీశులు ॥శ్రీ

జోర॥ అరుణోదయమై రవిపొడమెడు నుదయాద్రిని నిపుడు సుమంతా
త్వరితంబుగజని రాజేంద్రుని దోడ్కొని తరలిరమ్మని ధీమంతా ॥జ

వ॥ అనవుడు సుమంత్రుడు అంతఃపురంబు ప్రవేశించి, దశరథుని డగ్గరి

తే॥ రాజమహారాజ రవితేజ రాజరాజ భానుడుదయించె ప్రొద్దాయెగాన వేగ
రాము నభిషేక మొనరింప రక్తిమీర రమ్మనె వసిష్ఠుండు మిమ్ము నెమ్మితోడ॥

జోర॥ ఆమాటలు చెవిసోకగ రాజున కధిక తాపము గలుగ
ఏమికష్టమహాయని నిట్టూర్పులు విడిచెను గనుల బాష్పము లొలుక ॥జ

(2) నివ్వెరపడుచు సుమంత్రుడు తానటు నిలువున నీరై నిలువ
నవ్వుచు కైక సుమంత్రునితోననె నరపతి డస్సెను కనుమ ॥జ

(3) రాముని దోడ్కొనిరమ్మా బోయి రాజుసన్నిధికి ననఘ
భూమీశుడు లేవడు పలుకడు శ్రీ రాముని కన్నులగనక ॥జ

వ॥ అనినుడువ సుమంతుడు వసిష్ఠాదుల జేరవచ్చిన సామంత భూపతులెల్లరు దశ
రథుండేల రాడయ్యె ననవుడు, మరల రాజాంతఃపురము ప్రవేశించి,

జోర॥ విభవముతో రామాభిషేకమున కెదురుజూచుచు ప్రేమఁ
సభయట కిటకిట చెలగుచున్నయది సకలజనంబులతోడఁ ॥జ

(2) ఉర్వీశ్వర నీరాకకు వేచుచున్నారచ్చట పురజనులు
నిర్వహింపు శుభకార్య మిప్పుడే నిరుపమ సద్గుణ వినుమ ॥జ

వ॥ అనిన దశరథుండు సుమంత్రునిగని, రాముని దోడ్కొని రమ్మనిన మాటను
పాటింపవేల, వేగమున రామచంద్రుని దోడ్కొని రమ్మన,

జోర॥ అంత సుమంత్రుడు వింతగ రాముని యంతఃపురమును జేరి
సంతోషంబున రామునిగని సీజనకుడు రమ్మనె ననప్రీతి ॥జ

వ॥ రామచంద్రుడు సీతాదేవినిగని యిట్లనియె

జోర॥ ధీరుడు నా జనకుడు రమ్మనె నను కూరిమిమీరఁగ వేగమునఁ
నారీమణి యిడె పోయివచ్చెదను జేరియుండు మిట నీసఖులఁ ॥జ

సీ॥ శృంగార భరితమై మంగళకరమైన రాజమార్గమున శ్రీరామమూర్తి
ఘనుడు సుమంత్రుతో కనకరథంబెక్కి యనుగు తమ్మునిగూడి యందముగను
వందిమాగధ సూతవరులు స్తోత్రముచేయ కరిభట తురగముల్ కదలిరాగ
సౌధాగ్రములనెక్కి సంభ్రమంబున సతుల్ పొగడుచు జలజల పూలుచల్ల
భేరినాదము లెంతయు భోరుకలగ ప్రజలు నుత్సాహమున నిల్చి ప్రస్తుతింప
వినుచు పురవైభవంబునుగనుచు వేగ జనియె జనకుని గన కైకసదనమునకు॥

డోర॥ రథము డిగ్గియు తమ్మునిగూడుక రాజ సమ్ముఖమును జేరి
ముదమున నభివాదన మొనరించి మ్రొక్కి నిలిచె నతిభక్తి ॥జ

(2) కన్నుల జలముగార తాపమున కదలక బలుకకయున్న
కన్నతండ్రిఁగని పరితపించుచుఁ గైకనుగని వేగమున ॥జ

(3) ఏలా కనులెత్తి జూడడు పలుకడు ఏమిజేసితి యపచారంబు
చాల మచ్చికను జేరదీయడు నను జననీ దెల్పు మీవిధము ॥జ

(4) వినడుగదా దుర్వార్తలేమియు వివరింపుము దయతోడ
మనుజేశ్వరునకు సంకటమేమి మదినిటు తపియింపగ ననివేడ ॥జ

సావేరి—ఆది

ప॥ వినుమయ్యరామ నినుగన్న తండ్రీ మనమునగలమాట దెల్పెదను ॥వి

అ॥ ఇనకులాబ్ధిచంద్ర సత్యవాక్యభీతి నీతెఱగున నడలియున్నవాడు ॥వి

చ॥ మునుదేవాసురులనిసేయనీదు జనకుడుదోడ్పడు వేళ నేను
అనఘుని ప్రాణరక్షణముసేయ ఆదరించి వరద్వయమిచ్చెనాకు ॥వి

(2) తాపమేమిలేదు వరముడుగనాపై కోపగించియుఁ గుందుచునుండు
భూపతిప్రతిజ్ఞ నెరవేర్చినీవు భూరియశముపొందు నవకోసలమున ॥వి

డోర॥ ఇటుబలికిన పినతల్లినిగని నీ వేమిగోరితివమ్మ
ఎటుజేయగనగు నేమివరములో యెఱిగింపుము శీఘ్రమ్మ ॥జ

(2) కోరితి రెండేవరములు నేను కోమలాంగ శ్రీరామా
ధారుణీశ్వరుడు నిచ్చెదననియిటు తల్లడిల్లుటను గనుమా ॥జ

(3) భరతునకును రాజ్యంబిమ్మనియొక వరముగోరితి వినుము
శ్రీరఘువరనిను నడవికిపంపఁగ గోరితి రెండవవరము ॥జ

(4) ఆమాటలు వినవొల్లక తానధిక తాపముప్పతిల
భూమీరమణుఁడు మోమాటంబున బొక్కుచు నున్నాఁడిటుల ॥జ

(5) సత్యముచే జగముల్లసిల్లును జానకి ప్రియ రఘురామా
సత్యప్రతిజ్ఞునిజేయుము తండ్రిని సద్గుణధామా ప్రేమా ॥జ

(6) నారచీరలను జడలనుదాలిచి నలువుగ మునివేషమున
ఘోరాటవిని పదునాలుగునేడులు చేరివసింపుమి యనిన ॥జ

(7) అతిసాహసమునబల్కుటైకేఁగని యనియెను రఘువీరుడు
హితముగ నాతో మున్నెదెల్పిన హితముగోరిజేయనె నేను ॥జ

(8) ఇంతమాత్రంబునకై విభునిటు లేటికి యలయింపంగ
సంతసంబున బోయెద నడవికి జనకునిదేర్పుము వేగ ॥జ

బిలహరి — ఆది.

ప॥ సంతసించితీ జనకునాజ్ఞదీర్ప ॥సం

అ॥ చింతవీడవమ్మ శీఘ్రంబున జేరి భరతునకు నిమ్ము రాజ్యమును ॥జ

చ॥ చీరాజనములు జడలుదాల్చివేడ్క ఘోరాటవిని జేరియుండెదను
ధారుణిలో నవకోసలరాముడు మారుబల్కడెపుడు తండ్రివాక్యమునకు ॥సం

జో॥ తల్లికిమ్రొక్కియు దెలిపిసీతకును తరలివచ్చెదనువేగన్
యుల్లమలరగ నాజ్ఞయొసంగుము తల్లీ మోదముమీరన్ జ॥

తే॥ కైకచేనాజ్ఞగైకొని ఘనుడువేగ కనులబాష్పంబులును గారు ఘనుజుగూడి
పాదచారియగుచు నంత భక్తిమీర వెడలెఁ దనతల్లి కౌసల్యకడకు వేడ్క

జో॥ అంతఃపుర నారీమణు లీ యుదంతమంతయును దెలిసి
నెంతయుబిగ్గర నేడ్వ దశరథుడు విని యేడ్చెను గుండెలుబగిలి ॥జ

2॥ గొల్లుమనెడు రోదనశబ్దమువిని తల్లడిల్లుప్రజ గనియున్
ఉల్లముచెదరక రాముడు తల్లి యిల్లుజేరె మరియపుడున్ ॥జ

హిం॥ సుతునిమేలుకై సంతోషంబున సురుచిరవిభవంబున కౌసల్యయు
హితమతిగురుబుధ దేవపూజలున్ వేడ్కమీరగ జేయుచునుండెను ॥శ్రీ

(3) అన్నదానముల్ వస్త్రదాన సువర్ణదానము ప్రీతినిజేసియు
కన్నకుమారుని రాకకు వేచియు కడుముదమున నుండవచ్చెను రాముడు ॥శ్రీ

(3) జననికి మ్రొక్కియు నిలచియుండుముద్దు తనయునిగ్రుచ్చి కౌగిటజేర్చియు
మనములరగ మూర్కొని శీర్షంబును అనువుగదీవించె చిరాయువుగమ్మని ॥శ్రీ

(4) ముచ్చటలర యీ వజ్రపీఠమున విచ్చేయుము సుకుమారశ్రీరామ
మచ్చికచే రాజ్యమిచ్చు నీ జనకుడు సచ్చరితాగాను సంతసింపనే ॥శ్రీ

వ॥ ఇట్లు ప్రేమాతిశయంబున గారవించు తల్లి వాక్యములు విని నమ్రుడై శ్రీరామ
చంద్రుం డిట్లనియె.

జోర:-ఘనమగు దుఃఖము గలిగెను నీకును జనకజ సౌమిత్రులకున్
వినినంతనె మనజాలవు రాజ్యము విడువవలసె నిపుడు నాకున్ ॥జ

(2) ధరణీరాజ్యము భరతుని కిమ్మని ధరణీశుని వరమడిగి
ఘోరారణ్యము పంపగనన్ను గోరె కైక ప్రియమలర ॥జ

(3) నారచీరలు జడలుదాల్చినే నరుగవలయు వనమునకు
ఆరున్నెనిమిది యేండ్లుండగవలె నమ్మా నినుబాసియును ॥జ॥

(4) జనకుని యానతి పరిపాలింపగ జనియెద నడవికినిపుడే
జననీయోర్పుననుండు మిచట గనరాదేరికి విధి బలము ॥జ

(5) అశనిపాతమగు పల్కులువిని హా పుత్రాయని మూర్ఛిలినన్
దశరథాత్మజుడు ప్రేమమీరతన తల్లిని చేర్చె కడునడలన్ ॥జ

(6) తల్లీ నినుజూడఁగ నామది కడు తల్లడిల్లుచున్నదమ్మా
యెల్లకాలమిటు వనరవలెసె నీ కిట్టి సుతునిగని యమ్మా ॥జ

(7) వరగుణయుత శ్రీరామచంద్ర యీ వాక్యమేల బల్కెదవు
సరసిజలోచన సాధుశీల నా సద్వచనంబుల వినుము ॥జ

(8) తనయా రాజ్యము భరతునికిచ్చి దశరథుండు మనసీ
ననువిడచియు బోవలదు వనమునకు మనజాలనునే భువిని ॥జ

(9) జనకుని కంటెను జనని యెక్కుడని వినవే శాస్త్రములందు
వనమున కరుగుమయనె జనకుఁడు పోవలదనియెద నేనిపుడు ॥జ

(10) పాలింపుము నావచనము రాజ్య భాగ్యభోగములు చాలు
వాలాయము మనమందర మొక్కెడ గలసియుండు టేమేలు ॥జ

వ॥ ఇవ్విధంబున దుఃఖించు తల్లనిగని శ్రీరాముడు మాఱుబలుకనేరక కన్నులనీరు
గ్రమ్మ నూరకుండ లక్ష్మణుడు,

అసావేరి - ఏక

ప॥ తల్లి శోకింపకుమీ నీ యుల్లమడల నేనోర్వ ॥త

అ॥ చెల్లునే యీ కైకమాటలు ఛీ యనరే గురు బుధ వరులు విన్న ॥త

చ॥ తప్పులేమియు దెల్పరెవ్వారును ధరణిజపతి శ్రీరామునిపై
ఇప్పుగిదిని ఘోరాటవి కనుపంగ నెటులదలచెనో మూఢుడై జనకుడు ॥త

(2) పురుషశ్రేష్ఠు డీరాముడుండగ భరతునకెటు పతి పట్టముగట్టునో
ధరణీశుం డతికాముకుడై పేలు కరకుమాటలకు నరపతులునవ్వరే ॥త

(3) అభిషేకము గావించెద నన్నకు అడ్డమెవ్వరు నా భుజబలమునకును
విభవమలర నీ నవకోసలమున వీరుడై నిలచెద శ్రీరామునితో ॥త

వ॥ అను సౌమిత్రి పలుకుల కలరి కౌసల్య రఘురామునింగని.

జో॥:- పొమ్మనుదురె నిన్నడవికి తండ్రి పుడమిని జనులెవరైనన్
తమ్మునిమాటలు వింటివిగద యెటుదలచెదు రామాయనినన్ ॥జ

(2) మనమున దుఃఖము మానుముతల్లీ వనవాసం బన నెంతా
క్షణముగ నవపంచాబ్దంబులు వని జరించి వత్తు నీచెంత ॥జ

వ॥ అని లక్ష్మణుంగని,

హిం॥:-తమ్ముడనీవిటు తల్లడిల్లకు తల్లికి శోకమినుమడించెదు
నెమ్మనమున ధర్మసూక్ష్మమెరుగవే నిర్మల హృదయ లక్ష్మణ వినుమా ॥త

(2) వింతలె నీబల శౌర్యధైర్యములు ఎఱుంగనే నాపై కూర్మి పెంపును
రెంతయు దైవకృతమని దెలియుము విలపింపగ నిది తరుణముగాదు ॥త

(3) తగునా మనకెటు ధర్మపథముదాటి తండ్రివాక్యమును ఉల్లంఘింపను
వగచెదవేలర ధైర్యమువీడుచు వశమా యెవరికి ప్రభునాజ్ఞమీర ॥త

(4) అరయంగ ప్రియముననో యప్రియముననో హర్షంబుననో గినుకచేతనో
గురునృప జనకులు పనిచిన పనులను నరుడుజేయమిని నష్టయశుండగు ॥త

(5) కృతనిశ్చయుడౌ కొడుకునుజూచి కడుదుఃఖంబున కోసలసుతయు
సుత నినువిడచి యుండజాలనిట హితమతి నీతో వచ్చెద రామా ॥శ్రీ

ముఖారి - చాపు

ప॥ ననుగన్న తండ్రి రామాముద్దులపట్టి నినువిడచినే నెటులుందురా ॥న

అ॥ కనికరమునులేక కైకబోధనవిని నినువిడనాడెనా నీతండ్రి నాతనయా ॥న

చ॥ హితమైనప్రియురాలౌ కైకేయినుతునకు ఇచ్చినసీగాక యీరాజ్యసంపదలెల్ల
మతిహీనుడై రాజు మమతవీడి నీపై అతి భీకరంబైన అడవికిబంపనేల ॥న

(2) నవమోహనాకార నాచిన్నికుమార భువనసుందర నాదుపుత్రరత్నమా
నవకోసలేశ నీవు యువరాజవై యుండ నాకనులజూచుచుండు భాగ్యములేదయ్యె॥న

ద్విర:- ఎల్లకాలము కైకకులోబడి జన వల్లభుడుండగ మరియు
ఉల్లముగుందుచు సుఖమునెఱుంగక తల్లడిల్లుదు నేనెపుడు ॥జ

(2) పుత్రరత్నమా నిన్నుగనియునే పొంగుచుంటి ప్రమదమునన్
శతౌత్రమునాపైఁ జూపి కైక నిను జనుమనెగా క్రోధమునన్ ॥జ

(3) కొడుకా నాకడుపున పుట్టుటచే నీకీ యిడుములుగల్గెను జూమియిపుడు
కడుప్రేమను నినుపెంచి తుదకునే కాన కెటుల బొమ్మనుదు ॥జ

వ॥ నేనును నీవెంటవచ్చెదనని కృతనిశ్చయమై వచించు జననిం గని జనకజారమణుండు

ద్విర:- కరుణింపుము నను తల్లి మొ్రొక్కెదను కానకు బంపుము ప్రేమ
తరణివంశజులు తండ్రిగణింపక ధర్మముతప్పిరె చెపుమ ॥జ.

(2) నీవెఱుంగనివి ధర్మమార్గములు నీతులునున్నవె జననీ
భావింపుము దీవింపుము దయతో పరమసాధ్వి వినుమనవి ॥జ

సీ॥ నాతల్లి గనుమమ్మ నాథుడుండగసతి స్వాతంత్ర్యమునుబొంద సాగదమ్మ
సతికి పతిహితమునల్పుట సద్వ్రతి మన్నయార్యోక్తి నీవరయుమమ్మ
ఈవును నేనును నెల్లమానవులును మనుగొని ప్రభునాజ్ఞమనగవలయు
గావుననీమది గలదుఃఖముమాని యుండుమిూ పతిచెంత నోర్పుగల్గి
నీవులేకున్న తండ్రికి నిక్కముగను కైకచే చాలకష్టముల్ గల్గుగాన
ధరణికాంతుని గొల్చుచు ధర్మపరసి యుండుమాయమ్మ నాపైని నిందుప్రేమ.

ద్విర:-సుతుడిటుబల్కిన శోకానలమున మతిదప్పిన తల్లినిగనియు
అతివిషాదమునుబొంద ధైర్యమున అమ్మాదయజూడుము నన్ననుడు ॥జ

(2) విని లక్ష్మణుడు కైకనుదూరియు మన మెటియగ అన్ననుగనియున్
అనుభవింపు మిూ రాజ్యభోగములు జననికి ముదమొదవగ ననినన్ ॥జ

(3) చింతిలవలదు లక్ష్మణ రాజ్యశ్రీవిభవము లేదనుచున్
ఎంతయుదూరకు పినతల్లినిమరి వినుదైవ కృతమిది మరియున్ ॥జ

(4) అనవిని లక్ష్మణుండన్న మాటలకు నదరుచు బొమముడితోడ
మనమున రోషవిషాదము లెసఁగఁగ కనులెఱవాఱఁగ నుగ్రిముతోడ ॥జ

(5) పౌరుషంబు విడనాడియు దైవ బలమందురె క్షత్రియులు
పురుషసింహ స్త్రీలోలునిమాటలు అరయ ధర్మమెటుదెల్పు ॥జ

(6) ముదుకడు నృపుడు కైకకులోబడి మోసగించ శ్రీరామా
విధిబలమని బల్కెదవిప్పుడు నినుమించిన విధియున్నదె చెపుమా ॥జ

అరభి — జంపె

ప॥ అన్నా అగణిత గుణగణసంపన్నా
అభిషేకము నీకొనరింపగ నాకనుజ్ఞయొసగుము వేగ ॥అ

అ॥ మన్ననతో నామనవినివిని మన రాజరాజసింహాసన మలంకరింపుము ॥అ

చ॥ దశరథనృపుడడ్డముగను రానీ ధరణీపతులెవ్వరైననుగానీ
అసదృశ వీరకోదండముబూని అతిరయమున నణచెద శౌర్యమూని ॥అ

(2) పాపినికైకను బట్టి గట్టియును భరతుడువచ్చిన మరి పరిభవించియును
ప్రాపుగ నవకోసలమున జేరియునిను పటుధైర్యమున సేవింతును నీదయనే ॥అ

డోర:- కన్నులనశ్రుల ధారలుగారగ అన్నతోడ నిటుబల్కగను
మన్ననజేయుచు తమ్మునికప్పుడు కన్నులజలము దుడిచియును ॥జ

(2) అన్నా నీవిటులాడకు మిపుడే• అరిగెద కానకు నిశ్చయము
పిన్నతల్లితో బాసజేసితిని జనకునాజ్ఞ దీర్చెదననుచు ॥జ

(3) శౌర్య ధైర్య సాహసములు జూపగ సమయముగాదిది వినుమా
ఆర్యులకిటు తండ్రిని నిందించుట అఘముగాదె గనుగొనుమా ॥జ

(4) జనకునియాజ్ఞా పరిపాలనకై జనియెద సత్యంబనగన్
విని కోసలసుత వాత్సల్యంబున తనయుని గనుఁగొని తండ్రియనుచున్ ॥జ

యదుకులకాంభోజి — చాపు

ప॥ ఎన్నడు కష్టము లెట్టివో యెఱుగని యీబాలుడెటులుండు కానలో ॥ఎ

అ॥ సన్నుతచరితుడు సద్ధర్ముడడవి వెన్నుల నేఱుచు భుజియింప నేర్చునే ॥ఎ

చ॥ పసిడి పళ్ళెరమున భక్ష్యపాయసములతో
పక్వాన్నము లారగించు రాముడు

కనపగాయలు కందమూలముఁ దినిబ్రతికి
కటికనేల బరుండ ఘటియించె దైవము ॥ఎ

(2) సుగుణాభిరాముని సురుచిరగాత్రుని సుందర రఘువీరు నడవికి ననుప
నగుబాటుగాదె యీనరపతి చరితము ననకోసలమునకు నాథుఁడై యుండియు ॥ఎ

వ॥ ఇవ్విధంబున శోకించు తల్లి కతివినయవిధేయతలతోడ,

భైరవి - ఆది

ప॥ జననీ నీపాదములకు సాగిలపడి మ్రొక్కెద నా ॥జ

అ॥ ఘనమగు పితృవాక్యపరిపాలన గావింప నీయకొనవేనా ॥జ

చ॥ నేనొకడగా దీధర్మమునడుప నెందరో మహానుభావులు గలరమ్మా
నే నపూర్వమార్గమని నీకపరాధినౌ కోరికలేదమ్మా
మును జమదగ్ని సూనుడు తల్లిని తెగవేసియు నఘము నొందెనే
మనమున శోకము మానియు వేగ బనుపు మీకటాక్షము చల్లనిచూపుల
వనవాసవ్రతమును దీర్చియు నే వచ్చెదనీయెడ ననకోసల పురికి ॥జ

మత్త॥ అన్న నన్విడనాడ నీకిపు డాజ్ఞ నొసంగుమా
కన్నతండ్రి యెటుల్ వచింపుడు కానసంబుల నంప మం
చన్ననా విన తల్లిమాటలె సూనటం విన నంచితో
నిన్నుఁబాసి క్షణంబు నేనిల నిల్వనేర్తునె పుత్రకా!

ద్వి:- ఇట్లుపలుకుచు దుఃఖము పొంగిపొంగఁగ నేడ్చుచు తల్లినిగనఁగ
పటుధైర్యముగల రాముని కనులను బాష్పముల్ గ్రుక్కబోవంగా ॥జ

సీ॥ మోసపోయెను గైక మోహాన నాతండ్రి గాసిలియున్నాడు గనుముతల్లి
పతిపరిచర్యయె సతికి సద్వ్రతమండ్రు పతి సేవకన్న సువ్రతముకలదె,
పతియుండ సుతువెంట పడతిబోనగరాదు పతి చెంతనుండుటె పరమనీతి
నాథుడుండగ నీవనాథ వంచుఁబోకు నాథుండె దైవంబు నాతికెపుడు
గారవించుచు నాథుని గాసిమాన్పు భరతుడతి ధార్మికుడుగాన భయమువలదు
నిత్యవ్రతములు సలుపుమీ నియతితోడ తల్లినామాట మఱవకు దయతలిర్ప

తే॥ అమ్మదైవంబు పూజింపు మనుదినంబు నియమితాహారమునుగాను నెమ్మితోడ
జీవితేశున కతిభక్తి సేవసేయు పోయివచ్చెదననుబంపు పూతచరిత

జో॥:-సంతోషంబున బంపుమునన్ను జననీ దైన్యమువూని
యెంతయు వృద్ధుడు జనకునిజూడుము హితమెఱింగి దయబూని ॥జ

(2) వనమునకుం జను నుత్సాహముగల తనయునిగని కౌసల్యా
ఘనమగు నీపది తిరుగదు గదనుత కాలముదాటగ వశమా ॥జ

(3) ఏమనుజుండు దైవచిత్రముల నెఱుఁగ నేర్చునే యీధరణి
నేమనవచ్చును దైవమాయయిటు లెంతజేసెనే యీకరణి ॥జ

(4) హోమ్మా ముద్దుల తనయావేగమె రమ్మా సౌఖ్యముగనుమా
సమ్మతి నను మృదుమధుర వాక్యముల సంతసింపగజేయ మోదమున ॥జ

వ॥ ఇట్లు తనమనంబునగల దుఃఖంబును బోనడచి, సంతోష స్వాంతయై శుచియై వార్చి, సత్పుత్రునిట్లని దీవించె.

సీ॥ శరదిందు వదనాయ సరసీరుహాక్షాయ కరుణాకటాక్షాయ వరసుతాయ
నిరుపమగాత్రాయ పరమపవిత్రాయ అరుణాబ్జ చరణాయ వరసుతాయ
ధరణి జా నాథాయ దశరథతనయాయ శరచాపహస్తాయ వరసుతాయ
వరదానపాలాయ వార్ధి గంభీరాయ కరిరాజగమనాయ వరసుతాయ
సరసమితభాషిణే మమ వరసుతాయ పరమకరుణాత్మవేమమ వరసుతాయ
వరసుగుణ శాలినే మమ వరసుతాయ
భవతు శుభ మన్వహం మమ వరసుతాయ॥

హిం:-రఘువంశమణీ రాజితసద్గుణ రామచంద్రా నీకు మంగళమెపుడుగా
సుఖముగ వ్రతమును దీర్పుము వేగను సుందరరూపా మంగళకరముగ ॥శ్రీ

(2) వనరుగదివిభువి భూతజాలంబులుగా ఘనముగ నీకును తోడునీడై యుండ
వనవాసక్లేశ మెంతయులేకను వర్ధిల్లుము సత్కీర్తితో పుత్రా ॥శ్రీ

వ॥ వనజాసన ప్రముఖులు సురమునులును, ఘనులు దిక్పతులు, గగనముదిక్కులును దనుజులు, మనుజులు, తరణిశశాంకులు, తారలు గ్రహములు, వనచరంబులు, వల్మీకంబులు, సతతమునిను బోర్చుచుగావుతగా, అనువుగవత్సర, అయన, ఋతు మాస, పక్షములు, దినములు, సంధ్యలు, దివ్యముహూర్తములు, కళలు కాష్టలు, కాలదేశములు, సతతము నినుబోర్చుచుగాత. ధర్మము, సత్యము, శృతి, స్మృతి, ధృతియును, సర్వాస్త్రంబులు, సకలమంత్రంబులు, సర్వశాస్త్రములు, సప్తఋషులును, సరిత్పతియును, సప్తద్వీపములు, వరనదీనదములు, ధరణీతలమును, గిరి, గహ్వర, ఖగ, మృగ, చరాచరములుగా, సతతము నిను

బ్రోచుగాత. వరనతనిన్నెల్లెడల సత్కృప సర్వభూతములు, గాచు సత్యము తనయా, వరనవకోసల, పురవాసా, మద్గర్భవాసా ఘోరాటవిచరించి వేగ మయోధ్యకు జేరి వరసింహాసన మధిష్టించి సార్వభౌముడవై పాలింపుము ధర జయశీలా, నాకనుల పండువుగ గాంచెద, జయవీర రఘురామా, సుగుణధామా దశరథరామా, శ్రీరామా సౌందర్యజితకామా, మంగళనామా, శ్రీరామ తనయ రుక్మిణి వందనార్చిత పదకమల దివ్యతేజా, మంగళము, మంగళము మంగళము.

బిలహరి — ఆది

ప॥ రాజీవ నయన శ్రీరామచంద్ర నీకు రాజిత సుప్రకాశ మంగళం బొనరును ॥రా

చ॥ తేజమలర సుపర్ణుడు దివ్యసుధను తేబోవ వినత దా నేమంగళ మొనర్చెనదియు
ఆజిని వృత్రుజంప అమరపూజితుడౌ వజ్రికే మంగళ మొదవెనో యదియును ॥రా

(2) అదితియు సుత్రామునకు అమృతలబ్ధికొఱకు
అరిభీకరుల దునుమ నేమంగళ మొనర్చెనదియు
మధుహారి వామనుడు వృద్ధిజెందెడు వేళ
మంగళమేమమరె నా మంగళ మమరుగాక ॥రా

(3) సతతము నిను సన్మంగళయుతుగాను సర్వభూతంబులు నెల్లెడల గాచు
పతితపావనులు బ్రహ్మఋషులు మునులు, భద్రమొసగిబ్రోచు నవకోసలరామా

హిం:-మంగళమని వరసుతునకు శిరమున మంత్రాక్షతలిడి సంతోషంబున
పొంగుచు వేల్పుల పూజించియుమరి మంగళకరముగ రక్షను గట్టెను ॥శ్రీ

(2) పరమహర్షంబున గ్రుచ్చికౌగిటజేర్చి శిరము మూర్కొని గద్గదస్వరమున
వరతనయాపోయి సిద్ధార్థుడవై మరలి అయోధ్యకు శీఘ్రమెరమ్ము ॥శ్రీ

(3) మనమలరగ నిటు దీవనలియ్యగ జననిని వలగొని, పదములవ్రాలియు
వినయము మీరగ పోయివచ్చెదనని వెడలెను రాముం డనుజునితోడ ॥శ్రీ

(4) సరసిజముఖి శ్రీ జానకిదేవియు సరసిజములు గంధపుష్పంబులతో
పరమభక్తిని దేవపూజలుచేసి హర్షంబున దివ్యహేమ పీఠముననిచి ॥శ్రీ

(5) ప్రేమను నాథుని పూజించుటకై కోమలిమైథిలి వేచి యుండనట
సామజగమనుడు శ్రీరఘురాముడు భూమిజచెంతకువచ్చి నిలిచెను ॥శ్రీ

జోర:-తలవాల్చుక లజ్జించుచునిలచి పలుకకున్న ప్రాణేశ్వరుగ
వెలవెలబారు ముఖపంకజమును దిలకించియు సీత భీతిలియుగ ॥జ

(2) ఎందులకో కడువిషాదముదోపగ విభుడు వచ్చెననుచుర్
సుంద రాంగితన మేనువణకమది గుందుచుపతి దగ్గరుచుర్ ॥జ

సీ॥ చామరంబులువీవ ఛత్రమ్మునీడను రావేలనీవిప్డు రామచంద్ర
వందిమాగధ సూతవరులు స్తోత్రముచేయ రావేల శ్రీరఘు రామచంద్ర
పరిజనంబులుగొల్వ భద్రగజంబుపై రావేల రవివంశ వార్ధిచంద్ర
సామంతరాజులు సచివులుసేవింప రావేలముదమున రామచంద్ర
రధగజ తురంగములుముందు రా విదేల వేడుకలరేదు నభిషేక వేళనీదు
మోముముకుళించియుండె నిదేమియకట పరమకృపతోడ నెఱిగింపు ప్రాణనాథ

జోర:-తన్నిటులడిగిన సతిగని రాముడు ధరణిజ దెల్పెద వినుమా
నన్నడవికిఁబో నాజ్ఞాపించెను నాతండ్రియు నతివేగమున ॥జ

(2) సత్కులజాతవు ధర్మోపేతవు జనకుని ముద్దులతనయా
మత్కథ విధమెల్లను వివరించెద మాను మధైర్యము చెలియా ॥జ

(3) సత్యరతుడు నాజనకుఁడొసంగెను వరములు జనని కైకకు మును ప్రేమర్
సత్య నిబద్ధుని జేసియు నిపు డాసతి గోరిన దావరములవేగర్ ॥జ

(4) భరతుని కీరాజ్యంబిమ్మనియును పరమహర్షమున మరియు
సరగున కానకు బొమ్మనియును నను జనపతియానతి చేకొనియు ॥జ

(5) నారీమణి పదునాలుగేండ్లు నే నడవిని దిరుగగ వలయుర్
కూరిమి నినుఁవీడ్కొనఁగ వచ్చితి కోమలాంగి విను మరియుర్ ॥జ

సీ॥ కల్యాణిరో నేఁడె కానకుఁబోవుదు తండ్రియాజ్ఞనుబూని ధర్మమరసి
యొండు మాటాడక యుండుము నీవిట వచ్చెద వనవాసవ్రతముదీర్చి
అనుదినంబునునాదు జనకుని సేవింపు పావనీ జనయిత్రి భక్తిఁగొల్వు
మక్కువతో నాదు మాతలకెల్లను బరిచర్య లొనరింపు నరవినెపుడు
నిచ్చవ్రతములు సల్పుము నియతితోడ, పూనియిలువేల్పులకునదా పూజసేయు
ధర్మమేరక్షకంబని తలఁచిమదిని, కాలమెట్టులో కడపు భూపాలపుత్రి

హిం:-చందనగంధీ చారుముఖి నీవు డెందమున నను గలచుచునుండుము
సుందరాంగి నీమనమునగుందకు సుక్కకు వేగమె వచ్చెద ప్రియసఖి॥శ్రీ

(2) భరతశత్రుఘ్నులు ప్రాణసములునాకు వరతనయలవలె వారినిజూడుము
కఱకుమాటలెపుడు గినుకనాడకుము చులుకుగల్గింపకు భరతున కెప్పుడు ॥శ్రీ

(8) సరసగుణాన్విత జానకివిరుమీా సమయమెఱిఁగియు మెలఁకువ నుండుము
భరతుని మోలను ప్రస్తుతింపకునన్ను పురుషులోర్వ రితరపురుషులఁబొగడిన ॥శ్రీ

వ॥ ఇట్లను శ్రీరామవిభునిగని జానకీదేవి,

హిం:-నీమాటలువిని నంతనె నాకు నెంతయు మితిలేని నవ్వుదయించెను
ఏమిటుబల్కెదో ప్రాణేశా యీా బీదపల్కులను రాజకుమారా ॥శ్రీ

(2) తలిదండ్రులు పుత్రసోదరులెవరైన తనదు పుణ్యపాప ఫలములఁబొందరు
సలలితమృదుపదపద్మ నామనోహర సతియొకతెయె బొందు పతిభాగ్యంబును ॥శ్రీ

(8) ఇనవంశోత్తమ నినుబొమ్మనుటయు ననుబొమ్మనుటగా నరయుము మదిలో
జననీజనకులు తనయులుగారెపుడు వనితకిందునందు పతియేగతియగు ॥శ్రీ

(4) పతికి పతియేగతి యార్యసమ్మతమిది సచ్చరితా నినువెనుకొని వచ్చియు
హితముగ పరిచర్యల్ చేయుచుండెదప్రీతి సతతమునీమది రంజిల వేడ్కను ॥శ్రీ

(5) వచ్చెద వనములకు నినువిడజాలను మచ్చికతోననుఁ దోడ్కొనిపొమ్మ
ముచ్చటలర శేఁబచ్చికలందును ముఱియుచు నీతో బవళింతు సుఖముగ ॥శ్రీ

కాంభోజ — ఆది

ప॥ నాథా నామనవి విను నామనోహర రఘువర ॥నా

అ॥ నీదు చరణ కమలముల్ నొవ్వక నీముందు నడచి వనకంటకముల దీయుదునే॥నా

చ॥ నీరము వలయునన నెమ్మితో దెచ్చియిత్తును మారిమిళయనింప కొంగుబరతు నీకు
వారిజపత్రముల విసరుదు శ్రమముదీర మారసుందర నీమనసు రంజింపజేసెద ॥నా

(2) నమ్మతి నీపదభజనముసేయుచు కమ్మని ఫలముల నినుగూడి భుజింపుచు
నెమ్మదివనముల గ్రిమ్మరెద నలయక నమ్ముము నామాట నవకోనలరామ ॥నా

హిం:-అలరుచు నీవిడు వన్యఫలంబులె అమృతములైగొని యుండెదనాథా
తలపను తల్లిని దండ్రిని మరియు దలపను నాతోబుట్టువులను మది ॥శ్రీ

వ॥ అని వేడుచున్న సతికి శ్రీరాముండు, మారుబలుకకుండునెడ సీతాదేవి మఱియు

సీ॥ ననుదోడుకొనిపొమ్మ జననాథ చంద్రమా! యనుమానమందుట యనువుగాదు
శృంగారముగ నుండు బంగారు సౌధాల హంసతూలిక తల్పమందుఁ బండి

వర విమానములందు తిరుగుటకంటెను పతిపాదఛాయను పవ్వళించు
సుఖముకన్నను హెచ్చుసుఖముస్న్నదతికెని, బతిచెంత లేనట్టి బ్రతుకదేల
ఏల సౌభాగ్య సంపదలెన్నియున్నఁ, బతిని విడనాడి యున్నట్టి సతులకిలను
గాన నన్విడనాడ కోకమలనేత్రి నీభుజాదండముల నీడ నిలువుకొమ్ము॥

హిం॥ వివిధాశ్రియముల పతినిగొలుచునట్టి విధమెల్లనేర్పిరి జననీజనకులు
నవనవముగ నేర్వవలదునే నాథామరియు భయమింతలేదు ॥శ్రీ

(2) నీయంతవానికి నిదియొకభారమె నినువేడెద నాకోర్కె దీర్పుమనుచు
నా రూపామణి యశ్రులు విడువఁగఁ బతి యతిముదమున సతినూరార్చుచును॥శ్రీ

బిలహరి - ఆది

ప॥ కువలయదళనేత్రి కోమలిజానకీ ॥కు

అ॥ జవదాటక నామాటవినుము సఖి ॥కు

చ॥ అడవులకు జనుకోరిక విడువుము ఆదరమున నీపై ప్రేమను బల్కెద
కడుదుఃఖకరముకానన వాసము కర్ణకఠోరము మృగవిహగరావము ॥కు

(2) జలజముఖి నారచీరలుగట్టి యెపుడు జడలు ధరించియు జడివానగాలికోర్చి
యలజడి చాలగొని యాకలిదప్పులడస్సి నిలువలేవు బాల యతి సుకుమారివి ॥కు

(3) నేమములజరుప నెంతయు కష్టతరము నిర్మలగుణశీల నిత్యకల్యాణిదేవి
ఓ మానినీ నవకోసల రాముని నీమదిదలచుచు నెమ్మితోనుండుమా ॥కు

సీ॥ కాననంబులు బలుకష్టంబు లొదవించుఁ దరుణు లడవులందుఁ దిరుగనగునె ?
ఘోరరాక్షసులందు గ్రుమ్మరుచుందురు భూరిభీషణరావములుచెలంగ
జేరి మార్గములందు క్రూరమృగంబులు దిరుగుచుండును భయంకరముగాను
కండ్లుముండ్లెల్లెడఁ గలిగించువేదన గుళకరాళుల దారి దెలియరాదు
కసరుగాయలఁ గాలంబు గడపవలయు, తిరుగవలయును బగలు రాతిరియు ననక
చెట్టుబుట్టల గుట్టల చెంత మరియు గొండచరియల నేల బరుండవలయు

జోర:-అడవిని రాళుల ముండుల నీవెటు నడువఁ జాలుదువె బాలా
ఇడుములు బడజాలవు సుకుమారివి యిటనుండుము సుఖలీల ॥జ

(2) పోయివచ్చెద దుఃఖము మదిని బూనక యెప్పుడు నీ విచట
ఛాయక సేవింపుము నా జననిని భావింపుము నను మోదమునన్ ॥జ

(6) అనవినిజానకి యతి విషాదమున నశ్రులు కన్నులగారఁ
మనమున రోషము శోకము బెనగ నిట్లనియెను రామునితోడఁ ॥జ

దర్బారు - ఆది

ప॥ భారమా నను భరియింపనీకు ॥భా

అ॥ ధీరగుణోత్తమ రఘువీర శూరాగ్రేసరుడవయ్యు వల్కెదవిటు ॥భా

చ॥ జీవింపనేర్తునే నినువిడచి నీవశవర్తిని ననన్యమతినఁ
భూవల్లభతగునె విడువ భువనరక్షా నవకోసలేశ ॥భా

డోర:-నీవులేని లోకము నాకేలా నిర్మలాత్మ శ్రీరామా
భావింపుము పగవారిచెంతనే బడియుందునె గుణధామా ॥జ

(2) మారుపలుకక యుండెడు విభుగని మైథిలి యతికోపమున
శ్రీరామునితో మరి యిట్లనియెను చిత్తము తత్తరపడగ ॥జ

(3) భూరి బలాఢ్యుడవని నాజనకుడు కూరిమినను నీకిచ్చెఁ
ఈరీతిని భరియింపజాలవని యెరుగక మదిలో మెచ్చెఁ ॥జ

(4) పురుషపుంగవుఁ డవని తలచెను నిను భువనమోహనాయిటులు
తరుణీశీలుఁడవని మిథిలేశుడు పరికింపడుగా యెటులు ॥జ

(5) పురుషవరేణ్య మన్నింపుము వేగ తరలుము నను దోడ్కొనియె
కరుణామయ శ్రీరఘువర నీపదకంజము లనిశము గొల్చెదనే ॥జ

కాపి - రూపకం

ప॥ ప్రాణనాథ పాహి పాహి మాం ॥ప్రా

అ॥ దీనపోషణ వీరభూషణ శోకశోషణ ॥ప్రా

చ॥ పతిని బాసి బ్రతుకనేల చలమిదేల సన్నుతశీల ॥ప్రా

(2) గిరులదరిని తరులనీడ చరియించెద నిన్నుగూడి ॥ప్రా

(3) సెలయేరులజేరి నీతో జలక్రీడ లాడుచుందును ॥ప్రా

(4) నవతులసీమాలాధర నవకోసల పురవిహార ॥ప్రా

డోర:-నినుసేవింపక యుండిన ప్రాణమునిలువదు తనువున నాథా
వినుమా నీపద కమలంబులపై విడిచెద ప్రాణము గనుమా ॥జ

(2) అని తనవిభుని కౌగలించికొని హారిణము మాడ్కిని బెదరగ
ఘనుడు రాము డాజానకినపుడు గారవించి ప్రియమలరగ ॥జ

(3) కందియుండు నెమ్మోము నిమిరియు కన్నుల నీళులదుడిచి
యెందులకిటు వాపోయెదవో చెలి విడువుము శోకము పడతి ॥జ

(4) నిను సృష్టించెను వనవాసమునకు వనజభవుడు సుకుమారి
నినువిడచియు నే నుండగలనె మరి వినుమా రాజకుమారీ ॥జ

కాంభోజి — ఆది

ప॥ జనకరాజ వరపుత్రీ సదమలనిరుపమ శుభగాత్రీ ॥జ

అ॥ నిను విడతునె నే నీథాత్రి నిత్యకల్యాణి నీరజదళనేత్రీ ॥జ

చ॥ సుందరీమణి నీడెంద మెఱుగగ బల్కితినిటు
లిందునా జగమందున నిన్నెందును విడనాడను సఖి ॥జ

(2) దాసమనోల్లాసినీ నవ కోసల పురవాసుల్ బొగడ
శ్రీసతి నాతోడ నుండుము భాసురాంగీ పరమపావని ॥జ

తే॥ రమ్మని నాతోడఁ బయనమ్మ గమ్మువేగ ధనకనక భూషణాదులఁ దనివిదీర
నిమ్మమనదాస దాసీజనమ్ములకును ధరణి సురలను దనుపు ముదాత్తఫణితిగ

హిం:-సాధు జనాళి నాదరించియు ప్రీతి బీదసాదలకు పెన్నగలొసగుము
మోదముమీరగ బోవుద మిప్పుడె మోహనాంగి వనవాసము జేయ ॥శ్రీ

(2) తన విభుడెంతయుఁ బ్రేమను మన్నించి వనమునకును రమ్మనియును బల్క
మనమున బొంగుచు ప్రాణప్రియుండు పనిచిన పనులకు బోవఁగ నపుడు ॥శ్రీ

తోడి — ఆది

ప॥ నీవెంట వచ్చువాడ నిరతము మిము సేవించుచు ॥నీ

అ॥ దేవదేవ దీనరక్ష నీభావమరసి మెలగువాడ ॥నీ

చ॥ జనకసుతనుగూడి నడువ వనమార్గములను చక్కజేసెద
ననుదయగను మన్ననేడు నారదాది మునివందిత ॥నీ

(2) ఘనమగు ఫలకుసుమములను గొని తెచ్చి యిచ్చుచు ప్రీతి
చనువుగ మిమ్మిద్ది త్తమలర చరియించెద సుఖముగాను ॥నీ

(౩) నిదురజెందు తరుణమునసే నీచెంత నిలిచి ధనువుపూని
సదమలమతి గాచియుందు సర్వేశశ్రీశ నవకోసలేశ ॥నీ

దోర:-ఈరీతిని ప్రార్థించెడు ననుజుని నెంతయు ప్రీతినిజూచి
యూరడింపఁగ సామోక్తులను శ్రీరాముని కిటు లనె సౌమిత్రీ ॥జ

(౨) మును నన్నెప్పుడు అనుగ్రహించెదవు మనమలరగ శ్రీరామా
అనుమానముగల్గెనె నావయి నినువిడజాలను రఘురామా ॥జ

హిం:-సత్యపరాక్రమ శౌర్యదురంధర సద్గుణసంపన్న సౌమిత్రీ నా
కత్యంతప్రియుడవు పరమభక్తుడవు అనుజుడవు నిన్నురావలదందునే ॥శ్రీ

(౨) అనఘానీవిటు నిలువకున్న జనయితృలకు దిక్కెవ్వరు మరి
ఇనకులచంద్రా నినుగనిమైనను జననులుప్రాణముల్ దాల్చియుందురుగదా ॥శ్రీ

(౩) ధరణీశుడు వారిదలచునో దలపడో భరతుడు తల్లుల భరియించునో లేదో
నిరతమునీవైన నరయుచుండవలదా వరగుణశీలా విను నాపల్కులు ॥శ్రీ

వ॥ అనవుడు లక్ష్మణుండు

దోర:-వేనవేలుజనముల రక్షించెడు సుజ్ఞానాన్విత కౌసల్యక్
నేనామతి కాపాడువాడను దీనవత్సల నాయార్యక్

(౨) నాతల్లియు కౌసల్యరీతిగ నరసిదీనులఁ బ్రోచు
భీతిలేదు వారల కిటనెప్పుడు భూతశరణ్యా దయఁజూడు ॥జ

(౩) సోదరుడిటుబల్కిన శ్రీరాముం డాదరించి మోదమున
నీదుసుమిత్రుల నెల్లరవీడ్కొని నెమ్మినిరమ్మా వేగ ॥జ

వ॥ అని లక్ష్మణా ప్రచేతసులచే మనకొసంగంబడినయట్టి.

తే॥ విల్లునమ్ములు మనగురు లిల్లటముగ పూజచేయంగ నునిచితిఁ బోయి యిపుడె
వానిఁగొని తెమ్ము తమ్ముఁడా వారినడిగి యవిరొవనమున సహకారులగునుమనకు

వ॥ అని వచించిన.

దోర:- అన్నయానతినిగొని సౌమిత్రియు నతివేగమె జనియంత
కృన్నసహితులకు దెల్పియు గురువరు గృహముజేరి శీఘ్రమున ॥జ

(౨) విల్లునమ్ములు చేకొనివచ్చియు వేడ్కమీరఁ లక్ష్మణుడు
ఉల్లమలర శ్రీరాముని సన్నిధి నునిచెను బుధ సమ్మతుడు ॥జ

వ॥ అంత శ్రీరామచంద్రుడు తనగృహంబునం గల సర్వవస్తుసంభారంబులు బ్రాహ్మణోత్తములకు దానముజేసి కౌసల్య దాసదాసీజనంబులకు ధనకనక వస్తువాహనంబు లపరిమితంబుగానొసంగి త్రిజటుడను బ్రాహ్మణునకు కోరినంత ధనం బిచ్చి సీతతోడ.

డోర:-సకలదానములు జేసియు ముదమున జనకుని యనుమతి వేడ
అకలంకాత్ముడు రాముడు వెడలెను అవనిజానుజుల తోడ ॥జ

(2) గగనచరులుగన జాలనిధరణిజ కాలినడక రాగనగ
వగచుచు గన్నులజలములుధారగ వర్షించిరి ప్రజ లతిశోకమున ॥జ

(3) స్యందనంబుపై జానకిఁగై కొని ఛత్రచామరాలమర
పొందుగబోవక నడచెద రహాయని పురవనితలు కై కనుదూర ॥జ

(4) జనులాడెడు వాక్యంబులను విని మదిచెదరక యపుడు
జనియెముదంబున దినకరతేజుడు జనకునిడాయగ మరియు ॥జ

(5) ఘనునిసుమంత్రుని గని యనెరాముడు నీ తనయుడు వనమునకరుగన్
అనఘావచ్చినవాడని దెల్పుము జనకునితో వేగమునన్ ॥జ

(6) కన్నులనీళులుగార సుమంత్రుడు గద్గదకంఠుండగుచున్
అన్నరపతితో ననె నిటునీదగు ఆజ్ఞవేచు రాఘవుడు ॥జ

(7) కానకుబోవగ నున్నవాడు జనకజలక్ష్మణులఁ గూడి
భూనాయకయన యీపల్కులువిని పొక్కుచు సూతునితోడ ॥జ

(8) నాదుపత్నులన్ దోడ్కొనిరమ్మా యందర నిచటికి నిపుడె
సాదరమున వారలతోనా సత్పుత్రుని గందునునేడే ॥జ

9) కోసలసుత సహితంబుగనప్పుడు దశరథసతు లందఱును
ఆ సుమంత్రుడు దోడ్కొనివచ్చెను నతిరయమున ముందఱను ॥జ

(10) రామచంద్రుని రమ్మనిబంచిన రయమున రాముడురాగన్
హేమపీఠమునుడిగ్గి దశరథుండెదురేగుచు మూర్ఛిలిపడినన్ ॥జ

(11) రామలక్ష్మణులు పరుగునవచ్చి ప్రేమను తండ్రిని వేగ
హేమరత్నపర్యంకముఁ జేర్చిరి ధీమంతులు కడుదుఃఖమున ॥జ

(12) సుందరి సుచరిత జానకి నృపవరు జూచియు శోకింపగను
అందరు గొల్లనియేడ్చిరి దుఃఖంబంతకంత పెంపొందగను ॥జ

వ॥ శ్రీరామ లక్ష్మణులు, శైత్యోపచారంబులుజేయ మూర్ఛదేర శ్రీరాముండు జనకునికి మ్రొక్కి,

సీ॥ తండ్రి! నీయానతి దండకాటవికేను బోయెదనన్న నీభూమితనయ
వెంటవచ్చెద నంచు విలపించి వచ్చిన దెంతచెప్పిన నిల్వదెడరునిండ
సౌమిత్రియునునట్లె చనుదెంచె నాతోడి వీరి నిర్వురఁగాని కారడవుల
వసియింపఁ బోన్నాజ్ఞ యొసఁగుము నాకిప్పుడొండొద్దియును వేడనో యిలేశ
యనిన రామునిగని విభుఁడనియె నిట్లు పుత్రకా నినుఁబాసి యీపుడమినింక
బ్రతుకఁజాలను ప్రాణముల్ వాయు నిజమునాయనా! నమ్మ సత్యమ్ము నాదుపల్కు

తే॥ కైకమాయకు వశుఁడైతి గానునన్ను ధిక్కరించియు గొనురాజ్య మక్కజముగ
వనమునకుఁ బోవవలదునా తనయ వినుము తల్లులకు నాకు నెల్లర కుల్లమలర.

వ॥ అనవుడు,

జోర:-కల్లరివని నిను జనులు వచింపఁగ నొల్లను రాజ్యము వినుమిూ
యుల్లంఘున చేయఁగ నీయానతి నొల్లను నిక్కముగనుమిూ ॥జ

(2) సత్యము బలికితి నాపినతల్లికి సాధుచరిత్రా వినుమా
సత్యముదప్పను బోదునడవులకు సార్వభౌమసదయ గనుమా ॥జ

(3) ధృఢ మనస్కుఁడయి బల్కు రామునిగని వెడలెడు నిట్టూర్పులను
బడియుండెనుదా రాజపుంగవుఁడు పిడుగువడిన విధమునను ॥జ

ద్విపద:-ధరణీశ్వరుఁడు పరితప్తుఁడై వగవ । మరి సుమంత్రుడుఁ దీనమానసుండగుచు।
పటపట పండ్లుదా బలుమూలుకొటికి । కుటిలఁగైకయిఁగాంచి క్రుద్ధుఁడై పలికె।
పాపివి! కులహంత్రి! వంచకురాల! । భూపాలునిటు చేయబోలునె చెపుమ । కలఁతఁ
జెందదుతేఁడు జలనిధివలెను । చలనమొందదు కొండ చాడ్పుననితడు । అలయించి
తివిగదా యోర! యీవిభుని । వలలోనవైచితి వసుధేశునిపుడు । ఈతలంపెటు
లొచ్చెనే కైకనీకు । సీతల్లిగుణములె నీవునొందితివి । చేరి నీజనకుఁడుచీమలభాష।
సారెకువిని నవ్వసరస నీతల్లి । ఏటికినవ్వితి వెఱుగింపుమనిన । బోటినేఁ దెల్పగాఁ
బొసఁగదు దెల్ప। బ్రతుకనునేనని బల్కినయంత । బ్రతుకుము చావుము పనిలేదు
నాకు । దెలుపుము నవ్వేల తెలియంగననిన । బలుకక గురునాజ్ఞ పాటించిమరియు।

స్థిరమనంబుననుండె ధీరుడై యతడు । నీతల్లిరీతిని నీవు నొందకుము । భూతలపతి యుక్కి బుద్ధిదలంపు । అపకీర్తి బొందకు మవనిలో నీవు । విపరీతబుద్ధియు విడువు మీ యిపుడు । రామచంద్రున కిమ్ము రాజ్యమ్ము ప్రీతి । నామనవిని విను నాతల్లి కాన.

జోర:-భయమున నయమునఁ బల్కె కైకయువల్కెదు గ్రుక్కెదునంత
భయముగదురదు ముఖరుచిదప్పదు భావముచెదరదాకింత ॥జ

(2) పంతమువీడని కేకయసుత దుర్భావముగని దశరథుడుఁ
మంత్రిసత్తముఁ సుమంతుఁగనుఁగొని మరలఁబల్కె నిటుఖేదమునఁ ॥జ

(3) చతురంగబలంబులు గొల్వగ పురిఁగల జనగణములతోడ
అతులితముదమున రాముని దోడ్కొని యడవికరుగుమీ వేగ ॥జ

(4) కొడుకునితోడ పాడరినరాజ్యము గొట్టుకొననిగ్గె కేయీ
కడువడి నేనువచ్చెదనడవికి గాకున్నను జచ్చెదవినుమీ ॥జ

(5) అనవుడు దశరథుఁగనికై కేయియు అదరిపడుచు నిట్లనియె
జనధనరహితంబగు నీరాజ్యము గొనవలఁతునె యన కిటులనియె ॥జ

(6) వినుమీవంశంబున సగరుడు తనయుని బనుపలేదె వనమునకుఁ
ధనధాన్యబలానీకముతోఁ బనిచెనె దెల్పుమునాకుఁ ॥జ

వ॥ అను కైకేయి వచనంబులకు తేఁడు కటకటంబడుచుండ, వృద్ధుండైన సిద్ధార్థుడను మంత్రి క్రోధారుణితలోచనుండై కైకేయి కిట్లనియె.

సీ॥ దుష్టుఁడౌ తనయు బోఁదోలిన సగరుని సాటి చెప్పెదవేల చానయిట్లు
ఏపాపలేశమ్ము నెంచి రామునియందు నడవికంపెదవె యన్యాయవృత్తి
నీవంత మెడలించి నిత్యనిర్మలుడైన పతి బ్రతికింపుమో పడతిమిన్న !
పరమపావను రాము పట్టభద్రునిజేసి యపకీర్తి పాపుకొమ్మతివయిట్లు
లందఱిని కష్టపెట్టి నీవేమి మూటగట్టుకొని పోయెదవు చాలు [illegible]దయ !
విభుఁడు వృద్ధుఁడు రాజును వెతలబెట్టి యేమిసుఖ ముండెదవు [illegible]వదన !

వ॥ సిద్ధార్థుండిట్లు పలుకుచుండ దశరథుండు,

జోర:-ఎందరు బుద్ధులు తెలిపిన విన వీ వెంతటి మూర్ఖవె [illegible]
యందరు ఛీఛీ యనినను లజ్జబొందవు ధీమస మెంతొ

వ॥ అనవిని, రాఘవుండు.

తే॥ ఏలయిటు వల్కెదరు మీర లెల్లరిపుడు, గహనముల కేగుచున్నాఁడఁ గాన నాకు
నారచీరలనిచ్చి నన్నంపుఁడయ్య భరతు డీరాజ్యమేలును భద్రముగను.

తే॥ జానకిని లక్ష్మణునిగూడి చని యడవులఁ బదియునాల్గునేండ్లుండి పదిలముగను
బోయివచ్చెద దీవింపుమో యిలేంద్ర! పిన్నతల్లికి మదిలోన ప్రేమగదుర.

వ॥ ఇట్లు కృతనిశ్చయుండగు తనయుంగని,

తే॥ నాయనా, యుండు మీనాఁడు నన్ను విడక
యొక్కదినమైన సౌఖ్యమ్ము నొందఁ గాంతు
భానుసమతేజ నాపాలి భాగ్యరాశి
రఘుకులాంబుధిచంద్ర యో రామచంద్ర.

వ॥ అనవుడు శ్రీరామభద్రుండు.

జోర:-విను నేనిఁక నొక నిముస ముండనని పినతల్లికిఁ దెల్పితిగానన్
ననుఁబంపుము తడయక యో జనకా నాపై దయతో వేగన్ ॥జ

(2) కాయలు గడ్డలు ద్రవ్వి తినుచును కాననమున బ్రతుకుటకు
ధీయుత యేటికి వేనలుమాకు దెల్పుము భ్రమయేటిది నీకు ॥జ

(3) ఘనమగు నారలచీరలు గంపయు గడ్డపారయును నిపుడే
వనసంచారంబునకిమ్ము ప్రీతిని వలదు వలదు బలకోశములు ॥జ

(4) అని యిటు రాముడు బల్కుచుండగా వినికైకయు వేగమున
మనమున పొంగుచు నారచీర లాఘునులకొసఁగె మోదమున ॥జ

(5) రామలక్ష్మణులు నారచీరలను రయమునగట్టుక నిలువన్
భూమిజాత యవి గట్టనేరక రామునిజూచుచు నిలువన్ ॥జ

ద్విపద:-అంత శ్రీరాఘవుఁడా నారచీర
వింతగాఁ జీరపై వెతగూరఁగట్టె
అదిగని యారాణు లాహాయటంచు
ఇదియేమి శ్రీరామ యీసీతనిపుడు
వనవాసమునకు గొనిపోవ తగదు
నినుబొమ్మనెను తేదు నెలతమైథిలిని

సెవరు పొమ్మని రిదియేమి యన్యాయ
మవనిజ నిటనుంచి యరుగవే తండ్రి!
ఈమెం గాంచుచుం గొంత యెడరు మానెదము
ప్రేమజూడుము మమ్ము రామశ్రీరామ.

వ॥ ఇట్లు పల్కు తల్లులపల్కుల నాలకింపక, వల్కలంబులు గట్టినంగని వసిష్ఠుండు కైకేయింగని ధిక్కరించుచు,

జోర:-వరమడిగెడు తరి రామునొక్కని వనము నంపగమగోరి
ధరణిజ కిటు లీ నారచీర లిడ తగదు దుర్మదాంధకారీ ॥జ

(2) నీతిగాదుపోపో కులఘాతకి పాతకి ఛీ ఛీ మరి నీ
భూతలేశునిటు గారియబెట్టెదు పుడమిజనలార్వగ దుర్బుద్ధి ॥జ

(3) నీకోరిక దీర్పడు నీభరతుడు నిజమునమ్ము నామాట
రాకుమారు శ్రీరామచంద్రుని రాజుగజేయు సుబోటి ॥జ

(4) అనియిటుబల్కు వసిష్ఠువాక్యములు విని దశరథనృపుడపుడు
కనలుచు కైకేయిని దిట్టుచుమరి కనికరమున నతఁడపుడు ॥జ

(5) కోరితివే సీతను వనులకుబంపను క్రూరరాక్షసీ చాండాలీ
నారీమణి భూజాతకునీవు నారచీరలియ్యగ ద్రోహీ ॥జ

(6) వలనుగ పదునాలుగేండ్లకు గావలసిన భూషణ వస్త్రములన్
గలయంగ దెమ్మన నంత సుమంత్రుడు గైకొనివచ్చిన నృపుడు ॥జ

(7) అమ్మాజానకి రమ్మా ప్రియమున పొమ్మా రామునితోడ
సమ్మతిగొను మీనగలు వస్త్రములు సాధ్వీమణి యనవేగమున ॥

(8) సంతోషంబున మ్రొక్కుచు భక్తిని సరిగవలువ లవిగొనియు
అంతట ముదమున కొన్ని ధరించియు ఆనందించెను ధరణిజయు ॥జ

(9) తండ్రికి మ్రొక్కియు నిండుప్రేమను తరలిపోదుమని బలుకన్
వేండ్రింబగు నామాటలు చెవిబడ వెంటనెమూర్ఛిలె నృపుడంతన్ ॥జ

(10) తల్లులందరికి వలగొని మ్రొక్కుచు ధరణిజతో రాముండు
తల్లిపదమ్ములవ్రాలి యిట్లనియె తల్లడమందకు మమ్మా ॥జ

(11) పోయివచ్చెదను జననీ కానకు పుణ్యశీల నేనిపుడు
ప్రాయకజనకుని సేవింపుము మరి బహుంవృద్ధుడు దుఃఖితుడు ॥జ

(12) అనిబల్కెడు శ్రీరాముని జూచి అధికము శోకముమీఱ
తనయా నేనెటుజీవింతునురా నినుజూడక యీ కనుల ॥జ

(13) ఘోరుఘోరుమని యేడ్చుచు హా పుత్రాయని దూరుచు తనవిధినపుడు
సారెకు రామా రామాయనుచు పేరెలుంగున పిలువగను ॥జ

శంకరాభరణం - ఆది

ప॥ నిన్ను వేడెద జనకా నా విన్నపమాలింపుము దయ ॥ని

అ॥ యెన్నడు దుఃఖమెట్టిదో యెరుగని నా కన్నతల్లిని గారవించిబ్రోవుము ॥ని

చ॥ యిరవుగ నుగ్రాటవిని నావరసుతు డెటులుండునోయని
పరితపించుచున్నయీ పరమపావని వృద్ధురాలను కనికరింపుము ॥నిన్ను

(2) దిక్కుమాలి నే కైకచేత జిక్కువలసెనని యేడ్చెడు
అక్కట నాజననిని ఆదరించి మక్కువజూడు తండ్రీ ॥నిన్ను

(3) నవకోసల పురవరముననను నారీమణులు సద్గుణయుతులు
అవనీశ్వర నాతల్లుల నెల్లర అరసి భరియింపుము ప్రీతి ॥నిన్ను

జోర:-మునివేషధరుండై బల్కెను పల్కులు వినియును సుతుగని నృపుడు
అనఘుడు సతులును నతిదుఃఖంబున హా రామా రామా యనమరియు ॥జ

(2) అమ్మా నీవిటు పలవింపకుము నెమ్మది మీఱగనుండు
అమ్మావచ్చెద శీఘ్రంబుననే నడలకు భీతిని విడుము ॥జ

(3) సుతుడిటు బల్కగ శోకమడంచుక యతిప్రేమను కౌగిటజేర్చి
హితముగ శిరమును మూర్కొని రాముని నిలసుఖంపుమని దీవించి ॥జ

(4) గ్రక్కున మ్రొక్కియు నిలచినసీతను నక్కునజేర్చియు మక్కువను
చక్కగపతికి సేవజేయుము సాధ్వీమణి ప్రియమునను ॥జ

(5) పతిమన మెరిగించుచు ముదమున హితమొనరించుచు నెపుడు
అతిశాంతము శీలము గలిగి మెలంగుట సతులకు భూషణమదియు ॥జ

(6) భోగభాగ్యములు గల్గినప్పు డనురాగము వినయముతోను
బాగుగ పురుషుని జూచుస్వభావము పడతులకెల్లను వినుము ॥జ

(7) సిరులు దొలంగిన సమయంబునను తరుణులు ప్రాణేశ్వరుని
మరిమరి దూరుచు గుణవిహీనలై చరియించెద రీ భువిని ॥జ

(8) ఘనముగ రాజ్యము సుఖముం బోయెనని వనటజెంది నాసుతుని
చనువుమెరసి చులకన జూడకు వనమున నెపుడునుగాని ॥జ

(9) ఉత్తమకులమున బుట్టినదానవు సుర్వీతనయా మరియు
చిత్తమందున నొవ్వక యెప్పుడు సేవింపుము నీపతినెపుడు ॥జ

హిం:-అనవిని జానకి యమ్మా నేను అటులె యొనర్తును మీయానతిని
మునుదెల్పిరి నాజననీ జనకులు వినిపించితిరి కూర్మిని మీరు ॥శ్రీ

(2) అనురక్తిని నావిభుని గొల్చెద ననార్యులతో నను సరిజేయకుమా
జననీ ధర్మము విడతునె నేను చంద్రునిబాసియు చంద్రిక యుండునె ॥శ్రీ

(3) ప్రకటితముగను వీణ మ్రోగునా పరగగ తంత్రులు లేకుండగను
శకటము చక్రములేకయె సాగునా సత్యము సతులకు పతియాధారము ॥శ్రీ

పంతువరాళి — రూపకం

ప॥ పతిభక్తి పణతులకు పరమశుభము జగతిలోన ॥ప

అ॥ సతత మానంద మొసగి సర్వసౌఖ్యములనిచ్చు ॥ప

చ॥ వరతపోధనులైన పతివ్రతా శిఖామణులు
అరుంధతి యనసూయ దేవి వరలుచున్నవారు స్థిరలై ॥ప

(2) పతియే పరదైవమని భావించి గొల్చుచు చంద్రమతి
సావిత్రియు దమయంతియు భాసిల్లిరి ॥ప

(3) భువనరక్షకుడౌ పుండరీక దళాక్షుని
నవకోసలరాముని నాప్రాణనాథు సేవింతు ॥ప

దో॥:-సౌమిత్రియు తనజననికి మ్రొక్కగ నాసాధ్వీమణి వేగమునన్
ప్రేమను తనయుని శిరమును మూర్కొని ప్రియవచనము లిటుబలికెన్ ॥

(3) వనవాసమునకు నినబుట్టించెను వనజభవుడు నాతనయా
మనుకులవర్ధన అన్ననుగూడి జనుమడవికి సుజనవిధేయ ॥జ

తే॥ అడవిసాకేతపురముగ నరయుమయ్య తండ్రియని రామచంద్రుని దలపుమయ్య
జలజముఖి సీత నన్నుగా దెలియుమయ్య పోయిరావయ్య యన్ననుబాయకెపుడు

జగన్మోహిని - రూపకం

ప॥ సేవింపుము శ్రీరాముని శ్రీజానకిని ॥సే

అ॥ భూవలయోద్ధారకుడౌ పురుషోత్తముడని ॥సే

చ॥ ధర్మకంటకులగు దనుజులను దండించి
ధర్మసంస్థాపనమునకు ధరపుట్టిన పరాత్పరుడని ॥సే

(2) నిగమాగమ గోచరుని నిత్యనిరంజనుని ఘనుని
అగణిత గుణాలంకారుని అప్రమేయుడని ॥సే

(3) భవకల్మష పరిహారుని భవపద్మజ పూజితుని
నవకోసల రఘురాముని నారాయణుడని ॥సే

వ॥ నాయనా, అన్ననునుసరించి మెలంగుచు రంజిల్లుమని దీవించెనంత.

జో॥:-అత్తలు మామయు దీవనలీయఁగ చిత్తమలర భూతనయ
భర్తృయానతిని నరదమునెక్కెను భర్మాభరణములొప్పలుగ ॥జ

(2) ధరణీశుడు సీతకొసంగిన వస్త్రభూషణావళులు
వరకవచంబులు విల్లునమ్ములును వావిరి రథమున నిడఁగను ॥జ

(3) ఎల్లపౌరులును దుఃఖభరంబున తల్లడిల్ల రఘువరులు
ఉల్లముకలఁగఁగ నారోహించిరి యుత్తమమగు నరదమును ॥జ

(4) సీతయు రాముడు లక్ష్మణులప్పుడు జేర శతాంగము వేగ
సూతుడు పగ్గంబుల పట్టుక కడు భీతియుశోకము మీర ॥జ

(5) తురగంబుల నదలించుచు రథమునుదోలగ మంత్రివరుండు
పౌరజనులు పోవలదువలదని పొక్కుచు తల్లడపడుచు ॥జ

(6) తురగములను వడివడిగా నిప్పుడు తోలకుమయ్య సుమంతా
నిరుపమతేజుని రాముని జూడనిమ్ము మమ్ముధీమంతా ॥జ

ముఖారి — చాపు

ప॥ రామా జగదభిరామా మంగళనామా రామా శ్రీరఘురామా ॥రా

అ॥ ఈమహి నినుబాసి యెటులుండనోర్తుము భూమిజప్రియకర పుండరీకాక్ష ॥రా

చ॥ మందస్మితచారు వదనారవింద కందర్పశతకోటి సౌందర్యగాత్ర యిందీవరశ్యామ
యినకులాంబుధిసోమ యిందుండ జాలమో యిభరాజగమన ॥రా

(2) పరిపరివిధముల పరికించిమమ్మెల్ల కరుణను బ్రోచెదవు కల్యాణగుణసాంద్ర
యొరుల కష్టముల్గని యోర్వజాలవు నీవు సరిలేరు నీకిల సకలలోకాధార ॥రా

(3) ఛాయవలె నిన్ను జానకియనుసరించె సౌమిత్రిధన్యుఁడు చనుదెంచు సీతోడ
శ్రీయుతమూర్తి నవకోసలరామ జేరివచ్చియు నినుసేవించు చుందుము ॥రా

వ॥ ఆబాల వృద్ధసహితంబుగ రామవియోగంబు సహింపలేక రథంబున కడ్డంబై.

డో॥ర:-రామా రామాయనుచును పౌరులు రథము బట్టుకొనియప్పుడు
మోము జూపుమో శ్రీరామాయని వేమరుపలవించుచును ॥జ

(2) క్రమ్మరనిన్నెటు కందుము మేమిక కమనీయ శుభాకరరామా
నెమ్మని వెనుకొని యశ్రులు గురియగ నెల్లరువనటను గుందా ॥జ

(3) అడలుచులేచి దశరథుండుమరి అడుగులు తడబడ నప్పుడు
గడగడ వడకుచు గృహమువిడచితా వెడలివచ్చె బహిర్ద్వారంబునకు ॥జ

సీ॥ ఆసమయంబున నంతఃపురాంగనల్ రఘురామ మాగుండె రాయిజేసి
బోయెదవే తండ్రి భూధవుండదయుఁడు కైక కధీనుడు కాముకుండు
నీమోముఁ జూడక మేమెట్లు బ్రతుకుదు మనిగొల్లుమని యేడ్పుల తిశయిల్ల
దశరథుండును తేరు తరలిపోవుటజూచి నిలుపుము రథమని పలికె నిట్లు
ధీరుఁ డనుజుఁడు సౌమిత్రి చేరికొల్వ అమ్మబంగారుబొమ్మ సీతమ్మతోఁడ బోవు
చుండెడు రాముపూర్ణేందురమ్య ముఖముగాంచెద గడసారి ముదముమీర.

తే॥ దశరథుండిట్లు పలవింప ధైర్యమెడల రామచంద్రుడు పదమన రథము వేగ
నిలుపు నిలుపని వృద్ధుడౌ నృపతిపనవ, వెరవు దోచకసూతుండు వెతలజెందె.

డో॥ర:-రామచంద్రుడిటు వేగిరింపనటు రథముగడపె సూతుండు
భూమీశుఁడు పరతెంచుచుఁ గడువడి పుడమిని బడిమూర్ఛిలెను ॥జ

(2) ఘోరుననేడ్చుచు కౌసల్యయు దాఁ తేరువెంట బరువిడుచు
శ్రీరఘువర నాముద్దుకుమారా యేరీతిని సైరింతునురా యనుచు ॥జ

(3) తల్లీ జానకి తనయ లక్ష్మణా ధరనెటు నిల్తునరో యనెడు
తల్లిని పలుమారుజూచుచు రాముడు తల్లడపడెఁ దా మదినిగడు ॥జ

వ॥ అంతట దశరథుండు మూర్ఛందేరి కొంతవడిపరువిడుచు పడుచు లేచుచు రాముని
జేరబోవుచు.

హిందూస్థానితోడి - ఏక

ప॥ హా నగధీరా హా సుకుమార హా నే నెటుసహింతురా హా రఘువీరా ॥హా

చ॥ మునునే నెంతటి ఘోరపాపమును జేసితిరా నినుబాసియు నిలనే నెటుజీవింతురా ॥హా

(2) నిలునిలునీతో వచ్చెదరా తాళలేనురా పలుకరా
నవకోసలపురవరా నాకుమారా ॥హా

వ॥ అనికౌసల్యా దశరథులిరువురు బిట్టు పలవించుచు మరియును,

సీ॥ హా రామ జయరామ హా జగదభిరామ హా రఘుకులరామ హా కుమార
హా వార్ధిగంభీర హా మేఘునుశ్యామ హా మనోహరరామ హా కుమార
హా సద్గుణస్తోమ హా రణాపనిభీమ హా యిష్టజనకామ హా కుమార
హా జానకీరామ హా రవికులధామ హా మానినప్రేమ హా కుమార
యీవువిడనాడిపోవ మాకేదిదిక్కు వనమునకు వచ్చెదము నేడు మనములలర
మమ్మునోడ్కొని పొమ్మిప్డు మరలలేము రామ సుగుణాభిరామ శ్రీరామరామ.

జోర:-జననీజనకుల శోకోద్రేకము గనియు గననియటులు ఘనుడు రాఘవుఁడు
ధర్మబద్ధుడై కడువడినడుపుము రథమనగ ॥జ

(2) వెనుకొనివచ్చెడు జనసమూహములగని రావలదని నుడువుచును
ఘనజవమున హయములదోలియు జనిరతివేగంబునను ॥జ

(3) దూరమువెనుకొని పోవగరాదని తోడివారు వచియింప
ధారుణీశ్వరుఁడు కౌసల్యయు దాదడవుగ మార్గమునందు ॥జ

(4) నిలబడి రాముని జూచుచునుండెను జలము కన్నులగారగ
తలిదండ్రులకు మ్రొక్కుచు రథమున బలువేగము రాఘవులరుగగ ॥జ

వ॥ అంతఃపురాంగనలెల్లరు రాముని బేర్కొని,

యదుకులకాంభోజి - చాపు

ప॥ ఏమిసేయుదమకటా యెవరు దిక్కటమనకు రాముని బాసితిమి ॥ఏ

అ॥ ఈమహిలో మనకేలా బ్రతుకింక కామితఫలప్రదుని కటకటవిడచి ॥ఏ

చ॥ తనమీది తప్పుల నెవ్వరైన బల్కిన మనమువ నుంచడు గినుకజెందడు నెప్పుడు
తనుగన్నతల్లివలె మనలసేవించును అనఘుని పుణ్యుని ఘనుని విడనాడితిమి ॥ఏ

(2) పరుల సుఖదుఃఖములు భావించుతనవని భానువంశోత్తముడు పరమదయాళుఁడు
వరనవకోసలవాసుని కృపగల్గ నిరతిశయ సుఖముల వరలుచుండుముగాదె ॥ప

వ॥ ఇట్టి రోదనధ్వని మిన్నుముట్ట దశరథుండు దుఃఖానలంబున గ్రాగుచు శతాంగ పరాగంబు గానవచ్చువఱకు జెప్పలార్పక రామునుండుపోవు మార్గంబునఁజూచుచు ధూళిమాయ మైనంత భూమిపై బడియె.

జో॥:-పురమంతయు భయకంపం బడరగ బొక్కుచుండె ఘోషమున
తరుణులు పురుషులు గృహకృత్యంబులు మరచిరి బలుదుఃఖమున ॥జ

(2) కరితురగంబులు మేత దొరంగియు కన్నీళులు గార్చుచు నుండెగా
తరణిశశాంకుడు తారాగణములు తలక్రిందులు నై చరియించెగా ॥జ

వ॥ కొంత వడికి కౌసల్య తెప్పరిలి,

తే॥ రామచంద్రుండు దండకారణ్యమునకు భూమిజాతను దోడ్కొని పోవుచుండ
జూచుచుండియు బ్రతికితి చోద్యముగను వ్రయ్యకున్నది నాగుండె వజ్రమయము

తే॥ అంత నట మూర్ఛపడియున్న యవనిపాలు జేరి కౌసల్య కైకయు శీఘ్రముగను
బట్టి యెత్తినఁ దెలివొంది పార్థివుండు కైకఁగనుఁగొని బలికెను గద్దరించి,

జో॥:-నను అంటకు దురాత్మురాల ఛీ నినువిడనాడితి పోపో
అనఘుని రాఘవు నడవికిబంపిన చెనటి దుష్టవు ఛీఛీ పో ॥జ

(2) కోసలేశసుత యింటికి నన్ను గొనిపొం డతివేగమున
గాసిలె ప్రాణము నిలువజాలనన నాఘనుని జేర్చిరట శీఘ్రమున ॥జ

(3) అంత దశరథుం డధికతాపమున అటునిటు పొరలుచు నపుడు
అంతములేని దుఃఖమునాకిది హా రామాయనుచును మరియు ॥జ

(4) కనికరమున నను కౌసల్యా నీ కరమున దాకుము వేగ
ఘనమగు రాఘవియోగ తాపమున కనులు దెలుపఁజాలను గనుమా ॥జ

వ॥ అనిన రాజేంద్రుని స్పృశించుచు శ్రీరామునిదలంచి,

పున్నాగ – చాపు

ప॥ నాపాలిభాగ్యమా నా పెన్నిధానమా నాకూనరఘురామ ॥నా

అ॥ పాపపుకైక నిన్నడవిపాలుచేసె నేపగిదిభరియింతు యీదుఃఖమకటా ॥నా

చ॥ రామచంద్రాయని నెవరినిపిలుతునే రామశ్రీరామభద్రా
భూమీశునాజ్ఞచే బోయియాయడివిలో భూమిజనీవేమి భుజియించిబ్రతికెదరో॥నా

(2) శరభశార్దూలాది సకలమృగంబులు చరియించుచుండ నడవీ
ధరణిజభీతిల్ల సౌమిత్రియుబెదర వరనవకోసలధామ యెటులుందువో ॥నా

ఢోర:-హారామా నాపుత్రరత్నమా అడవిజేరితివె తండ్రీ
శ్రీరామాయని విలపింపగనపుడు చెంతసుమిత్రయుజేరి ॥జ

సీ॥ ఘనుడు శ్రీరాముడు వనమునకరిగిన విలపింపనేలమ్మ వీరుఁడతఁడు
ఎందున్న భయమేమి యింద్రానుజనిభుండు శూరుండు ధీరుండు సుఖకరుండు
అడవిమృగంబులు నతనిచెంతకురావు పుడమిజకేలాటి జడుపులేదు
కాకుత్స్థతిలకుండు కల్యాణగుణనిధి పరమపావనుడు నీ వరసుతుండు
తమ్ముడును రాముడడవిని దాజరింప ఘోరరాక్షసులెల్లరు గూలిపోర
మానివరులకు సంతోషమానుగాదె కుశలుడై వచ్చు నీవిట్లుగుందకమ్మ

తే॥ వీరమాతవు నీవిటు వెతలబడకు ధరణిజను లక్ష్మణునిగూడి మరలనిటకు
వచ్చిపాలించు రాజ్యంబు వనరుహాక్షి పిడుతువానందబాష్పముల్ వేడ్కనపుడు

ఢోర:-కూరిమితోడ సుమిత్రయు తన్నిటు లూరడింప కౌసల్య
మీరినదుఃఖము నణచియుమదిలో శ్రీరామా యనుచుండెనుప్రేమ ॥జ

వ॥ ఇట సుమంత్రుడు రధమునడుప

ఢోర:- పల్లెలు వనములు పట్టణములు జనపదములు దాటుచుబోవ
నెల్లవారు శ్రీరామునిజూడగ నెదురువచ్చి రటవేగ ॥జ

(2) రామచంద్రుని సుందరమూర్తిని రమణీమణి మైధిలిగనియు
కామితార్థము లొనగుచుండెడు కల్యాణగుణనిధుల్ వీరనియు ॥జ

(3) ఈ మహనీయులనెటుపంపిరి కానకు ఏమిది యన్యాయంబు
భూమీశుండతి కాముకుడౌటను బుట్టెనిట్టి యకృత్యంబు ॥జ

(4) ఎంతటిపాపిని దుష్టురాలు మరి యెంతద్రోహిని యాకైక
పంతగించి యిటు పరమదయాళుని బంపెను రాముని దుశ్శీల ॥జ

(5) అచ్చటచ్చట జనులీవిధమున ఆడెడుబల్కులు వినుచు
హెచ్చుగుగిరులను వనములఁగనుచు విశ్వమోహనుడు నగుచు ॥జ

(6) కోసలదేశముదాటితిమా కైకమ్మకు గోరికదీర సుమంతా
వాసిగ గంగాతీరము డాయవచ్చితిమా యనసంత ॥జ

వ॥ సుమంత్రుడు స్వామీ! మనదేశముదాటి తమసానది జేరవచ్చితి మనవుడు రాముం డానదీతీరంబున రథముడిగ్గి, యొక వృక్షమూలంబున గూర్చుండి, లక్ష్మణా మన వనవాసంబునకిదియే ప్రథమ దివసంబని, యచట నిరువురు సంధ్యావంద నముదీర్చి సీతా సహితంబుగ నుదకంబుద్రావి, సూతా గుఱ్ఱంబుల చక్కగ నాశ్వాసింపుమని యారాత్రి యందుండ నిశ్చయించి, లక్ష్మణుం డమర్చిన పర్ణ శయ్యపై గండశిలదిండుగాగొని సతితో శయనించెనప్పుడు రాముని వెనుకొని వచ్చిన యయోధ్యా నగరవాసులెల్లరు నందందు బరుండి నిద్రాపరవశులైరి. లక్ష్మణ సుమంత్రు లిరువురు జాగరూకులై సీతారాముల సేవించుచుండ మూడవ యామంబున రాఘవుడు మేల్కాంచి సుమంతా! రథముతెమ్ము; పురవాసుల కెఱుకపడక యరణ్యంబుఁ జేరుదము వారందరు పట్టణంబుజేరి సుఖం తురుగాక అని రథము నారోహించి జాడదెలియరాసీక అడ్డదారుల తేరు నడపించి అరణ్యంబునకు బోవుచుండిరి. అంత నరుణోదయంబగుటయు అచ్చటి వారలు మేల్కొని రాముని గానక వారిపోకయు నెఱుంగక దుఃఖించుచు పురము జేరి తమతమ గృహముల ప్రవేశింప వారలంగని స్త్రీలెల్ల రిట్లనిరి.

హిం॥ పురుషోత్తముని పుండరీకాక్షుని పూర్ణచంద్రముఖకమలుని రాముని
సురుచిరగాత్రుని సుందరమూర్తిని జూచువారలే ధన్యులు జగతిని ॥శ్రీ

(2) వనసత్వంబులకెల్ల శశాంకునివశువున మోదము గల్గించుచును
వనమున విహరించు జనకజతోడ తనుకాంతులు సర్వదిక్కులుబర్వ ॥శ్రీ

తే॥ ఇట్టి శ్రీరామచంద్రుని నెలమిమీర కనులజూచెడు భాగ్యంబు గలుగుటెపుడు
ఏమిచేయుదమిఁక బ్రతుకెట్టులనుచు వనటగుందుచు మరియు నావనితలెల్ల.

జోర:- రాచకుమారుని నతిసుకుమారుని రాముని కానలద్రోసి
నీచమతియు చండాలియు కైకిక నేమిచేయునో యాపాపీ ॥జ

(2) పశువుల కటికవానికిచ్చిన పగిదిని మనలను నిపుడు
దశరథనృపుడు కైకపట్టికి దయమాలి యొసంగెను దుర్ణయుడు ॥జ

(3) రాముని దోడ్కొని రాకైతి రిదేల నేమిచేయవలె నిచట
రాముని [illegible]దము మానమును రండీ వేగముతోడ ॥జ

(4) పాలుత్రాగరు పసిబిడ్డలకు భర్తల ప్రేమించరు సతులు
చాలగ రాముని స్మరియించుచును సర్వము మరచిరి జనులు ॥జ

(5) మరియట రాముడు శృంగిబేరమను పురముచెంతను జేరి
ధరణిజగనుమా గంగానది యిదెయని పరమహర్షమున బలికె ॥జ

(6) అరదముదిగి రాముఁడు ప్రియపత్నిని యనుజునిగూడియు నొక్క
తరుమూలంబునఁ గూరుచునుండఁగ తనకు భృత్యులదిచెప్ప ॥జ

(7) శ్రీరామచంద్రుడు వృక్షమునీడను జేరియుండుటను వినియు
కూరిమిమీరగ బంధుయుతుండై గుహుడువచ్చె ప్రియమునను ॥జ

(8) వచ్చిన గుహుని కడుమెచ్చియు దశరథవరతనయుడు మోదమున
మచ్చికవానిని కౌగలించి మరిమన్నించెను ప్రియమలర ॥జ

వ॥ గుహుండును రాముని మునివేషంబుగని దుఃఖించి కుశలంబడిగి వినయంబున
నిట్లు వినుతించె.

ధన్యాసి — రూపకం

ప॥ రామచంద్ర కృపాకర నామనోరథముదీర్పు ॥రా

అ॥ స్వామీ నీయనుచరుడను సార్వభౌమ నన్నేలు ॥రా

చ॥ సకలలోకపరిపాల సాధుజన హృదయలోల
ప్రకటిత సద్గుణజాల పరమపురుష సౌశీల ॥రా

(2) దశరథవర సుపుత్ర ధర్మచరిత సుజనమిత్ర
అసమానబల నీలాంబుదగాత్ర అంభోరుహపత్రనేత్ర ॥రా

(3) శ్రీరమణీ సీతతో చిత్తమలర పాలింపుచు
నారాజ్యమయోధ్యయని జేరియుండు దేవదేవ ॥రా

(4) ఈమహిని నన్నుద్ధరింప వెలసితివి నవకోసలమున
రామా కోదండరామ రాజరాజ పూజితపద ॥రా

హిం:-నీదర్శనమున ధన్యుడనైతిని నీరజబాంధవ వంశోద్ధార
నీదుకింకరులము సేవింతుముసదా సాదరమున భోప్రభు జానకీరమణా ॥శ్రీ

(2) అక్షయ కరుణాకటాక్ష వీక్షణ ఆశ్రితరక్షణ ఆనందరూప
భక్ష్య భోజ్య లేహ్య పానీయములను ఫలమూలములివె తెచ్చితి చేకొను ॥శ్రీ

(3) ఈరీతిని గొనియాడుచు ప్రీతిని నెల్లపదార్థములుంచగ రాముడు
జేరియు మిత్రుని కౌగిలించుకొని జెంది తృప్తిని మెచ్చితివినుమా ॥శ్రీ

(4) వనవాసమునకు వచ్చితి వ్రతమున గొననెవ్వియు నే వేరెంచకుమది
అనఘానిను గనుభాగ్యముగల్గెను ఆదరమునకు సంతోషించితి ॥శ్రీ

(5) అవనీపాలుని కతిప్రియమైన అశ్వంబులుఇవి యలసినవిచాల
అవిరళముగ మేత లమర్పుము వీటికి అతిథి సత్కారములవియే వినుసఖా ॥శ్రీ

వ॥ అనవుడు గుహుండు డాక్షణంబ గుఱ్ఱంబులకు ఘాసంబులుదెప్పించె నప్పుడు, సుమంత్రుండు నశ్వంబులకు నలపుదీర్చి మేతయిడె, శ్రీరాముండు సౌమిత్రిదెచ్చిన జాహ్నవీతీర్థంబున జానకీదేవితోగూడి దాహంబుదీర్చుకొని యింగుదీవృక్షమూలంబున లక్ష్మణుం డమర్చిన చిగురుటాకుల పాన్పలపై సుఖాసీనుండై కొంత తడవునకు పవళింప ధనుర్బాణధరులై సౌమిత్రీ గుహులు సుమంత్రునిగూడి గాచియుండిరప్పుడు.

తే॥ అన్నలక్ష్మణ శయనింపుమధికభక్తి విల్లునమ్ములుచేకొనియు వేగువఱకు
మేలుకొని కాచియుందు నామిత్రురాము ననినగుహుగాంచి లక్ష్మణుండనియెనిట్లు

జోర:-అనవరతము రాముని గొల్చుచునుండెదు అతిప్రియసఖుడవునీవు
అనుమానము లేదింతయు నామది ననఘా బల్కెదవినుము ॥జ

(2) ముదమునవిూరలు జాగ్రత్తగ నీసదయుని సేవించినను
వదలక యన్నను గొల్చెదనాపని పదపద్మంబులు వీడకను ॥జ

(3) మరివిను జనకమహీపతితనయ మహావిభవమున తులదూగు
పరమపావని పతిగూడియునిటు పవళించియుండుటను గనియు ॥జ

శహాన — చాపు

ప॥ నిదురెటువచ్చును సీతా రమణితో నేలబరుండ శ్రీరాముడు ॥ని

అ॥ సదయుడై సర్వజనముల రక్షించు సాకేతనిలయుడు తృణశయ్య శయనింప ॥ని

చ॥ త్రిజగన్మోహనుడు దివ్యాస్త్రకోవిదుడు సుజనవిధేయుడు సుకుమారుడురాముడు
అజ రుద్రాదులగెల్చు అధికబలోన్నతుడు విజనస్థలంబున నిటుపవ్వళింప ॥ని

(2) అవనీచక్రంబెల్ల నటునిటుచేయజాలు నవకోసల కోదండరాముఁడు
భువిధర్మబద్ధుఁడై భూరిగుణాఢ్యుఁడు వివిధభోగంబులు విడచియిటులుండగ ॥ని

జోర:-అనఘూనాతండ్రి యయోధ్యను మనియుండఁ డీ దినము
పెనుదుఃఖంబున మరణింతురు తల్లులు వినమా నిశ్చయమిదియు ॥జ

(2) మంత్రులు భృత్యులు బంధువర్గములు మరి యడలుచు నుండెదరు
ఎంతయుశోకంబున బొగలుచు వెతలుచెందుదురు ప్రజలు ॥జ

(3) ఇంతకుమూలము కైకయొసుమ్మీ ఏమందును ప్రియసఖుఁడా
చింతకులోనై చెడియుండునయోధ్య శ్రీరాముం డడవిని జేర ॥జ

వ॥ ఇవ్విధంబున నయోధ్యలో జరిగిన వృత్తాంతంబులనెల్ల సంభాషించుచు దుఃఖించుచుండగ నరుణోదయంబగుటయు శ్రీరాముఁడు మేల్కాంచి కాల్యకృత్యంబులు దీర్చి గంగానదిని ప్రార్థించి గుహునితో ప్రాణసఖా గంగదాటింపు మనవుడు సుఖోచితంబైన నావ దెప్పించి యుంచె నంత రాముండు వటక్షీరంబుగొని తెమ్మని తమ్మునిండును దానును జడలుదాల్చి పడవనెక్కి గంగానదిదాట ప్రయత్నించునెడ శ్రీరాముఁడు సుమంత్రా మేమిక నరణ్యము జేరెదము నీ వయోధ్యకు జనుమన నతండు శ్రీరాముని పాదములకు నమస్కరించి,

ఖ. ఖారి – రూపకం.

ప॥ జనకసుతారమణా ఆలకింపుము నామనవిని ॥జ

అ॥ నిను ఘోరారణ్యమున వదలి నేనెటు మరలుదు ॥జ

చ॥ హృదయమెరియఁ బోవజాల అదయుడ నేనరసిచూడు
సదయుడవై గొనిపొమ్ము ముగమునవత్తు రథమునడపి ॥జ

(2) నీవెంటదిరిగి కౄర జీవజాలముల దెగటార్చి
నీవాడనై సౌమిత్రితో భావమెఱిగి గొల్చువాడ ॥జ

(3) వరద యఖిల లోకబంధూ శరణు నవకోసలరామ
కరుణింపు నిన్నిటువిడచిన పురవాసులు నిందింపరె ॥జ

వ॥ ఇట్లువేడుకొను సుమంత్రునికి దయార్ద్రహృదయుండై శ్రీరామచంద్రమూర్తి.

జోర:-పరమాప్తుడవు మిత్రుడవును నతిభక్తుడవీవు సుమంతా
ధరణీశుని రక్షించుటకొఱకు పురిజేరగవలె నీతిమంతా ॥జ

(2) సీతతోడ శ్రీరామలక్ష్మణులు జేరియు ఘోరాటవిలో
భీతిలేక యున్నారని దెల్పుము ప్రియములరగ జనకునితో ॥జ

(3) నీవటుబోవక నిలచియుండ నిట నేనడవికి జనలేదనియు
భావించును కైకమ్మ నిజముగ ప్రభు డసత్యవాదియనుచు ॥జ

(4) ధరణిజాతయును తమ్ముండును నేనును తల్లులపాదంబులకు
మరిమరి దండము లర్పించితిమని మా కుశలంబెఱిగింపు ॥జ

(5) ఆరున్నెనిమిది ఏండ్లిట నుండియు హర్షంబున మరివేగా
జేరవచ్చెదము మిము జూచుటకని చెప్పుము జనకునితోడ ॥జ

సీ॥ నామాటగాదెల్పు నయమునభరతుని తండ్రి వృద్ధునిమాట దప్పవలదు
మనతల్లులందఱ మన్ననజేయు కైకతో సమముగా గాంచుమయ్య
మరియు సుమిత్ర నామాత కౌసల్య ననుదినమ్మును గనియాదరింపు
రఘువంశవర్ధనా రాజ్యభారమువూని నిండార సత్కీర్తి నిలుపుజగతి
కన్నబిడ్డలవలెఁ బ్రజఁగరుణజూడు పిన్నతమ్ముని గూడి ప్రేమమీర
సకల సుఖములు బొందుమా శాంతముగను నీతికోవిదతమ్ముడా నిర్మలాత్మ.

వ॥ సుమంతా పయనంబుగమ్ము సమయోచితంబుగ అని రాజయోగ్యంబైన నావపై
ఆయుధంబులునిచి ప్రాణసఖా పోయివచ్చెదమని గుహునికి బ్రియంబు బలికి
సీతాలక్ష్మణ సమేతుండై రఘువీరుడు ఆసీనుండయ్యెనంత నావికులు

గేయము

ప॥ రారాపోదాము ఓరోరి బల్ వేగ ॥రారా

చ॥ శ్రీరామచంద్రుని సీతాలక్ష్మణులతో కోరికల్ మీరగ గంగదాటింతము ॥రా

(2) ఆలి మాటలువిని అనుగుసుపుత్రుని ఈలీల నడవికి వెడలగొట్టెనట ॥రా

(3) దండకాటవిజేరి తమ్మునితోగూడి దండి రక్కసుల చెండాడివచ్చునట ॥రా

(4) మనదొరకు సఖుడంట మనలరక్షించునంట
మోక్షము గాచునంట దీనుల బ్రోచునంట ॥రా

(5) నవకోసలేశుడట నరనాథచంద్రుడంట భువిని
శ్రీరామపుత్రి భోంచిన దేవుండట ॥రా

వ॥ ఇట్లుబల్కుచు వచ్చిన నావికులందరు తెప్పను గడలువేయుచు శ్రీరామచం ద్రుని కనులారజూచి యానందించుచు త్వరిత గమనంబున పడవ నడుపుచు

గేయము

ప॥ శ్రీరామచంద్ర ఏలేలో సీతామనోహర ఏలేలో
మత్స్యావతార ఏలేలో మహితవిచార ఏలేలో
కూర్మావతార ఏలేలో కోసలపురవాస ఏలేలో
వరహావతార ఏలేలో వారిధిగంభీర ఏలేలో
నరసింహరూపా ఏలేలో వరదాసపాల ఏలేలో
భార్గవరామ ఏలేలో పరమకల్యాణ ఏలేలో
శ్యామలరూప ఏలేలో కామితఫలద ఏలేలో
రామాభిరామ ఏలేలో రఘుకులదీప ఏలేలో
బలరామమూర్తి ఏలేలో భక్తజనోల్లాస ఏలేలో
శ్రీకృష్ణ హరికృష్ణ ఏలేలో శ్రితజనమందార ఏలేలో
కల్క్యవతార ఏలేలో కలిదోషహరణ ఏలేలో
నవకోసలేశ ఏలేలో భవభయహరణ ఏలేలో ॥శ్రీ

వ॥ ఇట్లుశ్రీరాముని గీర్తించుచు పడవ నడుప నది గంగానది మధ్యప్రదేశంబు జేరవచ్చిన సీతాదేవి గంగాదేవి నిట్లు ప్రార్థించె

తే॥ తల్లి నావిభుగూడినే తరలియిపుడు దండకాటవి జని యటనుండి మరల సౌఖ్యముగమేము పురిజేరు సమయమునను పుష్పదామంబులను నిన్నుపూజసేతు

వ॥ అమ్మా నమస్కరించుచున్నదాన మమ్మనుగ్రహింపుము, సుర పొన్నలపూజించి సురాభాండంబు లర్పించెదనీకు, దేవీ రక్షింపుమని ప్రార్థించుచుండ నావయు నావలితీరంబున జేరెనంత

జోర:-రామలక్ష్మణులు భూమిజతోడ రయమున నావనుదిగియు
రాముడంత నావికులను బనుపుచు ప్రేమను లక్ష్మణుగనియు ॥జ

(2) చేరవచ్చితిమి నిర్మానుషమగు ఘోరకాననమునందు
నారీమణి సీతనుగాపాడుచు నడువవలయు మనమిందు ॥జ

(3) గంగదాటి జనుచుండెడు వారల గనుగొనుచును సూతుండు
పొంగి పొరలెడు బాష్పంబులతో భోరున నేడ్చుచునుండె.

(4) అడవిని గుట్టల చెట్లనీడలను నడచుచు బోవుచునుండ
కడువేగమ యినుడస్తమించెను గ్రమ్మె చీకటులు నంత ॥జ

వ॥ నళినదళనేత్రు లోకతరుచ్ఛాయం గూర్చుండి వరాహము మున్నగు మృగముల గొట్టి ఆకలిగొనటచే నచ్చట భుజియించి సౌమిత్రీ మనము పల్లెలుదాటి వెల్పలి పొలంబున వసించుట సుమంతుడెడబాయుట తొలిరేయిగాదె కావున మనము మేల్కొని సీతను రక్షింప వలయును. కడచిన కార్యంబుల విచారంబు సేయకు మన్న యనుచు తాముదెచ్చిన యాకులనేలబరచి శిలయొకటి దిండుగా నిడుమని యందు సుఖాసీనుండై తమ్మునికి చిత్రకథలు వినుపించుచు ప్రసంగవశంబున తండ్రిని దలంచి.

జోర:-వినుమా లక్ష్మణ ఘోరాటవిలో నిడుముల బొందెదమనుచు
మన జనకుడు దలపోయుచు నీరాత్రి మనియుండునె మహిపైననుచు ॥జ

(2) అన్నిటికన్నను కామమె నరులకు అధికంబని దలచెదను
ఎన్నగ కామంబున మన తండ్రియు ఎడరు జెందె గనుఁగొనుము ॥జ

(3) కామమె పురుషార్థంబుగ మదిలో నేమను జుడు దలపోయుఁ
నీమహినాత డధోగతిపాలగు ధీమహితా యిదినిజము ॥జ

(4) కామమోహితుండై మనతండ్రీ కైకయురులలోఁ జిక్కి
భూమివీడి స్వర్గమునకు బోవును పుత్రవియోగంబున పొక్కి ॥జ

(5) పాపినికైకచె నిన్నికష్టములు ప్రాప్తించెను మనకిపుడు
దాపురమాయెను మనయింటికి మరి ధరణీశుని వధియించుటకు ॥జ

(6) ఎదురులేని రాజ్యంబేలును కైకకు ముదముగల్గ భరతుండు
ముదుసలి గావున రాజేంద్రుండు మదిరోయుచుండు నిపుడు ॥జ

(7) మనతల్లుల నింకేమిచేయునో చెనటి దుర్మతి యాకైక
జనుమా లక్ష్మణ తల్లులజూడగ జనకజ నీవును వేగ ॥జ

(8) వనమున నొక్కడ దిరిగి వేగమె వచ్చెద నేమముజరిపి
అనుమానింపకు మయ్యలక్ష్మణా అరుగుము శీఘ్రమె పురికి ॥జ

సీ॥ తల్లి నేడ్పించెడు తనయుండు నేగాక యుండునే వేరొక డుర్విలోన
నావంటి కొడుకు నీయవనిలో నేతల్లి గనకుండుగావుత ఘనముగాను
ఏతల్లి బిడ్డల నెడబాపెనో మును నాదుజనయిత్రి కీగతి సంభవిల్లె
పెంచి పెద్దనుజేసి ప్రేమించు జననినే నిడుములబడుమని విడచినాడ
నెంతద్రోహిని మూర్ఖుడ నెట్టిసుతుడ తల్లి నిలబ్రోచువారెవో ధన్యులార
యట్టి పుణ్యంబు నేజేయనైతినయ్య పుత్రుడనుగాదు శత్రుండ పురుషవర్య.

వ॥ ఇవ్విధంబున జననీజనకుల దలపోయుచు కనుల బాష్పంబులొలుక శోకింపుచు విషణ్ణ వదనుండై నిస్తరంగ సముద్రంబువలె మాటలాడకయున్న యన్నంగని లలిత వచనంబుల సౌమిత్రి యిట్లనియె.

జోర:-స్వామీ నీవిటుబల్కుటెల్ల సత్యము సజ్జనహితము
రామా నీవటులేక నయోధ్యయు రంజిల్లదు కాంతి దొరంగియును ॥జ

(2) అన్నా నీవిటు విలపించిన నన్నాదరించు వారెవరు
సన్నుతచరిత యెటులోర్తుము మది జానకియును మరినేను ॥జ

భైరవి - చాపు

ప॥ రామా బ్రోవుము కరుణ సీతా ॥రా

అ॥ ఏమానవులైన స్వామీ నిన్ విడతుర
కామాదులకులోనై కనుగానని వారుదక్క ॥రా

చ॥ జలము బాసినట్టి మత్స్యమురీతిని జానకియును నేను నినువిడనాడి
జలజారుణనేత్రా బ్రతుకగలమా నీ చరణముల్ సేవించి సరసనుండెదము ॥రా

(2) తారకాధిపుడు లేక తారా గణములున్న చందమున
శ్రీరామనీవులేక చెలువమెటుగల్గు కారుణ్య సాగర నవకోసలధామ ॥రా

వ॥ అని వినయంబున నమస్కరించిన తమ్మునిగ్రుచ్చి కౌగలించి సంతుష్టాంతరంగుడై యచట తృణశయ్యపై బరుండె నంత చంద్రోదయంబగుటయు గంగాయమున గలయు ప్రాంతంబునంగల కాంతారంబుగనుచు సౌమిత్రికిట్లనియె.

జోర:-గంగాయమునా సంగమస్థలమదె పొంగుచున్నదతిధ్వనితోను
మంగళకరమగు ప్రయాగ యిదియా మహనీయుడు భరద్వాజుడు గలడిందు ॥జ

తే॥ హోమధూమంబు గన్పట్టె నొప్పమీర మునివరుల యాశ్రమంబులిందనువుగాను
కలవు మనమట కరుగంగవలయు రేపటంచు నిదురించి వేగినయంత లేచి

వరతపోనిధి యల భరద్వాజమౌని యాశ్రమము డాయవచ్చితి మనుచు వేగ
చేరనరుదెంచి యొకమునిశిష్యునరసి చెప్పివంపిరి మానీంద్రుచిత్తమలర

వ॥ భరద్వాజుండంత సీతాలక్ష్మణ సహితుండగు శ్రీరామచంద్రుని దోడ్కొని
రమ్మని శిష్యులబుత్తెంచె నప్పు డాయాశ్రమంబుజేరి

జో॥ర:-వందనములు జేసిరి మువ్వురు భక్తిని మునిచంద్రున కానందమున
పొందుగ నాశీర్వాదము జేసెను ఋషిపుంగవు డతిమోదమున ॥జ

(2) అనఘుడు రాముడు మునికిట్లనియెను వినయము మీరగ నపుడు
జనకుని యాజ్ఞచె దండకాటవికి జనుచుంటిమి మేమిపుడు ॥జ

(3) అనవుడు మునివరుడనియె రామునికి మునుసెరుగుదు నీవిధము
అనఘా యిచ్చటనుండుడు సుఖముగ యనవిని యమ్మునిగనియు ॥జ

వ॥ దేవ॰ మేమిందునిలచిన పురవాసులెఱింగి వచ్చుచుం బోవుచుందురుగాన రమ్య
స్థలంబొండు నెఱింగింపుడు దయానిధే యన భరద్వాజుండును యిచటికి పది
క్రోసులదూరంబున చిత్రకూట నగంబుగలదు అచ్చోటజేరి సుఖంబుండుము
అని బహుప్రేమ దనర నాతిథేయ సత్కారంబులు సలుప ఆనాటిరాత్రి యట
గడపి ఆవేకువనులేచి పోయివచ్చెదమని మునిపుంగవుని వీడ్కొనిపోవునెడభరద్వా
జుండును వారలతోడ జనుచు శ్రీరామా యమునదాటి యటుజనుచుండ మార్గం
బున శ్యామంబను వట వృక్షంబుగలదు. యావృక్షరాజంబునకు భూమిజాతను
మొక్కింపుము. మరియు సిద్ధసేవితంబగు పుణ్యతరువుసుమా అచ్చటనిలువుడు
లేనియెడ నొక క్రోసుదూరంబున నీలవనంబుగలదు బహురమ్యంబు. అందుండి
నను భయంబులేదని మార్గంబెరింగించి జనియెనంత రాముడు, లక్ష్మణా! మౌని
దయకు పాత్రులమైతిమిగదా, పుణ్యశీలులమంచు బోయిబోయి సీతతోడ
యమునాతటంబుజేరి నదీప్రవాహంబు తరంగములతో అతివేగంబున పారుటంగని
మనమెటు దాటగలమనుచు తెప్పకొయ్యలవెదకితెచ్చి వెదుళ్ళు నేరేడు మున్నగు
కొయ్యలతో బిగియగట్టి జానకి కూర్చుండ నొక సుఖాసీనముజేసి భీతిల్లుచు
లజ్జావదనయై నిలచియుండు సీతాదేవినెక్కించి తమ ఆయుధములును భూజాత
వస్త్రాభరణముల నందుంచి అతివినోదంబుగ రఘువీరులు యాతెప్పనెక్కి
కాళిందిని తరించుచు మధ్యభాగంబుజేర ధరణీసుత కరములు ముకుళించి.

హిం॥:-దేవి నీకు వందనంబులు తిరముగ వనవాసవ్రతమునుదీర్చి
సావధానముగ మరలివచ్చి వేగ సాకేతము జేర దయగనుతల్లి ॥శ్రీ

(2) కోసలపురమును జేరబోవఁగ నీకు కుంకుమ పసుపు సుమములర్పించెద
భాసురముగవేయి మధుఘటములను భక్తి నిచ్చెద రక్షింపుమమ్మ ॥శ్రీ

వ॥ ఇట్లు స్తుతించుచుండ తెప్ప దక్షిణ తీరంబుజేర రామలక్ష్మణులు దిగి సతీతిలకం
బును దిగిచి నదీప్రాంతంబున నడచుచుండునెడ,

హిం:-మునిదెల్పిన యాశ్యామవటముజేరి మోదమున శ్రీరామ లక్ష్మణుల్
జనకజకుదెల్ప మొక్కియువలగొని వినుతించె భక్తితో వృక్షరాజంబును ॥శ్రీ

(2) వ్రతముదీర్చియు రామలక్ష్మణులు అతులితమున పురిజేరియు మేము
సతతము తల్లుల కానందంబుగ హితముగనుండ వరమిమ్మ వేడెద ॥శ్రీ

(3) ప్రేమను నిటు ప్రార్థించియు సీత రామునిజేరగ రయమునవారు
భూమిజ నిరువుర మధ్యనిడుకొని సామజగమనులు గదలిరి ముల్వురు ॥శ్రీ

(4) మత్తగజంబుల మధ్యచెలంగు మత్తకరేణువువలె మైథిలియు
ఉత్తమపురుషుల మధ్యనునడచె చిత్తమలరఁగ విచిత్రవస్తువుల ॥శ్రీ

(5) ఎంతోసొంపై యున్నవి నాథా యీ మహీజములు ఫలపుష్పంబులు
సంతసమాయె నీవనమార్గంబు స్వామీ మందమారుతమునను ॥శ్రీ

(6) అనవిని రాముం డానందంబున అనుజా వివిధఫల కుసుమంబుల
జనకజకుప్రీతిఁ గొనితెమ్మనగ వినయంబున దెచ్చి సమర్పించెను భక్తి ॥శ్రీ

వ॥ ఇవ్విధంబు నచట చిత్రంబులగనుచు క్రోసుదూరంబరిగి, యచట కాళింది యుప
వనంబున కేకికేకలును కిచకిచలును వినుచు, చనిచని రాత్రి మార్గమున
నొకయెడ నిదురించి శుకపికరావంబుల మేల్కాంచి రామలక్ష్మణులు జానకి
యు స్నానంబులాచరించి భరద్వాజుం డెరింగించిన మార్గంబుననరిగి చిత్రకూ
టంబుజేరంజని సీతా సౌమిత్రులంగాంచి రాముడు,

సీ॥ చిత్రకూటమ్మును చేరవచ్చితిమిదె చూడుడు వృక్షాల సొంపుగనుడు
ఫలపుష్పముల తరు లలరుచున్నవి మరి శుకపికరావముల్ సొంపుమీర
పూపొదరిండ్లలో పులుగులు ముదమున చెలగుచున్నవియివె జేరియిందు
శృంగారకందమై మంగళకరమైన యీపర్వతముజేరి యెల్లమునులు
తపముజేయుచు నున్నారు తనువు మరచి సిద్ధసాధ్యులు సతతము జేరియుందు
సకలఋతు పుష్పఫలములు చాలగలవు సాధుసంచారమిది సర్వసౌఖ్యదంబు.

వ॥ కాన మనమీ చిత్రకూట ప్రాంతంబున, నివసింతమనుచు వాల్మీకి యాశ్రీ

మంబుజేరి యమ్మహాత్ముని సందర్శించి,

ద్విప:-అమ్మునివరునకు నతివినయంబున ననువుగ మ్రొక్కుచు వేగ
అమ్మహానీయున కభిముఖులయి వా రంజలిబద్ధులుగాగ ॥జ

(2) కరుణతోడ దీవించియు వారల పరమానందము మీరగ
సురుచిరముగ పూజించి మహామునివరుఁడు వచించెను వారి ॥జ

ఉదయరవిచంద్రిక - ఆది

ప॥ చూడఁగంటి నిన్ జటామకుటధర సూర్యవంశదీప సుందరరూప॥చూ

అ॥ నాడు తాటకని గీటడంచిన నాథ జగన్నాథ సీతానాథ ॥చూ

చ॥ ఆదరంబున కుశికపుత్రుని యాగమునుగాచి యసురులదరిమి
పాదరేణువున పెనుశిలనువేగ పడతిమిన్నఁజేసి భాసిల్లురామ ॥చూ

(2) పరమపురుష నీపదములగొల్చి భవభయముల బారద్రోలితిని
వరనవకోసల కోదండరామ శరణు శరణు దేవ కరుణాకర ॥చూ

తోడి - ఆది

ప॥ నీనామ మహిమను నేనేమని వర్ణింతు శ్రీరామ ॥నీ

అ॥ జ్ఞానానందస్వరూప కామితప్రదకల్పభూరుహ ॥నీ

చ॥ పరతత్వ సారంబని గిరివరతనయ కెఱిగించుచు
పురారాతిసదా జపియించు పరమగోప్యమైన ॥నీ

(2) వరతపోధనులు నాకు వ్యత్యస్తాక్షరముగాదెల్ప
నిరతము పఠియింపగాను నేబ్రహ్మ ఋషినైవెలసితి ॥నీ

(3) సరసిజాసనాది సురలు మునులు సతతము ధ్యానించుచు
పరమకృపతో త్రిజగములను భాసిల్లఁజేసిన ॥నీ

(4) పురుషోత్తమ నవకోసల పురనివాస దేవదేవ
నిరవధిక సుఖదాయ నీరదాభ నిఖిలనాథ ॥నీ

క॥ నీనామ మహిమచేతను నేధన్యుడనైతిగాదె నిరుపమ తేజా
జానకితో రఘువర నామానసమున నిలిచియుండు మానుషవేషా.

వ॥ అని నుతియించి మధురఫలంబు లర్పించి, రామా! నీ విందు పర్ణశాల యొకటి
నిర్మించి సుఖంబుండుమనిన,

డో॥ర:-మునివరు నాజ్ఞనుగొని శ్రీరాముడు ముదమున తమ్ముని గనియు
అనువుగ పర్ణశాలవేయుమన అటుగావించెను లక్ష్మణుడు ॥జ

(2) రమణీయంబయి వాసయోగ్యమయి రంజిలుచుండెడు శాలగ
పరిమదంబునగని శ్రీరఘువీరుడు పలికెనిట్లు మనమలరగ ॥జ

వ॥ లక్ష్మణా! హరిణమాంసంబు దెమ్ము వాస్తుశాస్త్ర ప్రకారంబుగ బలి హరణంబును గావింపవలయునన అతం డట్లుజేయ శ్రీరాముడు సీతాసమేతుడై స్నానంబుజేసి యధావిధిని దేవతాగణంబుల బలిసమర్పణంబున దృప్తులం గావించి కుటీరంబు ప్రవేశించి పుణ్యాహవాచనంబుజేసి విధిచోదితంబున సకల క్రియా కలాపంబు నెఱపి యందు సుఖంబుండెనట.

డో॥ర:-కన్నుల కగుపడువరకును రాముని గనుచుండి సుమంత్రుడు గుహుడు
నెన్నరాని శోకంబున నిరువురు వెడలిరి వెనుకకు నవుడు ॥జ

(2) అంత సుమంత్రుడు గుహుని వీడ్కొని యా రఘురాముని తేరుగ
చింతాక్రాంతుండై మరలించియు జేరవచ్చె పురమునకుగ ॥జ

(3) రామరహితమా రథముగగని పౌరులు రాముండేడీ యనుచు
రామునెచ్చటను విడచితి వకటా రఘునాథుని గనుటెట్లనుచు ॥జ

(4) హా రామా నిన్నెందు వెదకుదుము హా కౌసల్యా వరతనయా
చేరవచ్చెదము నీపదసేవకు సీతాపతి జయరామా ॥జ

వ॥ పురవాసులిట్లు విలపించుచుండ సూతుండు చింతార్ణవ మగ్నుడై అంతఃపురంబు ప్రవేశింప రాజపత్నులందరును గొల్లుమని యేడువ వీనులగ విననేరక కనుల జూడజాలక తలవంచి సూతుండు దశరథమహారాజు చెంతజేర నతనింగని రాజు మూర్ఛిల్లి మరల తెలివొంది కనులు మూసియుండె నంత కౌసల్యా సుమిత్రలు దుఃఖితలై యిట్లనిరి.

డో॥ర:-సూతుడు వచ్చిన బలుకవిదేల చూడవు కన్నులుదెరచి
సీతాపతి క్షేమంబడుగవుమరి చింతించిన ఫలమింకేమి ॥జ

(2) ప్రాణదయితయగు కైక లేదయిట భయమువలదు నీకిపుడు
భూనాయక ప్రియమారగ పలుకుము పుత్రులగతి గనుగొనుము ॥జ

(3) అనిపల్కుచు దుఃఖావేశమ్మున హా పుత్రాయని మూర్ఛిలగ
ఘనచరితలగు సపత్నులు డగ్గరి కౌసల్యను దేర్చిరి వేగ ॥జ

(4) తలవంచియు గద్గద కంఠుండై జలములు గన్నులగారఁ
నిలచియుండు సుమంత్రుని గనుగొని పలికె నృపుడు వేగమునఁ ॥జ

(5) నాసుతుడెటు లే వృక్షము నీడను నలమట జెందెను జెపుమా
భాసురాంగుడెటు నేలవసుండెను భార్యతో నడలి సుమంతా ॥జ

(6) దుఃఖమెట్టిదో యెరుగని సీతయు నిక్కము కానలఁజేర
దుఃఖించుచు యెటులున్నదో దెల్పుము తోయజముఖి భూజాత ॥జ

వ॥ అనిన దుఃఖం బపనయించుకొనుచు, సూతుం డిట్లనియె.

జోర:-శ్రీరాముడు మీపాదఁబులకును, చేయుమనెను వందనముల్
నారీమణి కౌసల్యకు భక్తిని నతులొనరించితి ననెమరియుఁ ॥జ

(2) తల్లుల కందరికిని వందనములు చేసితినని దెల్పుమనెఁ
ఉల్లమలర కైకమ్మకు సుఖముగ నున్నవారమని పల్కుమనెఁ ॥జ

(3) భరతునకిటు నామాటగదెల్పుము ధరణీ పతిత్వము గలుగఁ
ధరణీశుని యాజ్ఞకులోబడి ధర బాలింపుమనుము ధర్మముగఁ ॥జ

(4) కన్నతల్లివలె కౌసల్యను సతతము గారవింపుమనుమా
మన్ననజేయుచు జనని సుమిత్రను మదినొవ్వక తల్లుల గనుమనుమా ॥జ

(5) అని పల్కెడు శ్రీరాముని కప్పుడు కనుల బాష్పములు జడిగురిసెఁ
జనకాత్మజ విలపించుచు రాముని ముఖపంకజము గనె నంతఁ ॥జ

వ॥ అనవుడు దశరథుండు సుమిత్రిపట్టి యేమిబల్కెనన సూతుండిట్లనియె.

తే॥ తప్పులేమియు నెఱుగని ధర్మశీలు నడవిపాల్ సేసె రాముని నవనివిభుడు
ఆడుదానికి లోఁబడి యధముడగుచు ఎల్లరిస్సిరోయందురం చెఱుగఁజెపుమ

వ॥ అని రోషారుణిత లోచనుండై పల్కెనన దశరథుండు.

జోర:-ఆలోచింపక మంత్రివరులతో స్త్రీ లోలుడనై నేను
బాలుని నాముద్దు పట్టినడవుల పాల్ చేసితి గదయిపుడు ॥జ

(2) రామునిజూడక బ్రితుకను న స్నీ రథమున నిడుకొనియు
రామ లక్ష్మణుల చెంతజేర్పుమీ రక్షింపుము దయతోను ॥జ

(3) లేదా వారలఁదోడ్కొని రమ్మని భూధవు డతిదుఃఖమునఁ
మేదినిబడి శ్రీరాముని ముద్దులమోముఁ జూపుమని దేడ్వఁ ॥జ

వ॥ కౌసల్యయు, అధిక దుఃఖావేశంబున సుమంత్రునిగని.

జోర:-రాముని కడకును లక్ష్మణు చెంతకు రయమున ననుగొని పొమ్మా
యీమహి నిక నాకాయము నిలువదు రాముని జూడకయున్న ॥జ

పున్నాగ - చాపు

ప॥ హా రాజకుమార హా సుకుమార కారుణ్యసాగర గంభీర నగధీర ॥హా

చ॥ సుందరముఖజితసోమ శ్రీరామ కందర్ప శతకోటిగాత్ర సుచరిత్ర ॥హా

(2) తళుకుచెక్కులి ముద్దుగుల్కు నగుమోమునే దిలకించుటెన్న డోజలజదళనేత్ర ॥హా

(3) రవికోటితేజ శ్రీరామసద్గుణధామా నవకోసలాధీశ నాముద్దుతనయా ॥హా

వ॥ ఇట్లు రాముని పేర్కొని యేడ్చుచున్న కౌసల్యనుగాంచి రాజపత్నులందరును మరియు నేడువదొడంగిరి. అంతఃపురం బంతయు రోదన శబ్దంబుల నిండియుండె. అంత సుమంత్రుండు తన దుఃఖంబు నిలుపుకొని కౌసల్యనుగని,

తే॥ అమ్మ దుఃఖింపవలదమ్మ అడవులందు నెమ్మదిగనున్న వాడమ్మ నీదుసుతుడు
తమ్మునింగూడి పత్ని సీతమ్మతోడ నమ్మ భయమింత లేదమ్మ నాదుమనవి

జోర:-సంతోషంబున మైథిలితనవిభు సరసదిరుగుచు మరినీ
వింతలుగనుచు మోదంబున విహరింపుచున్నదా వనినీ ॥జ

(2) రాముని భుజపాలితయగు మైథిలికేమి కొదవయో చెపుమా
రాముని విడచియుండ సీత కట నేమిసుఖమ్మగు గనుమా ॥జ

(3) సత్యము నిలుపగ నీ వరపుత్రుడు జనియెను వనమునకమ్మా
నిత్యనిర్మలుడు మునిజనములతో నిచ్చమెలంగును వినుమమ్మా ॥జ

(4) పదియును నాల్గేండ్లన నెంత భావింపుము నీవోతల్లీ
సదయుడు వేగమె వ్రతముదీర్చి నీ సరసజేరుఁ గల్పకవల్లీ ॥జ

వ॥ సుమంత్రుండిటు లూరడిలంబల్కిన దుఃఖంబడంచుకొని దశరథునిగని కౌసల్య శోకము పొంగిపొరల నతనికిట్లనియె.

జోర:-ప్రియసతియగు కైకేయికిలోబడి దయజూడవు నన్నెపుడు
ప్రియురాలికి సంతోషంబుగ నా ప్రియసుతు దరిమితి విపుడు ॥జ

(2) పతి నీవుండియు కృపలేని కతంబున పతిలేనిదానసైతి
సుతునిటు అడవిపాలుజేసి నక్ష హాతముజేసితివి ధృతి వీడి ॥జ

(3) ఉండజాలనిట నాముద్దుల పట్టియుండెను చోటికి బోదుర్
ఉండుము ప్రియసతి సుతులతో సుఖముగ భూమండలమేలుచు మరియుర్ ॥జ

కం॥ కారడవిని శ్రీరాముండేరీతిని నుండువాడో యిడుములు బడుచుర్
ధారుణిసుత సుకుమారిని జేరియు ఫలమూలములను చీకుచు నకటా.

డో౯ర:-జనకుని ముద్దులపట్టి జానకిని వనముల కనిపితివిపుడు
జనకుండిదివిని నావలె నెప్పుడు వనరుచుండడే చెప్పుమా ॥జ

(2) కటికనేల శయనించుచు సీతతో కాయగసురులుర్ దినుచు
ఎటులున్నాడో నాకూరిమితనయుం డధిక కష్టముల బడుచు ॥జ

తోడి - ఆది

ప॥ తగునా నీకిది రాజచంద్ర దండకాటవి కనుప సుతుని ॥తగు

అ॥ సుగుణాకరు సుందరాంగుని సుకుమారుని రఘువీరుని ॥తగు

చ॥ తరుణేందు వదనుని అరుణాబ్జదళనేత్రుని
సురుచిర శృంగారుని నా వరతనయుని విడనాడ ॥తగు

(2) శరణని యొకమారుబల్క శత్రువైనర్ గాచువాని
కరుణాకరు నవకోసల పురుషసింహుని శ్రీరాముని ॥తగు

వ॥ ఇట్లు బల్కు కౌసల్యంగాంచి చేమోడ్చి దశరథుం డిట్లనియె.

డో౯ర:-చేసితితప్పు ద్రోహముసీయెడ చేరియునను మన్నించు
గాసిలి యుండిన వాడనింకమరి కరుణించుము వృద్ధుడటంచు ॥జ

(2) కరకుమాట లిటులాడిన ఫలము గలదే దేవీ చెప్పుమా
పరుసములాడకు ప్రార్థించెదనిను బ్రతుకను దయగనుగొనుమా ॥జ

(3) విభుడిటు ప్రార్థించిన కౌసల్యయు వినయంబున నృపుగనియు
విభునిచేత ప్రార్థనగొను సతియును యిహపరములకును జెడుమరియు ॥జ

(4) అనిబల్కుచు పతిపాదంబులు చేనంటుచు భయభక్తులను
నను మన్నింపుము పుత్రశోకమున నాడితి మతిదప్పియును ॥జ

వ॥ ఇట్లు పతినివేడుకొని యతని కుపచారంబులు జేయుచుండ దశరథునకు దుఃఖం బతిశయిల్ల రాముని బేర్కొని,

హరికాంభోజి — రూపకం

ప॥ ఒకమారునను చూడర ఓరామచంద్ర ॥ఒ

అ॥ అకలంక గుణధామా అడలి యడలి వెడలు ప్రాణము ॥ఒ

చ॥ నీముఖారవిందముజూపి నిత్యానంద పదవి నిమ్ము
రామా యీతాపమణచి రయమున కాపాడర తండ్రి ॥ఒ
నవకోసలధామా నాముద్దుల రఘురామా
భవహార శ్రీపరంధామ పాపుశోకమురణ భీమా ॥ఒ

వ॥ ఇట్లు హా రామా రామాయనుచు కనులుమూసి నొకమూహూర్తము మైమరచి మేల్కాంచి మునిశాపంబు జ్ఞప్తికి వచ్చినంత కౌసల్యాదేవితో ఇట్లనియె

ద్విపద:—వినుము కోసలసుత వినువింతునిపుడు। అనువుగ రాజ్యంబు అనుభవించుచును
మనములర వేటకై వనమున కరిగి। ఘన మృగంబులనెల్ల ఖండించి వేగ
దినకరు డస్తమించిన నంతరాత్రి। వనరుగా మృగముల వధియింపబూని
ధనువునుబట్టి నే డాగియుండగను। మునికుమారు డొకండు చనుదెంచి యేట
కలశంబు ముంపగ జలములలోన। బుడబుడశబ్దంబు పొడమె నే నంత
మదకరియనియెంచి వదలితి శరము। అదిదాకి మునిపుత్రు డయ్యొయ్యోయనుచు
ఎవ్వరికిని జేయ నిసుమంత ద్రోహ। మివ్వనంబున నన్ను నేపాపి జంపె
అంధులు వృద్ధులైనట్టి తలిదండ్రు। లుండు రింకెట్టు లీయుర్వి నేబోవ
యనెడు మాటలు విని మనుజుడం చేను। జనియు డగ్గరజేర మునిసుతుం డనియె
ఏల జంపితి నన్ను నింతపాపంబు। నేల జేసితివన నెరుగక నేను
మృగమనియేసితి కృపఁజూడుమనఁగ। వగవకు రాజేంద్ర వనరుగా నిపుడు
జలమును గొనిపోయి సరగున నాదు। తలిదండ్రి కిమ్ము యవి ద్రావినంత
ఇలనీదు శరముచే బొలియుట నేను। తెలియంగ జెప్పుము పలుమాటలేల
పొమ్ము విప్రుఁడగాను పొసఁగదాహత్య। అమ్మదీయుము నిల్వవయ్యప్రాణములు
అనివల్క శరము నే నటు దీయవేగ। పెనురక్తమునఁదోగి మునిబాలకుండు
జనియె స్వర్గమునకు తనువునుబాసి। అంత నీరముగొని యటపోవ నేను
యింత యాలస్యం బిదేలరా పుత్ర। అనివారు బల్కగా నంటి నే నిట్లు
వినుడయ్య మీపుత్రుడనుగాను నేను। పాతకి స్త్రీపుత్రుఁ బరిమార్చినట్టి
భూతలపతినేను పుణ్యాత్ములార। ఆమాటవిని వార లధికదుఃఖమున
భూమిపైబడి పొర్లి భోరున ఏడ్చి। నాతోడజనుదెంచి యరసియాత్మజుని
ప్రీతిచే నిమురుచు ప్రియపుత్రమేను। ననుగని యనిరిట్లు నరనాథ నిన్ను

వినుము వధింపక విడచితిమిపుడు|అనుచు దుఃఖావేశమున సుతుతనువు
ఘనముగా దగ్ధంబు గావించి యపుడు.

డోర:-చేరియు మాసుతుజంపితిగాన జీవింపజాలమిక ననుచు
సారెకు హాపుత్రాయని యేడ్చుచుమావలె జచ్చెద వీవనియనుచు ॥జ

(2) చితిలోబడి యానతియును బతియు మృతిజెందిరి యపుడు
అతివా యాశాపము నన్నంటెను సుతుబాసితి దప్పని విధికృతము ॥జ

(3) తాజేసిన పాపము నెరిగించుచు మది తాపము హెచ్చగ నృపుడుగా
యీ జన్మము నాకేలగాల్పనే యికనిల్వదు ప్రాణంబనుచుగా ॥జ

తే॥ కనులుగనరావు వీనులు వినగరావు తనువువణఁకెడు చాల నోతరుణీ నాదు
మనసు చంచలమయ్యె నిన్గనగజాల గనికరంబున కౌసల్య ననుస్పృశింపు ॥జ

డోర:-అనవుడు కౌసల్యయు పతిమేనును హస్తంబున నిమురుచు నుండగా
జననాయకుడు రామాయనుచు వనటజెందుచు నుండెగా ॥జ

వ॥ దశరథుండిట్లు విలపించుచుండ కౌసల్యా సుమిత్రలు దుఃఖించి దుఃఖించి గగ
జీవులంబోలి దశరథుని చెంతం బడియుండిరి. అంత నర్ధరాత్రింబున

డోర:-హారామా హాలక్ష్మణ సీతాయని యరచుచు ప్రాణముల్ విడచి
ధారుణీశ్వరుడు దివముకరిగె ప్రజతల్లడిల్ల భువివిడచి ॥జ

వ॥ అంతవేగుటయు వందిమాగధుల స్తోత్రంబులు మంగళతూర్య రవంబులు చెలగ
నప్పుడు రాజపత్నులందరు మేల్కొని దశరథుం డేల లేవడయ్యెనని చెంతకరిగి
రాజు శరీరంబునుజూచి యుష్ణంబులేమిని ప్రాణంబులు పోయెనని హాహాకారం
బులు సలుప కౌసల్యాసుమిత్రలు కనులుదెరచి విభునిగని విగతజీవుండయ్యెనే
యని క్రిందబడి హాహాకారంబులుచేసి నెత్తిమోదుకొనుచు ఘోరంబుగనేడ్చుచు

డోర:-హాప్రాణప్రియ హామనోహరా హతమైపోతివ యిపుడు
పాపపుకైకయె యింతజేసెను ప్రాణేశ్వర మమువిడచియును ॥జ

(2) పోయితివే వీరస్వర్గముునకు నాపుత్రుని నడవికిబంపి
ఘాతకియగుకైకేయి మోహముునఁ గల్గె విపద్దశయని విభుసీ ॥జ

(3) చుట్టుచేరియు గుండెలుపగులఁ గొట్టికొనుచు విలపించ
అట్టి రోదనధ్వనియును మిన్నుముట్టి నిండె పురమెల్ల ॥జ

(4) హాహాకారముల్ జేయుచువారు హారాజచంద్ర యనుచు
మోహాంబుధిలో మునిగి జచ్చితివె మోసగించె కైకనుచు ॥జ

(5) హతము జేసితివి పతిని పాపి నాసుతు నడవికి బంపితివి
హితమతి నీదు సుతునితో రాజ్యము నేలుము వేడుక మరిని ॥జ

వ॥ ఇట్లు కౌసల్యాది కాంతలు భూమిబ్రద్దలువార నేడ్చుచుండ రాజుమరణంబువిని వ్యవహార దక్షులును మంత్రివరులు వశిష్ఠాది మహామునులును రాజపత్నుల నూరడించుచు పుత్రులెవ్వరును జెంత లేమికతమున దశరథుని దహనంబు జేయక యతని దేహమును తైలద్రోణియందు ముంచి భద్రపఱచి రప్పుడు రాజు భార్యలు హాహాకారంబులు జేయుచు.

దో॥ర:-హా రాజేంద్ర హా సుగుణాకర హాసత్యవ్రత యనుచు
ధారుణిమము విడనాడిపోతివె ధర్మస్వరూపా యనుచు ॥జ

(2) తలలు మోదుకొని తత్తరపడుచు నిలబడి పొరలుచు నపుడు
పలవరించుచు హానాథా మేమిటు నిలువగలమె భువిననుచు ॥జ

(3) పురవాసులు స్త్రీ పురుషులు గుములై ధరణీశుని మరణమువినియు
పరమపాపి కైకేయి దశరథుని ప్రాణము దీసెను మరియు ॥జ

వ॥ ఇట్లనుచు ప్రజలెల్లరును దుఃఖాంబుధి నోలలాడుచుండిరి. మరునాడు వామదేవ జాబాలి కశ్యపాది మునులెల్లరును సభచేసి వశిష్ఠమునివరునితో నిట్లనిరి.

దో॥ర:-రాజులేని రాష్ట్రంబున ప్రజలు రంజిల్లరు ధర్మముతోడ
రాజులేనిచో చోరులు జనులను రాయుడి జేతురుగాన ॥జ

(2) నిలువదు సత్యము ధర్మము నీతియు నిలువవు ధనధాన్యములున్
చలమునగొనియును నొక్కరినొక్కరు చంపుదు రతిక్రోధమునన్ ॥జ

(3) కావున రాసుతు నొక్కని రాజుగ గావింపుము వేగముతోడన్
భావింపుము యాలస్యమువలదని బల్క వశిష్ఠుడు అంతన్ ॥జ

(4) మంత్రులతో నిట్లనియె మీరలిది యెంతయు దెల్పక వేగన్
సంతోషంబున భరతుని దోడ్కొని సరగున రండిటు జేరన్ ॥జ

(5) అని వల్కిన తురగంబులపైన నారోహించియువారు
జనపదంబులు నదులు దాటియు జనిరతి వేగంబునను ॥జ

వ॥ దూత లతిత్వరిత గమనంబున కేకయమహారాజు పురంబుజేరి రాత్రియగు
టయు నొకచో నిలచియుండి రట్టిమెడ ఆరాత్రి భరతుండు దుస్వప్నంబుగని
మేల్కాంచి యేమియుం దోచక ముఖంబున విన్నదనంబుదోప దిగులొంది
మాటాడకున్న నతనిమిత్రులు డగ్గరి వినోదంబులగు కథలుదెల్పుచు హాస్యంబు
జేసియు నాతని మనస్సు రంజింపజేయజాలరైరి. అందొక:హితుడు మిత్రమా
నీముఖకమలము వాడియున్నది. మాతోడ బలుకవిదేలయన భరతుడు.

డోర:-ఈరేయొక దుస్వప్నముగంటిని చేరియు నాజనకునిపై నీ
కారణమేమొ కలతజెందెమది కలనెరుగింతును మరివినుడీ ॥జ

(2) తనువెల్లను తైలముబూసుక తైలము ద్రావినయటులు
ఘనమగు శైలమునుండి క్రిందికి జనపతిగూలిన యటులు ॥జ

(3) పేడగుంటలో నృత్యముజేయుచు రాజు బడిపోయిన విధమునను
పోడిమి దక్షిణదిశకు రథముపై బోవగగాంచితి నిటులు ॥జ

(4) ఈరీతిని కలగంటిని మిత్రమ యేమిజరుగునో తెలియ
నోరండెను మదితాపము హెచ్చెను కారణమేమియొ యెఱుగ ॥జ

(5) జనకునకో శ్రీరామచంద్రునకో సౌమిత్రికో మరినాకో
కనుగొన ముప్పు గల్గుననుచు మది కలతజెందెడి నాకో ॥జ

వ॥ ఇట్లు పల్కుచుండు సమయంబున దూతలు చనుదెంచి భరతమహీపాల తమ్ముని
తో మిమ్మతి త్వరితగమనంబు నతోడితెమ్మని వశిష్ఠమహాముని మమ్ము
బుత్తెంచె వేగమె పయనంబై రండు పోదమనిన భరతుండిట్లనియె.

డోర:-జనకునకును శ్రీరామచంద్రునకు సౌమిత్రికిని సుఖమే
జనయిత్రుల కెల్లరకును మరియు అనఘులార క్షేమంబే ॥జ

(2) మీరడిగిన వారందరు కుశలము చేరరండు శీఘ్రమున
ధారుణిపతి మీతాత యాజ్ఞగొని తరలుడు బహువేగమున ॥జ

(3) అనిదెల్పియు వారశ్వపతినిగని అర్పించియు కానుకలు
జనపతిచే మరిసుతునిచె వారతి సన్మానము బొందిరి ప్రియమునను ॥జ

వ॥ మంత్రులంత తన్ను వేగిరింప భరతుండు తాతనుగని నమస్కరించి దూత లిటే
తొందరించుచున్నవారు నేబోయివచ్చెద ననిబల్కిన అశ్వపతి సంతసించి
కనకాంబరాది వస్తువాహనంబు లుపహారంబుగ నొసంగిన గైకొని తాత యనుమతి

గొని మాతులుని వీడ్కొని తమ్మునితోడ స్యందనంబెక్కి పరివార సచివ సమే
తంబుగ అనేక పట్టణ పర్వత వనప్రదేశంబులను గంగాది పుణ్యనదులను
దాటుచు సప్తరాత్రంబులు నడచి అరుణోదయంబునకు మను నిర్మితంబును
శోభాయమానంబగు అయోధ్యా పట్టణంబుజేరి భరతుండు సూతునకిట్లనియె.

ద్విపద:-గనుమిదె సారథి కాంతిదొరంగి। గనుపట్టుచున్నది ఘనపట్టణంబు ।
మనమున సంశయము జనియించెనాకు। జనపతి కుశలుడై మనియుండునొక్కొ
కనరారు జనులేమొ ఘంటాపథమున। ఘనతురంగంబులను గజములనెక్కి
వేదాధ్యయనముల్ వినరా విదేల। మోదంబు గనరాద యేదెసంగనిన
వనములు పాడరి వనరుచున్నట్లు। గనుపట్టుచున్నవి ఖగములరుతము
వినరాదు వీనుల కేమిదిసూత। అనుచును భరతుండు వనటజెందుచును
జనపతి వసియించు సౌధముంజేరి। మంగళ వాద్యముల్ మఱివినరావు
సంగీతరవములు సాగవిదేమి। రంగవల్లులుదీర్ప రంగనలేల
ముంగిళ్ళ ముత్యాల నంగుగానేఁడు। దేవతా గృహముల దివ్యశృంగార
మావంతయును లేద యాహా యిదేల। అని తలంచుచు మదిఁదల్లడపడుచు
తనతండ్రి నగరులో తద్దయుఁగాంచి। జనకుఁడు గానరామిని గడువగచి
తనతల్లి రత్నసౌధమునకు బోయి। యట పైఁడిగద్దెపై నంబనుగైకఁ
దటుకునఁ గని మ్రొక్కె తద్దయుభక్తి.

వ॥ అంత కైకేయి పుత్రునిచేరదీసి నాయనా నీమామయు తాతయు కుశలురేయన
అమ్మా యెల్లరు సుఖంబున్నవారు. గురునాజ్ఞ నే సత్వరంబుగవచ్చితి వారొసం
గిన ధనకనక వస్తువాహనంబులు వెనుక వచ్చుచున్నవి.

జోర:-కనకశయ్యయిటు పాడరి యున్నది జనకుండేడీ యమ్మా
జననిమైన కౌసల్యయింటికిని జనియెనె వేగమె చెపుమా ॥జ

(2) సుతుగని పల్కెను స్మితముఖకైకయు సూనృతచరితుడు నృపుడు
క్షితినివీడి జనె స్వర్గంబునకు చతురుడు నీజనకుండు ॥జ

(3) ఆమాటలువిని హా తండ్రీయని అవనిదొ్రళ్ళె భరతుండు
గోమున తనయుని లేవనెత్తెదాఁ గోమలి హర్షమునిండ ॥జ

వ॥ అంత భరతుడు రోదనంబుజేయుచు తల్లినిగని,

జోర:-ఏమిజెప్పె నాజనకుడు జీవము విడచునపుడు నాకు
రామలక్ష్మణులు ధన్యులైరిగద భూమీశుని దరినుండియును ॥జ

(2) శ్రీమంతుడు నీజనకుడు మరి నీ కేమియు జెప్పనులేదు
రామలక్ష్మణ! సీతా! యనుచును ప్రేమమీర విలపించుచును ॥జ

(3) మరలివచ్చిన రాముని ముఖ సరసిజమును గనువారే
పరమ ధన్యులు పుణ్యులటంచును బల్కుచు ప్రాణమువిడచె ॥జ

(4) సీతయు రాముఁడు లక్ష్మణుఁడెచటికి జేరబోయిరమ్మా
యాతెఱ గెఱిగింపుము వేగమె యన యాసతి బల్కెను మోదమున ॥జ

వ॥ నాయనా! శ్రీరాముడు చీరాజినములు ధరించి వనవాసంబునకు సీతాలక్ష్మ ణులగూడి యరిగె నన భరతుడు తన సద్వంశ వర్తనంబు దలపోయుచు తల్లి కిట్లనియె.

జోర:-మనుకులోత్తముడు పుణ్యవర్తనుడు ఘనుడగు రాముం డేలా
వనవాసముజేయగ బోయెను జననీ జనకజ లక్ష్మణుతోడ ॥జ

(2) ధరణీసురుల విత్తము గొనెనా? పరసతులను గోరెనా లేక
కరుణమాని భూప్రజలకు పీడలు గావించెనో దెల్పుము నిజమనిన ॥జ

(3) వరగుణయుతుడు శ్రీరఘురాముడు పరమదయాళుడు వినుము
పరస్త్రీలను కంటచూడడు మరియు పరధనమును గోరండెపుడు ॥జ

తే॥ మునులవేషంబుతో రామువనికిఁబంపి యావరాజ్యంబు నిడుఁడు నాయాత్మజునకు బదియు నాగ్లేడులంచు భూపతినివేఁడ నిచ్చె మీతండ్రి తాపంబు హెచ్చమదిని.

జోర:-అడవికి సీతారామ లక్ష్మణుల ననిపియు దుఃఖంబునను
విడచెను ప్రాణము నీజనకుండు విమలచరిత్రా మరియు ॥జ

(3) తనయా రాజ్యము నైకొనుమిపుడు ఘనులగు మంత్రులుగొల్వ
అనుభవింపు నిష్కంటక రాజ్యము నాకానందంబునుగల్గ ॥జ

(4) కూరంబగు నామాటలు మదికి నారాచముల్లై నాటఁ
ధారుణిపై బడి భరతుండప్పుడు తల్లడిల్లి దుఃఖమునఁ ॥జ

పున్నాగ - చాపు

జనకా యెటులుందుము నిన్నెడబాసి వనటచే గుందుచును ॥జ
ఘనుడగు రాముని వనమునకనిపియు మనలేకదుఃఖార్ణవమగ్నుడవై బోయితివా జ॥

చ॥ పరమపాపీ కైకవలన నీకీపాటు వాటిల్లెనకటా
ధరణీరాజ్యము కైకతలపైఁ గొట్టినీవు అరిగితివే దివమునకు అతితాపమునను ॥జ

(2) సుతులను విడనాడి తండ్రీ నీవు గతిలేక పోయితివా
అతిప్రేమ నన్నిక నాదరించెద రెవరు క్షితి నవకోసలపతి చెంతజేరెద ॥జ

సీ॥ రాము నడవికంపి రాజును జంపితి ఘోరరాక్షసివి ఛీ కులవినాశి
పాపిష్టి దుర్బుద్ధి పరమ వంచకురాల సజ్జనదూషిత చనటి ద్రోహి
దుఃఖంబుపై మరిదుఃఖంబు బెట్టితివి పుంటిపై కారంబు పూసినట్లు
దాపురంబైతివి పాపి చండాలి నీ కాళరాత్రివిగూళ కలుషచిత్త
ధార్మికుండైన యశ్వపతి తనయవగుచు బుట్టితివి కులముజెరుపంగ భూతమగుచు
వచ్చి మాయిల్లు చొచ్చితి చిచ్చువలెను జచ్చెనీచేత నాతండ్రి సత్యరతుడు

ద్విర:-అన్నఏమి యపకారముజేసెనె అడవి కంపితివి పాపి
కన్నతల్లివలె మన్నించును నిను కఠినచిత్తకులహంత్రీ ॥జ

(2) నీ కోరిక నేడీర్చనునిక్కము నీకనిష్టము నేజేతుగా
శ్రీకరుడగు శ్రీరాముని దోడ్కొని జేరవత్తు పురమునకుగా ॥జ

(3) రామచంద్రుని పదములు గొల్చుచు రాముడు రాజ్యముజేయగా
భూమిజనులు విని మోదమంద నేబోయెద నడవికి వేగగా ॥జ

(4) యిటనుండియు నీవేడ్చుచుండు నీ హితులను గూడి శిఖండీ
కుటిలచిత్త కులపాంసనీదు కోరికదీర్చను చండీ ॥జ

(5) ఎంతటి యవమానము దెచ్చితివే మాయినవంశంబున కిపుడు
ఎంత ద్రోహమొనరించితి కౌసల్యకు నెలమినుమిత్రకు మరియు ॥జ

(6) పతివిహీనయై పుత్రశోకమున పరితపించు కౌసల్య
హితమతితో నను జూడదు మరి నీసుతుడననుచు కోపమున ॥జ

(7) ఉరిబోసికొని చావుము లేక యురుకు మగ్నిగుండమునందు
ధరణిలోన బడిపొమ్ము వేగ దుశ్చరిత యుండవలదిందు ॥జ

(8) హాతండ్రీ ననుబాసిపోయితె హాసార్వభౌమ జనపాల
హాధరణీశ్వర ననువిడనాడి అరిగితివే దయలేక ॥జ

వ॥ అని యేడ్చుచు మంత్రులంగని భరతుండు దూరదేశంబున నేనుంటంజేసి రాము
నకు పట్టంబుగట్టుట నేనెఱుంగనైతి ఇదియునుంగాక నేనెన్నడును రాజ్యంబు
గావలయునని నాతల్లితో యోచింపలేదు. పూజ్యుండగు శ్రీరామచంద్రు
నడవికి బంపుట నేనెఱుంగ. ఇట్టి యుత్పాతంబులెల్ల ఈదుర్బుద్ధి కైకవల్ల గలిగె
నని బిగ్గరగ తనతండ్రినిం బేర్కొని రోదనంబుజేయు భరతుని కంఠధ్వనివిని
కౌసల్య సుమిత్ర కిట్లనియె.

తే॥ వచ్చినాడమ్మ భరతుడు వనరుహాక్షి వానిజూడంగ నామది వాంఛగలిగె
పుత్రశోకంబుచేతను బాగులునాకు గల్గునూరట కొంతని దలతు మదిని.

వ॥ ఇట్లు బల్కుచు లేచుతరుణంబున భరతుండు కౌసల్య గృహంబుజేరి యామె
పాదంబులపై వ్రాలి అతిదీనుండై రోదనంబుజేసి విలపింప.

జోర:-అనుభవించుము కంటకరాజ్యము అన్న యడవులకుం బోవగ
జనపతిబోయెను స్వర్గమునకు నీజననికి మోదము గలుగగ ॥జ

(2) అనిబల్కిన కౌసల్యనుజూచి వినయముమీరగ నపుడు
వినుమమ్మా నేనేమియు నెఱుగను నెఱుగవె నామదియెపుడుగ ॥జ

ద్విపద:-శ్రీరాము డడవిని జేరంగనేను । కోరియుండితినేని క్రూరుని పగిది
ధరణి భిక్షుకుండనై తిరుగుచునుందు। పరమాన్నమును పంచభక్ష్యమ్ములెల్ల
మరితాను భుజియించి పెరవారి కిడని; వాని పాపము నాకు వచ్చును తల్లి
దీనుండనై పుత్రహీనుండ నగుదు। జ్ఞానశూన్యుండనై గనలుచుండెదను
పెక్కుబిడ్డలంగని పెంచంగలేక। స్రుక్కుచుండెదువాని చొప్పున జనని
జూదమాడుచునెప్డు చోరులగూడి। వాదంబులాడెడు వంచకురీతి
ఆదిత్యుం డుదయించునావేళలందు । మోదాన నిద్రించు మూర్ఖునిగతియు
మరి రవికెదురుగా మలమూత్రములను। పరంగంగ విడిచెడి పాపాత్ముగతియు
గురుతల్పగులు బోవుదురితంబు మరియు। శరణన్నవారిని జంపెడునట్టి
పరమపాతకములు ప్రాపించునన్ను। నిరతిశయానందు నిత్యనిర్మలుని
కరుణాసముద్రుని కానకుంబోవు । పెరిగియుండిననిట్టి దురితజాలములు
కరమర్థిననుజేరు నెరుగనుతల్లి॥

వ॥ అని చింతాకుల స్వాంతుండై శపథంబులు బల్కు భరతునాలింగనంబు గావిం
చి అంకపీఠంబున కూర్చుండబెట్టుకొని, అతని మేనుహస్తంబున నిమురుచు
శిరంబు మూర్కొని నాయనా! నీవాక్కులవలన రామునిపై నీకెక్కువ

మకుటపగలదని నేనెరుంగుదు. నిన్ను జూచినంత నాయుసుఱు నిలచెనని బహు
ప్రకారంబుల నతని నూరడించె. భరతుడు రాత్రి యంతయు రాముని దశర
థుని తలఁచి తలఁచి వలవించుచుండెను. అంతవేగుటయు, వసిష్ఠుండు చనుదెంచి,

జోర:-ధైర్యముబూనుము శోకము విడువుము తండ్రికి చరమక్రియలన్
ఆర్యసమ్మతి జేయగ వలయును అగ్నులజేర్చియు వేగన్ ॥ జ॥

(2) అని తెల్పగ నారాజశవమ్మును అటుదెచ్చిరి । వేగమునన్
గని భరతుడు మూర్ఛిలి భువిఁబడ ఘనుడు వసిష్ఠుండంతన్ ॥జ

(3) భరతుని లేవగనెత్తి మునీంద్రుడు తరుణముగాదిది వినుమా
అరయగ గాలయాపనమాయెను స్థిరుడవుగమ్మా రమ్మా ॥జ

(4) అని బల్కుచు జనపతిశవమును నునిచియు శిబికనువేగన్
జనుచుండగ నృపుతరుణులందరును వెనుకొని పోయిరి శోకముమీరన్ ॥జ

(5) శిబికడించియు మంత్రియుతంబుగ చితిపై దశరథు నునిచి
విభుని చుట్టుకొని రమణులేడ్వగ విలపించుచు భరతుఁడుచేరి ॥జ

వ॥ దహన సంస్కారంబు గావించె. దుఃఖించుచు నెల్లవారును సరయూనదిజేరి స్నా
తులై గృహంబు ప్రవేశించి పదిరాత్రింబులు గడచిన పదునొకండవ దినము
అశౌచంబు బాపుకొని ఉత్తరక్రియలన్నియు సాంగంబుగ నెరవేర్చి బ్రాహ్మణు
లకు షోడశ మహాదానంబులజేసి మృష్టాన్నంబుల పరితృప్తులం గావించి పదు
మూడవదినంబు నస్థిశకలంబులు గంగలో గలిపి విలపించుచుండిన భరత శత్రు
ఘ్నుల వసిష్ఠాది మంత్రిపుంగవు లెల్లరు నూరార్చి శుభస్వీకారము గావించిరంత.
భరత శత్రుఘ్నులు రామచంద్రుని సన్నిధానంబు జేరదలంచుచుండు నెడ

జోర:-శృంగారించి చందనమలదియు చెనటి మంథరటురాగ
అంగనలాపుచు శత్రుఘ్నునకు అప్పగించిరి వేగా ॥జ

(2) వనవాసము శ్రీరాముని బంపుట మనుజేశ్వరు జంపుటయు
వినుమయ్యా యీకుబ్జవల్లనే జనియించె ననర్థముల్ మరియు ॥జ

(3) అనిబల్కిన కోపాధిక్యంబునను ఘనుడు శత్రుఘ్నుడు దానిన్
గనియు తన్ని యిల బడనీడ్చెను కలుషచిత్తయగు దానిన్ ॥జ

(4) ఇది గని దాని సఖులందరు భయమున నిటునటు పరువులుబారి
సదయురాలు కౌసల్యను శరణన చావుదప్పె మన కని జనిరి ॥జ

వ॥ అంత కుబ్జ కైకేయినిజూడ దానికడ్డంబు వచ్చునెడ శత్రుఘ్నుండు కైకేయిం దిట్టుచు కొట్టబోవు సమయంబున భరతుని జేరవచ్చిన, అతండు తమ్మునింజూచి.

తే॥ జంపవలసినదే వీరి జంపనైతి ఆడువారలజంపి రన్యాయులనుచు
రామచంద్రుడు మనలను రక్తిమీర జేరదీయడు గావున వీరిఁవిడుము

వ॥ అనవుడు శత్రుఘ్నుండు వారలవిడచిపుచ్చె నంత రాజముఖ్యులు భరతున కిట్లనిరి

సీ॥ అన్న యడవికిబోయె అయ్య స్వర్గముజేరె అభిషేకవస్తువులన్నియివిగొ
పట్టంబుగట్టుక పాలింపుమీధర రాజులేకున్న రాష్ట్రంబుజెడును
మంత్రులు విప్రులు మానులు మీకున్నె యెదురు జూచెదరిదె యెలమిమీర
తమ్మునితోఁగూడి దశరథనందనా ధరణియేలుము రాజధర్మముగను
అనుచు బలికిన వారల కనియెనిట్లు రాజునేగాను రాముడేరాజు నుండి
అడవికేఁబోయి ప్రార్థించి యామహాత్ము నిటకు దోడ్కొనివచ్చెద నింపుమీర

వ॥ భరతుండిట్లు బలికి అభిషేకవస్తువులకు నమస్కరించి యివియెల్లయు ఆడవికి గొని రండు, అన్న రామచంద్రునకు అచ్చటనే యభిషేకము గావించి దోడ్కొనివత్తము. ఇప్పుడే పయనింపవలయు, పనివారల బంపి కానకుబోవు మార్గంబుల చక్కజేయించి, చతురంగ బలంబులతో ప్రయాణ సన్నాహంబు గావింపుడనిన వార లతిసంతోషభరితులై సైన్యంబు నడుచుటకు దారిచక్కజేయుండని పనివాండ్రనుబంప వారలు చెట్లుగుట్టలు గొట్టి మిట్టపల్లంబులు సరిచేయుచు అచ్చటచ్చట నీరులేనితావుల కొలనులు ద్రవ్వించి, ఉపవనంబులు గల్పించి మార్గంబంతయు శృంగారవంతంబుగ జేయుచుండిరి.

ద్విపద:-మరునాడు మునిలోక మాన్యుఁడౌ గురుఁడు। నరవి వసిష్ఠుండు సభజేర్చి వేగ।
భరతుని రావించి బలికెనుమునియు। ధరణి రాజ్యముగొనుము తడవేలయనిన।
గురునిమాటలువిని కోపంబుమీర। గురుభక్తిపరుడు యే నరుడైనగాని।
గోరునేమది రఘుకులజరుపదవి। కోరి నేగొనునట్టి ఘోరపాపుడనె।
యేరీతిబల్కెద వెరుగవేమున్న। మావంశజులెల్ల మరియు జ్యేష్ఠునకె।
పట్టాభిషేకంబు పరగజేయుటయు। యెఱిగియుండియు నీవు యిటులబల్కెదవు।
కట్టడి కైకేయి కారణంబునను। బుట్టెనిప్పుడిట యిట్టి దుర్నీతి।
వచ్చెను యపకీర్తి వసుధపైనాకు। సచ్చరితు శ్రీరామచంద్రుని, తోడి।
తెచ్చియు రాజ్యంబునిచ్చియు వేడ్క। మచ్చికను సేవింతు మానీంద్రచంద్రా

వ॥ కావున, శ్రీరామచంద్రుని సన్నిధానంబున కిపుడే పోవలయుః చతురంగబల

సమేతంబుగ ప్రయాణంబు గావింపుడనుచు, అయోధ్యా నగరవాసులనందఱను తనతోడ వచ్చుటకు నియమించి మంత్రి పురోహిత భృత్యవర్గంబుతో తల్లులం గూడి రథారూఢులై యరణ్యమార్గంబున జని చని గంగాతీరంబున అతిరమ్యమైన శృంగిబేరపురంబు డాయంజని అచ్చో సైన్యంబులు నిలువ నాజ్ఞాపించి, రేపు నదిని దాటుదము. ఉత్తమ తీర్థంబున తండ్రికి నివాపంబు గూర్చెద ననవుడు వారట విడిసిరి. అంత నిషాదనాయకుండగు గుహుండు సేనాసమూహంబుల గని తనహితులను భృత్యులను పిలిచి యిట్లనియె.

హిం:-హితులారా ! యీసేనల గంటిరే యేరీతిని నాక్రమించెనో దేశముఁ
అతి కలకలమున జలధినిబోలుచు నంత కంతకు హెచ్చుచున్నవి ॥శ్రీ

(2) జలజమిత్ర కులధ్వజములగనుడీ బలములు గొల్వగ భరతుడు వచ్చెను
ఖలుడు కుబుద్ధితో తనివినొందక బొలియింపబూనె శ్రీరఘుపుంగవునిఁ ॥శ్రీ

(3) శ్రీరామునికి తోడ్పడకున్న ! వీరులార ! మనప్రాణములేల !
నీరజదళనేత్రుడు మనస్వామితో నేఁబోవక యిటనిలచుట మేలయ్యె ॥శ్రీ

(4) గంగతరించిగా వీనిపరాక్రమము గనుగొనవే నాభుజబలమున వేగ
మంగళకరుఁడౌ జానకిరమణుని మదినుంచియునే నొకచెయి జూచెద ॥శ్రీ

(5) నావల నన్నిటి సిద్ధముజేసియు నావనావకు బలములతోడ
కైవర్తకులు కావలి యుండుడి యేవిధిదాటునో చూతముగాక ॥శ్రీ

(6) ఫలములు మధువు మాంసభక్ష్యములు పాయసముం గొనిపోయి సేనతని
కలుషాకలుషభావము తెలిసియు కడువేగవచ్చెద భద్రముసుండి ॥శ్రీ

వ॥ అని భక్ష్యభోజ్యంబులుగొని బంధుమిత్రులతో భరతుని జేరవచ్చిన సుమంత్రుడు రాముని హితుండగు గుహుడు వచ్చెనని భరతున కెఱింగింప నతం డాబోయ జేని వివిధ సత్కారంబులఁ దనుప భరతునికి గుహుడిట్లనియె.

జో:-ఫలమూలంబులు గలవిట గొల్లగ జలజాప్త కులాభరణా
నిలిచి సేనతో నాతిథ్యముగొని నెమ్మదిబొమ్ము ప్రార్థించెద ననిన ॥జ

(2) అనఘా ! ప్రియసత్కారంబులతో నీ వాదరించితివిచాల
మనమున సంతసమందితి మిత్రమ మముదాటింపుము గంగనువేగ ॥జ

(3) ఘనుడు మహాత్ముడు భరద్వాజమహాఋషిఁ గానగ బోవలెనని
వినియు నిషాదపతి యిట్లనియెను విమలచరితుని గని యంత ॥జ

(4) భూనాయక సందేహము నీయెడ బొడమెను మాకిదెవినుము
నేనలగూడి వచ్చితివేలను శ్రీరాముని కెగ్గుజేయగను ॥జ

వ॥ వీనుల కామాటలు సోకినంత భరతుండు పరితప్త హృదయుండై.

ధన్యాసి - చాపు

ప॥ రామా యీనింద భరియింపలేను రయమున బ్రోవుము రాజీవదళనేత్ర ॥రా
అ॥ ఈమహి నీయనుగు సోదరుడనయ్యు నెంతపాపినైతి నేమిదికాలము ॥రా

చ॥ కరుణించి నాపైని దోషము తొలగింప కన్నన నీసేవ యొసగుము రఘువర
శరణార్తిహరరామా నవకోసలధామా సనకాదినుతచరణా జానకిరమణా ॥రా

డోర:- అనుమానింపకుమయ్యా యిపుడునా యన్నను దోడ్కొనిరాగ
జనియెద నేనతో సత్యము నమ్ముము సఖుడా మద్గురు ప్రియుడ ॥జ

(2) భరతునిగని యతిప్రేమను గుహుడు పరమానందముతోడ
కరుణాకర ననుమన్నింపుము ప్రీతి కాకుత్స్థకులాభరణా ॥జ

హంసధ్వని - రూపకం

ప॥ పరమాత్మ శ్రీరాముని భక్తుడవు మాన్యుడవు ॥ప

అ॥ సరియే యిలనొరులు నీకు సరసగుణాన్విత సచ్చరిత ॥ప

చ॥ పరికింపగ నీవంటి ప్రభువెందునుగాన అరయగ శ్రీరామునకు అతిప్రియుడవును
నిరతము పదపద్మంబుల స్థిరబుద్ధినిగొల్చు పరమపుణ్యుడవు నవకోసల వరదుడా

వ॥ ఇవ్విధంబున నొండొరులు భాషించుచు రామచంద్రుని వృత్తాంతంబు సర్వము నెఱింగించి, యారాత్రి ఇంగుదీ వృక్షంబు నీడను నీరుదాగి శ్రీరాముడు పవళింప లక్ష్మణుండు విల్లుబట్టి గాచియుండ, నేను లక్ష్మణుని గని "నేను భద్రంబుగా గాచి యుందును. మార్గాయాసంబున శ్రమించితివి. నిదురింపుము. నామాట నమ్ముము" అని వేడినంత,

సీ॥ ఈరీతినేబల్క మీరుదుఃఖముతోడ ననుగని సౌమిత్రి యనియెనిట్లు
నీమాటనమ్మితి నిక్కంబు మిత్రమా పరమాప్తుడవు రామభక్తుడవును
ఈగొడ్డునేలపై నీపూరిసెజ్జపై భూమిజాతనుగూడి రామవిభుండు
పవళింప గాంచిన ప్రియ్యుడే హృదయంబు నిదురెట్లు వచ్చును హృదయమెరియ

పెనుగాలిచేతను వనధిలో జిక్కిన నావచందంబున నామనంబు
అల్లాడుచున్నది యధిక దుఃఖంబున శ్రీరాము డీవనసీమచేర

తే॥ నేడయోధ్యలో నేడ్పులునిండియుండు తండ్రి మరణించు మరియునుతల్లులెల్ల
ప్రాణములు బాసియుండురు భద్రయశుఁడ యేమిచేయుదు కైకమ్మ యింతచేసె

తే॥ భరత శత్రుఘ్ను లిరువురు భక్తిమీర తండ్రి కుత్తర క్రియజేసి ధన్యులగుచు
సకల సామ్రాజ్య విభవంపు సౌఖ్యమంది యుండురటవారు మేమిందు గుందుచుండ

వ॥ లక్ష్మణుండిట్లుబల్కి దుఃఖించుచుండ అరుణోదయ మగుటయు రామచంద్రుడు
నిదుర మేల్కాంచి కాల్యకరణీయంబులుదీర్చి జటలుదాల్చి గంగానదిదాటి దండ
కాటవి ప్రవేశించిరని గుహుడుబల్క ఆమాటలువిని,

యదుకులకాంభోజి - చాపు

ప॥ అన్నా రఘురామ హాజగదభిరామ యెన్నడు నినుజూతు జానకిరామ ॥అన్నా

అ॥ నిన్నువిడచి నేనెటులుందు భువిలో నీకన్నాదిక్కెవరు ఆపన్నారక్షణ దీక్షా॥అన్నా

చ॥ చీరాజినమ్ములు జడలు ధరించియు మారసుందర నీవు మౌనివేషమ్మున
ఘోరాటవులలో జేరి యిటుదిరుగ యేరీతిసహింతు యెటులోర్తునయ్యా ॥అన్నా

(2) జనకజాప్రియ భక్తజనహృదయసంచార దినకరకుల శేఖర రఘువీర
వననిధి గంభీర దనుజసంహార ననుదయజూడర నవకోసల పురవర ॥అన్నా

జోర:-భరతుడు మించినశోకముచే నిటుపరితపించి మూర్ఛిలియు
ధరణిబడి మరిలేవకున్న నా తనయునిగని తల్లులును ॥జ

(2) హాసుగుణాకర పలుకవేమిర హాపుత్రాయని పలవించుచును
భాసురాంగనీవిటు పడియుండిన బాపెదరెవరీ దుఃఖమును ॥జ

వ॥ అని బిగ్గరగ రోదనంబుజేయ కన్నులుదెరచిన భరతుని కౌసల్య తనుగన్నబిడ్డవలె
లేవనెత్తి మేనునిమరి కౌగిలించి నాయనాయని

జోర:-నినుగనియును నాతనువున ప్రాణముల్ నిలిచియున్నవిర తనయ
జనకుడు స్వర్గము చేరెను రాముడు వనముజేరె సుజనవిధేయా ॥జ

(2) అన్నా నీవిటు లడలుచుండ నిన్నెవ్వరు దయతోనిపుడు
మన్ననజేసి యాదరింతురు మనుకులతిలకా మరియు ॥జ

(3) కౌసల్యయు తన్నూరడింప యాఘునుడు శోకమునణచి
భాసురముగ శ్రీరామభద్రుడు పవళించిన తలమునుజేరి ॥జ

(4) తల్లుల మంత్రులతోనసె భరతుడు అల్లదె రాముశయ్య
ఎల్లలోకముల నేలెడు విభునకు నీగతిబట్టెనుగా నాహా ॥జ

(5) భూమిజ ధరియించిన రత్నభూషణంబు లారయుచును
హేమరజంబులు రాలినవివిగో యీదర్భలపై నిపుడు ॥జ

వ॥ అని తెలుపుచు దుఃఖించుచు దుఃఖంబినుమడింప మైమరచి మరలలేచి.

తే॥ రత్నపర్యంకమందున రమణిగూడి సరససల్లాపములనుండు సరసుడిచట
గడ్డిపైబవ్వళించె నీ కటికనేల కష్టమెరుగని నాయన్న కైకవలన ॥జ

వ॥ ఆహానేనెంత ద్రోహినైతి నాకొరకుఁగాదె సకలసంపత్కరమైన పట్టణంబువిడచి
అడవుల నిడుములబడుట అన్నా రామచంద్రా నీ మొగమెటులుచూతును అనుచు

నీలాంబరి — చాపు

ప॥ ఘనమగు కఱకు దర్భశయ్య నీకు రామచంద్రా
కనకరుచిర మృదుతల్పంబాయెగద రామచంద్రా ॥ఘ

(2) గారకొమ్మలనీడ కనకసౌధమాయె రామచంద్రా
హోరుగాలి నీకు వింజామరలాయె రామచంద్రా ॥ఘ

(3) పొందుగ ఖగమృగ ఘోషములు నీకు రామచంద్రా
వందిమాగధస్తోత్రపాఠములాయెనా రామచంద్రా ॥ఘ

(4) కానలొనొంటిమై కాలమెటుగడపేవు రామచంద్రా
వేనవేలు ప్రజలు వేచియుందురెపుడు రామచంద్రా ॥ఘ

(5) కటికనేల నిటు పవళింపసీతతో రామచంద్రా
కటకటనావల్ల గల్గె నీకష్టంబు రామచంద్రా ॥ఘ

(6) పరికింప దైవముకన్న కాలమె బలము రామచంద్రా
మరియును నీవంటి మహారాజునిటుజేసె రామచంద్రా ॥ఘ

(7) జనకుని సుత యీ సుకుమారి జానకి రామచంద్రా
వనకష్టములబడుచు నన్నెటుల దలచెనొ రామచంద్రా ॥ఘ

(8) ఎంతటిపాపి నేనెంత క్రూరుండను రామచంద్రా
యింతలు వచ్చెను నానిమిత్తంబున రామచంద్రా ॥ఘ

(9) పాడరియున్నది స్వామి మనయయోధ్య రామచంద్రా
పాడిమి నీ భుజపాలన లేకను రామచంద్రా ॥ఘ

(10) సుందర నవకోసలేశ నీసాక్షిగ రామచంద్రా
యుందును నీవలె వ్రతము సల్పుచునేను రామచంద్రా ॥ఘ

జోర:-అన్నా అన్నాయని విలపించుచు నార్తిని బొగలుచు నపుడు
సన్నుతచరితుడు భరతుడు మూడుజాములు గడువగ మరియు ॥జ

(2) చీరాజినములు జడలు దాల్చిన్నే ఘోరాటవి నుండెదను
శ్రీరాముడె రాజ్యంబేలును నాకోరిక యిదియే వినుడు ॥జ

(3) దేవతలార మ్రొక్కెదమీకు దీర్పుడు నా కోరికయున్
భావము రంజిల సేవించియు రమ్మని ప్రార్థించెద శ్రీరామున్ ॥జ

(4) భరతుండిట్టు లనేకవిధంబుల పరితపించుచు నుండన్
అరుణోదయమున్న గుటయుజూచి యనెనిటు తమ్మునితోడన్ ॥జ

(5) అన్నను జూడంగ బోదము గుహునింపు డనుజా దోడ్కొని రమ్మా
ఎన్నగ గంగనుదాటగ నావలు నున్నవె కనుగొనిరమ్మా ॥జ

వ॥ అనవుడు శత్రుఘ్నుండు గుహుని దోడ్కొని వచ్చిన,

జోర:-స్వామీ యోడల సిద్ధపరచితిని సంతసమున నేనూరు
రామభద్రుని జూడబోవుదము రయమున రమ్ము లెమ్ము ॥జ

వ॥ అనవుడు సైన్యంబుతోడ నందరును గంగాతీరంబుజేరి వారి వారి యానంబులతో పడవలనెక్కి గంగానది యావలిగట్టు జేరిరి. రాజ్యంబగు నావపై తల్లులతోడ భరత శత్రుఘ్నులు మంత్రి పురోహిత గుహసమేతంబుగా భాగీరథి నుత్తరించిరి. భరతుండు చమూసహితుండై భరద్వాజాశ్రమంబు సమీపించి క్రోసుదూరంబున సైన్యంబువిడచి, పాదచారియై,

ద్విపద:-గురుని వసిష్ఠునిగూడి తమ్ముండు| భరతుండు నామౌని పదములవ్రాల
కరుణతో దీవించి కడుమోదమునను| ఆవసిష్ఠుని కర్ఘ్యపాద్యంబులిచ్చి
భావము రంజిల్ల భక్తిపూజించి| కుశలానుయోగంబు కూరిమినలిపి

దశరథసుతుగాంచి తపసి యిట్లనియె। స్త్రీలోలుడై రాజు బాలిశుండగుచు
పలుమంచిచెప్పనీ కిల్లధరిత్రి। అఖిల రాజ్యమునీవు అనుభవించుచును
సుఖమున నుండక -చోద్యంబుగలుగ। జనుదెంచినావేల సైన్యంబుతోడ
ఘనుని శ్రీరాముని గారియపెట్ట। పాపపురాజ్యంబు ప్రాపించెగాన
పాపబుద్ధియునీకు ప్రబలెఁ గావలయు। జలజాప్తకులవీరు జానకీరమణు
అలయింపదోచెగా ఔర నీమదికి। చాలు నీ వచ్చిన జాడనుబొమ్ము
పాలింపు మీతల్లి పల్కులుప్రీతి.

వ॥ తన్నుదూలనాడి బల్కెడు భరద్వాజ మహర్షినిగని విషణ్ణవదనుండై భరతుడు.

కం॥ ఏపాపము నేనెరుగను భూపుని రాజ్యంబు గోర బోధయొనర్పక
పాపవిధి కైకేయియె బాపురెనన్నింత భంగపరచె మహాత్మ

వ॥ అనివచింప నిర్దోషుండగు భరతుని వాక్యంబులువిని భరద్వాజుండంత నతని
గాఢాలింగనంబు గావించి.

జోర: ఇనవంశోత్తమ నీసద్గుణముల నెరిగియుండి నేనిపుడు
నినుదూరితి మదినొవ్వకుమనఘా నీకీర్తి వెల్లజగములను ॥జ

(2) ఘనుడగు రాముని కతిభక్తుడవు కడుధన్యుడవు నీవు
మనుకుల వర్ధన నినుగంటిని నా మదిరంజిలె ముదమునను ॥జ

(3) ఈరాత్రి యిచ్చట నిలచి నేనతో విందు లారగించి
కూరిమి శ్రీరఘురాముని సన్నిధి జేరబొమ్ము వేకువలేచి ॥జ

వ॥ అనిబల్కి భరద్వాజుండు సైన్యంబు నిటకురప్పింపుమన నతం డట్లుగావించె.
మునివరుండును తూర్పుముఖముగా నిలచి దేవతల ప్రార్థించినంత అమ్మహా
త్ముని యాశ్రమంబున.

రగడ:-అందమైన పలు సుందరగృహములు అందునమర్చిన ఆసనంబులు। ఎందు
జూడ సెలయేరులు కాల్వలు అందందున నడబావులు కొలనులు। దధిఘృత
క్షీరముల్దనరిన చెరువులు నలుదిక్కుల నరసాన్నపు కొండలు। పలువిధంబులగు
భక్ష్యరాసులు సరసత సూపశాకంబులను। పరమాన్నంబుల బావులు మరియును
సురచేనిండిన సొగసగు కొలనులు। మరియును మద్యమాంసంబులతో యిరవొం
దెడు పెనుకూష్మాండంబులును। సురతరుసుమములు పరిమళగంధముల్ మణిమయరత్న
ఘనభూషణములు। పసరుగనూతన వస్త్రజాలములు బంగరుశయ్యలు పట్టుశాలు

వలు। రంగుమెరసెడు రమ్యవస్తువులు సుగంధమిళిత కర్పూరవీడెములు। అగరు వాసనలు అతిశయిల్లగా బహువిధమైన పదార్థజాలములు। మహర్షి మహిమను మరి నింపిరయొప్పగ శృంగారంబుగ నృత్తగీతములు। మంగళవాద్య రవంబులు చెలగగ విందులుజేసెను భరతుని సేనకు। పొందుగాను భరద్వాజుడు ప్రీతి.

వ॥ ఇట్లు విందుజేయ సైన్యంబంతయు మహానందమున తృప్తులై యారాత్రి యట నుండి, ప్రభాతంబగుటయు భరతుండు ప్రయాణంబు గమ్మని సేనల కాజ్ఞాపించి మునీంద్రునికి నమస్కరించి రామచంద్రుం డెందున్నవా డెరిగింపుమనిన.

జో॥ర:- చేరియిచటికి దవ్వున నున్నది చిత్రకూట నగము
మీారటుజనుడి దక్షిణ మార్గము కూరిమి మీారగనిపుడు ॥జ

(2) సుందరమై ఫలవృక్షంబుల ఆనంద దాయకంబగుచు
మందాకినియను నదిగల దచ్చట మలయమారుతము వీచు ॥జ

(3) మునియిటు మార్గము తెల్పుచునుండగ జనపతి దశరథసతులు
వినయంబునను మ్రొక్కియు నిల్వగ గని భరతుని భరద్వాజుండు ॥జ

(4) వీరలలో మీా మాతలెవ్వరో యెరిగింపుమి యిపుడనిన
ధీరుడు భరతుడు వినయముతోడ తెలియబల్కె వేగమున ॥జ

హిం:-ధర్మదేవతవలె గన్పట్టుచు దలచుచు రాముని శోకించెడు యీా
నిర్మలమతి నృపుపట్టపుదేవి ధర్మమూర్తి శ్రీరాముని జననీ ॥శ్రీ

(2) వనటను స్రుక్కుచు కౌసల్యాదేవి వామభుజము పట్టినిలచినట్టి యీా
వినుతగుణశీల లక్ష్మణ శత్రుఘ్నుల గనిన మహాసాధ్వి కరుణార్ద్రహృదయ ॥శ్రీ

(3) పరమపావనుల కానకుదరిమియు పతిప్రాణంబులు బాపినట్టి యీా
దురితచిత్త దుష్ట పాపి నిష్ఠురశీల వరమునీంద్ర నను గన్నకైక యిదే ॥శ్రీ

(4) విని మునివరుడు భరతున కిట్లనె జనననిని నీవిటు దూరకుమయ్యా
వనవాసమునకు రాముడు వచ్చుట మునిజనములకెల్ల సౌఖ్యప్రదము ॥శ్రీ

వ॥ మరియు నమరులకు దనుజులకు నందరికిని మేలుకొఱకు సుమ్మా! యని, శీఘ్రంబున నింక రాముని చెంతకు బయనింపుమన భరతుం డంత చమూసహితం బుగ దక్షిణ దిశంబోయి యమునానది దాటి బోవుచుండ చిత్రకూటము గను పింప తమ్మునిజూచి,

తే॥ జూచితే చిత్రకూటంబు సొంపుపెంపు
రత్నసానువుచే నతిరమ్యముగను
మరియు ఫలపుష్పములనొప్పె తరులుచాల
మలయమారుతమును వీచె మనము లలర.

జోర:-గనుపడుచున్నది హోమధూమము మునివరు లుందురు యింకు
జనకజ సౌమిత్రిని శ్రీరాముని గననగునిచ్చో వనము ॥జ

(2) అనుచును సైన్యము నచ్చట నిలిపి జనిరటు వెదకుచు నపుడు
అనఘులు నడచిరి నలుదిక్కులను ఘనుడౌ రాముని జూడగను ॥జ

వ॥ అట్టియెడ శ్రీరాముడు, వివిధ ధాతువులచే నొప్పు చిత్రకూటనగంబునం గల వింతలను జానకీదేవికి విలాసంబుగా జూపుచు,

తే॥ అందమైయొప్పు వనము లంగందుగనుము కుంద మందార కేతకీ సుమము లడర పారిజాతాల మల్లెల పరిమళంబు నిండె దిక్కులనెల్లను నీరజాక్షి.

సీ॥ ఈ చిత్రకూటంబు నిందుండు గుహలును సంతోషదాయులు సఖరో వినుము
చాపరాళ్ళవికొన్ని స్ఫటికాలవలెకొన్ని అరుణమై పసిమిచే అలరుంగొన్ని
యీరత్నసానుల విహరించు చున్నారు సిద్ధులు సాధ్యులు చెలియజూడు
కిన్నర మిధునముల్ కింపురుషాళులు గానముల్ చెలగెడు కాంత యిచట
వివిధధాతులనొప్పు నీవింత యీనగంబు నెంతయు మనోహరంబునై వెతలబాపు
జూడ చూడంగ క్రొత్తలౌ సొంపుగనుము సుందరీ నీతోయిందుండ సుఖముగాదె

హిం:-చిరకాలము యిటనుండియు మన మీ చిత్రకూటనగమును విడచి
మరలిపోవుటకు మనసురాదుచెలి మందాకిని యతిమనోహరము ॥శ్రీ

(2) సుందరముగ నీనగము అయోధ్యా యిందలి మృగములే పరిజనములు మరి
మందాకినియే సరయూనదియని మదిరాక్షీ నీమదిలోం దలపుము ॥శ్రీ

మోహన — ఏక

ప॥ మందగమన చంద్రవదన మందాకినిగ గనుమా ॥మం

అ॥ అందమైన విచిత్ర పులినతలంబుమీరియు
హంససారస సరసిజములతో సుందరి నినుబోలి యున్నదీ యిది ॥మం

చ॥ చారుతర పుష్పఫలముల నొప్పియు భూరుహంబులు వరుసలుదీరి
శారికా శుకపికరవములతో చేరి మయూరమ్ముల్ వింతనాథ

తీరములతి సొంపుజూప సారెకును మదికోర్కెలూర
కూరిమి నినుగూడియుండ మీరిన సౌఖ్యం బిలగలదే ॥మం

(2) అనువుగ నామది అరసియునీవు అనురక్తిని మెలగగను
చనువున నన్నెడబాయక సతతము సౌమిత్రియు సేవింపగను
అనుదిన మీగిరిసానువులందున ఘనమందాకిని తీరంబునను
వన మధుఫలముల భుజియింపుచు నే మన నవకోసలమని దలచెద చెలి ॥మం

హిం:-పరిమళమైన విరులను మునిచియు మురిపెము చెలువము హర్షముమీరగ
సరసిజనేత్రుడు సఖియనుగూడుక సరస సల్లాపము లాడుచు నవ్వుడా ॥శ్రీ

(2) అతులిత ముదమున సీతారాములు అతిమధురంబైన ఫలములు గోయుచు
చతురత సుమముల జల్లుచువేడుక మితిమీరిన యానందముతోడ ॥శ్రీ

జోర:-ఇదుగో స్వాదుఫలంబులు ప్రియసఖ యివిగో పరిమళ సుమముల్
యిదుగో చేకొను మనుచుండగ నట వినవచ్చెను యొక ధ్వనియు ॥జ

(2) పరువులు బారెడు ఖగములు మృగములు భయమున నతివేగమున
మరియును ఘనమగు ధూళిరేగెనిదె అరయుడు లక్ష్మణ యనిన ॥జ

(3) లక్ష్మణుండు వృక్షమునెక్కియు వీక్షించియు దిక్కులను
అక్షయబాణ తూణీరముగొను అన్నా వేగం బనెను॥జ

వ॥ అగ్నిహోత్రంబు చల్లార్పుము సీతను గుహాలోనికి బంపుము! యుద్ధంబునకు సన్నద్ధుండై యుండు మన,

జోర:-ఏమి భయంబు గల్గె నిప్పుడు యేలను యిటుబెల్కెదవు
ఏమహీపతి వేటకువచ్చెనో యెరుగుము చక్కగ యనుడు ॥జ

(2) ఉత్తర దిక్కుననుండి సైన్యము వచ్చుచున్నది వినుమా
చిత్తము మనపైఁ జేర్చికోధమున జేరవచ్చె భరతుడిదె గనుమా ॥జ

(3) ఇచ్చెను రాజ్యము జనకుడు తనకని హెచ్చుగమది పొంగుచును
మచ్చికపేడి మనలజయింపను వచ్చెను భరతుడె యిపుడు ॥జ

(4) మదగర్వితుడై వచ్చెడు భరతుని వధియించెదనిదె జూడు
ఎదురెవ్వరు నాకవనిలో వాని హితులతో గూల్చెద నిపుడు ॥జ

వ॥ ఇట్లు కోపావేశమున బలుకు తమ్మునింగాంచి.

తే॥ ఏల యిటుబల్కెదవు మరి చాలు చాలు జనకు తెగటార్తునంటివి జడియకపుడు
అనుజు వధియింతుననెదవీ వౌరయిపుడు ధనము రాజ్యముపై నాశగొనెదవేని

తే॥ నీవుగైకొని యేలుము నేడయోధ్య ఇమ్ము రాజ్యమ్మునని నంత ఇచ్చునతడు
బాణ తూణీరములు పట్ట పనియులేదు అధికభక్తుండు భరతుండె యరయ వీవు.

జోర:- ప్రార్థించియు ననురమ్మని పిలువగ భరతుడు వచ్చెడునిపుడు
అర్థము తృణమని నెంచెడు వాడు అతిధర్మాత్ముడు ఘనుడు ॥జ

వ॥ రాముండిట్లుపల్క లజ్జించి లక్ష్మణుండు అన్నా ! మనతండ్రి దశరథుండు వచ్చె
నేమొ, అన సౌమిత్రీ! వచ్చుచుండనోపు! మనజనకుని, శత్రుంజయమను
పట్టపేనుగు వచ్చుచున్నదేమొ గనుమన దృష్టిసారించిచూచి రాలేదనియె.
లక్ష్మణా ! దిగిరమ్మని, సీతా రామ లక్ష్మణులు మువ్వురు కుటీరము జేరిరంత.

జోర:-భరతుడు మంత్రిపురోహిత హితులతో నరిగియు నొకదిక్కునను
సరగున శత్రుఘ్నుడు నొకవైపున అరయుచుండగ నపుడు ॥జ

(2) ఘనులగు మునుల యాశ్రమంబులు గనపడుచున్నవి యనుచు
అనువుగ రాముని పర్ణకుటీరం బలరుచుండు నిందనియు ॥జ

(3) వరుసగాను తరుశాఖలయందు వల్కలముల గనియు
సరగున మార్గము గనుటకు సౌమిత్రియు మరి యుంచిన గుర్తులివియనియు ॥జ

మఃఖారి - ఆది

ప॥ ఎటుల దయజూతువో యిభరాజగమన స ॥న్నె

అ॥ కటకటనీరీతి కష్టపెట్టితిచాల కుటిలచిత్తుడ నేరామా కూరిమిన ॥న్నె

చ॥ నీపాదములు మది నెరనమ్మియున్న నా పాపముల్ బాపుమయ్యా పరమపురుషదేవ
నాపాలిదైవమా నవకోసలరామా కాపాడతరుణమిది కరుణానిధేన ॥న్నె

జోర:-ఇటుపల్కుచు రామా రామాయని విలపించెడు భరతునిగనియు
అటనుండెడు మహానీయులు దెల్పిరి అదుగో రామా శ్రమమనియు ॥జ

(2) ధీరుడు భరతుడు గుహుని సుమంత్రుని చేరియు తమ్మునితోడ
శ్రీరామచంద్రుని పర్ణకుటీరము జేరబోవుచు ప్రియమలర ॥జ

ద్విపద:-అన్న రఘుకుంజరు ఆశ్రమంబిదుగో। గన్నారగాంచంగ గలిగెను మనకు
సమిధలు దర్భలు విమలతోయములు। సుమఫలములనుంచె దాసౌమిత్రియిందు

అదె వెల్గుచున్నది అగ్నిహోత్రంబు। అదె యింధనముల్లు అమరిన వచట
ధన్యుడు రాముని దయకు పాత్రుండు। అన్నను సేవించి అలరుచున్నాడు
అనుచును తల్లులనపుడు బిలువంగ। ఘనుడు వసిష్ఠుని కడువడిబంపి
జలజాక్షు శ్రీరాము చుందుని జూడ। జలధారలై కనల్ జలములుగార
అతిమనోహరమైన యాపర్ణశాల। క్షితిపతి సుతులతి శీఘ్రినడాసి.

అఠా ౧ – రూపకం

ప॥ కనులారగనె రాముని జటామకుట ధారుని ॥జ

అ॥ అనువుగ కృష్ణాజినముమేను నమరివెల్గువాని ॥క

చ॥ నీరద సమదేహముపై నిండారుధూళితోను
నారచీరలనుగట్టి వీరాసనంబున వెలయువాని ॥క

(2) సీతాలక్ష్మణులతోడ చెలువమున రంజిల్లువాని
స్మితరుచిర ముఖాంభోరుహమున విలసిల్లువాని ॥క

జోర:-వర దుకూల చేలంబులు దాల్చెడు సురుచిరగాత్రా యిపుడు
ధరియించితివిటు చీరాజినములు నరవరతనయా మరియు ॥జ

(2) హేమరత్న సింహాసనమున విబుధులు గొల్వగ నుండు
రామచంద్ర యీదర్భాసనను రమ్యమా యెనా యిందు ॥జ

(3) ఇటు నినుజూచియు జీవించితి నహా యినకులతిలకా రామా
కటకట యెంతటి కఠినచిత్తుడను కరుణింపవె శ్రీరామా ॥జ

(4) అతిదుఃఖంబున పరుగిడి డగ్గరి అన్నా రామా యనుచు
మతిదప్పియు బడె రామునిముందర మరియంతట శత్రుఘ్నుండు ॥జ

(5) రోదనంబు జేయుచు రఘురాముని పాదంబులపై వ్రాలగ
సాదరంబున తనతమ్ముల నెత్తి సరసత గౌగిటజేర్చె ॥జ

(6) ఆలింగనముజేసి వారలను అంకపీఠమున నునిచి
లాలనజేయుచు మేను నిమిరియు చాలగ కన్నుల మరిసీ ॥జ

(7) జలములదుడిచియు శిరముమూర్కొని చనువున దయమీరగను
పులకాంకితుడై వారల ముడిగల కలతబాపి యప్పుడు ॥జ

తే॥ జడలు నారలుదాల్చియు జడునిభంగి దేహముకృశించి యున్నయా దీనవదను
నెట్టకేలకు గుర్తించి యార్తిమీర ననియె శ్రీరామచంద్రు డాతనుజునిట్లు

వ॥ నాయనా! తండ్రీ!

ద్విపద:-ఏలవచ్చితివయ్యా యిచ్చటికిపుడు। ఈలీల నీవచ్చు టెరిగినతండ్రి
మనియుండు వాడొకో మహిమీదనిపుడు। అనఘాత్మ మనతల్లులందరు మరియు
మనియున్నవారలె అనజుడాతెల్పు। మనువంశ గురుడగు మాన్యువసిష్ఠు
వినయాన పూజింతువే సహోదరుఁడ। రాజ్యభారముబూని రమణీయముగను
రాజనీతిని ననురక్తి మెలగుదువె। ప్రజలకు తండ్రివై పాలించిధరను
సుజనులబ్రోతువే సుగుణాంబురాశి। నీపురోహితు కడు నెమ్మిసేవించి
కాపాడుచుందువే కడుధనమిచ్చి। మంత్రుల సచివుల మరిబంధుజనుల
నెంతయు ప్రీతితో నెపుడు జూచెదవె। హితులకు కోరిన విత్తంబులిచ్చి
సతతంబువారల సరసజేర్చెదవె। పరగధర్మాత్మ ధర్మ పద్ధతినెరిగి
చరియించు చుందువె జననాధనీవు। అని రాముడడుగంగ వినయంబుదోప
అనె నిటు భరతుండు నార్తుడై కరము.

జోర:-అరయగ రాజధర్మమెరుగ నే నర్హుడనే రఘురామా
కరుణాకర నీవెరుగని ధర్మము గలదే భువిలోఁ జెపుమా ॥జ

(2) అనఘా మనవంశంబున జ్యేష్ఠున కభిషేకము జేసెదరన్నా
వినుమా రాజ్యముగాన నర్హుడ నీవెరుగవె కులధర్మము అనఘా ॥జ

వ॥ కాన నీవు పురంబునకువచ్చి పట్టాభిషిక్తుండవు గమ్ము.

సీ॥ అన్న నీవిటురాగ నతిశోకమున తండ్రి నిన్దలంచుచుమది నేగెదివికి
అనిదెల్ప శ్రీరాముడధిక దుఃఖముమీర హాతండ్రి యనుచును నవనివ్రాలె;
చల్లని నీరుపైజల్ల మూర్ఛనుదేరి సౌమిత్రి! మనతండ్రి స్వర్గమునకు
జేరబోయెనె యింక కూరిమి మనలను గారవించెడువారు కలరె భువిని
మామయని యేరిఁబిలుతువు భూమితనయ అనుచుదుఃఖింప భరతుడు అన్నఁగాంచి
ప్రియసుతుండవు తండ్రికి ప్రియముగూర్ప పిండదానంబుచేయు మఖండయశుఁడ

వ॥ భరతుండిటుదెల్ప హా తండ్రి మముబాసిపోతివే యని సీతాలక్ష్మణ సహితంబుగ
విలపింప నందరు దుఃఖింప సుమంత్రుడు వారినందర నూరార్చె నంత మందా
కినీయందు స్నాతులై రామలక్ష్మణులు గారవించిచే పిండంబులిడి తండ్రి కుత్తర
క్రియలు గావించి వారల స్నానంబుజేసి వల్కలంబులు ధరించి పర్ణశాలప్రవేశించి

డోర:-అనుజులతోడ తండ్రిని దలచి అధిక రోదనముజేయ
ఘనమగు గిరిగుహా ప్రతిధ్వని గలుగ విని భరతుని సైన్యమువేగ ॥జ

వ॥ భరతుండు శ్రీరామచంద్రునిగని దశరథుని మృతిజెప్పియుండనోపు కావుననే
యింత రోదనధ్వని గలిగె ననుచు నాధ్వనినిబట్టి జనులెల్లరు వారివారి యానం
బులను, కొందరు నడచుచు మరికొందరు పరుగిడి రాముని డగ్గరి.

డోర:-కనుల బాష్పము లొలుకగ ప్రజలు కడువడి మ్రొక్కగ నపుడు
అనఘుడు రాముడు తనబిడ్డలవలె ఆదరించె ప్రియముగను ॥జ

వ॥ అంత వసిష్ఠుండు దశరథుని భార్యల దోడ్కొనివచ్చునెడ కౌసల్య సుమిత్రనుగని

ద్విపద:-ఇదియె మందాకిని యీరేవునందు। సదయుడు రాముడు సౌమిత్రి సీత
స్నానాదు లిచ్చట సలుపుచునుందు। ఈ మహానదినుండి యింపగు జలము
సౌమిత్రిగొంపోవు చందంబుతోచె। ఇవి సీతయడుగులు ఇవి లక్ష్మణునివి
ఇవి రాము పదములు ఇంపుగాఁదోచు। నాతనూభవునికై సీతనూభవుడు
ఈతీరుగా నిట నిడుమలగుడుచు। నీతేశుగొల్చుచు భూతలఁబునను
ఖ్యాతివహించెను ఘనుడు లక్ష్మణుడు। అనుచు సపత్నుల నందరగూడి
తనయుడౌ శ్రీరాము డగ్గరంజేర। జననులగని రాము డనుపమభక్తి
అనఘుడు సాష్టాంగమున ప్రణమిల్ల। కనుల బాష్పంబులు కాల్వలైగార
ఘనముగా కౌసల్య కౌగిటజేర్చి। తనువెల్ల దడవియు పెనధూళిదుడిచె
ఇనకులోత్తముగని ఇంపుమీరగను। సౌమిత్రి మ్రొక్కిన సరసత నతని
ప్రేమచేమన్నించె రాముని వలెను। అతిదుఃఖమున సీత అత్తకుమ్రొక్క
హితమతి కౌసల్యనెంతయు ప్రీతి। ఆలింగనముజేసి అనియెదా నిట్లు
లలితాంగి సుకుమారి లావణ్యవతియు.

డోర:- జనకుని సుతయట దశరథుకోడలు మనుకుల వర్ధనుడైన
ఘనుడగురాముని ప్రియసతికిట్టి కష్టము గలిగెను దలపా ॥జ

వ॥ ఇట్లు దుఃఖించు కౌసల్యను సుమిత్రాదిసతులు ఊరడిలం బల్కరంత శ్రీరామ
చంద్రుడు వశిష్ఠమునివరునకు నమస్కరించి లక్ష్మణ భరత శత్రుఘ్నులు గొలువ
దివ్యతేజంబున ప్రకాశించుచు ప్రజానురంజనుండై కూర్చుండి భరతునింగని

డోర: ఈ వల్కలములు జడలుధరించియు నివ్విధమున రాజ్యమువిడచి
నీ విట వచ్చుట కేమికారణము ధీవర యెరిగింపుము కూరిమినీ ॥జ

వ॥ అనవుడు భరతుడు అంజలి బద్ధుడై అన్ననుగని,

దోరః- అరయ స్త్రీ వచనంబుల జనకుడు అడవికి బంపియు మిమ్ము
అరతుణ మోర్వక పుత్రశోకమున అరిగెను స్వర్గంబునకు ॥జ.

(2) ఘోరపాపము నొడిగట్టియు నాజననియు గోల్పోయెను భర్తను రాజ్యంబుల్
ధారుణి నాపై నిందమోపెనిటు దారుణంబుగా మరియుల్ ॥జ

(3) కరుణాతోడను గావుమునన్ను కడుదీనుడ నీదాసుడను
నరవర నాదు మనవిని వినియు ధరణీరాజ్యము గొనుము ॥జ

(4) ఇలమనవంశంబున కిది మరియాదయె ఇనకులోత్తమా గనుమా
తలపగ జ్యేష్ఠుండుండ రాజ్యమును తమ్ముడాయేలుట తగునా ॥జ

(5) చేరబోవుదము రమ్ము అయోధ్యకు రాజ్యశ్రీ బొందగ ముదమునను
శ్రీరఘువర సచివులతో నమస్కారముజేసెద ననుదయ గనుము ॥జ

తోడి — రూపకం

ప॥ పాలింపరార ధీర పట్టాభిరామ యాధర ॥పా

అ॥ ఆలింపుము నామొర అడుగులబడితి రఘుకులభూషణా ॥పా

చ॥ నీరులేనిపైరువలెను నీరజాప్తుడులేని దివమురీతి
నీరజాక్ష నీవులేక నేరీతి నుండగలమిల ॥పా

(2) వత్సముబాసిన ధేనువు చందము వాత్సల్యముగల తల్లిని దీన
వత్సలబ్రోవు నాపై మత్సరముననుమాని దేవ ॥పా

(3) భవదీయ చరణములను పదిలంబుగ మదినమ్మిన
నవకోసలపురవరమున నరులకు సంతోషముగల్గ ॥పా

దోరః- అనుచును భరతుడు అతిశోకంబున అన్నపాదముల వ్రాలగ
అనుజునియెత్తి కౌగిటజేర్చి అనెనిటు ప్రియమలరంగ ॥జ

ధన్యాసి — ఆది

ప॥ అనుజా నీపిటు దలపోయదగునా నినునిందించువారెవరు ॥అను

అ॥ మనమున నినునీవె దూరుకొనుచును వనటచెందెదవు పామరువలెను ॥అను

చ॥ సాధులోక సమ్మతుడవు సత్కులజాతుడవు
సోదరనీవు నిర్దోషుడవు ఖేదముమానుము మోదము గనుము ॥అను

(2) విమలహృదయ నాప్రియభక్తుడవు వీతరాగుడవు విశదయశుడవు
సమదర్శనుడవు నవకోసలపుర జనరంజనుడవు సన్నుతశీలా ॥అను

జోర:-తల్లిదండ్రులను మించిన మరియొక దైవములేదుగాన
తల్లిమనము నొప్పింపగరాదు ధర్మశీల ధరలోన ॥జ

(2) ఎంతటివారైనను సుతులకు గోరరామేలు యిటు తల్లిని దూరగ దగునా
వింతలె తమబిడ్డల ప్రేమించుట విపరీతమె లోకములోన ॥జ

(3) మనజనకుం డతిఘనుడు పూజ్యుడు మాన్యుడు సత్యవ్రతుడు
మనకిద్దానిని బంచియిచ్చె నది యనుభవింపవలె నిపుడు ॥జ

తే॥ తండ్రియాజ్ఞను మీఱంగ తగదుమనకు, ధరణిరాజ్యము నీకిచ్చె నరవరుండు
వననివాసము నాకిచ్చె వరగుణాఢ్య, యనజ వగపేలనయ్య నీ మనమునందు.

హిం:-ధరలో సుతులను నేమించుటకు అర్హముగాదా జనకునకు దెల్పు
అరయగ రాజ్యము నియ్యగ నెటులో యవ్విధమునగదా కానకుబంపుట ॥శ్రీ

(2) రయమున తల్లియు తండ్రియు బిలచి రామా అరణ్యము బొమ్మని బల్కగ
నయముగాను మరి చెల్లింపకయుండ న్యాయమదెల్పు నీతివిశారద ॥శ్రీ

(3) దేవసమానుని దివ్యవాక్యము స్థిరముగ నమ్మితే విహితమునాకును
భావమురంజిల్ల నడచెద నెప్పుడు పరమహితంబని జనకుని పంపున ॥శ్రీ

(4) కావున సుఖముగ రాజ్యంబేలుము కైకతల్లికి సంతసమొదవ
భావమలరగ వనమును నేను పాలించెదను పరమసుఖంబుగ ॥శ్రీ

వ॥ తండ్రీ ! నీకును నాకును జనకునాజ్ఞ పాలించుట విధియైయున్నది. అనివచించి యిట్లారాత్రియంతయు గడపె. సూర్యోదయంబగుటయు నెల్లవారును స్నానాది కృత్యంబులదీర్చి మునిగణ సమేతంబుగ సుఖాసీనులైరి.

జోర:-సీతా లక్ష్మణ భరత శత్రుఘ్నులట శ్రీరాముని కనులార్పక గనుచు
ఆతపోధనులు మంత్రులు పౌరులు కౌతుకమున వినగోరుచుండి రపుడు ॥జ

(2) అంతట భరతుడు ప్రార్థించెను యిటు అంజలిజేయుచు నిలిచి
సంతసమున నను కరుణార్ద్రదృష్టిని సదయజూడుమని పిలిచి ॥జ

(3) మనుకుల వర్ధన వేడెద మరినిను మన్నింపుము కూరిమి ననియు
వినయము భక్తియు దోపగ కైక తనయుడు న్యాయముగాను ॥జ

(4) అవనీపతి యిచ్చినరాజ్యము నీకిచ్చెద అన్నా గైకొను వేగ
రవివంశాగ్రణి నిను దోడ్కొనిపోవ రయమున వచ్చితి దేవ ॥జ

(5) వృక్షముబెంచీ ఫలకాలంబున వదలినరీతిని జనకుండు
రక్షకుడగు నిన్నడవుల కంపెను రామా నిష్ఫలుఁడయి కడకు ॥జ

(6) చంద్రునిరాకకు చకోరములవలె సర్వజనంబులు రామ
చంద్రాయనుచు వేచిరి యిదెగను చయ్యనబ్రోవుము రఘురామ ॥జ

కాఫి - ఆది

ప॥ గతివేరులేరు జానకీపతి కరుణజూడవే ॥గ

అ॥ పతితపావనుడ వీవు క్షితిని నేలనెంచు మతిని ॥గ

చ॥ సరివారిలోన కైక నన్ను చౌకచేసెను రామా
దరిజూపువారు మరియెవరు ధరణిలోన నీవుగాక ॥గ

(2) పదులనింద కోర్వలేను తరుణమిదియె నీ
చరణసేవ యొసగుమయ్య శరణు నవకోసలేశ ॥గ

కం॥ అన్నావిను విన్నను నేనెన్నగ నీ రాజ్యభార మెటులు భరింతుఁ
సన్నుతచరితా మన్నన నన్నుంగరుణించి రమ్ము నయముగఁ బురికిఁ

- బేగడ - రూపకం

ప॥ మనసున దయరాదా మహితగుణా ! సుశీల ॥మ

అ॥ దినకరకులతిలకా దీనుని యపరాధిని బ్రోవ ॥మ

చ॥ శరణాగతవత్సల నీ కరుదా యభయమీయ
కరుణారస పరిపూర్ణ కాకుత్స్థవంశాభరణ ॥మ

(2) గురు బుధ హిత మంత్రివరులు పరమప్రీతి జననియుగన
వరసింహాసనమున రాజ వైభవమున తేజరిల్ల ॥మ

(3) నవకోసలపుర విహార నవతులసీహారా
భవనుత రఘువీర పాలింపుము శ్రీకర ॥మ

హిం:-గరుడుని గమనము తురగముగతియు కాకము ఖరమున్వలె గాదెనేనడచుట
పురుషోత్తమ నీ వరమార్గమునకు సరితూగగను సమర్థుడ నాదునె ॥శ్రీ

(2) వినయోక్తుల నిటు గంభీరంబుగ వేడగ రాముని వినియందరుమరి
అనఘుని వచనరచన కలరుచు నవు నవునని శ్లాఘించిరి భరతుని ॥శ్రీ

(3) దీనాలాపముల్ వినియును రాముడు ధీరుడు తమ్ముని దేర్చియుప్రేమను
వీనులకింపగు నీ సునయోక్తుల విధినిర్ణయమును మీరగవశమే ॥శ్రీ

తే॥ ఇచ్చినంతయె నరులకు యిచ్చుదైవ మెచ్చుగోరిన వచ్చునే యేలయిట్లు
పరితపించెదు తమ్ముడా భావమునను సుఖము దుఃఖమ్ము సమముగా జూడవలదె

జంఝూటి - రూపకం

ప॥ వినుమా యీతనువులుగన క్షణభంగురములు భరతా ॥వి

అ॥ అనఘా ధీమంతులు వీనిగ గణియింపరు మనమునను ॥వి

చ॥ సిరిసంపదయును రాజ్యము సర్వభోగముల్ ధరను
మెరుపులవలెఁ గల్గుఁబోవు నరయగ శోకింపతగునె ॥వి

(2) కాలము దుర్లంఘనీయము గావున నెవ్వారికిగ
కాలబలము దాట మనము జాలము ప్రియసోదర ॥వి

(3) మానవులకు ఆయువల్పము గాన ధర్మము విడువక
పూని చేయవలయునెపుడు భువిని కీర్తిబడసియు ॥వి

(4) అతి ధార్మికుడైన దశరథు సుతులమై జనియించియు
సతతము నవకోసలమున సత్యము నిల్పవలదె తండ్రి ॥వి

ఢోర:-అనుజా మనమిరువుర మిప్పుడు జనకుని వచనముల్ దలచి
వనరాజ్యమునే పాలించెద ధరణిని పాలింపుము ప్రియముంచి ॥జ

(2) పొమ్మ యయోధ్యకు మంత్రులగూడి సమ్మతిమీరగ నిపుడు
తమ్మునితోడుత రాజ్యంబేలుము తడవేలను తండ్రి మరియు ॥జ

వ॥ ఇవ్విధంబునంబల్కు రామచంద్రునిగని దుఃఖావేశంబున,

ఢోర:-ఎంతటి కర్మఫలంబోనాకు వినడయ్యెను నానుడులనుచు
మంతనమున గుందుచు నన్నసుగని మరిమరివేడుచు దుఃఖించుచును ॥జ

షణ్ముఖప్రియ — ఆది

ప॥ అన్నా నేనోర్వఁగలేను ఆదరమును జూపకయున్న ॥అ

అ॥ కన్నార నిను గని సేవింపని కన్నులేలను శ్రీరామా ॥అ

చ॥ చనవున రామాయని పిలువని నాజిహ్వాకు ఫలమేమిదెల్పు
అనుదినమును పూజింపని నాహస్తయుగ్మమేల అవనిజనాథ ॥అ

(2) అతిభక్తి నీ యడుగుదామరల సతతము మ్రొక్కని శిరమేలనయ్య
పతితపావనా నవకోసలేశ పరమకృపనేలు భక్తమందార ॥అ

వ॥ ఇవ్విధంబున భరతుండు ప్రార్థించునెడ, జాబాలియను ఋషిచంద్రుండు, శ్రీరామచంద్రున కిట్లనియె.

జోర—భరతుని పలుకులు సత్యముపినుమా నరపతులకు ధర్మంబు
అరయగ రాజ్యంబేలగ నర్హుడు అగ్రజుడేయగు గావునను ॥జ

(2) ఎక్కడిసత్య మిదేటిమాటలు ఏలుము రాజ్యము నిపుడు
టక్కరి కైకకు వశుడై పల్కిన తండ్రిమాటలిక చాలు ॥జ

(3) చాలగ జాబాలిటు పల్కిన రాముడు శాంతితోఁ బల్కె నోకయింత
దూలనాడెదవు ధర్మము సత్యము చాలునయ్య నికచాలు ॥జ

(4) స్వధర్మము విడచి సత్యముదప్పిన చండాలుం డనఁబడును
అధర్మ యుతములు వచనంబుల నిటులాడకు మెప్పుడు నీవు ॥జ

(5) అని తిరస్కారము జేసిన రాముని గని జాబాలియు క్షమయింపు
మనివేడుచు పల్కెను ధర్మనియతిని మంత్రన మెరిగింపుచును ॥జ

(6) ఎరుగుదు రామా సత్యధర్మములు విడచిన వాడనుగాను
మరలనయోధ్యకు ననుపగోరి నిను భరతునికై పల్కితి నిటునేను ॥జ

వ॥ ఇట్లు బల్కఁగ వసిష్ఠుండు, శ్రీరామా ! జాబాలి ప్రకృతకార్యార్థియై యిటు పల్కెఁగాని, ధర్మమెఱుంగనివాఁడు కాడుసుమా ! మరియు, నామాటవినుము సూర్యుండు మొదలుకొని మీ వంశంబున జ్యేష్ఠునికే రాజ్యంబు పూజ్యంబుగా పట్టాభిషేకంబు జేయుట యాచారంబయి యున్నయది. కాన నీవే మీ వంశంబున కిప్పుడు కర్తవు. తప్పకనీవే రాజ్యమేల వలయు. అయోధ్యకు తిరిగి

రమ్ము. అదియుగాక తలిదండ్రులకన్న విద్యయొసంగిన గురు వధిక పూజ్యుండు. నీకు నేను గురుండనుగాన నాపల్కు లాదరించి, భరతుని మొర వినిరమ్ము! అవనీ భరంబుబూనుము! అనవుడు శ్రీరామచంద్రుడు గురువునకు నమస్కరించి.

హిం:-తల్లిదండ్రుల ఋణముదీర్ప నిల తరమే నరులకు తథ్యముగాను
ఉల్లమలరజేయ జాలని పుత్రుండుండియు లేనివాడుగదా దెల్పు ॥శ్రీ

(2) మున్నుగ తండ్రి యాజ్ఞను వచ్చితి ముదమున వనవాస వ్రతములు దీర్పగ
నన్నుతచరితుడు జనకు వాక్యముకన్న యెన్నగ నామది యేదిరుచింపదు ॥శ్రీ

జో:ర:-అని యిటురాముడు ఖండితముగనన వినిభరతుడు శోకమున
అనఘా పూర్వకృతమిదియని మరి ఆపరాని కోపమున ॥జ

(2) తుండ తుండములుగా కైకేయిని ఖండించిన దోషములేదు
చండకిరణ కులమండను రాముని నుండజేసె నిటువనమునను ॥జ

(3) చెంతనున్న సుమంతుని గనియిటు జేర్పుము దర్భలనిపుడు
ఎంతవేడినను కరుగదు మనసు ఇనకులాంబుధి చంద్రునకు ॥జ

(4) పడియుండెదనిట యీ రఘువీరుని పాదపద్మముల చెంతగ
కుడవ నన్నము నీరుద్రావ నవకోసలపతి దయగను దాకగ ॥జ

(5) భరతుని పంపున దర్భలుదెచ్చి పఱవకె రాముని జోడ
సరగున భరతుడు తానె తెచ్చుకొని పఱచుకొనెను ధైర్యముతోడ ॥జ

వ॥ అంతరాఘవుండు భరతునింగని, భరతా! ఇట్టి ఘోరకార్యంబుజేయ నీకేమియప కారంబుజేసితి! నీకీపని తగదు. బ్రాహ్మణుడు తనసొమ్ము నిమిత్తము ఒంటి ప్రక్క పరుండును. క్షత్రియులకిది ధర్మంబె! లెమ్ము! ఈదోష పరిహారం బునకై నన్నును ఈజలంబును స్పృశియింపుమని, మునివర్యులారా! మీరైనను నాతప్పుల తెలియ బల్కుడీ! తండ్రియాజ్ఞ దీర్పుటయే వ్రతమని యెంచితి! దీననేమి యన్యాయంబు గలదు? అనవుడు అచ్చటనుండు వారందరును భరతా! సౌమ్యంబుగ శ్రీరాముడు పల్కుచున్నవాడు. నీవు మీయన్నమాట వినుటయే యుచితము. అని పలుక భరతుండులేచి గడగడవడంకుచు భయభక్తియుక్తుం డై జలంబునుదాకి రామచంద్రుని స్పృశియించి నేత్రంబుల నీరుగార్చుచునిలువ శ్రీరామ చంద్రుండును,

జోరః-కన్నన్న జననీవచనంబులు విని కడుముదమును గూర్పుము అనుజా
అన్నా యెంతటి మూర్ఖురాలైన కన్నతల్లి తల్లిగదా ॥జ

(2) అతిభక్తియు నాపై గలవాడవుగాన అనువుగ పాటించియు నాపల్కు-
సతతము ధర్మము దప్పక ప్రజలను సకల హితంబుగ బాలింపు ॥జ

(3) ఇటు బల్కిన నే నేమనగలనిక నిభరాజగమనా నిన్ను
కటకట నాదౌర్భాగ్యముగంటిని కమలదళాక్షా నేడు ॥జ

(4) ఏరీతిని భూభారముదాల్తును ఈరాజ్యతంత్ర మెటు జేతుగ
భూరమణా రాజ్యాంగనీతులను అరయగ నాతరమా యనుచు ॥జ

శంకరాభరణం — ఆది

ప॥ సమ్మతి గొనుమన్నా సాకేత నిలయులకు సంతస మొదవ ॥స

అ॥ నెమ్మనమున నెనరుంచి నాపై నేరములెంచక నీక్షితి నేల ॥స

చ॥ ఇంత పిన్నవానిపై నీకెందుకు దయరాదో
పంతముజూప నెంతవాడ నీ పాదముల నమ్మితి నవకోసలరామ ॥స

హిం:-పాదపద్మంబుల బట్టియేడ్చుచు బడియున్న తమ్ముని నెత్తి
ఆదరమున నాలింగనమొనర్చి అంకముననిడి శిరమును మూర్కొని ॥శ్రీ

(2) చయ్యన స్వేదజలమును దుడిచి చమురుచు మేనును బుజ్జగించియు
అయ్యా నాకొఱకెంత డస్సితివి అనఘా నాతండ్రియని మురిపెమున ॥శ్రీ

(3) ముదమున గురుబుధ మంత్రివరులగూడి ముచ్చటగా రాజ్యమేలుము నాతమునా
పదునాల్గేండ్లు వ్రతమునదీర్చి నీ భావము రంజిల్ల పాలించెదనే ॥శ్రీ

వ॥ ఇట్లు దెల్పిన అన్నతో భరతుం డిట్లనియె.

మధ్యమావతి — రూపకం

ప॥ పాదుకలను ఇచ్చిబోవు పట్టాభిరామ నీ ॥పా

అ॥ ఆదరమున నన్నేలుము ఆశ్రితవత్సల నీ ॥పా

చ॥ అనువుగ సింహాసనమున అలంకరింపజేసియు నే
ననరుగ అభిషేకమును వైభవమున గావింతును ॥పా

(2) అనుదినమును సేవించుచు అఖిల రాజకార్యములను
ఘనముగ సమర్పించెదను వనరుహ పత్రాక్ష నీ ॥పా

(3) రవివంశోద్ధారక నీరాకను నిరీక్షింపుచు
నవకోసల నిలయ యుండెద నవపల్లవపదయుగళ నీ ॥పా

జోర:-భరతుండిటు ప్రార్థింపగ రాముడు పాదుకలిచ్చెను ప్రీతిఁ
పరమ పవిత్రములని వానిని దన శిరమున దాల్చెను భక్తిఁ ॥జ

(2) మనములరగ సీతారాములకు మరిమరి మ్రొక్కుచు నపుడు
కనికరించి నా కనుజ్ఞ యొసంగుము కరుణామయ రఘువరయనుచు ॥జ

తే॥ అన్న మరియొక విన్నప మవధరింపు పదియునాల్గేండ్లు కడచన మొదలిదినము
నీవు రాకున్న నగ్నిలో నేనుజొత్తు ననుచుబల్కిన తమ్ముని నాదరించి

హిం:-సచ్చరితా విను సంతసముననిను మచ్చికతోడుతఁ జేరగ నేను
వచ్చెదనయ్యా నేమముతప్పక వగవక జేరుము నగరముతండ్రీ ॥శ్రీ

(2) నీలనీరద సన్నిభగాత్రుని నీరజనేత్రుని రెప్పార్పకనంత
ఆలోకించుచు భద్రగజమున నానందంబున పాదుకలుంచెను ॥జ

(3) అన్నపాదంబుల కతిభక్తిఁ మ్రొక్కిన పిన్నతమ్ముని చేరదీసియు ప్రియమున
కన్న తండ్రీయని ముద్దిడి కౌగలించి చిన్నవాడ సుఖముండుము అన్నతో ॥శ్రీ

ద్విపద—అంత శ్రీరాముడు నతిభక్తితోడ। సంతసంబున గురు సన్నిధిఁజేరి
వందనంబులుజేసి వనరుగా ప్రజలు। అందరు మ్రొక్కిన నానతినొసగి
కడు ప్రేమ శత్రుఘ్ను కౌగలించియును। కడువడి భరతుని గనియిట్టు లనియె
ఆదరంబున తల్లు లందరినిజూడు। సాదరమ్మున నీదు జనని మన్నించు
అనుచు తల్లులగని యతివిషాదమునఁ। గనుల బాష్పంబులు కాల్వలై పాఱ
వనటచేగుండెడు వారికెనెల్ల। దండ నమస్కృతుల్ తద్దయుజేసి
ఉండలే కటవోయె కుటజంబునకును। భరతుడు హితగురు వరులతోఁగూడి
తగలి తల్లులతోడ తమ్మునితోడ। అలభరద్వాజుని నతిభక్తి మ్రొక్క
పోలువారు దయ మునిపుంగవుండనియె। కనుగొంటివే రాము కనులారనీవు
వినియెనే యతడు నీ మనవియొకింత। అనభరతుండిట్టు లనియె నామునికి
అనఘాత్మ! నేబిల్వ వినయంబుతోడ। రానని పాదుకల్ రయముననిచ్చి
కాననవాసంబు గడుపుమీరగనే। మానకవస్తును మఱినీవుపొమ్మ

దీనతమాననుచు దీవించి పంపె। అనిదెల్పి మాసిందు రాజ్ఞగైకొనుచు
గనియు గంగనుదాటి కడువేగమునను। కూరిమి మీరంగ గుహుని వీడ్కొనియు
సాకేకు రాముని సన్నుతించుచును.

జో॥ర:-జేరి అయోధ్యకు రథమునవుండి సారథిగని భరతుండు
అరసితివే తేజముమాసెను పురి అన్నలేని కతమునను ॥జ

(2) ఎన్నడువచ్చునో రాముడు మోదం బెన్నడు గూర్చునో ప్రజకుల్
ఎన్నడుజూతును అన్నరామునని కన్నుల నీళులుగారన్ ॥జ

(3) తల్లులనగరికి బంపియు వేగమె తల్లడమందుచు చాల
వొల్లను నీపురియనుచు నపుడు తన యుల్లము కలగగనంత ॥జ

హిం:-గురువరుగని యిట్లనియెను భరతుడు సరగున నందిగ్రామము జేరెద
అరయగ జనకుడు అన్నయులేని పురమున నుండగజాలను నేను ॥శ్రీ

(2) శ్రీరఘురాముని చరణ కమలముల జేరియుండునట్టి శృంగారపాదుకల
నారాధించుచు వ్రతనిష్ఠుడనై అనుజునితో నందిగ్రామమున నుందు ॥శ్రీ

(3) ఆదరమున మీరందరుగూడి అనుదినమును నీనవరత్న ఖచిత
పాదుకలకు రాజ్యాంగముల్ దెల్పుచు పరమప్రీతితోడ పాలింపగధర ॥శ్రీ

(4) ఇల్లడముగ నీపాదుక యుగళము ఇచ్చెను అన్నయు ఇంపుగనాకు
పల్లవ మృదుపద పద్మముల నతిభక్తిని భజియించి యుండెదనిచట ॥శ్రీ

(4) అతులిత ముదమున అన్నయురాగ అర్పించియు యీపాదుకల్ మరల
అతివినయంబున అతనిని సేవించి అపకీర్తిని నేబాపుకొనెదను ॥శ్రీ

వ॥ అని పలికి,

క॥ నందిగ్రామము జేరియు అందర రప్పించియపుడె యాభరతుండున్
సుందరమగు పాదుకలకు వందనమునుజేసి భక్తి వలగొని వేడ్కన్.

హిం:-కనకమణిమయ సింహాసనమున కడుభక్తిని నాపాదుకలునిచి
ఘనముగ ఛత్రచామరములుబట్టి మనములరగ నుపచారముల్ చేసెను ॥శ్రీ

(2) గంగాదినదీ జలకుంభములతో మంగళముగ నభిషేకము జేసియు,
శృంగారంబుగ [illegible] యనుదు పొంగుచు సర్వము సమర్పించెను వేడ్క ॥శ్రీ

(3) అన్న రాకను గోరుచు దినమును అనుజునిగూడియు ప్రేమతో ప్రజలను
మన్ననజేయుచు రాముని దలచుచు సన్నుతచరితుడు దృఢవ్రతుడై యుండె ॥శ్రీ

వ॥ చిత్రకూటమును వదలి భరతుండు వచ్చిన యనంతరంబు శ్రీరామచంద్రుడు సీతాసమేతుండై అనుజునితో నుండుసమయంబున అందుండు మునీంద్రులా రామచంద్రుని జూచుచు గుసగుసలాడుచు కనుబొమలార్చుచు ఏమియో జెప్ప బూని చెప్పక మిణుకుచున్నవారి చంద మెరింగి కులపతియు వృద్ధుండునగు మునివరునిగాంచి కేల్మోగిచి.

దోర:-మునివర నాదు వర్తన మిప్పుడు మునుపటిరీతిగ లేదా ?
అనుజుడు పాడిదప్పి నడచెనా వినుపింపుడి దయతోడ ॥జ

(2) జనకజ నాదు సేవసేయుచును అనువుగమీకు సపర్యల్
మనమలరగ జేయదో దెల్పుం డనెనిటు వినయముతోడన్ ॥జ

(3) అంత తపోధనుడగు నమ్ముని యనెనిటు జానకిరమణా
గాంతుమె మీయెడ నపచారంబులు కామితఫలదా భూరమణా ॥జ

(4) పరమసాధ్విని కల్యాణగుణయుత ధరణిజ తపసులయెడను
అరయగఁ దప్పినడచునె రామా పరమపావనా వినుము ॥జ

వ॥ స్వామీ! మీ రిటవచ్చినది మొదలు ఖరాది రాక్షసుల బాధలధికంబయ్యె. అప్రశస్తంబులగు పదార్థంబులు మాపై గురిపించి కొందర మర్దించి ప్రాణములు దీయుచు దాగియుండి తటాలున పైబడుచు హోమగుండము లార్పుచు స్రుక్కులు మున్నగు పాత్రంబుల బారవైచుచు బాధించుచున్నారు. అందున నెచ్చటికైన పోవగా దలచి హెచ్చరింప వచ్చితిమి. శ్రీరామా! ఈ మాటలు విన్నవింపవెరచి గుసగుసలాడుచున్నవారు గావున,

దోర:-పత్రపుష్ప ఫలభరిత ద్రుమంబుల భాసిలు నాశ్రమమునకు
శత్రుసంహారణ బోయెద మచటికి సత్వరముగ నందరమునేడు ॥జ

(2) నిలువుడిచ్చట భయమేటికనంగను బలుకగవేగమె వారు
నిలువక బోవగదలచిన రాముడు వలగొని మ్రొక్కియు నపుడు ॥జ

(3) వారి దీవనల నందియువేగ వచ్చికుటీరముజేరి
శ్రీరాముండిటు పల్కె తమ్ముని సీతాదేవినిజూచి ॥జ

(4) మనమిచ్చోనిక నుండదగదుమరి జనవలె నెచ్చటికైనన్
అని మోదంబున గదలిరి మువ్వురు అత్రిమహాముని జేరన్ ॥జ

(5) చేరియు మునికుల సార్వభౌమునకు జేసిరి నమస్కృతు లపుడు
వారల దీవించెను మౌనియు వర్ధిలుడని ప్రియమునను ॥జ

(6) తన యిల్లా లనసూయ యనియెడు తాపసికిన్ మరియపుడు
జనకరాజ వరతనయను జూపి మునివరుడిట్లనె ప్రీతిన్ ॥జ

(7) గారవింపు మీసాధ్వీమణిని గాంతారత్నంబంచు
శ్రీరామునిగని యనసూయమహిమయు జెప్పబూనె వినుమనుచు ॥జ

(8) పదివత్సరములు వర్షములేక పరితపింపను జగము
సదయురాలు అనసూయ ప్రీతిచే సర్వభూతముల కపుడు ॥జ

(9) పరమసాధ్వి తన తపోమహిమమున ఫలమూలంబులు గల్పించెన్
అరయ దశాబ్దముల్ పెంపొందజేసి వనమును కరుణను జీవుల రక్షించెన్ ॥జ

(10) పదివేలేడులు గంగాతటమున బహుతీవ్ర నిష్ఠతోడన్
సుదతీమణి తపమాచరించెను సువ్రత విఘ్నములేకన్ ॥జ

(11) దేవకార్యమును దీర్చుటకొఱకై దేవియు పదిరాత్రులను
భూవల్లభ యొక రాత్రిగజేసెను పుణ్యశీల సుఖముగను ॥జ

(12) సర్వభూతములకు సంతసమొదవెడు సాధుకీర్తనీయ
నిర్వికారియౌ నీతపస్విని నీజననిగ పూజింపు ॥జ

(13) అసూయలేని కారణంబున అనసూయ యందు రీసతినీ
వసుధీశ్వర జానకి మ్రొక్కింపుము వైభవములు గల్గును వినుమీ ॥జ

వ॥ ఇట్లు దెల్పిన అత్రిమహామునికి నాదేవికిన్ నమస్కరించి ఆమె మహిమను గొని
యాడి శ్రీరాముడు సీతాదేవిని గాంచి యావృద్ధ తపస్వినికి నమస్కరింపుమన
జానకి,

హిం:- పసిడి ఛాయయు ముడతలమేనును పాండురమౌ జడలు భాసురముగను
నొసటికుంకుమ దిక్కులవెల్గ నొడలువణంకు వృద్ధనుగని సీత ॥త

(2) పతివ్రత ధర్మంబే రూపముదాల్చి పంపు ముదిమినుండు భవ్రియశస్వినిఁ
  క్షితికన్యయతి సంతోషంబున చేరియు చెంతను వినయముతోడఁ ॥శ్రీ॥

(3) పదములవ్రాలియు భక్తిని మ్రొక్కి పాణియుగ్మంబులో్మ్రెచ్చి నిలచియు
  పదమలమతిని కుశలంబడిగి సాధ్వికి దెల్పెను తన నామంబును ॥శ్రీ॥

వ॥ ఇట్లు నమస్కరించిన జానకిని పరమప్రీతిని గారవించుచు,

ముఖారి – ఆది

ప॥ ఎంత పుణ్యవతివో జానకి యీధరాతలమునను ॥ఎం

అ॥ సంతసమున నవకోసలేశుగూడి సాధువృత్తినీ చరియించు నీ ॥ఎం

చ॥ కాననములని మదినెంచక కాంతునితోనుండ ధర్మమని
  పూని వ్రతమునను వచ్చితివిట పూబోణి నీలవేణి నారీమణి నీ ॥ఎం

(2) గలిగిన మున్నిట్టివారిలను కల్మిపేర్మిని నిరసించివేగ
  బలుబాధలోర్చి బంధువులబాసి పతినిగొల్చుటే పరమ భాగ్యము నీ ॥ఎం

హిం:- ధనికుడైనను నిర్ధనుడైనను గుణహీనుడు ఖలుడైననుగాని
  వనవాసియు పురవాసియు నైనను వనితనుగతికి పతికారణమగు ॥శ్రీ॥

(2) సరసిజాక్షి శ్రీజానకివినవే తరుణీమణులకు తనపతి దైవము
  అరయగ పుత్రమిత్ర బంధువర్గంబులు పురుషుండేయని మదినెఱుగవలె ॥శ్రీ॥

(3) సుమతియైన సతి పుట్టినయింటికిఁ జొచ్చినయింటికి దెచ్చునకీర్తిఁ
  సుమహిత సద్గుణ శోభితయగుచు విమల యశంబున వెలయును సాధ్వి ॥శ్రీ॥

(4) కావునభర్తకు హితమొనరించెడు కాంతలె యిహపరముల సుఖియింతురు
  దేవి రాముని సేవింపుచు నీభావమలరగ నుండుము మైథిలి ॥శ్రీ॥

తే॥ పతికి నడ్డంబుజెప్పెడు సతులునెపుడు
  ప్రాణనాథుని శాసించు భావులెల్ల
  అపయశంబును బొంది యీ యవనిలోన
  నిందు నొందుదు రెపుడు రో యిందువదన.

కం:-పతిసేవ జేయుచుండెడు సతులకు నిహపరసుఖంబు సత్కీర్తి యగుఁ
  పతియే గురుడును దైవము పతియే సద్గతియటంచు భావింపవలెఁ.

కం॥ వ్రతములు వేయేటికి యిల పతిహితమును జేయునట్టి పడతులకెల్లన్
పతివ్రత ధర్మంబను సువ్రత మొక్కటిజాలు నమ్మ వనరుహనేత్రీ.

డో॥:-అని యనసూయ ప్రీతినిదెల్పగ వినిజానకి ముదమునను
అనసూయనుగని వినయంబున నిట్లనియెను ధర్మంబుగను ॥జ

(2) దేవీ నీవంటి తపస్విలలు యీవిధ మెఱిగించుట చిత్రముగాదు
భావంబున నెఱుగుదు దైవంబని ప్రాణనాథుని గొల్తును సతతంబు ॥జ

(3) వృత్తిహీనుడై యున్నను విభుని భక్తిజేయవలయు
చిత్తమెఱిగి సేవింపగవలయు స్త్రీలకు ధర్మంబిదియు ॥జ

బేగడ — ఆది

ప॥ కరుణాంబుధి శ్రీరాముని యరుదా గొల్చుట దెల్పుము తల్లీ ॥క

అ॥ నిరుపమాన తేజున్ లావణ్యుని నిరవధిక సుఖదాయకుని ॥క

చ॥ ఇనవంశాగ్రణిని విజితేంద్రియుని విజ్ఞానఘనుని విమలయశుని
జనరంజనుని సాధువర్తనుని సకలధర్మయుతుని సద్గుణ గరిష్ఠున్ ॥క

(2) పరకాంతల కన్నతల్లివలె భావించు పార్థివో:త్తముని
వరనవకోసల వరదుని యోగి హృత్సరోరుహావాసుని ॥క

డో॥:-పతి శుశ్రూషనుగాదె అరుంధతి సతిసావిత్రియు మరియు
పతివ్రతలై సతులందరు మహిని బడయరె పరమ సుఖంబులును ॥జ

(2) ధరణిజ యిటు ధర్మంబులు పల్కగ పరమహర్షమున వినియు
కరుణను జానకిన్ చేరదీసియు శిరముమూర్కొని యిటులనెను ॥జ

హిం:-అమ్మా నీకు మనోజ్ఞవాక్కుల కాహ్లాదను జనియించెను నాకు
కొమ్మా కోర్కెలుగోరుమునీవు సమ్మతినిచ్చెద సాధ్వీతిలకమ ॥శ్రీ

(2) గంధపుష్ప మాల్యానులేపనము ఘనమగు వస్త్ర భూషణంబులున్
సుందరి మఱి సంప్రీతిని గొనుము సురుచిరగాత్రీ వాడవు వీడవు ॥శ్రీ

(3) వీని ధరించియు శోభనయుతవై వేడుకతో విభుని మనమలరింపు
మనుచును ప్రియమున నంగరాగమా జనకజకిచ్చెను సంతోషంబున ॥శ్రీ

(4) మునిపత్నియు కడుప్రీతి నొసంగిన జనకజగాంచి యతిభక్తిని మ్రొక్కి
తనచెంతను గూర్చుండిన సతిగని మానసమలరగ నిట్లనె ననసూయ ॥శ్రీ॥

(5) శ్రీరఘురాముడు స్వయంవరమున నిను చేకొని పెండ్లియాడిన విధమును
ధారుణీతనయా విశదంబుగను కూరిమితో నెరుగింపుమి యనిన ॥శ్రీ॥

కం॥ అని యడిగిన యనసూయకు నవనిజ వినయమునబల్కె హర్షముతోడన్
జననీ రాముడు ప్రీతిని నను గైకొనినట్టి విధము విను వివరముగన్.

గద్యము:-శ్రీమన్ మహాజన సంస్తూయమాన పాదారవింద, ఆనందకందళిత హృదయారవింద, నామనవిని వినుమా దయగనుమా. జనకచక్రవర్తి యాగంబు చేయనెంచి, యోచించి, భూమిదున్నింప, నాగటిచాలున పెల్లగిలి వెలికివచ్చి, ధూళిదూసరితగాత్రినగు నన్నుంగాంచి, ప్రేమించి, తనుగన్న కన్నియం బోలె మమతచేత యంకపీఠమున యుంచి, గగనవాణిచే నీకన్య నీపుత్రి యని పలుక హర్షించి, ప్రమోదాంతరంగుడై తన జ్యేష్ఠపత్నికి నన్నొసంగిన కడు కూరిమి తనకూతుంబోలె నను బెంచుచు, ఆనందించుచు, ప్రేమాతిశయంబున గారవించుచు, వివాహసమయంబగు ప్రాయంబుగల, నన్నుంగని నాజనకుండు, యీ మనోజ్ఞవిలాస సౌందర్య సౌజన్య సద్గుణ ధన్యయగు కన్యకుం దగిన కాంతుడెవ్వడోయని చింతించి, మదియోచించి, స్వయంవరంబు చాటించి రాజచంద్రుల రావించి, మహాధ్వరంబున ప్రచేతసులచే నొసంగినదియు, రాజులు స్వప్నమందైనను దీని నెక్కుపెట్ట దలంప రానిదియునగు, శివధనుస్సును ఆ రాజవీరులకు జూపి యీవింటిని మోపెట్టిన వీరుడు నాపుత్రికి విభుండగునని బలుక, యారాజవరులు దానినిగదల్పలేక బోయిరి, తమ పురములకంత, అధికమైనవంత, కొంతకాలమునకు గాధితనూభవుండు, రామ లక్ష్మణులను దోడ్కొనివచ్చి, అధ్వరమునుగాంచి, మోదించి, జనకచక్రవర్తిన్ సజ్జనానురక్తిన్, సత్కీర్తిన్, యీసుకుమారులు దశరథభూపతి వరసుతులు, మతిమంతులు, శౌర్య ధైర్య వీర్యపరాక్రములు గావున వీరికి సదాశివుచాపము జూపుమనన్, విని భూపాలుం డటు జేయంగన్, మునియానతి రాముడు యా విలుగనియున్, అవలీల చాపమునెత్తియు వంపన్, రెండయ్యె చూపరులు వెరగందన్, జనకుడు మది ముదమందన్, అంతట మిథిలేశుడు దశరథభూపతి రావించి, శ్రీరామచంద్రు పూజించి, నన్నర్పించి, సంతోషించి, నా చెల్లెలి నూర్మిళన్ సౌమిత్రికి నొసగి, భరత శత్రఘ్నులకు మాండవి శృతకీర్తిని యిచ్చిమెచ్చి, మజ్జననీ జనకులు ముదమందిరి తల్లీ, ఆశ్రిత కల్పకవల్లీ, నవకోసల రాముని

కనురాగంబుగ మెలగెడి సతితము సాధ్వీమణి యనసూయా, తపోధననిలయా,
కర్దమప్రజాపతి వరతనయా, దయామయా, నమస్తే నమస్తే నమస్తేనమః

డో॥ర:-అని పలికిన జనకజ మృదువాక్యంబుల కలరిమదిని అనసూయ
చనువునగుర్చి కౌగిటజేర్చి ప్రియమున జనకమహీపతి సుతవినుమా ॥జ

(2) ప్రొద్దుగ్రుంకె చీకట్లు గ్రమ్మెను భామా శ్రీరాముని జేర
ముద్దియ సీతతో ముచ్చటలాడగ మోదమయ్యె మది చాల ॥జ

(3) వారిజనేత్రి నేనొసంగిన వస్త్రభూషాలేపనము
కూరిమితో ధరియింపవమ్మ నేకన్నారజూడ గోరెదను ॥జ

(4) ధారుణికన్యయు ముదమున నన్నియు దాల్చి నమస్కృతిజేసి
శ్రీరఘురాముని జేరిన యతడు సీతను గనెనతిప్రీతి ॥జ

(5) ఆదరమున మునిసతి దనకిచ్చిన విధమంతయు దెల్పియు నపుడు
మోదంబున వస్త్రాభరణాముల యా ముదితజూపె రామునకు ॥జ

(6) మానవ దుర్లభమగు సత్క్రియల బొందిన జానకిగని రఘువరులు
ఆనందించిరి మునిచంద్రుని సన్మానము బొందియు నపుడు ॥జ

(7) నిదురించియు వారంతట సూర్యుం డుదయింపగ మేల్కొనియు
ముదమున సంధ్యోపాసనజేసి మునికోటికి మ్రొక్కియు నపుడు ॥జ

(8) ఎరుగదెల్పుడీ మార్గంబన మునివరులు దెల్పిరిటుల
ధరణీశ నీవెంకుబోయినను దైత్యులు గలరు గనుమ ॥జ

(9) క్రూరరాక్షసులు రామావిను మునికోట్లను మ్రింగుదు రెపుడు
వీరాగ్రణి శ్రీరామచంద్రమా వెతలుబాపవే యిపుడు ॥జ

(10) అనుచును ప్రాంజలులగుచు మహా.ము లా ఘనులను పూజించియును
మనము లలరగ మంగళంబని మరిదీవించియు నపుడు జ॥

(11) వనజదళాక్షా మార్గంబిదియే గను మీతోవను భామా
వనములకును ఫలపుష్పముల్ గోయగ మునివరులిటు బోదురు యనిన ॥జ

తే॥ మునులు దన్నంపదమ్ముండు జనకసుతయు వెంటజనుదేర జొచ్చెను విపినభూమి
రామచంద్రుడు సుగుణాభి రాముడపుడు అర్కుడాకాశపథమున నరుగునట్లు.

క॥ శ్రీరామా జితకామా చారుయశోధామ రామ సద్గుణధామా
భూరిబల భుజపరాక్రమ ధీరా కోదండరామ తారకనామా

క॥ స్థిరమతి నయోధ్యకాండము పరమానందంబుతోడ ఒల్కితి నిపుడేఁ
గరువలిసుతు కృపచేతను ధరణిజ శ్రీరామభద్రుఁ దలచుచు భక్తిన్

మంగళహారతి

ప॥ శ్రీరామచంద్రునకు జయమంగళము సదా సీతాసమేతునకు శుభమంగళము ॥శ్రీ॥

చ॥ తండ్రియాజ్ఞను బూని ధరణిజతో గూడి దండకాటవిఁజేరి తమ్ముఁడు గొల్వగ
ఖండించి దనుజుల గాచియుమౌనుల నాఖండలాది సురల కానందమొసగు ॥శ్రీ॥

(2) వరగున చిత్రకూటగిరియందు నివసించి భరతుడు వేడగ పాదుకలర్పించి
అరిగియా యత్రిని అనసూయచెంతఁజేరి అంగరాగముగొని అవనిజ సంతసించె॥శ్రీ॥

కం॥ సరసీరుహదళనేత్రా వరదా కోదండరామ వాసవవినుతా
స్థిరమతియగు రామున్మఁకు నిరవధిక సుఖంబొసంగు నిరతము దేవా

తే॥ సంతతము రామనామంబు సంస్మరించు చరసి దీనుల బ్రోచు రామమ్మ యాత్మ
కధిక శాంతిని నవకోసలాధినాథు డొసఁగి యాసాధ్విసుత నిచ్చ లోముఁగాత

శ్లో॥ నమోస్తు రామాయ సలక్ష్మణాయ నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మ భువేవరాయ నమోస్తు వాల్మీకభవాయ తస్మై॥

గద్య
ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షణ
లబ్ధకవిత్వ శౌనకసగోత్ర పవిత్ర
శ్రీరామపుత్రి విరచితము
నవకోసల రామాయణము హరికథ.
అయోధ్యాకాండము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ
శ్రీ రామార్పణమస్తు.

శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# నవకోసల రామాయణము.

# హరికథ.

## అరణ్యకాండము.

క॥ శ్రీసీతారమణీశుడు భాసురగుణు డర్కవంశవారిధి నిధుడై
వాసిగ నవకోసలపురవాసుడు మముబ్రోచుగాత వైభవమలరన్.

క॥ ధరణిని రఘువంశంబున నరుడై జన్మించె హరియు సురుచిరలీలన్
సరసిజభవ సురముని నరవరులకు నానంద మొదవ వరదుండగుచున్.

హిం:-శ్రీరఘురాముడు శ్రితమందారుడు ధీరుడు ఉదధి గంభీరుడు వీరుడు
నారీమణి వైదేహి సౌమిత్రియు జేరిరి ముదమున దండకారణ్యమున్ ॥శ్రీ

(2) వేద ఘోషంబులు వీనులవిందుగ వినుచును జనుచును వేడుకమీరగ
మోదంబున మృగపక్షి సంకులములున్ మధురమైన ఫలసున్నమ్ములు నిండిన ॥శ్రీ

(3) బ్రహ్మఋషులచే రాజిల్లు తలమును భాసురముగగని చాపముడింపగ
నిర్మలచిత్తులు బ్రహ్మనిష్ఠులు మునులు నెదురుగవచ్చియు గనిరి ముదంబున ॥శ్రీ

(4) శృంగారుల సీతారామలక్ష్మణుల సౌజన్య లావణ్య సౌకుమార్యముల్ గని
మంగళమని దీవించిరి ప్రియమున మహనీయులు వారి మెచ్చుచుమదిలో ॥శ్రీ

తే॥ అనిమిషత్వమునం తనివి సనకగాంచి రామలక్ష్మణులను మౌనులు భూమిసుతను
అతిథులని ప్రేమనిండార నధికభక్తి జనిరి దోడ్కొని తమ పర్ణశాలలకును

డో॥ర:-పాద్యమొసంగియు నాసనమిడియును ఫలమూలంబులదనిపి
మోదంబున కేల్ మొగిచి మునీంద్రులు సాదరముగ నిట్లనిరి ॥జ

సురటి - రూపకం

ప॥ ఆదిపురుష నిన్నాశ్రయించితిమి రామ ॥ఆ

అ॥ వేదవేదాన్తవేద్య విమల విశ్వకారణరామ ॥ఆ

చ॥ ఆనందనిలయ రామ సదానంద మొసగుమాకు
నీనామ కీర్తనమున నినుజూడగ గంటిమి దేవ ॥ఆ

(2) అప్రమేయచరిత మా కభయమిచ్చి ప్రోవుముకరుణ
సుప్రకాశ రఘుకులేశ సుజనరక్షా దీక్షరామ ॥ఆ

(3) నిరుపమాన తేజయీశ పరమపురుష శ్రీరమేశ
నిరవధిక సుఖదాయక నిత్యకల్యాణ మహోత్సవ ॥ఆ

(4) అవనిలోన నవతరించి అసురుల దెగటార్చి వేగ
నవకోసల కోదండరామ భవభయముల బాపుతండ్రీ ॥ఆ

వ॥ అని ప్రార్థించిన వారల నాదరించి,

జో॥-ఆదిన మట గడపి వేగుటయు నార్యసమ్మతులులేచి
ఆదరమున నామునులను వీడ్కొని యరిగిరి మోదముతోడ ॥జ

(2) తరువుల గుల్మలతాదుల నొప్పెడు దండకాటవిలో జనుచు
శరభ శార్దూల వృక మృగ ఖగముల సంచారంబుల గనుచు ॥జ

వ॥ అప్పు డక్కాంతార మధ్యంబున వికృతవదనుండు, పింగాక్షుండును, మహాకాయుండును, సింహ శరభ శార్దూల హస్తిశిరంబులనొప్పు శూలంబు కేలంబూని, బొబ్బలిడుచు భయంకరాకారంబున వచ్చునతని, సీతా రామ లక్ష్మణులు నివ్వెఱపడి చూచుచుండ, ఆరక్కసుండేమఱుపాటున సీతనెత్తుకొనిపోయి తన అంకపీఠంబున బెట్టుకొని, రామ లక్ష్మణులంగని యిట్లనియె.

జో॥-చీరాజినములు జటలు దాల్చితిరి ధరణిని మునులను బోలియును
నాతిమణిం దోడ్కొని పోయెదరు ఘోరాటవిలో మీరు ॥జ

(2) ఘనుడ విరాధుడ మునులమాంసము దినుచుండెదనేం బ్రత్యహమ్ము
వినుడీ మిమ్మిదె మ్రింగి యీ మగువ వెసంజేకొందును భార్యగను ॥జ

(3) గడగడవడకుచు నసురుని తోడపై పుడమిజ యుండగ వాడనియెం
బుడమిని బ్రతుకగ నాశయుండునెడ వెడలిపొండు సతివిడచిప్పుడె ॥జ

(4) ఎవ్వరు మీరలు ఈ వనమున భయమింతలేక దిరిగెదరు
ఇవ్వనజాక్షిని విడువనింక నన్నేమిచేసెదరు మీరు ॥జ

(5) అనవిని రాముడు శోకముమీఱ ననెనిటు తమ్మునితోడ
వినుమా కైకయు వనులకనిపినది [illegible]

కం:- హితమతివై తనపుత్రిన కతులిత వైభవములొసంగి యలరంగరాదే
వెతలం బడుచని మమ్మీగతి నడవుల కనుప నేమి కతమో యెఱుంగన్ ॥జ

వ॥ అనిన సుమిత్రానందనుండు, రోషారుణిత నేత్రుండై.

జోరః- అన్నా యిటు దుఃఖించెదేల యీ యసురుని దునుమకయె సంగ
సన్నుతచరితా యీదురాత్ముని నిక సంహరింతు సెలవొసగ ॥జ

(2) భరతునిపైఁగల కోపముదీరఁగఁ బరిమార్చెద నసురుని నేడు
ధరణిజ దుఃఖము బాపెద నిప్పుడు పరమపూరుష దయజూడు ॥జ

వ॥ అని లక్ష్మణుండు తెలియంబల్క విని రామచంద్రుండు కనుఁగొలుకులఁ గెంపు
సొంపార ఆరక్కసునిపై సునిశితాస్త్రంబులు ప్రయోగించి వానివక్షంబు
భేదింప వాడు నెత్తుటం దొప్పదోగియు చావక సీతను డించి శూలంబు వారిపై విస
రివేయ రామసౌమిత్రులు పెనుమంట లెగయుచు వచ్చుదాని ఖండించిరంత.
నారక్కసుడు రామ లక్ష్మణులను భుజంబులనిడుకొనిపోవ సీత మొలుగెత్తి
యేడ్చుచు ఓరాక్షసా నన్నుమృగంబులు దినిపోవునుగాన వారలవిడచి నన్నుం
గొనిపొమ్ము నీకు మ్రొక్కెదననుచుండ నప్పుడు వానిభుజంబుల రెంటిని నిరు
వురు ఖండించి అనేకశస్త్రాస్త్రంబుల బొడిచినను వాడు మరణింపకుండె నప్పుడు
రఘుపుంగవుండు లక్ష్మణా వీనిని గుంటలో పూడ్చిపెట్టవలయు ననియె. ఆమా
టలు వినినంతనె వానికి పూర్వజ్ఞానంబుగలిగి శ్రీరామవిభునిగని.

కళ్యాణి - ఆది

వ॥ తుంబురుండనే గంధర్వుడ రామ ॥తుం

అ॥ రంభగూడి సురరాజసభనుండ జంభవైరినన్ను శపియించె నిటుల ॥తుం

చ॥ ఏమిగతినాకు నెరిగింపుమనివేడ రామమూర్తి నిన్ను రక్షించు పొమ్మనియె ॥తుం

(2) ఎరిగితినిపుడు నిన్నాదివిష్ణువని మరియు శేషుడే యీ లక్ష్మణుండనియు ॥తుం

(3) జనకరాజతనయ జగన్మాతయని గనుగొంటిని నా కర్మములు దొలగ ॥తుం

(4) అవనిలో దుష్టులనణచి సాధులబ్రోవ అవతరించినావు నవకోసలేశ ॥తుం

వ॥ రామచంద్రప్రభో అస్త్రశస్త్రంబులచే నేఁజావను గాన శరపీడితుండనగు నన్ను
త్వరితంబుగఁ గోతిలోఁ ద్రోయుము. ప్రాణంబులుపోవు దివంబుజేరెద మరియు

జోరః- అర్ధయోజన దూరంబున శరభంగుని యాశ్రమమున్నది గనుడీ
సార్థకముగు నామునిసేవించిన సరగున మీరటు జనుడీ ॥జ

వ॥ అనవుడు శ్రీరాముడు లక్ష్మణుని గుంటత్రవ్వుమన నతండట్లుచేయ నిరువురు వాని గుంటలోత్రోసి కొట్టి పూడ్చిరి అతడును స్వర్గంబు జేరెనంత

జోర:-చంద్రసూర్యులన యావనమున రఘునందను లతివేగమునన్
ఇందువదన మహీసుతతో నడచిరి మునిచంద్రు నాశ్రమము పొంతన్ ॥జ

(2) అంతరిక్షమున భటులుగొల్వ నమరేంద్రుడు రథమున నిలచీ
ఆంతర్యంబుగ మునితో ముచ్చట లాడెడు వానినిగాంచి ॥జ

వ॥ దాశరథి సీతాలక్ష్మణ సహితంబుగ మునిచెంతకువచ్చి అతనికి వందనంబు లాచరించి నిలచియున్న దీవించి సుఖాసనంబుల కూర్చుండ నియోగించి రామా

క॥ దేవేంద్రుడు ననుబిలువగ తావచ్చియు పోయెదివికి దశరథతనయా
నీవిటవచ్చు టెఱుంగుచు బోవక నిలిచితిని నేను నినుగను వేడ్కన్.

అమృతపంచమము - ఆది

ప॥ దేవాదిదేవాప్రభో దినకరవంశవిభో ॥దే

అ॥ నీవేశరణ్యుడవు నిఖిలజగంబులకు శ్రీవల్లభారవితేజా శ్రితకల్పభూజ ॥దే

చ॥ మానుషవేషా మణిమయభూషా మానిజనపోషా మధురమంజులభాషా ॥దే

(2) కరుణాసముద్ర కల్యాణగుణసాంద్ర వరనవకోసలేంద్రా వరదా శ్రీరామచంద్రా॥

జోర:-ఆర్జించితిని బ్రహ్మలోకమును అధికతపము పెంపునను
నిర్జరలోకము బ్రహ్మలోకఫల మిచ్చెద చేకొను ముదమునను ॥జ

(2) ఇచ్చిన ఫలమును గైకొంటిని సచ్చరిత్ర మోదమున
నిచ్చట నుండుగ నెలవుదెల్పు మన నిట్లనియెను మునివేగమున ॥జ

(3) ఘనుడు సుతీక్ష్ణుడను మునిగలడట జనుడీమార్గంబున మీరు
ఘన మందాకిని పూల తెప్పలతో గన్పట్టుచున్నదదె చేరువను ॥జ

(4) మీరుండుటకును తావెరుగించును శ్రీరఘువర యటుజేరి
ధారుణి సుతను తమ్మునిగూడి కూరిమి నుండుము మోదముమీరి ॥జ

(5) భూవల్లభ క్షణకాలమునిల్వుము పోయెద బ్రహ్మపదంబున్
దేవా నిన్నే కనుచు ముదమ్మున దేహమువిడచెద నిపుడున్ ॥జ

(6) అని పల్కుచును జ్వలితవహ్నిలో మునివర్యుడు తాంబడియు
అనఘుడు దివ్యశరీరము దాలిచి అరిగె నజుని చెంతకును ॥జ

వ॥ అంత నమ్మువ్వురు శరభంగ మహాముని మహిమను గొనియాడుచు కాంతార మధ్యంబున జనుచుండ వైఖానస వాలఖిల్యాది మునులు దశరథాత్మజుని గని యిట్లనిరి.

కమాసు - ఏక

ప॥ రాజమహారాజ దశరథరాజతనయ రామచంద్ర ॥రా

అ॥ రాజకల్ప భూజజనక రాజసుతా పూజితపద ॥

చ॥ తండ్రియాజ్ఞ బూనినీవు దండకాటవి జేరితివి
దండి క్రూరరాక్షసుల చండివేయు జగతిపాల ॥రా

(2) దుష్టుల ఖండించివేగ శిష్టులరక్షించి మా
కష్టములను దీర్పుమయ్య కౌసల్యా వరకుమార ॥రా

(3) అభయ మొసగు మాకునిపుడు ఆర్యవినుత రఘుకులేంద్ర
త్రిభువన సంరక్షదీక్ష దినకర వంశాబ్ధిచంద్ర ॥రా

(4) సరసిజభవాదిసేవ్య శరణుజొచ్చినాము దేవ
కరుణింపుము నవకోసల పురినివాస వరదయీశ ॥రా

వ॥ రామా! అందందు రక్కసులచే జచ్చిన, మునీంద్రుల శవంబులను, అస్థిశకలంబులను గనుము! దేవా! అసురులబాధ తొలగింపుము. ఇదియె మావిన్నపంబన రఘురాముం డిట్లనియె.

జోర:-జనకుని యానతియను నెపమున నే మునులను జూడగగోరి
వనవాసంబును జేయగ వచ్చితి ఘనులారా మీరిటుచేరి ॥జ

(2) పనిచిన పనులను దీర్చెదనింకను భయము విడువు డసురుల వలనన్
అనుచును వారల కభయమొసగి తా జనియెను జనకజానుజుల తోడన్ ॥జ

వ॥ అంత సుతీక్ష్ణ మహాముని యాశ్రమంబుజొచ్చి ధూళిధూసరిత జటామకుట ధరుండగు నమ్మహాత్ముని దర్శించి, స్వామీ! నేను రాముండ. తమ దర్శనార్థంబు వచ్చితినని నమస్కరించిన,

జోర:-గుచ్చికౌగిటను జేరిచి రాముని కూరిమినిట్లనె మునియు
సచ్చరిత్ర నీవచ్చుట దెలిసి సంతోషించితి మరియు ॥జ

(2) నను బిల్వగ నింద్రుడువచ్చిన నరుగక నినుగను వేడ్కనురామా
మనమున నీపై ప్రీతిని నిలచితి నినకులోత్తమ జయరామా ॥జ

(3) నేనార్జించిన పుణ్యలోకములు జానకితోడుత వేగ
భూనాయక చేకొనుమని బల్కుచు ఆనందంబున మీర ॥జ

(4) మునికోట్లిట తపమాచరింతు రతి ముదమున సౌఖ్యప్రదము
ఘనతరులతలను పుష్పఫలమ్ముల గడు రమ్యమీ వనము ॥జ

(5) మీరిట నుండుడు జానకితోడ భూరి బలాధికులార
జేరి మృగములు మునుల తపమ్ములు చెఱచుచుండు నిటచాల ॥జ

(6) అనిముని బల్కగ విని రాముండనె ననుమోదంబునుమీర
అనఘా మృగసంఘముల్ గూల్చిన మీ కాయాసముగద మునిశార్దూల

వ॥ అనిబల్కి యటనుండ సమ్మతింపక మునివరుం డొసంగిన యాతిథ్యంబు తుష్ట స్వాంతుండై యారాత్రి యటనుండి అరుణోదయంబున వేకు స్నానసంధ్యా జపహోమంబు లాచరించి యమ్ముని శ్రేష్ఠునకు ప్రణామి విమ్మ పోయి వచ్చెదము. మాతో వచ్చిన బ్రాహ్మణులు దండ జేరుచున్నవారన సుతీక్ష్ణుడు రాముని గాఢాలింగనము గావించి నాయనా ముగాంబోయి మరలి యిచటికి రండన శరచాపంబులు సీతాదేవి రా ణుల కందియ్యగైకొని పయనంబై పోవుచున్నంత వసుంధరాతనయా చందుప్రన కిట్లనియె.

హిం:-పరమపురుష నే బల్కెద నొకమాట నరులకు విహితము సత్యము బల పరసతులను మదిగోరకుండుటయును మరియు నహింసాచరణము శ్రేష్ఠము

(2) సత్యవ్రతుడవు పరసతినంటవు సహజగుణంబులు నీకివి శ్రీరామా
నిత్యనిర్మల మానుము హింసను నీతిగాదు నీకు నిశాటుల జంపుట ॥శ్రీ

(3) మునివృత్తిని మీరున్నారిప్పుడు వనముల తపమును గావించుచు మరి
వనవాసవ్రత నియమము దీర్చియు జనుద మయోధ్యకు సంతోషంబున ॥

వ॥ దేవా! అసురులజంప ప్రయత్నింపకుము. మున్నొక బ్రాహ్మణుండు సాంగత్యంబున క్రూరుండై ఘోర నరకంబునం బడెనని విందుముగదా యు ధర్మంబని తలంతుమేని యద్ధానికిది సమయంబుగాదని యెంచెద.

శో:-నీవెరుగని ధర్మంబులుగలవే నిత్యవ్రత యీవిభుని
దేవా చనువున నీకిదిహితమని దెలిసి తెలియకయు బల్కితిని ॥జ

(2) నాదు విన్నపంబిదే మన్నించుము నాథానాపై దయతోను
నీమదిని నేబుద్ధి చెప్పినటు జేయుము సోదరు గూడియును ॥జ

(3) ఇట్లుపల్కిన సతిమెచ్చుచు రాముడు హితముదెల్పితివి లేమా
పటుధైర్యంబును బూని క్షత్రియులు పాలింపరెధగ భామా ॥జ

(4) వినువక మునులను బట్టిగొట్టుచు విఘ్నముచేయుచు తపముల్
అసురులు వారల బాధించుచును హతమొనరింతురు సతతంబుల్ ॥జ

వ॥ అటుగాన నో దేవీ!

సీ॥ ఈ మహామునులెల్ల రింతి వేడిరిమమ్ము దనుజులఁ బరిమార్చి మనుపుమంచు
ఆర్తరక్షణజేయు టదియె ధర్మముగాన అభయమిచ్చితి వీరి కతివ యిపుడు
విడుతు ప్రాణములైన విడుతునిన్ లక్ష్మణు విడువను ధర్మంబు వినుము సాధ్వి
గావున మునికోట్ల గాపాడి దనుజుల జంపుటధర్మంబు సత్యమిదియె
తాపసులబట్టి చంపుచు దైత్యులిందు సంచరించుచు నున్నారు సకలదిశల
వారినందర బరిమార్చి చేరిఋషుల భయముబాపుచు రక్షింతు వారినబల॥

వ॥ ఇట్లుదెల్పి దియా మునివరులంగూడి బోవుచుండ, మార్గంబున శ్రీరామ చంద్రుండు, లక్ష్మణా!

తే॥ సరసిజంబులతో శుద్ధజలముగలిగి సుందరంబైన కొలనిది జూడనొప్పె
మనుజులెవ్వరులేరిందు నినదమొకటి వినగవచ్చెను వీనుల విందుగాగ

వ॥ యీ నాదంబెందుండి వచ్చుచున్నదో మనోహరంబుగ నున్నదని బల్కునెడ వారితోగూడివచ్చు వారలలో ధర్మభృతుండను నతడు శ్రీరామప్రభూ,

జో॥:-ఇందొక మౌనితపమ్మును చేయగ నింద్రుడు విఘ్నముజేయ
ఇందువదనలను బంప వారితో విహరించెడు నిటమోదమున ॥జ

(2) పాటలగంధులు బహునాదంబుల పాటలుబాడుచు నాడన్
సాటిలేని యీసంగీత రవమిది సాధుపూజితా యనినన్ ॥జ

వ॥ శ్రీరాముండంత జానకీ యీగానంబు వింటివిగదా పదివేల వత్సరంబులు ఘోర తపంబుజేసియు యీ మాండకర్ణి స్త్రీలోలుండై యున్నవాడు అనిదెల్పుచు పుణ్యకథా ప్రసంగంబులు సేయుచు మునివరులతోడ వారివారి యాశ్రమంబులుజేరి యచ్చటచ్చట కొన్నిమాసంబులు వారి యిష్టానుసారంబుగ నిలచుచు సీతా లక్ష్మణులంగూడి వినోదంబుగ నా యాప్రదేశంబుల కాలంబుగడిపి షడ్వత్సరములు జనగ మరల సుతీక్ష్ణు నాశ్రమంబుజేరి కొంతకాలంబు నివసించి యొకానొక దినంబున సుతీక్ష్ణునింగని,

జోర:-ఘనుడు అగస్త్య మహాఋషి. యీవనమున గలడటవేగ
జని యామునిపుంగవు గనుషేకుక జనియించెను నామది ననిన ॥జ

(2) ఆమహాత్ముని యాశ్రమంబుగన అతిరమణీయముగానర్
రామా నీవటుపొమ్ము ప్రియమున రవిసన్నిభ జూడగ హర్షమునర్ ॥జ

(3) సంతోషంబున రామలక్ష్మణులు జానకిదేవినిగూడి
వింతవింత తరుగుల్మలతాదుల వీక్షించుచు మోదముమీరి ॥జ

(4) శుకపికరావముల్ సొంపుగవినుచు సకల మృగంబుల గనుచు
సుఖగమనంబున బోవుచు నప్పుడు శుభచరితుడు రాఘవు డిటులనెను ॥జ

(5) అగస్త్యానుజుని యాశ్రమమల్లదె అతిమనోహరము ఘనము
సొగసై యున్న యీవనమునుగన సొంపు పెంపు శుభకరము ॥జ

వ॥ అని యావన విభవంబు సీతాలక్ష్మణుల కెరిగించుచు అగస్త్యానుజుని జేరంజని మ్రొక్కి దీవనలంది యతండిచ్చిన ఫలమూలంబుల భక్షించి యా రేయిగడపి రేపకడ లేచి మునివర్యు ననుజ్ఞగొని మువ్వురు దక్షిణదిశంగూర్చి బోవుచు కుంభసంభవు నాశ్రమంబు డాయం జని యందు జాతివైరంబులులేక మెలంగు మృగపక్షి జాతులును మధురాంబువులనొప్పు జలాశయములును ఫలపుష్పమంజు లతాదులును, రమణీయంబు లగు వస్తువితానంబులును, అతిమనోహరంబుగా గనుచు రామచంద్రుడు తమ్మునిని కిట్లనియె.

జోర:-వాతాపీల్వలు లనియెడివారల వధియించిన పుణ్యుండు
చాతుర్యంబున వింధ్యుని మదము జక్కడచిన పూజ్యుండు ॥జ

(2) నీవటుపోయి యామహాత్మునికి నివేదింపు మనరా కనిన
భావములర లక్ష్మణు డటుచని వలికెను మునిశిష్యుని కిటుల ॥జ

(3) రామచంద్రుడు దశరథ తనయుండు భూమిజతో గూడియును
స్వామీ! మిముదర్శించుట కొరకు జనుదెంచెను యిటకనుము ॥జ

(4) రాముని తమ్ముడ లక్ష్మణుడను మారాక దెల్పుము గురువునకనినర్
శిష్యుతోడను రయమున దెల్పెను రామ లక్ష్మణుల రాకర్ ॥జ

వ॥ అంత నమ్మహర్షి ఆనందరసాబ్ధి మగ్నుండై

హిం:- వారలందోడ్కొని రమ్ము ప్రియమ్మున ధీరుల వనధిగంభీరుల
శూరులం జేరగంబో మ్మతిశీఘ్రంబునను కూరిమితో నాకోర్కెదీరగ ॥శ్రీ

(2) అంతట శిష్యుడు ఆరఘువీరుల చెంతకరిగి శ్రీరాముల గాంచియు
సంతోషముతో మ్రొక్కి యిట్లనియెను స్వామీ మిము వేగ రమ్మనె మౌనియు ॥శ్రీ

(3) దివకరతేజులు మునిసదనంబున త్రేతాగ్నులు వెల్గు దేవశాలలును
ఘనమగు వేదపాఠశాలలగనుచు కడుముదమున మౌనిజేరగ వచ్చిన ॥శ్రీ

(4) ఎదురుగ వచ్చెడు మునిచంద్రుని గని యీ మహాత్ముండె కలశోద్భవుడని
పదములపాలి భక్తిమువ్వురును సదమలమతులై సన్నుతించిరపుడు ॥శ్రీ

వ॥ నమస్కరించిన సీతా రామ లక్ష్మణుల అర్ఘ్యపాద్యాసన అర్చనాదులచే అతిథి సత్కారంబు జేసి ఫలమూలంబుల పరమప్రీతిని నొసగ పరమానందంబున భుజియించిరి. అంత సుఖోపవిష్టులైన, శ్రీమ పరిహారంబుదీర్ప శిష్యులు వీవనలుబట్టివిసర, మధుర సంభాషణల సల్లాపంబు లాడు సమయంబున మౌని వరేణ్యుడు.

జోర:- రామాయివె దివ్యాస్త్రశస్త్రములు రవికులోత్తమా గనుమా
ప్రేమనొసంగిరి వేల్పులు నాకును ప్రియమున నిచ్చితి నీ కిదెగొనుమా ॥జ

(2) ఎరుగుదునీవు వచ్చినవిధమును ఇటనుండుము సుఖముగను
తరువులు ఫల భరితంబులు మరి సరసుల మధురాంబువుల్ గలదు ॥జ

(3) జాతివైరములు లేక మృగములు సంచరించు నిచట
సీతారమణికి సంతోషంబుగ జేరి వసింపుము తమ్మునితోడ ॥జ

ఆనందభైరవి — ఆది

ప॥ రామా లలామ సాధ్వీమణిరామ ॥రా

అ॥ యీ మానిని వరవర్ణిని యిందువదన యీసుందరి యిందిర ॥రా

చ॥ భానుని ఛాయని ప్రభవలెను భాసురముగ సీతోడ
కానకువచ్చెను అతిమోదంబున కాంతుని పదకంజములను గొల్చుచు ॥రా

(2) భూవర యతికోమలి నవకోసల పుర సంచారిణి
పావని పరమదయానిధి పతిహిత ప్రియకరి భద్రయశస్కారి ॥రా

శ్రీరా:- ఈ సుకుమారీ కష్టము లెరుగదు హితముగూర్పు మదికింపు సొంపుగ
వాసవసన్నుత రాఘవయిందు వసియింపుము విశ్రాంతిని గొనుము ॥శ్రీ

(2) జనక మహీపతి వరసుతజానకి సతీజన సమ్మానిత చరిత
వనరుహాలోచన అరుంధతి సమాన వనితారత్న మీయిలలో రామ ॥శ్రీ

(3) అనవుడు రాముండనియె మౌనితో అనఘా నీదయ నటుల నొనర్చెద
వనవాసవ్రితశేషము దీర్చగ జనరహింతబగు స్థలముదెల్పు మాకు ॥శ్రీ

వ॥ అని యడిగిన నొక్కింత తడవు యోచించి అగస్త్యుండు, రఘువీరా! ఇచ్చటికి రెండామడ దూరంబున పంచవటియను దివ్యస్థలంబు గౌతమీ తీరంబునం గలదు. అతి మనోహరంబు,

క॥ ప్రేమను నాచెంతను నిను శ్రీరామా యుండుమనుచుఁ జెప్పియు నటకుఁ
భూమిజధవ బొమ్మంటిని నీమదిగల తలపునెరిగి నిర్మల హృదయా॥

వ॥ కావున రామభద్రాయిటుబోయి యిప్పచెట్లతోపు దాటిన వట వృక్షంబొండు గాన్పించు అట పర్వతప్రాంతంబున,

హిం:-ఫలవృక్షము లందు బలసియున్న విమతి యలరుచుండు చెంగల్వతామర కొలకుల్
పలు తెఱగుల మృగపక్షి గణములు చెలగుచుండునట సీతకు ప్రియముగ ॥శ్రీ

(2) చేరువగౌతమి రమణీయంబుగ పారుచుండు నతి గంభీరముగను
సారస టిట్టిభ జలకుక్కుటములు సరసత నొప్పను జలచరములతో ॥శ్రీ

(3) నీవటుపోయి నివాసముచేయుచు గావుము మౌనుల ఖండింపు మసురుల
దేవినిగూడి నీవ్రితముదీర్చి వేగ బోవుమి యయోధ్యకు బొందుము రాజ్యము

వ॥ అనవుడు,

జోర:-కడుముదమున నామునికి నమస్కృతి గావించియు వేగమున
పుడమిజఁ దోడ్కొని రామలక్ష్మణులు వెడలిరి యానందమున ॥జ

(2) మునిదెల్పిన మార్గంబునఁ బోవుచు గని రట వటవృక్షమునఁ
ఘనకాయుం డగు జటాయువు నప్పుడు గాంచిరి యాశ్చర్యముగఁ ॥జ

(3) వీడెవ్వడు పెనురక్కసు డిక్కడ జూడుము తమ్ముడ బాగ
పోడిమిగ నితనిఁ బట్టి గొట్టియుఁ బొలియింపుము చనువేగ ॥జ

వ॥ అని యతని నీవెవ్వడవు నీపేరేమి రాక్షసా!

ద్విపద:-అని రాముడిటుబల్క వినియునాఖగము। ఘనులార వినుడయ్య కానురక్కసుడ
దయజూడుడీ మీాదుతండ్రి సఖుండ। భయమయ్యెనిపుడు మీా పల్కులువిన్న
ఘనుడు కశ్యపువంశమునబుట్టినాడ। వినతాతనూజుని తనయుండనేను
అనఘుడు సంపాతి అన్నయానాకు। ననుజటాయువటంచు నన్నును జనమ్ము

మిమ్ము సేవించుచు మీతోడనుండి। కమలాక్షి సీతను గాపాడుచుండు
శ్రమలేక మీపనుల్ జక్కఁజేసెదను। ప్రమదానమీపాద పద్మముల్ గొలిచి

వ॥ అని యిట్లు పలుకు నాపక్షి కులేంద్రుని మన్నించి యతండు తోడరా పంచవటి ప్రవేశించి,

ద్విర:-ఫలపుష్పంబుల నలరు తరువులును జలము చేరువను నుండు
సలలితమగు మిట్టపల్లములులేని సమతల మరయుచు నందు ॥జ

(2) రామలక్ష్మణులు నిటనట దిరుగుచు రమణీయంబుగ మరియు
తామర కొలకును తరులత లమరిన స్థలముగనిరి ముదమునను ॥జ

(3) ఇచ్చట నుండగ హితమగు మనకు వినుమా లక్ష్మణవేగఁ
ముచ్చటగా నిర్మింపుము గృహమును మోహనాంగి సీతకు ముదమొందఁ ॥జ

హిం:-అంత లక్ష్మణుం డట నిర్మించెను వింతగు గృహమును వేడుకలరగ
సంతోషంబుగ గృహశాంతి గావించి జానకితో రామచంద్రుడు చేరెను ॥శ్రీ

(2) అతిశయంబగు ప్రేమనునాకు హితముచేయుదువు సోదరనీవు
అతి ప్రియమున నీకేమి యొసంగుదు అనుచును తమ్ముని గ్రుచ్చి కౌగిటఁజేర్చి ॥శ్రీ

వ॥ అన్నా! నీ కింతకన్నను పారితోషకం బింకేమియిత్తు! నని శిరమువూర్కొని మేనునిమిరి యానందించె. అందరును మహానంద మగ్నులై,

సీ॥ శ్రీరామమూర్తియు సీతాసమేతుడై యాకుటీరమునందు నతిసుఖముగ
కాలంబుగడుపుచు కడుమోదముననుండ హేమంత మొప్పారె నింపుమీర
స్నానంబుజేయంగ జనుచుండు సమయాన సౌమిత్రి యన్నతో ననియెనిట్లు
అన్న యీఋతువునం దధికంబు చలివలి జనులకు మృగపక్షి గణములకును
సిరుద్రోవక చలికి నివారణంబు తొండముఁ ముడిచినదదె తోయజాక్ష
పచ్చికలపైని వజ్రాల తునుకలట్లు మంచుబిందువు లమరె నమంచితముగ॥

వ॥ అన్నా యిట్టి తరుణంబున,

ద్విర:-సరయూనదికిని బోవుచుండు మన భరతుండీ వేకువను
స్థిరమతి చలివలి కోర్చియు మనవలె చరియించునుగద శుభకరుడు ॥జ

(2) అనఘా సుతునకు తల్లి గుణంబులె అలవడునని బల్కెదరు
ఘనుడు భరతునకు తల్లి గుణంబులు గలుగ వతఁడు శుభగుణుఁడు ॥జ

వ॥ అన శ్రీరాముండు,

జోర:-భరతునిపై గల కూరిమిచేతను బల్కుట ప్రియమగునాకు
దురుసుగ బల్కకు కైకనెప్పుడు పరమపావనిని నీవు ॥జ

(2) తమ్మునికిటు బహుహితములు దెల్పుచు తడయక స్నానముజేసి
కమ్మనితావులు గల పొదరిండ్లను గనుచును సీతనుగూడి ॥జ

వ॥ పర్ణశాల ప్రవేశించి, కందమూలములతోడి పక్వఫలము లారగించి, సుఖాసీనుడై రామచంద్రుడు సీతా లక్ష్మణులకు అనేక పురాతనకథావిశేషంబు లెఱింగించుచున్న సమయంబున.

జోర:-రావణుచెల్లెలు చుప్పనాతి రఘురాముని కన్నులజూచి
భావజాస్త్రముల పాలై రక్కసి వర్ణించుచు నిలచెను రాఘవుని ॥జ

కానడ - రూపకం

ప॥ గంభీర రత్నాకరు కరుణాకరు శ్రీకరుగనె ॥గం

అ॥ అంభోరుహ పత్రాక్షుని అతివిశాల ఘనవక్షుని ॥గం

చ॥ హర్యక్ష నిభమధ్యుని ఆజానుబాహుని
శౌర్యవిక్రమ ధౌరేయుని సౌందర్య జితమారుని ॥గం

(2) భువనమోహన లావణ్యుని పురుషోత్తము నప్రమేయుని
నవకోసల పరంధాముని సద్గుణా లంకారుని ॥గం

జోర:-ఎవ్వరు మీరిటనేల నుండెదరు యెఱిగింపుడు వేగమున
క్రొవ్వున దిరిగెదరిట రక్కసులు ఘోరరూపులు వినుమ ॥జ

(2) నున్నైనను భయమింతలేక నీ సుదతినిగూడియు నిచట
నంతసముననను సంచరించెదవు సరిగాదిది నీకనిన ॥జ

(3) ఇనవంశజుడను దశరథభూపతి తనయుడ రాముడనేను
అనుగుతమ్ముడు లక్ష్మణుండు యీ వనిత ప్రియసతినాకున్ ॥జ

(4) తండ్రియాజ్ఞచే వచ్చితినేను దండకాటవినిజేర
చెండాడుచు రాక్షసవీరుల నిట నేనుండెద ధైర్యముతోడ ॥జ

(5) పిలవచ్చితివి యెవ్వతెవీవిటు తెలిగింపుము వేగమెయనిన
బాలభాస్కర[illegible]లు రాముగని బల్కెనదియు మోహమున ॥జ

(6) నినుగని వలచితి మోహనాంగనే నిలువజాలనిక క్షణమైనన్
నను దయజూడుము కోర్కిదీర్చి యీ వనితను విడువుమిక నైనన్ ॥జ

వ॥ సుందరాకార వినుము నేను రావణ కుంభకర్ణ విభీషణుల సహోదరిని, యిం దుండు ఖరదూషణ త్రిశిరులును, నాసహోదరులు. నేనెందైనను స్వేచ్ఛగా విహరించుచుండుదాన గావున

కమాసు - ఏక

ప॥ రామచంద్ర నాతో విహరింపుము వేడుకన్ ॥రా

అ॥ కామ శతకోటి లావణ్య సుందరగాత్రా
కామరూపిణి నన్నుగలసి క్రీడింపుము బహువిధముల ॥రా

చ॥ నాతియీసీత నొ్వడచి నదిగ్రికందరములను నన్
భూతల నాయక రంజింపజేయుము బోవుదమిపుడు వేగమునను ॥రా

(2) చక్కదనమునను నీకు సరియగుదును నేను
మక్కువ నిను మగనిగగొని ముక్కిడి నీసతి మ్రింగివైచెదను ॥రా

(3) సుందరమగునట్టి సొంపును జూచి వలచియిప్పుడున్
అందగాడా నవకోసలేశ నీ పొందుగోరి యిటవచ్చితిని ॥రా

వ॥ అని పల్కు వికార స్వరూపిణియగు దానింగని దరహాసిత వదనారవిందుండై శ్రీరామచంద్రుండు అమంద మధురవచనంబుల,

శంకరాభరణము – చాపు

ప॥ నిను గోరుటరుదే నేమగవారైన ॥ని

అ॥ కనులకు నీరూప శృంగారముగన కదువిరహాగ్నిలో బడకుందురే భువి ॥ని

చ॥ అతిముదమున పెండ్లియాడిన చిన్నదీ సతివిడువదునను సవతిపోరగునీకు ॥ని

(2) చతురుడు సరసుడు చక్కనివాడు సతిచెంతలేదు సవతిపోరునులేదు ॥ని

(3) శ్రీకరుడగు నాతమ్ముని జేరుము భీకర రదనా పెండ్లియాడు నతడు ॥ని

(4) వర నవకోసల పురవాసులుగని నిను పరిహాసింతురు నా సరసనుండకుపొమ్ము ॥ని

వ॥ రాముండిటుబల్క సద్గుణ విచక్షణుండగు లక్ష్మణునిజేరి యారక్కసి,

ద్విప:-నిను వరియించితి నాథా లక్ష్మణ ఘనశైలంబుల గుహాలన్
అనువగు వనముల పూపొదరిండ్లను మనమలరగ నుందమువేడ్కన్ ॥జ

(2) నాకంటెను చక్కని సుదతిని నీవీలోకంబున గనలేవు
రాకుమార ప్రియురాలను నీకు గైకొను భార్యగ ననునీవు ॥జ

వ॥ అన నాపలుకు లాలించి రామచంద్రుని మోముచూచుచు వినోదంబుగా దాని
తో నిట్లనియె,

పంతువరాళి — ఏక

ప॥ నీదు చక్కదనము నెంచగ నేరరెవరు జగతిలోన ॥నీ

అ॥ మోదమున నీయందముజూచి మెచ్చునివారెవరు సుందరి ॥నీ

చ॥ ముదిత బహుకరాళ వదనవు విరూపిణీ మహోదరంబు గల్గుదానవు
ముదుసలి ఘనదుర్మద నిన్ను మది దలచిన విడతురెవరు
మదనబాణాగ్నిమగ్నులై మడియరె యోమగువ విను ॥నీ

(2) రామవిభుని బాసినీడనే ననుగోరెదేల తెలియక బానిసవై మెలగవలదెపో
యీమహి నవకోసలపురరాములు నినుజూచి నవ్వరె రాము సుగుణధాము ముద్దుల
భామవగుచు నుండుముపోపో ॥నీ

హిం:-పరిహాసంబటుబల్క లక్ష్మణుడు సరసమాడెనను చక్కని సతియని
హర్షంబున శ్రీరాముని జేరియు మురియుచు బల్కెను మోహముమీరగ ॥శ్రీ

(2) ఈ కరాళముఖి విరూపిణినన్న చేకొనుభార్యగ సీతను విడచియు
భీకరాటవుల క్రీడింతముమరి నాకుమించిన సతిలేదు జాగేల ॥శ్రీ

డోర:-మిగ్రింగెద నేనని సీతనుడాయగ మేరుధీరుడు రాఘవుడు
చెంగటనుండెడు తమ్మునితోననె చెనటి రక్కసిని యిపుడు ॥జ

(2) ముక్కుచెవులు తెగగోసి పంపుమీ రక్కసి ననగ లక్ష్మణుడు
గ్రక్కున నాసిక కర్ణంబులను ఖండింపగ నదియరచుచును ॥జ

(4) గాసిలి నెత్తురుగార నేడ్చుచు ఖరునిజేరి మొరబెట్టుచును
నాసిక కర్ణంబుల గోసిరినాకు నరుల న్యాయము గనుము ॥జ

వ॥ ఇట్లుబల్క భైరవారంబున క్రోధ తామ్రాక్షుండై ఖరుండిట్లనియె. నిర్జరులడ్డ
మైనను వారినిబట్టి వధించెదగాన,

డోర:-ఎవ్వరు నీకపకారమొనర్చి విరూపిణిజేసిరి జెపుమా
యివ్వనమున నింతటిశూరు లెవరు దెల్పుము వేగమున ॥జ

(2) స్వేచ్ఛగ దిరుగెడు నిన్నిగతిగ జేసిన మూర్ఖుండెవడు
నిశ్చయమిదిగను వానిజంపినే నెత్తురు ద్రావెద నిపుడు ॥జ

వ॥ అని భీషణాకారుండై పలుకు ఖరునితో శూర్పణఖ యిట్లనియె,

దేవగాంధారి — అది

ప॥ తరుణులు రూప సంపన్నులు దశరథవరపుత్రులు ఘనులు ॥త

అ॥ సరసీరుహ పత్రాక్షులు నిరుపమగుణ సంభరితులు ॥త

చ॥ భువనమోహనాకారులు పూతచరితులు గంభీరులు
నవకోసలపురవాసులు నవయౌవను లతినిపుణులు ॥త

వ॥ రాముని సౌందర్యాతి శయంబులు వర్ణించుచు మరియు నిట్లనియె.

జోర:-వారిచెంత నొక నారీరత్నము చేరియున్నయది మరియు
కోరి దానిని మ్రింగ బోవనను నీతీరునజేసిరి వారు ॥జ

(2) వారినెత్తురు ద్రావగ నాకు వాంఛ జనించెను క్రూర
నారాచంబుల వధించు మిపుడు నాకోరిక దీర్చుమి వీరా ॥జ

వ॥ శూర్పణఖ యిట్లుదెల్ప ఖరుండు కోపోద్దీపిత మానసుండై పదునల్వురు రాక్షసులంజీరి శూర్పణఖ వెంటబోయి యా నరవరుల దెగటార్చుండన వారలు, అట్లే శ్రీరామమూర్తి సన్నిధిజేరి, రామునిపై శూలంబులు ప్రయోగింప, శ్రీరాముడు యా పదునల్వుర నరక్షణంబున సంహరించె. అదిగని యాయసుర అరచుచు పరువిడి, ఖరునిజేరి ఘోరున నేడువ.

జోర:-ఏలయేడ్చెదవు శూరుల నీదు వెంటబంపితిని యిపుడు
కాలునిజేరగ బోయెనెరాముండన కటకటలేదని మొరలిడగ ॥జ

ద్విపద:-ఖరుడంత భీషణాకారుడై యంత। అరదంబునెక్కియు అతి రయంబునను
వీరుడై పదునాల్గు వేలసైన్యములు। మరియు దూషణు త్రిశిరుడు గొల్వగను
రణమునుజేయ శ్రీరామునితోడ। జనుచుండు వేళ నప శకునంబులాయె
కాకఘూకంబులు కంకగృధ్రములు। ఆకులపాటున అరచుచునిలచె
నక్కలుగూసెను పెక్కులొక్కటను। గ్రక్కున ధ్వజముపై గ్రద్దలువ్రాలె
రుధిరమ్ము వర్షించె అధికంబుగాను। బెదరుచును మృగములు భీతినిపారె
యిదిగని ఖరుడు విషాదమ్ముదోప। అదరునే ఖరుడు నీ యపశకునముల
కదనాన రాముని బంధించివేగ। ముదముగూర్చెద అక్క మదినిరంజిల్ల

వ॥ ఖరుండిటు యుద్ధసన్నద్ధుడై వచ్చునెడ రామభద్రుడు తమ్మునిజూచి.

జోర:-అనుజా యుద్ధముజేయగ నిపుడదె గనుమా వచ్చెదరెవరో
పెనుధూళియు చెలరేగి దిక్కులను వినుమా దెల్పెదనిదిగో ॥జ

(2) సీతనుదోడ్కొని యనఘాగుహాలో జేరి జాగ్రతగనుండు
ఘాతకులగు రాక్షసులను దునిమెద కదనంబున నేనిపుడు ॥జ

(3) ఎదురాడకు నాపదములయానను యేమియు భయపడవలదు
అధికబలాఢ్య శత్రులనేనే హతము చేసెదనిపుడు ॥జ

(4) మునులకు నేను అభయమిచ్చితిని దనుజుల జంపెదననుచు
అనఘా శీఘ్రమె సీతతోడను జనుభద్రంబుగ గుహాలోను ॥జ

వ॥ అంత లక్ష్మణుడు సీతను గుహాలోనుంచి ద్వారంబున భద్రముగ గాచియుండె.
రాముడు కవచధారియై ధనుర్బాణంబులు ధరించి నిలచియుండ ఖరాసురుడు
రాక్షసవీరులతో రాముని ముట్టడించె నంత,

జోర:-సురలును మునులు సిద్ధులు సాధ్యులు వరవిమానముల నుండి
పరమ హర్షమున గోభూసురలకు మరి శ్రీరామునకు జయమనిరి ॥జ

వ॥ రామవిభుండంత తన్నుజుట్టి ముట్టడించిన రాక్షసుల వేనవేల బాణపరంపరలచే
హతంబుగావించి దూషణ త్రిశిరాది మహావీరుల రణరంగంబున బడగూల్చి
కుంభసంభవుడిచ్చిన దివ్యాస్త్రంబుచే ఖరాసురుని శిరంబు ధరంబడవేసి విజ
యంబు చేకొనియె. జనస్థానంబునగల రాక్షసులనెల్ల నిర్మూలంబు గావించి
మునివరులకు మేలొనరించె నప్పుడు,

జోర:-దుందుభి రవములు చెలగగ దివిసుర సుందరు లాడగమరిని
పొందుగ సుమములు గురిపించిరి పొగడుచు రామునిపైని ॥జ

(1) శ్రీరామునకు జయము జయమని చెప్పుచు పోయిరి సురలు
ధారుణిసుత సౌమిత్రియు తన్ను జేరవచ్చిరి శీఘ్రంబునను ॥జ

(2) జేరియు మువ్వురు పర్ణశాలను శ్రీరఘువీరుని యపుడు
కూరిమిన్గాఢాలింగన మొనరిచి కోమలాంగి జానకియు ॥జ

(3) ప్రాణేశ్వర దనుజుల బరిమార్చియు బడలితి విప్పుడు దేవా
మౌనివరుల బాధలుదీరెను మంగళమయ్యెను జగములకెల్లా ॥జ

వ॥ సౌమిత్రియు అన్నకు బడలికదీర యుపచారంబులు జేయుచు నందరు సుఖం బుండ, ఖరాసురుని యుద్ధంబులో అకంపనుండనువాడు స్త్రీవేషంబున దప్పించుకొని రావణునిజేరి స్వామీ జనస్థానంబు నాశంబయ్యెనన రావణుండదివిని వంశ్లు పటపటగొరికి "ఎవడు ప్రాణంబులపై నాశవదలి, నాప్రతాపంబెరుగక రమణీయంబైన జనస్థానంబును ధ్వంసంబుగావించె! వాడెవ్వడో వానిచరితంబు చెల్పు! అగ్నియైన నగాల్చెద! వాయువేయైనను బడగొట్టెద!" నని భీషణాకారుండై బల్క అకంపనుండు గడగడవణంకుచు.

జోర:-రామ లక్ష్మణులు రాజచంద్రులు ధీరులు వీరులువారు
శ్రీమంతులు మునివేషధారులు జితరణశూరులు ఘనులు ॥జ

(2) చంద్ర సూర్య సమ తేజులువారలు చండవిక్రములు మరియు
ఇంద్రసమానులు శరచాపహస్తులు నినకులపతి దశరథసుతులు ॥జ

(3) భూరితేజు లపారబలులు వారికెదురులేరెవరిలను
జేరివారు జనస్థాననాశమును జేసిరి దేవరవినుము ॥జ

(4) ఎందుజూచినను దానై!రాముఁడె యెల్లరాక్షసుల దునిమెఁగ
సందియమే సంద్రములోపల జగములముంచును దేల్చుఁగ ॥జ

(5) ఎరిగితినేను రామమహిమలను పూర్వజన్మ పుణ్యమున
ఎరుగజాలవు నీవురావణా యా రాముని ఘనమహిమ ॥జ

(6) నిలువజాలవు రాముని యెదుటను గెలువగ లేవు నీవు
తెలియజేయుదును నొక్క యుపాయము అలరగ నీకిపుడేను ॥జ

హిం:-శ్రీరామునిసతి సీతను వర్ణింప శేషునికైనను తరముగాదు ఆ
నారీమణి సౌందర్యము నీ భువి దేరిజూడగ జాలరెవ్వారు ॥శ్రీ

(2) ధీరుడవైతే బొమ్మాయచటికి తెమ్మా సీతను దొంగిలి వేగమె
వీరుడనీకే తగునాజానకి వివిధభోగముల దనియఁగవచ్చును ॥శ్రీ

తే॥ ఇటుల గావింప రావణా యింపుమీర సతియు లేకున్న రాముడు జచ్చునిజము
తమ్ముడునుబోవునన్నతో తథ్యమిదియు చక్కబడు కార్యమిటుజేయ సౌమ్యముగను॥

వ॥ అకంపనుం డిటుదెల్పగ తత్క్షణంబ రథంబునెక్కి రావణుండు మారీచుని గృహంబున కేగి తాతా! నీవలన నొక్క గొప్పకార్యంబు కావలయుననన, అతడు తర్కించి నావలన కాగల కార్యంబేయ్యది యనన రావణుండు.

జోర:- రాముని ప్రియసతి సీతయనునది రమణీమణి గావునను
ఆ మానినిదెచ్చిద తోడ్పడరమ్మన నామారీచుండనె ప్రియమునను ॥జ

(2) ఎవ్వరు నీకిటు విషమగు కార్యము హితమని దెల్పిరి యిపుడు
ఎవ్వరు నీ విభవంబున కోర్వక యిట్లుబల్కి - రకటకట ॥జ

(3) పొమ్మాయింటికి శీఘ్రమ్మున నీ భామలతోను గూడి
సెమ్మదినుండుము సమ్మదమున ననసమ్మతించి యిలుజేరి ॥జ

వ॥ రావణుండు సుఖంబుండునంత శూర్పణఖయు జనస్థానంబు విడచివచ్చి నిండు కొలువుండిన దశవదనునిం గని,

జోర:- మత్తుడవీవు మదగర్వితుడవు మరియును శ్రీలోలుడవు
అత్తరి జనస్థానంబున అసురులు హతమైరట గనలేవు ॥జ

(2) ధరణీపాలురు చారులవలనను నరయంగవలె గార్యముల
ఖరదూషణ త్రిశిరాది రాక్షసుల ఖండించిరి ఘనబలులు ॥జ

(3) విరూపిణి జేసిరి వారిటునన్నును భూరివిక్రములు నరులు
ధీరులు ఘనశృంగారులు మరియును దేవసములు నృపవరులు ॥జ

(4) తన్నిటు కఠినోక్తులు పల్కుటవిని దనుజేంద్రుండు దాంబల్కె
నిన్నిటు చెల్లెల పరిభవించిన నీచులెవ్వారేయనిన ॥జ

వ॥ అప్పుడు సీతారామ లక్ష్మణుల రూపలావణ్యంబులను దలచి శూర్పణఖ యిట్లు వర్ణింపం దొడంగె.

పంతువరాళి — చాపు

ప॥ రామ లక్ష్మణుల నేమని పొగడుదు భీమపరాక్రములు ॥రా

అ॥ సామజగమనులు సత్యచరిత్రులు భూమీశుడౌ దశరధ వరపుత్రులు ॥రా

చ॥ రాజసింహులు సురరాజ సమానులు రవితేజులు మునివేష ధరుల్
ఈజగంబులనెల్ల నేలు మహాత్ములు పూజ్యులు మదనసౌందర్యులు ఘనులు ॥రా

(2) మునులకు అభయం బిచ్చినారటవారు దనుజుల వధియింప
జనస్థానంబున ఖరాది రాక్షసుల దునిమి మహాఋషుల భయము దీర్చినారు ॥రా

(3) చేరియు బాణముల్ వేయుట దీయుట యెరుగజాలరనిలో
ధీరుడు నవకోసల కోదండరాముడౌక డే శూరుడైన మనసోదరుల వధియించె॥రా

జో॥ర:-విను పదునాలుగువేల రక్కసుల దునిమె నొక నిమిషమునన్
జనస్థానంబు స్మశానంబయ్యెను మునులు సుఖించిరి యచటన్ ॥జ

(2) ఆరాముని సతి సీతసికుదగు నారీమణిగనబొమ్మా
శూరుడవై తే వేగంబున యా సుందరి చేకొనిరమ్మా ॥జ

**తోడి — ఆది**

ప॥ సౌందర్యసదన చంద్రికాదరహాసవదన ॥సౌ

అ॥ కుందరదన హంసగమన కోమలి యిందిరసమాన ॥సౌ

చ॥ కరుగు బంగరుగేరుమేను యాకలికి రాముని ప్రియసతిసీత
యురుకీర్తి కలిత రంభోరులలిత వరగుణయుత పరమపావన చరిత ॥సౌ

(2) కమనీయమంజుభాషిణి కల్యాణి నీలవేణి
రమణీయ మృదుపల్లవపాణి రాజిత సర్వాలంకారిణి ॥సౌ

(3) నవనీరజదళలోచన నవకోసలరామ విలాసిని
భవలతాలవిత్రి బాలయౌవన చారుగాత్రి ॥సౌ

జో॥ర॥ వినియారక్కసి మాటలు ముదమున వేగమె యారావణుడు
జనెనటు రథమున నారోహించి సముద్రతీరమున కపుడు ॥జ

(2) అమరులు సిద్ధులు సాధ్యులు గరుడులు అసురులు మరి పన్నగులున్
విమల భోయములు సెలయేరులు కొలకులు వివిధవృక్షములు గనుచున్ ॥జ

(3) మలయ మారుతము వీవగ సుఖముగ మదిలో అలరుచు నపుడు
కలకలమను శుకపికరవములు పలువిధముల వినుచు ॥జ

వ॥ రావణుండిట్లు సముద్రతీరంబున జనిచని మారీచుని గృహంబుజేర నతండు అతిథి
సత్కారంబుల దనిపి తండ్రీ యేలవచ్చితివన ఆతండును.

జో॥ర:-నీసహాయము గోరివచ్చితిని నెయ్యముతో నా కార్యంబు
జేసిపరువునను కాదనగూడదు జెప్పెద వినుమా నీవు ॥జ

(2) ఖరదూషణ త్రిశిరాది రాక్షసుల ఖండించెను రఘువీరుండున్
సరగున వానిసతిగొని తెచ్చి సమయింపంగవలె వానిన్ ॥జ

(3) కావునసీవొక సుందరమైన కనక మృగమ్మైగమ్మా
బోవుము రాముని పర్ణశాలకును నేవచ్చెదనిదె సీతోనిపుడు ॥జ

(4) అందముమీరగ అటునిటు దిరుగుచు అందుండుము నిరుగనిసీతా
సుందరమగు నీమృగమును దెమ్మని రామ చంద్రునడుగు నోతాతా ॥జ

(5) కడునీచుడు దుష్టుడు రాముడు కఠినుడు క్రూరుడుగానగ
అడవులదరిమెను కొడుకని యెంచక పుడమితేడు కడువేగమునగ ॥జ

(6) కూరిమిప్రియసతి గోరినయంతనె శ్రీరాముడు నిను జేరగ
దూరముగాజని మాయను కూయుము తొయ్యలి నొక్కతె నేదేరగ ॥జ

వ॥ అనిన మారీచుం డిట్లనియె.

ద్విపద:-వినుము రావణ యిట్టి విపరీతబుద్ధి। ఘనముగ నీకెవ్వర్గలిగించినారు
వైరంబుపూనకు శ్రీరాముతోడ। ధీరుండు వీరుండు దివ్యాస్త్రవిదుడు
సత్యసంధుడు నీతిశాలి సుచరితుడు। అత్యంత ప్రియకరుం డాశ్రితాళులకు
నిత్యనిర్మలుడిద్ధ నీతికోవిదుఁడు। భృత్యుల సుజనుల పోషించువాడు
కాడు రాముఁడు నీచు కఠినచిత్తుండు। కాడయ్య మూఢుండు కాడుదుష్టుండు
లేదుసూ వంచన లేదు క్రౌర్యంబు। కైకవరమ్మున కానకనుప
శ్రీకరుండతివతో జేరెకారడవి। ఘోరరాక్షసులను గూల్పంగమునులు
కోరినవారికి కారుణ్యమొప్ప। అభయమిచ్చెను రామవిభుడు మోదమున
నిభరాజగమను డాయిందిరాప్రియుడు

జోర:- తెలియలేవు శ్రీరాముని బలమును నిలువలేవు నీవెదుర
వలదు సీత తేవలవదు నాశము గలుగునీకు నిశ్చయము ॥జ

(2) బంధుమిత్రులను పుత్రులగూడి బ్రతుకదలంచిన నీవు
సుందరులగు నిజసతులనుగూడి సుఖయింపుము మోహము వీడు ॥జ

వ॥ రాముండను అగ్నిజ్వాలలో జొరకుము, నిన్ను సపరివారంబుగా గాల్చును రావణా! సూర్యునిరశ్మిని నీవెట్లు విడదీయలేవో! అటువలె సీతను రామునిచెంత నుండి గ్రహింపలేవు. అట్లొకవేళ గ్రహించిన నీవు సమూల వినాశము నందుదువు. లంకయు గాలిపోవును. రాక్షస కులంబంతయు నశించును. కులధ్వంసా! నీ కిట్టి దుర్బుద్ధియెవరు బోధించిరి? పరదార గమనంబు పాపంబని యెరుంగవె? మరియు రాముని మహత్వంబంతయు నీకింక నెఱింగింపలేదు. వేయి యేనుంగుల బలంబుగలవాడు! ఇంద్రాదులైన నతని కీడుగారు! అతండ యీజగంబు పుట్టించు రక్షించు నాశంబుజేయు అనంత శక్తియుతుడు తేజోమయుండు సౌందర్యఖని అట్టిమహాత్ముని యితర మానవులవలె దలంపకుము. అతని జయింప

సీతరంబుగాదు విను ఒకానొక సమయంబున విశ్వామిత్రుని యజ్ఞంబు విఘ్నంబు గావించు నన్ను నీరాముడు ఒకబాణముచే నూరుయోజనముల దూరంబున సముద్రంబునఁద్రోసి దయామయుండై చంపక విడచె. మరియు నాతోడి రక్కసులను సుబాహు నుక్కడంచె.

జోర:-అదిమొదలుగ శ్రీరాముదలంచిన నదరుచుండుదును మరియు
మదిలో క్రోధముమానక నేను మరియొక సమయమునందు ॥జ

(2) దనుజులఁగూడుక మృగరూపంబున దండకాటవిని నున్న
దనుజాంతకుని డాయుచుఁ బొడువగ ననుగని బహుకోపమున ॥జ

(3) మూడుబాణములు విడచిన నాపై పోడిమిచెడి పరువిడితిఁ
తోడివారలను జంపిన భీతియు వీడదు నాకిప్పటికిఁ ॥జ

(4) రథములన్నను రత్నములన్నను రాదివర్ణములు విన్న
మదిలోభయమున మాటరాదు నే బెదరుచుందు కంపమున ॥జ

ధన్యాశి - అది

ప॥ ఎందుజూచిన రాముడు జగముల వెల్గుచు నిండియున్నాడు ॥ఎం

అ॥ ఇందుగలడు మరి అందులేడని సందేహింపకు సర్వస్థలంబుల ॥ఎం

చ॥ నీలోనాలో నరణ్యములో బహు లీలలుజూపుచు నున్నాడు
కాలుని పాశముచే రక్కసులను గూల్ద్రోయుచు నున్నాడు ॥ఎం

(2) భువనములన్నియు నిండియు రాముడు నవకోసల మందున్నాడు
భవభయములు బాపి సుజనులకు భజనీయుండై యున్నాడు ॥ఎం

(3) రామపుత్రి హృదయ కుహరమున రాము డతివతో నున్నాడు
ప్రేమను రామరామా యనువారికి బహుసులభుండై యున్నాడు ॥ఎం

తే॥ ఎట్లుమోసంబు చేసెదు విశ్వమయుని దేవి నెటుదెచ్చెదవు నల తెలియకిటులు
పల్కుచున్నావు దుష్టుడ పారిపొమ్ము రాను నీవెంట భయము శ్రీరాముడనిన॥

వ॥ రావణా బ్రతుకనాశగలదేని యింటికిబొమ్ము, జావగోరెదవేని జేరబొమ్ము అన వుడు రావణుండు కోపఘూర్ణితాత్ముండై ఓరీ! నీచా! మారీచా! నాతోడ సీతాపహరణంబునకు తోడ్పడెదవేని సరే లేనియెడల నిన్నిచ్చటనే జంపెద నన మారీచుండు వీనిచేఁ జచ్చుటకంటె రామునిచేఁ జచ్చిన మోక్షంబుగల్గునను కొని రావణునితో రథంబెక్కి రామాశ్రమంబుజేరె. నచ్చట.

హిం:-చిత్రవర్ణముల మాయామృగమై జేరవచ్చియు వేగంబునను
ధాత్రీసుత కగిపడునటుల డగ్గరి యటునిటు దిరుగుచునుండగ ॥శ్రీ

(2) పూలుగోయుచు సీతాదేవియు పుత్తడి మృగము నందము చందము
ఆలోకించియు రామలక్ష్మణుల అతివ బిలచి యా మృగమును జూపెను ॥శ్రీ

(3) సారెకుదానిగని సౌమిత్రి శంకించియును మదిలోజింతించి
మారీచుండీ మాయామృగము శ్రీరామా యిదినిక్కంబనిన ॥శ్రీ

(4) అనఘుడు లక్ష్మణు డాడినమాటలు వినిజానకి మది గణనచేయక
చనువున ప్రాణనాథుని గనియు చక్కగ గనుమీ వింతగులేడిని ॥శ్రీ

కమాసు — ఏక

ప॥ చూడు చూడుమోరామ సొంపైన యీమృగమును ॥చూ

అ॥ వేడుకలర దీనితోడ నాడుకొందు నే సదా ॥చూ

చ॥ బంగారు ఛాయయు పలురంగులుగలదియు
శృంగార మొప్పు దీని సర్వాంగ సుందరము ॥చూ

(2) చిత్రరూపమైన యిట్టి జింకను మనము
ధాత్రినెందైన గంటిమే తడవుసేయక బట్టియిమ్ము ॥చూ

(3) ధరణినాథయీ హరిణముగొనిపోయియు
వరనవకోసలమున మన వారికెల్ల జూపవచ్చు ॥చూ

వ॥ అని సీతబల్క రఘువరుడు, లక్ష్మణా! యిది కడురమణీయంబైన మృగంబు. ఇది యెట్టివారి మనంబునైనను హరింపకుండునే గాన ధరణీతనయ దీనిగోరుచున్నది. పట్టితెచ్చెద రక్కసుండైన జక్కాడి వచ్చెద.

జో॰:-కూరిమితోడ జనకుని తనయను గ్రుచ్చి కౌగలించి
నారీమణియిదె బట్టితెత్తునిదె యని యాజింకనుడాసి ॥జ

(2) పట్టబోవ నిట్టట్టు దిరుగుచు బహుదూరము జనియు
అట్టెగంతులు వైచుచువచ్చి ఆడుచు నిలచు చాలేడియును ॥జ

(3) చేరగవచ్చిన రాముని గనంగొని చెలగి దుమికి పరువిడుచు
సారెకు ముందరవచ్చి నిలచుచు ధీరుని మదిలాగుచును ॥జ

(4) చిక్కక తన్నిటు చిక్కులబెట్టెడు టక్కరిమృగమును గనియు
చక్కగ దీనిని దెచ్చువరకు నిట సౌమిత్రీ భద్రింబనియు ॥జ

(5) క్రూరమృగంబులు ఘోరరాక్షసులు గ్రుమ్మరు చుందురువనిని
జేరియుండు వైదేహిని గాచుచు ధీరుడ యేమరకను మరినీ ॥జ

(6) అనుజున కిటుదెల్పుచు రాముడు దనుజుడు జనుమార్గమున
వెనుకొనిపోవగ బహుదూరంబది గొనిపోయెను క్రూరముగ ॥జ

(7) దనుజుండని మదితెలిసి వేగముగ ఘనశరమటు వేయగను
తనువుననాటగ నిలబడిప్రాణము తల్లడిల్ల నిట్లనెను ॥జ

(8) హాసీతా హాలక్ష్మణా హా హా హా హా యని పెనుకూత
గూసియు మారీచుడు ధరణిపై గూలెను రామునిచేత ॥జ

(9) మారీచుని బరిమార్చి రాముడు మరలియు తనమదిలోన
ధారుణిసుత యీకూతను విని యట తల్లడిల్లునని వేగ ॥జ

వ॥ వచ్చుచుండ అట సీత లక్ష్మణుని గని

తే॥ రక్కసులచేత మాయన్న జిక్కినిన్ను లక్ష్మణాయని పిలిచె నేతక్షణంబ
రామచంద్రుని రక్షింపబొమ్ము ప్రేమ అన్నందోడ్కొనిరమ్ము నీవతిరయమున॥

వ॥ అనుచు కన్నీరు వరదలై గార్చుచుండ లక్ష్మణుండేమియు తడవుచేయక నెప్పుడు
రెప్పపాటున తనకార్యంబు నెరవేర్చు నతండిప్పుడు తనమాటపాటింపక నిలచి
యుండుటం గని.

జోర:-ప్రేమగల్గు తమ్ముడవని దలచితి రామునిచెంతకు బోవ
ఏమో యోచించెద విటునిలచి స్వామిద్రోహివి చాల ॥జ

(2) అన్నపోయిన నన్నుగైకొని ఆనందంబుననుండ
నెన్నుచుంటివో యిచ్చటం జేరి యిన్నిదినంబులో క్రూర ॥జ

(3) జీవింపను శ్రీరామునివిడచి చెడ్డతలపు నీకేలా
నీవశమగుదునె దుర్బుద్ధీ వేగ బోవుము రామునిజూడ ॥జ

(4) అని కఠినోక్తుల నాడెదు సీతకు ననె నాలక్ష్మణు డప్పుడు
వినుమమ్మ శ్రీరామభద్రునకు వని భయ మింతయు లేదిప్పుడు ॥జ

(3) సురగంధర్వ యక్ష కిన్నర తరుణులజూచితి గానీ
పరికింపగ నీయందమునకు మరి సరిగారీ యిల తరుణీ ॥జ

(4) కోమలి నీరూపము ప్రియముగన నామది హరియించెడు చెలియ
యామినీచరుల్ సంచరింతు రిట అబలా బొమ్మింటికి వేగమున ॥జ

(5) కనకసౌధముల విహరింపగదగు కమలానన నీవిపుడు
వనభూముల నిటు లొంటిచరింపగ వచ్చునె సుందరి చెపుము ॥జ

వ॥ కలికీ సింహశరభ శార్దూల భల్లూక గజగవయ వరాహాది మృగంబు లిందు సంచరింప భయంబులేక ఎట్లున్నదానవని నుడివిన యతని విప్రుండనియెంచి సీత పూజించెనంత మరియు రావణుండిట్లనియె.

హిం:-సతి నీపేరు ఊరునేది నీపతియెవ్వడో యెరిగింపు లతాంగి
అతివా నీకీకాననవాసము అహాంబౌనా దెల్పుము సఖియ ॥శ్రీ

(2) తన్నిటుజూచి బల్కగ సీత వినయంబున నిట్లనె నాతనితో
ఘనుడా దశరథు కోడలునేను జనకుని పుత్రికనా మరియును వినుమ ॥శ్రీ

(3) భీమపరాక్రమశాలియైన శ్రీరామచంద్రుని ప్రియసతి నేను
భూమిపాలుడు కైకగోర వనభూమికనిపెను సత్యవ్రతుని ॥శ్రీ

(4) ఆసనమున వేంచేయుండిపుడు ఆతిధ్యము గైకొను డతిముదమున
భూసురవర నావిభుడిదెవచ్చును భాసురాంగుడు ఘనుడని బల్కన ॥శ్రీ

(5) రక్షోవీరుడనా రావణుండను వీక్షింపుము నను బాలామణిరో
అక్షయ భోగము లనుభవింపుము అతివా నాతో సుఖలీలలను ॥శ్రీ

(6) రమణీయంబగు ఆరామంబుల రత్నసౌధముల యందునజేరి
కమలాక్షీ నాకగ్రభార్యవై కడుభోగములను బొందుము ప్రీతి ॥శ్రీ

(7) బలహీనుండు రాజ్యహీనుడు బహునీచుడు నీమగడు శృంగారీ
కలకాలంబీ యడవుల దిరుగుచు కష్టపడెడువాడు గావునతన్వీ ॥శ్రీ

(8) జంకక గూర్చుండు నాయంకంబున పంకజముఖి భయమేల నింకమరి
లంకకుబోవము రమ్మువేగ వన సంకటములు బడనేలను బాల ॥శ్రీ

వ॥ యీ విధంబున బల్కుచు సన్యాసి వేషంబువిడచి రావణుండు పది తలలును యిరువది చేతులతో రాక్షస రూపంబున నిలువ సీత భయభ్రాంతచిత్తయై వాని తిరస్కరించుచు,

మాళవి - ఆది

ప॥ శూరాగ్రణి రఘువీరుడు ధీరుడు వనధి గంభీరుడు ॥శూ

అ॥ ఈరీతిబల్కఁదగదమ్మనీకు ఈజగమున కీశ్వరుడు ॥శూ

చ॥ లోకేశులెల్ల లేకమైవచ్చిన శ్రీకరుచెంత నిల్వలేరు
భీకరాటవుల వడతి నిన్నువిడచి యేకరణిఁ బోదు నెరుగింపుము ॥శూ

(2) అమ్మా మృగము సేసియావేగ అన్నవచ్చునిటకు నెమ్మది నుండు
నమ్ముము నామాటల నిపుడు నవకోసలరాణి మంజువాణి ॥శూ

వ॥ జననీ ఖరుండు హతుండైన దాదిగ రక్కసులు వైరంబు బూనియున్నవారు. ఘోరాకారులగు రక్కసు లొనరించు మాయాజాలంబులుగాని శ్రీరాముని కంఠస్వరంబుగాదు చింతింపకుమని వచించిన వసుంధరాతనయ కోపారుణిత లోచనయై సత్యవాదియైన సౌమిత్రి గని

జోర:-ఓరి దుర్మదుడ దయావిహీనుడ యోరి వంచకుడ యోకూ్రరా
శ్రీరామునికి చేటుగోరి యిట్టు జేరవచ్చితివె పోపోరా ॥జ

(2) నీవై వచ్చితో కైకతనూజుడు నిన్నంపెనో మరియోకూ్రరా
చేరి యగ్రజుని పొలియింప జేసినను చేకొనగోరితె గుణదూరా ॥జ

(3) రాముని బాసిన తనవున ప్రాణంబీ మహినిల్వదు వినుమిా
సౌమిత్రీ యానిమిషంబున నే జనిపోయెద నిదె కనుమిా ॥జ

తే॥ అనెడు కఠినోక్తులనువిని యనఘుఁడతడు మగువ నట వీడిబోవంగ మనసురాక నిలిచి యట నుండజాలక నిర్మలుండు దిక్కులనుజూచి దుఃఖంబు పిక్కటిల్ల.

వ॥ ఓ వనదేవతలార యీ సీతను రక్షింపుడని యొప్పగించి నే బోయివచ్చెద తల్లీ యని సీతకు నమస్కరించి హా దైవమా మరల రామునితోడవచ్చి యీ దేవిని చూడగలనోలేనో యని కుందుచు సీతయాడిన దురుక్తులు ముందుకులాగ యాదేవి నొంటి విడచిపోలేక వెనుకంజవేయుచు నెట్టకేలకు మరలిమరలి చూచుచు అన్న సన్నిధికి జేరబోవుచుండె. అట్టియెడ సమయంబు వేచియుండిన రావణుండు దండ కమండలు ధారియై సన్యాసివేషంబున పర్ణశాలఁ జేరంజని సీతాదేవింగాంచి,

జోర:-ఎవ్వతె వీ వల వనదేవతవో యిందాణివో మరిచెపుమా
యివ్వనమందున నొంటిగ నిటువలె వెలచరించెదు చెపుమా ॥జ

(2) కూ్రరరాక్షసులు గుమిగ్మరుచుందురు ఓరమణీమణి యిచట
చారుముఖీ నీచక్కదనంబునఁ జలియింపరె యోరు లకట ॥జ

జోర:-రాముని శౌర్య ధైర్యము లెరుగవు రాక్షసాధమ నీవు
రామునిసతి నన్నంటిన బ్రతుకవు రణధీరునిచేతిలో మరియు ॥జ

(2) కనకమునకు సీసముసరియగునే కలహంసకు గ్రద్దకు యిలను
అనఘుండగు శ్రీరామునిసాటి యగుదువె దుర్మద నీవు ॥జ

హనుమతోడి - ఆది

ప॥ రామానువ్రతను ధర్మాత్ముడౌ శ్రీ ॥రా

అ॥ భీమవిక్రముడౌ నామనోహరుడు శ్రీమహిత శుభలక్షణుడు శ్రీ ॥రా

చ॥ నరపాలుని వరకుమారుడు హరితుల్యుడు అసురమర్దనుడు
నరకేసరి కరుణాపయోధి నవకోసలపతియురుతేజుడౌ శ్రీ ॥రా

వ॥ అటుగావున,

జోరః-చేలాగ్రంబున యగ్నిగట్టుటయు నాల్కను అసినాకుటయు
శూలాగ్రంబున శిరముగ్రుచ్చెడు లీలగాదె వినుమరియు ॥జ

(2) పెనుబండను కంఠమునగట్టుక వనధిదాటు చందమున
ఘనుడగురాముని సతి ననుగోరుట దనుజాధమయటులె గనుమ ॥జ

(3) విషయ వశాత్ముండ చపలమూర్ఖుండా విషమని యెఱుంగవు నన్ను
విషము గ్రసించిన బ్రతుకుదురే మానుషు లాచందమె యెన్న ॥జ

వ॥ అని ధిక్కరించిన,

జోర:-నీరాముడు నీవేమిచేయుదురు నిష్ఠురోక్తులిటులేలా
శూరుండ ధీరుండ జితరిపు వీరుండ సురల జయించితి బేలా ॥జ

వ॥ ఇట్లుబల్కుచు ఓరుగాలిచే కదలు కదళీవృక్షంబుపోలిక గడగడ వడంకుచు విల
పించు సీతనెత్తుకొని రథంబుపై నెక్కి బోవుచుండునెడ సీతయు హారామా
రామా రామా రామాయని యరచుచు ఉన్మత్తయై యచ్చటి తరులతాదులగాంచి

తోడి - చాపు

ప॥ తరులార గిరులార సరసిజంబులార ॥త

అ॥ కరుణమెఱయ శ్రీరామునకు యెఱిగింపరె నావిధము ॥త

చ॥ గోదావరీతల్లి గోనుము నామ్రొక్కుల నీవు
ఆదరంబున నానాథునకు దెల్పునాగతి యిటులని నవకోసల ధామునకు ॥జ

డోర:-ఇటు విలపించుచు నిటునటుజూచుచు నింతి జటాయువుఁగనియు
కుటిలచిత్తు డీరావణు డిటు ననుగొనిపోవుట దెల్పుమి యనుడీ; ॥జ

వ॥ సీత కుయ్యిడ ఆసవ్వడివిని సమీపవృక్షంబున నిదురించు జటాయువు మేల్కాంచి రావణాపహృతయగు భూపుత్రింగాంచి ఓరీ రాక్షసాధమ మహాత్ముండగు రాముని సతియగు నీసాధ్వీమణి నేలగొనిపోయెదవు విడువుము అటువిడువవేని నిన్నిదె హతముగావించెద వృద్ధుండనని దలంపకుము. నాకరువదివేల సంవత్సరంబులైనను నిన్ను జయింపగలను.

హిం:-రాముని ప్రియసతి జనకసుపుత్రిని కోమలగాత్రిని కమలదళాక్షిని
రాముడులేని సమయంబున నీవిమెయిదెచ్చుట తగునా ముచ్చిలి ॥శ్రీ

(2) విడువుము రాక్షస సీతనువేగమె విడువవేని నినుబొడిచెద ముక్కున
అడచెదనిదె నా రెక్కలతోడను పుడమినిబడి చనిపోదువు నీచుడ ॥శ్రీ

వ॥ అని యిటు తన్నదలంచిన జటాయువుంగని రావణుడు కనులెఱ్ఱజేసి వానిపై దివ్యాస్త్రంబులు ప్రయోగింప నతండు రోషించి.

డోర:-కాళ్ళందన్నియు ముక్కునఁబొడిచియు కడురభసము చేయగను
తాళజాలకను బాణజాలముల దానవుడటు వర్షింపగను ॥జ

(2) అవిదప్పించుక రథవాహంబుల హతముజేసి సారథినీ
గవిసియు రథమును చూర్ణముజేసెను ఖగపతి కోపముమించీ ॥జ

(3) క్రిందఁగులిలి యారాక్షసుడప్పు డాక్రోశించిన మొసరింపగను
అందుండెడు ఖగమృగ వనదేవత లాశ్చర్యంబును బొందగను ॥జ

(4) అంతట దనుజుం డవనిజ నెత్తుక ఆకాశంబునబోవ
వింతగ గృధ్రము రక్షోవీరుని వీపుదొక్కియు బాగ.

(5) ముక్కున బొడుచుచు గోళ్ళంజీల్చుచు రెక్కలతో వడిగొట్టుచును
చక్కగ రావణుమూపున బోవుచు పెక్కుతెఱంగుల నొప్పింపగ ॥జ

వ॥ దశకంఠుడు పదిచేతులచే సీతను గాపాడుకొనుచు కొంచెము వెనుకకుదిరిగి జటాయువుపై ననేకబాణంబులు ప్రయోగింప నాఖగపతియు అతని కరంబుల ఖండించె. వెంటనే ఆయుధంబులతోగూడి కరంబులు పునరుద్భూతంబులయిన రావణుడు సీతనుడించి ఖడ్గంబుచే జటాయువు పక్షంబులను పాదంబులను ఖండించ నప్పుడు పక్షీంద్రుడు నేలంగూలి కంఠగత ప్రాణుడై విలవిలఁదన్నుకొనుచుండ యాతనిండగ్గరి సీత యాతని దేహమ్మును నిమురుచు నాతండీ

డోర:-పాపి రావణుఁడా జేరియు నాకై పడిపోతివె హా యిపుడు
    ప్రాపించెను నా పాపము నీకు పరమదయాళూయనుచు ॥జ

(2) ఏడ్చుచునుండెడు సీతనెత్తుకొని యేగెను దశకంధరుఁడు
    ఆడుజింకవలె బెదరుచు అరచెను హా రామ రామా యనుచును ధరణి ॥జ

క॥ ఆలింపుము నామొర యీవేళఁ గూళనిశాచరు గూయఁగొని పోయెడి హా
    పాలింప వచ్చి వేగను కాలునిపురి కనుపుదనుజు కరుణా జలధీ.

డోర:-అందుండెడు మునివరు లిదిగని అతి విషాదమును జెంది
    యిందువదన సీత నిమిత్తము యితడు నశించు నిక్కంబనిరీ ॥జ

(2) గగనపథంబున బోవుచు భూసుత కపివరుల నేవురగాంచి
    నగశిఖరమ్మున ధగధగ మెఱసెడు నగలను చీరను చించి ॥జ

(3) గట్టిగ మూటనుగట్టి వేగముగ కపిమధ్యముననవైచి
    యెట్లైన నిటువచ్చును రాముడు వీరలగను ననియెంచి ॥జ

(4) రావణుగని యోమూఢా నీచా శ్రీరాముడిపుడు నినుజూచినను
    జీవింపవు క్షణకాలంబైనను జేరెదు యమపురమునకు ॥జ

(5) పతివ్రత నన్ను పరమసాధ్విని పరదారయనక దుర్బుద్ధీ
    పతి నాదగ్గరలేనిసమయమున బట్టితెచ్చితివి ద్రోహీ ॥జ

(6) బలపరాక్రమశాలి ననుచును బల్కితి విప్పుడు మూఢా
    బలము చలము శ్రీరాముని మ్రోలను నిలువదు దెలియుము దుష్టా ॥జ

వ॥ ఇవ్విధంబున వాని నిందించుచుండ రావణుడు ఆకాశ మార్గంబున సముద్ర తీరంబుజేరి యాసముద్రంబు దాటిపోవుచుండ సిద్ధచారణు లదిగని వీనికి కాలంబు సమీపించినది లేనిచో, దహను నోడిలోనుంచుకొనినట్లు మహాపతివ్రతయగు సీతను తీసికొనిపోవునాయని యనుకొనుచుండ లంకలో సీతాదేవిని యంతఃపురంబులోనుంచి రాక్షస స్త్రీలతో నీమె నెవ్వరు చూడకుండ జాగ్రత్తగా కాచి యుండుడని యాజ్ఞాపించి,

ద్విపద:-క్రూరులౌ రాక్షస శూరుల బిలచి। వారలతోనని పంక్తికంధరుడు
    సరవి మీరల జనస్థానంబుఁజేరి। ఖరదూషణాదుల ఖండించినట్టి
    నరుల చరిత్రంబు లరయుచునాకు। నెరిగింపు చుండుడు నేర్పదలిర్ప
    అనుచు వారలనంపి అంతఃపురంబు। చనియాంత భూపుత్రి గనియు మోహమున

వినయంబు మీరంగ దనుజుడు బలికె। నను ప్రీతి నేలుము కనకాంగి యిపుడు
ధనము రాజ్యము నాదు తరుణులందరును। వనిత నీసొమ్ముగా మనమున నెంచు
నను నీదు భర్తగా నాతి వరింపు। మనుజుడు దీనుండు మరి దుర్బలుండు
రమణీమణీ విను రాజ్యహీనుండు। విమలచరిత్ర నీ విటు వాని దలచి
ఏల దుఃఖించెదు చాలు లతాంగి। ఏలీలవచ్చునే యిచటికి నతఁడు
రాలేడు వానిపై రాగంబువలదు। నీలవేణిరో నన్ను నేలుము పతిగ
అఖిలభోగంబుల ననుభవించుచును। సుఖముండు మిచ్చట సుందరి నాతో

తే॥ జూడుమీ రత్నసౌధముల్ సుందరాంగి
మణిమయమ్ములఁ గనుమీ విమానములను
సతత సుమఫల వితతిచే నతిశయిల్లు
నుపవనమ్ములు కనుమివే నృపకుమారి !

హిం:-అందమైన యీ అంతఃపురమున సుందరమగు రమ్యమణి శయనములందుగ
ఇందువదన నాతోడ రమింపుము డెందమ్మానందము నొందగ ॥శ్రీ

(2) దేవీ యీ వరమందిరములు నా దేవీసంఘము రాజ్యరమగ
భావింపుము నీవశము జేతు నా దేవివై చెలగుము శోకము మానుము ॥శ్రీ

(3) రాముడటంచును దలచెద వేల రాజ్యహీనుని అల్పుని జోగిని
భామా నను నీ భర్తగఁ గైకొని బడయుము సకల సౌఖ్యంబులను ॥శ్రీ

(4) లంకారాజ్యంబెల్లను నీదె లలనా యేలుము శంకయేల నీ
కింకరుడను ననుగూడి సుఖింపుము మంకుతనము మాను మదిరాక్షీ వేగ ॥శ్రీ

వ॥ జానకీ నీపాదంబులకు మ్రొక్కెద నన్ననుగ్రహింపుము, కామపాశ బద్ధుండనై యున్నవాడనన, గడ్డిపోచ నడ్డంబిడి నిర్భయంబుగ నా రాక్షసున కిట్లనియె.

ద్విపద.-ధర్మాత్ముడైనట్టి దశరథసుతుడు। నిర్మలచిత్తుండు నిగమార్థ వేది
త్రిభువనపూజ్యుండు ధీరుండుమరియు। శుభదాయకుడు లోకవిభుఁడు రాముండు
ప్రాణనాథుండు నాప్రభువు దైవంబు। మానవరూపుఁడై మహినిదావెలసె
నినుజంపునిక్కంబు నీచుడావినుము। ననుదెచ్చితివి నీ వినాశంబుకొరకు
భీమబలుడనని ప్రేలెద వేల। యీమహి గూలెదు రాముని మ్రోల
గరుడునిగన్నట్టి యురగమ్మురీతి। పరమనీచుడ రామబాణజాలముల
ధరబడిపోదువు దగ్ధుండవగుచు। కాలవశుండవై గాదెనీవిటుల
బాలికనుడా నన్ను బట్టితెచ్చుటయు। రామునిసతి నన్ను రాక్షసాధముడ
కామించుట వినాశకాలంబువచ్చె। వరహంసమును గూడి ముఖియుచునుండు

వరటకాకముగోరి చరియించునోక్కా। గావుస వశ్యనుగానురా నీకు
జీవముపైనాశ చెందనేనిపుడు। బక్షింతువేన్మెను భక్షించుభువన
రక్షుడురాముండు శిక్షించునిన్ను.

డోర:-అంతట కోపావేశంబున నసురుడు అదరి మండిపడుచు
చెంతనున్న యసురాంగనలంగని చేరియు మీారందరును ॥జ

(2) అందమైన అశోకవనంబున యీాసుందరి నుంచియువేగ
పొందుగ నాపై కూర్మిగలుగగ బోధింపుడియని బల్కె ॥జ

వ॥ రాక్షసాంగనలు సీతను అశోకవనంబుజేర్చి బెదరించుచు గాచియుండ నాదేవి యాత్మనాథుని ధ్యానించుచు విలపించుచుండె. ఇట శ్రీరాముడు మారీచుని సంహారించివచ్చుచు ఆకలిగొని మరియొక మంచి జింకనుజంపి భుజంబుపై వైచుకొని సీత యీాలేడిని బాగుగ పక్వంబుజేయుననుచు మరల మనంబున భయంబు గదుర,

డోర:-మారీచుని భీకరమగు పల్కులువిని మంగళాంగి జానకియు
నేరీతిని నున్నదో కోమలి యిటుపంపునో సౌమిత్రిని ననుచు ॥జ

(2) పర్ణశాలలో నొంటినుండగని భక్షించిరో రాక్షసులు
దుర్ణయమున సతినేమిజేసిరో దోచదాయె మదినిపుడు ॥జ

(3) అని గలపోయుచు వచ్చుమార్గమున నపశకునంబులు గనియు
మన మెరియగ నేతెంచు లక్ష్మణుని గనుగొని యదరుచు నపుడు ॥జ

(4) సీతను విడచివచ్చితివేలిట జీవించియున్నదే సరిగ
ఘాతకులగు నసురులు జానకి గాఁజేసిరో మదినెరుగ ॥జ

(5) జీవింపను నే నరనిముసమ్మెనను సీతనువిడిచి యిపుడు
బోవు మయోధ్యకు కైకకు ప్రియమగు నావిషయము వినగను మరియు ॥జ

(6) సీతపోవుటయు నేను నశించుట చెవిసోకగ కౌసల్య
యేతీరున మనియుండును చెపుమీా నిక పరిశేషితశల్య ॥జ

(7) ఎడమకన్ను భుజమదరెనునాకు కడుభయ మొదవెడు నాకెడను
పుడమిజయుండదు పర్ణశాల నాయడుగులు నెంతయు తడబడును ॥జ

(8) ఎంతటి అన్యాయము జనకజ నొంటిగ నిటువిడిచి రాజన్నే
సంతోషంబిక నాకేక్కడిదయ్యా జానకి జూడకయున్నే ॥జ

వ॥ అను మాటలకు సౌమిత్రి శోకభరంబున మాటలు తడబడ అన్న కిట్లనియె.

సీ॥ అన్న నీయాజ్ఞనే యాదలదాలిచి రక్షించుచుండగ రమణీమణిని
హా సీత లక్ష్మణా యను రక్కసునికూత వినినంత జానకి వనటజెంది
రక్షింపబొమ్ము శ్రీరాముని లక్ష్మణా ఏమి యనర్థంబొ యెరుగరాదు
అనిన తల్లిరో విను మన్నకై వగపేల నినువీడి పోవుట నీతిగాదు
అధిక శూరుండు వీరుండు అన్న మరియు క్రుద్ధుడైనంత లోకముల్ గూలిపోవు
గాన దనుజులు శ్రీరాముగదియలేరు దానవుల మాయలివియని దలపు మదిని॥

జోర:-అనవిని కోపము శోకము జెనగొన ననుగనుగొని యపుడు
విను మూర్ఖుడ నీయన్నబోయిన ననుగోరెదవే నీవు ॥జ

(2) క్రూరుడవై వెనుకొని యడవికి నను గోరివచ్చితివా యిపుడు
కూరిమిచే శ్రీరామునిగొల్వ గోరినవాడవుగాదు ॥జ

(3) విడుతును ప్రాణము నీవశమౌదునె వెడలిపొమ్ము ఛీయనిన
కడువిషాదమున కఠినోక్తులు వినజాలక కదిలివచ్చితినే ననిన ॥జ

(4) యెరుగవె స్త్రీలస్వభావము లక్ష్మణ యిటుచేయుట యిదితగునా
ధరణిజగైకొని తినిరో దైత్యులు కరుణవిడచితివి యిదియేల ॥జ

వ॥ అని విలపించుచు ఆశ్రమంబుజేరి అందు సీతనుగానక హాలక్ష్మణా యెంత
జేసితివి హా కఠినహృదయ నినునమ్మి సీతను గోలుపోతి. కైకవలన నింతగల్గెనని
గట్టిగనేడ్చుచునుండ సౌమిత్రియు దుఃఖించుచు.

జోర-అన్నా! నీవిటుదుఃఖింపకుము అరయుద మిటునటు ననిన
నెన్నగ చెట్టుల పుట్టల గుట్టల వెదకిరి యిరువురు శోకమున ॥జ

ఆఠాణా - రూపకం

ప॥ ఎందుబోయినావు ఎదురేగి ఏలరావు ॥ఎం

అ॥ మందయాన మారుబల్కవు సుందరీయిటులేకనీ ॥వెం

చ॥ చందనశీతళచారుశుభాంగీ మందస్మిత పూర్ణేందుముఖీ
యిందీవరనేత్రి మత్ హృదయాంబుజ భృంగీ నీ ॥వెం

(2) శృంగారీ సుకుమారీ సకలగుణాలంకారీ
మంగళకరి నఘకోసల మహారాజ[illegible] రాకుమారి ॥[illegible]

తే॥ ఆశ్రమమునందు సీత నందందు వెదకి చెట్టుచెట్టును జేరియు సీతయనుచు
చారుపద్మసరస్సుల నరసజూచి యెందుగానక పూపొదలందు నరసి

షణ్ముఖప్రియ - ఆది

ప॥ ఏలాగు నేనిలతును నిల హేలావతి నినుగానకున్న ॥ఏ

అ॥ చాలునుపరిహాసము నా జాలి దెలిసివేగ జానకిరమ్మి ॥ఏ

చ॥ ముద్దుమోముజూపి ముదము గూర్చుచుండు మోహనాంగి నను మోసగింపతగునా
సద్దుసేయకను సరసిజాక్షి డాగి జాగుసేయకిపుడు సరగునరమ్మిటు

(2) కోరియున్నవాడ కోమలినిను నే కూరిమినాపై నుంచి రావె చెలి
యిారీతి నవకోసలేశు నలయించుదానవు గావె ఫుడును ॥ఏ

జో॥ర:-తరుణీమణి పూపొదరిండ్లను నిటు దాగియుండగ నేలా
తరుణముగాదిది పరిహాసమునకు తరలాక్షీ రమ్మిటు గుణాశీల ॥జ

(2) పలుకవేమి నవపల్లవపాణి అలిగితివా మరుముల్కి
చలమేలనె యిటు చెలియా నాపై కలికీ చిలుకలకొల్కి ॥జ

(3) పరువిడుచును మరి చెట్టుచెట్టుకును భ్రాంతునికై వడి నపుడు
అరుగును బుట్టల గుట్టల చెంతకు హాసీతాయని విలపించుచును ॥జ

యదుకులకాంభోజి - చాపు

ప॥ చంపకగంధిని జలజాతనేత్రిను జానకిని గంటిరే చంపకతరులార ॥చం

అ॥ సొంపైననడకల సొగసుమిారెడుదాని సుకుమారిగంటిరే చూతవృక్షములారా ॥చ

చ॥ చంద్రవదన నిపుడు గంటిరే పున్నాగ చందన మందార పారిజాతములారా
ఇంద్రనీలమణి తారహారముల్ గదుల నిందువచ్చెనె మోహింతాలగసాలములారా ॥చం

(2) కదళీవృక్షమ నీవుగంటివే మైథిలిని కాంచనభూజమ గంటివే కనకాంగినీ
బదరీ కపిత్థజంబూపనసలార పరమపావనియా పద్మాననగంటిరే ॥చం

(3) నారీమణి నవకోసలరాణి నామనోహారిణి కోకిలవాణి
చేరి మిా చెంతను దాగియున్నదో చెప్పుడీ కూరిమితో మిారు కుందరదనను జూపుడీ

జో॥ర:-కలహంసము కనుగొంటివె నల కలహంసగమన జానకిని
అలికుల వేణిని గంటివె యళినీ అబలను నాప్రియసఖిని ॥జ

(2) కీరము కాంచితె కీరవాణి శృంగారిణి శుభాంగిని నిపుడు
చారు విలాసిని సుందరి భూసుత సత్యచరితను మరియు ॥జ

(3) గోదావరి నీవైన గంటివె కోమలి మైథిలినింత
నీదాపున చరియించు నెప్పుడు నెయ్యముతో నాకాంత ॥జ

వ॥ ఉన్మత్తునివలె సకల ప్రదేశంబులు వెదకి సీతనెందును గానక దుఃఖించుచు రాముడు తమ్మునింగని,

జోరు:- అన్నా లక్ష్మణ సీతనుమ్రింగిరో హరియించిరో దానవులు
కన్నుల నీళులుగార్చు మృగములివి గనుపించెడు సీత వియోగమును ॥జ

(2) జానకిగానలం గోల్పోయిన నే నెటుజేరుదునయ్య పురంబు
దీనుడ ననుగని సకలజనంబులు తిట్టరె నిర్దయుడనుచు ॥జ

(3) తనయా నాకోడ లదేదిరాయన జనని కేమి దెల్పుదును
అనఘా జానకి యెచ్చట నను నీ జనని కేమి జెప్పెదను ॥జ

(4) కానల సీతను గోల్పోతివెయని కైక నవ్వుచునడుగ
నేనేమంచు వచించువాడనట నెఱిచెడి మొగమును ముడుగ ॥జ

(5) మచ్చికమీరగ వచ్చిజనకుడు మైథిలి యెచ్చటయనుచు
ముచ్చటింపగ నామహాత్ముని మోమెటు జూచెదననుచు ॥జ

(6) ఇదివిని మిథిలేశుడు విలపింపగ నేనెటుల యోర్చియుందు
వదిన ఏదియని తమ్ములడుగగ వారి కేమి నుడువుదును ॥జ

(7) సీతను అసురులవాత ద్రోసెను చేతగాక రాఘవుడనుచు
ఈతీరున ప్రజలాడగ వినుచు నేమందును వారికి చెపుము ॥జ

(8) పొమ్మి అయోధ్యాపురమున కిప్పుడు తమ్ముడ వేగంబునను
అమ్మను చాల అడిగితిననుమి యరయుచుండు ప్రియమునను ॥జ

వ॥ లక్ష్మణా సీతలేక నింక యీతనువున ప్రాణంబులుండవు. సీత పోకయును నా మృతియు నాతల్లి కౌసల్యకు తక్కినతల్లులకెల్లరకుం జెప్పుము. నాయనా పోయిరమ్మని విలపించుచు,

ద్విపద:- అనుపమరాజ్య భోగములు బోవుటయు। జననిని విడిచి కానమ జేరుటయు
జనకుని మరణంబు జానకీహరణ। మనుజ దుఃఖంబుపైనయ్యె దుఃఖంబు
మును నేను చేసిన ఘనుపాప ఫలము। ననుభవింపక తప్పదనుచు శోకమున

సీతాయటంచును శ్రీరఘువరుడు। భూతలమునబడి పొరలుచునంత
పవనభాస్కరులార పావనులార। అవనిజ స్థితిదెల్పుడయ్యా మ్రొక్కెదను
అని పలవించెడు నన్ననుగాంచి। ఘనుడు సౌమిత్రి యిట్లనియె నెయ్యమున.

హిం:-శోకముమానుము ధైర్యముబూనుము సౌక్కితపింపకు పుడమితనూజను
ప్రకటముగ మనమరయుద మిప్పుడె యీకరణిని గృశియింపకుమన్న ॥శ్రీ

(2) కోనలు నదులు కొండలు గుట్టలు కాననములు కొలకుల వెదకిన
జానకి గనుపడకుండునె మనకు మానుముచింత మహితవిచార ॥శ్రీ

వ॥ లక్ష్మణుం డిట్లూరడిలంబల్క. రామభద్రుండు తమ్మునింగూడి దిక్కుదిక్కుల
నరయుచు,

ఙోర:-కానన ఖగమృగములు సారెకు నను గనుచున్న విచ్చటగనుము
జానకిజాడ యెఱిగినట్లివి చరియించెడు నిటునటు యన రఘువరుడు ॥జ

(2) ఖగమృగాది పన్నగములారయిట నగుమొగముగల్గు జానకి మీ
కగపడెనా యెరిగింపుడు దయతో అంబుజాక్షినీ మరినీ ॥జ

వ॥ ఇట్లు పల్క శ్రీరామునిగని మృగంబులు మోరలెత్తి దక్షిణపు దిక్కునకు పరు
విడ వానియింగితం బెరింగి లక్ష్మణుం డన్నా యీమృగంబులు సీతజాడదెల్పుచు
దక్షిణదిక్కుంగూర్చి పోవుచున్నవి. మన మాదిక్కున పోయి చూతమని
పోవుచు అందందు నరయుచు,

ఙోర:-వెదకివెదకియు నెందునుగానక వెలదిని నిటునటుజనుచు
ముదితకొప్పున ముడిచిన సుమములు పృధివీతలమున గనుచు ॥జ

(2) అవనిజ యడుగుల వెంబడించిన అసురుని అడుగులుజూచి
అవనినిరాలిన స్వర్ణరేణువుల నచ్చటగని దుఃఖించీ ॥జ

(3) రక్తబిందువుల నందందుగనుచును రయమున నడువగనందు
నక్తంచరుని విల్లునమ్ములును నవమణి కవచము రధము ॥క

(4) విరిగి తునియలై యిలబడినవియివి యెవరివో లక్ష్మణయనుచు
ధరబడి నీల్గినగార్ధభముల సారధి నరయుమెవ్వరివో యనుచు ॥జ

(5) రాక్షసులిరువురు సీతకొరకునై రణమొనరించిరి యిచట
భక్షించిరో చెరబెట్టిరోవారలు భయముగలిగె నాకకట ॥జ

వ॥ అని శోకమోహంబున కోపారుణిత లోచనుండై సర్వభూతంబులపై నాగ్రహించి లక్ష్మణా.

ఝోర:-దేవతలైనను గోదావరి వనదేవతలైనను గాని భూవలయంబున
భూతజాలములు భూమిజ, విధమెరిగింపరు మరినీ ॥జ

(2) కరుణను సర్వజగంబులునేను కడుప్రేమను రక్షింపగను
నెరుగరు నాబలశౌర్యము లెవరు నెరిగించెద వారికినిపుడు ॥జ

(3) లోకంబులు లోకేశులు నెల్లరు నాకోపంబున కోర్వగగలరా
ఆకులపాటును జెందగజేసెద అవనిజ జూపకయున్న ॥జ

వ॥ అని కోదండంబు బూని ధనుష్టంకారంబు జేయుసమయంబున లక్ష్మణుండు వినయ వచనంబుల అన్నా క్రోధంబు బూనకుము. జానకీదేవి నెత్తుకొని పోయిన వా డొక్కండై యుండనోవు. ఇచ్చట యుద్ధంబుచేసిన జాడ జాడ యిరువురు, దైత్యుల సైన్యంబుగానరాదు. గాన నారక్కసుని యీకొండ గుహలలోను నద నదీకూలంబులందును వెదకి సంహరింప వలయును. ఒక్కనికై సర్వభూతంబులపై నాగ్రహింప నీవంటి వానికి తగ దని అన్నపాదంబులకు ప్రణమిల్లి.

హిం:-చంద్రసూర్యుల తేజంబును మరి శాంతిదాంతి దయాసత్యంబులు నీ
యందును యశముతో నన్నివసించును నిందునిభానన విశ్వభావన ॥శ్రీ

(2) ఎంత మహాత్ములైననుగాని యీశ్వరకృతము దాటగవశమె
వింతలె మేలునుగీడు ప్రాణులకు వేఱుగ నెఱిగింప వలయునె నీకు ॥శ్రీ

(3) సర్వభూత శరణ్యుడ వీవు సమదర్శనుడవు సజ్జనహితుడవు
ఉర్వీశ్వర సురగరుడోరగులు పరికింపగ నెగ్గు సేయుదు రేనీకు ॥శ్రీ

(4) నీ విటు శోకింప శ్రీరామ దేవ గురుండైన దెలుపగలడే
భావింపుము నాపల్కులు దయతో నీవే మునుదెల్పిన దిది నేబల్కితి॥శ్రీ

వ॥ అన్నా పామరునివలె నిటుశోకించుట భావ్యంబుగాదు కష్టంబు లనుభవింపని వా రెండైనం గలరె అనపరాధులైన సుర గరుడాది జీవజాలంబుల గారియ పెట్ట నేల అపకారియగు వానింబట్టి దండింపవలయు నని వచియించు తమ్ముని సద్వాక్యంబుల శాంతుండై వత్సా! సీతనెందు వెదకుదము? ఎటబోవుదమని బల్కుచు ధనుస్సున బాణము సంధానముజేసి తమ్మునితో కొంతదూరముబోవ నచ్చట భయంకరా కారుండై బడియుండు జటాయువునుజూచి లక్ష్మణా! యీ రాక్ష

సుడు సీతను రక్షించి నిదురించు చున్నాడు! వీనిని హతము జేసెద నని యతని
కభిముఖుండై నిలిచిన శ్రీరామచంద్రునిగని,

జోర:-రామా నేను జటాయువు సీతను రక్షింపగ యుద్ధముజేసి
స్వామీ రావణుచే హతుండ నైతిని జంపకు నను క్రోధమున ॥జ

(2) ఈ సారధి గార్ధభముల జంపితి నీకనకరధము కవచములన్
జేసితి చూర్ణము రావణు నిలబడ ద్రోసితి శౌర్యముతోడన్ ॥జ

(3) అడచితి రెక్కల ముక్కునబొడిచితి అసురుని నొప్పించితిని
కడువడినాడు రెక్కలునరికె గగన పథంబునవాడు ॥జ

(4) భూసుత ద్రోడ్కొని దక్షిణదిశకును బోయె రావణుండపుడు
దాశరధీ నేబడి యున్నానిట సీదయగనుటకు ననుడు ॥జ

వ॥ రాముడంత దుఃఖాతిశయంబున చేతిధనున్నును క్రిందవైచి పక్షిరాజు గాఢాలిం గనంబు గావించి మూర్ఛిలి, మరలలేచి తండ్రీ, నాకొరకై యిట్టికష్టంబు నీకు గలిగెనే యనుచు, రావణుండు సీతనెత్తుకొనిపోవు సమయంబున సీత ముఖం బెట్లుండె? ఏమిబలికె? వాడెందుండును? ఎరుగింపుమన జటాయువును, శ్రీరామా, సీతాదేవి, హా రామా హా లక్ష్మణా యనియేడ్చుచు బోవుచుండె. ఆతడు విశ్ర వసు కుమారుడు కుబేరుని తమ్ముడు, అని నెత్తురుగ్రక్కుచు ప్రాణంబులువిడిచె. అంత రామభద్రుడు తండ్రికింబోలె నతనికి దహనసంస్కారంబు గావించి, పిండంబులిడి రామలక్ష్మణు లిరువురు గోదావరియందు స్నానంబుజేసి ఈ పక్ష త్రిపుంగవుండు ఉత్తమగతి బొందుగాతమని ఉదకదానంబుగావించి.

క॥ సాక్షాద్ధరి రఘువీరుం డక్షీణకృపాకటాక్ష ప్రాపణమున నా
నాపక్షీంద్రున కాక్షణమున మోక్షానందంబొసంగె ముదముదలిర్పన్

వ॥ అంత అన్నదమ్ము లిరువురు ఘోరంబగు దండకారణ్యము దాటి క్రౌంచార ణ్యంబు ప్రవేశించి బోవునెడ అయోముఖి రాక్షసి లక్ష్మణుని గాగలించి నన్ను పెండ్లిచేసుకొనుము యీ వనాంతరాళమున, సంతోషంబుగా విహరింత మన లక్ష్మణుండు దాని విరూపిణించేయ నదిభయంకరముగ బొబ్బలిడుచు పారిపోయె. అంత ఘోరవనంబున బోవుచు సౌమిత్రి అన్నా! నాయెడమ భుజమదురుచున్నది ఏదోయొక విపరీతంబుగల్గునని తోచుచున్నది నీవుజాగ్రత్త తోనుండుము మరియు నీపక్షికూత మనకు యుద్ధంబున జయముగల్గునని సూచిం చుచున్న దనుచుండ పెద్దధ్వనియొకటి వినబడె అదివిని భయభ్రాంతుడైన తమ్మునింగని రాముడిట్లనియె.

ద్విపద:-భయమేల మనకిప్డు పరగనీయడవి| రయమునం బోదము రమణిని వెదుక
అనుచు బోవుచునుండ నాయరణ్యమున| ఘనకాయునత్యుగ్ర కర్కశరూపు
దను కబంధుండను దైత్యుగన్గొని| కడుపులోఁదలయును గన్నునుగల్గి
నిడుపైన చేతుల నిఖిలభూతముల| నీడిచికొని తిను హింసనుచేత
పోడిమిచిక్కి యీపురుషపుంగవులు| పరవశులై యుండ భయమొదఁబొదల
కరుణాశ్రువులు కంట గారుచునుండ| మునుకొనిదుఃఖాబ్ధి మునుఁగుచునంత
ననిమెలక్ష్మణుఁ డిట్టులనె నగ్రజునికి| అగ్రజా బడితి మీ యసురునిబారి
వ్యగ్రతనొందక బదు కెట్లొ బైట| వీనికి బలియౌదునేను సీతనుమ
పూనికతోనీవు భూపుత్రివెదకి| చేరి యయోధ్యను శీఘ్రంబుగాను
ధారుణిఁబాలింపు తలఁచుచునన్ను

జోర:-రాజ్యముపోవుట వనమునుజేరుట రమణిని గోల్పోవుటయు
తేజమువీడి వీనికి జిక్కుట తెలియగ విధి బలమిదియు ||జ

(2) పిన్నతల్లికి కైకమ్మకు ప్రీతిగ వనట జెందగావలసె
అనుజా దుఃఖముపై దుఃఖము మన మనుభవింప కాలమువచ్చె ||జ

(3) వింతగ దైవముచే హతుడగు నిలవీరుడు శూరుడు మరియు
ఎంతటి సమర్థుండైనను గూలును ఇసుక సేతువు వ్వలెను ||జ

వ|| ఇట్లు వచించువారి మాట లాలించి కబంధుండు.

జోర:-ఏల వచ్చితిరి ఘోరాటవికని ఎవ్వరు మీ రిరువురును
పోలేరింకను ప్రాణమ్ములతో పొగలకు డోమానవులు ||జ

(2) తడబడ నేటికినిచ్చెను మిమ్మును దైవము నాకాహారముగ
బడితిరి నాకరముల మధ్యను భక్షించెద భయమిక నేలా ||జ

వ|| అన లక్ష్మణుండు ధైర్యంబుబూని శౌర్యంబుతో,

తే|| అంగహీనుడు గావున అన్న మనము దుష్టుడైనను వీనిని దుంపవలదు
నఱుకుదము రెండు భుజముల చెరియొకరము ననుడు వారల దినబోవు నంతలోన

జోర:-ఛేదించిరి యాకబంధుని భుజముల శ్రీరామలక్ష్మణులువేగా
మోదము జెందగ సర్వభూతముల బాధలు దీర్చిరిబాగా ||జ

(2) భీకరరావముతో దనుజుఁడు భీతిలి పుడమినిబడియు
పాకశాసనుని వాక్యముదలచుచు పలికెను మీ రెవరనుచు ||జ

వ॥ వానికి లక్ష్మణుండు ఈమహాత్ముడు దశరథ కుమారుడగు శ్రీరాముడు నేనతని తమ్ముండ మే మరణ్యమున సంచరించుచుండ శ్రీరామునిభార్య నెవ్వడో యొక రాక్షసుం డపహరించిన ఆదేవిని వెదకుచు నిటవచ్చితిమి మఱి నీవెవ్వడవు కడుపులో కన్నుగలిగి కబంధరూపమున నుండ కారణమేమి? యనినవాడు.

హిం:-స్వామి నాభాగ్యవశమున మీరు జనుదెంచి తిరుకరముల ఖండింప
రామలక్ష్మణులని దెలసితి నిపుడు క్షేమముగల్గును శీఘ్రము మీకు ॥శ్రీ

(2) సుందరదేహముగల వాడను నే చంద్రసూర్యులవలె వెల్గుచునుందును
ఎందును నెదురులేక విహరింతు నెల్లరకు భీతిగల్గింతు నెపుడు ॥శ్రీ

(3) భీకరముగను వికృతరూపముదాల్చి బెదరించుచు మునుల సర్వకాలంబును
ఆకులపాటుజేయగ నొకనాడు అనుసరించెనాకు విధివశము రామ ॥శ్రీ

(4) స్థూలశిరుండను ముని వరు డిట వనఫలముల చేకొనిరా గనినేను
నిలుమని బెదరించి గైకొంటి ఫలములనలిగి యాముని నన్ను శపియించెనిటు॥శ్రీ

(5) ఈరీతిని బహుఘోర రూపముల నిలజరియింపుము క్రూరాయన నే
సారెకు నామునిపదముల బడివేగ శాపముదీర్పుము దయతో ననివేడ ॥శ్రీ

(6) రఘువీరులు శ్రీరామలక్ష్మణులు రయమున నీదు కరములు నరికియు
అఘువిదూరులు నిను దహనముజేయ నలరుచుండెదవు బ్రహ్మలోకంబున ॥శ్రీ

వ॥ అని శాపాంత మనుగ్రహించె, నంతనేను బ్రహ్మనుగూర్చి తపంబుచేసి దీర్ఘాయువునుబడసి గర్వితుండనై యిందురునిపై యుద్ధంబునకుబోవ వజ్రాయుధంబున నాశిరంబు వక్షంబున దునిమి బ్రహ్మవరంబున జంపక విడచిన నేను దీనుండనై దేవా నాకాహారంబెట్లని వేడిన నతండు నాకడుపులో కన్నుబెట్టి ఒకయోజనంబు నిడుపుగల బాహుద్వయంబు గల్గ వరంబిచ్చె. అదిమొదలు నాచేతిలో జిక్కిన సింహశరభ శార్దూలాది మృగంబులను మరియు భక్ష్యాభక్ష్యంబు లెఱుగక దినుచుందు వీలన.

జో౯ర:-ఎన్నటికైన రామలక్ష్మణులు ఇచటికి వచ్చెద రనుచు
క్రన్నన నాకరముల జిక్కియు ఖండించెద రెపుడనుచు ॥జ

(2) తలచుచుంటి మహాత్ములార మీదయచే దేహమువిడచీ
అలరుచుండెద బ్రహ్మలోకమున అగ్నిదహింపుడు తనువు ॥జ

(3) సీతనుదెచ్చి యిచ్చెడు హితుని జెప్పెద రామా యిపుడు
నీతోనమముగ నతిగోల్పోయెను నీతిపరుం డాఘనుడు ॥క

వ॥ అనిన వానితో రామచంద్రుం డిట్లనియె మహాత్మ నాభార్యనపహరించిన వాని పేరు దెలియునుగాని నివాస స్థలమేదియో వాని బలపరాక్రమమెట్టిదో యెరుగ దానిని దెల్పుమన నతండును రామా! పాపరూపుడనగుట పూర్వజ్ఞానంబులేదు ఈ శరీరంబును సూర్యుడస్తమించు నంతలో దహనంబుజేయుడి అంత దివ్య దేహంబుదాల్చి యెరిగినంతవరకు విన్నవింతెద. సీతాక ఘనుడైనవానితో సఖ్యంబు చేసికొనుము సర్వకార్యంబులు సమకూరును అనినంత వారు ఏను గులు విరచివేయ యుండియున్న కాష్టంబులుదెచ్చి పెద్దగుంటలోనైచి వాని దేహంబు గాల్చినైచి నంత, దివ్యదేహంబుదాల్చి విమానంబుపై వెల్గుచు అంత రిక్షంబున నిలచి.

కం॥ శ్రీకరభూరిగుణాకర లోకేశ్వర రాకుమార లోకశరణ్యా!
పాకారి వినుత! ప్రొక్కెద నాకుం గరుణింపుమయ్య నాథ ముకుందా!

తే॥ మిత్రునెరుగించెదను కపి మేలుగల్గు వెదకిసీతనుదెచ్చు కపివరలు మాన్పు
అతడు చూడనితలము లేయవనిలేవు సఖ్యమొనరింపు మతనితో నగ్నిసాక్షి

జోర:-తనకుగా సరియగువారల స్నేహము ఘనముగ జేయుగ వలెను
విను మాతని భార్యను సిరిచేకొనెను వాలి తనబలమునను ॥జ

(2) తనమంత్రులు నల్వురతో సుగ్రీవుడు దాగి ఋశ్యమూకమున
మునికొని వెతబడియున్నా డచ్చట గనుమాతని వేగమున ॥జ

(3) సత్యవాది ప్రజ్ఞానవిభవుడు సద్గుణుడును ధార్మికుడు
అత్యంత పరాక్రమశాలియు ధీరుడు అతిశూరుడు సీరుండు ॥జ

(4) వంచనయెరుగడు వానరు డని మదినెంచక సఖ్యమొనర్చు
అంచితముగ రామా రవిసుతుని వాంఛదీర్చు మునమునుగూర్చు ॥జ

(5) అతడుజూడని స్థలములులేవు భూతలేశ్వర వినుము
సీతను వెదకి దెచ్చియిచ్చును చింతవిడువు మిక బొమ్ము ॥జ

వ॥ ఆవానరవీరుండు పంపాసరోవర ప్రాంతమందున్నవాడు నీకార్యంబంతయు సాధిత పనమర్థుండుగావున రామా పడమటి దిక్కునుగూర్చి ప్రయాణంబుగమ్ము అందొక వనంబు మనోహరంబైయుండు.

హిం:-రామా నీవటు పోవుచుండగా రమణీయంబగు వనములగాన్పించును
శాఖీకంబులగు ఫల కుసుమంబులు గలవచ్చట నతిమధురముగాను ॥జ

ఖరహరిప్రియ - ఆది

ప॥ సుందర వనమది చూడనొప్పు రామా ॥సుం

అ॥ నందనవనమన మందమారుతముతో ॥సుం

చ॥ మందార పారిజాత మహిత చంపక వకుళ
చందనతరువుల చైత్రరథమువలె ॥సుం

(2) పనస జంబూద్రాక్ష బదరి కపిత్థామ్ర ఘనతర దాడిమీ కదళి ఖర్జూరతరుల॥సుం

(3) అలరు జొంపములతో అశోక పలాశ వటముల్
చెలగు కదంబ నింబ తమాల ఔదుంబరముల ॥సుం

(4) నవ్య రజనేత్రా నవకోసలరామా నవపల్లవ లతల నతిరమ్యము గనుము ॥సుం

హిం:- అనుజుడు కోసియిచ్చిన యచటి అమృతఫలములను మెసవి
ఘనమగు పంపాసరమును గనుమట కలుగును మదికి కడుమోదమును ॥శ్రీ

(2) ఫుల్లపద్మముల పుష్పాడితావియు చల్లని జలములు చుట్టును నింపగు
మల్లెలు మొల్లలు సంపెగలు నొప్పగ నుల్లము రంజింపజేయును సతతము

(3) అందముగా నందు హంససారసములు అందందు విహరించు సుందరంబుగ
మందమారుతముగల్గి నల్దిక్కుల డెందంబుల కానంద మొసంగును ॥శ్రీ

వ॥ ఇట్టి పంపాసరోవర సమీపంబున ఋశ్యమూకంబను పర్వతంబుగలదు అందు సుగ్రీవుండు మంత్రులంగూడి యున్నవాడు. నీవు తమ్మునితోబోయి స్నేహంబు జేయుము. మరియును.

జో॰ర:-ఘనుడు మతంగ మహామునివనమున కామిని సువ్రతశబరీ
వనరుగ తపము సల్పుచున్నదీ గనుడీ మీరటుచేరీ ॥జ

(2) కాచియున్నదీ మీ రాకకునై కరుణాజలధీ రామా
దాచియున్నదీ మధురఫలంబులు దాశరథీ దయచే గనుమా ॥జ

(3) చూడుడి ఋశ్యమూకగిరిని జతగూడుడి సుగ్రీవునితో
పోడిమిమీరగ బోవుడచటికి నే బోయెదనిక మీదయతో ॥జ

వ॥ అన జానకీవిభుండు దనుపుత్రునితో ఉత్తముడా నీవు బ్రహ్మలోకము జేరుము మేము సుగ్రీవుని జేరబోయెదము అని బల్కి పడమటిదిక్కుగా పర్వత సమీపంబు జేరి యారాత్రి యటనుండి మఱునాడు పంపాసరోవరము పడమటి

తీరంబుననుండు శబరి యాశ్రమంబుజేరి అంత తపోధనయగు శబరి రామ
లక్ష్మణులంగని వారి పాదపద్మంబులకు మ్రొక్కి అర్ఘ్యపాద్యాది విధులం
బూజించిన శ్రీరామచంద్రుడు శబరినిగని,

హిం:-సాధుసద్గుణశీల నిత్యవ్రతమ్ములు సజ్జనహితముగ సల్పుచుందువా
నీదు మానసమున మోదముగంటివ నిర్మలచరిత సద్గురుభక్తిని ॥శ్రీ

(2) నిగ్రహించితివా కామక్రోధుభాలకా నిత్యవిఘ్నములు తపమునకవియు
ఉగ్రమైన నీతపము సిద్ధించెనా ఒప్పుగ గురుసేవ నెరవేరెనెయన ॥శ్రీ

(3) వృద్ధతపస్విని విజితేంద్రియయు పీతకల్మషయునగు నాశబరీ
సిద్ధులకును సమ్మతనైనదియు శ్రీరామునకు నిట్లనె యలనీ ॥శ్రీ

హరికాంభోజి — ఆది

ప॥ సర్వశరణ్య నీ దర్శనమున సఫలమయ్యె నాతపము రామభద్ర ॥స
అ॥ నిర్వికారనిరంజన నిత్యానంద నినుపూజింప నాజన్మసఫలమయ్యె ॥స
చ॥ నిరుపమానగుణ నీకృపవలన గురుసేవ ఫలము సిద్ధించె దేవా
పరమపావనా పరంధామ నేను పరిశుద్ధురాలనైతిని రామ ॥స
(2) భువనసుందర సేవించి నిన్ను భవభయంబుల బాసితి నయ్యా
నవకోసల కోదండరామా నారాయణా నే ధన్యురాలనైతి ॥స

హిం: హరీమురారీ పరవాసుదేవ శరణార్థి నన్నుం కరుణింపుమయ్యా
నరరూపధారీ నారాయణా కరివరద ముకుంద వామన శ్రీధర ॥శ్రీ

వ॥ శ్రీరామచంద్రప్రభూ నీవు చిత్రకూటంబుననుండి మాయాచార్యులైన మతంగ
మహర్షి ప్రకాశమానంబైన విమానమున పరమపదమునకు వెంచేసిరి. పరిశు
ద్ధంబైన యీయాశ్రమంబునకు శ్రీరాముడు రాగలడు. అతనికి నీవు అతిథి
సత్కారంబులు చేయుము. అప్పుడు రామచంద్రుని యనుగ్రహంబున పరమ
పదము జేరదవని మహర్షులు నాకు దెల్పిరి. దేవా నీవు వచ్చుటెఱింగి నాటి
నుండియు పంపాసరోవర తీరంబునంగల.

హిం:-మధుర ఫలంబులు జేర్చియున్నానిదె మాధవ మధుసూదన గైకొనుమా
సదయుడైన యీసౌమిత్రినిగూడి సాదరమున ఆరగింపుము రాఘవ ॥శ్రీ

(3) అంతరంగ భక్తిగల్గిన శబరిని అనుగ్రహించి శ్రీరాముడు ప్రియమున
వంతసమున నీసద్గురు వనమున సర్వము జూడగోరెద సనగను ॥శ్రీ

వ॥ శబరియు శ్రీ రామలక్ష్మణులకు ఆమతంగ మహాముని గొప్పవనమునుజూపి రామా అదిగో మంత్రి ప్రభావంబులచేత గంగాది పుణ్యనదుల నిచ్చట ప్రవహింపఁజేసిరి జూడుము ఉపవాస శ్రమచే పోలేక తలచిన మాత్రమున సప్త సముద్రంబులు నిటవచ్చియున్న విధిగో ఆమహాత్ముని తపోబలముచేత ఇప్పటికిని వెలుగు అగ్ని ఆవేదికలజూడుము. దేవ పూజాస్థానంబుల గనుము మా ఆచార్యుండు వృక్షశాఖల వ్రేలగట్టిన నారచీరలు ఇప్పటికిని తడియారకున్నవి గనుము దేవతార్చనలుచేసి కమలంబులను సామాన్య పుష్పంబులనువేసిన హారములు వాడిపోవక యిప్పుడు వికసించియున్నటు లున్నవి జూడుము. శ్రీరామచంద్రా నీయాజ్ఞచే గురుప్రభావంబు వినిపించితి నింక నీయనుమతిని శరీరంబు విడువ నిచ్ఛగించు చున్నాను. నేను ఉపచారంబులు జేయుచుండిన పరమాత్మ ధ్యానముజేయు ఋషులచెంతకు బోవ నిచ్ఛగించు చున్నాను. అనవుడు లక్ష్మణునితోగూడి రాముడు ధర్మయుక్తంబైన శబరి మాటలువిని ఆశ్చర్యంబుగ నున్నదని సంతోషించి గొప్ప తపస్సుగల శబరినిజూచి,

జోర:-అతిభక్తిని ననుపూజించితివి ఆచార్యుని సేవించితివి
సతతము సద్వృత్తిని మెలగుచు సాధుగతిని బొందితివి ॥జ

(2) కోరిన లోకంబులకును నీవు జేరగలవు శుభశీల
పరమపదమున బ్రహ్మానందమ్ము బడయుచుండు సుఖలీల ॥జ

వ॥ ఇట్లు శ్రీరామచంద్రుని యనుమతిని అగ్నినిజ్వలింపజేసి యందు దేహమును హోమముజేసి దివ్యశరీరమును ధరించి మహాత్ములరుగు ఉత్తమలోకంబు జేరెను. అప్పుడు రాముని తేజస్సుచే పరమపదమునకు బోవు శబరినిగని అన్న దమ్ము లిరువురు మతంగ మహర్షి ప్రభావంబు గొనియాడిరి. అప్పుడు రాముండు.

సీ॥ జాతివైరములేక చరియించు మృగములుగల మహాత్మ వనమ్ముగంటి మిపుడు
సప్తసాగరముల స్నానముల్ గావించి పిండంబులిడితిమి పితరులకును
తొలగె ననిష్టంబు గలుగుశుభమ్ములు పంపాసరోవర ప్రాంతమందు
అదె ఋశ్యమూకంబు అలరుచున్నది వత్స రమ్ము బోదమటకు రయముతోడ

తే॥ భానుతనయుండు శ్రేష్ఠుండు వానరుండు వానరుల నల్వురను గూడి వాలిభయము
చేత నీ కొండ గుహలోన చేరినాడు చూడు సుగ్రీవుడనువాని సుగుణయుతుని

హిం:-అతని జేరగబోదము త్వరగ అవనిజ వెదకెడుకొరకును మనము
క్షితియంతయు దిరిగి జనకతనూజను శీఘ్రంబునను దెచ్చునతండు ॥శ్రీ

(2) శ్రీరాముండిటు బల్క లక్ష్మణుడు జేరబోవుదము శీఘ్రింబనుచు
వారిరువురును గదలియు పంపా తీరము జేరిరి కడుమోదంబున ॥శ్రీ

(3) అరయుచు నందలి చిత్రింబులను అందు మతంగతీర్థంబునను
పరమపావనుల్ స్నానముజేసి పానముజేసిరా జలమునుప్రీతి ॥శ్రీ

(4) స్నానపానముల శ్రమదీర్చుకొని భానువంశజులు పంపనుగాంచి
ఆనందించి ఖేదముమానియు అర్కజు జూడగోరుచు నప్పుడు ॥శ్రీ

(5) అలరు జొంపముల తరులొప్పియును ఫలకుసుమంబులు చెలగుచు పలువిధ
పులుగుల రవముల కలకలమనెడు సలలితమగు పంపాసరస్సును జూచిరి ॥శ్రీ

వ॥ మరియును యట్టి పంపాసరోవరంబు జూచుచు అనుజా దీనితీరంబున ఋశ్య మూక పర్వతంబుపై సుగ్రీవుండు తన హితులతో వసియించుచుండు గావున నీ వతనిజేరబోయి రమ్మని బల్కుచు.

హిం:- అతిమనోజ్ఞమై సుందరమగుచు నాపంపాసరను చిత్రముగనుచు
అతిమోదంబును గాంచిరప్పుడు క్షితిపతితనయులు శ్రీరఘువీరులు ॥శ్రీ

తే॥ ఇందుముఖి సీత సందేశమిచ్చి రామచంద్రు దుఃఖంబు బాపిన చారుయశుడు
రమణ బల్కించె దయ నీయరణ్యకాండ వొనర నర్పింతు నారఘుపుంగవునకు

తే॥ అంజనా దేవి తనయుండు హర్షమునను దెచ్చి సంజీవి సౌమిత్రికిచ్చి యతని
ప్రాణములు నిల్పినట్టి యాపవనసుతుని పాదపద్మంబులను గొల్తు భక్తితోడ

మంగళహారతి

ప॥ శ్రీరామచంద్రునకు జయమంగళం సదా సీతాసమేతునకు శుభమంగళం

చ॥ అగసియు మౌనివరుల కభయం బొసంగియు పరగవిరాధుని బరిమార్చి రక్కసిని
విరూపిగా జేసియు విశ్వవినోదుడు ఖరదూషణాదుల ఖండించి మించిన ॥శ్రీ

(2) క్రూరుడైనట్టి యామారీచు మర్దించి ధారుణి తనయను దనుజుడు గొనిపోవ
మీరిన శోకమునచేరి జటాయువుకు కూరిమితో మోక్షమొసగి రక్షించిన ॥శ్రీ

(3) కరుణతో నప్పుడు కబంధు శాపముదీర్చి తరుణియౌశబరికి పరమపదంబిచ్చి
అరిగియు పంపాసరస్సునుగాంచియు హర్షించి తమ్మునితో చరియించుచుండెడు॥శ్రీ

శ॥ హరిదాసుల మైత్రిని శ్రీహరికథలను వినుచు సతతమానందమునన్
నిరతము హరిభజనలచె వరలిన రామమ్మగాంచు పరమసుఖంబున్

శ్లో॥ నమోస్తు రామాయ సలక్ష్మణాయ నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ నమోస్తు వల్మీక భవాయ తస్మై॥

గద్య

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్ష వీక్షణ
లబ్ధకవిత్వ శౌనకసగోత్ర పవిత్ర
శ్రీరామపుత్రీ విరచితము
నవకోసల రామాయణము హరికథ
అరణ్యకాండము
సంపూర్ణము
శ్రీ శ్రీ శ్రీ
శ్రీరామార్పణమస్తు.

---

శ్రీరస్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః.

# నవకోసల రామాయణము
# హరికథ.

## కిష్కింధాకాండము.

క॥ శ్రీరమణా! శ్రితపోషణ సారసభవ గిరిశముఖ్య సన్నుతచరితా
నారాయణ భవహరణా ధీరా నవకోసలేశ దీనశరణ్యా.

భైరవి — ఆది.

ప॥ కోదండరామా కోరితి నీసేవ ॥కో

అ॥ వేదండపాల నీదండజేరి పాదారవిందములను పట్టి నిలుతు ॥కో

చ॥ పరాత్పర శ్రీరఘువీర భక్తమందార భవ్యగుణాకర
ధరణిసుతామనోహర నరవర దరహాసితవదన చారుశరీర
వరనవకోసల పురసంచార వరదాఖిల లోకగురూ ॥కో

హిం:-శ్రీరామా నీచరణముల్ మొక్కితి శీఘ్రమె నను దయజూడుము తండ్రీ
నీరూప గుణ సౌందర్యములను నేఁబొగడ తరమా నవకోసలరామ ॥శ్రీ

(2) రామలక్ష్మణులు ఆశ్చర్యంబున రమణీయంబగు పంపను జూచుచు
శ్రమదీరగ శుద్ధజలమును ద్రావియు శ్రీమంతులు ఋశ్యమూకము చెంతను ॥శ్రీ

(3) దినకర సన్నిభ తేజముమీర ధనువులు శరములు కరములదాల్చి
వనరుగ జటావల్కలములు ధరియించి ఘనులు దిరుగగ గనె సుగ్రీవుఁడు ॥శ్రీ

(4) వాలి పనుపున వచ్చినవారని దలచి పరువులిడి యొదిగి వణఁకుచు
తూల ధైర్యమెదను దొట్రిలె రవిజుఁడు తొల్లిటి బాధల నెంచుచు నపుడు ॥శ్రీ

వ॥ అంత నతనింగాంచి కాంచనాచల సంకాశుఁడగు నాంజనేయుండు, ఎందుకింత భీతిల్లెదవు? వీరు మహానుభావులవలె కనుపించెదరు. నీకు హితము జేయుదురని తలఁచెదనని వచింప సుగ్రీవుఁ డో హనుమంతా! వాలి ఇచ్చటికి వచ్చుట కవకా

శములేమ. కావున నన్ను యమపురి కంపు తలంపున వీరి నెవ్వరినో యంపి
యున్నాడంచు నెంచెద.

జోర:-మనమున బెదరుచు రవి తనయుండు మారుతనందను జూచి
ఘనవటు రూపము దాలిచి వారల గనుగొను మెవరో యనిన ‖జ

(2) అంత రామలక్ష్మణు చెంతకు ఆంజనేయుడును జేరి
సంతోషంబున మ్రొక్కి యిట్లనియె సద్వచనంబుల జేరి ‖జ

(3) వనసీమకు శోభనుగల్గించుచు వనరుగ నరవేషముల
అనుపమ తేజంబున దిరిగెదరిటు లమరసన్నిభులు ఘనులు ‖జ

భూరికల్యాణి - ఆది

ప‖ ఎవరయ్యామీరు మునివేషధరులు రవిసన్నిభులు రాజచంద్రులు ‖ఎ

అ‖ భువనమోహనులు భూరివిక్రములు పూర్ణేందుముఖులు పురుషశ్రేష్ఠులు ‖ఎ

చ‖ ఘనమైన శరచాపములును కరముల చాల మెరయగనిటు
వనములదిరుగ నేటికయ్యా యిపుడు వరగుణోత్తములారా శ్రీమంతులార ‖ఎ

(2) శీతకరునిపోల్కి లోకహితము జేయ జేరిసంచరించు దేవసములార
భూతలము నేలజాలువార లీరీతి వల్కలము జడలుదాల్పనేల ‖ఎ

(3) వరనవకోసలాధీశులవలె తరుణులు రూపసౌందర్యఘనులు
సరసిజాక్షులార మీవిధమెల్ల నెరిగింపుడయ్యా పరమప్రీతితోడ ‖ఎ

జోర:-పలుకరేలయిటు లెంతవేడినను బ్రాజ్ఞులార యిపుడు
చెలిమిగోరి సుగ్రీవుడు నను మీచెంత కనిపె నిపుడు ‖జ

(2) తనసోదరుడౌ వాలిభయముచే తల్లడిల్లుచు నెదను
ఘనమగు ఋశ్యమూకమునందు గడుపును దినముల నతడు ‖జ

(3) వాయుతనూజుడ హనుమంతుండను వానరుడను నేను
ధీయుతులార సుగ్రీవుని మంత్రిని దెలిపితి నిక్కంబిదియు ‖జ

వ‖ అనిపల్కి యూరకున్న,

జోర:-ఆవాక్యంబులువిని శ్రీరాముడు అనుజునితో నిట్లనెను
భావింపుమి య్యాతని వచనరచనయు భక్తియుక్తి వినయంబు ‖జ

(2) ఎవ్వని చెలిమిని గోరివచ్చితిమొ యీ వనమునకును మనము
అవ్వనచరుని యమాత్యుడె యీతం డతి నిపుణుడు కార్యజ్ఞుండు ॥జ

(3) వేదశాస్త్ర పురాణములెల్లను శోధించిన ప్రాజ్ఞుండు
సాదరముగ హితసూక్తుల నితనికి సోదర మనచరితము దెల్పు ॥జ

(4) అనవిని లక్ష్మణుం డాంజనేయుగని అనఘా దెల్పెదవినుము
దినకరసుతు సద్భావమువిని వెదకుచు ధీవర వచ్చితి మిపుడు ॥జ

(5) చేయగలము నీచెప్పినవిధ మన చెలగిపొంగి కపివరుడు
పాయని సఖ్యము కూర్చిముదమును జేయగవలె రవితనయునకు ॥జ

(6) అని తలపోయుచు నంజనాత్మజుం డాజగతీపతి రాముని జూచి
అనుజునితో కాననమున గుప్తమ్మర ఘనమగు కారణమేమి ॥జ

వ॥ అనవుడు శ్రీరాముని యాజ్ఞను సౌమిత్రి హనుమంతున కిట్లనియె.

హిం:- ధరణీవిభుడు ధర్మవత్సలుండు దశరథ తనయుడు అగ్రజు డీతడు
పరమపురుషుడు కరుణామయుడు శ్రీరాముం డను నామమున బరగు ॥శ్రీ

(2) ధరణీరాజ్యము విడచియు సతితో తండ్రి యాజ్ఞను వనమున జేరగ
తరలివచ్చితి నే దాస్యంబునుగోరి తమ్ముడ నితనికి లక్ష్మణుడనువాడ ॥శ్రీ

(3) కాననమున వసియించుచు నుండగ దానవుండు మరి సీతను ముచ్చిల
మానిని వెదకుచు రాగమార్గంబున భానుజా గనుమని దనునుతు డిటుబల్కె ॥శ్రీ

(4) భానుతబాడను దెల్పగలడని బోయెను దివికి శాపముదీరియు
వానిగ మేమిట వచ్చితిమిపుడు భాస్కరసుతుడే దిక్కగునంచు ॥శ్రీ

(5) సార్వభౌముడౌ శ్రీరఘువీరుడు సర్వశరణ్యుడు లోకరక్షకుడు
ఉర్వీపతిసుతు డూర్జితయశుడు సర్వజ్ఞుడు రవిజుని శరణన వలసెను ॥శ్రీ

వ॥ ఇవ్విధమున కన్నుల నీరుగార్చుచు బల్కు లక్ష్మణునికి వాయుకుమారుం
డిట్లనియె.

సీ॥ ఈ మనోవైభవ మింద్రియజయమును శీలసంపన్నత జెప్పతరమె
తన భాగ్యగరిమను దినకరాత్మజుడిప్డు చెలిమి జేయగగల్గె చేరిమిమ్ము
హరిస గ్రీవముం డైన యతని వృత్తమువిను డన్నయా వాలి యుత్సాగ్రహమున

అక్రమంబున భార్య నపహరించి యదల్చి పురి వెలార్చెను తమ్ముని భూరిగుణుని
గీ॥ గుందు చున్నాడు పర్వత గుహాలయందు సాయపడుమీకు రవిజుఁడు సత్యముగను
సీత నెల్లెడ వెదకించి చేర్చుమరల ఓ యనఘులార వేగ వేంచేయరయ్య.

జోరః-చక్కఁగ సఖ్యము సుగ్రీవునితో సల్పుము సత్యచరిత్రా
నిక్కము ప్రాణసఖునిగ జూడుము నీలనీరదగాత్రా ॥జ

(2) అంత లక్ష్మణు డలరుచు మదిని హనుమంతుని వాక్యంబులకు
ఇంతయు మోసము తోపదు సుమిత్రా యీతనియెడ అన్నా మది ననియు ॥జ

వ॥ రామా! వాయుకుమారుఁడు గోరునట్లు పోవుదమాయన రాముండట్లే యనెను. అంత మారుతియు చయ్యన భిక్షురూపంబువదలి నిజరూపము ధరించి రామ లక్ష్మణులను తన భుజంబులపై నిడుకొని సుగ్రీవుని సన్నిధిఁజేర్చి,

జోర:-కనుమా రవినుత రామలక్ష్మణులు దినకరాన్వయులు వీరు
మనుకుల వర్ధనుడగు దశరథవర తనయులు పూజ్యులు ఘనులు ॥జ

(2) జనకుని వాక్యము తలదాలిచి సతితో వనముల దిరుగుచు నుండ
దనుజాగ్రణి యొకరుం డాదేవిని గొనిపోయిన గుందుచు వేగ ॥జ

(3) తపము పెంపున జగతీచక్రము ధర్మంబుగ పాలించు
నృపతిసుతుడు నిను శరణు జొచ్చెను కపివర మేలగు నీకు ॥జ

(4) పూజనీయులు పురుషోత్తములు పుణ్యులు వీరల నీవు
పూజింపుము నినుగోరివచ్చిరి పొంగుచు చెలిమిని నిపుడు ॥జ

(5) పావని మాటలు విని సుగ్రీవుడు భయమువిడచి మోదమున
భావమురంజిల మనుజరూపమున భానుజు డిట్లనె వేగమున ॥జ

(6) నాతో స్నేహము చేయదలచిన కౌసల్యాతలనాథా యిపుడు
చేతనుచేయివేయు మనుచు తనచేయిజాప రాఘవుడు ॥జ

(7) సంతసమున తన పాణితలము హరిసత్తము కరమున నునిచి
యెంతయు ప్రీతిని కౌగిలించి భూకాంతుఁడు మైత్రి ఘటించి ॥జ

వ॥ అంత మారుతియు సమిధలనుగూర్చి యాక్షణమున అగ్నిని రగుల్ప రామసుగ్రీవులు వహ్నిని వనసుమంబుల నర్చించి ప్రదక్షిణ మాచరించి సంతోషంబున నెయ్యంబుమీఱ నొండొరుల జూచుచు సఖ్యంబు గావించి ఆనందంబున పరవశు

వైరి. సుగ్రీవుడు పుష్ప పర్ణంబులతో గూడిన నొక శాఖను విరిచి భూమిపై వైచి రామునితోడ దానిపై గూర్చుండ హనుమంతుడు ఒక చందన శాఖను దెచ్చివైచిన లక్ష్మణుండును సవినయంబున గూర్చుండె నంత సుగ్రీవుడు రామా ! నీదు చెలిమి నాకు భాగ్యవశంబున గలిగెనని ప్రణమిల్లి,

జంఝూటి — రూపకం.

ప॥ కావుము నన్ను కమలనేత్ర కరుణతో రఘువీర ॥కా

అ॥ దేవదేవ దీనరక్ష దీర్పవే నాభీతియుఁ ॥కా

చ॥ బలశాలియగా వాలినాదు అలిని చేకొనియు
పలుమరు నను బాధించెడు ప్రాణభయమును బాపుము ॥కా

(2) క్రూరుడైన వానిభీతిని కొండగుహలను దాగియు
వేరుగతియులేకయుండ కూరిమి నిను గాంచితి ॥కా

(3) పరమపురుష పరంధామ నీ పదముల కిదె మ్రొక్కెద
ధరణీశ్వర నవకోసల పురవిహార వేడెదఁ ॥కా

వ॥ అనవుడు.

జో॥- కపినాయక నీ శత్రుని హతుని గావించెద నిదినిజము
చపలాక్షుని రాజ్యంబును గైకొని సౌఖ్యంబుల బొందెద విపుడు ॥జ

(2) సీతారమణీవిభు డిటుపల్కగ చింతవీడి కపివరుడు
ఏతీరున వధియింపగ వచ్చునో వాని నెరిగిరక్షింపుము దయతోను ॥జ

క॥ రామా జగదభిరామా కామితవరదా త్వదీయకారుణ్యమునఁ
భూమీశ్వర ! కపిరాజ్యము భామయు జేకూరు నాకు భానుకులేశా !

జో॥- ఏ రిటుబల్కెడు సమయంబునను ఎడమకన్ను లదరెనపుడు
వారిజాక్షి శ్రీజానకి మణికిని వాలికి దశకంఠునకు ॥జ

వ॥ సుగ్రీవుండు రామచంద్రునితో మరియు,

తే॥ వనమునకు జాయతోగూడి వచ్చుటయును
సతిని రక్కసుఁ డెవఁడో మోసమునఁ గొనుట
శోకభరమున మీరలు స్రుక్కుటయును

మారుతియు దెల్ప వింటిని మానవేంద్ర.

డోర:- వెదకి తెచ్చెదను సీతాదేవిని విడువుము శోకము రామా
మదిలో సందేహింపకు నమ్ముము మరియెందున్నను రణభీమా ॥జ

(2) దశకంఠుం డొకయువతీమణిని తనతోడ నిడుకొనిపోవ
దిశలు బగుల రామా లక్ష్మణయని దీనత్వంబున సతియేడ్వ ॥జ

(3) గనుచుంటిమి మేమందరమును మము గనుగొని యానారీమణియు
తన కొంగున భూషణములు గట్టియు ధరబడవైచెను మాముందరను ॥జ

(4) ధరణిజ యామెయె యని దలచెద మిపుడు ధరణీశ్వర శ్రీరామా
మరి దాచితి మా యాభరణమ్ముల నరయుము మైథిలివో యవి యనగ ॥జ

(5) కాలవిలంబన మేల మిత్రమా కడువడి దెప్పింపుమ యనిన
చాల భక్తిని దెచ్చియిచ్చెను గాలికొమరు డవి వేగ ॥జ

(6) ఆభరణంబులగని శ్రీరాముడు అశ్రులు కన్నులగారగ
శోభనాంగి భూషణములె యివియని శోకించుచు తమ్మునితోడగ ॥జ

(7) రక్కసు డెత్తుక పోవునప్పుడు రమణీమణి జానకియు
నిక్కముగా నిట బడవైచెను జూ మ్మివి చెక్కుచెదరకున్నవివె గనుము ॥జ

(8) అనవిని లక్ష్మణు డన్నా వదిన ధరించిన యాభరణంబుల నెరుగ
అనుదినమును వందన మొనరింతును పదముల కందెల నెరుగుదు యివె యనిన ॥జ

వ॥ ఇవ్విధంబున బలుకుచుండ సుగ్రీవుడు శోకబాష్పపూరిత నేత్రుడై ఇనకులాంబుధి చంద్రా! వ్యసనంబును విడువుము. ఎచ్చట నున్ననుగాని సతీమణినిదెచ్చి నీచెంత జేర్చుట నాభారం బన శ్రీరాముడు కపినాయక! జానకీదేవిని అపహరించిన వాడెందున్నవాడు, ఎరిగింపుము. క్షణకాలంబున బాణంబుల చెండాడి వైరంబు దీర్చికొని సతీతిలకంబు దుఃఖంబు మాన్పెదననుచు,

డోర:- మందహాస వదనారవింద నా సుందరి నెడబాసియును
డెందము గుందగ నెటులుందును నీరజబాంధవతనయా చెపుము ॥జ

(2) హరిణాక్షి యెటులున్నదొ యచ్చట అసురునిచే జిక్కియును
తరుణీమణి సుకుమారి మనోహరి దానెటు జీవించునొ యీధరను ॥జ

(3) తనసతి నిటువలె దలచి రాముడు తల్లడిల్ల గనియు
ఇనసుతు డప్పుడు హితముబల్కెను ఇక్ష్వాకుకులపతి తనయునకు ॥జ

(4) అడలకుమయ్యా ధృతిజెడ నిప్పుడు అంబుజాక్ష నీవిటులు
ఎడమిచ్చిన జాలును శోకము జనుల నీడ్చును దుఃఖాంబుధిలో ననుచు ॥జ

తే॥ ఆలిఁగోల్పోయి కష్టమ్ము లనుభవించుచున్న వాడను నేనిటు లుర్వీరమణ
ధైర్యమే యూతగాఁగొని ధరణియందు బ్రదికియున్నాడ దుఃఖాబ్ధిపార మెఱుంద

హిం:-శౌర్య ధైర్య పరాక్రమ సద్గుణశాలివి శ్రీరఘుకులవర్య రామ
ఆర్యనిందితమగు నీశోకమ్ము నరికట్టుము చెంత జేరనీయకను ॥శ్రీ

(2) హితుడనుగాన బల్కితి రాఘవా యెంతవాడను నీకిటు దెల్పగ
సతతము ప్రియమున సేవింతును నిను సర్వజ్ఞ మరి వేడువాడ నన ॥శ్రీ

(3) కపికులేంద్రుని గ్రుచ్చి కౌగిటజేర్చి గలదే నీవంటి సఖు డీయిలలో
విపరీతంబగు నాతాపాగ్నిని హితసూక్తులను జల్లార్చితివి ॥శ్రీ

క॥ ఆపత్కాలము నరునకుఁ బ్రాపించిన యపుడు వాని నంతికమునకుఁ
బ్రాపగుచుఁ జేర్చికొని తగఁ గాపాడెడు వాఁడె సఖుఁడు కమలాప్తసుతా!

జోర:-దొరకునె నీవలె ఆప్తుడునాకు నెరుగదెల్పితివి హితముగ
సరసిజనేత్రిను జానకి నరయగ హరివర జేయుము యత్నంబుగ ॥జ

(2) సుఖ దుఃఖంబులు సమముగ మనము జూడవలయు నెయ్యమున
సఖుడా నీకష్టంబుల బాపుదు సౌఖ్యాంబుధి దేలుము చాల ॥జ

(3) ఏ కార్యమునే జేయగవలయును ఎరిగింపుము ముదముగను
భీకరాస్త్రముల శత్రుని దునిమి ప్రియముగూర్తు శీఘ్రింబునను ॥జ

(4) అని రాముడు బల్కగ రవిసూనుడు తన మంత్రివర్గములతో
విని హర్షించియు వినయంబునదా ననియెను రఘువీరునితో ॥జ

క॥ శ్రీసీతారమణీశా! దాసమనోవాస దుష్టదైత్య వినాశా
భాసుర రవిసంకాశా నీసరిసఖు నెందుగాన నే జగతీశా!

హిం:-రఘుకుంజర నీవు సఖుడవైతివి గాన జగతిని పూజ్యుడ ధన్యుడ మరియు నే
అఘవిదూరుడనైతిని నీదయ అనుభవించెద సర్వసౌఖ్యంబుల ॥శ్రీ

(2) ధరణిని మిత్రుడు ధనికుడైనను ధనవిహీనుండైననుగాని
అరయగ సుఖియు దుఃఖియుగానీ పరమహితముజేయు ప్రాణ పదంబుగ ॥శ్రీ

వ॥ ఇట్లు సుగ్రీవుడు ప్రియవచనంబులు పలుక, అవుననుచు రాఘవుండును లక్ష్మ
ణుండు నన. మరియు తనఅన్నయగు వాలి తన్నుదరిమిగొట్టి భార్యను అపహరించి

అవమానించి నన్నంతవిడువక ప్రాణంబుదీయుటకు యత్నించెనని యేడువ రాముండు సుగ్రీవునూరడించి "రవిజా! నేసత్యంబుపల్కెద నమ్ముము, నీకు ద్రోహంబు జేసినవానిని ఒక్కబాణంబున నేలగూలవైచెద నీవుక్షసంతసింపగల వప్పుడు" అన సూర్యజుండు వికసితముఖుండై,

క॥ శ్రీరఘుకులవరరత్నమ కోరిన సురరాజ్యమైనఁ గొనివచ్చిడవే
యీ రాజ్యంబననేటికి సారసదళనేత్ర నీదు సాయముకలుగన్ ॥

వ॥ శ్రీరామా! అగ్నిసాక్షిగను మైత్రినొనరించితివి ప్రాణదానము జేసితివిగావున నామనంబును దహించు దుఃఖంబంతయు జెప్పుకొనబూనితి నని కన్నుల నీరు గార్చుచుండ శ్రీరామచంద్రమూర్తి ధీరుండైన సుగ్రీవుని కనులబాష్పంబుల దుడిచి నీయన్నతో నీకెట్లువిరోధంబు గల్గె దెల్పుమన, సుగ్రీవుండు శ్రీరామా! మాతండ్రికిరువురుపుత్రులు. అందు జ్యేష్ఠుండువాలి; నేనుకనిష్ఠుండను. మాతండ్రి కాలంబుజెంద మంత్రులు పౌరసమ్మతముగ వాలికి పట్టాభిషేకంబుజేసి నాకు యువరాజ్యంబు నొసగ నే నతివినయంబున నతని గొలుచుచుంటి. ఒకసమయంబున మయుని పుత్రుడును దుందుభి అన్నయగు మాయావియనువాడు నారీ నిమిత్తమున కలహించి నిశీథంబునవచ్చి వాలిని యుద్ధంబునకు బిలువ అతడు నిదురమేల్కాంచి యుగ్రుడై యుద్ధంబునకు బోవ నేనతనితోడ బోయితి. ఆ రక్కసుడు భయపడి పారిపోవ మేమువానివెన్నంట నతడొక గుహాంతరాళంబు జొచ్చె. వాలియు నన్నురావలదని యెంతచెప్పినను భ్రాతృస్నేహంబున నేవిననైతిని. అంత నాయన్న యొక్కగుహాద్వారంబున "నీవుండుము నేనతనిజంపి వచ్చెద"నని బిలంబులోనికిజనియె. అనంతర మొక్కసంవత్సరంబు జరిగె. అంతవరకు నేనచటగాచియుండ నాబిలంబునుండి నెత్తురుప్రవహించె. అసుర భీకరారవంబు వినబడియె. కాని వాలిగొంతు వినరాదాయె. అంత దుఃఖితుండనై యన్నమరణించి యున్నవాడనియెంచి బిలంబువాకిట పెద్దకొండను ద్రవైచి ఉదకదానంబులుచేసి పురంబుజేర విషణ్ణవదనుండైన నన్నుంగని వాలి మరణించెనని దలచి అరాచకదోషము గలుగునని నేవలదన్నను వినక మంత్రులు నాకు పట్టంబుగట్టిరి.

జో॥:-అంతటవాలియు నసురునిదునుమించి యాగుహవెడలి వేగ
చింతనజేయుచు ననుగానక పురము జేరవచ్చి క్రోధమున ॥జ

(2) తమ్ముడవటరా కూరాసీవు దానవుతో నే బోర
ఇమ్మహినేలగ గుహాద్వారముమూసి ఇటవచ్చితి వౌర దుష్ట ॥జ

(3) పటురోషంబున నాబంధుమిత్రుల బాధలుపెట్టి వెఱనునిచి
కఠినంబుగ ననరానిమాట లని కుటిలత చేకొని నాసతిని ॥జ

(4) పాదంబులబడి వేడిత నిట్లు పట్టణమేలుమి యన్నా
మోదంబున నీ బంట్లైగొలిచెద నాదరించుమని యన్న ॥జ

వ॥ అన్నా ! మరియు నేనచ్చట సంవత్సరము కాచియుంటిని ఆవల దానవుని భయంకరారవము వినంబడ నీకంఠబు వినరాకుండిన మరణించితి వని దలంచి క్రూరుడగు అసురుడు నావెంబడి రాకుండ ద్వారంబున గండశిల నడ్డంబువైచి పురంబు ప్రవేశించితి నిది నమ్ముము. అసత్యంబు లాడలేదు. ఈ మంత్రులు నే వలదన్నను వినక యీ రాజ్యంబున నను నిల్పిరి. నాయందు దప్పేమియు లేదని మన్నింపుమని బతిమాలుకొన్నను వినక వెడలగొట్టె. అంతటితోవిడువక ప్రాణంబులుడీయ ననేకులబంప వారినెల్ల నేజంపితిని. ఈ హనుమదాదుల సహాయంబున ప్రాణభీతిని నీ గిరియం దున్నవాడ. మీరు పంపాసరోవరమువద్ద నుండగ గని నేను వాలిపనుపున వచ్చినవారని దలచి భీతిల్లితి గావున.

ఢోర: నిదురవచ్చునె కంటికి రామ నే నెటుగుడిచెదనన్నంబుగ
మదిలో దుఃఖంబారునె వాలిని మడియజేయకయె మరినాకుగ ॥జ

(2) అనుచు కీశపతి దుఃఖింపగ రాముడనె అడలకు మయ్యా యిటుల
దునిమెద నీదుశత్రుని నాదు సునిశితమగు బాణమున ॥జ

(3) నీశత్రుడె నాశత్రుండగును నీరజబాంధవ తనయా
నీసఖుడే నాసఖుడని దెలియుము నిక్కము నమ్ముము నామాటా ॥జ

(4) మేలుకీడు లొనరించెడువారే మిత్రులు శత్రులు ధరను
వాలియు నీకపకారము జేయుటవలన గూలును శంకింపకుము ॥జ

వ॥ అని శ్రీరామ విభుడుపల్క సంతసించి సుగ్రీవుండు,

ఢోర:-నీరజనేత్రా నీశరమున త్రైలోకముల్ నిటునటు జేతువు మరియు
వీరాగ్రేసరు వాలిబలంబును వివరించెద రఘువర వినుము ॥జ

(2) ఇను డుదయింపక మున్నే వాలియు వనధులు నాల్గు దిరిగియును
అనుదినమును నత డలసటజెందక అర్ఘ్యమొసగి జవమునవచ్చు ॥జ

వ॥ రామా మరియు దుందుభియనువాడు తన భుజగర్వంబున సముద్రుని యుద్ధంబునకు బిలువ అతడు హిమవత్పర్వతంబు కడకు బొమ్మన నతడచ్చటికేగ నేనెంత గాథను కపివరుండైన వాలియొద్దకు బొమ్మనన దుందుభియు నిశీథంబున కిష్కిం

ధజేరి పెనుబొబ్బలిడ వాలియు వానిజేరవచ్చి ప్రాణమ్ములపై నాశగలదేని పారిపొమ్ము లేకున్న యుద్ధంబునకు రమ్మన అతడు వాలిపై కెగయు నిరువుర్ఱు ఘోరునెడ వాలి దుందుభిని హతంబుగావించి విసరివైవ మతంగాశ్రమ సమీపంబునబడి ఆరక్త బిందువులు అమ్మహాత్ము పైబడ కోపించి యీవిధంబున నేదురాత్ముండు గావించెనో యతండు నాయాశ్రమంబు నలుప్రక్కల యోజన దూరంబు జేరవచ్చిన హతుండౌగాకయని శపించి వానికి హితంబాచరించు నీమర్కటంబు లిందుండక పారిపోవుగాక అటుపోవక నిలచియున్న శిలలవునుగాక యనియె. అంత నావార్తవిని యావనంబు జేరిచిన వానరంబులు పారిపోయి వాలికి యెఱిగింప నతండు మతంగ మహర్షి పాదంబులబడి వేడినను అనుగ్రహింప డయ్యె. అది మొదలు వాలి యాప్రదేశంబు చేరరాడు. కావున నేనిటనుండ గల్గితినని యదుగో దుందుభి యస్థిరాశి పడియున్నది. సప్తసాలంబుల నవిగో కనుగొనుము. వాలి వీనిని నిష్పత్రములుగ నొక్కనిమేషంబున జేయును.

జోర:-బలపరాక్రమ శాలివైన నీ బలమెరుగను శ్రీరామా
తెలిసినవాడను వాలిబలము నే బలికితి నిటు గుణధామా ॥జ

(2) అదివిని లక్ష్మణుడా రవిసుతుతో ననెనిటు వేడుకమీరగ
సదయుడు రాముండేమి జేసిన నీ సందేహము దీరునో యనిన ॥జ

(3) కనుమా దుందుభి కళేబరంబును కాలజిమ్మి యొక బాణమున
అనఘాసాలముల్ గొట్టిన మరి నా మనమున ధైర్యము గల్గును రామ ॥జ

(4) అనగను చిరునవ్వొలయగ రాముడు ఆ దుందుభికాయము గనియు
తనకాలి వ్రేలితో జిమ్మిన నదియు దశయోజన దూరము బడెను ॥జ

(5) చక్కగ సప్తసాలంబులను ఒక్క బాణమున గూల్చినను
మ్రొక్కియు రాముని పదపద్మంబుల నర్కసుతుం డిట్లనెను ॥జ

(6) తెలిసితిరామా నీబల పౌరుషములు అలరితి నామదిలోన
ఖలుడగు వాలి నీచే హతుడగు నిల నీసరి యెవ్వరు రణభీమా ॥జ

(7) నీబల శౌర్యము శక్తియుక్తియు నెంచదరమె రఘురామా
నీప్రజ్ఞయు గాంభీర్యము వర్ణింప నెవరితరము గుణధామా ॥జ

(8) పారావార విహీనుడనేను చపలుడ కపివరుడనుగానా
జేరను నీ [illegible] మహిమను బాగడగ ధీరాగ్రణి రఘుకుంజర శూరా ॥జ

కాపినారాయణి – ఆది.

ప॥ పరమపావన నాపాలిదైవమా శరణు శరణు శ్రీ జానకిరమణా ॥ప

అ॥ నిరుపమాన తేజ నిత్యనిర్మల యీ ధరణిలోన నేను ధన్యుడనైతి ॥ప

చ॥ పూనినాడు పూర్వపుణ్య ఫలముచేత భూనాథ నిన్ను బొడగంటిని
దీనజనాధారా దినకరాన్వయురామ నీనెయ్యమున నే కృతార్థుడైతి ॥ప

(2) భువనమోహనా భూతభావన భూరివిక్రమ పురుషోత్తమ
నవకోసలపుర పరిపాల నాథా జగన్నాటకలీల ॥ప

క॥ జేరితి నీ సన్నిధి నే గోరితి నీపాదసేవ కూరిమితోడన్
కారుణి కోత్తమ నన్నిపు డారసి రక్షింపుమయ్య యబ్జదళాక్షా॥

వ॥ ఇట్లు ప్రార్థించు సుగ్రీవునిగని రఘువీరుండు,

హిం:-సోదర వినుమా కిష్కింధకును పోదముర మ్మా వాలినెదుర్కొన
మోదంబున వాని హతమొనరించియు శ్రీదనరగ నిను జేయువాడను ॥శ్రీ

(2) అని పల్కియు శ్రీరామ లక్ష్మణులు ఇనతనయునిగూడి జనియును వారొక
వనమునజేరి యుండిరచ్చట ఘనమగు తరువుల మరుగున డాగి ॥శ్రీ

(3) దినకరసుతుడంత వాలిని బిల్వగ జనుదే నత డిరువురు ఘోరంబుగ
అని చేయుటయు గని శ్రీరాముడు ధనువుదాల్చి వాలిని దునుమ యత్నించియు

(4) ఇరువురి రూపులు తేజము శౌర్యము పరికించియు వాలి భానుజు డిత డని
అరయలేక రఘువరుడంత ఘోర శరము విడువడయ్యె సందేహంబున ॥శ్రీ

వ॥ సుగ్రీవుండు నిందగ్రజుచేతి దెబ్బలకుతాళజాలక రక్తసిక్తాంగుడై పరువిడ వాలి వానిం దరుముచు సుగ్రీవుడు ఋశ్యమూకంబుజేర ఛీ! బ్రతికితివిపోరా! యని శాపభీతి నందుజొరక మరలపురంబు జేరె. రామలక్ష్మణులంత రవిజు నెదుర నిల్వ వారలంగాంచి సిగ్గునతలవంచి శ్రీరాముని కిట్లనియె.

క॥ మేరా యిదిరఘువీరా! ధీరా! యిటు జేయదగునె యార్యహితకరా
శూరా రణధీరా సుకుమారా నినునమ్మియుండ క్ష్మాపతితనయా!

జో॰ర:-రామా నను శత్రునిబారిదోసియు రక్షింపక జూచుచును
భూమీశా యిటు జంపదలచి ననుబొమ్మంటివె ముదమునను ॥జ

(2) పడియుండనె నేనెప్పటియట్లు భానుకులేశ యిపుడు
ఇడుమలుబడుమని తరిమితివే నను యెరుగనైతి నీ విధము

(3) అనియిటు నిష్ఠురభాషణంబులు ఆడగ రామవిభుండు
ఘను డాభానుజు, గౌగిటజేర్చి కడుపే్రమను యిట్లనెను ॥జ

(4) అనఘా నిష్ఠురమాడకు నను మీా యన్నదమ్ములను గాంచ
వినుమీా భేదముగానరామి నే విడువనైతి శరమును వేగ ॥జ

(5) పలుకుల నడకల రూపరేఖలను అలుకల కంఠధ్వనుల
చెలగియు తర్జన భర్జనంబులు జేయుట నిరువురు నొక్కటిగ ॥జ

(6) పోరగవాలియు నితడని దెలియనేరక భానుజ వినుమా
యూరకుంటిని బాణమువిడువక వేరుగ దలపకు నను రవిజా ॥జ

(7) పొమ్మా యుద్ధముజేయగ మరల పుష్పమాలదాల్చి గళమునను
నమ్ముము వాలినివధించెద నిపుడె నాపల్కులు సత్యముగనుము ॥జ

(8) పలుకనసత్యము నిదివర కెన్నడు బలుకనిప్పుడును మరియు
బలుకను కష్టములెన్నిగల్గినను దెలియుము నామది స్థిరము ॥జ

వ॥ అనివచించి లక్ష్మణా యాపుష్పలతందెచ్చి యీా సుగ్రీవుని కంఠంబున వేయు మనిన సౌమిత్రియు నాగజపుష్పలతను హారంబుగ సుగ్రీవుని మెడలోవైచు టయు నతం డద్దానమిగుల దేజరిల్లుచు రామలక్ష్మణులను హనుమదాది మంత్రి వర్గంబును గూడిచనుచుండ శ్రీరామభద్రుండు తరణి కుమారునిగని.

తే॥ మనము తనియుచున్న దీవనముచూడ నెవ్వరిదియన్న నిట్లనె నినసుతుండు
తపమునొనరించి మునులిట ధన్యులయిరి మ్రొక్కుమునులకు రాఘవా మోద
మొదవ

వ॥ అనుచున్నంత నందఱును కిష్కింధాపురంబు చేరవచ్చిరి. అప్పుడు రామభ ద్రుండు.

హిం:-దినకరతనయా భీతిల్లకుము ధీరతగల్గియు దిక్కులు బగుల
ఘనముగ గర్జనచేసి రణమునకు అనఘాబిలువుమి యన్నను మరల ॥శ్రీ

వ॥ అనిన సుగ్రీవుడు ధైర్యంబుతో.

తే॥ సింహనాదంబు జేయగ చెచ్చెఱ గపీంద్రు డదరిపడి సంభ్రమంబున వదనమునను
భీషణాకారుడై యతిరోషమునను వెడలునప్పుడు తానడ్డపడుచు తార

ఖరహరప్రియ - త్రిపుట

ప॥ వలదు ప్రాణనాథ పోవలదు నిలువుమా ॥వ

అ॥ జలజాప్త సూనునిపై చలము బలము జూపఁదగదు తగదు ॥వ

చ॥ నిన్ననోడిపోయి మరల నేడువచ్చినే
యెన్నగ బలవంతు డొకడు ఉన్నవాడు తోడుపడగ ॥వ

(2) యువరాజుగ జేయుమప్పుడె రవితనయుఁ
నవకోసలవాసు రాముని నమ్మిము నామనవివినుము ॥వ

సీ॥ వినుమెఱింగించెద వేగులవాండ్రిచే మనయంగదుఁడు విన్నమాట నిపుడు
తరణికులోద్భవుల్ దశరథతనయులు బలసంయుతులు ధర్మపాలురు నగు
రామలక్ష్మణు లను రఘువంశతిలకులు చేరి యీ కాననసీమయందు
చెలిమి నెఱపిరంట యలరవిసుతుతోడ కపిరాజ్యపట్టంబు కట్టెదనని
కానవైరంబు వలవ దాఘునులతోఁడ జేరబిలిపించి యనుజుని శీఘ్రముగను
ఇమ్మి యువరాజ్యపదము సీతమ్మినకును భక్తిపచరించు కర మనురక్తినతడు

మధ్యమావతి - రూపకం

ప॥ రఘువీరులు సింధుగంభీరులు నవకోసలులు ॥ర

అ॥ అఘదూరు లమరసేవితు లాశ్రితరక్షకులు ఘనులు ॥ర

చ॥ శ్రీమంతులు గుణనిధులు సింహవిక్రములు ధీరులు
భూమీశులు పురుషోత్తములు పుండరీకదళనేత్రులు ॥ర

(2) కమనీయశుభగాత్రులు కరుణారస పరిపూర్ణులు
విమలమానస సంచారులు విశ్వవిభులు విశదయశులు ॥ర

క॥ చనువున ప్రియమున బలికెద దినకరసుతు నెడలనిట్లు తీఱని కినుకఁ
మనమున విడువుము దయగను మనుజుఁడు బంధువుఁడుగాఁడె యనఘా యెందుఁ

దోర:-అని వినయంబున వేడెడుసతిగని పల్కెను కినుక మహేంద్రుని సుతుడు
ఘన బలశాలివలె గర్జించెడువాని వనితావిడుతునె యిపుడు ॥జ

(2) ధర్మాత్ముడు శ్రీరామచంద్రుడు తరుణీమణిరో వినుమా
నిర్మలు డాతండేల వధించును నిష్కారణమున నను చెపుమా ॥జ

పూర్ణ షడ్జమము — రూపకం.

ప॥ తారకనామముగల శ్రీరాముడు ॥తా

అ॥ నారాయణు డాదిమూర్తి నరుడై యవతరించె ॥తా

చ॥ వేద వేదాంత వీధుల విహరించు మహాత్ముడు
భేదాభేద రహితుడు భీమబల సంయుతుడు ॥తా

(2) భూభార హరణార్థము భువిచరించుచు
గోభూసురవరుల బ్రోచు తాభానుకులేశ్వరుడు ॥తా

(3) ధర్మాత్ముడు నవకోసల వరధాముడు
నిర్మలు డతి నీతిపరుడు నిరవధిక సుఖప్రదుడు ॥తా

జో॥:-పౌరుషంబు విడనాడరు శూరులు ప్రాణంబులె ఘనమనుచు
పౌరుషహీనుని మదమణచియు నే వడతీ వచ్చెద నిపుడు ॥జ

(2) చంపను భానుజు శత్రువటంచు సత్యము బల్కితి వేగ
బంపుము నన్నను ప్రియముదలిర్ప నీ భావము రంజిలచాల ॥జ

(3) భామా అంతిపురమ్ములోనికి పొలతుల గూడియు లేమా
నెమ్మది నుండుము విజయముగైకొని నేవచ్చెద గుణధామా ॥జ

(4) అని బల్కెడు విభునకు మ్రొక్కి అతివయేడ్చుచు నపుడు
వనితలగూడుక బోయెనుతార వాలిబోయె విధిమూడుటను ॥జ

ద్విపద:-వాలిరోషమువిూఱ నేతెంచి యంత | మాలితనూభవు మఱికాంచి యనిరె
ఏలరా రవిసుత యిదేనాడుముష్టిం | గూలెదు ననుగెల్వం జాలెదే యనిన
ఇనసుతుండిట్లనె నిదేనాడుముష్టి | నినుబోలియించెద నీతలబగుల
నని బల్కుచును వార లతిరోషముునను | ఘనముగా యుద్ధంబు గావించిరపుడు
తరులతో గిరులతో కరములతోడ | మరియు నొండొరులను మర్దించుకొనుచు
నరిగబోరిరివారు గిరి గిరివలెను | హరి హరివలె నిర్వు రటు బోరుచుండ
హరిసుతుంబల మంతకంతకు హెచ్చె | అరయరవిసుతుంబల మంతకు తగ్గ
పెనునెత్తుటనుదోగి గినుకనువనట | మనమున రోషంబు మల్లడిగొనగ
వెనగుచు వాలితో గనుచు నర్దనలు | దినకరసుతుడిటు దిక్కులుజూడ
కనుగొని శ్రీరాముడు గొనకొని యింద్ర | తనయుని జంపగ ఘనమగు శరము

బంధించివింటను వరగున విడువ | వర తెంచి యది వాలి యురమునునాట
గూలెను ధరణిపైఁ గొండచాడ్పునను | వాలితా తేజంబు దూలఁగానప్పుడు.

ఘోర:-అంతట రాముడు తమ్మునితో తనచెంత నిలువగని వాలి
యొంతయు శోకము రోషము బెనగొన నిటులనె రాముని జూచి ॥జ

(2) అరవిందాక్షా ఏమిజేసితిని అపకారము నీకిపుడయ్యా
మరుగున నుండి జంపితివేల మనుకులవర్యా చెపుమా ॥జ

(3) నీతియు సత్యము ధర్మమార్గము నెరుగును రాముండనెడు
ఖ్యాతిని బోఁగనడచియు నీవిటు గావింపదగునె నిర్దయను ॥జ

(4) ధర్మాత్ముండగు దశరథ నృపతికిఁ దనయుడవై బుట్టియును
ధర్మమువిడచి కౄరుడవగుచును దగునే యిటుజేయగను ॥జ

(5) బుద్ధిలేనిపని చేసిన నినుగని పెద్దలు ఛీ పొమ్మనరె
పెద్దమానిసివలె దిరుగెదెటు పేరు పెంపు విడనాడి ॥జ

(6) విల్లునంబులు దాల్చియురాజ వేషంబున జరియించు
కల్లరివాడవుగాక నృపుడవే కటికివాఁడ వనదగు నిన్ను ॥జ

(7) కోతి మాంసము గోరరెవ్వరును గోరితివేల దినగా
ఘాతకుడవు మరియాద యెఱుంగవు గనుగొంటిని మాయావేషా ॥జ

తే॥ తారవలదన్న వినక నే ధీరమతిని ధరణిపాలుడు రాముండు ధార్మికుండు
ఏల ననుజంపు భయమునీకేల యనుచు వచ్చి చచ్చితి నీచేత వసుమతీశ.

తే॥ ఎదుట నిలబడి నాతోడ నినకులేశ కదనమును జేయజాలవు గాననిపుడు
చాటుగానుండి నన్నిటు జంపినావు శూరుడవె నీవు మగటిమి చూపుటిట్లె?

హిం:-దెలుపవైతివి నీకథనాతో ఖలుడగు రావణు గట్టివేసియు నే
జలజాక్షిని యరక్షణమున దెచ్చి నిలుపనె నీచెంత మనమలరగను ॥శ్రీ

(2) పాతాళంబున నునిచినగానీ భీతిలియబ్ధిని దాచినగానీ
సీతాభామిని నొసగనెనీకు భూతలనాథ శ్రీరామచంద్ర వేగ ॥శ్రీ

(3) ఇంతమాత్రంబునకై సుగ్రీవునితో హితముగ సఖ్యముజేసియు నీవిటు
పంతంబున వాయుసువులు బాపితి భానువంశజ సత్యపరాక్రమ శాలివె ॥శ్రీ

వ॥ అని పల్కుచు శరవేదనను నోరెండిపోవ నూరకుండిన,

జోర:- కాంతిమాసిన చండకిరణుగతి గమనముడప్పిన కరివలెను
భూతలమున బడియున్న వాలితో సీతాపతి యిట్లనెను ॥జ

(2) ఎరుగవు నీతిధర్మశాస్త్రముల నిటు నను దూషించెదవు
కోరమాలినవి నీతులు బల్కెదు కోతిచేష్టలవలనను మరియు ॥జ

(3) ఎరుగుమి యీధరణీతలమెల్లను నిక్ష్వాకువంశజులదనియు
భరతుని యానతి నీవనగిరులను చరియించెదము వినుము ॥జ

(4) ధర్మమునిలిపి ధరణిస్థలిని యధర్మము బాపుట కొఱకు
ధర్మేతరులను వెదకివధింతుము ధర్మమార్గమున మేము ॥జ

(5) తమ్ముని భార్యను చేకొనినట్టి యధర్మరతుడవు గాన
దుర్మతి నిన్ను జంపుట నాకు దోషము లేదిది గనుమ ॥జ

(6) ధరణీతలమున రాజచంద్రు లధర్మపరులను గనియు
మరివారిని దండించక విడచిన నాదురితము బొందెదరనియు ॥జ

(7) ఏటికి నన్నిటు దూలనాడెదవు నోటికివచ్చినయటుల
చాటుననిల్చి మృగములనేయరె క్షత్రియు లీధరలోన ॥జ

(8) అనిపల్కగ నింద్రజు డౌననిమదిదలచి వినయోక్తులతో నిట్లనెను
ననుక్షమియింపుము రామచంద్రవిభు కినుకమాను దయతోను ॥జ

క॥ శ్రీకర దామోదర హరి ప్రాకృతుడని దలచి నిన్ను బహుభంగులనే
నాక్రోశించుచు బలికితి నీకృపకు పాత్రుగాగ నేలుము నన్నున్

భైరవి - ఆది

ప॥ రామా దయజూడర భూమిజా మనోహర ॥రా

అ॥ కామారిసన్నుత పదకమల కరుణాలవాల ॥రా

చ॥ అరవిందదళాక్ష ఆశ్రితావనదీక్ష సురుచిర ఘనవక్ష శరణు లోకాధ్యక్ష ॥రా

(2) నిరుపమానాలంకార నీలమేఘ శరీర శరచాపధరధీర స్వామి శ్రీరఘువీర ॥రా

(3) జ్ఞానానంద శ్రీరమణా కాకుత్స్థ వంశాభరణా
మౌనీంద్ర వందిత చరణా మహి నవకోసల భూరమణా ॥రా

డోర:-కూరిమి నాముద్దు కొమరుని దలచి నే కుందెదమదిలో రామా
కారుణికోత్తమ బాలుడంగదుడు గారవింపుమా ప్రేమా ॥జ

(2) భరత లక్ష్మణులవలె భానుజు నంగదు భావింపుము కృపమీరగ
మరియును తారను మన్నింపగ నీవు మఱిమఱివల్కుము రవిసుతుతోగ ॥జ

(3) బాణవేదనను సహింపజాలక పరితపించుచు చాల
దీనుండై ప్రార్థించెడు వాలిని దేర్చుచు నతిదయతోడ ॥జ

(4) కలుషములెల్ల నశించెను నాచేతను బొలియుటచే కపివీరా
గలుగునిపుడె స్వర్గాది భోగములు విలపింపకు తెలియుము ధీరా ॥జ

(5) వగవకుమయ్యా యంగదుకొరకు వాసవనందన నీవు
సుగుణాకరు సౌమిత్రి సమునిగా జూచెద భయమును వీడు ॥జ

వ॥ అను రాముని పల్కు లాలకించి వాలి శ్రీరామా! నీకృపకు పాత్రుండ రక్షింపు మనుచు శరవేదనచే మూర్ఛిలి పడియుండెనంత నట తార వాలి మరణంబువిని భటవరంబుతోడ అంగదునిగూడి రణభూమి కరుదెంచి.

డోర:-ఏలను నాకీ రాజ్యభోగములు ఏలను సుఖసంపదలు
వాలితోడిదె లోకము నాకు వానరులారా యిపుడు ॥జ

వ॥ అని విలపించుచు వాలినిడగ్గరి హా నాథా, నాథా నాగతియేమి యని మొర లిడుచు వనితామణి శ్రీరామ లక్ష్మణులను దినకరతనయుని గనుచు,

ఆ॥ ఇంద్రతనయ యిట్టులిచ్చట శ్రీరామచంద్రు శరముచేత చచ్చినీవు
నాకమునకుఁబోవ నాధయింకే నెట్టులుందు మందభాగ్య నుర్విలోన.

సీ॥ నను విడనాడుట న్యాయమా కపివీర కనులెత్తిచూడవు గారవమున
విలపించుచుండు నను బలుకరింపవిదేల బిలువ వంగదునైన ప్రీతితోడ
యిదె నీదుసతులెల్ల ఏడ్చుచున్నారు ఆదరించవిదేల హర్షమునను
కటిక నేలమీఁద నిటుపరుండగనేల కనకశయ్యనువీడి వనచరేంద్ర
రఘుకులాంబుధి చంద్రుడౌ రామవిభుని బాణనిర్భిన్న వక్షుడై పడియు నేల
నెత్తుటనుదోగియున్నట్టి నిన్ను జూచి పగులకున్నది నాగుండె బ్రద్దలుగను

డోర:-దినకర తేజా వచ్చెదనీతో మనజాలను నేనిలను
అనుచును గుండెలు శిరమును మోదుకొనుచును దుఃఖమున్మనను ॥జ

(2) ఏరా అంగద తండ్రియని నీవెవరిని బిలచెద వింకా
రారా ముద్దులతనయా జనకుని జేరగ కూరిమి మీరా ॥జ

(3) ఈ దుఃఖాంబుధి నెట్టుదాటుదును ఎవరుదిక్కు ధరనాకు
నాథా నేజీవింప ననుచు పెనురోదనంబు జేయుచును ॥జ

వ॥ ప్రాయోపవేశంబు గావించెద నిక క్షణముండజాల నని విలపించుచుండ ఆంజ
నేయుం డిట్లనియె.

జోర:-బాలు డంగదుని జూడుము ప్రేమను పలవించిన ఫలమేమి
కూలెను వాలియు కాలమువచ్చి క్రూరకృత్యములుజేసి ॥జ

హిందూస్థాని తోడి - రూపకం.

ప॥ ఇంత భ్రాంతి యేలతార విడువు మిపుడు దుఃఖము ॥ఇ

అ॥ వింతలె భువిబుట్టి చచ్చుట లెరుగవె యెల్లవారలున్ ॥ఇం

చ॥ నీటిబుగ్గలు ఈతనువులు నిలువవు క్షణభంగురములు
ఏటికి విలపించెదవిటు విధిమూడిన బ్రతుకగలరె ॥ఇం

(2) ఏలెను రాజ్యమువాలియు బహుకాలము మన్నించి కపులన్
గూలెను రఘువీరునిచేతను ఘోరపాపంబుల బాసియును ॥ఇం

(3) వీరస్వర్గము నందినట్టి యీధీరుని కై వగ పేల
నారీమణి శాంతింపుము చేరి నవకోసలరాముని నమ్ముము ॥ఇం

జోర:-నీ తనయుడు కపిరాజ్యము చేయగ జూతువు మోదముతోడ
భూతలమునబడి శోకింపకుము పుత్రుడుండ నీవిటుల ॥జ

(2) తలపగ సుకృతదుష్కృతంబుల వలనను సుఖదుఃఖములు
గలుగుచుండును జీవకోట్లకు తెలియుము తత్వంబిదియు ॥జ

వ॥ ఇట్లుపల్కు నాంజనేయునిగని తార నాయనా నూర్గురు పుత్రులైనను భర్తతో
సాటి యగుదురే?

జోర:-ఎవ్వతె నేను రాజ్యమునిలుపగ నీపుత్రుని రక్షింప
ఎవ్వరికెవ్వరు హితముదెల్పుటకు విభునికన్న భువిలోన ॥జ

(2) అని పల్కెడు సమయంబున వాలి అటునిటు కదలియు నపుడు
గొనయూపిరితో శ్వాసనువిడుచుచు నినతనయున కిట్లనెను ॥జ

ద్విపద:-వినుమిటు సుగ్రీవ మును విరోధములు | మనమున నెంచుచు ననుదూరవలదు
మనమిర్వురముగూడి మనియుండలేక | అనుజ నిన్నెడలంగ నడచితి నేను
భావిఫలంబిట్లు బట్టెనన్నిఁడ్చె | దైవకృతంబిది చాటంగవశమె
వనచర రాజ్యంబు గొనియు భోగముల, అనుభవించుచు నుండుమయ్యా నీవింక
అనఘ యేడ్చుచునున్న యంగదునిపుడు | ఘనకృపాదృష్టిచే గనుగొనుమయ్యా
గారవంబున వీని గాంచి యతిప్రేమ | ధీరుడు బాలుడు నేర డెద్దియును
నీతో సమానుడు నీసుతుండనుచు | ప్రీతితో మన్నింపు భీతియుమాన్పి
అనఘ సర్వజ్ఞురాలైన యీతార | మనము రంజిలజేయుమా యినతనయ
యెరిగిదెల్పు హితమ్ము వినుమి యామాట | సరసగుణాన్విత సద్గుణశీల
పోవుచున్నాడ సుధీవర్య దివికి | భావమున నాపల్కు పాటింపుమయ్యా
మరియొండుదెల్పెద మరువకుమదిని | సరసీరుహాక్షి యాజానకీ రమణి
అరసి యెల్లెడ స్వామి కర్పింపుమయ్యా | జేయు మీకార్యంబు శీఘ్రంబుగాను
జేయకుండిన నీకు చేటువాటిల్లు | వీరు డా యంగదు జేరి శ్రీరాము
కార్యముల్ నెరవేర్చు కడు భక్తితోడ.

వ॥ సుగ్రీవునికి బుద్ధులుచెప్పి ముద్దుకుమారుండైన అంగదుని గని.

తే॥ తనయ సుగ్రీవుడే నీకు తండ్రి యతని ననుసరించుచు జెప్పినపనులు జేయు
వినయ భయములు జూపుము చనవువిడుము ఘనునిరాముని కరుణను గలిగిమనుము

వ॥ అంగదా యుక్తాయుక్తంబు లెరింగి సమయోచితంబుగ మెలంగుచుండు అని బల్కుచు పండ్లుగీటుకొని గుడ్లుగిరగిరందిరిగి వాలి మరణించె నప్పుడు అగచరేంద్రులెల్లరు దుఃఖింపుచుండ తార మృతిజెందిన విభునిమొగంబున మోము జేర్చి రోదనంబుజేయుచు నాథా నన్ననాథనుజేసి యీ లోకంబు వీడిపోయితే నీచే ఎందరో శూరులీల్గిరి వారివలె సుగ్రీవునిచే నీవును నేలంగూలితివి నీకన్న సుగ్రీవుండే శూరుండయ్యె దీనుండై యేడ్చు నంగదునేలదేర్చవు? రక్తసిక్తాంగుండవై నేలబడియుండు నిన్నుగని నాగుండె తునుకలై పోవదుగా! ఆహా కటికరాయింగా బోటు! దేవ రాజ్యశ్రీలక్ష్మినిబాసి పోయితివే? సుతులెందరున్నను సతికి పతియే దైవంబు; పతిలేని సతికి యిహపరసుఖంబులు దక్కవేయుండు అంగదుండును నేనును దిక్కులేనివారమైతిమి ప్రాణప్రియా! నిన్నువిడిచి విధవనై యెటుల జీవింతును? నీవక్షంబున వెలుగు శృంగారంబగు రత్నమాల యెందుబోయె?

రాముని ఏకబాణంబుచే నిన్ను హతంబుగావించి సుగ్రీవుండు వైరంబుదీర్చు
కొనియె నీవు యుద్ధంబునకు పోవలదని నే నెంతవేడినను నా మాటవినవైతివి
అని పెక్కుభంగుల విలపించుచు పర్వతగుహాంతరాళంబులు ప్రతిధ్వనులియ్య
నేడ్చుచు అంగదుని చూచి.

డోర:- తనయా నీదుతండ్రిని జూడుము కనజాలవ యిక నెపుడు
జనకుని పాదంబులకు మ్రొక్కుమన విని మ్రొక్కెను తండ్రికి నపుడు ॥జ

(2) తనయుడుమ్రొక్కిన దీవించవు నీ కనులజూడవైతివి యిపుడు
దినకరసుతు వగదీరెనె మాకుదిక్కెవ్వరు కపివర యనుచు ॥జ

(3) అతిదుఃఖంబున నేడ్చుచునుండు నా తారను నంగదుగనియు
మితిమీరిన శోకంబున సుగ్రీవుడు తనమిత్రుని రాముని గనియు ॥జ

(4) రామా నేనీ రాజ్యభోగములు కామించను సత్యంబు
నామది దుఃఖము మీరెను భ్రాతయు మరణించిన కతమున నేడు ॥జ

(5) తారాంగదు లీరీతినేడ్వగని నేనేరీతి సహియించెద నెదరు
క్రూరుడ దుష్టుడ నన్ననుజంపిన ఘోరకర్ముడను నేను ॥జ

(6) వాలితోడ నే బోయెద భువి మనజాలను శోకముతోను
నీలవర్ణ సీతమ్మనువెదకియు నీ కర్పించెద రీకపులు ॥జ

(7) ఎన్నిమారులో క్రిందబడియు నే తన్నుగొనగ వాలీ
మన్నించియు నను పొమ్మనిబల్కెను మహాత్ముడు గుణశాలి ॥జ

వ॥ కాన రామచంద్రప్రభూ యీ హనుమదాది కపులు నీకార్యమును సాధించి
సీతను దెచ్చెదరు. కామరోషంబులు బాధింప తోబుట్టునుజంపిన మహాపాపిని.
నావలన నీయంగదాదుల కెల్లరకు దుఃఖంబుగలిగె. నాకేల సుఖంబులు? బాలుం
డైన యీ అంగదుడు జీవించునోలేదో అను భయంబుచే నామనంబు వణకెడి.
ఎప్పటియట్ల ఋశ్యమూకమున బడియుండెద లేక అన్నతోడి పరలోకంబునకు
బోయెద నాకనుజ్ఞ యొసంగుమని రాముని వేడ శోకానలతప్తుండైన సుగ్రీవుని
గని తానును బాష్పకులలోచనుండై ముహూర్తకాల మూరకుండె. ఆసమయం
బున తార చాపబాణధరుండగు రామచంద్రునింగని యతడే ఇక్ష్వాకు వంశో
ద్భవుండగు రాముడని తెలసి విలపించుచు నిట్లనియె.

ఆనందభైరవి - ఆది

ప॥ పరాత్పరా రఘువీరా దయజూడరా సుధీశ్వర ॥ప

అ॥ పరాకుసేయకు సురేంద్రవంద్య పురాణపురుష నామొరాలింపరా ॥ప

చ॥ శరణు శరణు దేవ శరచాప శోభితహస్తా
వరగుణోత్తమ నవకోసలవాసా శ్రీరమేశా ॥ప

జోర:-వాలిగూలిన బాణముతోనను గూలనేయుము రామా
శ్రీలోలా నాభర్తను నన్నుజేర్పుము సద్గుణధామా ॥జ

(2) ఘనముగ స్వర్గాది భోగము లనుభవించుచును వాలీ
ననుదలపోయుచు దుఃఖించును మది జననాయక యిదివినుమీ ॥జ

(3) ఘనుడగు నాపతిచెంతనుజేర్చి గట్టుకొనుము పుణ్యంబు
ఇనవంశోద్భవ సతిలేని దుఃఖము నెరుగుదువయ్యా నీవు ॥జ

(4) నీవెటు సీతనుదలచి కుందెదవో నావిభు డటువలె నిపుడు
దేవలోకమున ననుదలచి గుందును గావున నటుబంపుము నన్నిపుడు ॥జ

వ॥ ఇవ్విధంబున దుఃఖార్ణవ మగ్నయై వాపోవ తారనుగని శ్రీరామచంద్రుం డిట్లనియె.

నాటకురంజి — ఆది.

ప॥ తారా విధి దాటవశమా ధైర్యముగనుమా ॥తా

అ॥ శూరుడు నీపతి చేర స్వర్గమునకు వీరునిసతివై విలపింపరాదు ॥తా

చ॥ నీరజ సంభవుడు నిర్మించి జీవుల వారివారి కర్మవశులజేయు
నేరక జగతితరింప నిరతము సుఖదుఃఖములకు లోబడు ॥తా

(2) నవకోసలుని దలపక నిల నరులకు గతి గల్గునా
యువతీమణి వినుమునామాట యోరుపు సతులకు సద్భూషణము ॥తా

వ॥ సాధ్వీమణీ, సర్వజ్ఞురాలవైన నీవిటు దుఃఖింప తగదు. నీపుత్రుండు యువరాజై యుండ సంతోషింపగలవని, తారకు దుఃఖోపశమనంబుగ బల్కి సుగ్రీవాంగదుల జూచి మీరిటు శోకింపుచుండిన పోయినవారు మరలివత్తురె శూరాగ్రేసరుం డగు వాలి సకల సామ్రాజ్య సౌఖ్యాంబుధి నోలలాడి వీరస్వర్గంబుజేరె. అతనికై

వగ పేల. మీర లిక కాగలకార్యంబులు గావింపుడని లక్ష్మణ సహితుండై యూరడిలంబల్కి కాలయాపనం బేలన సుగ్రీవాది వానరులు శిబికదెప్పించి దానిపై వాలి కళేబరంబునిచి వానరవీరులు అంగద సుగ్రీవాదులతో తారాది కాంతలును హాహాకారంబులు జేయుచు నదీతీరంబు జేరి శ్రీగంధపు చెక్కల చితినేర్పరచి కపివీరులు వాలికళేబరంబు అందుంప అంగదుడు అగ్ని సంస్కారంబు గావించి సుగ్రీవాంగదాదులు హరివీరులు తారాదిసతులును నదీజలంబున స్నానాదు లాచరించి సుగ్రీవాంగదాది ముఖ్యులు ఉదకదానం బొనర్చి నందరు దుఃఖించుచు కిష్కింధ జేరిరంత సుగ్రీవాంజనేయులు శ్రీరామచంద్రుని సన్నిధానంబు జేరవచ్చిరప్పుడు హనుమంతుండు శ్రీరామ చంద్రునకు మ్రొక్కి యిట్లనియె.

హిం:-శ్రీరఘురామా నీదయచేత హరివీరునకు సర్వసౌఖ్యము లమరె
జేరియు కిష్కింధకు మోదంబున జేయుము అభిషేకము శ్రీరామ ॥శ్రీ

(2) అని హనుమంతుడు వల్కిన రాముడు దినకరతనయుని గని యిట్లని పలికెను
అనఘా రాను నగరమునకునే వనముల నుండగ జనకునాజ్ఞగద ॥శ్రీ

(3) హనుమదాది కపివీరులు నీకు అభిషేకము గావింతురు ప్రియమున
ఘనమగు వర్షాకాలము గడపి నను జేరగరమ్ము జనకజ వెదుకగ ॥శ్రీ

తే॥ అంగదుని యౌవరాజ్యమందునిల్పు మనుచు రాముండుపల్కగా నర్కసుతుఁడు
సచివులనుగూడి పురి కేగి సంతసముఁన గూరిమిని తారగని యూరడించె.

వ॥ అంత సుగ్రీవునికి కపులందరు నమస్కరించి సంతోషంబున పరివేష్టించి పొగడుచుండి రట్టియెడ సుగంధమిళిత వస్తువులను పుష్పమాల్యాదుల అగ్నినర్చించి హోమంబుగావించి రత్నదండ ఛత్రచామరంబు లమర సువర్ణ రత్నపీఠంబుపై సుగ్రీవుని గూర్చుండబెట్టి హనుమదాది కపిముఖ్యులు నదనదీ జలంబులతో

హిం:-శుభముహూర్తంబున కపిరాజ్యమునకు సుగ్రీవునకు సంతోషంబుగ
అభిషేకము గావించిరి కపులు అంగదునకు యువరాజ్యం బొసగిరి ॥శ్రీ

(2) హితమతి రాజ్యముగొని సుగ్రీవుడు నింపుమీరగ రుమతోగూడి
అతులిత వైభవమలర నుండెను చతురత మంత్రి సామంతులు గొలువగ ॥శ్రీ

తే॥ అచట శ్రీరామచంద్రుండు ననుజుతోడ, పరగ ప్రస్రవణంబను గిరిని జేరి
కడుమనోహర మాగిరిగహ్వరంబు మనకు నుండగ యోగ్యంబు గనుము వత్స.

జో॥ర:-కనుమా యీకొండకు కిష్కింధ కడుసమీపమగు గావునను
ఘనముగ కపులకోలాహలములు వినబడెనిదె వాద్యధ్వనులు ॥జ

(2) కావున మన మిందుండియు వర్షాకాలము గడుపుద మనుజా
భావమలర నీకమలాకరములు ఫలపుష్ప భూజముల గనుచు ॥జ

జో॥ర:-శ్రీయుతమా తరులతల్ గూడి చెలువము జూపెడు వనము
ఛాయని పరిమళ మొల్లెడలను బర్వుచున్నది గనుము ॥జ

(2) ఇంతరమ్యమై యున్నను చూడగ నింపుగాదు నామదికి
చెంతను జానకియుండిన నాకు సంతోషంబగు నీగిరిని ॥జ

(3) అనుచును బాష్పాకుల నయనుండగు నన్ననుగని లక్ష్మణుడు
అనఘా శోకించుట నీవంటిఘనునకు దగునా మరియు ॥జ

(4) శోకము సకలానర్థ హేతువగు, శోకముచే మదిచెడును,
శోకము నాశముగావింపును మరి సుఖముగందు వీవిపుడు ॥జ

(5) శత్రుని హతముజేయును వేగమె పుత్రమిత్ర బాంధవులతోడ
ధాత్రీవర నీవెరుగని నీతియు ధర్మమున్నదే యనిన ॥జ

(6) తమ్మునిమాటలు విని శ్రీరాముడు ధైర్యము శౌర్యము మీఱ
న మ్మహిజాతను మ్రుచ్చిలు రక్కసుఁ యమపురి కనిపెద వేగ ॥జ

(7) మరచునె మనయుపకారము మది దా అరవిందాప్తుని సుతుడు
ధరణిజ వెదకగ తడయకవచ్చును తరుణమరయుచు నతడు ॥జ

తే॥ ఉరుములెల్లెడ వినవచ్చె మెరుపులడరె, మూలగాలియు వీచును జాలనిపుడు
కురియు నల్లడ మేఘముల్ కుంభవృష్టి యహహా యెటు లోర్తు నీకాల మనుజచెపుమ

తే॥ చలికి వానకు జడియుచుఁ బులుగులైన వెలికిరాకున్నవి కులాయములను విడచి
మనము నీగిరిగుహాలోన వర్ష ఋతువు కడపుదము రమ్ము తమ్ముడా తడయకిచట

వ॥ అనుచు ననుజునితో గుహాంతరాళంబున వానకాలంబు నెల్లెట్లో నెట్లు నట సుగ్రీవుండు స్త్రీలోలుండై యుండ ఆంజనేయుం డది యెఱింగి సుగ్రీవునితో.

క॥ సీతారమణిని వెదుకగ చేతోమోదంబుతోడ జేయక యత్నం
బీతీరున హ్రీ భీయును నీతియు విడనాడదగునె నీకు కపీశా

వ॥ స్త్రీలోలుండవై సమయాతిక్రమణంబుచేసితివి రాముని బలశౌర్యంబులు మఱచితివె నీ కుపకారంబు గావించిన రఘువీరుని కార్యంబుఁ జేయకుండుటయు

చేసిన బాసతప్పుటయు నీతిశాలివగునీకు దగఁ దన సుగ్రీవుం డొకపక్షంబులోపల
పర్వతగుహాదుల యందుగల వానర భల్లూకంబుల రప్పింపుమని అంగదుని
నాజ్ఞాపించి తానంతఃపురంబు ప్రవేశించి యథాస్థితినుండె ఇచ్చట గుహాంతరా
ళంబున పరితపించుచు రాముఁడు సమయాతిక్రమణ మగుటయు సుగ్రీవుండు
రామికి వగచుచు.

దో:-తమ్ముఁడ కిష్కింధకు బొమ్మీ వేగ రవితనయుని గనుగొనుమీ
అమ్మహిజాతను వెదకగనిప్పుడె రమ్మసైన్యముతో ననుమీ ॥జ

(2) అతికాముకుడై ప్రీతినదప్పియు సతులను గూడి యుండు
మతిహీనునిగని వాలిగూలినది మరచితివే యని యనుము ॥జ

(3) భ్రాతనుజంపిన బాణము మరి మా చేతనున్న దనిపల్కు
నీతి నిషిద్ధము లేక చరించెడు కోతిగుణము లివియని పల్కు ॥జ

(4) ఆమాటలువిని సౌమిత్రియు దా నధిక కోపమును మించ
తామసింపకబట్టి వధించెద ధర్మహీను రవి సుతుననిన ॥జ

క॥ అనుజా శాంతముతోడను జనుమా కిష్కింధ కిపుడు జలజాప్తసుతున్
గనియును సప్రేమంబుగ వినిపింపుము నాదునుడులు విశదముగాఁగన్.

వ॥ లక్ష్మణుం డన్నచే ననుజ్ఞాతుండై కిష్కింధకు కోపతామ్రాక్ష వదనుండై వచ్చిన
లక్ష్మణుని కపివీరు లెల్లరుంగని భయభ్రాంతులై సుగ్రీవునిజేరి మొరలిడ, అతం
డది వినడయ్యె. సౌమిత్రియు అంగదునిగని నీపినతండ్రికి నారాక దెల్పుమన
నాతండు సుగ్రీవునింగని సౌమిత్రి కోపరక్తాంత నేత్రుండై వచ్చియున్నాడని విన్న
వించుటయు ఆనుడులు పెడచెవినిబెట్టి మర్కటాధిపుడు మత్తుండయి యుండం
గని వానరులు హాహాకారంబుచేయ కొంతవడికి తెలివొంది కపిసత్తముండు అల్ల
నల్లన కన్నులు తెఱవ మంత్రు లిట్లనిరి.

దో:-ఘనుడు లక్ష్మణుడు రోషభీషణా కారుండై యిటువచ్చియును
నిను బిల్వగ దానంగదు బంపెను గనుమా వేగంబునను ॥జ

(2) ఉగ్రుండై మరి వాకిటనిలబడి యున్నవాడు లక్ష్మణుడు
శీఘ్రంబునజని యడుగులబడుమిపు డాగ్రహంబు విడచు నతండు ॥జ

(3) శ్రీరాముని కార్యము నీవు జేసెదనను తరుణము దాటన్
శూరా నీతో మాటలాడ నీ వీరుడు వచ్చెను జేరన్ ॥జ

వ॥ అనవుడు,

హిం:-ఈ మహాత్ములకు నే నెదురాడను ఏటికి నాపై యింత కోపము
ఏమి యపకృతిజేసితి వారికి నామది తెలిసి తెలియక నిపుడు ॥శ్రీ

(2) ఎవ్వరు నాపై వైరముచేత నెరుగ దెల్పిరో కాని మాటలు
ఇవ్వనజాతుడు లక్ష్మణుండిపుడు ఇంత క్రోధమున రాగతమేమి ॥శ్రీ

(3) చేయగవచ్చును స్నేహము జగతిని జేసిన సఖ్యము నిల్పుట కష్టము
పాయక నే రఘువీరుల సేవను జేయుచుందు భక్తి స్నేహములమర ॥శ్రీ

వ॥ కాన నాకేమిటను భయంబులేదు. సత్యంబు దప్పినందులకై వెఱచెద నన సుగ్రీవునికి పవనజు డిట్లనియె.

సురటి – రూపకం.

ప॥ జలజాప్తకుల భూషణుగ దలపవు నీకిది ధర్మమె ॥జ

అ॥ బల పరాక్రమయుతుడు రాముడు పలువిధముల మేలుజేయ ॥జ

చ॥ సకలభూత సమ్మతుడౌ సాధువరేణ్యుని సార్వభౌముని
అఖిల జగముల కజేయుడని అరయక నవకోసల నాథుని ॥జ

జో:-చేసినమేలు మరచియు నీవు స్త్రీలోలుడవై యిపుడు
గాసిలియున్న రాముని గనవు బాసతప్పి నీవిటులు ॥జ

(2) ఘనుడగు లక్ష్మణు బనిచె రాముడు వినుమీ మత్తుడవగుచు
గనలేవయితివి గడువుదాటుటను కనుగానక నీ విపుడు ॥జ

(3) అపరాధము సైపుడనుచును నీవు అంజలిబద్ధుడవై యతనిగ
కృపగనుమని పాదంబుల మ్రొక్కుము కరుణించు నుపాయంబిదియనగ ॥జ

(4) హనుమంతుని హితసూక్తుల కలరి అంగదుగని రవిసుతుడు
వినయంబున సౌమిత్రిని దోడ్కొని వేగమెరమ్మా యనుడు ॥జ

వ॥ అచట సౌమిత్రియు అతిత్వరితంబుగ జాంబవంతుడు మొదలగు కపిశ్రేష్ఠుల నిలయంబులజూచుచు వజ్రవైడూర్య తోరణాలంకృతంబగు సుగ్రీవుని భవనంబు జొచ్చి కక్ష్యాంతరంబులను నవరత్న కనకఖచిత శయ్యాసనంబుల గనుచు అంతఃపురంబుజేరి అందుండు రూపలావణ్య విలాసవతులైన సతులనుగని లజ్జితుండై ముఖంబువంచి ఏకాంతప్రదేశంబున నిలువంబడి శింజిని టంకారంబుగావించిన సుగ్రీవుండు భర్మపీఠంబుపై గడగడవడంకుచు తారతో నిట్లనియె.

డో॥ర:-పరమ దయాళుడు లక్ష్మణుడిటులు కరుణవిడచి క్రోధమున
అరుదెంచుటకు కారణమేమొ యెరుగజాలనో చాన ॥జ

(2) తప్పేమైనను జేసితినో మరి దశరథసుతులకు నిపుడు
మెప్పుగ జెప్పుము హితసూక్తులతో మిత్రకులోత్తముతోను ॥జ

(3) అతివలగాంచిన నాగ్రహింపరు మతిమంతులు ధరలోన
అతిధార్మికుడౌ నా మహాత్మ్యమది నలరబల్కు వినయమున ॥జ

(4) అనవిని తారయు లక్ష్మణుజేరి వినయ వివేకమ్ములతో
సునయోక్తుల సంభావించుచు నిట్లనియెను నతిమోదముతో ॥జ

క॥ తార సుగుణాలవాల శృంగారలీల చారుస్నిగ్ధకపోల విశాలఫాల
జేరవచ్చినయట్టి శృంగారిగనియు మారు మోమిడె శ్రీరఘువీరుడపుడు ॥

డో॥ర॥ కరుణింపుము దేవా సుగ్రీవుడు కడుదీనుడు భృత్యుండు
చిరకాలము కష్టంబులబడి మరి మీదయ ప్రసరింపగను ॥జ

(2) కామమోహితుడు సుఖరహితుడు చిరకాల దుఃఖితుడు రవిసుతుడు
కాముకుడగు నీ కపివరుపైని గల కోపము మానుమి యిపుడు ॥జ

(3) మీ యాజ్ఞను శిరసావహించియు జేయనివా రిల నెవరు
ధీయుత సీతాన్వేషణమిపుడె చేసెదు నీ కపివరుడు ॥జ

(4) నానాదిక్కుల నుండునట్టి కపినాథుల రప్పించుటకై
వానరవీరుల కాజ్ఞాపించెను వచ్చెదరిట కపివరులు ॥జ

(5) నీతియు ధర్మయుతంబును ప్రియమును నిపుణతగల్గియు పల్కు
నా తరుణీమణి గని యిట్లనెను అధిక కోపముతోను ॥జ

సీ॥ కాముకుడు మూఢుడు కడులోభి దుష్టుడు స్వామిద్రోహియు నీ భానుసుతుడు
నీచుడు దుర్మతి నిందితచరితుడు పాతకుడు కృపణుడు వంచకుండు
మేలుమరచియు మరి స్త్రీలోలుడగుచును ధర్మంబు నీతియు దప్పెనిపుడు
అనుభవించెడు తాను అఖలభోగంబుల గనడు శ్రీరాముని కష్టములను
సీత దలచుచు మది నతి చింతతోడ కొండగుహాలను బడియు భూమండలేశు
డిట్టుల శోకింపఁ జూచి నేనెటుసహింతు మత్తుడగు రవిజుగర్వంబు మాన్పకిపుడు

క॥ అని వచింప తార యిట్లనియె.

జో॥ రః కావించును మీ కార్యము త్వరలో రావించును కపివరుల
భావింపుము దుష్టునిగా డీకపియు పాలింపుము దయతోడ ॥జ

కేదారగౌళ - రూపకం.

ప॥ కోపము మానుము కోమలగాత్రి నీ ॥కో

అ॥ పాపాత్ముడుగా డీభానుకుమారుడు పరమకారుణి కోత్తమా ॥కో

చ॥ విడుచును నన్నా రుమను మరియును విడచు ప్రాణముల్లైననుగానీ
విడుచును భోగముల్లైనను నితడు విడువడు శ్రీరామ కార్యమును ॥కో

(౨) కడుభీతి చెన్నవానిని దయతో గనుమయ్యా దేవా నీ విపుడు
గడువురాకమున్నే నలుదిశల కపిసేనలను రమ్మనబంచెను ॥కో

(౩) నవకోసల నాథుని సేనాటికి మరువడు నమ్ముముమాటను
భవభయముల బాపెడు మీ పదపద్మముల్ గొల్చుచునుండును ॥కో

వ॥ ఇట్లు తారచే ప్రార్థింపబడి సౌమిత్రి సుగ్రీవుని జేరబోవునెడ రుమనుగాగిలించి
కొనియుండు సుగ్రీవుడు లక్ష్మణునిజూచి దిగ్గనలేచి అంజలిగీలించి భయభ్రాం
తుండై నిలచియున్న వానింగని లక్ష్మణుండు కోపోద్దీపిత మానసుండై కనుల
కెంపుదనర నిట్లనియె.

హిందూస్తానితోడి - ఏక.

ప॥ మరచితివా శరణి తనయా రామబాణముల్ ॥మ

అ॥ వెరవక రవికుల వీరుని యలయించి తరుణులగూడియు తామసుడవై ॥మ

చ॥ వలగొనివచ్చి ప్రతినజేసితివి వానరచేష్టల మానవైతివి
అలనాడణగిన వాలిని గనలేదా చులకన నెంచకు నవకోసలపతిని ॥మ

జో॥ రః-సురదాత్రివిన వ్యర్థము దొంగిలినను ధరణిసురు జంపినను
సరిగాదలడురు చేసినమేలు మరచిన పాతకితోను ॥జ

(౨) మేలు బొందియును రామునిచే మరుమేలు జేయ మరచియును
స్త్రీలోలుడవై యున్నావిప్పుడు ఛీ ఛీ కుటిలుడవీవు ॥జ

(౩) వాలి భయంబున నేడ్చిన నినుగని జాలిబొంది రఘువరుడు
శూలనేసి నొకకోలను వాలి నదేల మరచితివి యిపుడు ॥జ

(4) సీతను వెదుక బంపవిదేల పాతకి దుర్మద నీచా
నీతిమాలిన కల్లరివని నిన్నెరుగమైతిమి మేమకటా ॥జ

(5) కలుషాత్మక మీ అన్నతో ప్రవజన దలపకు బ్రతుకుము ధరను
దలపుము సత్యము సమయమునీవు దెలియుము మదిలో నిపుడు ॥జ

వ॥ అని పల్కు లక్ష్మణునకు తార మరియు నిట్లనియె.

కన్నడ – చాపు.

ప॥ నమ్మినవాడు జానకీపతి పదములు ॥న

అ॥ నెమ్మనమున రాముని నిరతము స్మరియించుచు ॥న

చ॥ నీరజ పత్రేక్షణు కరుణారసంబున యీరాజ్య సుఖసంపద లీతనికి మరిగ్గైను ॥న

(2) మీరొనర్చిన మేలును మరవడు హరివీరుడు
కూరిమి మిము మెచ్చును కూర్రచిత్తుడుగాడు చూ ॥న

(3) ఏలయింత కోపము ఇపుడెవచ్చె మీసేవకు
కాలమెఱుగక లక్ష్మణా కామవశుడాయెను ॥న

(4) సత్వసంపన్నా నీవు చక్కగ విమర్శింపు మితని
సత్వరము నవకోసల స్వామికార్యము జేయును ॥న

జోర:-అధిక తపోనిధియౌ కౌశికుడు పది యేండ్లు ఘృతాచినిగూడి
మదిలో నొక్కదినముగ నెంచడె మదనాగ్నికి లోనై మరినీ ॥జ

(2) అంతటివారలె కామవశ్యులై యవని జరింపగ లేదా
వింతగనె యీకపి కామవశుండై యిటులుండుటఁ జెప్పగనేలా ॥జ

(3) అనఘా యీతప్పు సైపు నామనవిని వినుమో దేవా
జనకజతో శ్రీరాముని గూర్చును శంకయేల రఘువీరా ॥జ

(4) భానుజు మీదను కోపముమానుము పరమదయాళుడ యిపుడు
దీనుడగుచును యున్నాడితని దేర్చుము ప్రీతిని గనుము ॥జ,

వ॥ మహాత్మా సీతాన్వేషణంబునకై నలుదిక్కుల వానరుల పిలువం బంచి యు
న్నాడు కావున నితని మన్నింపు మనవుడు ధర్మ యుతంబులగు తారవచనంబు
లకు మృదుస్వభావుండగు సౌమిత్రి కోపంబుమాని శాంతుం డయ్యె నంత సుగ్రీ
వుండు భయంబువీడి లక్ష్మణునిగని వినయంబున నిట్లనియె.

హిం:-శ్రీ రఘురాముని దయచే నివ్వుడు చేకొనగల్గెను రాజ్యసంపదలు
చేరియు మీకు ప్రత్యుపకారము జేయగ నెంతటివాడను నేను ॥శ్రీ

(2) ఘను డతిబలుడు రామవిభునకు గావలయు నె తోడు లీలయె గాక
ధనువు మీటనంత దశకంఠుండును దనుజులతోడ హతమై పోడె ॥శ్రీ

(3) చనువుననో మరి తెలిసి తెలియక నే నొనరించిన యపరాధంబులను
మనమున నెంచక క్షమియింపుడి నను అనఘా మీదు దాసుడగాన ॥శ్రీ

(4) వినయంబున నిటు పొగడుచు రాముని వేడుకొనెడు కపిరాజును గనియు
అనఘుడు శాంతుడై యతిదయతోడను ననియెను పశ్చాత్తాపంబునను ॥శ్రీ

జోర:- అన్న దుఃఖము జూచి యోర్వక అడిగితి యెగ్గులు చాల
మన్నించుము నను దినకరతనయా సన్నుతచరితా ధీరా ॥జ

(2) సత్యసంధుడవు ధర్మరతుడవు సాధుసమ్మతుడ వీవు
నిత్యనిర్మలా శౌర్యధైర్యగుణ నీతికోవిదుడవు పుణ్యుడవు ॥జ

వ॥ సుగ్రీవుడంత చెంత నిలచియున్న మారుతింగని దశదిశలంగల వానర భల్లూకం
బుల త్వరితంబు రావింపుమన నతండట్లు గావించెనప్పుడు సుగ్రీవుని యాజ్ఞ
మేరకు కానుకలుగొని,

క॥ వానర భల్లూకంబులు సేనానాయకులు వారి సేనలతోడన్
గానగవచ్చిరి భానుజు పూనియు కిష్కింధకపుడు భువి దివి నిండన్.

వ॥ ఇట్లువచ్చి సుగ్రీవునకు కానుకలర్పించిన వారింగని సంతసించి మీరందరు శ్రీరా
ముని సన్నిధానంబునకు శీఘ్రంబున రండని సెలవొసంగి పంపె నట్టియెడ లక్ష్మ
ణుండు సుగ్రీవునితో నిట్లనియె.

జోర:-శ్రీరఘురాముని జేరబోవుదము శీఘ్రమె రమ్మా యనిన
తారాయుక్తంబుగ సతులను లోనికి జేరబనిచి వేగమున ॥జ

(2) బంగరు పల్లకిలో సౌమిత్రితో భానుతనూజుడు జేరి
మంగళతూర్య రవంబులు చెలగగ పొంగుచు రాముని జేరి ॥జ

(3) శ్రీరాముని పదపద్మంబులపై కపి శిరము జేర్చి మ్రొక్కినను
కూరిమిమీర భానుజు నెత్తి గ్రుచ్చి కౌగలించి ముదమునను ॥జ

(4) కృతకృత్యుడ నీవంటి స్నేహితుడు గల్గెనాకు రవితనయా
చతురత సీతాన్వేషణంబునకు సల్పుము యత్నము వేగ ॥జ

(5) సరగున రావణు బంధుయుతంబుగ బరిమార్పగవలె యిపుడు
ధరణిజ దుఃఖము మాన్పవుము వేగ తరణి కుమారా యనుడు ॥జ

వ॥ అంత సుగ్రీవుండు సంతోషితస్వాంతుండై స్వామీ పర్వతగుహాలను వనప్రదేశంబులను జరియించు సేనానాయకులందరు వారివారి సైన్యంబులతోడ మదాజ్ఞానుసారంబుగ వచ్చుచున్నారు. వారి బలపరాక్రమంబు లెరింగించెద. చిత్తగింపుడు.

హిం:-అనిలసమానులు వనచరవీరులు అంజనగిరినుండి మూడుకోట్లుపరగ
జనుదెంచిరి యస్తాచలముననుండియు కనక రుచిరగాత్రులు పదికోట్లును రామ॥శ్రీ

(2) ఘనులు వేనవేల్ కపులతిబలులు దినకర తేజులు కోటానుకోట్లును
వనదుర్గంబుల నుండియు నిపుడె అనఘా వచ్చిరి వనధితీరమువారు ॥శ్రీ

నోటు – ఏక

ప॥ వచ్చిరి వేగమె వనచరులందరు వనగిరి గహ్వరములనుండి

అ॥ అచ్చెరువొందఁగ నమరగణమ్ములు అరచుచు అంబరవీధి కెగరుచు ॥వ

చ॥ ఆకాశంబున కెగరి లంఘించుచు హరివీరులు నవ్వుచును
కేకలు వేయుచు పుట్టలగుట్టల భీకరులై పెనగుచు బింకములాడుచు ॥వ

(2) తరువులనెక్కుచు గిరుల దుముకుచును కరులచాడ్పున గర్జించుచును
వరనవకోసలపురవాసుని సేవ దొరకునని మది తొందరపడుచు ॥వ

వ॥ ఇట్లువచ్చి సుగ్రీవుని చెంతనిలచి యున్నంత.

జోర:-వింధ్యమేరు హిమనగములనుండెడు వీరులు శూరులు మరియు
మందరాద్రి ద్రోణాచలమాదిగ గల గిరులందుండెడి కపివరులు ॥జ

2) చండకిరణ నీ కాశవిక్రము లఖండబలులు ఘనులు
దండిరక్కసుల చెండాడెదు నాఖండలుబోలెడు వారు ॥జ

(3) నిండియున్న వారెల్లకపులు భూమండలమంతయు నిపుడు
కొండలవంటి దేహంబులతో గోలాంగూలులు భల్లూకములు ॥జ

(4) రావణుని వధించియు సీతాదేవిని దెచ్చెదరిపుడు
దేవాద్యసురుల గూల్తురు రణమ్మున భూవల్లభ యీ తరుచరు లనుచు ॥జ

(5) మిత్రజ వినుమా ధాత్రిలోన సన్మిత్రుడుగల ధన్యుండు
శత్రుజయము గలవాడై సుఖయించును చిత్రముగాదిది వినుము ॥జ

(6) చండకిరణునకు వేడిమియును నా చంద్రునకు శైత్యమును
నుంఘుటసహజము నీ యందటువలెనుండును సఖ సత్వంబు ॥జ

(7) కావున ప్రత్యుపకారము మాకు గావించుట సహజంబు
నీవేగద బంధుడవును హితుడవు భావింపగ నిచ్చట మాకు ॥జ

వ॥ అని పొగడు రామునింగాంచి వినయ విధేయతలతో భానుజుండు శ్రీరామా అసంఖ్యాతంబులగు వానరసేన లివె వచ్చియున్నవి. కామరూపులు గగనసంచారులు కఠోరతనులు దనుజమర్దనులు వీరలందరు మదాజ్ఞానుసారులై మీచెంత నిలిచి యున్నవారు. చేయంగల కార్యంబాలోచించి బంపుమన రామభద్రుం డిట్లనియె.

జో॥ర:-బ్రతికియున్నదో సీతారమణియు భానతనూజా యిపుడు
వెతకి గనవలెను రావణుగృహమున హతమైపోయెనో యిపుడు ॥జ

(2) వనచరవీరులు పోయి జానకిని గనివచ్చిన యపుడు
అనువగుకార్యము నాలోచింతము దినకరతనయా మనము ॥జ

వ॥ అని వచింప సుగ్రీవుండంత.

జో॥ర:-వినతునిగాంచి తూర్పుదిక్కునకు జనుమా సైన్యముతోను
ఘనశైలంబులు గిరిగహ్వరములు వనములు ద్వీపముల్ నదులు ॥జ

(2) కోలకుల పులినతలంబుల సెలయేరుల బలుపగు పూపొదలందున్
జలనిధిలో దత్తీరంబులను జానకి వెదకుడు మరియున్ ॥జ

(3) క్షీరసముద్రము మేరుగిరియును చేరి యనంతుని చెంతన్
ధారుణితనయను నరయుడి మీరు దశకంఠుని మరివేగమునన్ ॥జ

(4) మాసములోపల రావలె మీరు భూసుత వెదకియువేగా
దాశరథిని మెప్పింపుడి మరినీ తడయక పొం డిపుడనగ॥జ

వ॥ కాలాతిక్రమంబు జేయందగదు. అట్లు గావించిన మరణశిక్ష విధింపబడు. శీఘ్రం బుగ బోయి రండని అజ్ఞాపించి,

హిం॥-హనుమంతుని నా జాంబవంతుని అంగదనల నీల మైంద ద్వివిధుల
ఘనబలాఢ్యులౌ కపివరులనుగని వినుడీ దెల్పెద వివరంబుగను ॥శ్రీ

జో॥:-అందరుజేరి దక్షిణ దిక్కున కరిగియు వేగంబునను
అందుండెడు గిరి గహ్వరగహనముల్ అరయుడి జానకిన్ మీరు ॥జ

(2) గంగాయమునా సరస్వతి సింధు తుంగభద్ర వరదానదియు
బంగరు పద్మముల్‌గల కొలనులను పరికింపుడి సీతను మరియు ॥జ

(3) గోదావరి కృష్ణా కావేరి గోమతి నర్మద నదులన్
ఆ దారుణగిరి గహ్వరములను అరయుడి యతివేగమునన్ ॥జ

(4) చందన వనము హేమసరసు లింపొందుచుండును గనుడు
అందమైన యరుణాబ్జము లుండును అలరగ ఫలవృక్షములు ॥జ

హిం॥ సురుచిరమగు తరులతలతో నొప్పుచు సుందర సహస్ర శిరఃప్రకీర్ణమై
పరగ మహోగ్రమౌ వింధ్యముగల దందు అరయుడి సీతను గిరికందరములన్ ॥శ్రీ

(2) మరియు నంగ వంగ కళింగ కాశ్మీర వరవిదర్భల నుజ్జయిని కోసలముల
బరికించుడి యాంధ్ర చోళ కేరళ దేశ పాండ్యమునందును ధరణిజన్ రావణున్ ॥శ్రీ

(3) అని పల్కుచును బనిచియు కొందరి ఘనుడు సుషేణునిగని మ్రొక్కియును
అనఘా సేననుగొని పశ్చిమదిశ కరుగుము నీవు సీతను వెదుకగ ॥శ్రీ

వ॥ మరియు పుష్పితారామంబుల గిరికందరంబుల నదనదీకూలంబుల సీతను వెదకి
అంత చక్రవంతంబను శైలంబు సహస్రార చక్రంబు విశ్వకర్మ నిర్మితంబై
హయగ్రీవునిచే రక్షింపం బడియుండ విష్ణువు వానిని దున్మి చక్రంబును పంచ
జనుని సంహరించి పాంచజన్యంబునుగొనె అట్టి స్థలంబెల్ల పరసి యావల వార్ధి
మధ్యంబున రజిత శృంగంబుల నుండు వరాహ పర్వతంబున నరకాసురుని ప్రాగ్జో
తిష పురంబునందును సువర్ణ మయంబులగు అరువదివేల పర్వతంబులమధ్య మేరు
గిరియుండు. అందంతటనుజూచి యచ్చట సావర్ణియను ఋషీశ్వరునింగని మ్రొక్కి
సీత యెందుండునని యడిగి యస్త్రాద్రి వరకుంగల ప్రదేశంబులెల్ల వెదకి మరలుడు
వానరశ్రేష్ఠులార యీ సుషేణుని యాజ్ఞను ఒక మాసంబులోన రావలయు.
అటురానియెడ మరణదండన తప్పదు అని వచించె.

హిం॥ శతవలిగని రవిసుతు డిటు బల్కెను చక్కగ జానకి దశకంఠుని వెదుక
చతురత నూరువేల్ యమతనయులు గొల్వ జను ముత్తరదిశ పర్వతగుహాలకు॥శ్రీ

(2) అపకారికి నుపకారము జేయుట సఫలతగల్గును జన్మంబునకు
ఉపకారికి నుపకారము జేయుటకు జెప్పగ వలయున ఒప్పుగమీరలు ॥శ్రీ

(3) ఎల్లభూతములకుఁ బూజ్యుడు రాముడు ఎంతయు మనకు హితము గూర్చె మును
చల్లనిచూపుల మనియున్నారము ధర పల్లవపాణి న్నరసి కృతకృత్యు లౌదము

వ॥ కపివర్యా, యుత్తరంబున హిమాలయము రాజిల్లుచుండు. అచ్చటికి బహు మెల కువతోడజని మ్లేచ్ఛదేశంబున శూరసేన పుళింద మద్రభరత కురూమ్వల కాంభోజ యవన శకంబులందును పౌరవ టంకణ ఋషికంబునను చీన నీహార ధరాతలంబును దేవదారు వనంబులను దుర్నీతుడైన పంక్తి కంఠునితోడ జానకీదేవిని వెదకుడి. మరియు సోమాశ్రమంబు సుదర్శనాఖ్య పర్వతంబు దేవసఖాద్రియు నన్నియు నరసి నత్వశూన్యంబైన కాంతారంబు గడచి కైలాస పర్వతంబుజేరి విశ్వకర్మ నిర్మితంబైన పాండుర భవనంబును ఆహ్లాదంబగు కొలకును దేవకాంతలు గొలువ అచ్చేరువ అచ్చర మచ్చకంటులతోడ యక్షనిచయంబులు సేవింప కుబేరుండెప్పుడు క్రీడలు సల్పుచుండు. ఆస్థళంబెల్లెడలను పరిశీలింపుడు. మరియు క్రౌంచము మున్నగు సిద్ధాశ్రమంబులు మానవ సరోవరంబును దిరిగి హేమాబ్జంబుల హంసలును నానావిధ పక్షి సముదాయంబుల కలకలంబను ఉద్యాన వనంబులెల్ల జూచుచు దాటి,

హిం:- ఉత్తర కురుదేశంబ్బుల వసుమతిసుతను రావణుఁ అరసియు మీరలు
అత్తలమునుగడచి పోవలబోకుడి అనఘులార యొకమాసముగడువని ॥శ్రీ

(2) కపికులాగ్రణి హనుమంతునిగని కార్యసాధకు డితడనిదలచి
నిపుణుం డతిబలవిక్రముడును మరి నీతిశాలియైన యతనికి నిట్లనె ॥శ్రీ

కేదారగౌళ - ఆది

ప॥ సాధించి గనిరమ్ము హనుమా సారసలోచన రాఘవుదేవిని ॥సా

అ॥ ఆదేవిని దెచ్చు నుపాయ మారయ నీవె తగుదువు ధీర ॥సా

చ॥ జవమున తేజమున లాఘవమున గమనంబున
పవనునిబోలుదువు పవనాత్మజ నీవు ॥సా

(2) నవకోసలపతి సేవాసక్తుడవు అవని నీసరిలేరు కుశాగ్రబుద్ధివి వీరా ॥సా

హిం:- హరివీరుని మాటనువిని రాముడు కరుణార్ద్రదృష్టిఁ కరువలిసుతుఁగని
ధరణిజఁ గనుగొను ఘనుడితడేయని సురుచిరమగు అంగుళీయకముదీసి ॥ శ్రీ

ఆరాణ - రూపకం

ప॥ హనుమా గొనుమా అంగుళీయకము మన్నామాంకితము ॥హ

అ॥ జనకజ యీ ముద్రికను గని నమ్మునాదూతవని ॥హ

చ॥ నీవలన నీకార్యము నిక్కముసిద్ధించును నీవిక్రమబలసంపదల్ నీయత్నముగంటినినే
భావించియు దెల్పెను సుగ్రీవుడు మెచ్చి నిను. గావింతువు నవకోసలనాథుని కార్యం

హిం:-దినకరతనయుని సందేశము నీ ఘనబలశౌర్య పరాక్రమముగాగన [బును ॥హా
అనిలజ నీచే కార్యసిద్ధిగల్గు ననిదలచెద మది నరుగుము వేగమె ॥శ్రీ

(2) జానకిసతి నెటు గాంచగల్గుదునో యటునల్పుము కార్యము సత్వరముగను
నేనును నీ బలాశ్రితుడనుగావున భానుజునకు నాకుగా ప్రీతినిగూర్పుము ॥శ్రీ

(3) అనివల్క శ్రీరామచంద్రుని పాద వనజములకు భక్తిగ వందనములుజేసి
ఘనమగు నంగరమును గైకొనియు తన శిరమున దాల్చి నిలిచె నంజలితోన॥శ్రీ

(4) జవమున జనియు జానకీమణిగా అవనీతలము నంతయు దిరిగి
ప్లవగులార పరిశీలింపుడియని భానుజుడుదెల్ప కపులందరును ॥శ్రీ

వ॥ కోలాహలంబు చేయుచు పండ్లు గొరుకుచు దిక్కులదువ్వనరచుచు దోకలాడిం
చుచు పరువుల బారుచు,

బిలహరి – ఆది.

ప॥ వేడుకలర హరివీరులు జతగూడియు వెడలిరి జానకిగా వెదుక ॥వే

అ॥ ఆడుచును పాడుచును ఆనందంబున గంతులు వైచుచు ॥వే

చ॥ నేనే సీతను గాంచెదననుచు నేనే రావణు బట్టెదను జానకీభయ మెడబాపి
నేనే వెదకిదెచ్చెద నిపుడు నిలువుడి మీరందరనుచు ॥వే

(2) నీరధిదాటెద నేనే నూరుయోజనంబుల నిపుడు, చేరియు దనుజుల గొట్టి
కూరిమి అంనందువెదకి కువలయాక్షిని దెచ్చెద నేనని ॥వే

(3) కోరియు నవకోసల కోదండపాణిని మదిలోన సారెకు గీర్తించుచును
ధీరుడనై రాముని పట్టపుదేవిని దెచ్చియిచ్చెద నేనని ॥వే

వ॥ ఇవ్విధంబున కోలాహలంబు చేయుచు తూర్పునకు వినతుడు, పడమరకు సుషే
ణుండును, శతవలి యుత్తరంబునకు, హనుమదాది కపి ప్రముఖులు దక్షిణ దిశ
కును తమతమ సైన్యంబులతో జని రంత

జోర:- తరణితనూజుండు సంతసించె కపివరులను బనిచియు చాల
తరణి వంశజులు ప్రస్రవణంబున కరముండుచు సుఖలీల ॥జ

(2) నీకెటు తెలిసెను భూమండలమున నీరజమిత్రుని సుతుడు
శ్రీకరుడా రఘువీరునితో నిటు జెప్పెను వివరంబుగను ॥జ

(3) వాలి దరుమగ దశదిశలకు నేవనటజెంది దిరుగుచు నంతా
గాలికొడుకుతో దేశములెల్లను గాంచితి రఘుకులతిలకా ॥జ

(4) తలదాచుటకై నను తావులేక యిటు తపియించగ గని ప్రియమునను
సలలితముగ హనుమంతుడు యింద్రజు శాపకారణము దెల్పగను ॥జ

(5) వనరుగ నేను ఋశ్యమూకమున వసియించితి మహికాంతా
యనుచు వచించెను వనచరవల్లభు డినకులచంద్రునకంతా ॥జ

(6) తూరుపు పడమర ఉత్తరదిశలను నారసి సీతను గానకను
జేరవచ్చిరీ వానరవీరులు శ్రీరామ రవిజుల జూడగను ॥జ

(7) నదులు నదమ్ములు నగగహ్వరములు నానావిధ స్థలములను
వెదకితి మెల్ల పట్టణములు పల్లెలు నెందుగనము భూసుతను ॥జ

(8) పెను శరీరము గల్గినవారిని గనుగొని రావణుడనుచు
దునిమి యిరవుల శోధించితి మెచ్చట గానము దేవిని నిక్కంబని మరియు ॥జ

(9) దక్షిణ తటమున శూరులతో జనె తారాంగద మారుతివరులు
అక్షీణ బలాఢ్యులు జూచివచ్చెదరు అవనిజ నని బల్కిరి వారపుడు ॥జ

వ॥ హనుమదాది కపివీరులు దక్షిణ దిక్కున వింధ్యపర్వతంబునం గల కాననసీమలు నగాగ్రములు గహనములు పర్వత కందరములు ఘోరభయంకర దుర్గదేశమ్ములు వెదకి యెందుంగానక మరియును ధృతివీడక మర్కటములు చొరరాని చోటులలోజొచ్చి వెదకుచు దాహంబుగొని సొమ్మసిల్లి నిర్జలమై నిర్జనమై శూన్యమైన యొక గహనభాగంబును గాంచిరి. తొల్లి కండుమహాముని తనబాలకుడు షోడశ వర్షంబులవాడు గానరామి నా స్థలంబు శూన్యమగునటుల శపియించె. ఆ శూన్యాటవిని వనచరవీరు లొక్క రక్కసునిఁ గాంచిరి. అతడు జచ్చితిరి రండీ యని వీరిపైకిరాగ అంగదుడు అరచేతితో నతనిగొట్ట వాడు నెత్తురుగ్రక్కి నేలంగూలె. కోతులెల్ల రావ్రదేశంబంతయు వెదకియు నందు సీతనుగానక ఖిన్నులై యొక వృక్షంబు నొద్దజేరి కూరుచుండిరి. అంత అంగదుడు వానరులం గని యోవీరులారా వనగిరిగహ్వరములు కఠిన ప్రదేశము వెదకితిమి యెందును జనకజ గానరాదాయె. మనమిటు లధైర్యముతో నుండరాదు. మరియు సుగ్రీవుండు ఉగ్రశాసనుండు గాన రండు వెదకుదమని బల్కుచు,

హిం:-శోకంబున కెడమీయఁగరాదిటు సొక్కియుండ దగ దిప్పుడు మరి
నాకర్ణింపుడి నావచనంబుల నాకంబైనను అరయుదము వేగ ॥శ్రీ

(2) అనియిటు బల్కఁగ వానరులందరు అవునౌ ననుచు వేగంబునను
చనుచును రజిత శైలమునెక్కి సప్తపర్ణవన మరసియు నంతట ॥శ్రీ॥

(3) అందునుగానక బడలియు యాగిరి నందుసందున గుట్టగుట్టలను
ఇందుముఖి సీతఁ వెదకియు గానక ఏమిచేయుదమని దలపోయుచు ॥శ్రీ

(4) గడువుదాటెనని మదికలంగియు కపికుంజరులంతఁ కఠినతలంబుల
కడువడిబోవుచు ఋక్షబిలంబుఁ గాంచిరి వారలు ఆశ్చర్యంబున ॥శ్రీ॥

వ॥ అప్పుడు పక్షిజాలంబు లార్ద్రపక్షంబులతో బిలద్వారంబునుండి వచ్చుచుండ వానింగని వానరులు దాహాతి రేకంబున అచ్చో జలంబుగలదని బిలంబుజొచ్చి లోనికరుగ చీకటియగుట దారినెరుంగక నొకరినొకరు పట్టుకొని యొక యోజనదూరంబు ప్రాణములు బిగబట్టుకొని పోవునెడ అచ్చో గొప్ప వెలుగుగనుపించె అదిచూచుచు జన అమిత తేజోమయులై నారచీరలుగట్టిన మహాతపస్వినియగు నొకయువతినిగాంచి భీతిలి దూరంబున నిలచి,

హిం:-హనుమంతుం డతిభయభక్తులతో వినయంబున యా వనితకు మ్రొక్కియు
కనకమణిమయ హర్మ్యంబులుగల యీ వనమెవరిది దెల్పుజననీ వేగ ॥శ్రీ॥

(2) మరియును నాకలిదప్పుల గాసిలి మగువా మే మీ బిలముజొచ్చితిమి
వెరపున చీకటి కనుగానకను దురపిల్లితి మమ్మ యిటుజేరగను ॥శ్రీ

(3) కమనీయంబగు ఫలపుష్పంబులు కనకమయమగు భూరుహములతో
విమలతోయములు హాటకమత్స్యముల్ విహరించెడు నెవరి తపోమహత్వమిద ॥శ్రీ॥

(4) తెల్పుము నీదు మహిమయు తపమును తేటపడగ మాకు నీ నామంబు
తల్లీ యనఁ సామీరినిగని యాతపస్విని బలికెను ఆదరంబున ॥శ్రీ॥

వ॥ మయుండను రాక్షసుడు వేయిసంవత్సరంబులు గానలో తపమొనర్చి నలుమొగంబుల వాని మెప్పించి వరముబడసి అతులిత వైభవంబగు నీస్వర్ణగృహంబును నిర్మించి తన శిల్పనిపుణతజూపి, హేమయనుదానిం గూడియుండె. నృత్తగీత వాద్య విశారదయగు నా హేమ నాకు నెచ్చెలి. వజ్రివజ్రాయుధంబుచే నతని ఖండింప హేమవరంబున యీవనంబు నే గాపాడుచుందు. నాపేరు స్వయంప్రభ. సావర్ణిక పుత్రిని. మీరేలవచ్చితిరిటకు? ఎల్లెడల నిటుదిరుగుట కేమికారణము? ఈ కాననంబున నెవరినివెదకెదరు? ఈఫలమూలంబు లారగించి మహితపదార్థముల గొని దాహంబుదీర పానీయంబుల గొనుడు. మీయెడ దీర్చుకొని మీచరితంబు నేను వినదగుదునేని వినిపింపుడనిన పవనతనూజుండంత

సీ॥ వినుమమ్మ దెల్పెద దినకరాన్వయుడైన దశరథనృప వరతనయుడైన
రామలక్ష్మణులును రమణి సీతనుగూడి దండకాటవినుండు తరుణమందు
రావణుండనువాడు రాముని సతి సీత నపహరించిన నందునందు వెదుక
రామచంద్రుసఖుడు రవిజుడు మముబంప ఘనదుర్గగిరులను కలయదిరిగి
నదనదీప్రాంతముల వింధ్యనగమునందు, సకలదిక్కుల నరసియు చాలడస్సి
యెందుగానక మా మదులందుగుంది, యెట్టకేలకు జేరితి మిచటికమ్మ.

జోర:-గాసిని ప్రాణము వేసనవేళను గంటిమి నిను పుణ్యమునన్
బాసెను మాశ్రమ క్షుత్పిపాసలు ప్రాణము మరలెను మాకెల్లన్ ॥జ

(2) తరుణీగోరెద రీవానరవీరులు మరు మేలు చేయగ నీకన్
పరమప్రీతిని దెల్పుమిపు డన హర్షంబున నిటులనె నపుడున్ ॥జ

(3) మెచ్చితి మీసద్వచనంబులకును మేలుగల్గు మీకెపుడున్
ఇచ్ఛగింప నెద్దియు నామదినెపుడు ధర్మచింతన జేయుటను ॥జ

(4) అనవిని హనుమంతుడు దానిట్లనె అసాధ్వీ తిలకంబునకున్
ఘనబిలమును దాటింపుము కరుణను గడువుదాటె నిక్కము మాకున్ ॥జ

(5) అనవుడు మారుతింగని తపస్విని యిట్లనె వినుమీ బిలమునజొచ్చి
తనువున బోలే రిదిదాటియు నాతపోమహిమ దాటించెదను ॥జ

(6) కనులు మూయుడన నాకపు లటు జేయగ కరమును బట్టియు వేగ
వనచరులను దాటించె నిమిషమున వననిధి తీరముజేర జ॥

ద్విపద:-అలలచే నొప్పెడు నాలవణాబ్ధిఁ । దిలకించి వనచరుల్ దిగులొంది రపుడు
బలికె నంగదుడిట్లు బిలములో మనము । నిలిచి యుండిన యడ్డె నెల గడువేగె
గనజాలమైతిమి కనకాంగి సీత । మనలేము మనమిక నినసుతుజేరి
అనఘులు వినుడింక అందరమిచట । తనువు వీడుట మేలు తరణి సంభవుడు
కడుకూరుడును రాజ్య గర్వితుడౌట । విడువడు మనలను వేగ వధించు
నన విని హనుమంతుఁ డనియె నాతనికి । ఘనబలుడైనట్టి వనచరు లిచట
తనువులు విడతురే తగదిట్టిమాట । సకల సద్గుణగణశాలివి నీవు
అకలంకముగ రాజ్య మనుభవింపకయ । వికలేంద్రియుండవై యకట యిట్లనుదె
అకలుషమతియైన యట్టి హరీశు । నీరీతిదూరుట నీతియె నీకు
జేరుదమాతనిఁ జింతనవీడి । భూమిజగాంచక పోరాదటంచు
వేమారు పల్కిన వీరులొమనకు । ఆతలోదరిఁగాంచ కన్యంబు వలుక
నీతజిఁ దగదంచు నెంచెద నేను.

వ॥ అని హనుమంతుడు దెల్ప నంగదుఁ డామాటలు పాటింపక యిట్లు వచింపఁ దొడంగె.

జోర:-ధర్మముదప్పియు మేలెంచకమరి తగని కర్మములుజేసి
నిర్మలమతి శ్రీరాముని మరచిన నీచుని నమ్ముట కెటులౌను ॥జ

(2) కాన నిచట నే ప్రాణము విడతును రానట కిష్కింధకును
దీనుడ బలహీనుడ నరిపుత్రుడ నను శిక్షించును భానుజుడు ॥జ

వ॥ ఇట్లనుచు పెద్దలకెల్ల నమస్కరించి దర్భలపై పండుకొని ప్రాయోపవేశంబు చేసెదనని నిశ్చయించి రోదనంబుజేయు అంగదునిగని హరివీరు లందరును సుగ్రీవుని దూరుచు వాలిని బొగడుచు జలమునంటి ప్రాయోపవేశంబునకు గడంగి దక్షిణాగ్రములై యొప్పు దర్భలందు ప్రాఙ్ముఖంబుగ గూరుచుండి శ్రీరాముని వనవాసంబును దశరథుని మృతియు సీతాపహరణము జటాయువధయు వాలి నిగ్రహమును రాముని కోపమును వానరుల భయంబును జెప్పుకొనుచు ఎలుగెత్తి యేడ్చిరి. అట్టి ధ్వని విని అతిబలవంతుడైన గృధ్రపతియు జటాయువు నన్నయగు సంపాతి పర్వతకందరము నుంచి మెల్లగవచ్చి వానరులగని హర్షంబున నిట్లనె ఆహా దైవంబు ప్రాణికోటులనెల్ల రక్షించుననట సత్యంబు. అశక్తుండైన నాకనేక దినంబుల కాహారంబుగూర్చె.ఒక్కొక్కని వధించి క్రమముగా దినుచుందుననిపల్కు నాగ్రిద్దమాటలువిని యంగదుడు హనుమంతునితో నిట్లనె హనుమా మనల భక్షించుటకై వచ్చిన యాపక్షిని గంటివా సీతను వెదకుట యను నెపమున యమధర్మరాజే విధముగవచ్చి యపాయంబుగల్గించె నన కపులు

జోర:-దేవసమానుడు రాముని కార్యము దీర్పగలేదు మనముగా
ఈవిధి ప్రభుపాజ్ఞను నెరవేర్పకమున్నె యింతవచ్చె మనకిపుడుగా ॥జ

(2) జనకజకును ప్రియముగూర్పగబోయి జటాయువునకు గల్గిన విధము
మనకెల్లరకదె ప్రాప్తంబయ్యెను మనుటలేదు మనమిక భువిలోను ॥జ

(3) తమతమ శక్తి భక్తి కొలది శ్రీరామకార్యమునకు
విమల మనస్కులై ప్రియముగూర్చుచు మరివిడిచె ప్రాణము పశుపక్షులును ॥జ

(4) ఎంతటి ధన్యుండా జటాయువు ఈకువలయమందు
పంతంబున రావణుతో బోరియు పరమపదము జేరెను మరియు ॥జ

వ॥ కైకవల్ల నందరికి నింతటి కష్టంబు గల్గెనని

బులతోకి నాతమ్ముని శరీరంబు కనలఁజొచ్చిన నా రెక్కల నతనికిప్పితిని. అపుడు నాపక్షంబులు దగ్ధంబులయి నేను వింధ్యపర్వతంబునఁ గూలితిని. అతఁడేమయ్యెనో యెఱుంగనైతి. అన అంగదుఁడు నీవుజటాయువునకుఅన్నవుగావున రావణాసురు వృత్తాంతంబెరింగియుందువు. అతని నెలవు దాపునగలదా దెల్పుమన సంపాతియు,

జోర:-రాముకార్యమును జేయవలయును నీమహి జన్మించినవారు
ఏమియు జేయజాలకుండు నే యెరిగింతును జానకిజాడను వినుడు ॥జ

(2) క్రమముగనెరుగుదు దేవాసుర యుద్ధము కడలిదచ్చుట యమృతము గొనుట్ల
అమరవంద్యుడు హరి త్రివిక్రముడు అఖిలజగములు గొలుచుటలెల్ల ॥జ

(3) గగనంబున గొనిపోవగ నొకవాల్గంటెని గంటిని రావణు నేను
పొగులుచు రామాలక్ష్మణయని యేడ్చుచుఁ బోయెను బాష్పముల్ గార్చుచును

(4) సారెసారెకు రామా లక్ష్మణయని విలపించెను సరసిజదళ నేత్రియుగాన
శ్రీరామునిసతి యారమణియె యనితలచెద చింతిలకుడు మరి వానరులార ॥జ

వ॥ ఆమనుజాశనుని నిలయము దెల్పెద. విశ్రవునకు పుత్రుడు కుబేరుని తమ్ముడు రావణుండను నామముగల్గి మదగర్వితుడై లంకయను నగరంబున నున్నవాడు. నలుప్రక్కల సముద్రమగ్నత్తగా గల్గి నూఱామడలో నున్నది యొక ద్వీపము. విశ్వకర్మ నిర్మితమై బంగారు ప్రాకారంబులు మేడలు పసిడివాకిండ్లు గల్గ భాను తేజంబున వెల్గుచుండు. ఆదనుజు నంతఃపురంబున నా దేవి రాక్షస స్త్రీలచే గావంబడు చున్నది. శూరాగ్రేసరులారా, దక్షిణంబుగ రాక్షసేంద్రుని పురంబు వరసి ఫలసిద్ధిం గాంచుఁడు వెడలి. దివ్యజ్ఞానంబున మీకు మేలుగలుగునని తెలిసితిని. మాకు దూరదృష్టి గలదుగాన ఆ సీతాదేవి గనపడు చున్నది. పక్షి కులంబులకు ఏడు అంతస్తుల గమనంబు గలదు. అందు నేడవ యంతస్తున దిరుగు వైనతేయుని యంశంబువారము మేము. కావుననే మాకు చాల దూర దృష్టి గలదు. వానరులారా! నన్ను సాగరతీరంబున చేర్పుడు. నా తమ్ముని కుదక దానంబు గావించెదనన వారట్లు గావించి మరల యథాస్థానంబు జేర్చిరి. అప్పుడు జాంబవంతుడు హర్షంబున సీతాదేవి చరితంబును రావణుని నిలయం బును చక్కగ నెఱిగింపుమన మరల సంపాతి యావిధమెల్ల దెలిపి 'సుపార్శ్వుడు' అను నాసుతుడు నాకాహారంబు దెచ్చునెడ సీతనెత్తుకొని సాగరంబుపై పోవు రావణుని మార్గంబు అడ్డగింప అతడు త్రోవ విడువుమని ప్రార్థింప "శరణు జొచ్చినవాని జంపుట నీతికాదు" అని మరలివచ్చి నాకు దెల్పెను. అశక్తుం డగుటజేసి బోవజాలక యూరకుంటి. మరియు నేనీ శిఖరంబున బడినప్పుడు

మూఁడుదినములు తెల్విలేక యటుండి వెనుక తెలివొంది మున్నెరింగిన నిశాకరు డను మునివరునొద్ద కెట్టకో ప్రాకుచుఁబోయి జీవంబువలదని యేడువ నతండు దగ్ధ పక్షంబుగల నన్నుఁగని చింతిలకుము

జోర:-ఇనవంశంబున దశరథసుతుఁడై యుదయించిన హరి రాఘవుఁడు
వనమున పత్నిఁగో ననుజునిఁగూడియు జనస్థానంబున నుండఁగను ॥జ

(2) దానవేంద్రుఁడు హరియింపఁగ సీతను దనుజుని దునుమఁగ నపుడు
వానరేంద్రుని సఖ్యము పడయఁగ జానకి జాడల నరయుచును ॥జ

(3) వానరవీరులు వామాక్షిని వెదకఁగ వత్తురు రామానుచరుల్
సీనుతుల నై దేహి వార్తను వనచరులకు దెల్పఁగ గల్గు శుభంబుల్ ॥జ

(4) కాలదేశముల గనియుండుము భూస్థలి గల్గును పక్షము లపుడు
చాల హితముగు కార్యము జగతికి గలిగింపుము సురనరులకు మేలు ॥జ

వ॥ పతంగా! మఱియు నేను నీరెక్కల మొలిపింతునుగాని సత్కార్యంబునకై వేచి యుండఁదగు నీకు గాన పర్వతంబున నుండుము. నాకు రామలక్ష్మణులఁజూడ గొండంత ఆశయున్నను నంత కాలంబు కాయంబునిలుప జిత్తమొల్లదు. అని మరియు రామునిచే రాక్షసుల హతముగల్గునని తత్త్వార్థవేదియైన యమ్ముని పుంగవుండు దివ్యదృష్టి ననాగతంబుదెల్పి నన్ను చాల నాశ్వాసించి వీడుకొలిపె. నేనటనుండి యెట్టకేలకు యీకొండజేరితి. అప్పుడప్పుడు నాబాధ నోర్వఁజాలక ప్రాణంబు విడువనెంచియు, ఆమౌని వాక్యంబు దలచి మీరాక కెదురుచూచుచు కాలంబునకు వేచియుంటి. అని యనునెడ,

జోర:-రెక్కలు మొలిచె ననూరుతనయునకు ఋక్షవానరములలరన్
లక్కుమేఁగాక్షిని జానకి నికమీ రరయుట నిక్కంబని చనిరోన్ ॥జ

(2) వినియామా వివరము వనితను వెదకఁగ వెడలిరి యభిజిన్ముహూర్తమున
వనచరవీరులు మోదమునందుచు మొనకొని గంతులు వైచుచును ॥జ

(3) పారావారము జేరఁబోయియు యా ప్లవగసత్తములు వేగ
పారజూచి యుద్భ్రాంతచిత్తులయి పలుకరైరి ప్రతిమలునాఁగ ॥జ

(4) అతిఘోరములగు జలచరములతో ప్రతిభయమగు లవణాంబుధికి
చతురత నుత్తరతీరంబున వనచరులుచేరి దిగులొంది ॥జ

(5) ఈ మహాబ్ధి మనమెటు దాటుదము ఏమిచేయుద మటంచు
వేమరు దుఃఖింపఁగ వారలగని వివరించెను యువరాజిట్లు ॥జ

(6) శోకంబున మనోబలము గృంగును శోకించిన కార్యము చెడును
ఆకులపాటును జెందక మనమిపు డాలోచింతము దాటుటకు ॥జ

(7) అంగద హనుమంతుల జట్టియున్నయా హరివీరులు బలుకకయున్న
పొంగుచు ముదమున తారతనయుడు భూరివిక్రములగని వేగ ॥జ

తే॥ అంగదుండంత కపులతో ననియెనిట్టు వారినిధిదాట ధీరులౌ వీరులార
యెవరిబల మెంతయున్నదో యెఱుఁగబల్కుఁ డనిన దెల్పిరి వార లాఘనున కిట్లు.

సీ॥ పదియోజనములు నేఁ బరగ దాఁటెదనని గజుఁడు గవాక్షుండు విజయశాలి
యిరువది యామడల్ సరగ దాఁటెదనని గవయుఁడు నేదాటగలను ముప్ప
దామడలంచనె నంతట శరభుండు నలువదామడల నే నలితరింతు
ననె గంధమాదనుండనియె నేఁబదియంచు మైందు డర్వదియంచు మాటయిచ్చె
చెప్పె ద్వివిదుఁడు డెబ్బది యప్పు డలసుషేణుఁ డెనుబది యనియె నా చెంతనున్న
జాంబవంతుండు వచియించె తొంబదామడలను దాటంగ నేర్తు నే నలవున నని

తే॥ అంత నంగదుఁడనియె నోయయ్యలార దాఁటెదను నూఱుయోజనాల్ ధాఁటిచెడక
మరలి రానేర్తునో లేనో మఱియెటుంగఁ జేయగలకార్యమిం కేది చెప్పుఁడనుచు.

హి:- బోవగనేర్తువు సహస్రయోజనములు జవమున రాగలవు మరలియు
వేగమె భావింపగ నిను బంపగజెల్లదు ప్రభుడవునీవు మాకెల్లరకును ॥శ్రీ

(2) సేనలకెల్లను అధిపతిగావున సేవకకోటిని నేమించువాడవు
గావున బోవ నర్హముగాదు గావవలెమేము స్వామియాటనిను ॥శ్రీ

(3) మున్ను మహాబలి సవనంబున హరి మూఁడులోకముల్గొన త్రివిక్రముడై నిల్వ
క్రిన్నన నతనికి ప్రదక్షిణమునుజేసి గని యాదేవునిప్రస్తుతించితి నపుడు ॥శ్రీ

(4) పూర్వముగల బలము తరిగెనునాకుఁ బోవలేనిపుడన నంగదుఁడనియె
సార్వభౌముడౌ రామచంద్రునియెదుట జనలేనిట నే జీవమువిడచెద ॥శ్రీ

(5) తారాసుతుగని జాంబవంతుడనె తల్లడపడకు కార్యధురంధరుడు
మారుతిని ప్రోత్సాహపరతును ధీరుడతండని పల్కియువేగ ॥శ్రీ

ఖరహరప్రియ - ఆది

ప॥ మానము దాల్పనిదేల హనుమంతా ॥మా

అ॥ మాన్యుడవు కరుణను మముగను పావనీ ॥మా

చ॥ వినతాతనయుని బోలు వీరుడవు ఇనకులచంద్రుని హితుఁడగు దూతవు ॥మా
(2) తేజము వీర్యము ధృతియు బుద్ధి బలము పూజితమగు నిను బోలువారులేరు॥మా
(3) నీవేలయెఱుగవు నిర్మలాత్మ నిన్ను నవకోసలవర నగరవాసా ॥మా
జోర:-హనుమా విను నీ జననము దెల్పెద అంజన నీ జనయిత్రి
అనిలునకు నీ వౌరససుతుడవు జనకుడు కేసరి సుచరిత్రి ॥జ
(2) అదియెట్లన తొల్లి యంజన యతిసుందర రూపంబునను
సుదతీమణి గిరిశిఖరంబులపై సొంపుగ విహరింపగను ॥జ
(3) అనిలుడు మోహంబున నాసతిగని ఆలింగనమునుజేయ
అనియెను భీతిలి పవనునిగని దా ననఘా యిది నీతియె నీకనిన ॥జ
(4) నారీమణి వగవకు మిప్పుడు నాతో సముడగువాడు
వీరుడు శూరుడు ఘనుఁడగుసుతుడు ధీరుడుగల్గును నీకు ॥జ
(5) ఏమి కీడుగలదు నా సంస్పర్శ మెల్లప్రాణులకు సుఖప్రదము
భామామణి నీపాతివ్రత్యము భంగముగా దిటువినుము ॥జ
(6) అన ముదమంది అంజనదేవి అద్రిగహ్వరముఁజేరి
నినుగనె నప్పుడె యతిబలశాలిని వినుతశీల విను కోరి ॥జ
ద్విపద:- అనఘునీవు జనించి నప్పుడు మింట । వనజాప్తుఁడుదయింప పండని భ్రమసి
ఒనర మున్నూరు యోజనములు జనగ । నినకరమ్ములు నీదు తనువింతకమర
అనఘు లత్యముశేక అరుగుచుండగను । కనిమహేంద్రుండు దాఁ గడు కోపమంది
వనరుగా గొట్టె ని వ్వజ్రాయుధమున । హనువు భగ్నంబైన నవనీధరమున
బడియున్న నినుగాంచి పవనుండు కనలి । నినునంకమునజేర్చి ఘనదుఃఖమునను
కరువలి యంతట కదలకయున్న । ధరణీ తలంబెల్ల తారుమారయ్యె
ఊపిరాడకయంత సర్వ జంతువులు । తాపమొందుచుఁ జాల తల్లడపడగ
సరసిజభవముఖ్యసురలు వేగముగ । పురుహూతునింగూడి పోయియచ్చటికి
పవమానసుతు నిన్ను బ్రతికించివేగ । పవనుని వేడియు బ్రహ్మాదులెల్ల
వరములిచ్చిరి పెక్కు హరివర నీకు । సృష్టి దీవించిఁ జిరంజీవివనుచు
ధరనస్త్రశస్త్రాల మరణింపవంచు । హనువు భగ్నంబగుట హనుమంతుడనుచు
నిన పేరుకొందురంచనుచుఁ దావజ్రి । మృత్యువు నీచెంత కేగలేదనుచు
నత్యంత ముదముతో ననిరాని నింద్రుండు । పవనుడు సంతోష భరితుడై చెలగె
భువనములు ముదమందె బోయిరి సురులు । గాన నీచేగాని కార్యంబులేదు

పూని లంకకు నీవె బోయిరావలయు.

క॥ కూరిమి మాన్పై నంచియు వీరాగ్రణి లెమ్ము వేగ వివనిధిదాటన్
ధారుణిసుత క్షేమంబును శ్రీరాముని కెరుగఁజెప్పు ధీరుఁడ నీవె.

వ॥ జాంబవంతుడు ఇట్లు పేరేపింప చెలరేగి

ధన్యాశి - ఆది.

ప॥ అంబుధిదాటగ విజృంభించెను హనుమంతుడు వేగ ॥అం

అ॥ అంబరవీధిని ఆక్రమించియు అంజనతనయుడు మేనుపెంచెను ॥అం

చ॥ ఘనపరాక్రమమును గని ముదమున కలకలనాదములన్
వనచరులందరు చెలగి యుప్పొంగి అనిల సువర్ణ్ణసముడని బొగడగ ॥అం

(2) అరుణంబుగ ముఖపంకజమమర ఆదిత్యుడోయనగ
సురుచిరకాంచన చాయమేనితో మేరుధీరు నవకోసలవాసుడు ॥అం

క॥ వీరుండై కపివర్యుడు శూరత్వము దనర లేచి సుగుణుల గపులన్
జేరియు వలగొని మ్రొక్కుచు మారుతి యిటులనియె వారు మది హర్షింపన్

హిం:- అండజపతికి వేయిమారులు అతిశౌర్యంబున వలగొనివత్తును
కొండలు పిండిజేయుగలను ఆఖండలుజేతి యమృతము తేగల ॥శ్రీ

(2) కాంచెద సీతను కడలినిదాటియు కడువడి రావణున్ గట్టియుదెచ్చెద
ద్రుంచెద నసురుల క్షణకాలములో ముంచెద లంకను సముద్రములోన ॥శ్రీ

(3) సీతాదేవిక్షేమమున్ తెల్పెద శ్రీరఘురాముని జేరి మ్రొక్కెదను
భూతలమున విఖ్యాతినిబొందెద భీతినిమానుడీ కపివరులారా ॥శ్రీ

వ॥ ఇట్లు గర్జించి పలుకు గంధవహాత్మజుగని వానరవీరులు, మేలుమేలని బొగడ
జాంబవంతుండు,

సౌరాష్ట్రము - ఏక.

ప॥ సామీరీ నీతో సముడు ఈ మహి నెవ్వారులేరు ॥సా

అ॥ రామదాసుడవు నీవు కామారీ వీర్యశౌర్య ॥సా

చ॥ జగత్ప్రాణాత్మజా వీరా జానకిని గనెదవిపుడు ॥సా

(2) కేసరికుమార మాదు ఖేదమును శాపితివి ॥సా

(3) సురమౌని బృందములు స్వస్తిజేయుదురు నీకు ॥సా
(4) కపివృద్ధులెల్ల నీకు ఘటియింతురు మంగళములు ॥సా
(5) గురుకరుణ మీఱ నీవు తరియింపు సాగరమును ॥సా
(6) పవనతనయా బోవుమెపుడు నవకోసలపురనివాస ॥సా

జోర:- ఇందుండెదము నీ రాకకు వేచి ఏకపాదమున మేము
అందరిప్రాణము లుంచితిమి నీ యందు వేగరమ్మనుడు ॥జ

(2) నాలంఘనమున కోర్వద యీయిల నారోహించెద నీగిరిని
తాళును పదఘట్టనము మహేంద్రము దాటగ నూరామడల్ పరిని ॥జ

(3) అనుచును వానరు లందరుగూడియు అద్రిశిఖరముజేరి
వనలత పుష్పఫల భూజంబులు గని యుత్సాహముమీఱి ॥జ

(4) గజహరి శరభ శార్దూలంబులు గల యీపర్వతమందు
సుజన విధేయుడు విహరించెను కడలి సొంపు పెంపును గనుచు ॥జ

వ॥ అట్టి సమయంబున,

హిం:-హరి దంతావళిగ అణచినరీతిని హరిపదపీడన నాగిరియుండెను
ఇరవులవిడచి గంధర్వులు సిద్ధులు పరువులు బారిరి భయకంపంబుల ॥శ్రీ

(2) బెదరెడు మృగములు నెగిరెడి ఖగములు కదలెడు కుజములు ఘన లత గుల్మముల్
అదరెడు ఘోర సర్పంబులతో కుధరము గ్రుంగగ గుప్పించుచు మరి ॥శ్రీ

(3) మారుతి యప్పుడు గర్జించుచును మహేంద్ర నగంబుపైనను నిలచి
శ్రీరాముని పదకంజంబులు మది జేర్చియు హర్షముతోడను నంత ॥శ్రీ

జోర:-శ్రీమంతుడు బలవంతుడు ఘనుడు శీఘ్రము లంకకు బోవగ
భూమిజ గను నుత్సాహంబున మది పొంగుచుండె నవ్వేళగ ॥జ

### మంగళహారతి

ప॥ శ్రీరామచంద్రునకు జయమంగళముసదా సీతాసమేతునకు శుభమంగళం ॥శ్రీ

చ॥ హరిపుత్రుమైత్రిజేసి పరిమార్చి వాలిని కరుణతో తరణిజునకు కపిరాజ్యమొసగి
హరివీరులబంపి అవనిజ వెదుక వేగ హరిరాజు గొల్వగ అనుజుని గూడియున్న ॥శ్రీ

క॥ శ్రీరాముని పదభక్తిని గోరుచుఁ గిష్కింధకాండ గూర్చితి నిపుడే
ధారుణి నవకోసల సువిహారుఁడు హనుమంతుఁ డొగి సహాయముచేయగ

క॥ శ్రీపతి శ్రీరఘురాముడు తాపసమందారు డసురదమనుడు హరియుఁ
తాపము బాపియు కృపతో ప్రాపై రామమ్మగొనగు పరసౌఖ్యములుఁ

శ్లో॥ నమోస్తు రామాయ సలక్ష్మణాయ నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తువాతాత్మ భువేవరాయ నమోస్తు వల్మీక భవాయ తస్మై.

గద్య.

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షవీక్షణ లబ్ధ కవిత్వ శౌనకసగోత్ర పవిత్ర

శ్రీరామపుత్రి విరచిత

నవకోసల రామాయణము హరికథ

కిష్కింధాకాండము

సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరామార్పణమస్తు.

---

శ్రీరస్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

# నవకోసల రామాయణము
# హరికథ.

---

## సుందర కాండము.

కం॥ శ్రీరామచంద్ర శుభకర వారిజభవవినుత భక్తవందిత చరణా
మారుతసుత సంసేవిత వీరా కోదండరామ వేడెద భక్తిక్.

బేగడ - రూపకం.

ప॥ శ్రీరామా నిన్నే నెరనమ్మితిని ॥శ్రీ
అ॥ ధీరాగ్రగణ్యా దీనశరణ్యా ॥శ్రీ
చ॥ సారసదళనేత్ర శ్యామసుందరగాత్ర
శ్రీరఘుకులవర పవిత్ర సీతాహృత్పద్మ మిత్ర ॥శ్రీ
(2) దాసజన పరిపాల దాశరథీ నవకోసల
వాసా శృంగారలీల వరదా కరుణాలవాల ॥శ్రీ

హిందూస్థాని - ఏక.

ప॥ సీతాపతి పదకమల సేవకప్రియకర వాతాత్మజ నా వందనములు గొను ॥సీ
(2) రామనామామృత రంజితహృదయ కామితకల్పద్రుమ కరుణజూడుము ప్రేమ ॥సీ
(3) ధరణి సుతార్తి నివారణకారణ దురితసంహారణా ఘోరరాక్షస హారణ ॥సీ
(4) అఖిలభూతహిత అంజనాతనయ సకల సజ్జనుత స్వామి శ్రీరామదూత ॥సీ
(5) నవకోసలపుర నరవరపూజిత భవభయ సంహార భద్రయశస్కర ॥సీ

జోర:- ఆంజనేయుడు నామదినిలచి అందముగా బలికింప
ప్రాంజలినగుచును సుందరకాండము ప్రారంభించెద మోదమున ॥జ
(2) శ్రీకరముగ వానరులందరు జేరి ముకమ్ముగ నచట
నీకేతగు నీయబ్ధిదాటగ నిర్మలగుణయని పొగడ

(3) జాంబవంతుడటు తెల్పిన యంతనె సరగున ననిలసుతుండు
సంబరమున నా మహేంద్రపర్వతము చయ్యన జేరియు నపుడు ॥జ

(4) పాదంబులు గదియించి శ్వాస బిగబట్టియు నిటునటుగదుల
భూధరమది యుబ్బాతలూగె కరపాద ఘట్టనలచేత ॥జ

ద్విపద:- అనిలజుండాకాశమున కేగఁదలచి । తనమేను బెంచి తాఁదగనటు నిలచి
గరములు పాదముల్ గదియించినిక్కి । యురుకాయము గదల్చి యూపంగనపుడు
కడువడి గ్రుంగెను ఘనపర్వతంబు । బడి నేలగూలెను పలువృక్షములును
జలజలమని పుష్పములు రాల గిరిని । నిలచిన హనుమంతుపై నిండెవిరులు
అరయగ గిరిపైని చరియించుచున్న । గరుడ గంధర్వ కిన్నర మిధునములు
వెరచి పరువిడెనప్డు వివిధ జంతువులు । నిరవులు విడివడి వెతలపాలయ్యె
కరువలి కొమరుఁ డాకసమునకెగుర । తరువులు కొన్ని సాగరమున బడియె
భూరుహంబులనున్న పుష్పఫలముల వారిధి గనుపట్టె వైభవం బెనసి.

హిందూస్తాని తోడి ఏక.

ప॥ వనచరేంద్రులార వినుడి మనము లలరగ ॥వ

అ॥ జనియెద లంకకు శరనిధిదాటియు గనియెద జనకుని తనయను వేగమె ॥వ

చ॥ దనుజులనెల్ల బట్టిగొట్టియు ఘనుడు రావణుతో గొనితెచ్చెద లంకను వేగమె
।వనజభవాదులు మెచ్చ గనుడీ నాదు బలశౌర్యంబులు ఘనుడగు నవకోసలపతి కరుణను

హిం:- బంధు జనంబుల తెఱగున నప్పుడు పలుతెఱగుల తరుల్ పవనజు వెంటను
సింధువుమీదికి నెగసి పరువిడి అందందునను సాగరమునబడె ॥శ్రీ

(2) ఆకాశంబున బోవు వేగంబున అంబుధి తోయముల్ అల్లకల్లోలమై
భీకరమగు యా జలచరంబులు ఆకులపాటున తలక్రిందు లయ్యెను ॥శ్రీ

(3) రఘుకులపతియగు రాముని దూత గగన పథంబున బోవుచునుండగ
అగణితమగు అల లంబరమునంటి ఆనందంబున పొంగెను జలనిధి ॥శ్రీ॥

తే॥ భానురుచి మించు మోమున పసిడిచాయ మేనికాంతులు మెరయగ మింటనంటి
బోవు హనుమంతుగని మెచ్చి భావమలర సిద్ధచారణు లిట్లనిచెప్పుకొనిరి

శంకరాభరణము — చాపు.

ప॥ మారుతి దాటెను వారిధిని శ్రీరామచంద్రుని జేర్చి మదిలో ॥మా

అ॥ ఈరేడు జగముల లేరయితనికెసరి యీవీరుని బలశౌర్య మెంచగ దరమా ॥మా

చ॥ పంకజాక్షి రామపత్నిని జూడగ లంకాపురిజొచ్చు శంకలేక నిపుడె ॥మా

(2) దనుజుల బరిమార్చి గనుగొని జానకిని జనుదెంచు వేగమె జయముచేకొని వేడ్క

(3) పరమభక్తిని రామభద్రునిజేరయు నెఱిగించు ప్రియమున జానకి విధమెల్ల ॥మా

(4) ధర నవకోసలధాము శ్రీరాముని పరమభక్తుడితడె దురితవిదూరుడు ॥మా

వ॥ అట్టియెడ.

జోర:-ఘనుడా హనుమ రామబాణమన వినువీధిని జనుచుండగ

వననిధి మైనాకుని గని యిట్లనియెను మోదముతోడగ ॥జ

(2) అరిగెడు రాముని కార్యము సలుపగ అంజనాత్మజుని గనుమా

మరి యాతని కాతిథ్య మియ్యవలె మనమలరగ వేగమున ॥జ

(3) ఘను లిక్ష్వాకులు పూజ్యులు మనకును గాన నీవు వేగమున

జని యెదురుగ హనుమంతుని కతిథి సత్కృతు లొనరింపుమి యనిన ॥జ

(4) విని సంభ్రమమున మైనాకుడు తా కనక శృంగములు వెలుగగ

వననిధినుండి పైకిలేచెను వాయుసుతుని గనుగొనగ ॥జ

(5) అతివేగంబున బోవుచుండు నా యనిలతనూజుని గాంచి

అతిథి సత్కృతుల గైకొనుమా యోయార్యపూజ్య నన్నెంచి ॥జ

(6) దినకరకుల తిలకుని కార్యమ్మును దీర్పగబోవు ఘనుండా

అనువుగ నాతటమున విశ్రాంతిని గొనిచనుమా యిటనుండి ॥జ

(7) నను గాపాడెను మును నీజనకుడు వినుమా యాపదనుండి

అనిలుం డాతండు సంతసింపగ నిను పూజించెద క్షణముండు ॥జ

తే॥ సాగరులచేతం బెంపొందె సాగరుండు వారు పూజ్యులు వార్ధికి వారివంశ్యుం

డయిన రాముని పనికినై యరుగు నీకు నొసంగనాతిథ్య మనిపె నన్నుదధియిపుడు

జోర:-మైనాకుని మాటలువిని యామారుతి వినయముతో నిట్లనియెగ

మానెద నేనిట నిల్వతగదుసూ మానకచనవలె విలననియెగ ॥జ

(2) ఆదరమున మీరిటు బల్కుట నా కాతిథ్యము గిరినాథా

మీదయచే మైథిలిగని నే మిముజేరగ వచ్చెద వేగ॥జ

వ॥ అనిబల్కి యాకొండ శిఖరంబును తన హస్తంబునద్రాకి బోవుచుండ ఆంజనేయుని

ధృఢ నిశ్చయంబుగని సంతసించి దివిజులు ఆమహాత్ముని ! బలంబు దెలియగోరి

సురసయనుం దానింబిలచి ఈవాయుకుమారుడు సముద్రింబుదాటి లంకకు బోయి వచ్చుటకు సమర్థుండవునో కాదో! యితని బలాబలంబులు బాగుగ బరీక్షించి రమ్మనిన నాగులకు తల్లియగు నాసురస ఘోరరాక్షస రూపంబు ధరించి హనుమంతుని కడ్డంబువచ్చి యిట్లనియె

సీ॥ వినుమయ్య హనుమంత విధినాకు నిన్నిప్డు డాహారముగ జేసెనయ్య రమ్మ టంచుఁ దన్నదియంగ నరసి మారుతి యామె కతివినయమ్మున ననియెనిట్లు అమ్మ లంకకుఁబోయి యాసీతఁ గన్గొని తత్క్షేమవార్త భూధవునికెఱుక పఱిచి దాక్షాయణి! మఱి సత్వరమ నేను వచ్చిచొచ్చెద నీదు వదనమునను నిక్కమిది నమ్మునామాట నెమ్మితోడ విడువుమనిపల్క సురస దాననియె నిట్టు లవుర నను గెల్చిపోవంగ నవునె నీకు బ్రిదికి పోలేవు నానోటఁబడిన నంచు.

ద్విపద:-సురస పదామడల్ తెరవగానోరు। హరి పెంచెఁ దనమేను నిరువదామడలు సురస ముప్పదిచేయ హరియునల్బదిగ। వరుసగా నిరువురు వాదంబుతోడ సరగున పది పది మరియు హెచ్చించి। నూరు యోజనముల నోరు దెర్వగను మారుతసూనుండు మదినియోచించి। ధీరుఁడై యంగుష్ఠ మాత్రుఁడై యంత నోరిలోపలజొచ్చి శూరుండు సురస। నోరు మూయకముందె॰ తారి వెల్పలికి వినువీధి కెగసి యా వీరుండు వేగ। నిను గెల్చితినితల్లి గానుము దండంబు లనిపల్క దీవించె ననిలజునిట్లు। సిద్ధించు కార్యంబు శీఘ్రిమ్ము పొమ్ము శుద్ధమానస ధరాసుతఁ గాంచిరమ్ము.

వ॥ అపుడు ఆంజనేయుడు సురసనోటనుండి వెలువడుట దేవతలుజూచి సంతోష చిత్తులై,

హిందూస్తాని — ఏక.

ప॥ జయ జయ హనుమంతా జగన్నుత ॥జ

చ॥ భయనివారణ భక్త సంరక్షణ దయామయ ఘోర దైత్యసంహారణ ॥జ॥

(2) మేరు మందర తుల్యశరీర శూరా వీరా దనుజసంహార ॥జ

(3) పరమపావన పవనతనూజ నిరుపమతేజ పరమదయాబ్జా ॥జ

(4) దాసజన మనోరంజన రఘురామ దాసా నవకోసల పురవాస ॥జ

వ॥ ఇట్లు దేవతలు కొనియాడుచుండ ఆకాశ మార్గమున బోవునెడ సింహికయను రక్కసి కామరూపిణి హనుమంతునిజూచి చిరకాలమునకు నాకాహారము దొరికినదని యాయసుర అతని నీడనుబట్టిన ఆంజనేయుండిట్లు యోచించె

జో॥ర:-బలహీనుడనై కదలకుండుటకుఁ దెలియు నిమిత్తంబని తలచి
చెలగి వారినిధి జలమున నుండెడు సింహికయను దానినిజూచి ॥జ

(2) సుగ్రీవుడు మున్నెఱిగించిన రక్కసి జూడగ నిదియేయనుచు
ఉగ్రాకృతి తన ఛాయబట్టెనని ఊహించి కాయముబెంచియును ॥జ

(3) అంతట నాసింహిక హనుమంతునిజూచి అరచి నోరుదెరచి
పంతంబున వానరునిచెంతకు పరువిడివచ్చెను మించి ॥జ

(4) తనుమ్రింగగ వచ్చిన ఛాయాగ్రాహిణి గనియును వాయుసుతుండు
తనదేహము చిన్నదిగావించియు మఱి దానినోట జొచ్చియును ॥జ

(5) ఆకాశంబున సిద్ధచారణులపుడు ఆరక్కసి నోటనుబడిన
శ్రీకరుడైన యాంజనేయుగని చింతించుచుండ వేగమున ॥జ

(6) హనుమంతుడు తనగోళ్ళతో దాని తనువున ప్రేవులుద్రెంచి
ఘనమగు రక్కసివదనమునుండి జనుదెంచె వేగ వెలుపలికి ॥జ

(7) హనుమంతుం డతి సాహసంబున నాసింహిక నటుబడద్రోయఁగ
వననిధిబడి జచ్చెనపుడు వనచరుఁగ బొగడిరి దేవతలంతఁగ ॥జ

(8) సురవరుల్ సుమవృష్టిని గురియగ కడుసొంపుమీరగ హనుమ
జేరియు యావలితీరము లంకాచెలువము గని మోదమున ॥జ

(9) ఘనమగు నానావిధ తరు లతలతో వనములను పవనములను
హనుమంతుడు గనె త్రికూటశిఖరము నందుండెడు లంకాపురము ॥జ

(10) అతిమనోహరము కనకమయంబౌ నాలంకానగరము గనియు
మతిమంతుండగు నాంజనేయుడిటు మదియోచించెను దా నపుడు ॥జ

తే॥ ఎట్లుదాటుదు రీ వార్ధినెల్ల కపులు లంకఁజొచ్చుట యేతీరు శంకలేక
రామచంద్రుండు నిటవచ్చి యేమిచేయు ననుచుదలపోసి యప్పుడాయనిలసుతుడు

తే॥ ఇన్ని యోచన లిటుచేయనేల నాకు నున్నదో లేదో లంకలో యువిదసీత
వెదకి గనుగొని ముదమంది వేడ్కమీర అవల యోచింతమని యెంచె నపుడతండు

వ॥ కార్యక్రమం బెట్లుజేయుటయని యోచించి, యీ ఘనశరీరముతోడ రావణ
పాలితంబగు లంకఁజొచ్చిన, రాక్షసులు నన్ను గనుగొందురు. కలహింతురు
గావున, మనమువచ్చిన దెవరిక దెలియక వెదకుదమని సూక్ష్మశరీరంబుదాల్చి

డోర:- కపివరుడిటు దలపోయుచు మదిలో ఘనముగ లంకనుజొచ్చెన్
అపుడు లంకిణి అడ్డమునిలచి ఆంజనేయుని గని యిట్లనియెన్ ॥జ

హిందూస్థాని-ఏక.

ప॥ వనచర నీవెవడవు జనియెద వెచటికి జంకక దెల్పు ॥వ
(2) వనిత నీవెవ్వరు ఘనమగు యీలంక గానగ వచ్చితి ॥వ
(3) నాపేరు లంకిణి కాపుందు దానను లంకనెవ్వరు జొరక ॥వ
(4) లంకిణి విను వేడుకన్ సంకోచమేలను లంకగని వచ్చెద ॥వ
(5) వినుర యో తరుచరా ననుగొల్వలేకను జొరలేవు లంకను ॥వ
(6) పరికించెద పురివిభవమున్ ధరనవకోసల ధాముని దలచుచు ॥వ

డోర:-అని బల్కినవిని కనలుచు లంకిణి అరచేతను గొట్టెను పవనజుని
వనితయనుచు నొక చెంపగొట్టె తన వామకరంబున దాని ॥జ

(2) విలవిలతన్నక లంకిణి యవుడే యిలబడి మూర్ఛిలి లేచి
వలగొని మొ్రొక్కి యంజనాత్మజుని బలికెనిట్టు లా నాతి జ॥

(3) వనజభవుండు దెల్పెను మున్ను వానరుడిట వచ్చియును
నిను నోడించిన యప్పుడె చేటు ఒనగూడును లంకకు ననెను జ॥

(4) కావున నీవు లంకను జొచ్చియు కడుముదమున శ్రీరాము
దేవిని కనుగొనిరమ్ము శీఘ్రము దివిజులుమెచ్చగ మరియు జ॥

(5) లంకిణి పల్కులువిని మారాతి లంకజొచ్చె నిశ్శంకన్
లంకంతయుగని రావణు గృహము జంకకజొచ్చెద వేగన్ జ॥

క॥ వెదకె ప్రభంజన సూనుడు సదమలమతి లంకయందు సర్వగృహములన్
మదవతు లుండెడు స్థలములు మదనార్తులు దిరుగునట్టి మణిభవనములన్.

డోర:-భర్మ హార్మ్యముల మణిమయ గృహముల స్వస్తిక పద్మములందు
ధర్మశాలలను దనుజుల యిండ్లను ధరణిజ వెదకెను వేగంబు ॥జ

(2) సతులు పతులుగల శయ్యాగృహముల సాధ్వీల నిలయములందు
పతివ్రత లుండెడు దివ్య సదనముల పరికించెను పవనుజు డంతన్ ॥జ

(3) వీణావేణు మృదంగ తాళ ముఖ వివిధ వాద్యంబులును
గానముజేసెడు స్థలములనెల్ల కలయదిరిగి జూచుచును ॥జ

(4) వేదాధ్యయనము జేసెడు గృహములు వీరభటులుగల చోటక్
మేదిని పుత్రిని వెదకెను మరి మించిన శౌర్యముతోడక్ ॥జ

(5) ఘోరరూపులగు రాక్షస వనితలు గూడియుండు దిక్కులను
చేరియు మూల బలములనెల్ల సారెకు శోధించియును ॥జ

(6) ఎందునుగానక జనకజ నప్పుడు కుందుచు మదిలో హనుమ
అందందు దిరిగి యారావణు భవనము నందుజేరి వేగమున ॥జ

(7) ఒక కన్నునొక చెవిగల వారల వికృతాకారుల మరియు
వికలాంగులను గోముఖ నజముఖ వింత రక్కసుల గనియు ॥జ

(8) చంద్రోదయ మప్పుడగుటయు రామచంద్రుని దూతయుబాగా
యింద్రనీల మణి సౌధములమరి వెదకి వెదకియు వేగా ॥జ

వ॥ రథగజ తురగ పదాతులచే విలసిల్లునదియు మరియు,

తే॥ కనకగోపుర ప్రాకార కలితమగుచు దివ్యమణిరత్న సౌధముల్ తేజరిల్లు
రావణుని మందిరముగాంచి పావనిమది వెరగుపడె వాని సంపదా విభవములకు

వ॥ లంకకు ఇదియొక భూషణంబు అని తలచుచు రావణుని గృహసమీపమున గల కుంభకర్ణుడు విభీషణుడు ఇంద్రజిత్తు జంబుమాలి ప్రహస్తుడు మొదలుగాగల రాక్షసుల గొప్ప ఇండ్లను ఉద్యానవనంబులను సీతను వెదకుచు నిర్భయుండై తిరుగుచు రావణుని మందిరము ప్రవేశించి వాని సమీపమున వికారములగు నేత్రములుగల్గి శూలముద్గర శక్తి తోమరాద్యాయుధముల ధరించియుండు రాక్షస స్త్రీలను నానావిధములైన సేనలను జూచుచు,

హిం:- బంగరు మయమగు వల్లకీలను శృంగారంబగు లతాగృహములను
రంగవల్లులుగల లీలాగృహముల రంగగు చిత్రవిచిత్ర గృహంబులక్ ॥శ్రీ

(2) క్రీడాగిరులను ఆడెడు నెమళ్ళను పాడెడు కోవిలల్ బలికెడు చిలుకలు
పోడిమిగ బంగారు శయ్యలను వేడుకౌ వివిధవస్తుజాలంబులుక్ ॥శ్రీ

(3) దినకర ప్రభలచే దీప్తిచెలంగెడు ఘనమగువజ్రముల్ పొదిగియున్నట్టి
వనరుగ చిత్ర వర్ణంబులుగల ఘనమగు పుష్పక విమానముక్ గనెను ॥శ్రీ

సీ॥ నవరత్నఖచితమై నాణ్యమైయొప్పెడు వరవిమానమునందు వజ్రమయపు
సోపాలు కుర్చీలు సొగసైన పానుపుల్ అతిమనోహరమైన ఆసనములు

సెందరుగూర్చున్న నెడమిచ్చుచొకరికి కుందనంపుబొమ్మ లందమొసంగ
అంతరిక్షంబున అర్కునివలెనుండి యాకాశమార్గాన నరుగునట్టి
స్వచ్ఛమైయొప్పు శారదచంద్రికవలె చాలరమణీయమై చైత్రింపు సమయమనగ
అతిమనోహరమై శ్రేష్ఠమైనయట్టి పుష్పకంబున వెదకెను పుడమి సుతను.

హిం:- భూలోకమునకువచ్చి యున్నట్టి కైలాసంబో స్వర్గమోయనగ
చాలరమ్యంబౌ వరవిమానమున జానకీ వెదకుచు హనుమంతుండు ॥శ్రీ

(2) వెదకితి లంకలో సర్వదిక్కులను వెదకితి నీ విమానమునందునన్
సుదతీమణి శ్రీరాముని పత్నిని జూడనైతి నని చింతించియు మది ॥శ్రీ

జోర:- నీతిశాలినులు సత్కులాంగనలు నిర్మలమతిగలవారు
పాతివ్రత్యమహిమను మెలగెడు పరమసాధ్వుల నరయుచును ॥జ

(2) వారలగనుగొని వాయుకుమారుడు వజ్రమణుల స్ఫటికముల
చేరియు బంగరు నవరత్నంబుల చేతనొప్పు మంచమున ॥జ

(3) కనకాసనములు అగరుధూపములు గంధమాల్యములును
ఘనముగ వింజామరములు వీచెడు మణిపుత్రికలచే నొప్పియును ॥జ

(4) బాగుమీరెడు పానుపుపైని పవ్వళించియున్నట్టి
మేఘ సమానుని సుందరరూపుని మణికుండలు రావణుని ॥జ

(5) రక్తచందన లిప్తాంగుని మరి రమణీప్రియుడగు వాని
రక్తనేత్రములు గలుగువానిని రాక్షసరాజగు వాని ॥జ

(6) హనుమంతుం డారావణుడగ్గరి గని ఛీ పాపీయనుచు
జనకజ దొంగిలి దెచ్చిన క్రూరుని సరస నిలువరాదనుచు ॥జ

(7) కొంతదూరమటుపోయి రావణుని చెంతబరుండిన స్త్రీలన్
వింతగరావణు భుజముల తొడలను వివిశలైన సతులన్ ॥జ

(8) ఇట్టి స్త్రీలను గని హనుమంతుడు ఏకాంతంబగుచోట
పట్టమహిషియగు మండోదరియు పవ్వళింపగని యొకపానుపున ॥జ

హిం:- ఈసుందరీలలన యతిసుకుమారీ ఇందీవరేక్షణ యిందునిభానన
భాసురగాత్రి పరమపతివ్రత భానుకులేశుని భార్యయనియెంచి ॥శ్రీ

(2) వాలమునెత్తియు నేలనుగొట్టి వజ్రస్థంభము పైకెక్కియును
నేలకుదుమికియు నానందంబున నిటునటుదిరుగుచు గానము జేయుచు ॥శ్రీ

(3) సంతోషంబున శోకనుముద్దిడి గంతులువైచుచు కపిభావమున
ఎంతయు మదిలోపొంగుచు మారుతి ఈసుందరి సీతయనిదలచి మరల ॥శ్రీ

క॥ శ్రీరామునిసతి యగునెడ నీరీతిని సుఖమువిూర నెటు నిద్రించున్
నీరముగోనునె భుజించునె కూర్రుడు రావణుని యింట కోమలి తలంపన్.

వ॥ ఇట్లుదలపోసి యటనుండి పానశాలంజొచ్చి భక్ష్య భోజ్యంబులు మధు మద్య మాంసములును పక్వఫలములును కనకపాత్రంబుల పాలు నేయి పెరుగును ఉప్పు పులుసు కారములచే పక్వము జేయబడిన పదార్థములను హేమరత్న పర్యంకములను సర్వాభరణముల కాంతులు వెలుంగ నిదురించు స్త్రీలను సగముదిని మిగిలిన యన్నపానీయంబులుగల కనక నవరత్న ఖచితంబులైన యనేక పాత్రంబులను సుగంధాగరు వాసనలుగల స్నాన పాన భోజనశాల లన్నియుజూచి సీత నెందునుగానక కులకాంతల జూచుటవలన నాకు ధర్మహాని గలిగెనని చింతించి మరలనిట్లు దలంచె.

జో॥ర:-సీత నిమిత్తము అంతఃపుర కులస్త్రీలను జూచిన నాకున్
పాతక మెటుగల్గును దశకంఠుని పత్నులజూచుట వలనన్ ॥జ

(2) పాప పుణ్యములు బొందుదు రింద్రియ బలమున మనసు చలింపన్
పాప పుణ్యములు లేవు చలించని భావముగల్గుట వలనన్ ॥జ

(3) స్త్రీలమధ్యగద స్త్రీని వెదకవలె స్త్రీలు లేనిచోటన్
బాలచంద్రముఖ జానకినెట్లు పరికింతును నే గానన్ ॥జ

(4) పరిశుద్ధంబగు మానసంబున పరికించితి దోషములేదు
గరుడ గంధర్వ కన్యలగాంచితి ధరణిః గనబడ దిందు ॥జ

(5) ఇటు చింతించుచు పానశాలను విడచియు మరల నపుడు
పటుధైర్యంబున నంతఃపురమును భావించిచూచె బాగుగను ॥జ

(6) చిత్రవిచిత్రంబగు గృహముల మరి జేరి లతాగృహములను
ధాత్రీసుతను గానకయపుడు తల్లడిల్లి మదిలోను ॥జ

వ॥ అహా! శ్రీరాముని పత్నియగు జానకి గనుపింపదు మృతిజెంది యుండునేమొ యనుచు,

ముఖారి - ఆది.

ప॥ అంతట వెదకితి అవనిజన్ లంకాపురి ॥నం

అ॥ సంతసమున సీతాకాంతను బాధక చింతచే వానరులచెంత కేటుల బోదునే ॥నం

చ॥ వారిధిదాటి నేవచ్చి లంకనుజొచ్చి చారుముఖిని గానసైతి నిటుల
ధీరుడ నగుచును అసురుల్లయిరవుల దిరిగి తిరిగి మరి ఫలము బొందనైతి ॥నం

(2) కూరుడు రావణుడు రాముని ధర్మపత్నిక చోరుడై దెచ్చి యెందు జేర్చియు
కారుమాటలాడి ఖండించెనేమొ వరనవకోసల వీరుడని వెఱవక [న్నాడో

జోర:-అని చింతించి ఆంజనేయుడు అంతిపురమ్మును జేరి
జనకజ వెదకెను భూగృహముల పుష్పశాలలందు మరి సీ ॥జ

(2) ఉన్నత స్థలముల కెక్కుచు దుముకుచు వానరేశ్వరు డపుడు
తిన్నగ తలుపులు దెరచుచు మూయుచు దిరిగెను లోవెలువలను ॥జ

(3) సందు గొందులను వీధివీథులను సకల దేశముల నంతట
అందమైన నడబావుల కొలకుల అవనిజఁ గాంచెడు చింతట ॥జ

వ॥ హనుమంతుండు విమానముదిగి ప్రాకారంబుపై గూర్చుండి అతిదుఃఖితుడై,

ద్విపద:-శ్రీరామునకు మేలు జేయంగనెంచి। చేరి యీలంకను సీతను నేను
చెఱువులు గుంటలు సరసులు నదులు। గిరులును వనములు పురవీధు లిండ్లు
అరసితి రావణు నంతఃపురంబు। ధరణిజ గనుపింప దాయెను వెదక
జనకతనూజాత వనధిలోబడెనో। వినువీధివచ్చుచో వీడిరావణుని
ఇలపైని బడినదో యెరుగరాదయ్యె। ఖలుడు రావణుడు దా ఖండించెనేమొ
సీతయిందున్నట్లు చెప్పెసంపాతి। యీ తలోదరియిందు యగపడదాయె
హా రామలక్ష్మణ యనుచు చింతించి। వీరపత్నీమణి విడిచె బ్రాణములు
కూరులు రక్కసుల్ కొట్టుక తినిరొ వార్ధిలంఘించి నే వచ్చుట యిటకు
వ్యర్థమయ్యెను తోడివారలఁగాంచి। నేమనిబోవుదు నేమి జెప్పుదును
రామలక్ష్మణులతో రవిసుతుతోడ। సీతలేదని యెట్లు జెప్పుదు నోట
వినినంత ప్రాణముల్ విడుచురాముండు। మనదు సోదరునిగని ఘనుడు లక్ష్మణుడు
భరత శత్రుఘ్నులుఁ బడిపోదురిలను। మరివారి తల్లులు మరణింతురంత
గనిరాము దుఃఖంబు దినకరసుతుడు। తనువును విడుచును తత్క్షణంబునను
అంతట రుమయును నంగదాదులును। చింతచేజత్తురు చేరివానరులు
అసువులు విడిచెద రందున నిపుడు। వెన నినవంశమ్ము వీరులౌ హరులు
నసిచెడి సర్వనాశము నందకుండ। వసుమతి సుతఁగాంచ కసదునై నేను
పోను కిష్కింధకుఁ బోకయుండినను। మానినిఁగనివచ్చు మారుతి యనుచు
మానని యాశతో మనెద రెల్లరును

వ॥ అనిదలపోసి యింకను వెదకెదను, మరియు గనపడనియెడల,

జోర:- చిచ్చునంబడి నే ప్రాణమువిడచెద చేరి యుదధి బడియైనం
జచ్చెద మరి ప్రాయోపవేశమున నిశ్చయ మింతయెగాక ॥జ

(2) జనకజ నాకును గనబడకుండిన మునివృత్తిని పూనియును
తనువున ప్రాణము నిలిపియుండెదను తపముజేయుచును నేను ॥జ

(3) బ్రతికియుండిన జనులు శుభమ్ములు బడయుదురను లోకోక్తిక
బ్రతికియుండెదను వానప్రస్థ వ్రతము సల్పుచును భక్తికా ॥జ

(4) ఈవిధమున దుఃఖించుచు మారుతి యిటుదలచెను కోపమున
రావణుతలలు గూల్చెద ధరపై రామునిసతిదెచ్చిన పగతీర ॥జ

(5) అటుగాదేని రావణుసీడ్చుక అంబుధిదాటియు వేగ
కుటిలునిజేర్చెద రామునన్నిధికి ఘోరరాక్షసులతోడ ॥జ

(6) ధారుణిసుత గనుపించువరకు నే ధైర్యముతో నీ లంకకా
సారెసారెకు వెదకుచుండెదను సందుగొందులను మరలకా ॥జ

(7) శ్రీరాముండిట వచ్చియుండిన సీత చిక్కనందులకు
కూరిమివిడచి కపులనందరిని గూల్చును కోపముతోను ॥జ

(8) ఇలనాప్రాణము నిలుపుటకొఱకు వలసినంత దినియు
చెలగియు నింద్రియ నిగ్రహంబున నిలచియుండెదను మరియు ॥జ

వ॥ శ్రీరాముడు మొదలగు నరులును, సుగ్రీవుడాదిగాగల వానరులును, నా నిమిత్తము ప్రాణములు విడువకుందురు అనిదలంచుచు, ఇదుగో గొప్పవృక్షములు గల అశోకవనంబు గనపడుచున్నది. అచటికి బోయెదను ఆవనమున నింత వరకు సీతను వెదుకలేదు అనియెంచి అష్టవసువులకు, సప్తమరుత్తులకు, ఏకాదశ రుద్రులకు, అశ్వనీదేవతలకు, నమస్కరించి అశోకవనంబునకు బోయెద. ఇక్ష్వాకుకులంబున కానందము కలుగజేయు సీతాదేవిని శ్రీరాములకు సమర్పించెదనని మహాతేజస్వియగు హనుమంతుండు ఒక ముహూర్తకాలము చింతించి, యచటనుండి లేచి అశోకవనముజేర నుద్యుక్తుండై,

ధన్యాసి - ఆది.

ప॥ శ్రీరామ లక్ష్మణులకు భూమిజకు జేసెను నమస్కారములు ॥శ్రీ

అ॥ ధీరుడు వాయుదేవునకును అష్టదిక్పతులకు సకలదేవ మానులకెల్ల ॥శ్రీ

చ॥ శ్రీ మహావిష్ణువునకు రుద్రునకు కమలసంభవునకును
భూమి జలానిల భూతజాలంబులకు పుణ్యపురుషులకు భూరివిక్రముడు॥శ్రీ

(2) ఘనులార మీరందరునాకు కార్యసిద్ధి గల్గజేయుడనుచు
మనమున నవకోసలుని ధ్యానించుచు జనకజవెదకగ ననిలతనూజుడు ॥శ్రీ

జోర:- శృంగారంబగు అశోకవనము సంతోషంబున జేరి
మంగళకరి శ్రీరాముని దేవిని మరివెదకెద ధైర్యముబూని ॥జ

(2) అనితలపోసి యశోకవనంబా హనుమంతుడు వేగ జొచ్చి
ఘనమగు ఫలవృక్షంబుల లత్లను గదల్చుచు దుర్కించుచు ముదమునను ॥జ

(3) బంగరు వెండి వృక్షంబుల మరి పక్షిరుతమ్ములు చెలగి
మంగళకరమై అతిరమ్యంబై మనమునకింపగుదాని ॥జ

(4) వివిధములగు బహుమృగపక్షులతో వెలయుచున్నదాని
భువనోన్నతమై పుష్పఫలంబుల పొలుపొందెడు దాని ॥జ

(5) అన్నిదిక్కులకు పరుగులెత్తుచు అవనిజవెదకుచు నంత
నెన్నగ వృక్షములెక్కుచు గూల్చుచు నిటనట శోధించెను హనుమ ॥జ

(6) తరులుగూలెను విరులురాలెను ధరణీతలమున నపుడు
విరులునిండిన కొండచాడ్పు కపివీరు డుండె వనమందు ॥జ

వ॥ పుష్పంబుపై నిండి యా హనుమంతుడు వసంతుడేమొ యనునట్లు వసంతఋతువునుగాన, అందమైన అశోక వనమంతయు దిరిగి, సీతను వెదకుచు మనోహరస్థలంబు లరయుచు,

సీ॥ రత్నఖచితమైన రమ్యప్రదేశముల్ బంగారు రేకుల ప్రభలుమీర
పగడము ముత్యముల్ బరచిన స్థలములు స్ఫటికసోపానముల్ సరసులందు
పద్మోత్పలంబులు బాగుగ వికసించి రాజహంసలచేత రమ్యమగుచు
అమృతోపమానమైనట్టి జలమ్ముల సీటికాల్వలతోడ నిర్మలముగ
చేరి మణిమయసౌధముల్ చిత్రముగను మేఘమునుబోలు శిఖరముల్ మెరయుచు.
అందమగు హర్మ్యములను నందందుగనుచు వెదకె జనకజ నాకపివీరుడచట [న్న

తే॥ పుష్పఫలముల నొప్పెడు భూరుహములు దివ్యమణిరత్న గృహముల తేజరిల్లు
ఛత్రచామరములుగల శయనములును అతి మనోహర స్థలములం దరసియరసి

హిం:-నలుప్రక్కల తరులతలను సొంపై అలరుచుండు స్వర్ణమయమగు అరుగులు
గలిగి మనోహరమై యుండెడి నొక ఘనమగు శింశుపా వృక్షముగనుగొని ॥శ్రీ

(2) బంగరు గంటలు చెలగుచున్న యీ శృంగారంబగు వృక్షమునెక్కి
అంగనరత్నమా సీతాదేవిని అరయుచుండెదను నలుదిక్కుల నే ॥శ్రీ

(3) చందన చంపక వకుళవృక్షముల అందమైన యీ అశోకవనంబును
చందనగంధి రమ్యమైన యీ పరసును జూడగ వచ్చును నిజము ॥శ్రీ

(4) పూర్ణచంద్రసమ ముఖపద్మముతో పుండరీకదళ లోచనములతో
స్వర్ణాంగియౌ శ్రీరాముని పత్ని యా సాధ్వీమణి యిందువచ్చును జూచెద ॥శ్రీ

(5) అని దలపోయుచు నావృక్షముపై ఆకులమధ్యను డాగియుండియు
జనకజనెట్లు జూచెదనోయని గనుచుండెను నలుదిక్కుల హనుమ ॥శ్రీ

వ॥ అచ్చట నొకప్రక్క వేయి వజ్రస్తంభములతో కైలాసమువలె నుండునదియు
కుందనమున ముత్యములు పగడములు పొదిగిన సోపానములతో ప్రకాశించు
నదియు సుందరమునగు చైత్ర్య ప్రాసాదమును జూచుచుండు సమయంబున,

సీ॥ మలినాంగమున నొంటి మాసినచీరతో అసురాంగనలమధ్య నడలుదాని
గ్రాసంబు ముట్టక కడుచిక్కి దేహంబు యూర్పులు విడచుచు నుండుదాని
చంద్రరేఖనుబోలి స్వచ్ఛమై యుండియు పొగగప్పు నగ్నిని బోలుదాని
నిది రూపమని గుర్తు లెరుగరాకుండియు భాసురాకారమై బరగుదాని
దీనమై యేడ్చుచును దిక్కులేనిదాని రక్కసులజూచి భయమున స్రుక్కుదాని
వనజదళములబోలెడు కనులయందు కాల్వలై పారు కన్నీళ్ళు గలుగుదాని
దుఃఖమెన్నడు నెరుగని తోయజాక్షి విభుని ధ్యానించుచున్నట్టి విమలమతిని
సుఖము బొందంగ నర్హ యా శుభచరిత్రఁ జూచె హనుమంతుడచట నాసుందరాంగి

క॥ సుందరి నతిసుకుమారిని యిందిర సరిబోల్పదగిన నిద్ధ సురూపన్
డెందమున భయముచే నాక్రందన మొనరించుసతిని గని కపివరుడున్

వ॥ రావణుడు గొనిపోవు సమయంబున నెట్టిరూప లావణ్య సౌందర్యముగల స్త్రీని
జూచితినో ఆసాధ్వీతిలకమే యీమె గా నున్నది. కావున నీమె రఘువీరునిసతి
యని భావించి,

తే॥ జానకిని గంటినని నతి సంభ్రమమున వాలమునుద్రిప్పి గంతులువైచి వేడ్క
చెట్టుచెట్టుకు లంఘించి గుట్టుగాను వర్ణములమధ్య గూర్చుండి పవనసుతుడు

డోర:-సీత ధరించిన భూషణములుగని శ్రీరాముడు దెల్పినవే యివి యనియు
వాతాత్మజు డూహించుచు నపుడు భూతలసుత గనుగొనియు ॥జ

(2) చేరియు ఋశ్యమూక నగముపై జారవిడచిన నగలీ
నారీమణి యొడలిని లేవుగానను ధారుణిసుతయని దలచెద మదిని ॥జ

(3) బంగరు ఛాయగల్గిన చీరయు శృంగారంబగు మేను
మంగళకరి యీసాధ్వీరత్నము మైథిలియే నిశ్చయము ॥జ

(4) కరచరణా ద్యవయవముల యందము ఘనుడగు రాముని బోలి
తరుణీమణి యిట నలరుచున్నది తథ్యంబిదియని మదినీ ॥జ

(5) తగు నీసతికి రామచంద్రుడు తగును రామునకు సీత
సుగుణాకరులు సుందరగాత్రులు తగు దాంపత్యం బిది చూడ॥ జ

(6) ఇరువురి మనసు లన్యోన్యమైత్రిచే వెలయుచున్నవారు
అరయగప్రీతి విడువని కతన ధరజీవించియు వారు ॥జ

(7) హనుమంతుండిటు లాలోచించి జనకజగని హర్షమున
ఘనుడగు రాముని సంస్మరించియు వినుతించెను నానందమున ॥జ

బిలహరి – ఆది.

ప॥ రామమూర్తికి సీతా రమణీమణిదగు భూమిపుత్రికిదగు రామచంద్రుడు మరియు

అ॥ కాముని రతిబోలు కమనీయగాత్రులు కామితఫలప్రదులు కల్యాణనిలయులు॥ రా

చ॥ శరదిందు వదనులు సత్యచరిత్రులు సరసిజనేత్రులు సర్వాంగ సుందరులు
పరమపావనులు భక్తశరణ్యులు నిరతిశయానంద కరుణార్ద్ర హృదయులు ॥ రా

(2) అరయగరూపము సిరియును వంశము సరిబోలుదురు భువిని సత్కులజాతులు
వర నవకోసల వాసు లీ దంపతులు నిరుపమతేజులు నీతివిశారదులు ॥ రా

వ॥ వానర శ్రేష్ఠుండగు హనుమంతుండు శ్రీరామచంద్రుని జానకిని గొనియాడి
కొంతకాల మాలోచించి కన్నీరు నిండిన నేత్రములతో సీతనుగూర్చి దుఃఖించి
అంతట బాగుగ పరిశీలించి,

క॥ సీతారాముల నడవడిచేరి స్వభావంబు వయసు చిహ్నములెల్లన్
ఖ్యాతియు వంశమురూపము ప్రీతియు నిరువురకు సమము భూతహితంబున్

హిం:-బంగరుఛాయ మేనుమెరుంగున మంగళాంగి శ్రీలక్ష్మినిబోలు
అంగనగని యా అంజనసుతుడు పొంగుచు మదిని రాముని దలచుచు ॥ శ్రీ

(2) జనకునిపుత్రి దశరథుకోడలు ఘనుడగు రాముని ధర్మపత్నియు
దనుజుల వశమున జిక్కియున్నది ధరణీ తనయ పరమ పతివ్రత ॥ శ్రీ

(3) పతిసేవయె నాకతి ధర్మంబని అతులిత భోగభాగ్యముల్ విడచి
హితమతి కందమూలముల్ దినుచు విభునిగూడి విపినంబున నుండెను ॥శ్రీ

(4) ఆభరణంబు లన్నిటికంటెను అతిశయమగు ఆభరణముగద పతి
భూ భరణుండౌ భర్తను విడచి భూమిజయున్నది అధిక దుఃఖమున ॥శ్రీ

(5) లలనామణి యేకాగ్రచిత్తమున దలచుచు రాముని ఫలపుష్పమ్ముల
వలనుజూడక బలుదుఃఖంబున నిలిపియున్నది ప్రాణంబులను ॥శ్రీ

వ॥ రాక్షసస్త్రీలమధ్య దుఃఖించుచుండు ఉత్తమాంగనయైన యీదేవినిజూడ శాఖా మృగంబగు నాకే దుఃఖంబతిశయిల్లెడు. పరమదయాళుండగు రాముడు దుఃఖింపక యెట్లోర్చు? అనిదలంచి యీసాధ్వి సీతాదేవియేయని నిశ్చయించి అశోక వృక్షంబుపై నుండెను. అప్పుడు ఆకాశంబున స్వచ్ఛమై చంద్రబింబము ప్రకాశించె. అట్టిసమయంబున సీతనుజుట్టియుండు ఘోరరూపులును, ఒక్క కన్నుగలవారును, వ్రేలాడుచుండు పెదవులుగలవారును, చెవులులేనివారును, మరియు మృగజాతుల ముఖముగలవారును, చూపరులకు భయముగల్గించు వారు నగు పలుతెఱంగుల అసురాంగనలచూచుచు వీరు నిదురించుటను వేచి యుండెదనని యెంచియుండెనంత.

జో॥ర:- వేకువజామాయెను రక్కసుల వేద ఘోష వినబడగా
ఆకుల పువ్వుల మధ్యగూర్చొని హనుమంతుడుండు నంతట ॥జ

(2) మంగళవాద్యధ్వనులచే మేల్కొని మదమత్తుండై రావణుడు
పొంగుచు జానకి దలచి మోహమున భూషణములు దాల్చి యపుడు॥జ

(3) జేరవచ్చె నశోకవనమునకు స్త్రీలుగొల్వ అసురుండు
నారీమణులు దీపముల్ బట్టి నడువగ తనముందరను ॥జ

(4) ఛత్రచామరాల్ బట్టియు కొందరు సతులువెంటరాగ
పాత్రల సురను బట్టుక కొందరు పడతులు వెనుకొని నడువ ॥జ

(5) హనుమంతుం డా రావణుభార్యల అందెలమొలనూల్ ధ్వనులు
వినుచును ఆకులమధ్యను ఒదిగి గనుగొనె రావణు నపుడు ॥జ

(6) కామపరవశుండై వచ్చెడుమూఢుని ఖలుని దుష్టు మదమత్తుగా
భీమపరాక్రమశాలిని జూచుచు ధీమంతుడు కదలకుండె నందుగా ॥జ

(7) అతి తేజంబున రావణుండు నిజసతులతో వనమునజేరి
మతిహీనుం డా మహిసుతఁజేరగ మైథిలి గడగడవడకి ॥జ

(8) తొడల నుదరము భుజముల స్తనములు తొట్రుపడుచు గప్పియును
పుడమిజ కంపింపగ రాముని దలచుచు భూరిశోకమునను ॥జ

సీ॥ రాక్షసస్త్రీలచే రక్షింపబడునది అతిదుఃఖమున దేహ మదరునదియు
ఉపవాసముల డస్సియుండెడు సాధ్వియు కఠినమౌ వ్రతనిష్ఠ గల్గునదియు
భర్తఁబాయుటచేతఁ బరితపించునదియు పావనచరితయు భద్రమతియు
శ్రీరామచంద్రుని చిత్తసీమను నెలకొల్పి ధ్యానించుచుండెడు మానవతియు
రాముఁడటకువచ్చి రావణుఁబరిమార్చి తన్నుఁ బ్రోచునంచు నెన్ను చిష్ట
దైవతమును మదిని ధ్యానించు చున్నట్టి సీతఁ గనఁగొని మదినిహర్షించె ననుర.

తే॥ అందమగు కాయమును కుంచియడలుదాని దిక్కుదోచక మదిలోనసుక్కుదాని
తపముజేయుచు రాముని దలఁచుదాని గని విమోహాన రావణుండనియె నిట్లు.

జంఝూటి - చాపు.

ప॥ ఏల నీవిటు జాలిబొందెదు బాలరో నన్నేలుమా ॥ఏ

అ॥ నీలవేణీ సుందరాంగీ నిన్నుగోరితి నామనమున ॥ఏ

చ॥ భయమిదేల నీకునిచట పరమేశ్వరి దయజూడుమా
ప్రియముచే నన్నను గ్రహింపుము భీతివలదు సుఖయింపుము ॥ఏ

(2) పూలహారముదాల్చి గంధముబూసి యందముమీరగ
చాలరత్నాభరణములు మరి సన్నవలువలు ధరియింపుమా ॥ఏ

(3) అలంకరించుకొనుము యిపుడు అతిమనోహరంబుగ
లలితవాణీ జగన్మోహిని పలుకుల నన్నలరింపుము ॥ఏ

(4) పూర్ణచంద్రవదన నిన్ను బోలువారెవ రీ యిలన్
స్వర్ణాంగీ నినుదెచ్చుట నే సఖియరో కృతకృత్యుడన్ ॥ఏ

(5) రాణివై రక్షింపుము నను రాజ్యమంతయు నీదిగా
మానినీ యేలు మీ లంకను మఱి నవకోసలవాసుని ॥ఏ

దోరః- ఆశతోడ దివ్యాభరణంబుల సలంకరించుకొనుము
సౌందర్యము నే బాగుగజూచెద మనవి వినుము ॥జ

(2) భేదబుద్ధియువిడచి భోగములు ప్రీతి ననుభవించు
ఆదరించుము భార్యగనుండుము అరయుము నాభాగ్యమును ॥జ

(3) కోరుము నీకు వలయుపదార్థముల్ చేరుము నాభార్యలను
ధారుణిసుత నీ దాసులైయుందురు దయజూడుము రాణివైమమ్ము ॥జ

(4) మాసినచీరధరించి భుజంపక గాసిలి నీవు కృశించి
భాసురాంగి జడగట్టిన కురులతో నిలబడియుండ నేల నిటుచెప్పుమి ॥జ

(5) తరుణీ నీవిటులుండుటజూడ తల్లడిల్లు నాకు
పరమానందము గల్గజేయుము ప్రార్థించెద నిన్నిపుడు ॥జ

(6) శ్రీరాముడు ధనహీనుడు దీనుడు నారచీర ధరియించి
కారడవిని చరియించెడు వాడిట చేరరాడు మనల మదినుంచి ॥జ

(7) జీవముతోనున్నాడో లేడో నను భావింపుము ప్రియముగను
దేవీ ననుబొందియు నిటువలె దీనతనుండగ తగదు ॥జ

(8) బలము తపము నైశ్వర్యము తేజము గలవాడను మరినేను
లలనా నాసరివాఁడెటు రాముడు తెలియుము ననుచేకొనుము ॥జ

వ॥ అని రావణుడు ప్రార్థింప,

జోర:-పరమ పతివ్రత సీతాదేవి పాపిని రావణు గుఱిచి
పరుసన నొకతృణ మడ్డమువేసి వాక్శరముల భయపఱిచె ॥జ

(2) క్రూరా నిను కన్నెత్తిజూడను పోరా ఛీ ఛీ లేచీ
శ్రీరాముని ఘన నారాచంబులచే హతమగుటకు కుమతి ॥జ

హిందూస్థాని తోడి_ ఏక.

ప॥ చాలు చాలునో నీచా నేలబడదె నీనాలుక ప్రీడి ॥చా

అ॥ ఏలనోరీ రావణా ఈరీతిబల్క దుర్మదాంధ ఛీ ॥చా

చ॥ నన్నుజూచి దుర్నీతులాడ నీ కన్నులుబోవకున్న వింకను ॥చా

(2) శూరుడననుచు గొప్ప చెప్పెదా చోరుడవుగాక వీరుడవె ద్రోహి ॥చా

(3) శ్రీరాముండులేని తరుణము చేరినను దెచ్చినట్టి మూర్ఖ ॥చా

(4) నవకోసల శ్రీరాముడు నిన్ను నాడే దండించును మహాత్మా ॥చా

క॥ సరసిజ మిత్రాన్వయుడగు ధరణీపతి సుతుడు నీదు తలలను వేగన్
ధరణిని గూల్చెడు నప్పుడె యెరిగెద వా రామచంద్రు నేపునుబలమున్

హిందూస్తాని మాండు — ఏక.

ప॥ రామ శౌర్యమును వినుమా రావణా ॥రా
అ॥ కామవైరుని విలుద్రుంచెను ఘనుడటు పిన్నప్రాయమున ॥రా
చ॥ ఘోరతాటకను గూల్చెను ధరణిని
క్రూరుడౌ సుబాహుని బరిమార్చె నొక శరమున ॥రా
(2) నీరధిలో బడద్రోసె మారీచునొక నారాచంబున నూరు యోజనములు ॥రా
(3) అరనిమిషంబున రాముండొక్కడే ఖరదూషణు డాద్యసురుల ఖండించె ॥రా
(4) నవకోసల రఘువీరుని నరుడని అవినీతుడవై యట్లెవదరకు ॥రా

జోర:-పరిశుద్ధంబగు కులమునబుట్టి పతివ్రత నైన నేను
పరమద్రోహి దురాత్ముడ నీకెటు వశవర్తిని నాదును చెపుము ॥జ
(2) రాక్షసాధమ నీభార్యల మరి రక్షింపక విడతువె పరులకును
రక్షింపరె తమ సతులను నితరులు వీక్షింపు మటులనె యనుచు ॥జ
(3) ఇంద్రియ జయములేక నీవిటు వినాశము బొందగనేలా
సుందరులగు నీసతులనుగూడి సుఖియింపుము మోహముమీర ॥జ
(4) నీ కీ దుర్బుద్ధియు మాన్పెడు సత్పురుషులు ఎవ్వరులేరా యిచట
శ్రీకరులగు విభీషణాది సాధులు చెప్పరె బుద్ధియు బాగా ॥జ
(5) నీచావుకు సంతోషింతురు నెల్లలోకములవారు
నీచా! నీయపరాధముచే లంకను నేలపాలు చేసెదవు ॥జ
(6) పాలించుచు లంకను స్థిరముగ నీవు బ్రతుకునాశ గల్గినను
చాలగ రాముని శరణని వేడుము చావుదప్పు నీకిపుడు ॥జ

సావేరి — ఆది.

ప॥ శ్రీరాముని శరణుజొచ్చిన కరుణించు కలుషాత్ముడైన ॥శ్రీ
అ॥ పారావార గంభీరుని వీరుని ప్రార్థింపుము బ్రతుక దలచితే నిల ॥శ్రీ
చ॥ అపరాధియౌ కాకాసురుని కృపజూచి విడచె కోదండపాణి
కపివీరుడైన సుగ్రీవునేలి ఘనుడౌ వాలిని దునిమె గనర ॥శ్రీ

(2) జనస్థానమున పదునాల్గువేల దనుజుల ఖండించె విను మూఢచిత్త
నను నర్పించి నీవు సవతోసలేసుని పదవనజములకు మ్రొక్కిన వనరుగ బ్రోచు ||శ్రీ

జోర:-దనుజేశ్వర వినుమిక కొంతకాలము మనియుండ దలపుమీ భువిని
ఇనకులాంబుధి చంద్రుడౌ రాముని యెదుట నిల్వలేవు మరిని ||జ

తే|| రామచంద్రుడును దుర్గింప గణమునందు బ్రహ్మరుద్రేంద్రులాదిగా బరగు సురలు
నిన్ను రక్షింపజాలరు నిక్కమిదియె కాన శరణని వేడు మాఘునుని జేరి ||జ

శంకరాభరణము — చాపు.

ప|| సాటియెవ్వరు మూఢా సరసిజమిత్రకులవర రాఘురాముని ||సా

అ|| నేటికి సీయపరాధముల్ దొలగగ మేటిగుణముల్ గల ధీరుని శరణను ||సా

చ|| అండపిండ బ్రహ్మాండములకెల్ల అధిపతియని యెరుగుము
నిండుమనంబున మన్నించు రాముని యండజేరి నన్నర్పించు వేగమె ||సా

(2) వరనవకోసల కోదండరాముడు వచ్చి నను గొనిపోవు నిక్కము
ధరణిని బ్రతుకగ దలచితివేని నీవు సరసిజనేత్రుని పదసరోరుహముల బట్టు ||సా

వ|| అటు గావింపవేని,

క|| రవివంశాంబుధి సోముడు భువనేశ్వరుడైన రామభూపాలుం డీ
భువనములు మోదమందగ నవనిజ సీతలను గూల్చు నధమా వినరా

జోర:-అని పల్కగ సీతనుజూచి కనులెఱ్ఱజేసి రావణుడు
వనితామణి నను దూషించెదవిటు నిను మన్నించితి విను మిపుడు ||జ

(2) రెండు మాసముల గడువు నిచ్చితిని మొండితనము విడచి
యుండుము ప్రేమను భార్యగ నాకు నుండకుండిన వినుమీ ||జ

(3) ప్రాతఃకాల భోజనంబుకై పచనము జేయించియును
భూతలతనయా భక్షించెద నిను నాతీ నీవిటు లుండినను ||జ

(4) సురగంధర్వ కిన్నరసతులు మరి మరి కనుసన్నలను
ధరణిజం గడువడి నూరడించిరి కరుణారస మొలుకగను ||జ

(5) అని యిటు బెదరించెడు రావణు గని ధాన్యమాలి యపుడు
చనువున దనుజేశ్వరు కౌగలించియు వినయంబున నిట్లనెను ||జ

కాపీ - రూపకం.

ప॥ ప్రాణనాథ విను మనవి ననుగూడి సుఖయింపుము ॥ప్రా

అ॥ మానవ స్త్రీయు వశవర్తినిగాని దాని గోరనేల ॥ప్రా

చ॥ భుజ బలాఢ్యుడైన నిను బొంది సుఖములందునటుల
అజుడు వ్రాయలేదు నుదుట అతికురూపి తగదు నీకు ॥ప్రా

(2) ప్రేమలేని సతిని నీవు కామించుటకంటె, నీపై
ప్రేమగల్గు సతిని నన్ను కామింపుము క్రీడింపుము ॥ప్రా

(3) నవకోసలవాసుని దయ దివిజవరుల మర్దించుచు
భువన సామ్రాజ్యపదవి బొందుచుండెడు రావణాసుర ॥ప్రా

వ॥ ఇవ్విధంబున బల్కు నిజసతి బోధనవలన కామమోహితుండైన రావణుడు అచట కావలియుండు రాక్షసాంగనలగని, రెండు నెలలలో సీతరమణీమణి నాకు వశవర్తిని యగునటుల నయభయంబుల బెదరింపుడు. అని యాజ్ఞాపించి తనతోడి స్త్రీ జనంబులతోడ అంతఃపురంబు ప్రవేశించె. ఇట రాక్షస స్త్రీలు జానకిని బెదరించుచు బ్రహ్మతో సమానుండును మహాత్ముండగు విశ్రవసు పుత్రుండును కుబేరుని తమ్ముడునైన దశకంఠుని పతిగాఁ బడయవేల? దౌర్భాగ్యురాల! నీకట్టి భాగ్యంబు బడయ నదృష్టంబులేదు. అని మరియును అతిఘోర రూపంబులుగల అసుర వనితలు సీతను జుట్టినిలచి,

హిం:-ఎంత బిలచిన బిగువు జేసెదవు హీనుండగు నరుని మదిని దలచి
సంతోషంబున రావణుగూడి సర్వసౌఖ్యంబులు పొందుము వేగమె ॥శ్రీ

(2) రాముడనెడు నా మానవాధముడు రాలేడిచటికి సముద్రముదాటి
కామింపుము మా రాక్షసరాజును మామాటలు విని మాకు రాణివయి ॥శ్రీ

(3) అతులిత భోగభాగ్యంబులు నీ వనుభవింపుము దుఃఖింపకుము
హితమతిరావణు కగ్రభార్యవై ఏలుము లంకాపురమును ముదమున ॥జ

(4) అటుచేయనిపక్షంబున నిప్పుడె అతివ నినుబట్టి భక్షించెదము
కుటిలచిత్త దౌర్భాగ్యురాల యా కూ్రరుని రాముని దలపకుము ॥శ్రీ

వ॥ అని యఱచు రాక్షసాంగనల మధ్యను రాముని దలచి దుఃఖించుచు.

నాపై నీదయలేదా కాపాడను వేళగాద కరిరాడ్వరదా!
భూపాలచంద్ర నా హృత్తాపంబును బాపరాద ధరణీనాథా!

యదుకులకాంభోజి — చాపు.

ప॥ భువనపావనలీలలకు అవతరించినట్టి భూతశరణ్యా రామ ॥భు

అ॥ నవకోసలేశ నాపాలి స్థనము భక్త భవపాశమోచన పాపవినాశన ॥భు

చ॥ శ్రీరఘుకులవీర శ్రితజనమందార మేరునగధీర శూరా
కారుణ్యసాగర కౌసల్యకుమార కామాకరా వేగ శృంగార రామా ॥భు

(2) ఘోరరాక్షసులు బారిని బడితిని బ్రతుకనేరను దయజూడర
ఈరీతి నేనుండు టరుగవేమిరి లేక కూరిమివిడచితివా కోదండపాణీ ॥భు

శ్లోః- ఈరావణుడు దొంగిలి తెచ్చి యీలంకలో నను జేర్చుటయు
శ్రీరామా నీ వెరుగవు గావున నను జేరరావు తమ్మునితోను ॥జ

(2) మునివృత్తిని దిరుగుచు నా ప్రియ మోహపాశమును విడచి
అనుజుని గూడ తపము జేయుచు ననుమరచితివే నీమదిని ॥జ

(3) ముందును నాపూర్వకర్మము లింకజేసె రఘువీరా
రామచంద్రి నను భక్షింతురట రాక్షసనతు లివు మీర ॥జ

(4) జనకునిపుత్రిని దశరథునికోడల ఘనుడగు రామునిసతినై
దనుజాలమధ్యను జిక్కి యు కష్టము లనుభవించెదను మదిని ॥జ

(5) అని దుఃఖించుచు రాక్షసస్త్రీలను గని యిట్లనియెను వేగ
నను భక్షింపుడు తునకలు జేయుడు వినను మీదు పల్కులను ॥జ

తే॥ ఇట్లు పల్కుచు దుఃఖంబు లినుమడింప ప్రాణములువిడుతు నా ప్రాణనాథు
నాత్మలే దేమిచేయుదు ననుచు నంత ధారుణీసుత మూర్ఛిల్లి ధరణి బడియె.

వ॥ ప్రాణంబులు విడువనిశ్చయించు భూసుతనుగని కొందరు రసురాంగనలు, రావ
ణునకు నెఱింగింప పరువులిడు సమయంబున, వృద్ధయగు త్రిజటయను యసు
రాంగన నిదుర మేల్కాంచి రాక్షసస్త్రీలను గని దనుజతరుణులారా! సీతా
రామలక్ష్మణులకు జయంబును దశకంధరున కపజయంబును గలుగునట్టి కల
యొక్కటిగంటి మీరీదేవిని నిర్బంధించవలదు చెప్పెదవినుండు

శ్లో:-ననుభక్షింపుడు సీతాదేవిని తినవల దిప్పుడు మీరు
గనుడు రాక్షసులకు నపజయమగు కాలమువచ్చెను మరి వినుడు ॥జ

శహాన - రూపకం.

ప॥ కలగంటిని విన రే కడుమోదము జయప్రదమా ॥క

అ॥ చెలువమున పుష్పహారముదాల్చి సీతామణి శ్వేతాద్రిని నిలచినటుల

చ॥ అనుజునితో భద్రగజముపై నెక్కి ఘనలంకలోజొచ్చి
జనకజనెత్తి తొడనిడుకొని జనియెనురాము డుత్తరదిశగూర్చి ॥క

(2) సురుచిరముగ కలహంసలనొప్పెడు వరవిమానమునను
దిరుగుచు అంబరమున నుండిరి తరణివంశజులు దశరథసూనులు ॥క

(3) ధరణిజతో పట్టాభిషిక్తుడై తన తమ్ములు గొలువగను
సురముని బృందములు సన్నుతిజేయగ వరనవకోసలమున సుఖముండునటుల ॥క

వ॥ మరియును రావణుడు మలపంకమునబడి మునిగినటులును దేహంబునిండ తైలంబు బూసికొని యెఱ్ఱని పూలమాలలు ధరియించి గాడిదలుపూన్చిన రథంబు పైనెక్కి దక్షిణదిక్కునకు బోవగంటిని. మరియును రావణుడు ఒక ఆడుదానిచే నీడువంబడినట్లును అతని పుత్రమిత్ర బాంధవులును దక్షిణాదిక్కునకు జనినటులు కలగంటిని. దుష్టాత్ములారా మరియు,

జో॥ర:-వానరుడొకడు సీతనుజూడ వచ్చియు లంకనుగాల్చి
దానవులను దున్ంచియు సీతను గని ముదమున తరలిపోవగ గంటి ॥జ

(2) పీనుగమయమై లంకానగరము గానవచ్చె కలలోన
హానిగల్గు శ్రీరామునిచేత హతమగుదుము గావునవేగ ॥జ

(3) శరణనివేడి సీతాదేవిని జేరి మ్రొక్కుడి యిప్పుడు
ధరణిజ దయచేకొనకయున్నను తప్పదు మరణము మనకు ॥జ

(4) అని బల్కెడు నాత్రిజట మాటలు విని యారాక్షస సతులు
మనముల భీతిలి సీతనువేడి తనువులు మరచి నిదురింపగ నపుడు ॥జ

(5) ఆమాటలవిని ధరణిజ మదిలో హర్షంబున నుప్పొంగి
ఏమీ! యీకల నిజమగునా నాదు నిడుములు దీరునె యింక ॥జ

రామాపన్నమున
కష్టరాత్రిమైన ॥జ

ఖరహరప్రియ — ఆది.

ప॥ రామా నీదయరాని కారణమేమి ॥రా

అ॥ భూమిపాలా నన్ను బ్రేమజూడవేమి ॥రా

చ॥ దశరథనందన తప్పేమి జేసితిని దశకంఠునిచేఁ జిక్కి తపియించుచున్నదాన ॥రా

(2) నను విడనాడదగునా వనరుహపత్రనేత్ర నినువిడచి యుండననుచు మును పల్కలేదే

(3) సురమౌనిపాల వర దాసజనలోల మరియు నన్నేల తరుణము శ్రీలోల॥ రా

(4) భువనమోహనాకార పురుషసింహ రామ నవకోసలేశ నన్నాదరించు వేగ ॥రా

తే॥ రాముఁదలఁచుచు మదిలోన భూమిపుత్రి ప్రాణములువాయ సమకట్టితోన తనదు
వేణి వృక్షంబు శాఖను వేసి దానిఁ గంఠమున నురిగఁ జుట్టెడు కాలమందు.

ద్విప:- భూమిజ కపుడు శుభశకునంబులు పొడసూపెను మది ముదమందఁగ
వామనేత్ర భుజ మూరువు నదరెను రాముని క్షేమము తెలియఁగ ॥జ

తే॥ ఇట్టి దుష్కాలమున శుభంబెట్లువచ్చు
గల్గుచున్న నీశకునముల్ గల్గుటెట్లు
మఱిడఁ గాంతునో రాము నా చూడ్కి లలర
ననుచు హర్షించె జానకి యపుడు హనుమ.

హిం:- హనుమంతుం డిటు తనమది దలచెను జనకజ నాశ్వాసింపక బోయిన
ననుగని రాముడు కోపించును ఈవనిత ప్రాణంబులు నిలుపవలె నిటు॥శ్రీ

(2) పలుకరింపక పోయినను నే ప్రాణముల్ విడచును భయమున నిక్కము
కలువకంటి నిపుడు పలుకరించినను గలుగు ననర్థము సత్యంబుగను ॥శ్రీ

(3) శక్తిమంతుడుగాని దూతవలన సర్వముజెడును ప్రాజ్ఞుల కార్యము
యుక్తి యుక్తంబుగ నేగతిజేతును యుర్విజ నామాట లాలకింపగను ॥శ్రీ

(4) బాగుగ నాలోచించియు నప్పుడు పావనియుఁగ మది నిశ్చయించె నిటు
జాగుసేయక రఘువరుని గీర్తించెద జానకికి నాగూపు జూపకను ॥శ్రీ

(5) మధుర వాక్యంబుల మహాత్ముని బొగడెద మానినికి మది నమ్మక ముదయింప
మైథిలి యెంత విశ్వసింపునో గని మారుమోచింతును ఆపై నియని ॥శ్రీ

(6) ఏమి జేయుదునే నీ రాక్షసాంగనలు ఎరుగరాక నెటు మాట్లాడుదును
ఏమరుపాటున నుండ రక్కసులు భూమిజ నాశ్వాసించెద నిప్పుడు ॥శ్రీ

(7) రథ గజ తురగ పదాతులచే నతి రమణీయంబగు సాకేతమున
బుధజన మాన్యుడు పుణ్యచరిత్రుడు పూజ్యుడు ఘనుడు దశరథనృపుడు ॥శ్రీ

(8) ఆ మహనీయున కగ్రతనూజుడు రాముడు సద్గుణధాముడు జగదభి
రాముడు ధీమహితుడు ధర్మపత్నిఁగూడి సౌమిత్రితో దండకాటవి నుండగ ॥శ్రీ

(9) దొంగిలి తెచ్చెను దశకంఠుండా మంగళాంగియా రామునిపత్నిని
అంగనగానక పరితపించుచును అనుజునితోడ వెదకుచు రాముడు ॥శ్రీ

తే॥ ఘనుడు సుగ్రీవుగని సఖ్యమును నొనర్చి జానకిని వెదుక వేనవేల్ వానరుల
దిక్కుదిక్కుల కనుప నే నొక్కరుడను వచ్చితిని లంకజొచ్చి యీవనముగంటి.

వ॥ ఈ పల్కు లాలించి జానకీదేవి ఆహా! యిచ్చట రామకథా ప్రసంగముంజేయు
వార లెవరనుచు శింశుపా వృక్షంబుపై నుండు వానరునిగాంచి దుఃఖసాగరంబున
మునింగిన నాకీ వానరంబు గనుపించె గాన నాదుఃఖం బినుమడించు నంచు
నెంచెద ఇదియంతయు కలగా నుండనోపు.

జో॥ర:-కలలో వనచరమును గనుగొనుట కడు దుఃఖకరం బనియెదరు
తెలియగ నిద్రయెరుగని నాకు కలయెటు గల్గును దలప ॥జ

(2) వానరాకృతి ప్రత్యక్షంబుగ గానవచ్చె వృక్షమున
వీనుల విందుగ రామునిచరితము వినుపించెను మోదమున ॥జ

వ॥ ఇట్లనుకొనుచుండ ఆంజనేయుడు వృక్షమునుండి కొంతదిగి చేతులు జోడించి విన
యంబున,

ఆనందభైరవి — ఆది.

ప॥ ఎరుగింపుము కోకిలవాణి యిందిరవో రామచంద్రుని సతివో ॥ఎ

అ॥ సరసిజానన నిను ప్రార్థింతునమ్మ సాధ్వీమతల్లీ నీవిధమెల్ల ॥ఎ

చ॥ సుందరీమణి నీవు ఇంద్రాణివో లేక గంధర్వ కిన్నరకాంతవో గాక
చంద్రశేఖరురాణి శంకరివో అరవింద సంభవుదేవి గీర్వాణివో ॥ఎ

(2) నీరూపురేఖలు ఏయింతులకుగాన నీ రేడుజగములందున
నారీమణి నవకోసలరాణివో నళినాక్షీ నామీద దయయుంచి వేగమె ॥ఎ

హిం॥-వనితామణి నీ విభుడెవ్వడు మరి జనకుం డెవ్వడు తనయు డెవ్వాడమ్మా
వనజదళంబుల బోలెడు నీదు కనుల నీరుగార్చ కారణమేమి ॥శ్రీ

(2) పరికింపగ మహారాజసుతవని యెరిగితి సురాసుర వనితవుగావని
తరుశాఖను బడబుట్టితియు నీ విటు తల్లడిల్లగను గతమేమమ్మ ॥శ్రీ

(3) శ్రీమంతుండగు రాముని సతియగు సీతాదేవియని మదిదలచెద
కోమలగాత్రి యొకగింపుము దయ కూరిమిచే నను రాముడు బంపెను ॥శ్రీ

వ॥ రామనామంబు వినుటతోడనే సంతోషస్వాంతయై ఇట్లువల్కు నాంజనేయుని
గని భూపుత్రి.

జోర॥ ఇనకులవర్ధనుడగు దశరథభూపతి తనయుడౌ రాముని సతిని
జనకరాజ వరపుత్రిని నేను అనఘా దెలియుము మరిని ॥జ

(2) పది రెండేడు లయోధ్యాపురమున భర్తనుగూడియుండ
సదయుడు దశరథభూపతి రాముని సార్వభౌముని జేయగదలప ॥జ

(3) కడువడి నృపుని ప్రియసతి కైక పుడమిరేని నిర్బంధించి
అడవుల కనుపగ వరముగైకొని అతికూరత రామునిగాంచి ॥జ

(4) కాననవికి బొమ్మన నంతట శ్రీరామమూర్తి నను గూడి
ధీరుండౌ సౌమిత్రిగూడుకొని జేరియుండ ఘోరాటవిని ॥జ

(5) మాయామృగమును బంపి రాము డెటబాయునటులుజేసి
మాయలమారి దశకంఠుడు నను మదమున దెచ్చిటనుంచి ॥జ

(6) [illegible]ంతమాసములు గడువుబెట్టెను దుండగీడు రావణుడు
ఖండించియు నను వండితినునట ఖలుడు మూర్ఖుడన వినియు ॥జ

(7) వాసరశ్రేష్ఠుండగు హనుమంతుడు జానకి దుఃఖముగనియు
మానినీమణిని నూరడించుచు మది రంజిల బల్కెను మరియు ॥జ

(8) భానుకోటి సమతేజుడౌ రామభద్రుని దూతను తల్లి
దానవకోటిని ధ్వంసముజేయుదు తల్లడపడకుము కల్పకవల్లీ ॥జ

హిం:- రఘుకులగురు శ్రీరామలక్ష్మణుల వీక్షణమున కృతకృత్యుడనైతిని
అక్షీణబలాఢ్యుల కరుణను రాజీవాక్షీ నిను గనగలిగితిని వేగ ॥శ్రీ

(2) అలికులవేణీ నీక్షేమంబును అరసిరమ్మని నన్ను శ్రీరఘువీరుడు
పలుమరు నీ పదపద్మంబులకును భక్తిని నమస్కృతుల్ జేసె లక్ష్మణుడు ॥శ్రీ

(3) మారుతి యాడిన మాటలు వినియు మనమున నుప్పొంగుచు ప్రీతిని
నీరజాక్షి పులకాంగితయగుచు నా వీరునితో నిట్లనియెను జానకి ॥శ్రీ

(4) బ్రతికియుండిన కొంతకాలము బడయుదురు సుఖములు యనులోకో క్తి
క్షితిలోబల్కుట సత్యంబయ్యెను అతిసంతోషము గల్గెను యిప్పుడు ॥శ్రీ

(5) రామలక్ష్మణుల క్షేమముదెల్పిన ధీమంతునిగని సప్రేమంబుగ
భూమిజయు నకృపారసము లొలుకగ పవనజున్జూచి సంభ్రమింపగ ॥శ్రీ

(6) అంతట మారుతి మెల్లమెల్లగ సీతచెంతజేర రాగనియును సాధ్వి
చింతించియు రావణుడని మదిలో శిరమువంచి యపుడు దలచెను నిట్లు ॥శ్రీ

తే॥ వచ్చె రావణుడిచటికి వనచరుడుగ నితనితో బల్కు టనుచిత మేమిసేతు
ననుచు నీవృక్షశాఖను నతివ విడచి భూరిశోకాంతరంగయై పొక్కుచుండ

వ॥ మహాబలుండగు హనుమంతుడు భయభ్రాంతయై దుఃఖించుచున్న యాదేవికి
నమస్కరించిన అతని తల యెత్తిచూడక నిట్టూర్పు విడచి,

సీ॥ మాయావి రావణ మారువేషంబున వచ్చితివా మఱి తుచ్ఛబుద్ధి
ఉపవాస కృశయైన యువిదను నన్నిట్లు దుఃఖపెట్టెదవేల దుర్మదాంధ
అరయ నీవు రావణుండనుట యుక్తముగాదు నినుజూడ సంతోష మనఘ గల్గె
శ్రీరామదూత నీవు జేరవచ్చితివేని మంగళమగుగాక మరియు నివుడు
చెప్పు రాముని గుణములు శీఘ్రముగను వినుటచే సంతోష మొనరు నాకు
నింతకాలంబునకు భూమికాంతు వార్త వింటి మది కొంతయూరట గంటి ననుచు.

వ॥ తలపోయుచు మరియును,

జోర:-కలలోనైన నను రామలక్ష్మణుల గనిన దుఃఖమున్ దొలగు
పలుమరు దుఃఖించెదు నాకిప్పుడు కలయేటు వచ్చును మరియు ॥జ

(2) కలలో కోతిని జూచినవారికి గల్గదు శ్రేయము గానన్
కలగా దిది సంతోషము నాకుగలిగెను నీకపివరు గనగన్ ॥జ

(3) భ్రాంతియొ లేక యున్మాదంబో పరికింప నెద్దియుగాదు
శాంతిగల్గెడు నామదికిప్పుడు సత్యము వానరు డితడనియు ॥జ

వ॥ మరల నిట్లని యోచించె. రాక్షసులు కామరూపులు. ఇతడు రాక్షసుడేగాని
వానరుండుగాడు. అని నిశ్చయించి పలుకక యూరకుండె. అంత నాంజనేయుండు

తన్ను అసురుండని సందేహించినది యనియెంచి వినుటకింపుగను సంతోషంబుల గల్గు సద్వచనంబులు చెప్పందొడంగె.

హిం:- రాముని దూత నే జానకి నీదు క్షేమ మరసిరమ్మని ననుబంపెను
రామలక్ష్మణులు సుగ్రీవుడు మరి వేమరు నిన్నుదలచి శోకింతురు ॥శ్రీ

(2) అసురులమధ్య జిక్కియు నీవు అమ్మా దైవయోగంబునను
వసుమతిసుత జీవించి యుంటివమ్మా వచ్చెదరింక దశరథసుతులు ॥శ్రీ

(3) హనుమంతుండనువాడను నేను వానరజాతిని రవిసుతుమంత్రిని
జనకసుపుత్రి నినుజూచుటకై వననిధిదాటి వచ్చితి లంకకు ॥శ్రీ

(4) రావణుతలపై పాదముంచియు నే రమణీమణి యిటవచ్చితి నమ్ముము
దేవీ ననుగని సందేహింపకు దేవదేవుని గుణముల్ దెలిపెద వినుము ॥శ్రీ

మధ్యమావతి — ఆది.

ప॥ శ్రీమహావిష్ణు బోలువాడు శ్రీరఘురాముడు ॥శ్రీ

అ॥ కామశతకోటి సౌందర్యుడు కళానిధివలె అమృతరసపూర్ణుడు ॥శ్రీ

చ॥ రాజాధిరాజు ధనదురీతి రాజితస్వప్రకాశుడు
తేజోనిధి దినకరువలె ధీరుడు! గంభీరుడు జలనిధివలె ॥శ్రీ

(2) వాసవుచాడ్పున వైభవోపేతుడు వాచస్పతిబోలు వాగ్విలాసుడు
దాశరథి నవకోసలవాసుడు దరహాసచంద్రిక ముఖారవిందుడు ॥శ్రీ

వ॥ కావున తల్లీ! నన్ను రాక్షసుండని యెంచకుము. నామాటల నమ్ముము. మాయామృగముచే మోసగింపజేసి నిన్నపహరించిన రావణునిగతి జూడగలవు. అగ్నివలె జ్వలించు బాణపరంపరల శ్రీరాముడు త్వరలో రాక్షసుని సంహరించును. భీతిమానుము సందేహంబు వీడుమనిన వాతాత్మజునిగని సీత.

జా:- నరులకు వానరులకు నేలాగున అరయగ సఖ్యము గలిగెగా
ఎఱిగింపుము శ్రీరామలక్ష్మణుల గురుతులు రూపురేఖ లనగా ॥జ

(2) ప్రేమను నాదు భాగ్యవశంబున రాముని విధ మడిగితివి
రామలక్ష్మణుల గీర్తించు పుణ్యము రమణీమణి గల్గె నాకీభువిని ॥జ

నాయకి — రూపకం.

ప॥ దేవీ శ్రీరామసౌందర్యము విను సీతా ॥దే

అ॥ భావజశతకోటి లావణ్యుడు భానుసన్నిభ తేజుడు ధీరుడు ॥దే

చ॥ శ్రీమంతుడు ధీమంతుడు శ్రీమనోహరుడు వీరుడు
సాముద్రిక లక్షణయుతుడు సర్వాంగసుందరుడు ॥దే

(2) పూర్ణ చంద్ర ముఖకమలుడు పుండరీకలోచనుడు
కర్ణకుండల శోభితుడు కంబుగ్రీవుడు పీనవక్షుడు ॥దే

(3) ఆజానుబాహుడు దూర్వాంకుర సమగాత్రుడు
మృగరాజమధ్యుడు రఘుకుల వర్ధనుడు సీతా ॥దే

(4) నవకోసలవాసుడు నవయౌవనుడు గంభీరుడు
భువనమోహనుడు రాముడు భువిని రామతనయ నేలినవాడు ॥దే

తే॥ లక్ష్మణుడు రామునకు సర్వ లక్షణముల సాటియగుగాని బంగారు చాయవాడు
నీలవర్ణుడు రాము డాయిరువురకును భేదమేమియు లేదమ్మ భద్రయశులు.

రగడ:-భూమిజవినుము శ్రీరామలక్ష్మణులు । ప్రేమను నిను వనభూముల వెదకుచు
జేరగ పంపాతీరంబున నా । ధీరుల వీరుల సుగ్రీవుడు గనుగొని
వాలిబంపగ వచ్చినవారని । దూలి భీతిలి తొట్రుపడగ నే
జేరియు వారి క్షేమంబరసి । ధీరుల జేర్చితి దినకర తనయుఁడు
సారెకు కుశల ప్రశ్నల సల్పుచు । కూరిమిమీరగ వారిరువురును
సురపతిసుతుడు తరుమగొట్టుటయు । నెఱిగించె రామునకు తరణితనూజుడు
ధరణిజ గోల్పోవుట తామరయుచు వచ్చుట । యెరుగ దెల్పెను మరి లక్ష్మణుడు
అంతట నీయాభరణముల్ జూపగ । చింతించుచు శ్రీరాముడు మూర్ఛిలి
కొంతవడికి తెలివొంది లేచి । యెంతయు ప్రీతిని యాభూషణములు
తొడ్డసై నిడుకొని కడుప్రేమను మరి । పుడమీశుడు దుఃఖము పొంగి పొరలగ
హా సీతా సీతా యని మరి । భూతలమున వ్రాలియు ఆతరి
సుగ్రీవుడు సౌమిత్రియు నేను । హితమగు మాటల నెంతయు దేర్పగ
మతిమంతుడు కష్టంబున లేచి ; పలుమరు ఆభరణంబుల జూచుచు
బలువిషాదమున భానుజుచే నిడె.

దోర:-రమణీయంబగు వనములు గిరులు విమలతోయములు గల నదులు
కమలాకరముల పుష్పఫలంబుల గాంచచు మోదముతోను ॥జ

(2) పురుష శ్రేష్ఠుండగు శ్రీరాముడు ధరణిజ విను వేగమున
బరిమూర్తును దశకంఠుని మిత్ర బంధుయుతంబుగ గనుమా ॥జ

సీ॥ వాలిని వధియించి వానరరాజ్యంబు రవిజున కిడునట్టు రామడనియె
ధరణిజ వెదకియు దశకంఠుఁ బరిమార్చి తోడుపడెదననియెఁ దోన కపియు
ఈవిధి ప్రతిన వారిరువురు గావించి వధియించె రాముడు వాలినంత
భాను తనూజుండు జానకిని వెదుకంగ వనచరులను బంపె ఘనుల బలుల
అందు మూడవపాల్ సేన లరసికొల్వ అంగదాది మహాకపుల్ అందరమును
వింధ్యపర్వతప్రాంతముల్ వెదకివెదకి యెందుగానక గుహజొచ్చి వెతలజెంది.

వ॥ అందు దారి యెరుంగరాక అహోరాత్రంబులు గడవ నెట్టకేలకు వెలికివచ్చి సుగ్రీవుం డేర్పరచిన గడువు దాటినందున ప్రాణంబులపై నాసమాని ప్రాయోప విష్టులమై సీతాపహరణంబును జటాయు మరణంబును వాలి వధంబును దలచి అంగ దుండు దుఃఖించిన సంపాతియను గృధ్రంబు ఇది యంతయు విని మమ్ముగాంచి,

జోర:-ఎవ్వరు మీరు జటాయువు నెవ్వరు ఏల జంపెను తెలియగ
ఇవ్వనమునకు ఏలవచ్చితిరి యెరిగింపుడు దయతోడ ॥జ

(2) అన విని యంగదు డనియె రావణుడు జనకజ నెత్తుకపోవ
ఘనుడు జటాయువు అడ్డగింపగా దునిమె నతడన విని వేగ ॥జ

(3) రావణునింట నీవుండుట యోదేవి దెల్పె మాకతడు
భావమలర మేమందర మప్పుడు పరుగు లిడుచు వచ్చియును ॥జ

(4) సాగరంబుగని భీతచిత్తులయి సత్వముడిగి కపులంతా
యేగతి దాటుద మీయంబుధి నని వెతల గుంది రంతా ॥జ

(5) వారల చింతను మాన్పియు నేనీ నీరధిదాటియు వేగ
చేరితి లంకను నినువెదకుచు నే శ్రీరామచంద్రు దయచేత ॥జ

కల్యాణి — ఆది.

ప॥ భాగ్యమెంతని బల్కుదు తల్లీ పరమసాధ్వి నిన్ జూడగంటి నా ॥భా

అ॥ భాగ్యరాశి నీసన్నిధిని జేర భద్రయశముగల్గె పతితపావని నా ॥భా

చ॥ సారసాక్షు నవకోసలేశు కృపన్ సాగరంబుదాటి సరసలంక జొచ్చి
చేరి నిన్నుగాంచి క్షేమమరసి వేగ శ్రీరామునకు దెల్పగల్గె నా ॥భా

జోర:-అన్నకు శుశ్రూషను జేయుచు మరి యున్న వాడు సౌమిత్రి
సన్నుతచరిత సత్యము దెల్పితి నున్నది యున్నటు మరిని ॥జ

(2) రాముని హితమును గోరివచ్చితిని రవిజునియాజ్ఞను నేను
రాముడు నీపై ప్రేమను సతతము భామామణి సీతాయని పలవించు ॥జ

వ॥ సీతాదేవి! నీకునమస్కారము. కేసరియను వానరోత్తముడు నాతండ్రి. అతడు మాల్యవంతంబును విడిచి గోకర్ణంబను పర్వతంబు జేరి దేవఋషులచే ప్రార్థింపబడి సముద్రతీరంబున శంబసాదనుండను రాక్షసుని సంహారించె నట్టిసమయంబున నా కేసరిభార్యయగు అంజనాదేవి గర్భంబున వాయుదేవునివలన బుట్టినవాడ గాన బలమున వాయుదేవుని సాటియౌదును. నేఁజేసిన కార్యంబుచే హనుమంతుండను నామంబుగల్గె.

డోర:- నమ్మకంబు గల్గుటకై యిపుడు నరనాథుని గుణములను
అమ్మా జెప్పితి యానందంబున నమ్ముమింక నను దయతోను ॥జ

(2) రావణు సుత హిత బంధుయుతంబుగ రణమున దుంచియు వేగ
దేవీ నినుచేకొను నిది సత్యము దెల్పితి మోదముగనుము ॥జ

(3) హనుమంతుం డిటు సర్వము దెల్పగ మనమలరుచు సీతాదేవి
ఘనుడీతడు శ్రీరామదూతయని గాంచెను హర్షముమీరి ॥జ

వ॥ అట్టియెడ.

హిం:- అమ్మా శ్రీరఘురాముని వ్రేలి అంగుళీయమిదె చేకొనుమా ప్రేమతో
నమ్ముమింక నను వనచరుండనని నవకోసలపురనాథుని రాణి ॥శ్రీ

(2) రమణీమణి ముఖపంకజ మొప్పెను రాహువువీడిన శశాంకుని రీతిని
అమితోత్సాహముగల యా జానకిని హనుమంతుడు గనెను ప్రియమలరంగా॥శ్రీ

ఆరాగ – రూపకం.

ప॥ శ్రీరామ నామాంకిత ముద్రికగనె సీత ॥శ్రీ

అ॥ ఆరాముని జూచినటుల ఆనందము నుప్పొంగియు ॥శ్రీ

చ॥ జలజనేత్ర శిరముననిడి పలుమారు కనులనద్ది
పులకాంకితురాలై మైథిలి పురుషోత్తముని దలచి యపుడు ॥శ్రీ

(2) నవకోసలపురనివాస నమ్మితి నీ పదపద్మముల్
నవనీరజపత్రనేత్ర నాప్రాణనాథా యనుచు ॥శ్రీ

హిం:- నిను విడనాడియు నేనింతకాలము మనియుంటినిగద నీపై కూర్మిని
నను దయగంటివా నేటికి శ్రీరామ ఘనమగు నీనామస్మరణము మేలునిచ్చు ॥శ్రీ

(2) వనచర శ్రేష్ఠా హనుమా నీ వీ వననిధిదాటి లంకనుజొచ్చి
దనుజవీరులను సరకుచేయక నను గనుగొంటివి అతిఘనుడవు బలుడవు ॥శ్రీ

(3) ధైర్యసాహస వీర్య పరాక్రమ శౌర్యము లెంచగ సాధ్యముగాదు
కార్యదురంధర గాడ్పుకొమరుడా ఆర్యవినుత నిన్నేమని పొగడుదు ॥శ్రీ

(4) సద్ధర్మశీలుడౌ రామవిభుండు సత్య పరాక్రమ సంపన్నుండు
బుద్ధిమంతుడవుగావున నిను నావద్దకు బంపెను ముద్రిక నిచ్చియు ॥శ్రీ

(5) అనఘా నాదు భాగ్యవశంబున అనుజునితోడ సుఖమున్నవాడని
ఘనుని శ్రీరాముని క్షేమము నీవలన విని ముదమందితి హనుమా వినుమా ॥శ్రీ

వ॥ రామలక్ష్మణులు కుశలంబే? నన్నేల యిటు లుపేక్షించిరి? నాదుఃఖంబున కంతంబులేదా? దయరాదా! ప్రళయకాలాగ్నివలె భూమినంతయు దహింప జాలు రాముడు నన్నీ రాక్షసుడు గొనితెచ్చియు కోపంబునొందకున్నాడేల? నావియోగంబున కృశించుచున్నాడా! మరియు నన్నుగూర్చి సదా పరితపించు చున్నాడా? ఏమి యన మారుతి యిట్లనియె.

జోర:- తల్లీ నినుదలచుచు శ్రీరాముడు తల్లడిల్లుచున్నాడు
ఉల్లంబున గుందుచు నిదురించడు యో సీతాయని అహర్నిశము ॥జ

(2) నినుగానక దుఃఖాంబుధిని రాముడు మునిగియున్నవాడు
జనకజ నీవార్తయు నేదెలుపగ దునుమును రావణు మరియు ॥జ

(3) నిండుచంద్రునిబోలు మోమును కుండలములకాంతి
గండస్థలమున గంతులిడగ భూమండల మేలెడు వాని ॥జ

(4) శ్రీరఘురాముని జూచెదవమ్మ శీఘ్రకాలమున వినుమా
చేరియు వనగిరి తరుఫలములపై బాసజేసెద నిక్కంబిది గనుమా ॥జ

(5) సీతా సీతా యని విరహంబున స్వీకరించ డెద్దియును
భూతలసుత హాప్రియురాలా యని సొక్కుచు చేర్కొను నిన్నెపుడు ॥జ

(6) అనిబల్కిన విని రాముని దలచి హర్ష శోకములు మీర
జనకజముఖ మలరెను శారదచంద్రిక సరసిజమునుంబోలి ॥జ

వ॥ ఆంజనేయా! రాముడు నాపై ప్రేమగల్గియున్న అమృతవాక్కును, నన్నుగూర్చి దుఃఖించుచున్నాడను విషమువాక్కును విన సంతోష దుఃఖంబులు నామనం బున గలిగె.

తే॥ అతిశయంబగు నైశ్వర్య మమరియున్న కాలమునగాని కష్టంబు గల్గునట్టి
కాలమునఁగాని దైవంబు కారణంబు గాని స్వాతంత్ర్యమేలేదు మానవునకు.

తే॥ ఈశ్వరాధీనులై యుందు రెల్ల నరులు పశువుగట్టివ చందాన ప్రాణిచయము
కర్మమను త్రాటిచేతను గట్టబడియు కష్టసుఖముల బడుదురు కాలబలిమి.

హిం:-రాముండెపుడు వచ్చునో రావణు రక్షోవీరుల నెపుడు వధించునో
ప్రేమను ననుదోడ్కొని పోవుట నెపుడో సౌమిత్రినిగూడి సంతోషంబున ॥శ్రీ

(2) జననీ నాదు మూపున గూర్చుండు వననిధి దాటి అతివేగంబున
ఘనుడౌ రాముని సన్నిధిజేర్చెద మనమున భీతిని మానుము సాధ్వి ॥శ్రీ

(3) రావణుతోఁగూడ లంకను బెరికి భూవిభుసన్నిధి బెట్టగలను మరి
దేవి నా బలశౌర్యంబులను దెలియుము మూపున నిలువుము వేగ ॥శ్రీ

(4) అని బల్కగను జనకజ మదిలో నాశ్చర్యంబున బల్కెను హనుమ
నను నెటుమోసెదు స్వల్పకాయుడవు వనచరుడనుట సార్థకమయ్యెను ॥శ్రీ

వ॥ ఇట్లు తన్ను చులకనగ నెంచిన జానకీదేవిఁగని, యీదేవి నాశక్తిని యెరుంగదు గాన నాశక్తి జూపెదనని కొంత దవ్వరిగి మేరుమందర పర్వతంబుబోలె తన దేహంబుబెంచి సీతంగాంచి,

జోర:-గనుమా నాదు కాయం బిపుడు కామరూపుడను నేను
నిను గొనిపోయెద రాముని చెంతకు గనుము నావేగము నిపుడు ॥జ

తే॥ అంత హనుమంతు గాంచి యిట్లనియె సీత వాయువంతటి బలశాలివైన నీవు
ననుమూపున నిడి వేగమునను బోవ భయముచే సాగరంబున బడుదు నయ్య

జోర:-అటుగాకుండిన రక్కసులందరు అతి వేగంబున వచ్చి
కుటిలవర్తనులు నిను గొట్టియు నను గొనిపోదురు నిక్కము గనుమా ॥జ

(2) గావున నేను బ్రతుకుట కల్ల కడువేగంబున నీవు
దేవ సమానుల రామలక్ష్మణులఁ దెమ్మిచటికి రవిజునితోడ ॥జ

)3) దశకంఠుని సుతహిత మంత్రులతోడ ధరణిని గూల్చియు వేగ
దశరథసుతులు ననుగైకొని మరి తరలిపోవుదురు శీఘ్రముగ ॥జ

వ॥ ఇదియునుంగాక నీవే నన్నెత్తుకొని పోయిన రామునికీర్తి నశించు. మరియును
పరపురుషుని నే దాకుటలేదు. రావణుండు దెచ్చెనే యందువేమో! రాముడు

లేని సమయంబున మోసగించి ఏమరు పాటున దెచ్చినాడు. దిక్కులేక అబలనై జిక్కవలసివచ్చె. ఏమియుం జేయజాలక మనమున రాముని దప్ప మారు చింతన లేక యుంటిని. ఆంజనేయా! యిప్పుడు నేను స్వయముగ ఒప్పుకొన గూడదు గదా! కావున అతి త్వరిత గమనంబున బోయి సుగ్రీవ చమూసహితంబుగ రామలక్ష్మణుల దోడ్కొనిరమ్ము. నాదుఃఖంబు దీర్పు మన మారుతియు యా దేవితో,

తే॥ పతితపావని నీవిట్లు బల్కదగును నిన్ను దోడ్కొని పోవుట నీతిగాదు
వేగమున బోవ భయమున సాగరమున బడిన గతియేమి తెలియంగ బల్కితీవు.

జోర:-పరమసాధ్వి శ్రీరాముని ధర్మపత్నివి గావున జననీ
పరపురుషుని దాకుట ధర్మముగాదని బల్కుట సత్యము మరినీ ॥జ

(2) తరుణీమణి దనుజుల కఠోర వాక్కులకు తాళజాలక యిచటన్
వురివేసుక వలెనని యత్నించుట మరియు నీదు కష్టముల్ ॥జ

(3) ఎరుగించెద శ్రీరామచంద్రునకు హితవుమీర నీవిధము
కరుణాకరి యొక గురుతు నొసగుము మరియును శ్రీరామునకు ॥జ

(4) హనుమంతుం డిటులాడిన జానకి హర్ష శోకములు మీర
అనిలతనూభవ పోయెదవా యీాదిన ముందుము మోదము మీర ॥జ

(5) శ్రీమదీర్చుకొని పొమ్ము రాముని సముఖంబునకు మరిని
అమలచరిత్ర నినుఁ గనుచుండిన హర్ష మొదవు నామదిని ॥జ

వ॥ వాయుతనూజా! యొక్క గుర్తు చెప్పెద వినుమని రామునుద్దేశించి,

సీ॥ శ్రీరామ మన మల్ల చిత్రకూటంబున సిద్ధాశ్రమంబును జేరియుండు
నప్పు డొకప్పుడే నందందు విహరించి అలసి గూర్చుంటి నీయంకమందు
వాయస మొక్కండు వారక నాదగు వక్షంబునం బొడువ కినుక నేను
తరిమిన బోవక మరి మరి ననుబొడిచి మరల హింసింప నే తరుముచుంటి
అంత నావస్త్రమునువీడ నదియు మరల నవరణము జేయుచుండెడు సమయమునను
నన్నుగని పరిహాసించితివి నాథ నీవు సిగ్గుచే నుంటి నీచెంత శిరమువంచి

వ॥ ఆంజనేయా వినుము! అంతట నేను రామునితొడపై పరుండి నిదురించి మేల్కాంచితి. మరి రాముండు నాతొడపై బరుండి నిదురించె. అట్టియెడ నా కాకి మరల వచ్చి నా స్తనంబు గీరుచు మాంసంబు దినుచుండ నేనదలించు చుంటి. అప్పుడు

రామునిపై రుధిర బిందువులు బడుచూడ నేనోర్వజాలక కన్నీరు గార్చుచు రాముని మేల్కొలుప లేచి యాకాకినిజూచి కోపోద్దీపిత మానసుండై దర్భాప వంబున యొక్క పోచ దీసికొని బ్రహ్మాస్త్రంబు మంత్రించి దానిపై వైచిన,

డోర:- లోకములన్నియు దిరిగి యెచ్చటను లోగొనువారలు లేక
శ్రీకరుడగు శ్రీరాముని శరణని చేరివేడె నాకాకి ॥జ

(2) శరణనివేడిన కాకిని రాముడు జంపక విడచియు దయతో
మరి నాబాణము వ్యర్థముకాదన నది పరమదయాళూ యనుచు ॥జ

(3) హరియింపుము నా కుడినేత్రం బీయస్త్రంబున రఘురామా
మరణముదప్పి బ్రతికెద ధర నిను శరణుజొచ్చి జయరామా ॥జ

వ॥ అని వేడ, రామచంద్రమూర్తి యటుగావింప

డోర:- శ్రీరఘురామునకును దశరథనృపునకు జేసి నమస్కృతు లపుడు
సారెకు వినుతించుచు పోయెను వెడలి చయ్యన కాకాసురుడు ॥జ

వ॥ మారుతనందన ! "కాకియంతటి స్వల్పపక్షిపై బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన దయామయుండవు, ఇపుడు నన్నపహరించిన రాక్షసు నుపేక్షించుట నీకు ధర్మమా !" అనియడిగితి ననుమని మరల రామునుద్దేశించి,

కాపీ – రూపకం.

ప॥ రామవిభూ రక్షింపుము రాజరాజశ్రీ ॥రా

అ॥ నీమనమున వేరెంచకు నిను నమ్మిన దానను నే ॥రా

చ॥ పురుషోత్తమ దయరాద మొరవిని కృపకనేలరాద ॥రా

(2) పరమోత్సాహము తోడ నను పాలింపను మనసురాదా ॥రా

(3) నాథా నీవుండియు నే ననాథవలె నుండనేల ॥రా

(4) శ్రీధర పరమోదార శ్రితజనావన రఘువీర ॥రా

(5) సుఖకర కరుణాలవాల సురుచిర శృంగారలీల ॥రా

(6) సత్యదానవ్రతశీల సకలలోక పరిపాల ॥రా

(7) ప్రకటిత సద్గుణజాల భక్తమనోహర లీల ॥రా

(8) నీదు దర్శనం బిచ్చియు నన్నేలనింక తడవేల ॥రా

(9) నవకోసలపురనాథ నామనవిని విని బ్రోవుము ॥రా

డోర:- బలశౌర్యంబులు గల్గియు మరి నా పాపఫలమువలన
చలమున వచ్చి రావణుశిరము లిలగూల్పవు వేగమున ॥జ

(2) సర్వజగంబుల రక్షణ చేయఁగ జాలునట్టి ఘనులయ్యు
నుర్వీశ్వర యి ట్లుపేక్ష జేయుట నా పూర్వజన్మ కృతమిదియు ॥జ

కమాసు - రూపకం.

ప॥ పురుషసింహామా భూరివిక్రమా రామ ॥పు

అ॥ కరుణజూడుమా యింత కఠినమా ధరణీశ్వర సురవందిత నిరతిశయానంద రామ

చ॥ అఘవిదూర రఘుకులవర ఆదరించి బ్రోవర నగధీర! శృంగార
పవకోసలపుర విహార సుగుణాకరణ రణశూర శుభకర వేగరా ॥పు

డోర:-రాముని గూర్చి కన్నీరొలుకుచు రమణీమణి పల్కఁగను
ధీమంతుండగు హనుమంతుండిటు తెల్పెను మోదముతోను ॥జ

(2) అన్నిటి యందును విముఖుండగుచు ఉన్నవాడు రాముండు
అన్న దుఃఖమును గాంచి లక్ష్మణుడు నడలుచుండును నెపుడు ॥జ

(3) అధిక కష్టమున నినుగంటినిగాన అమ్మా శీఘ్రింబునను
సదయులు రామలక్ష్మణు లిచటికి సరసిజాప్తసుతు గూడియును ॥జ

(4) చేరవచ్చి యీలంకను భస్మము జేసియు రావణు దున్మించి
కూరిమి నినుగొనిపోదు రయోధ్యకు కోమలి దుఃఖము విడచి ॥జ

(5) సంతోషంబున సుందము రాముని సైన్యయుతంబుగ నీదు
చెంతకు దోడ్కొని వచ్చెద నాకు సెలవొసగుము తల్లీ యనుచు ॥జ

(6) ఏమి చెప్పవలె రామలక్ష్మణులకు ఇనసుతునకు కపులకును
ప్రేమను దెల్పుమి యన విని జానకి నామాటగ రాముని కిట్లనుము ॥జ

వ॥ అని సామీరితో జానకీదేవి యిట్లనెను.

క॥ కౌసల్యావరసుతునకు భాసురగాత్రునకు రామభద్రున కిపుడున్
భూసుత క్షేమం బడుగుచుఁ జేసెను నమస్కారమనుచుఁ జెప్పుము తండ్రీ.

వ॥ రామునకు నేనొనర్చినట్లు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరింపుము. పరది
లక్ష్మణు నాశీర్వదించితినని పల్కుము. సుగ్రీవాది వానరుల నందఱను కుశలం
బడుగుము. మరియును,

హిం:-సర్వభోగ భాగ్యంబులు విడచి సౌమిత్రియు తన యన్నను గూడి
నిర్వికారుడై నిత్యనిర్మలుం డార్యసమ్మతుం డడవుల జేరెను ॥శ్రీ

(2) తలిదండ్రులవలె సంతోషంబున దలచును మమ్ము ధర్మనిరతుడు
పలువిధముల గురుబుధ సేవజేయును పరమోదారుడు ఉత్తమోత్తముడు ॥శ్రీ

(3) నను రావణుడు గొనితెచ్చుటయు గనియుండిన సౌమిత్రియు నప్పుడే
తునిమి రాక్షసుని ననురక్షించును అనఘా నాకీ కష్టము లుండదు ॥శ్రీ

(4) హనుమా నీవే కర్తవు నాకీ ఘనదుఃఖం బెడబాపుటకు మరి
దినకరతేజుడు శ్రీరామచంద్రుడు నను గొనిపోవు యత్నము చేయుము ॥శ్రీ

తే॥ ఒక్కనెల మాత్రమిక జీవముండు మేన ననుచుఁ జెప్పుము రామున కనువుమిఁగుల
ఇదిగొ చూడామణింగొని ముదముతోడ నాథునకు నొసఁగుమి యిది నగచరేంద్ర

జోర:-హనుమా నావివాహ సమయమున నా జనని యిచ్చె నీమణిని
గనినదీని నాజనని జనకుని నను దశరథుదలచును రాముడు మదిని ॥జ

(2) మణిగైకొని యతిసంతోషంబున హనుమంతుడు సీతకును
ఘనముగ ప్రదక్షిణ నమస్కారములు గావించెను ప్రియమునను ॥జ

(3) జనుమా నీవు రామలక్ష్మణుల ఇనసుతు కపివర్గము చెంత
గొనివచ్చియు ఈ దనుజుల ద్రుంచి ననుజేకొని పొమ్మను వేగమున ॥జ

(4) నీ వీకార్యము జేయగవలయును నిరుపమాన బలశౌర్య
భూవల్లభు శ్రీరాముని మరి ప్రోత్సాహపరచు గుణధుర్య ॥జ

(5) అడలుచు నిటుపల్కిన జానకితో అంజనసుతు డిట్లనియె మరిని
పుడమిజ దుఃఖింపకు శ్రీరాముడు కడువేగమువచ్చును గనుమీ ॥జ

(6) రావణ సహితంబుగనెల్ల రాక్షసవీరుల ద్రుంచి
దేవీ నినుగొనిపోవు నయోధ్యకు భావమలర ప్రేమించి ॥జ

వ॥ అమ్మా! రామలక్ష్మణులతో సరియైనవా రెందునులేరు. అధికు లెవ్వారుం
డురు గాన రక్కసుల దునుమ అగ్నివాయువులతో సరిబోలి వారిరువురు మేఘ
గంభీరులై, పర్వతాకారులై యీ లంకను ముట్టడించి సింహనాదంబులు చేయు
టను త్వరలోవినగలవు తల్లి! నేను రాముని జేరునంతవఱకు సహించియుండుము.
నేఁబోయి రాముని తోడితెచ్చెద; నీకు మంగళమగుగాక! సంతోషింపవలసిన
సమయమువచ్చె; దుఃఖింపరాదు; రోహిణి చందురునిఁ జేరునట్లు నీవును శ్రీరామ

చంద్రుని జేరగలవు దనుర్ధరులగు రామ లక్ష్మణులు పెక్కువేల వానరులగలసి లంకాద్వారంబున నుండుటను శీఘ్రింబున జూడగలవు. అనిన మరల రాము నుద్దేశించి జానకీదేవి,

కాపి — రూపకం.

ప॥ సరసీరుహాక్ష తరుణమిదే కరుణజూడుమా ॥స

అ॥ నిరతిశయ కృపాకటాక్ష సురమునిసంరక్ష దీక్ష ॥స

చ॥ పరమపురుష భవవిదూర భక్తపాలన
నిరుపమ గుణాలంకార నెరనమ్మితి రఘువీర ॥స

(2) అలనాడు నాపై జాలిగొనియు ఆదరంబున చెలగి
కినుకంబూని కాకము నలయింపవె ప్రాణనాథ ॥స

(3) ఘోరరాక్షసులిపుడు నన్ను జేరిహింసింప
కూరిమివీడి నీ విటులు ఊరకుండదగునె రామ ॥స

(4) దశకంఠుని సంహారింప తడ విదేలను దశరథ
సుత నవకోసల ధామ మేఘశ్యామ రామ ॥స

వ॥ అని బల్కుచు.

పిం:- శ్రీరాముని ననుజేర్చియు పుణ్యము చేకొనుమయ్య అంజన తనయ
ధారుణీశునకు నాపై నిప్పుడు దయగల్గగను బోధింపుము వేగ ॥శ్రీ

(2) ధరణీశుడు నానుదుటను తిలకము అరసియు లేకున్న మణిశిల చాదియు
సరగున చుక్కగబెట్టె నాయెదుట చలువరాతిపై నాముఖబింబంబున ॥శ్రీ

(3) రామచంద్రా యీ చూడామణియు రత్నాకరమున బుట్టెను దీనిని
కామించియు నే దాచియుంచితిని ప్రేమను నీమణి బంపితి నీకు ॥శ్రీ

(4) నేనొకమాసము ప్రాణంబులను నిలిపియుండెద నినుజేరుటకై
ప్రాణనాథా నినువిడచి యరక్షణము బ్రతికియుండ నిలబల్కితి సత్యము ॥శ్రీ

వ॥ ఇట్లు కన్నీరొలుకుచు బలికిన దుఃఖకరములగు మాటలు విని హనుమంతుండు జానకీదేవినిగని యమ్మా!

కం॥ నమ్ముము నా యీపలుకులు నెమ్మదిగానుండు మింక నినుచేకొనగ౯
తమ్మునిగూడుక రాఘవు డమ్మా యిటువచ్చువేగ అడలకుమింక౯

కం॥ వచ్చెద రిదె కపివీరులు చొచ్చెద రీలంకయందు సుందరి వినుమా
తుచ్ఛులు దనుజులగుండెలు చెచ్చెర కోరలను గోళ్ళఁ జీల్చెదరమ్మా !

వ॥ జననీ ! సుగ్రీవుండొక్కడే యీరాక్షసుల నందరం జంపగలడనిన విని సీత హనుమా! నాకొక సందేహంబు బొడముచున్నది. ఈసముద్రంబు దాటుటకు గరుత్మంతునకు వాయుదేవునకు నీకుందక్క మరియెవ్వరికి శక్తిచాలదని దలంచెద. వానర భల్లూకంబులుగాని, రామలక్ష్మణులుగాని, యీ మహాసముద్రం బెట్లు దాటగలుగుదురన హనుమంతుండు,

హిం:- అతిబలశాలులు అందరుకపులు మతిమంతులు నాకంటెను ఘనులు
చతురులు వారు సంద్రముదాటి చయ్యన లంకను ముట్టడించెదరు ॥శ్రీ

(2) రామ లక్ష్మణులు నామూపునగూర్చుండి రాగల రిటకు చంద్రసూర్యులన
భూమిసుపుత్రీ భయపడవలదు రామునిగూడి సుఖియించెదవు ॥శ్రీ

వ॥ ఇట్లు ఊరడిలంబల్కిన సీతాదేవియు వర్షంబుచే పైరంకురించినరీతి అంజనేయుని వాక్సుధావర్షంబున సంతసించె నంత.

జోర:- మణిరత్నంబునుగొని మోదంబున హనుమంతుడు వినయమున
జనకసుతకు సాష్టాంగవందనము సలుపుచు నతివేగమున ॥జ

(2) ఆవలిగట్టును జేరగ దేహం బట్టె పెంచుచు నున్న
పావనిగని యిటు బల్కెను సీతాదేవియు నతి దుఃఖమున ॥జ

(3) మారుతినందన రామలక్ష్మణుల మరి హరివీరులకెల్ల
వేరువేరు నాక్షేమము ప్రీతిని నెరుగింపు మిచటి కథలెల్ల ॥జ

(4) బొమ్మా సుఖముగ రాముని దోడ్కొని రమ్మా వేగంబనిన
అమ్మా పోయివచ్చెద ననుచు అతిహర్షము మీరగ హనుమా ॥జ

(5) రామునొద్దకు బోదలచుచు నతి రయమున నవ్వలి కరిగి
ధీమంతుడు తలఁచెను మదినిటు సీతాదేవిని జూచితి మరిని ॥జ

(6) ఈవని నాశముగావించియు మరి పన్నెరుగునటుల జేసి
రావణు హృదయం బరసియు కొందర రక్షోవీరుల దునిమి ॥జ

వ॥ ఈ రాక్షసులయెడ సామదాన భేదంబు లెవ్వియు బనికిరావు. ధన బల శౌర్యంబులు గల వీరికి దండోపాయంబే ముఖ్యంబు. నే నిచ్చటనే రావణుని బలాబలంబులతో యుద్ధంబున వానర దానవుల తారతమ్యంబు లెరింగి కిష్కింధకు

బోయెద. ఇట్లు జేయుదునేని సుగ్రీవుని ఆజ్ఞ చక్కగ జరిపినవాడ నగుదు. అని దలంచి,

హిం:-సుందరమగు నీ యశోకవనము జూడజూడ నతి మనోహరమై
యెంతయు నొప్పెడు ఫలవృక్షంబులు వింతగు చున్నది నందన వనమన ॥శ్రీ

(2) అని తలపోసి అంజనతనయుం డధిక బలంబున పవనునిరీతి
ఘనవృక్షంబుల లతలను మరియు కనకగోపుర సౌధంబులను ॥శ్రీ

(3) బడద్రోయుచు తన యూరువేగమున భగ్నము జేసెను ప్రమదావనముఁ
నడబావులు బూడ్చి కొలకు లడంచి పుడమి నుతయున్న తరువును విడచి ॥శ్రీ

(4) రావణునతుల్ విహరించుచు నుండెడు రమ్యగృహంబు లన్నియు ధ్వంసము
గావించియు తన బాహుబలంబున పావని గూర్చుండె బహిర్ద్వారంబున ॥శ్రీ

వ॥ అట్టియెడ విహంగంబులు వృక్షంబుల విడచి మహాధ్వని జేయుచు పరువిడసాగె విక్రృతాకారలగు రాక్షసాంగన లంత మేల్కాంచి భగ్నంబైన అశోకవనమును మహాకాయుండగు వానరోత్తమునిజూచి భయభ్రాంత చిత్తలై సీతాదేవిం గాంచి,

జోర:-ఎవ్వడువీడు ఎచ్చటి నుండి ఏల వచ్చినాడు
ఎవ్వరు పంపిరి సీతో నిప్పుడు ఏమిచెప్పినాడు ॥జ

(2) ఎఱిగింపుమి యన సీతయనెను వాడెవడో రాక్షసమాయ
ఎరుగజాలను మీకే తెలియును ఏల అడిగెద రీలీల ॥జ

(3) పాము పాదములు పామె యెఱుంగును పరికింపలేర యెవ్వరును
కామినులారా రాక్షసాంగనలు గావున మీరెరుగుదురు ॥జ

(4) వానర రూపము దాల్చి రాక్షసుడు వచ్చియుండు ననిన
మానసమున నతి భయమయ్యెడు ననుచు మరలి భయకంపమున ॥జ

వ॥ కొందరు రాక్షస స్త్రీలు పరువిడిరి. కొందరు రక్షణార్థం బందె భీతిలు చుండిరి. మరికొందరు రావణున కీ వృత్తాంతం బెఱింగించబోయి, దనుజేశ్వర మహాకాయుండును భయంకరుండునునగు నొక్క వానరుడు సీతతో భాషించి అశోక వనంబంతయు పాడుచేసినాడు. వా డెవ్వడో యింద్రుని దూతయో కుబేరుని దూతయొ లేక శ్రీరాముని దూతయొ మాకేమియు తెలియరాదు. అతి మనో హారమగు వనమంతయు నాశము గావించి సీతాదేవి యుండు వృక్షంబును మాత్రమే కూల్పడయ్యెనన విని రావణుడు,

జోర:-కన్నుల నిప్పుకణములు రాల కడుకోపంబును మీర
ఎన్నగ అతిబలశాలుల యెనుబదివేల రాక్షసుల గనివేగ ॥జ

(2) వానరు డొక్కడు వచ్చి అశోక వనమున నున్నాడిపుడు
గాన మీరలు వాని వధించి కడువేగమె రండన నపుడు ॥జ

(3) అతి భయంకరాకారులునగు నా రాక్షస కింకరు లపుడు
అతివేగమె మిడత లగ్నిని బడునటు లందరు మారుతి గదిసియును ॥జ

(4) గదలను నినుప గుదియలతోను కత్తులతో హనుమంతుగ్
కదిసి రాక్షసులు విసరగ నప్పుడు ఘనవాలము గొట్టుచు నేలక్ ॥జ

(5) గట్టిగ భుజము దట్టియు బొబ్బ బెట్టెను భీకరముగను
అట్టె లంకను ధ్వనిబుట్టగ రాక్షసు లదరి గుండె పగులగను ॥జ

(6) జయము జయము శ్రీరామచంద్రునకు జయమగు లక్ష్మణునకును
జయము జయము సుగ్రీవునకు మాజానకి దేవికి జయము ॥జ

(7) దాసుడ రాఘవవిభునకు వాయుతనయుడ హనుమంతుడను
భూసుతజూచి బోవవచ్చితి భూరి బలాఢ్యుడ నేను ॥జ

(8) వేనవేల్ రావణులైనను నాకు నెదుట నిల్వగనులేరు
కాన యెట్టికార్యము నాచేగాని దెద్దియులేదు ॥జ

(9) ఈరాక్షస వీరులు జూచుచుండ నే యీలంకను భస్మముజేసి
ధారుణిసుతకు నమస్కరించి నే శ్రీరాముని జేరుదు మరల ॥జ

వ॥ హనుమంతుం డిట్లు గట్టిగ నరచిన ఆరాక్షసులు భయంబుజెంది రావణు నాజ్ఞకు వెరచి అతని జుట్టుముట్టి యుండిరప్పుడు వాయుసూనుండు ఇనుప గుదియచే ఆ రాక్షసుల నందర హతంబుగావించి యాద్వారంబున గూర్చుండి యుండె నంత హతశేషులగు రాక్షసులు రావణునకు ఈ వృత్తాంతం బెరుంగింప కోపోద్దీపిత మానసుండై ప్రహస్తుని పుత్రుని హనుమంతుపైకి బోవ నాజ్ఞాపించె. అట్టియెడ ఆంజనేయుండు అశోక వనంబును కలయంజూచి అతి సుందరమగు చైత్య ప్రాసాదము బడద్రోయనైతినని దలంచి, దానిపై లంఘించి,

జోర:-సరగున బంగరు స్థంభము పెరికియు గిరగిర ద్రిప్పగ నందు
మరియు ననలము పుట్టి సౌధము మండిపోయె వేగమున ॥జ

(2) అందుండెడు అసురుల నూర్వుర హతముజేసి శీఘ్రమున
డెందంబున నుప్పొంగుచు భుజము దట్టెను దిక్కుల ప్రతి శబ్దము గలుగ ॥జ

సురటి — రూపకం.

ప॥ జయము జయము శ్రీరఘురామునకు జయము జయము అతిబలోన్నతులకు ॥జ

అ॥ జయము జయము లక్ష్మణునకు మరి జయము జయము సీతారమణీమణికి ॥జ

చ॥ రాఘవపాలితమగు కపిరాజు సుగ్రీవునకు
రాజరాజసేవితునకు నవకోసల పురాధీశునకు ॥జ

వ॥ అని గట్టిగా నరచుచు 'మహాబలవంతులగు నావంటి వానరశ్రేష్ఠు లనేకులను సీతను వెదకుటకై సుగ్రీవుడు బంపియున్నాడు. మరియును మేఘంబులతో సరిబోలు వారును, వాయుబలులును, నూరేనుగుల బలముగలవారును, సీతాదేవిని వెదకుచు భూమియంతయు దిరుగుచున్నవారు. కోట్లు కోట్లు వానర భల్లూకంబుల గూడివచ్చి సుగ్రీవుం డీలంకను నాశంబొనరించు. రాక్షసులారా! రాముని తో వైరంబుబూనినారు గాన ఇంక మీరెవ్వరును బ్రతుకరని హనుమంతుండు బిగ్గరగనరువ నప్పుడు ప్రహస్తుని పుత్రుండగు జంబుమాలి హనుమంతునిపై బాణవర్షంబులు గుఱిపింప ఇనుపగుదియతో అతనిని రథగజతురగ సైన్యంబుతోడ చూర్ణంబుగావించి ప్రళయకాళ రుద్రునివలె తోరణస్తంభంబున గూర్చుండియుండె. ఇదియంతయు విని రావణుడు ప్రహస్తుని కుమారుండు హతమైనందుకు చింతించి కోపసంరక్తలోచనుండై అక్షయకుమారుని గాంచి వానరుండైన యాభూతంబును వెడలగొట్టిరమ్మన

తే॥ తండ్రియాజ్ఞను గైకొని తరలివేగ వాయుసూనుని జేరంగ వచ్చి యతని
బలపరాక్రమశాలిగాఁ దెలిసి మదిని బాణవర్షంబు నాతనిపయిని గురిసె

వ॥ నతండలిగి ఆకాశంబునకెగిరి యిరువురును బోరుచుండ, అతిసుందరుడును తరుణవయస్కుండును, మహాశూరుండును, నిపుణుండునగు అక్షయకుమారునిజూచి, మెచ్చుకొనుచు, పవనజుండు వానినిద్రుంచ మనసురాక, యసురులపై దయజూపి చంపక విడువగూడదని నిశ్చయించి ఆతని పాదంబులుబట్టి వేయిమార్లు ద్రిప్పి నేలంగొట్టిన, హతుండయ్యె నంత తోరణస్థంభంబున ప్రళయకాలాగ్నిహోత్రునివలె ప్రకాశించుచు చూపరులకు భయంబుగల్గించుచు హనుమంతుడుండ, అక్షకుమారుడు చచ్చుటవిని రావణుం డతిదుఃఖితుండై యింద్రజిత్తుం గాంచి.

తోర:- ఘనబలుడవు గావున నీవు తనయా వేగమెబోయి
వనచరుబట్టి వధియించి రమ్మా నా మనమలరంగ మరిని ॥జ

(2) బలపరాక్రమశాలివి యాకపిబల మెరిగియు తగునటుల
చెలగి వానితో మెల్లగుము యుద్ధముజేయు సమయమ్మున బాగా ॥జ

(2) ఈవిధిబల్కిన తండ్రికి మ్రొక్కియు యింద్రజిత్తు మోదమున
పావనిచెంతకు బోవగ నప్పుడె బంగరురథమెక్కెను వేగమున ॥జ

(4) జేరబోయె నింద్రారియు నా రణశూరుని వాయుకుమారుని
మేరుమందర ధీరుని వర్వతాకారుని వీరుని గనియు ॥జ

(5) భూరినాదము చెలగ నసురుడు నారిటంకారము జేయగ
మారుతిజేసెను సింహనాదముగ ధారుణితల మదరంగ ॥జ

(6) దనుజుడు గురితప్పక బాణంబులు హనుమంతునిపై వేయ
అనఘుడు శరమధ్యంబున దిరుగుచు కినుకబూని రయమునను ॥జ

సీ॥ వీనిగెల్చుట కష్టమని దలంచి యతండు పట్టెద నితనినే నెట్టులైన
అని దలపోసి బ్రహ్మాస్త్రంబు సంధించి వాయుతనూజుపై వేయనపుడు
కట్టంగఁబడి దానఁ గదలఁగాలేక దా బడియుండె క్రిందను పవనసుతుడు
బ్రహ్మాస్త్రమున నన్ను బంధించె నసురుడు మంచిదియని తన మదిని దలచె
బ్రహ్మదేవుండు నిందు్రుండు పవను డిపుడు చేరి రక్షించెదరు నన్ను చింతలేదు
రాక్షసులు బట్టుకొన నేనీక్షణంబె అరసి రావణుతో మాటలాడవచ్చు

వ॥ అని యాంజనేయుం డాత్మ తలపోయు సమయంబున రక్కసులు భయంబువీడి
మెల్ల మెల్లగ దగ్గరి.

తే॥ అట్టి పాశంబునను తాళ్ళగట్టి రంత పవనుజునివీడె బ్రహ్మాస్త్రబంధ మపుడు
అదియుగని యింద్ర జిత్తాత్మమదిని గుందె ఔర బ్రహ్మాస్త్రమును వ్యర్థమయ్యెననుచు

వ॥ మరి వేనిచే గట్టినను బ్రహ్మాస్త్రంబు నిలువదు. బ్రహ్మాస్త్రంబు వ్యర్థమైన
మరియొక అస్త్రంబు బారదు. నారలచే వానరుని గట్టిరి. రావణునికి సంకటం
బు గలుగగలదని చింతించె నంత దానవులు హనుమంతుని కొట్టుచు పిడికిళ్ళ
తో బొడుచుచు ఈడ్చుచు రావణుని సన్నిధానంబు చేర్చిరి. మహాబలుండైన
హనుమంతుడు బ్రహ్మాస్త్రంబు తన్ను విడచినను రాక్షసులు పట్టికొట్టి యీడ్చి
నను రావణునితో మాటలాడవలెనని యోర్చి యూరకుండె నంతట,

జోర:- నారలచేగట్టి తెచ్చినట్టి యా శూరుడె యీకపియనుచు
వీరుండగు రావణునకు జూపెను యింద్రజిత్తు ముదమునను ॥జ

(2) ఈ వానరుడెవ్వరు డిచ్చటికి కేలవచ్చె ననుచు
భావంబుల దలపోసిరి సభికులు పరివరివిధముల నపుడు ॥జ

(3) దివసమధ్యమున వెలుగుచుండెడు దినకరుబోలెడు వాని
పవనాత్మజుడు జూచి విస్మయ భరితుడయ్యె తనమదిని ॥జ

(4) దనుజుల త్రాళ్ళఁగట్టి తెచ్చిన వనచరు గని రావణు మరిని
కనులెఱ్ఱజేసి అతిక్రోధముతో నిట్లనియె ప్రహస్తుని గాంచి ॥జ

(5) వీడెవ్వడో మరియెవరిదూత యిటకేలవచ్చె నీవనచరుడు
పాడుజేయుటకు కారణమేమీ ప్రమదావనమని యడుగు ॥జ

(6) రావణుమాటలు విని ప్రహస్తుడు పావనిగని యిట్లనెను
నీవెవ్వడవో యెవరు బంపిరో యెరుగబల్కుమీ నిజము ॥జ

(7) ఇంద్రునిదూతవో పరాక్రమశాలియౌ విష్ణుని దూతవో రామ
చంద్రుని దూతవో భయపడకుము నీ చందము దెల్పుము వేగ ॥జ

(8) వనభంగంబు నేల చేసితివి వానరవీరా యిటుల
నిను విడచెదము నిక్కము దెల్పుము నీకు మంగళమగు ననిన ॥జ

వ॥ హనుమంతుండు రావణాసురునిజూచి,

హిం:-అసురనాయక నినుజూచుటకై అశోకవనమును భగ్నముజేసితి
అసురులు ననుగెల్వ బంపగ నీవు హతమొనరించితి దేహరక్షణమునకు ॥శ్రీ

(2) సురనాయకుడుగా కుబేరుడు యముడు మరి నన్నెవ్వరు బంపగలేదు
నరనాయకుడౌ రాముడు బంపెను ఎరుగుము వాయుతనూజుడ నేను ॥శ్రీ

(3) సురాసురులును బంధింప జాలరు మరి యేయస్త్రముల్ దాకవు నన్నని
పరమేష్టియును కరుణతోడను వరమిచ్చెను నాకు రావణ వినుము ॥శ్రీ

(4) ఘనమగు త్రాళ్ళచే గట్టిన యప్పుడే ననువిడచెను బ్రహ్మాస్త్రము వేగ
నినుఁజూచియు హితమొఱగించుటకై దనుజా వచ్చితి బాధలకోర్చి ॥శ్రీ

(5) వనచరపతియగు సుగ్రీవుండు తనక్షేమము హితముగా జెప్పుమనెను నీకు
వినుము ధర్మార్థ సహితంబగుమాట ఇహపరములయందు మేలగు నీకు ॥శ్రీ

సీ॥ దినకర వంశ్యుండు దేవేంద్ర సముడునౌ దశరథుండనురాజు ధరణినేలు
అతనికి ప్రియపుత్రుఁ డగుర్యేండు తేజస్వి యతిసమర్థుడు రాము డధికబలుడు
తండ్రి యనుజ్ఞచే దండకాటవిజేరె జనకజ వెంటరా అనుజుగూడి
అందుండ జానకి యగపడనందున వెదకుచువచ్చి యావీరులంత

చేరి సుగ్రీవుతో చెల్మిజేసి వేగ వాలి నొకబాణమున గూల్చి వైభవమున
భానుజుని రాజుగాజేసె వానరులకు నెరుగుదువు నీవు వాలి పెంపెసఁగు బలము.

తే॥ అంత సుగ్రీవుడును సీత నరయుటకును అగచరేంద్రుల, బంపె దా నధికబలుల
దిరుగుచున్నారు వారెల్లదిక్కులందు వారిలో నొక్కరుడ నేను నీవనధిదాటి

తే॥ వచ్చితిని లంక జొచ్చితిని వైభవమున గంటి నిచ్చట రామునికాంత సీత
తపముజేసినవాడవు ధర్మరతుడ వగుదు పరకాంతపై వాంఛ వలదు నీకు.

జో॥ర:-ధర్మ విరుద్ధంబగు పనిజేయుట తగునా నీకిది చెపుమా
నిర్మలమతి వతిపండితుండవు నీవెరుగవె నీతిని గనుమా ॥జ

(2) రామలక్ష్మణుల కోపాగ్నికి నిల్వ నీ భూమి నెవ్వరోపుదురు
రాముని కపరాధము గావించి త్రిజగముల రంజిలు సుఖముగ నెవరు ॥జ

(3) ఈ మాటలు సుగ్రీవుడు నీకు నెరుగ జెప్పుమనెను
భూమిజనిచ్చి రామచంద్రునకు బుద్ధిగలిగి మనుమనెను ॥జ

భైరవి — ఆది.

ప॥ ఏరా మూఢా యీతామసమును మానుము ॥ఏ

అ॥ శ్రీరాముని పదకంజములను నమ్మి బ్రతుకు మీాయిల ॥ఏ

చ॥ అనలమునుదెచ్చి అటకపై దాచినటులు మనమున జడియక మారువేషంబున
ఇనకులపతిసతి జానకినిదెచ్చి యునిచితివి నీయింట వినునీ నాశమెరుగక ॥ఏ

(2) అరయఁగ నీవుత్రమిత్రవసులను రక్షించుకొన నెఱిగించెద విను హితసూక్తులను
ధరణిసుతను నవకోసలధాముని కర్పించి వేడుము గాపాడు నతడు ॥ఏ

హిం:-అధికతపంబు పెంపున రావణా ఆయుర్వృద్ధి బొందియునీవు
మదగర్వముతో నున్నవాడవు మరణము లేదెవ్వారిచేనని ॥శ్రీ

(2) సుర గంధర్వ పన్నగ దానవ వరులెవ్వరిచే నుక్రి కుందునటుల
వరము బొందితివి రావణ యప్పుడు నరుల వానరుల మరచితివీవు ॥శ్రీ

(3) వరముగొనిన వారిలో నెవరును గారుగదా శ్రీరామ సుగ్రీవులు
నరులు వానరుల్ గావున వారిచే మరణము దప్పద యెరుగుము మదిలో ॥శ్రీ

(4) అనుభవించితివి ధర్మఫలంబును జనకజ దెచ్చిన కర్మఫలము నిక
అనుభవించెదవు శీఘ్రంబునను విను మైథిలియను కాలపాశముజిక్కి ॥శ్రీ

(5) ధరణిజ తేజంబున నీలంక దగ్ధమైయున్నది మరియును రాముని
కఱకుబాణములఁ గోపానలమునఁ గాల్చివేయును నిన్ను రాక్షసులందఱను॥శ్రీ

వ॥ రాక్షసా! నేనొక్కరుండనే యీలంకనంతయు నాశంబుగావింతుగాని సీతనపహరించినవాని, తానే సంహరించెదనని రాముడు వానరభల్లూకంబుల యెదుట ప్రతిజ్ఞజేసినాడు. రావణా విషంబుగలిపిన యన్నంబుదిని బ్రతుకజాలని యట్లు సీతను దెచ్చినందున నీవును బ్రతుకజాలవు. నీహితముగోరి నిజముజెప్పితి రాముని దాసుండగావున అతని ప్రభావం బెరుంగుదు గాన వినుము.

ఖరహరప్రియ – ఆది.

ప॥ సంకల్పమున సంహారింపనెంచ సరసిజగర్భుడుఁ వారింపలేడు ॥సం

అ॥ శంకరుడుఁ నిర్జరేంద్రుడును పంకేరుహాక్షు శ్రీరామచంద్రుని ॥సం

చ॥ దేవదానవు లొక్కమార్రై వచ్చిన దేవదేవు శ్రీరాముఁ గెల్వలేరు
భావమున నరసి బ్రతుకుమోరావణా లావొకింతలేదు నిక్కమిదియు నీకు ॥సం

(2) శరణనివేడ కరుణించు నతడు సమరముననున్న శత్రువైనగాని
వరనవకోసలవాసుని మహిమ వర్ణింప నెవరితరముగాదు వినుము ॥సం

వ॥ హనుమంతుండిటు బలుక రావణుండధిక కోపంబున నీ వానరుని జంపుడని యాజ్ఞాపించిన బుద్ధిమంతుండగు విభీషణుండు క్రుద్ధుండై బలుకు రావణుమాటలు విని రాక్షసేశ్వర క్షమింపుము కోపంబువిడచి ప్రసన్నుడవగుము నామాట వినుము.

ఖరహరప్రియ – ఆది.

ప॥ దూతనుజంపుట నీతిగాదన్నా పాతకమును నపఖ్యాతియు గల్గును ॥దూ

చ॥ ధర్మము నెరిగిన ధార్మికుండవు నీవు నిర్మలమతివిది నిందితకార్యము ॥దూ

(2) సకలశాస్త్రంబులు జదివినవాడవు ప్రకటితగుణగణ పరమార్థకోవిదుడవు ॥దూ

(3) మంచిచెడ్డలెరుగు మహనీయుడవు యో
చించుము నీమది యుక్తమయుక్తము ॥దూ

(4) శ్రీరాముడు పంపచారుడై వచ్చిన వీని జేరిదరుము నవకోసలమునకును ॥దూ

వ॥ రాక్షసాధిపుండగు రావణుడు విభీషణుడుచెప్పిన మాటలు విని కోపం బిను మడింప విభీషణా విను!

జోర:- పాపిష్ఠుండగు వీని జంపినను పాపములేద యనిన
కోపము విడువుము రావణ యీతని గూల్చుటధర్మమె చెపుమా ॥జ

(2) అక్షకుమారాదుల జంపిన యీ అగచరేంద్రున కిపుడు
శిక్షయొకటి విధించుట న్యాయము చెప్పితి మన విదివినుము ॥జ

(3) అంగవికృతి గావించుటో దేహమునందు ముద్రలు వేయుటయొ
భంగపఱచి తల గొరుగుటయో మరి పట్టికొట్టి పంపుటయో ॥జ

(4) దూతకు దగినదండన లివియని నీతివిదులు దెల్పుదు రీ
కోతిని ద్రుంచిన ఏమిఫలము దుర్నీతిగాదె మరి వినుమా ॥జ

తే॥ చేరివీనిని ద్రుంచిన సీతవార్త రామునకు జెల్పువారేరి ? రయముమీర
మరియు నీ వారినిధిదాటి జొరగలంక సాధ్యమగు నింకనెవరికి జగతిలోన

తే॥ శూరవరులును రఘుకులవీరులైన రామలక్ష్మణు రప్పించి రణమొనర్చి
జయముచేకొని వారలజంపుమయ్య వీని విడువుము దండించి వేగ యిపుడు.

వ॥ యుద్ధప్రియుండగు నోరావణా! యీ వానరుని జంపిన రామ లక్ష్మణుల నిచటికి దెచ్చువారెవరు? మఱియు కీన నీకు వేరుప్రతిష్ఠయెనఁ గల్గునన్న నదియు సున్న. నిన్నెల్లవారు దూషింతురుగాన కండకొవ్వున నొడలెఱుంగక నీయట్టి వానికడకే తుచ్ఛవానరునిబంపిన యామూర్ఖుల బరిమార్ప యత్నింపుము ఆరాజపుత్రుల బట్టిననీకు గొప్పకీర్తియు జయమును గల్గును. నామనవి చిత్తగింపుడు. అని విన్నవింప రావణుం డుత్తమంబును ప్రియంబునునైన విభీషణు పల్కు లంగీకరించి తనలో నిట్లని తలపోయుం దొడంగెను.

హిందూస్థాని తోడి —ఏక

ప॥ శ్రీమహావిష్ణు తేజమేయిది యీమహాభూతమై వచ్చెనేమొ ॥శ్రీ

చ॥ పరాత్పరుండు సర్వకారణుండు నను మారిస్వరూపమై హతముజేయగా ॥శ్రీ

(2) కోతియైవచ్చెగానీ కోతిగాదిదియు సీతనెపముచేత చేటుమూడెను నాకు ॥శ్రీ

(3) శ్రీరామచంద్రుడు నను చేరి వధియించు ధీరుడు నవకోసల పురవిహారుడు ॥శ్రీ

తే॥ మున్ను కైలాస మూగించుచున్నవేళ నిచ్చెశాపంబు నాకు నందీశ్వరుండు
వానరాకృతి నతడిందు వచ్చెనేమొ యనుచు రావణుడెంచును మనములోన

జోర:- ఇటుదలపోయుచు పేఱు విధంబుల నిట్లనియె విభీషణుతోడ
కుటిలుండైనను జంపుట నింద్యము క్రూరశిక్ష విధియింపుము వేగ ॥జ

(2) కోతుల కెప్పుడు తోకపీతిగద భీతిలేక మీరిపుడు
భూతమువాలము దగ్ధముజేసియు పురవీధుల ద్రిప్పండనుడు ॥జ

(3) రావణు నాజ్ఞను బూని రక్కసులు కావరంబుమీరగను
యా వానరుని బట్టికట్టియు నసురులు వేగంబునను ॥జ

(4) హనుమంతుని వాలంబున కప్పుడు వనరుగ గుడ్డలుచుట్టి
నూనెల ముంచియు నిప్పంటించియు హోయని యార్చుచు మరిని ॥జ

(5) అనిలసుతుని పురవీధుల ద్రిప్పుచు నాఘనునిగొట్టి తిట్టుచును
దనుజులు సింహనాదముజేసి భుజముల దట్టుచు బెదరించుచును ॥జ

(6) శంఖభేరి మృదంగ వాద్యములు జయజయ ధ్వనులు జెలంగగా
జంకులేకను దూతయితండని చాటించుచుఁ బోవంగగా ॥జ

(7) బాలురు వృద్ధులు పురుషులు పౌర స్త్రీలు గుంపులుగూడి
బాలార్కునివలె వెల్గు కపివరు చాలమోదమున గనిరి ॥జ

(8) ఆ సమయంబున రాక్షస భటులను అదల్చి నేలబడగూల్చి
భాసురాంగు డవమానముకోర్చి పట్టణమును పరికించి ॥జ

తే॥ రమ్యమగునట్టి యాలంక రాత్రివేళ జూచితినిగాని యిందలి చోద్యములను
బాగుగా గాంచ నంచును పవనసుతుడు రక్కసులచేత యూరక జిక్కియుండె.

వ॥ అట్టియెడ అసురాంగనలు సీతాదేవిం గాంచి,

ఝోర:-సీతా నీతో మాట్లాడిన యా కోతితోకకు నిపుడు
నేతిని దడిపిన గుడ్డలఁజుట్టి నిప్పంటించియు మరియు ॥జ

(2) పరమానందముతోడ రాక్షసులు పురవీధుల ద్రిప్పెదరు
పరికింపుమి యని పల్క జానకి పరితపించుచు నపుడు ॥జ

జంఝూటి — రూపకం.

ప॥ వీతిహోత్రా వందనంబులు శీతలుండవగుము దేవవాతాత్మజునకు ॥వీ

అ॥ భూతలపతి రాముడు నాపై ప్రీతిగలిగి యుండునేని
శీతలుండవగుము దేవ వాతాత్మజునకు ॥వీ

చ॥ పతిసేవ జేయుచునే పతివ్రతనై యుందునేని
శీతలుండవగుము దేవ వాతాత్మజునకు ॥వీ

(2) పతిభక్తిగల సతియని నను పవనజుండు దలచియున్న
శీతలుండవగుము దేవ వాతాత్మజునకు ॥పీ

(3) చతురుడైన సుగ్రీవుడు సత్య ప్రతిజ్ఞుడయ్యెనేని
శీతలుండ వగుము దేవ వాతాత్మజునకు ॥పీ

(4) అతి ముదమున నవకోసలపతి నను రక్షించునేని
శీతలుండ వగుము దేవ వాతాత్మజునకు ॥పీ

డోర:-అని యిటు వేడగ సీతాదేవియు అనలుడు మోదముమీర
అనిల తనూజున కతిశీతలుడై కనకన వెలుఁగఁ దొడంగెఁ ॥జ

వ॥ అంత చెంతనున్న సరమయను అసురాంగన చింతిల్లు జానకినిగని,

హిం:-దేవీ వినుమా యామహాత్ముడు ధీరుండై యాదానవుల న్నలిపి
కావలివారల కాలనుదన్నియు కాల్చెను లంకను గనుమా జననీ ॥శ్రీ

(2) ఇంటింటికి నిప్పంటించియు ప్రతి యింటిపైన దా దుముకగ మారుతి
మంటలో బడియు మగువలు పురుషులు మండుచున్నారదె పసిబిడ్డలతోడ ॥శ్రీ

(3) కాలుచున్నవి మేడలన్నియు గూలుచున్నవి జ్వాలలపాలై
గూలియుకొన్ని భస్మమైనవి కుయ్యోమొర్రోయను నార్తనాదము విను ॥శ్రీ

(4) హనుమంతుండిటు లంకగాల్చగ అంతఃపుర సతులు దిక్కుగానక
గనుమా పరువిడుచున్నారదుగో కాపాడెడువారెవరని యేడ్చుచు ॥శ్రీ

(5) అనలున కర్పణజేసెను లంక అతిధీరుండు ఆంజనేయుడు
జనకజ భయము మానుము నీవన విని మైథిలి మది సంతోషించెను ॥శ్రీ

(6) హనుమంతుండంత తనమది దలచెను అగ్నిచే మండెడు నావాలంబు
గనుగొన చందనశీతలమై నా తనువు దహింపకున్నది చిత్రము ॥శ్రీ

(7) సీతారాముల కరుణారసమున జాతవేదుడు శీతలుడయ్యెను
నాతండ్రికి ప్రియసఖుడు గావున ప్రీతినిజూపెను నాపై నిప్పుడు ॥శ్రీ

వ॥ అని తలపోసి సంతసించి ఆంజనేయుండు జేయవలసిన కార్యంబు నాలోచించి,
తనశౌర్యంబు ప్రకటించుకొనుచు.

డోర:- ఇంతటివీఁగడనై యుండియు నే నీరాక్షసులకుదగిన
శాంతిని జేయక యుండిన నాదు శౌర్యంబేటికి ఛీ-యనివేగ ॥జ

(2) పట్టణద్వారము జేరి యందుగల పరిఘను జేకొని యపుడు
కొట్టిజంపె రాక్షసుల నందఱను నట్టహాసము జేయుచును ॥జ

(3) వాలము ధగధగమండుచుండగని ఆలోచించెను ఇటుల
గాల్చియు లంకను భస్మము జేసెద నా గాసిదీర మోదమున ॥జ

(4) విఱిచితి నేను అశోకవనంబును నెల్లరాక్షసుల జంపితిని
కొఱతలేక యీలంకను గాల్చిన కోర్కెదీరు నాకని యెంచి ॥జ

(5) సముద్రము దాటి వచ్చిన కార్యము సఫలత పొందునని యెంచి
విమలచరిత్రుడు అగ్నిహోత్రునకు విందు జేసెద నని యెంచి ॥జ

(6) పవనజుండు తనకాయము చిన్నది గావించిన బంధముల్ వీడ
దివికెగసియు మండెడు తోకతో భువికిదుమికి కడువేగ ॥జ

(7) ఇంటింటను నిప్పంటించియు పురవీధు లెల్ల దిరుగుచును
మంటలెగయగ భర్మహర్మ్యముల మఱిమరిగాల్చెను అంతి పురములను ॥జ

భ్యాగ్ — ఏక.

ప॥ తగులబెట్టె లంకగ హనుమంతు డెగసి యెగసి వేగ ॥త

అ॥ ధగధగమని పెనుమంటల పొగలెగసెను గగనమందు ॥త

చ॥ పతిసుత సహితంబుగ సతులు పరువులిడగ నపుడు ॥త
(2) హతముగాగ రక్కసులు అగ్నిజ్వాలల మ్రగ్గగాను ॥త
(3) మేలిమి బంగారుమేడల్ నేలగూలి భస్మమగునటు ॥త
(4) ప్రేమను నవకోసల పరంధాముని మదిదలచుచును ॥త

జోర:- దేవతలకు జయకాలంబనుచు దెలిసి భీతిమానియును
పావకునకు తోడై యుండెను పవనుడు మోదంబునను ॥జ

(2) పావకుండు గాల్చుచుండ నా పదార్థస్వభావము చేతగ
దావెలుగొందెను మోదుగ కుంకుమ పువ్వులవలె నందందుగ ॥జ

(3) దిక్కుదిక్కుల నావరించియు తేజరిల్ల పావకుడు
దిక్కులేక యారక్కసులేడ్చుచు తెరువులబడి పరువిడుచు ॥జ

(4) హాతాతా నాతండ్రి పుత్రా హాసోదర బాంధవులార
కోతివచ్చె మనకాయంబులను వీతిహోత్రుపాల్ జేయ ॥జ

(5) అనియిటు హా హాకారంబులతో అగ్నిహోత్రిపాల్ గాగ
ఘనుడు రావణుని గృహము లాదిగా గాల్చెను మోదముతోడ ॥జ

(6) ఆవిభీషణుని గృహముదప్ప మరి అసురుల యిండ్లన్నియును
పావనిగాల్చియు సంతుష్టుండై పరంధాముని దలచుచుండె నపుడు ॥జ

వ॥ అంత,

బిలహరి — ఆది.

ప॥ సంతసించిరి బ్రహ్మేంద్రాదిసురలు ॥సం

అ॥ సంతసించిరి హనుమంతుని జూచియు సాధువాక్యముల సన్నుతించుచు ॥సం

చ॥ సిద్ధులు సాధ్యులు చేరి గంధర్వులు బుద్ధిశాలిౕ ఘనుని భూరి విక్రముగని ॥సం

(2) వనభంగ మొనరించి దనుజుల బరిమార్చి ఘనమగు లంకను గాల్చెనని మదిని ॥సం

(3) ధన్యుడు పూజ్యుడు పుణ్యపురుషుడితడు మాన్యుడుత్తముడు మహనీయుండనిచాల

(4) ధర నవకోపలధాముని దూతను పరమానందమున ప్రస్తుతించుచు మునులు ॥సం

వ॥ అట్టియెడ,

జోర:-పారావారముజేరి వాలమును పవనసుతుడు జల్లార్చి
తోరణ స్థంభముజేరి జూచెను ధీరుడు లంకాపురిని ॥జ

(2) మండుచుండు నాలంకనుజూచి మతిహీనుడ నేననుచు
డెందమున దిగులొందియు జానకి యుండునో లేదో యనుచు ॥జ

హిం:-సీతయున్నదని దలపక నేను ఘాతకుండనై గాల్చితి లంకను
పాతకుడను ప్రభుకార్యము జెరిచిన పాపిష్ఠుడను స్వామిద్రోహిని నేను ॥జ

(2) కోపముచేత తాపము హెచ్చును కోపము సర్వానర్థ హేతువు
కోపానలము జల్లార్చినవాడు కువలయమున కడు పూజ్యుడు ధన్యుడు ॥శ్రీ

(3) కోపముచేత గురునైన జంపును కోపముచే సాధువరుల దూషించును
కోపంబున పరుషోక్తులు పల్కును కోపిష్టిజేయని కూరముతే దిల

(4) కోతిస్వభావము జూపితినిప్పుడు కోపముచేతను చపలుడనైతిని
సీతాదేవిని రక్షింపగల్గియు నటు జేయమరచితి కోపంబునను ॥శ్రీ

(5) సముద్రము దాటుట సీతనుజూచుట సర్వము వ్యర్థంబాయె నిప్పుడు
భూమినుపుత్రి నాశంబై యుండు నేమిచేయుదు రామవిభు నెటుజూతును ॥శ్రీ

వ॥ లంకలో తగులబడని ప్రదేశ మావంతయును లేదు. పట్టణమంతయు దగ్ధమైనది. నాబుద్ధి వైపరీత్యమువలన సీతాదేవి నశించియుండు. అట్లు నశించి యుండునేని ఇచ్చటనే నా ప్రాణములు విడుతును. నిప్పులోబడుదునా లేక పాతాళంబులో బడుదునా, అటుగాకున్న సముద్రమునబడి అందుండు సత్వంబుల కాహార మగుదునా యని చింతించుచు

జో॥ర:- సీతాదేవి నాశమువినియు శ్రీరామ లక్ష్మణులు వేగ
పాతకుండనగు నావలన నశింతురు భరత శత్రుఘ్నులతోడ ॥జ

(2) ఇనతనూజుడు బోవునిశ్చయము హితవర్గంబుల తోడఁగ
ఇనకులమును నశియింపగ జనులు వెతలజెందుదురు వేగఁ ॥జ

(3) ధర్మార్థంబుల రెంటిని జెరచిన దార్భాగ్యుడ నిక్కముగఁ
నిర్మలమతి హీనుడ మూర్ఖుడ నిర్దయుండనని చింతిలగఁ ॥జ

(4) గనుపించెను శుభసూచకంబులు హనుమంతున కపుడు
మనియుండును భువి ననుచు దలచె మది మంగళరూపిణి జానకియు ॥జ

శహాన — రూపకం.

ప॥ స్వప్రకాశియా జానకినీ స్పృశియించునె పావకుడు ॥స్వ

అ॥ అప్రమేయగుణాఢ్యుడౌ రఘువీరునిసతియా పరమ పతివ్రతా శిరోమణి ॥స్వ

చ॥ భక్తజన రంజనియా పరమకల్యాణీ భద్ర యశస్కరీ పావనీ జగజ్జననీ
ముక్తిదాయినీ సురనరమునిపోషణీ రుక్మిణీమానస సంచారిణీ ॥స్వ

(2) భరత లక్ష్మణ శత్రుఘ్నులకు పరదేవతగాదే మైథిలి
వరనవకోసలేశు హృదయ సరసిజమున నుండుదేవీ ॥స్వ

హిం:-అనలుడు నాదు వాలము గాల్పడు జనకజ కరుణావీక్షణమునను
ఇనకులపతి సతి నెటు దహియించును మనమున శంకయేలను నాకు ॥శ్రీ

(2) వననిధి బంపగ మైనాకుండు వనరుగ నుపకృతి గావించెనుగద
ఘనుడగు రాముని కార్యముదీర్పగ అనువుగ దహనుడు మేలొనరింపడె ॥శ్రీ

(3) సీతాదేవి తపః ప్రభావమునను పాతివ్రత్య మహిమచేతను
జాతవేదుని దహియించునుగాని వీతిహోత్రుడెటు గాల్చును తెలియక ॥శ్రీ

వ॥ ఇట్లనుకొను సమయంబున,

డోర:-అలవిగాని పని జేసెను చిత్రము హనుమంతుండని యనుచు
చెలగుచు చారణు లాశ్చర్యంబున జెప్పుకొనిరి యిటులు ॥జ

(2) ప్రాకారంబులు కోటబురుజులును పట్టణమంతయు గాలెక్
శ్రీకరియగు శ్రీరామునిపత్నిని జేర కగ్నిజ్వాలలు పురినిండెక్ ॥జ

(3) బాలురు వృద్ధులు స్త్రీలునుజేరి పరువు లెత్తుచున్నారు
కోలాహలమున రక్కసులందరు చాల నేడ్చుచున్నారు ॥జ

(4) పరమ పతివ్రత సీతాదేవిని పవనుడు దహియింపడుగా
నిరుపమ తేజంబున భాసిలుచున్నది నీరజాక్షిక్ గనుగొనగ ॥జ

తే॥ చారణుల వాక్యముల్ విని సంభ్రమమున మరల సీతను వీక్షించి పరమభక్తిc
జోయెదనుగాక రాముని(మోల కనుచు నెంచి పావని సీత నీక్షించి వేడ్క

వ॥ తల్లీ నాభాగ్యవశంబున క్షేమంబుగానున్న నిన్ను మరల జూడగంటినని నమస్కరించి నిలచి ప్రియాణంబై యుండు హనుమంతుని మాటిమాటికి జూచుచు నాయనా శీఘ్రంబున శ్రీరామ లక్ష్మణుల దోడ్కొనివచ్చి రాక్షస సంహారంబు గావించి నను చేకొని పోవునట్లు కార్యంబు కొనసాగింపుమన పవనజుడు అమ్మా! చింతింపకుము శ్రీరాముడు వానరసేనలతో వచ్చి రావణాదుల దునిమి నిన్ను దోడ్కొని సంతోషంబున పురంబుజేరు. ఊరడిలుము. జననీ నేcబోయి వచ్చెదనని అతి మనోహరంబగు అరిష్ట పర్వతముజేరి మరల సాగరంబుదాటి అంగదాది కపులజేర నుద్యుక్తుండై,

డోర:-ఆకాశంబున కెగురదలచి యా హనుమంతుడు కడువేగ
కాకుత్స్థుని పదయుగళము దలcచుచు గర్జించెను మోదముతో నిటుల ॥జ

క॥ రాఘవు ప్రియసతి జూచితి రాక్షసవీరులను జంపి రావణు గని నే
బాగుగ నీతులు దెల్పితి వేగమె యీలంకగాల్చి వెడలితి ననుచుక్ ॥జ

వ॥ ఇట్లు సింహనాదంబు గావించుచు,

డోర:-శ్రీమంతంబగు నాపర్వతము శిఖరంబులతోను
సామీరి పదమ్ముల నూనుటచే సమమయ్యెను భూమికి నపుడు ॥జ

(2) సురగంధర్వ కిన్నరసతు లాగిరి కందరములు విడచి
పరువిడి రప్పుడు గగనపథంబున వరులను జతగూడి ॥జ

(3) పవనతనూజుడు రెక్కలుగల్గిన పర్వతంబువలెను
జవమున నాకాశంబున కెగసి సముద్రముదాటగ నపుడు ॥జ

(4) మైనాకుని వీడ్కొని వేగంబున నా మహేంద్రపర్వతము గనియు
వానరతల్లజుడగు హనుమంతుడు ఆనందంబున మరియు ॥జ

(5) భూగగనంబులు ప్రతిధ్వనులియ్య భూరినాదములు జెలగన్
మేఘమువలె గర్జించుచు బహువేగంబున వచ్చుచునుండన్ ॥జ

(6) అంగదాది కపివీరుల జూచెదనని అధికోత్సాహముతోడన్
పొంగుచు జేసెను సింహనాదమున్ భూరిబలుడు హర్షమునన్ ॥జ

(7) ఎపుడువచ్చునో హనుమంతుడు మన మేమివిందుమో యనుచు
కపివరులందరు దుఃఖించుచు నాథునుని కెదురుజూచుచును ॥జ

(8) హనుమంతుని కంఠధ్వని విని తమ మనముల బొంగుచునుండు
వనచరులనుగని జాంబవంతుడు వచ్చె వాయుసుతుడనుచు ॥జ

హిం:- కృతకృత్యుండై వచ్చెడు నిటకు మతిమంతుండగు పవనసుతుండు
చతురుని కంఠధ్వనివిని కార్యము సాధించెనని దెలియగవలయు ॥శ్రీ

(2) అంతట కపు లతిసంతోషంబున గంతులువైచుచు వేగంబునను
వింతగు పర్వతశిఖరము లెక్కియు వేడుకతో నతని జూచెదమనుచు ॥శ్రీ

(3) వృక్షంబులపై నెక్కియు కొందరు వీక్షించుచు మోదంబున కొందరు
వృక్షశాఖల నూచుచునప్పుడు వచ్చెను మారుతి యనుచును వారలు ॥శ్రీ

(4) కిలకిలమని శబ్దంబుల కొందరు ఇలపై దుముకుచు నెగురుచు మరియు
పలుమరు కేకలువేయుచు నందరు పవనజు బొగడుచు నుండిరి కపులు ॥శ్రీ

(5) మారుతి బహువేగంబున వచ్చి మహేంద్రపర్వతముపై వ్రాలినయంతన్
ధీరునిజూచి మొక్కియు నందరు జేరిరి చుట్టును మోదమువిూరన్ ॥శ్రీ

(6) ఫలమూలంబులు కానుకలిచ్చి పవనతనయుని పూజించియు ప్రీతి
కిలకిలశబ్దము జేయుచు కొందరు చెలగి తోకలాడించిరి ముదమున ॥శ్రీ

వ॥ ఇట్లు కపివరులు ఆనందపరవశులై యుండ,

డోర:- హనుమంతుండంతట జాంబవంతునకు అంగదాదులకు నంతన్
ఘనతరభక్తిచె నమస్కరించియు మనమలరగ నిట్లనెను ॥జ

(2) జూచితి సీతను సంతోషంబున సూరిజనోత్తములారా
నీచుడైన యా రావణునింట నిరుపమగాత్రిని వేగ ॥జ

(3) తలవెంట్రుకలు జడలుగట్టగా మలినాంగముతో కృశియించి
చెలగి రాక్షసస్త్రీలమధ్య మరి దలచుచు రాముని మదిని ॥జ

(4) జనకజయున్న దశోకవనమునను గనివచ్చితి నిపుడనిన
వినిరి వానరుల్ అమృతవాక్కులను వేడ్కమీర నానందమున ॥జ

వ॥ కొందరు సింహనాదంబులు గావించిరి. మరికొందరు గట్టిగా కేకలువేసి యెగిరిరి. కొందరు వృషభంబులవలె కొందరు మేఘంబులవలె గర్జించిరి. దీర్ఘంబులగు తోకల నెత్తి నేలపై గొట్టిరి. మరియును వానరులు పర్వతంబుపైనుండి దుమికి హనుమంతుని దాకి కిచకిచమనిరి. అట్టియెడ అంగదుడు హనుమంతుని గాంచి

హిం:-శతయోజనముల సముద్రముదాటి సీతనుజూచి వచ్చితివయ్యా
బ్రతికితి మిప్పుడు నీపుణ్యంబున అతిశూరుడ నీసాటి యెవ్వా రిల ॥శ్రీ

(2) శ్రీరఘురాముని పరమభక్తుడవు శౌర్య ధైర్య పరాక్రమశాలివి
కూరిమితో మాభాగ్యవశంబున ధారుణిసుతగని జేరితివి మము ॥శ్రీ

వ॥ ఆంజనేయా ! నీవీసాగరంబుదాటి జానకిని జూచివచ్చిన విధంబంతయు సాంగంబుగ దెల్పుమన వానరులందరును అంగద జాంబవంత హనుమదాదుల పరివేష్టించి శిలపై గూర్చుండి చేమోడ్పు గీలించి యావద్వృత్తాంతంబు వినగోరి హనుమంతుని ముఖంబును జూచుచుండ జాంబవంతుడును వాయుకుమార,

తే॥ ఎట్లుజూచితివి సీతను ఏమిజెప్పె పాపియగు రావణుండును పరమసాధ్వి
నెట్లు జూచుచునున్నవాఁ డెచటకలదో విశదముగ జెప్పుమా వేగ విమలచరిత.

వ॥ శ్రీరామచంద్రున కీవృత్తాంతంబు ఎటుల చెప్పందగునని ఆలోచింత మనవుడు హనుమంతుడు సీతకు నమస్కరించి ఇట్లని జెప్పం దొడంగె.

ద్విపద:-వినరయ్య యెగురుచు వినువీధి కేను । వననిధి దాటంగ గనినారుగాడె
ఘనుడు మైనాకుడు కనక శృంగముల । ననుడాసి యాతిథ్యమును గొనుమనిన
నిలువను నేనెందు వలదనిపోవ । కలయంగ సురస నన్ దిలకించి యపుడు
ఆకలిగొంటినం చంత నన్ జేరి । వే కబళింపగా వచ్చె నో రపుడు
అంత నేదానితో కొంతపోరాడి । చింతించి మదిలోన చెచ్చెర సురస
వదనంబుజొచ్చి నే వచ్చియు వెలికి । ముదమునబోవంగ నుదధిమధ్యమున

ఛాయాగ్రహంబు నట్లె జంపయత్నించ | బాయక దానినేఁ బట్టి వధించి
చేరితి యావల తీరంబునకును | సూర్యాస్తమయమున జొచ్చితి లంక
అంత రక్కసియొక్క తరచుచు నాదు | చెంతను నిలచి నన్ జేరవచ్చినను
యెడమహాస్తమున నేబొడచిన నసుర | ననుజయించితి విభుడు నాపేరులంక
వినుమయ్య నీవింక వీరలందఱును | దునిమియు జయము చేకొనుమనె నంత
లంకజొచ్చియు దాని లక్షణాలరసి | శంకలేకను నెల్లస్థలముల నరసి
జనకజ నెందు నే గనలేక చింత | గొనుచు నప్పు డశోక వనమున జొచ్చి
కనుగొంటి సీతను కడుదీనవదన | మలినాంగి కనులను జలములుగార
ఘోరాసురులమధ్య నూర్చుండి భీతి | శ్రీరాముమదిలోనఁ జింతించుసాధ్వి
గని ముదమందితి జనకజ యనుచు | తరుణంపు శింశుపా తరువునుజేరి
సరవిని గనునంత సంతసంబడర.

డోర:- సురగంధర్వ అసురాంగనలతో అరుదెంచియు రావణుడు
పరమపతివ్రతయగు జానకి గని బలికెను క్రూరముగాను ॥జ

(2) ననువరియింపుము నా మాటను విను మరి వినకుండిన నేనివుడు
తునుకలుచేసి నినుభక్షించెద నని బెదరించగ వినియు ॥జ

(3) ఖలుడగు రావణుఁ గన్నులఁ జూడక తలవంచియు నిట్లనెను
నిలువలేవు శ్రీరామునియెదుట నీచా దుర్మతి ఛీ పొమ్మనెను ॥జ

(4) రావణుసతి మండోదరియనునది రక్షోవీరునిగాంచి
దేవా నను గామింపుము సీతాదేవి వలవదనిపలికె ॥జ

(5) సతులులేరె ప్రాణేశ మానవసతి నిటుగోరగ నేలా
హితమిటు తెల్పి పతినిదోడ్కొని యేగెనామె వేగమున ॥జ

వ॥ అంతట నానారాక్షసస్త్రీలు జానకీదేవిని "నీవు రావణుని వరియింపవేని నిన్ను భక్షించెదము" అనుచు బెదరింప నామె దుఃఖంబున విలపించుచుండె. అట్టియెడ త్రిజటయనురాక్షసి మేల్కని సీత నూరడిలంబల్కి రాక్షససతులారా! సీతకు జయమును రాక్షసులకు అపజయంబును గల్గు స్వప్నంబుగంటిని. ఈ దేవిని ప్రార్థింపుడు మనల రక్షించుననిన రామునకు జయంబుగల్గునను మాటవిని సీతాదేవి సంతోషించి, త్రిజటస్వప్నంబు నిజమయ్యేనేని, మిమ్మురక్షించెద ననియె. అంత అసురాంగనలు నిదురించిరి. అట్టిసమయమున సీతప్రాణంబులపై నాశమాని తన కేశపాశంబును జెట్టునకుజుట్టి మెడకురిపోసి,

తే॥ జనకవరపుత్రి దుర్దశ గనినయంత చాలచింతించి నేను నీ సాధ్వితోడ
నెట్లు భాషింప గలనని యెంచి యపుడు పల్కితిని రామకథయామె భావమలర.

తే॥ కన్నులను నీరుగార్చుచు నన్నుగాంచి యెవ్వడవు నీవు నానాథు నెంచెదిట్లు
వార్ధిదాటియు నీవెటు వచ్చితిటకు నెవరుపంపిరి నిన్ను నాకెరుగజెపుము.

వ॥ అని యాకాంతామతల్లి యడుగ నేనును సవినయంబుగ,

హిం:- రామ సుగ్రీవుల సఖ్యముదెల్పియు రాముడు పంపగవచ్చితి నేనని
క్షేమము శ్రీరామలక్ష్మణుల కని భూమిజ కిచ్చితి అంగుళీయకము ॥శ్రీ

(2) శృంగారంబగు ముద్రికగని యుప్పొంగుచు పులకాంకితురాలై యా
మంగళాంగి శ్రీజానకి దానిని మరిమరి కనుల శిరమున నుంచెను ॥శ్రీ

వ॥ అంత నేను నమ్మకముగల్గు గుర్తులు మఱికొన్ని దెలిపి సెలవిమ్మని యడుగ

హిం:- చూడామణియను దివ్యరత్నము చేడియ మరి నాచేతి కొసంగి
వేడుకగును శ్రీరాముండిదిగన వీడును దుఃఖము నను గూడినయట్లు ॥శ్రీ

(2) రామలక్ష్మణుల చెంతకు నిన్ను రమణీమణి గొనిపోయెదనిప్పుడె
ఏమనెదవు నీవనుచు నేనడిగిన రాముడువచ్చి నను దోడ్కొనిపోవును ॥శ్రీ

వ॥ నాయనా! రావణుని వధించి నన్నుగైకొనిన రామునకు గీర్తియగుననన నేనా దేవికి సాష్టాంగనమస్కారంబులు గావించి తల్లీ! పోయివచ్చెద నేనన, అంజనేయా! నాకష్టంబులన్నియు రామునకుజెప్పి వానరసేనాసమేతంబుగ వచ్చి నన్నుం గొనిపొమ్మనుము రెండుమాసంబు లెట్లో యోర్చియుందును ఆవల బ్రతికియుండనోప నీభువిని. ఈమాట శ్రీరామునకు జెప్పుమన తల్లీ యట్లకావించెద. నీవుల్లంబునఁ దల్లడిల్లకుము. శ్రీరాముఁ డరనిమిసమున రావణుతలలు నేలగూల్చి నిన్నుంగొనిపోవును ధైర్యముననుండుము. అని ఆవలకువెళ్ళి రోష విషాదములు బెనగొన ఇంకనేనేమి జేయవలయునని కొంతయోచించి దేహంబు బెంచి అశోకవనము భగ్నంబుగావించి చైత్య ప్రాసాదమును గూల్చి అందలి రక్కసుల బరిమార్ప రావణుడు మంత్రిపుత్రాక్షకుమారాదులతో పెక్కువేల రక్కసుల బంపిన అందరిని హతముగావించి తోరణస్థంభముం జేరియుంటి. రావణుండంత మహాబలుండగు ఇంద్రజిత్తుడను కుమారుని నాపైకి బంపెను. నేనంత వానిసేనల నిర్మూలంబుచేసి యతనినినొప్పింప నేనజేయుడనని యెఱింగి బ్రహ్మాస్త్రంబున నన్నుబంధించె నంత రాక్షసులు నన్ను పగ్గంబులతోగట్టి

కావలు సన్నిధింజేర్చిన రావణుడు నీవెవ్వడవు? ఏలవచ్చినాడవు? రాక్షసుల నేలజంపినావన

జోర:-సీతను జూచుటకై వచ్చితి నిపుడు శ్రీరాముడు బంపగ నేను
వాతాత్మజుడను హనుమంతుడను వానరజాతిని వినుము ॥జ

(2) దనుజాధమ యిక మనజాలవు విను రాముని శౌర్యంబు
ఘనుడగు వాలిని దునిమెను మరియు నిను జంపును నిక్కంబు ॥జ

(3) వనచరుడగు సుగ్రీవుని మంత్రిని ననుబంపె నతడు వేగమున
జనకజనిచ్చి బ్రతుకుము భువిలో చావవలదు మూఢుడ యనిన ॥జ

(4) అధిక కోపమున రావణుండు నను వధియించు మనుచు బల్కనను
సదమలమతియగు విభీషణుండు నను జంపదగదని బల్కగను ॥జ

(5) అంగవికారము జేయవచ్చునన నారాక్షసులందరు జేరి
పొంగుచు రావణు నానతిచే నను పూని గట్టియును బాగ ॥జ

వ॥ నూనెతో దడిసిన గుడ్డలు నావాలంబునకు జుట్టి నిప్పుబెట్టి కాలుచున్న తోక తో నన్ను లంకంతయు దిప్పునంత నేను నాదేహంబు చిన్నదిగాజేయ కట్టినకట్లు వదలిపోయె. అప్పుడు నేనారాక్షసుల మర్దించి లంకంతయు భస్మము గావించి నాతోకను సముద్రమున జల్లార్చి మరల దగ్ధంబైన లంకను గలయంజూచి హా నేనెంత బుద్ధిహీనుండ సీత యేమయ్యెనో దగ్ధంబై యుండునని చింతించు సమయంబున,

తే॥ భస్మమైపోయె నీలంక పాడుబడియె నౌర సీతమ్మ సుఖమున్న దనుచు బలుకు
చారణుల నుడి విని నేను సంతసించి మరల ధరణిజ గనుగొని మదిని పొంగి.

వ॥ ఆదేవి యనుజ్ఞ బడసి మిమ్ముజేరవచ్చితి. శ్రీరాముని ప్రభావంబున మీయను గ్రహంబున సుగ్రీవునాజ్ఞ చక్కగా నెరవేర్చితి నింక నేమి చేయవలయునో దెల్పుడని మరల నిట్లనియె

జోర:-దశకంఠుని వధియించియు మనము ధరణిజ దోడ్కొనివేగ
దశరథ తనయుల జేరబోదమని దలచెద దెల్పుడి మీమది బాగా ॥జ

(2) పాతివ్రత్యము సదాచారము పరమశాంతి గల్గియును
సీతాసతి మనియున్న దచ్చట శ్రీరాముని ధ్యానించుచును ॥జ

(3) తపోబలము గలవాడు రావణుడు ధర్మముజేయుచు మరియు
చపలాక్షి శ్రీరాముని పత్నిచే జావక నున్నాడిపుడు ॥జ

(4) సీతాదేవి కోపాగ్నికి నిక జీవింపడు మరి రావణుడు
ఆ తరుణీమణి రామునిచేతను హతమొనరింపగ నెంచి మరియు ॥జ

(5) వీరపత్నిగావున ధర్మంబున నూరకున్నదా దేవి
కూరిమి దశకంఠుడు పుత్రమిత్రులతో గూలును నిక్కము వినుడీ ॥జ

(6) మనమందరము బోయి యిప్పుడే దనుజుల బరిమార్చియును
జనకజ దోడ్కొని రామలక్ష్మణుల గనుట యుక్తమని నలచెదను ॥జ

(7) చాలుదు నేనొక్కడనే రావణు జంపి సీత దెచ్చుటకు
వాలాయము మీరందరు గలసి వచ్చిన నిలతురె రక్కసులు ॥జ

(8) లంకను బూడిదజేసియు నేను లక్ష్యపెట్ట కారావణు నిపుడు
శంకలేక యిటుబల్కితి బిగ్గర జయము జయమ్మని మరియు ॥జ

(9) శ్రీరామునకు సౌమిత్రికి మరి సీతాదేవికి జయమనుచుశా
సారెసారెకు సాకేంచితి నిటు జయము జయము సుగ్రీవున కనుచుశా ॥జ

(10) అధిక బలాఢ్యులు శూరులు మీరందరు గావున వినుడిపుడు
విధి రుద్రాదుల శరణు జొచ్చినను వధియింపక విడతురె దనుజుల నిపుడు ॥జ

వ॥ రావణుండెంత నిర్బంధించినను వాని ముఖంబు జూడక,

జోర:-ఇలను బరుండి తనువెల్లను దూళిగ మలినాంబరమున సీతా
లలితాంగియు కడు దుఃఖంబున రాముని దలచుచున్నది జగన్మాతా ॥జ

(2) రాక్షస స్త్రీల నడుమ నశోక వృక్షమూలమునను
రక్షింపుము రఘువీరాయను సతి వీక్షించితి కష్టంబునను ॥జ

(3) శ్రీరఘురాముని దూతను నేనని చెప్పితి మోదముతోడశా
ధారుణిసుతతో మాటలాడి నే తరలి వచ్చితిని వేగశా ॥జ

వ॥ సీతాదేవిని నిర్బంధించుటచే రావణుని తపస్సంతయు నశించె. ఇంక వాని
జంపుటకు రాముడు నిమిత్తమాత్రింబేయని దలంచెదనన అంగదుడు

హిం:-శ్రీరఘురాముని చెంతకు మనము సీతాదేవిని దోడ్కొని పోక
జేరబోవుట యుక్తముగాదు శీఘ్రమె కష్టముల్ బాపగవలయును ॥శ్రీ

(2) వానరులారా లంకకు వేగమె వారిధిదాటి రావణు దన్నియు
జానకిదేవిని శ్రీరామచంద్రునకు సంతోషంబున సమర్పింతము మనము ॥శ్రీ

జోర:- సంతోషంబున వల్కె నంగదుడు జాంబవంతు డిటులనెను
వింతగాదు నీ బలశౌర్యంబులు వీరాగ్రేసర మరి వినుము ॥జ

(2) ప్రతినజేసె శ్రీరాముడు సభలో తనసతిని మ్రుచ్చిలిన క్రూరున్
హతముజేసి వేగంబున సీతాసతిని దెచ్చెద ననుచున్ ॥జ

(3) కావున మన మతిశీఘ్రంబున సీతాదేవి యున్నదని దెలుపఁ
బోవలె రాముని సన్నిధి కిప్పుడు పూర్ణోత్సాహముతోడ ॥జ

తే॥ జాంబవంతుని నుడులను సమ్మతించి హర్షమున రాము లక్ష్మణు హరితనూజు
జేరబోవుదమన కపుల్ శీఘ్రముననుఅంగదుడు ముందరెగురఁగా నంబరంత.

వ॥ హనుమదాది వానరులును గగనంబున కెగిరి సింహనాదంబులు గావించుచు
లాంగూలంబు లాడించుచు మేరు మందరంబులరీతి జూపట్టుచు అతిరయంబున జని

జోర:- మధువనంబును జొచ్చి వానరులు మధువెల్లను ద్రావగను
దధిముఖు డడ్డమువచ్చిన వానిని తరిమిగొట్టె నతి బలమునను ॥జ

(2) ఫలములు నమలుడు తేనెలు ద్రావుడు ప్లవగోత్తములారా యనుచు
బలుకగ మారుతి వనచరులందరు ఫలములు దిని మధుద్రావుచును ॥జ

(3) దధిముఖుడంతట మరలివచ్చియు ద్రావవలదు మధువనిని
బెదరించుచు వానిని భటులను దరిమిన భీతిని పరువిడి రంత ॥జ

(4) అంగదుడంతట నా దధిముఖు సర్వాంగముల్ విరుగగ తన్న
అంగ మెఱుంగక మూర్ఛిలిపడి మరి యంతలేచి రోషమున ॥జ

(5) వనపాలకులను గూడుక నతఁడు వినువీధిని జని వేగ
దినకరసుతుని పాదంబులబడె వినయవిధేయత లొప్ప ॥జ

వ॥ అంత సుగ్రీవుండు దధిముఖుని జూచి లెమ్ము లెమ్ము ఇంతదీనుండ వగుటకుఁ గతం
బేమనిన అతండు మహారాజా అంగదాదివానరులు మధువనంబు నాశంబు
గావించిరి.

హిం:- ఫలమూలంబులు నారగించుచు పలుమరు తేనెద్రావుచు మరియు
చెలగియు వనపాలకులను బట్టి నిలువనీకను తరిమిగొట్టిరి ॥శ్రీ

(2) పాదంబుల పైకెత్తియు వారల పశ్చిమద్వారము జూపుచు మదమున
బాధలుబెట్టియు మధువనమంతయు పాడుచేసిరి యంగదాదులు ॥శ్రీ

(3) అనిపల్కగ విని మోదంబునను వనపాలకునకు నసె సుగ్రీవుడు
అనఘా వారలు కృతకృత్యులునై జనుదెంచిరి గాన నేమియు ననకుము ॥శ్రీ

వ॥ అనుసమయంబున లక్ష్మణుండు సుగ్రీవునిగని, ఇతండెవడు? ఏల దుఃఖించు చున్నాడు? అని యనుటయు సుగ్రీవుండు.

డోర:- అంగదాది కపివీరు లందరును అతిమోదంబున నిపుడు
పొంగుచు మధువనమంతయు నిపుడు భంగపరచిరట మరియు ॥జ

(2) దక్షిణ దిక్కునుండివచ్చి రతి ధైర్యముతోడుత వారు
వీక్షించియుందురు సీతాదేవిని నక్షీణ బలాఢ్యులు ఘనులు ॥జ

(3) గావున మధువనమందు జేరిరి కపులందరు హర్షమున
భావింపగ కార్యము సాధించినవాడు పవనసుతుడు శౌర్యమున ॥జ

(4) మధువంతయు డ్రావుచు నందలి మధురఫలంబులు దినుచు
బెదరించుచు వనపాలుర దరిమి మధువనమున నున్నారట యిపుడు ॥జ

వ॥ అని లక్ష్మణునికిదెల్పి దధిముఖునిగాంచి అనఘా వారలతో జగడంబువలదు. నీకొలువున నీవుండుము. నేను శీఘ్రంబున రమ్మనినట్లు వారల కెఱిగింపుము. అన నతండు రామలక్ష్మణ సుగ్రీవులకు నమస్కరించి తన భటులతోడ మధు వనంబుజేరి అంగదునిగాంచి.

డోర:- ననుమన్నించుము యువరాజా నా మనవిని వినుమి యిపుడు
నినురమ్మనె వనచరులను గూడుక నీపినతండ్రియైన భానుజుడు ॥జ

(2) అని పల్కిన మహదానందముతో వనచరులందరు వేగ
హనుమంతుని నంగదు మున్నిడుకొని జని రాకాశ పథంబున వడిగా ॥జ

ఆఠాణా — రూపకం.

ప॥ శ్రీరఘుకులవరవీరా సీతామనోహార ॥శ్రీ

అ॥ కారుణ్యసాగర గంభీరా గనివచ్చియుందురు జానకిని ॥శ్రీ

చ॥ పశ్చిమదంబున వచ్చెదరిదె ప్లవగోత్తములు రామా
అమిత బలాఢ్యులాకాశ పథమున
అమరతుల్యులతిఘనులు అంగదాది మహావీరులు విమల మతులు నవకోసలేశ ॥శ్రీ

వ॥ సుగ్రీవుండిట్లు బల్కు సమయంబున,

హిం:-వచ్చియు వనచరుల్ ఉత్సాహంబున వ్రాలిరి శ్రీరఘురాము సన్నిధిని
సచ్చరితుడౌ శ్రీరాముని కప్పుడు సాష్టాంగముగ నమస్కరించిరి ॥శ్రీ

(2) చూచితి సీతను సాధ్వీమణిని సురుచిరగాత్రిని పరమ పవిత్రిని
రాచకుమారిని రమణీ తిలకము రామ రామా రామాయను నాదేవిని ॥శ్రీ

నవరసకన్నడ — ఆది.

ప॥ కంటిని నాకనులారగ కంబుకంఠిని కమలాక్షి నే ॥కం

అ॥ వింటిని రామ రామ రామయను వెలది పల్కులను వీనులలర రామ ॥కం

చ॥ ధర్మమే రూపముగ దాల్చినట్టి ధరణీ సుపుత్రిగ పరమ సాధ్విని
నిర్మలగాత్రిని నిరుపమానగుణ నిత్యమంగళ నవకోసలేశు రాణిగ ॥కం

హిం:-ఆమాటను విని రామలక్ష్మణులు హరిసుతుడును సంతోషము మీరగ
శ్రీమంతుని యావాయుతనూజుని ప్రేమించిరి బహుమాన దృష్టిచేత ॥శ్రీ

(2) వనచరులందరు రామచంద్రునకు ఘనుడు సౌమిత్రికి దినకరసుతునకు
వినయంబున నమస్కారముల్ చేసి వినుపించిరి యిటు జానకి విధము ॥శ్రీ

వ॥ రామా! రావణుని యంతఃపురమున రాక్షస స్త్రీలు బెదరించుచుండ దుఃఖా
క్రాంతయై నీయందుగల యనురాగంబున నిన్నే దలంచుచు సీతాదేవి క్షేమంబు
గా యున్నదనవిని రాముడు వానరులారా! సీతా వృత్తాంతంబంతయు నెఱిం
గింపుడనిన వనచరులందఱు నాంజనేయుని దెల్పుమనిరి. అంత నా మహాత్మ
జుడు జానకీదేవికి నమస్కారంబుచేసి రాముని గాంచి,

జోర:-నూరామడగల సముద్రము దాటితి జేరితి నావలిగట్టుగ
ధారుణిసుతను వెదకుచు నేను దక్షిణ దిక్కున బోవగ నందుగ ॥జ

(2) రావణు పట్నంబగు లంకను సీతాదేవిని జూచితి నేను
భావంబున నినుదలచుచు సాధ్వి బ్రతికియున్న దిటువినుము ॥జ

(3) పతివ్రతయగు నీధర్మపత్నియు పలుమరు దుఃఖించుచును
ధృతిజెడి రావణు నంతఃపురమున వెతల జెందుచున్నది మరియు ॥జ

(4) జడగట్టియు తలవెంట్రుకలన్నీ కడు దీనవదనమున నచటగ
పుడమిజ యున్నది నిన్నేతలచుచు భూరిశోకము తోడగ ॥జ

(5) నేల బరుండి యుండుటచే పెను ధూళినిండి దేహంబు
బాలచంద్రముఖి మలినాంబరమున భాసిలకున్నది జనకజయు ॥జ

(6) వినుమా రావణు నిర్బంధంబున విడువగ ప్రాణములెంచి
మనమున గుండెపు సమయంబున నే గనుగొంటిని కష్టంబున చింతించి ॥జ

(7) రామా యినవంశంబును దెలిపి రఘువీరా నినుబొగడి
భూమిజకిచ్చితి ముద్రిక నప్పుడు ప్రేమమీర ననుగాంచీ ॥జ

(8) సంతసించి మీకుశలం బడిగిన సర్వము దెలిపితి నపుడు
ఎంతయు ప్రీతిని చూడామణి నీకిచ్చెను గుర్తుగ నిదె కొనుమా ॥జ

వ॥ అని మరియును శ్రీరామా!

కల్యాణి – ఆది.

ప॥ పతివ్రతామణీ శ్రీజానకీ పరమపావనీ రామ ॥ప

అ॥ పతియే దైవంబని భావించుచు సదా
అతిభక్తిని రామా రామాయని ధ్యానించుచును ॥ప

చ॥ ధర్మపరిచారిణీ దేవీ దైత్య సంహారిణీ నిర్మలగుణ భూషణీ నిత్యకల్యాణీ ॥ప

(2) భవలయస్థితి కారణీ భవరోగ వినాశినీ
భువనమోహినీ సుందరీ నవకోసల మహారాణీ ॥ప

వ॥ రామా! నిద్రాహారంబులు వర్జించి కృశించిన శరీరంబుతో రాక్షసాంగనల మధ్య నిన్నే ధ్యానించు చుండు నా దేవి యొక్కమాసంబుకంటె నెక్కువ జీవింప జాలనని పల్కెను. అని మరియు చిత్రకూటంబున జరిగిన కాకాసురు వృత్తాంతంబును దెల్పుమనె. మరియు నిచ్చట జూచినది జూచినయటుల సుగ్రీవుడు వినుచుండ నీకెరుగింపుమనిరెను మరియు,

హిం: శ్రీమంతంబగు నీచూడామణి రామున కిమ్మని ప్రేమను నొసగెను
భూమీశ్వర యిది సముద్రంబునను బుట్టినమణి నీకు బంపితి గుర్తుగ ॥శ్రీ

(2) మణిశిలజాది బొట్టుగ శిలపై బెట్టుట మరియొక గుర్తుచెప్పుమని
వనచరులను గూడి వచ్చియు నన్ను గొనిపొమ్మనెను దనుజుల దుంచి ॥శ్రీ

వ॥ రామచంద్రప్రభూ! సీత యేమేమి చెప్పెనో యదియంతయు నీకుఁ జెప్పితి. ఇక సముద్రంబుదాటు నుపాయంబు ఆలోచింపవలయును అని హనుమంతుండు బలుక నంత శ్రీరామవిభుండు,

డోర:-చూడామణి తన రొమ్మునను౦చి చూచి చూచి దుఃఖించీ
జూడుము లక్ష్మణ యనుచు నిరువురు శోకంబున తపియించీ ॥జ

(2) మణిరత్నంబగు నీచూడామణి గనుగొనుమా సుగ్రీవా
వినుమా నాడు వివాహకాలమున జనకుడిచ్చె సీతకు మోదమున ॥జ

(3) జనకున కిచ్చెను యాగకాలమున మును వాసవుఁ డీమణియు
వననిధి బుట్టిన దిది పెద్దలచే నీమణి పూజితమగు మరియు ॥జ

(4) జనక మహీపతి దశరథ నృపతిని జానకిజూచిన రీతి
మణిఁజూచిన నామదిలో దోచెడు నినసుత మోదంబున వినుమీ ॥జ

వ॥ ఇవ్విధంబున బలికి హనుమంతునిగని జానకి యింకను నేమి చెప్పినది. దప్పి గొన్న వానికి జలంబు బోయునటులు నీవాక్యామృతంబున నాతాపంబు జల్లార్పుమని యామణిశ్రేష్ఠంబును చేతనిడికొని దానిం జూచుచు లక్ష్మణునిజూచి

శహాన — చాపు.

ప॥ మనజాలనిల జనకజన్విడచి అనుజా నేను ॥మ

అ॥ కనకాంగిని నాకనుల జూడకను క్షణమోర్వలేను వినుమా ॥మ

చ॥ సీత ధరించిన మణిని జూచితినా సీతను జూడనైతి నహా
ఏతీగున యారక్కసులమధ్య భీతిలియున్నదో నెరుగనైతి నహా ॥మ

(2) భూసుత చెంతకు గొనిపొమ్ము వేగమె పోవజాల నీశోకముమీర
భాసురమగు నవకోనల పురవాసిని పరమ కల్యాణిని జూడక ॥మ

వ॥ ఇట్లు దుఃఖించుచు హనుమంతా! సీత యేమిచెప్పినది? యథార్థముగా జెప్పుము దేవి మధురవాక్కుల విని రోగి యౌషధంబుచే జీవించి యుండునట్లు నేనుబ్రతికి యుండెద. అనవుడు హనుమంతుండు రామా చిత్రకూటములో జరిగిన కాకాసురు వృత్తాంతంబు జరిగినది జరుగినటుల జెప్పి నీకు జెప్పుమనెను స్వల్పదోషం బొనర్చిన కాకిపై బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన నది లోకంబులన్నియు దిరిగి రక్షించువారులేక మరలి నిన్ను శరణుజొచ్చిన కాపాడిన కృపానిధీ నన్నపహరించిన యీదనుజాధము నేలవధింపకున్నావు ?

డోర:- రామా దివ్యాస్త్రంబులచే నీ రాక్షసులను ఖండించి
ప్రేమనునన్ను గొనిపోవేల భూరివిక్రమ కృపయుంచి ॥జ

(2) రఘువంశోత్తమ రావణుజంప రావే మింత యుపేక్ష
అఘువిదూర నాపాపంబేమొ అమరవినుత జగద్రక్ష ॥జ

(3) నరవర నీయాజ్ఞను లక్ష్మణుడు నరగున నిటవచ్చియును
అరసియు ననురక్షింప డిదేమి కరుణవిడువదగునె యని మరియు ॥జ

అసావేరి — ఏక.

ప॥ రామా కృపజూడు లోకాభిరామా ॥రా

అ॥ రామా సౌందర్య జితకామా నీలాంబుదశ్యామ
రఘువంశాంబుధి సోమ సద్గుణధామ ॥రా

చ॥ ధీరా శ్రీరఘుకులవీరా కౌసల్య వరకుమారా రారావేగమె రణశూరా
రాక్షస మదసంహారా ఏరాశృంగారా సుకుమారా నన్నేలవేర ॥రా

(2) చాలనమ్మితి భక్తపాల యోగీంద్ర హృదయలోల మాయాగుణజాల
ఆనందఘనలీల జాగేల భూపాల నన్నేల కరుణాలవాల ॥రా

(3) కాంచి రావణునితలలు దుంచి రక్కసులబట్టి వధించి ననుగైకొని సంతసించి
సాకేతపురి ప్రవేశించి నవకోసల రాజ్యముపాలించి సర్వసౌఖ్యములనుకామించి

డోర:- కన్నులనీరుగార్చుచు మైథిలి కడుశోకంబున బలుక
విన్నపమిది యాలింపుమనుచు నే వేడియు బల్కితి నిటుల ॥జ

(2) శూరులు రాజకుమారు లిరువురుఁ జేరియు లంకాపురము
ఘోరరాక్షసుల రావణుజంపి ధరణితనయ నిను చేకొనియు ॥జ

(3) పోదు రయోధ్యకు సంతోషంబున పొగలకు మది నోజననీ
మోదముతో నొకగుర్తునొసంగుము ముదమొందగ నాథుఁడు మదిని ॥జ

(4) ఇటునే నడిగిన చీరకొంగు దా విప్పియు చూడామణిని
కుటిలకుంతల యిచ్చెను నాచే కూర్మిమీర నాజననీ ॥జ

(5) మణి చేకొని నేనతిమోదంబున జనకసుతకు మ్రొక్కియును
తనువుబెంచితిని మరలివచ్చుటకు ననుగని తరుణీమణియు ॥జ

(6) వనచరోత్తమా ధన్యుడవీవు ఘనులు రామలక్ష్మణుల
గనుగొను పుణ్యముగల్గెను నీకు అన నిట్లంటిని నే మరల ॥జ

(7) నామూపున గూర్చుండుము తల్లీ నమ్ముము నిన్నతివేగ౯
రామలక్ష్మణుల చెంతజేర్చెదను రమ్మా శీఘ్రింబనిన౯ ॥జ

(8) పరపురుషుని దాకుట నాకు హరివర ధర్మముగాదు
పరమదయాళో వేగమెపోయి యెరిగింపుము నాకష్టములు ॥జ

(9) ధరణీశుడు ననుదుఃఖసాగరము దాటునటులు చేయ౯
సరగున యత్నము చేయుమనుచును నెరిగింపుము రామునితోడ౯ ॥జ

వ॥ నాయనా! రామలక్ష్మణులకు సుగ్రీవాది వానరులకు నాకుశలంబు దెల్పుము. ఈ రాక్షసులు నన్ను బెదరించుటయు నాదుఃఖంబంతయు రామునకు విన్న వింపుము అని చెప్పినది యాతల్లి. రామచంద్రప్రభూ నేను చెప్పినసుద్దులు నాలోచించి సీతాదేవి క్షేమంబుగానున్నదని నమ్ముము.

తే॥ వనచరుల్ రామలక్ష్మణుల్ వార్ధి దాటి యెట్లువచ్చెదరిచటికి నెరుగజెప్పుము
యనగ నేనిట్లుజెప్పితి వినుమతల్లి ఘనులు నాకంటె నతిబలుల్ కపులుగాన.

హిం:- చెచ్చెర నాదు మూపుననెక్కి జొచ్చియు లంకను రామలక్ష్మణులు
చిచ్చుశరంబుల రావణుగూల్చి శీఘ్రింబున నినుచేకొను రాముడు ॥శ్రీ

(2) సంతసింపుము జానకిదేవీ చింతవిడువుము శీఘ్రమునీదు
చెంతకు శ్రీరఘురామ లక్ష్మణులు జేరవచ్చెదరు సత్యముగాను ॥శ్రీ

(3) చేరియు లంకను దూరియు కపులు సింహానాదముల్ జేయుచు రాక్షస
వీరులదుంచి విజయముగ్గైకొని ధీరులు రాముని జేరుదురమ్మ ॥శ్రీ

(4) నెరవేర్చియు వనవాసవ్రతమును సీతోగూడి యయోధ్యనుజేరి
ధరణీశుడు పట్టాభిషిక్తుడౌ తరుణమువచ్చెను శోకము మానుము ॥శ్రీ

తే॥ మరియు ప్రియకరమైనట్టి మాటలపుడు చెప్పి దుఃఖంబుమాన్పి నేశీఘ్రముగనను
సరసవచ్చితి మీపాదసన్నిధికి రామ జయరామ శ్రీరఘు రామచంద్ర.

తే॥ అబ్ధి లంఘించి జనకజ నరసి లంక భక్తితో ముద్రిక నొసంగి పవనసుతుఁడు
దనుజవీరుల దునుమాడి ధరణిజాత క్షేమ మెరిగించి మణినిచ్చె రామునకును

క॥ ఇందీవర దళనేత్రుని సుందరు శ్రీరామచంద్రు సుదతి నవనిజ౯
డెందమునఁ దలఁచి కూర్చితి సుందరకాండంబు నేను సుమతులుమెచ్చ౯

మంగళహారతి.

ప॥ శ్రీరామ చంద్రునకు జయమంగళము సదా సీతాసమేతునకు శుభమంగళము॥శ్రీ

చ॥ హనుమంతు డప్పుడు అంబుధిదాటియు జనకజగ్ గాంచి సంతోష స్వాంతుండై
ఇనకులపతి రాముగ్ ముద్రికనిచ్చియు ఘనమగు చూడామణిని గైకొనిన హనుమకు

(2) వనభంగ మొనరించి దనుజుల బరిమార్చి గనియు దశకంఠుని ధర్మబోధజేసి
ఘనుడు లంకగాల్చి గాంచి మైథిలిగ్ మరల వననిధిదాటి కపివరులజేరిన హరికి॥శ్రీ

(3) సీతక్షేమముదెల్ప శీఘ్రమె కపులువెడలి జేరియు శ్రీరామచంద్రుని సన్నిధి
భూత శరణ్యునకు భూపుత్రిగనిన విధము
ఖ్యాతిమీరగజెప్పి కడుభక్తి మ్రొక్కిన పావనికి ॥శ్రీ

ఉత్పలమాల:-శ్రీ మహిజాత క్రొమ్మెఱుగు చేతిశరాసన మింద్రచాప ము
ద్దామ గుణారవంబు స్తనితంబుగ భక్త జనార్తి సంఖ్య ర
స్తోమ మడంగ సాధులను స్తోకముల్ చెలగగ్ కృపాకటా
క్షామృతదృష్టి ధాత్రివలయంబును దనుపుచుఁ దేజరిల్లు ను
శ్యామల దివ్యమూర్తి రిపుసారస దుస్సహతేజమొందియుగ్
కోమలకాంతి నొప్పు నవకోసల పుష్కర భూషమైన
శ్రీరామ ఘనాఘనుండిల నిరంతరదాన జితామర
ద్రుమకా రామమ పుత్రి కామమపురంధ్రి మనశ్శుభసీమ నిచ్చలుగ్
కామిత సస్యసంపద లఖండముగాఁ బొదలించు గావుతగ్.

శ్లో॥ నమోస్తు రామాయ సలక్ష్మణాయ । నమోస్తుదేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మ భువేవరాయ । నమోస్తు వల్మీక భవాయ తస్మై.

గద్య.

ఇది శ్రీరామచంద్ర కరుణా కటాక్షవీక్షణ లబ్ధ కవిత్వ శౌనకసగోత్ర పవిత్ర
శ్రీరామపుత్రి విరచితము
నవకోసల రామాయణము హరికథ
సుందర కాండము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ
శ్రీ రామార్పణమస్తు.

శ్రీరస్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

# నవకోసల రామాయణము

# హరికథ

## యుద్ధ కాండము.

కం॥ శ్రీధర దామోదర హరి మాధవ గోవింద శౌరి మానుషవేషా
ఆదిపురుష పరాత్పర శ్రీదయితాచిత్తచోర శ్రీరఘువీరా॥

భైరవి - ఆది

ప॥ శ్రీకర కరుణాసముద్రం శ్రితచింతామణి రఘువీరం॥ శ్రీ

అ॥ సాకేత పురపాలిత దశరథ సుపుత్రం సాధుజన హృత్పద్మమిత్రం

చ॥ నిత్య నిర్మల నిరుపమ గుణాకరం నీరద శ్యామసుందరశరీరం
దైత్యకులహారం నరవరం ధరణిజమనోహారం ప్రియకరం
నవకోసలపురవర ధీరం కోదండధరం॥ శ్రీ

తే॥ ఆంజనేయుని పల్కుల కలరి మదిని ఘనుడు కోదండరాముం డిట్లనియె నపుడు
తెలిపె నున్నదియున్నట్లు తేటపడగ కపికులాగ్రణి శూరుండు ఘనుఁడితండు

హిం:- ఈ ఘనకార్యము దీర్చిన హనుమకున్ నీడుజోడును గలరే జగతిని
సాగరమును లంఘింపఁగ నితరులున్ జాలుదురే యీధీరుడుదక్కన్ ॥శ్రీ

(2) వినతాతనయుని పవనునిబోలు వేగము బలము గలవాఁ డీతడు
అనిమిషులకున్ యక్ష రాక్షసులకు జొర నలవిగాని లంకఁజొచ్చె నీ వీరుఁడు శ్రీ

(3) చొచ్చియు జానకిఁజూచియు నసురుల విచ్చలవిడి బరిమార్చి
వచ్చెను మన ప్రాణములనిలిపె నీ సచ్చరితున్ బొగడ సాధ్యంబగునే ॥శ్రీ

తే॥ వినుము ప్రియమిత్ర! రవిపుత్ర! ఘనుఁడు హనుమ
ప్రియమునొనరించె నుక్తాతిశయము మనకుఁ
బనుచుపనికన్న మిన్నగా నొనరఁజేయు
దూత యుత్తముడండ్రు బుధులు ధరిత్రి

(3) అని రవితనయుఁడు యు_క్తియు_క్తముగ ఆడినమాటలు వినుచు
హనుమంతుని గని యనె శ్రీరాముడు అనఘా దెల్పెద వినుము॥ జ

(4) కనులారగ దశకంఠుని పురము గంటివిగద హనుమంతా
ఘనద్వారంబులు దుర్గబలంబులు వినుపింపవె ధీమంతా॥ జ

(5) చేరి నాదు తపోబలముననో సేతుబంధనమునో
ఆరయ నస్త్రంబులనో యెటులో నీరధి దాటుద మిపుడే ॥జ

వ॥ రామవిభుం డిట్లడిగిన మారుతి లంకామహిమంబును దుర్గయంత్ర బలకోశ
సేనా విశేషంబు లెఱిఁగించి మఱియు నిట్లు చెప్పందొడంగె.

జోర॥ అతి బలశాలురు తూర్పు ద్వారమున అసురులు పదివేలుండ్రు
సతతము దక్షిణద్వారమునందు శస్త్రాస్త్రధరులు శూరులు గలరు ॥జ

(2) పడమటి దిక్కున శూలపాణులు బహుసేనలతో నుండెదరు
కడు శూరులు రక్కసు లసంఖ్యలును గల రుత్తరదిక్కునను ॥జ

(3) రథగజ తురగ పదాతి సంయుతులు రణధీరులు కులజులును
మదమత్తుండగు దశకంధరునకు మాన్యులు వీరందరును ॥జ

(4) జెఱిచితి వంశెనలెల్లను రామ విఱిచితి పాతికబలముగ
నఱుమాడితి నగడ్తలు బూడ్చితి నరయగ నసురుని పురముగ ॥జ

(5) వారిధి గట్టఁగఁగలిగితిమే నిఁక వానరవీరులచే నిపుడు
శ్రీరామా పాదనినమ్ముము లంకజేరగ బంపుము మరియు ॥జ

(6) అంగద నీల ఋక్షాధ్యక్షులు నదికులు మైందద్వివిదులును
పొంగుచు జలనిధిదాటి లంకకుఁబోయిన జాలును రావణుద్రింప ॥జ

(7) తోరణప్రాకారంబులు జెఱిచియు దుమ్మునఁగలిపియు లంకగ
జేరవచ్చెద రోకముహూర్తమున వారలబంపుమి యనగా ॥జ

(8) హనుమంతుని వాక్యంబులు రాముడు ఆలోచించియు వేగంబునను
దనుజేంద్రుని పురమిదె ధ్వంసము జేసెద నే తత్క్షణమే సత్యముగాను ॥జ

వ॥ అని సుగ్రీవుడు మున్నగువారికి దెల్పి సోత్సాహుండై,

హిం:-మంచిముహూర్తమిది గావునను మధ్యాహ్నకాలముగ కదలిన జయమగు
వంచనచే మైథిలిగ గొనిపోయిన వానినిదుృంచి వైదేహిని దెచ్చుటకుగ ॥శ్రీ॥

(2) నే వచ్చుటవిని నాప్రియురాలు జీవించును నామీాదిప్రేమమున
బోవుదమిప్పుడె ఉత్తరఫల్గుని గావున సేనల సిద్ధము జేయుము ॥శ్రీ॥

(3) కనబడుచున్నవి శుభశకునంబులు ఇనతనయా మేలుగల్గును మనకు
నొనరగ కుడికన్నదరెను నాకు గనుమా విజయము చేకురు సత్యము ॥శ్రీ॥

(4) జలసమృద్ధిచే ఫలమూలముల్ గల్గి సకల సుఖాస్పదమై రమ్యంబై
చెలగుచుండెడు మార్గంబునను సేనల నడిపింపు శీఘ్రంబునను ॥శ్రీ॥

(5) జలదుర్గంబుల కాననములను నిలచియుందురు రాక్షసవీరులు
తెలియగవలె వారల నరయుచు నందందుచెలగియు కపులు జాగ్రత్తగల్గియు॥ శ్రీ

(6) బలవిక్రమముల్ గల్గినవారిని బంపుము ఘోరయుద్ధము జేయగ
బలహీనులను బంపు కిష్కింధకు జలజాప్తసుత సత్వరముగను ॥శ్రీ॥

సీ॥ గజుడు గవాక్షుడు గవయుడు ఋషభుడు దక్షిణపార్శ్వంబు రక్షసేయ
గంధమానుడాది కపివీరులందరు దాపటిదిక్కును కాపుగాగ
వెనువెంట వాసరుల్ వేగ మెంబంపుము దినకరతనయ యరుదెంచువారు
సకల బలంబులు సంతోషమున బోగ హనుమంతు నెక్కి నే నరుగువాడ
సైన్యమధ్యంబునను నేను సైన్యనాథ యాంగదుని నెక్కి సౌమిత్రి యరుగునయ్య
సేన గాపాడుకొనుచు సుషేణు డనఘ జాంబవంతుడు వేగమె చనగవలయు॥

వ॥ రామచంద్రుండిట్లు వచింప ఋక్షవానర సైన్యంబు భూగగనంబులునిండి, సుగ్రీవునాజ్ఞచే వెడలిరంత సౌమిత్రి సుగ్రీవసమేతుండై సైన్యంబుతో శ్రీరామ విభుడు సంతోషంబున దక్షిణాభిముఖంబున నడచె. వారల వెంబడించి లక్షల కోట్ల బలవంతులగు వానరులు ముదితులై నడచుచు,

హిం:-గంతులువేయుచు నెగురుచు దుముకుచు వింతగ నవ్వుచు ఆడుచు పాడుచు
[illegible]ంతు[illegible]జేయుచు తరులనుయెక్కుచు సంతసమునను ఫలముల మెక్కుచు ॥శ్రీ॥

(2) ఎగురుచు రాళ్ళను పూ[illegible]త్తి[illegible] విరచుచు శాఖల వేడుకమీార
[illegible]గిరియుచు [illegible]కని పడద్రోయుచును పరువులెత్తుచు సరసములాడుచు ॥శ్రీ॥

(3) నేనేదుర్కొంచెద రావణుబట్టి నేనేదుర్కొంచెద రక్షోవీరుల
నేనే నేనే యనుచు నప్పుడు వానరులందరు వాదములాడ ॥శ్రీ॥

(4) జనునెడ కుముదుఁడు నీలుఁడు ఋషభుఁడు జనిరి మార్గము లరయఁగ ముందు
ఘనమగు శాఖామృగములు పదికోట్లు వెనుకొని శతవలిగొలువఁగ నప్పుడు ॥శ్రీ॥

వ॥ మహాశక్తియుక్తుండు జాంబవంతుడు లక్షవానరులు తన్నుగొలువ సుషేణుని తో సైన్యంబును రక్షించుచు ముందునడచె నప్పుడు.

తే॥ జలధి ఘోషంబుమించి తాఁజెలఁగ రవము జనపదంబులు వనములు గనుచునంత
రామచంద్రుని వెంబడి రభసమెసఁగ నడచె వానరసైన్యముల్ వడిగ నపుడు.

వ॥ లక్ష్మణుడు శ్రీరామవిభునిగాంచి, అన్నా మనకు కార్యసిద్ధియు, రాక్షస నాశము దప్పకగల్గును. శుభశకునంబులు అనేకంబులు దోచెడు.

జోర:- అనుకూలంబుగ వాయువు వీచెడు మనసైన్యంబులమీద
మనమలరఁగ మృగపక్షి రవంబులు వినబడుచున్నవి యిచట ॥జ

(2) దినకరుడును నిర్మలుడై వెలిగెడు దిక్కులు చక్కగ నిపుడు
ఘనుడు త్రిశంకుడు మనకులజుడు దివి కడువెలుగొందెడు వాడు ॥జ

(3) వలగొని ధ్రువుని మహర్షివరులు వచ్చెదరిదె శ్రీరామా
చెలగుచు మనకుల తారవిశాఖయు నలరుచున్నది గనుమా ॥జ

(4) వనములు పుష్పసౌరభయుతమైఁ దనరెడు ఫలములతోడ
ఘనమగు నిర్మల జలములుగల్గియు కమలాకర మొప్పె నిదెచూడ ॥జ

(5) ఈ శుభశకునంబులు జూడఁగ విజయముగల్గును మనకు
భాసురాంగి ధరణిజ సుఖయించును పగతురకును నపజయము ॥జ

(6) అనుజుడు శుభశకునంబులు దెల్పఁగ అతిముదమున రఘువరుడు
వనచరసేనను నడిపించెను దా దినకరసుతునితో నపుడు ॥జ

(7) మేఘముగప్పిన మిన్నురీతి సైన్యౌఘము దివిభువినిండి
బాగుమీర వేవేగమె నడవఁగ పరాగము రేగెను నలుదిక్కులను ॥జ

(8) వాయువేగమున గర్జించుచు బోవుచు వానరులత్యార్భాటమును
జేయుచు గంతులువైచుచు మరియు జే జే శ్రీరామునకనుచు ॥జ

మ॥ కాలమేఘము రీతిబెట్టుగ గర్జలెసఁగఁగ వానరుల్
వాలముల పైకెత్తి విసరుచు బర్వతంబుల నెక్కుచున్
గూలద్రోయుచు వృక్షపంక్తుల గొండకాల్వల దాఁటుచున్
వేలమించిన వార్ధికై వడి వేగమడరఁగ నేగుచున్
నీరుద్రావుచు వాదులాడుచు నీటిలోబడియాడుచున్
సారె యొకళ్లు లొకళ్లపైఁ దగ జల్లుకొంచు జలంబులన్
భూరుహంబుల నెక్కి కూల్చుచు పుట్టతేనియలానుచున్
దారి తెన్నన కేగి రా కపితల్లజుల్ వడి నెల్లడన్॥

తే॥ మలయమారుత మొలయ నమందగతిని వలుతెరంగుల ప్లవగులు చెలగి యవని
నంత నింతట నెల్లడ నావరించి సహ్యమలయాద్రి తటులకుఁ జనిరి వేగ॥

వ॥ అంత,

జోర॥ శ్రీరాముడు దామహేంద్రపర్వత శిఖరముపై నిలిచియును
నీరధిజూచి సుగ్రీవునితో ధారుణిపతి యిట్లనెను ॥జ

(2) అలల నెనంగుచు చెలగుచున్నయీ జలనిధి దాటగ మనము
బలుకు ముపాయము నిలుపు సైన్య మన భానుజుడటు జేయగను ॥జ

(3) వనచరవీరుల కోలాహలమును వననిధిఘోషముచేరి
ఘనమగు ధ్వనిచే దిక్కులన్నియును కలతజెందెను మరిసీ ॥న

(4) కనఘోరములగు తిమింగిలంబులు శాకోదరములు తిములు
ఘనమగు మకర మత్స్యకూర్మములు కర్కాటములు చెలగంగా ॥జ

(5) ఆకాశంబున కెగయుచునుండెడు అలలమొత్తముల నపుడు
ఆకాశంబిది సాగరమిది యని అరయ దరముగా నిదియు ॥జ

(6) దివ్యరత్న సంకులమై యగాధమై తేజరిల్లునదియు
సేవ్యంబయ్యె నది వితతులకు (శకరమగు సముద్రము గనియు ॥జ

(7) పొరలి పొరలివచ్చెడు అలలను భూరినాదము చెలగన్
సురద్రావిన నరుపోలిక జలనిధి నురుగులతో చెలువమరన్ ॥జ

(8) అగచరులను దా నుత్తరతీరమునందు నిలిపె నీలుండు
రఘువీరుండట మైథిలిదలచి రయమున తమ్మునిగనియు ॥జ

యదుకులకాంభోజి — చాపు.

ప॥ ఏరీతితాళుదు నిమ్మహిలోన నిందుముఖి సీతలేక

అ॥ నారీమణిని శృంగారిని యిపుడుజేరి కౌగిట జేర్చి కూరిమిజూపక ॥నే

చ॥ దశరథుకొడనై ధర్మాత్ముడౌ జనక వసుధీశు సత్పుత్రి
అసమానబలుడ నాకత్యంత ప్రియురాలై అసురులచేజిక్కి అతిదుఃఖమునసుండ॥ఏ

(2) కలికిసుందరగాత్రీ కంబుకంధరి నిత్యకల్యాణియౌ జానకి
నలికులవేణి నంబుజపాణి నే చెలగి నవకోసలముజేరి సుఖించక ॥ఏ

జో॥ రావణుచేతను జిక్కియు సతి శ్రీరామా రామా యనుచు
జీవితేశయని యార్తినేడ్చెడు దేవినిదలచిన నాకు ॥జ

(2) వేదనచే గ్రాగెడు నామది విషముద్రావినయట్లు
మోదంబున నీసాగరమునబడి ముద్దియ చెంతకుబోదు ॥జ

(3) ఎన్నడు జూతునో ధరణీసుత నాకన్నుల కఱవుదీర
ఎన్నడు రావణు బంధుయుతంబుగ నిలగూల్తునో ఖేదముదీర ॥జ

(4) రావణు నింటను మనుచున్నది యని పావనిదెల్పుటవలనఁ
జీవముతో నున్నాడను తమ్ముడ యీవనుమతి నేననఘా ॥జ

(5) మారుత నీవతివేగమెపోయి ధారుణిసుతను స్పృశించి
జేరవచ్చి నను దాకుము కొంత యూరటగల్గును మదికి ॥జ

(6) అని రాముడు దుఃఖించుచుండుతఱి దినకరుండు గ్రుంకుటయు
అనునయసూక్తిని దేర్ప లక్ష్మణుడు అననిజ నిడుకొనె మదినపుడు ॥జ

తే॥ అచట రావణు డాత్మలో నధికభీతి ననిల తనయుండొనర్చిన యట్టివిధము
దలచి కడుసిగ్గుచేబడి తలలువాంచి యసురవీరులతో నిట్టులనియె తగను॥

హిందూస్థానితోడి — ఏక.

ప॥ వననిధిదాటె జనిమె వేగమె వనచరుడొకడు ॥వ

అ॥ ఘనుడౌ రాముని దలచి ముదమున జనకమహీపతిసుతగని జయమునుచేకొని ॥వ

చ॥ మనలంకాపురమును జొచ్చి వనభంగము గావించి ఘనసౌధముల్ బడగూల్చి
దనుజుల బరిమార్చి ననుసరకుగొనక మించి లంకనంతయును గాల్చి ॥వ

(2) ఏమిజేయువాఁడ రాము నెట్లు దున్నించువాఁడ భూమిని మీకు నాకును
మేలుగూడునటులు మీ మతమెఱిఁగింపుడు జయప్రదముగనుడు వ॥

(3) ధైర్యోత్సాహము గల కపివరులతోఁడి శౌర్యంబున నవకోనలరాముడీ
లంకముట్టడించు వినుడీ కార్యంబున నాతని దునుమగ యాలోచన దెల్పుడీ ॥వ

వ॥ ఇట్లుపల్కుచున్న రావణునిగని ప్రహస్తు డాదిగాఁగల మంత్రులును పుత్రులు
హితులు ప్రతాంబుమించి రాక్షసరాజేంద్రా! దేవదానవుల జయించిన మహా
ప్రతాపశాలివైన నీకేల యీచింత! నిమిషమాత్రంబున రామ లక్ష్మణ సుగ్రీవ
హనుమదాది వీరుల బరిమార్చి రాగలవారము.

ఘోర:-నేనొక్కఁడనే చాలుదు వారల నిర్మూలముచేయుటకు
నేనొక్కఁడచాలుదు చాలుదునని నెనరునబల్కఁగ నపుడు ॥జ

(2) ఘనుడు విభీషణు డారాక్షసులను గనిబల్కెను న్యాయముగ
దనుజులార మీచేతనౌనొకో ఘనుడా రాముని గెలువగ ॥జ

(3) పరదారను హరియించుట వలనను పాపము నపకీర్తియును
అరయుము సౌఖ్యం బాయువు నర్థము హానిజెందు మదిగనుము ॥జ

(4) జానకికొరకై మనకీకలహము జనియించెను దనుజేంద్రా
జానకిఁబోవిడచిన నెల్లరకును సౌఖ్యముగల్గెడు నసురేంద్రా ॥జ

శహాన — చాపు.

ప॥ విన్నపమాలింపు వేడెద కేల్మోగిచి అన్నా రాక్షసరాజా ॥వి

అ॥ ఎన్నగ సజ్జనహితము సత్కీర్తి.తన్మో కన్యా రామున కిమ్మో కడుమేలుమనకిది ॥వి

చ॥ ధీరుడు సద్ధర్మాచారుడు జితరణశూరుం డరివీరునితో
చేరినిష్కారణ వైరమిదేటికి శ్రీరామచంద్రునకు సీతనర్పింపుము ॥వి

(2) చారుమణిహర్మ్యస్థలి హయ వారణయుత శ్రీరమ్యమౌ లంకగ
ధారుణిపతిచే దగ్ధముగాకమున్నె శ్రీరామవిభునకు సీత నొసంగుము ॥వి

(3) ఘోరముగ మనపురము జేరి వనముల్ నీఱుజేయకమున్నే
కూరిమితో నవకోసలనాథుడు శ్రీరామభద్రునకు సీతనిమ్ము ప్రీతి ॥వి

వ॥ ఇవ్విధంబున బల్కిన తమ్మునివాక్యంబులకు మారువలుకక రావణుండు రాజసంబున నిజసదనంబు ప్రవేశించె మరునాడుదయంబున పరిశుద్ధమానసుండై విభీషణు డన్నయున్న యున్నత ప్రాసాదంబునకేగి యగ్రజునకు సవినయంబుగ నమస్కృతు లర్పించి యాతనికనుసన్న రజతాసనంబున నాసీనుండై దేశకాలజ్ఞులైన మంత్రులయెదుట హితసూక్తుల ననురేంద్రున కిట్లనియె.

జోర:-అన్నా జానకి మన యీపురిలో నడుగిడినది మొదలుగ వినుమా
యెన్నరాని దుశ్శకునము లెంతయు హెచ్చుచున్న విటుకనుమా ॥జ

తే॥ వేదపారంబు సాగెడు వేశ్మములను నగ్నిహోత్రమ్ము లలరు నిశాంతములను
వంట యిండ్లను జక్కనౌ పడకటిండ్ల దిరుగుచున్నవి పాములు తెగువమీఱ.

క॥ గోవులు మేతలు మేయవు భావింపగ మదములుడిగె భద్రగజంబుల్
ధీవర కాకులు గ్రద్దలు కావరమున గ్రాలుమనయగారమ్ములపై.

వ॥ అన్నా యిట్టి యపశకునంబు లెన్నియో గల్గుచున్నవి. నీ మంత్రులు నీకీవిధంబు దెలుపరైరి. నేను విన్నదియు గన్నదియుఁ జెప్పినాడ. దీనికి బ్రతిక్రియ యొండు గలదు. దానఁ గీడు దొలంగి మేలుగల్గు నిపుడు నామాట వినుము.

హిం॥ రామచంద్రునకు జానకినొసగి రక్షింపుము మనరాక్షస కులముగ
నీమది సమ్మతమేని యిప్పుడే నేర్పుతో న్యాయాన్యాయము చెప్పెన ॥శ్రీ

(2) హితము మహార్థ హేతుయుతంబును అతి ధర్మంబగు తమ్మునిమాట
శ్రుతిజొరనిచ్చి క్రోధము హెచ్చి మతిహీనుండై రావణు డిట్లనె ॥శ్రీ

(3) ఏమివచ్చెర యింతభయమునీకు రాముండెటు జానకిని జేరదెల్పు
ధీమసమున నాయెదుట నిల్చునే రామచంద్రుడు రణరంగంబున ॥శ్రీ

వ॥ కావరమున దశవదనుండు ఇట్లుపచించి హితవాదియు పాపరహితుండగు వాని విడచి యావలంజని ఆలోచనజేయవలసిన యుద్ధకాలంబు సమీపించెగావున హితబాంధవ సచివులతో యోచింపవలయునని దలంచి

జోర:- రథమునెక్కి అతివైభవమున నారావణుండు వేగ
ముదమున కొలువుకూటము జేరెను మొక్కుచు దనుజులు పొగడ ॥జ

(2) అంతట దూతల బిలిచి రావణుడు అతివేగంబున మీరూ
సంతసమునజని సర్వరాక్షసుల సభకుదోడుకొని రండు ॥జ

(3) అనవిని దూతలు జని వేగంబున దనుజులనెల్లర బిలువ
ఘనముగ వాహనములనెక్కియు కొందరు కాల్నడవచ్చిరి వేగ ॥జ

(4) అందఱు రాక్షసరాజు పదములకు వందనమ్ములుజేసి
పొందుగ పూజితులై కూర్చుండిరి బృందారక రిపుశాసనమున మరిని ॥జ

(5) పండితులును సర్వజ్ఞులు సభను నిండియుండి రెల్లరును
దండిరక్కసులు యోధులు మంత్రులు దశముఖుఁ గనుచుండి రయ్యెడను ॥జ

(6) వరగుణశాలి విభీషణుండట వచ్చియు నన్నకు మ్రొక్కగను
మరియు ప్రహస్తుడు శుకుడును మ్రొక్కిరి మనమున ముదమొదవగను ॥జ

ద్విపద:-కలయంగ సభనెల్ల గనియు రావణుడు, చెలగి ప్రహస్తుని జేరి యిట్లనియె
పరులెవ్వరిచటికి జొరకుండునట్లు, వెరవుతో కాపుంచు వేవేగ నిచట
అనవిని మంత్రి ప్రహస్తుఁడునట్లు, కావించి తెలిపె రాక్షసపతికంత
రావణుండిటుపల్కె రక్కసులలర, వినరయ్య సభ్యులు విశదంబుగాను
మనమెల్ల నేర్పుతో మసలంగవలయు, ఏ కార్యమునుగాని యెప్పుడుగాని
మీకు దెల్పక నేనుమించిచేయనుగా, సుఖమొదుఃఖమొమఱియశుభమొశుభమ్మొ
సఖులార యరయుఁడీ సద్బుద్ధితోడ, రాముని ప్రియపత్ని రాజీవనేత్రి
ప్రేమించి తెచ్చితి విపినంబునుండి, ఆరాముఁ గనుగొన్న యానాఁటినుండి
మారుని కగ్గమై మతిసెడియుంటి, కనులఁజూడదు నన్ను కమలాయతాక్షి
వినదు నామాటలు విసుగొంది మదిని, పడతుక భర్త తప్పకవచ్చు నంచు
నడియాస నొకయేఁడు గడువునుగోరె, ఇచ్చితి పుచ్చిక నింతి కాగడువు
చెచ్చెర పదినెలల్ చెల్లెనునందు, వానరుడొక్కడు వచ్చిదా లంక
బూని ధ్వంసముజేసి పోయెనుగాదె, జానకిపోబడి చక్కగ నెరిగి
వానరులనుగూడి వార్ధితీరమున, చేరియున్నాఁడట శ్రీరాముఁడిపుడు
ఏమిచేయుదమింక నేది కార్యంబు, యీ మహాభయమింక నెట్లు దొలంగు
భూమిజనేనియ్య రామచంద్రునకు, రాము గూల్చుట యెట్లు రణరంగమందు
యెరుగింపు డొకయుక్తి యెదనెంచి మీరు, సురలగెల్చుట మీదు కరుణనుగాదె
రాలేరు వానరులు నీరధిఁ దాటి, జేరవచ్చునయిట శ్రీరాముడొకడు
గావున విజయమ్ము గల్గు నటంచు, రావణుండనియెను రక్కసులలర.

వ॥ ఇట్లు కామపరవశుండై పల్కు రావణునిమాటలు విని కుంభకర్ణుండు కోపతామ్రాక్షుండై రావణునిగని యోమహారాజా రామలక్ష్మణులచే రక్షింపబడు సీత నపహరించునపు డెవ్వరినడిగితివి అప్పుడైన మంచియుక్తి చెప్పియుందుము గదా అటుగాక! నిప్పుడు చింతించిన ఫలమేమి, యెవ్వడైనను న్యాయపద్ధతి యోచించి కార్యంబులాచరించిన దుఃఖంబునొందడు. కార్యము జెడినవెనుక యోచించువాడు విపరీతాలోచనచే నశించు.

జోర:-ఆలోచింపక దుష్కార్యంబు ఆచరించితివి యిపుడు
చాలయదృష్టము రాముడచట నినుజంపక విడచుట యపుడు ॥జ

(2) విష మిశ్రాన్నము జీర్ణంబగునే వినుమింక జేయునదేమి
వసుమతినుతయను విషమునుగొంటివి యసువులు విడుతుము మనమంత ॥జ

(3) సీతోబుట్టిన వాడనగుట నే నిలువక తప్పదు నీతోడ
భీతివలదు శ్రీరామ లక్ష్మణుల కోతులగూల్చెద రణరంగమున ॥జ

(4) యుద్ధమ్మున యమపురిజేరగ మనము యుప్పొంగుచు శ్రీరఘువరుడు
వద్దిక సీతారత్నముబొందును వైభవంబుతో నిందు ॥జ

వ॥ కుంభకర్ణుం డిట్లుబల్క కుద్ధుండైయున్న రావణునిగని మహాపార్శ్వుండు అతడు శాంతించుటకు నదుపాయ మాలోచించి యంజలి గీలించి.

తే॥ ఎల్లలోకములకు నీవె ఈశ్వరుడవు జనకజగూడి సుఖయింపు శాశ్వతముగ
నీదుపల్కులు వినదేని నిర్జరారి కుక్కుటమురీతి జరియించు కోర్కిదీర

వ॥ దేవా నీవాంఛితంబు నెరవేరిన యుత్తరక్షణమున భయంబుగల్గించు వజ్రాయుధంబు ధరించివచ్చినను ఇంద్రాదియు కుంభకర్ణుం డాదిగాగల మేమందరము వానింజంపెదము ఇక మానవులైన రామ లక్ష్మణులన నెంత యనిన రావణుడు వానిమాటలకు మెచ్చుచు చింతగదుర నిట్లనియె మహాపార్శ్వా విను పుంజకస్థలియను సతి గగనంబున బోవుచు ననుజూచి జంకుచు నెడముగ జనుచుండ బలవంతంబున దానిబట్టిన యాకోమలాంగి నలువ సభంజేర విరించియు దాని వృత్తాంతంబెరింగి కోపంబున నాకు.

జోర॥ ఇది మొదలుగ రావణ నిన్నొల్లని సుదతీమణిని దాకినను
పది తలలును యిల నూరువ్రయ్యలై బడునని శాపంబిడెను ॥జ

(2) ఆ శాపభయంబున సీతను నే నాసగొనక యున్నాను
భానురాంగిని బలవంతంబుగ నాప్రక్కన జేర్పనె జంకకను ||జ

(3) శైలగుహను నిదురించెడు సింహము నరసకు వచ్చినయటుల
వాలాయము నన్నెదురించుటకు వచ్చెను రాముండిటుజేరా ||జ

(4) ఇందువచ్చి శ్రీరాముడు నాదు యెదుట నిల్వలేడు
ఇంద్రాది దిక్పతులుతోడై వచ్చిన నన్నెదిరిచి గెల్వగలేరు ||జ

వ|| అని పలుకు దశకంఠుని దుర్వాక్యంబులు కుంభకర్ణుని ప్రగల్భములు విని విభీష
ణుండు అసురేంద్రుని జూచి

హిం|| భూరి బలాఢ్యులు కోరల నఖముల వైరులబట్టి జీల్చివేయుదురు
శూరులు వానరవీరు లిచటికి జేరకమున్నే సీతన్ రామునకిమ్ము ||శ్రీ

(2) కుంభకర్ణుడు అతికాయుండు క్రూరులు మహాపార్శ్వ మహోదరులు
కుంభనికుంభులు నీవైననుగాని గూల్చలేరు శ్రీరాముని రణమున ||శ్రీ

(3) భానుడు మున్నగు అష్టదిక్పాలురు బ్రహ్మరుద్రులు అనిలోగాచినన్
భానుకులాగ్రణి ప్రహస్తానిన్ను ప్రాణంబులతో విడువ డెరుగుమన ||శ్రీ

కం|| వినియు ప్రహస్తుం డిట్లను అనిమిష గంధర్వయక్షులైననుగానీ
నను గెల్వగలరెయనిలో మనుజాధములెంత రిత్తమాట లివేలా||

వ|| అని పలుక విభీషణుండు ప్రహస్తా నీవును మహాపార్శ్వుండును కుంభకర్ణుండును
జేయు యోచన అధర్మపరులగువారికి స్వర్గంబు లేనట్లు శ్రీరామునిపట్ల మన
నేర్పులు నేమియు జేయజాలవు రామాశ్రయము లేనిదే శ్రీరాముని జేరలేము
నావను విడనాడి సముద్రంబున దూకినవారమగుదుము. మన మెవ్వరముగాని
యతని జెనకంజాలము. ప్రహస్తా ఏల యీప్రగల్భములు రాముని బాణ
పరంపరలు నీ శరీరంబు నాటునప్పు డెరుంగుదువు. చాలుచాలు నూరకుండుము.

హిందూస్తాని—భైరవి—ఏక.

ప|| హితులారా సద్వ్రతులార మీరైనను హితమెరిగింపుడి నృపునకు ||హి

అ|| అతిశోకంబున రామమూర్తికి అవనిజ నిమ్మని బోధించుడి దయ ||అ

చ|| శిరములు వేయిగల్గిన పాము పరికింపగ భయదాకృతితోడ
అరయుడి విభునిజుట్టియున్నది ఆపదదొలగించి బ్రోవుడీ ||పా

(2) నవకోసలపతి కోదండంబున అవనినిబడి చావకుమున్న
అవివేకముమానియు వేగ అసురేశ్వరుఁ గావరెమరి ॥పా

జోర:-ఆ విభీషణుని పల్కులువిని యారావణుగని యిందాిరి
భావింపుము నీసోదరు పిరికి పందతనము వింటివె మరినీ ॥జ

(2) మనకులంబునకు అర్హాముగాని మాటలాడెడు నితడు
జనకా మనకపయశము దెచ్చె నీశక్తి విహీనుం డిపుడు ॥జ

(3) శౌర్యధైర్యములు సత్యము తేజము సాహసంబు విక్రమముఁ
స్థైర్యము బలమును వీర్యములేని తమ్మునిమాటలు వినుము ॥జ

తే॥ నాకు సరివారలెవరు ముల్లోకములను ఇందుిడాదిగ సకల లోకేశ్వరులను
జెరలనుంపనె దరుమనె యెరుగుదీవు హీనబల విక్రములు మర్త్యులెంతనాకు.

వ॥ మహాబలుండగు నింద్రజిత్తు ఇట్లుపల్క మరల విభీషణుండు నానితో నిట్లనియె.

హిం:-బాలుడవీవు గావుననిట్లు బలికెద వెరుగవు న్యాయాన్యాయము
చాలగలేనిపోని వాక్యములు ప్రేలిననేమి ఫలముగల్గును ॥శ్రీ

(2) తీర్పులుదిద్దెద వెరిగినట్టుల తెలియవు రాముని బలశౌర్యంబులు
దురితచిత్తుడవు పిల్లతనంబున దుర్మదాంధనీ వధనెఱుంగవు ॥శ్రీ

(3) రాముని బాణానలజ్వాలల రక్షోవీరులతో నీపురము
ఈ మహినిలువదు దగ్ధంబగు నావిన్నపమాలింపుము దనుజాధీశ్వర ॥శ్రీ

(4)ధనముఁ రత్నముల్ కానుకగాగొని ధరణిజతో శ్రీరామచంద్రునకు
మనమలరగ సమర్పింపుము నీవు గనుమా సౌఖ్యము సుతులతో హితులతో ॥శ్రీ

వ॥ ఇట్లు హితంబుబల్క విభీషణునిజూచి కోపంబుదీపింప కాలచోదితుండై రావ
ణుండు పరుషవాక్యంబుల.

క॥ కూరిమిగల వారివలెఁ గ్రూరులు దాయాదులుంద్రు కొందరు ధరణిఁ
వారల నమ్మగదగునే ఏరా దాయాదివిధము యెఱిగితి నిపుడుఁ.

జంఝూటి — ఆది.

ప॥ ఛీ ఛీ పోరా జ్ఞాతి గుణంబులు చివరకు జూపితివోర ॥ఛీ

అ॥ చూచిచూచి సమయమువేచి చూపోర్వకను క్రౌర్యము జేతురు ॥ఛీ

చ॥ కలసిమెలసియు నున్నటులుండీ చెలగిచిచ్చుబెట్టి జెరుపగోరుదురు ॥ఛీ

(2) కనలిన ఫణితోను తనపగతునితోను
మనియుండవచ్చు మనరాదు రిపుసేవకునితో ॥ఛీ

(3) వినరా పద్మవనమున ఇభములు మునుదాయకృతమును వినువించె నిటుల ॥ఛీ

(4) భయములేదు మాకు పటుశస్త్రాస్త్రములను భయముగల్గు దాయాదులవలనను ఛీ

(5) నవకోసలపురనాథుని పక్షపాతి అవురా నినుజూడ అన్యాయముగాదుపోరా ॥ఛీ-ఛీ

డోర॥ గోవిప్రులు నారీదాయలకును నైజగుణములు విశ్రుతములును
భావింపగ భాగ్యము దమమును చిత్తచాపల్యము నెడరుసేతలుగ విసుము ॥జ

(2) ఈ పాటిని నీవాడిన యటులను ఇతరులు నన్ననియున్నగ
బాపాత్ముడ తృటిలో బడదోత్తు శిరము నిల బలుకకు నాయెదుటన్నగ ॥జ

(3) అని తను పరుషములాడు నన్నగని ఘనుడు విభీషణు డంతగ
తనమంత్రులు నల్వురతో గగనంబున తత్క్షణమెగిరి నిలిచె నల్లంతగ ॥జ

(4) అన్నవుగావున రాజైనను మరి యాడితి హితసూక్తులను
మన్నన గైకొనకున్నవాడవు మదిజెడి మత్తుడవైయున్నావు ॥జ

భైరవి — ఆది.

ప॥ రావణా నీ చెంతనుండరాదు బోయెద నే ॥రా

అ॥ కావరమున నీవేమెరుగవు కాలచోదితుడవై ॥గా

చ॥ హితకాముడనై నీ హితముదెల్పితిని
మతికెక్కదు కర్మము మరలదు మన్మథ పరవశుడ వౌటను ॥రా

(2) శ్రీరామునిచేతి శరాసనానల దీప్తిచేత
శూరా నిను గూల్పగనే జూడనొల్ల నీపాటు ॥రా

(3) అంతకుని పాశమునజిక్కి యఖిల రాక్షసులపుడు
చింతించిన ఫలమేమి జేరెద నవకోసల రామునన్నిధి ॥రా

డోర:-పలువిధముల పరుషంబులు బల్కియు ఖలుని రావణుని విడచి
చెలగి మంత్రులతో వచ్చెనువేగ శ్రీజానకిపతి సన్నిధికి ॥రా

(2) మేరుపర్వత శిఖరాకారుల్ ధీరుల్ సుగుణాధారుల్
శూరుల్ గగనవిహారుల్ కపులుజూచిరి రాక్షసవీరుల్ ॥జ

(3) ఇనసుతు డాతనిగని యోచించి హనుమంతు ప్రముఖులగనియు
గనుడీ రక్కసు నల్వురతోడ జనుదెంచె మనలదుంచుటకు ॥జ

(4) భానుజుమాటలు వీనులుసోకగ వానరవీరులు వేగ
ఆనతిమ్ము యీ యసురుల నిప్పుడె హతముజేసెదము యనగ ॥జ

(5) అనుచును వనచరులందరు యిట్లు అన్యోన్యము భాషింపగను
విని విభీషణుడు మింటనిలిచి యిట్లనియె భానుజుని గనియు ॥జ

హిందోళ—ఆది

ప॥ రాక్షసవీరుడను రావణు తమ్ముడనే ॥రా

అ॥ వీక్షింపుము నను విభీషణు డందురు
అక్షీణకృపాకటాక్షమున రక్షింపవలె శ్రీరఘువీరుడు ॥రా

చ॥ ధరణిజల్ దెచ్చియు దండకాలవినుండి చెరయుంచినాడు శ్రీరాముని దేవిల్
పరమద్రోహిగ్నైన పాపి రావణు డెరుగడు రాముని బాణపరంపరల్
సరగున నన్నవమానించెను విను సత్యము సత్యము రాముని నన్మితి ॥రా

(2) ధరణిని జీవింప దలచితినేని శరణని శ్రీరాముని వేడి
ధరణిజనిమ్ము తప్పు క్షమించుమనన పరుషములాడియు బంటువలెనను
తరలిపోతిమన భక్తశరణ్యుని ధర నవనీతల పురవరు జేరితి ॥రా

సింహేంద్రమధ్యం—ఆది

ప॥ శరణుజొచ్చినాడల్ సర్వశరణ్యుని ॥శ

అ॥ ఎఱుకపరపుడో కపులార ॥శ

చ॥ నీలోత్పల ఘనశ్యాముని చరణముల్ నిరతముసేవింప దలచియు నే
ఆలుబిడ్డల విడచియువచ్చితి ఆదిపురుషు డనియును ॥శ్రీ

(2) శరణాగత రక్షణమను బిరుదముదాల్చిన శ్రీరాముని
వరనవనీతల పురవరదుని సరసజేరితి నభయమొసగ ॥శ్రీ

జోర:-ఇనతనయుం డామాటలువినియు వేగమె రామునిగనియు
వినువీధిని రాక్షసవరుడొకడు విపులంబుగ నినుజేరో్కనియు ॥జ

(2) వినుమా దేవ విభీషణుండట అనుజుండట రావణునకును
నిను శరణనివేడ వచ్చినవాడట తనమంత్రులుగొల్వగ నిటకు ॥జ

(3) కామరూపులు శూరులు కనులకు గానరాక దిరిగెదరు
రామచంద్ర యోచించుము మదిలో రాక్షసులను నమ్ముటతగదు ॥జ

(4) మనలోనుండి సమయమెఱింగి మనల జంపదలచి
దనుజుడు వచ్చెనో రావణుబంపగ అనుమానముగల్గెడు మదిని ॥జ

(5) క్రూరుండైన యారావణుని కూరిమితమ్ముడు గాన౯
శ్రీరామా యీదనుజుని జంపుట శ్రేయమువినుమతి వేగ౯ ॥జ

వ॥ సుగ్రీవుం డిట్లుబలుక అంగద హనుమదాది అగచరులగని రఘువీరుం డిట్లనియె.

తే॥ ఈ విభీషణు నెడ మన యినసుతుండు పల్కుపల్కులు వింటిరో ప్లవగులార
దెల్పుడీ మీదు భావముల్ తెల్లముగను అనిన రామునిగని కపుల్ వినయమునను

హిం:-రామా నీకు తెలియని దెద్దియు యీ మహీత్రియ మెందునులేదు
భూమీశా ప్రశ్న జేసితివిటు మామీదగల గౌరవమునను ॥శ్రీ

(2) మతిసంపన్నులు కపులందరు నిపుణుల్ హితులునుగావున వేరువేరు వారి
మతములుదెల్పుట మేలన నప్పుడు చతురుడు అంగదుడు జెప్పె నిటువలె౯ ॥శ్రీ

(3) ఈ విభీషణుడు రావణుతమ్ముడు గావున నీతడు అనుమాన పాత్రుడు
దేవా వీనిని నమ్మదగదిపుడు భావంబున దలపోయుము రామా ॥శ్రీ

(4) ఈతని నిపుడిందు కార్యములందిడి యెఱిగియు వీని గుణదోషంబులు
నీతిపరుడేని గైకొనదగును దుర్నీతుండైన విడువగవలయును ॥శ్రీ

(5) అనవుడు జాంబవంతుడిట్లనె మనవి యొనర్చెద రావణువిడచియు
మనలజేరగవచ్చె నీతడు గనవలె దేశకాలంబులను ॥శ్రీ

(6) శరభుడు మైందద్వివిదు లిట్లనిరి అరసి యీతనిగుణ మవగుణముల
వరగుణుడేని చేకొనదగును దరిమిగొట్టవలె ఖలుడై యుండిన ॥శ్రీ

తే॥ వనచరుల్ పల్కురీతిఁబలుక హనుమ అర్థవంతంబు మధురంబునగుచు ప్రియము
మితమునగు వాక్య మీగతి హితముతలఁచి రామచంద్రునితోఁబల్కె ప్రేమమీఱ

జోర:- పరపక్షంబులు పల్కవలయునను భావము న్యాయాదిగాదు
ఎరిగినవిధము దెలిపెదనిట్లు పరమదయాళూ యిపుడు ॥జ

(2) అరయగ నీమంత్రులు జెప్పినవిధమున అర్థమనర్థము నెరుగ
తరముగాదు మరి వేగులవారిచే పరికింపగ రఘువీర ॥జ

(3) ఈతడు దేశముకాలము నెరుగక యిటకువచ్చె ననదగదు
సీతాపతి యిత డర్హకాలమున జేరవచ్చె గను మరియు ॥జ

(4) రావణు దౌష్ట్యము నీదుశౌర్యమును భావించియె మదినిపుడు
దేవా నిను శరణంబువేడ నీ ధీరుడు వచ్చెనువినుము ॥జ

వ॥ ఇట్లాంజనేయుండు జాంబవదంగదాదుల మతంబులన్నియు యుక్తియుక్తంబుగ
ఖండించి, తాను బాగుగ నాలోచించి,

కాఫి నారాయణి — ఆది.

ప॥ నిగ్రహానుగ్రహ నిపుణుండగు నీరజాక్ష నీకెరుగ దెల్పగలనా ॥ని

అ॥ ఉగ్రకర్ముడు గాడీ విభీషణుడు ఉత్తమంబనివచ్చె యుక్తకాలమున ॥ని

చ॥ మనమున దాప గనరాదె ముఖమున వనరుహపత్రాక్ష వంచనదోషదు
ఇనకులచంద్ర ఇతడు నొచ్చినాడు దనుజేశ్వరుని దర్పణములకున ॥ని

(2) వానరరాజైన వాలినిజంపి భానుపుత్రునికి పట్టణమిచ్చుటల్
వీనుల మున్ను విన్నవాడుగాన సానుకూలుడై శరణుజొచ్చె నిన్ను ॥ని

(3) అరసిజూడ నిపుడు ఆర్తితోడ నీచరణకమలముల పరిచర్యల్ జేయ
వర నవకోసలపురవాస వచ్చె తరుణమున మేలు తడయకజేయు ॥ని

వ॥ అని,

తే॥ తెలిపితిని నాదుబుద్ధికి దెలిసినంత రామ జగదభిరామ శ్రీరామచంద్ర
యనగ హనుమంతు పల్కుల కలరియపుడు భక్తవరదుండు రాముడు పలికెనిట్లు

హిం॥ వినుడీ మీరు విభీషణుగూర్చి వినిపించెద నేనొకకొంత
నినునమ్మితినని మైత్రిభావించిన వాని దోషమెంచరాదు దయాళులకు ॥శ్రీ

వ॥ అనవుడు లక్ష్మణుండు,

హిం॥ వినుమా రామా యీరాక్షసుడు గనుగొన దుష్టుండవునో గాదో
అనుమానాస్పదుడగును మరియు మనలో సీతని జేర్చుకొనరాదు ॥శ్రీ

(2) ఆపదలోనుండు అన్నను విడిచి అసురుడువచ్చె నీశరణు జొరగను
ఈ వగిదిని మరి యెవ్వరినైనను ఎడబాయుగాని నాదుకొనగలడా ॥శ్రీ

వ॥ అంత శ్రీరాముండు లక్ష్మణునింగని,

కం॥ శరణాగత రక్షణమె యరయగ నావ్రత మటంచు యనుజ! యెఱుఁగవే
గురుబోధలేక పెద్దల వరికింపని వానిరీతిఁ బలికెద వీవున్.

వ॥ మరియు సూక్ష్మధర్మం బొకటి గలదు. రాజులైనవారు కులమున బుట్టినవారు విరోధులైనవారు వ్యసనంబు బొందుతరి జ్ఞాతులు ద్రోహ మొనర్చు చుందురు గావున విభీషణుడు నన్నిట జేరవచ్చె. మరియు నిర్మలులైనవారిని కలుషింతురు కలుషాత్మకులు. ఒకా నొకప్పుడు శూరులు శుద్ధమానసులైన వారియెడ మారు భావంబు ప్రిభవించు నట్టి రచ్చగలిగిన కారణంబుచేత నీతడిప్పు డిటకు వచ్చె కావున గ్రిహియింప దగును మనవీతనికి దగ్గిర చుట్టములముగాము. చెంత రాజ్యంబులులేవు మనకు. రాజ్యకాంక్షచే చీలివచ్చిన వాడుగాన వెఱపు లేదు.

హిం॥ భరతునిపాటి భ్రాతలు లేరిల అరయగ నీవంటి హితుడును లేడు
వరపుత్రుడు గలడే తండ్రికి నావలెా తరణి కుమారా తథ్య మిదియయ్యా ॥శ్రీ

వ॥ ఇవ్విధంబున బలుక రామచంద్రుని మీాది ప్రేమాతిశయంబున రవిజుడులేచి,

జో॥:-అయ్యా వినుము నమస్కరించెద అసురుని వధియింప దగున్
కుయ్యాలించి మాయలొనర్చి కూరిబుద్ధితో కీడును జేయున్ ॥జ

(2) ప్రమాదబుద్ధిని నుండగ మరి నిన్నొ సౌమిత్రినో నన్నొ వధియించున్
అమాత్యులతోడ జక్కడుపగవలె నాతని నిప్పుడె యనియున్ ॥జ

(3) ఊరకున్న వనరుహ మిత్రుని సుతునికి యుక్తంబుగ శుభసూక్తుల్
నీరజపత్ర నేత్రుడు దెల్పెను నీతి బోధయా సద్వచనంబుల్ ॥జ

(4) ఈతడు దుష్టుండైనను గాకున్నను నీతనిచే కీడయ్యదియు
ఏ తఱినైన ఘటింప నశక్తుడు ఇనసుత నమ్ముము నన్ను ॥జ

(5) అఖిల జగంబుల దైత్యదానవ యక్షరాక్షస తతులెల్లన్
సఖా వినుమీ యంగుళికొనచే క్షణమున జిమ్మనె గినియంగన్ ॥జ

(6) శరణాగతి ననుజేరినవాడు సత్పురుషుడో దుష్టుడోగానీ
కరుణనువాని గాపాడుట యొక బిరుదని దెలియుము నాకు మరిసీ ॥జ

(7) వినుడర్థము మరి యనేకవస్తువుల్ వనగూడి వచ్చిననుగానీ
మనముల నాదు హితులకు యిష్టము జనియింప కుండిననుగానీ ॥జ

(7) అరయగ నాకు ప్రాణహానియు అగునట్టి సమయముగానీ
శరణాగతుని విడువను నేను సత్యంబిదియని దెల్పియు మరిసీ ॥జ

వ॥ కణ్వామహర్షి సుతుడు పరమ తపోధనుడైన కండు మహర్షి జెప్పిన ధర్మవాక్యం
బులైన కథ వినుము.

హిం:-కరములు మోడ్చియు కడు దైన్యమునసీదు మఱువుజేరితివి రక్షింపుమన
అరియైన జంపగరాదు అనఘువిను కరుణావ లోకనుడై వెలయగను ॥శ్రీ

(2) ఆర్తుడైనను దృప్తుడైనను అరియైనను విను శరణనివేడ
ఓర్చియునైన ఆత్మనాశంబునకు కోరి రక్షింపవలె శాస్త్రవిశ్వాసులు ॥శ్రీ

(3) ప్రీతి ఫలాపేక్షుడైననుగానీ భయముచేనైన మోహామునైనను
గతి నీవేయని ప్రాపుగోరినవాని గాపాడకున్న నిహాపరమున జెడున్ ॥శ్రీ

(5) కరుణను తన శక్తికొలది బ్రోవవలె శరణుజొచ్చినవాని తనుజూచుచుండ
పరుడు జంపెనేని ఆ అనాథుడు మరి వాని సుకృతముల్ గొనిపోవు విను ॥శ్రీ

వ॥ కావున ప్రపన్నుని గావడేని నరక ప్రాప్తంబు గల్గుగాన కండు మహర్షి వా
క్యంబు ననుసరించెదనని,

హరికాంభోజి — రూపకం.

ప॥ నీవాడని యొకవరి యన నేవాడైన గాచుటె వ్రతము ॥నీ

అ॥ వావి వరుసలు దోష నిర్దోషముల్ భావింపను భానుతనయ ॥నీ

చ॥ పాపాత్ముని గాపాడుటను పతితపావనుడందురు నను
పాపరహితుని బ్రోవనాప్రతాప మేమున్నది ॥నీ

(2) వేదండము గతినినే వేగ నెక్కింతు పాదమూలమున
కోదండమేలనాకు కోరియాశ్రితుల రక్షింపకున్న ॥సీ

(3) నవకోసల పురవరమున నాథుడై వెలసితివి
భవభయముల బారదోలుదు భక్తజన బృందములకు ॥సీ

హిం:-వినుమిదె రవిజా అభయ మొసంగితి విభీషణుడేని రావణుడేయైన
గొని తెమ్మిటకు సమ్మదమారగ కూరిమిని లెమ్ము హనుమ్మక వేగ ॥శ్రీ

(2) సారసనేత్రుని సద్వచనముల్ విని అరయులో వెలి పరిశుద్ధుండని
ధీరదయాగుణ దెలిసితి నీకృప ధీవరనీకే జెల్లు సత్యపథము ॥శ్రీ

(3) మానమానుడై సఖ్యంబుగ గొని మముగూడి యుండుటె హర్షంబనిబల్కి
భానుకాంగుడు శ్రీరఘువీరుడు పరిగ్రహించె విభీషణ రమ్మనె ॥శ్రీ

(4) శ్రీరాముడు సర్వభూతముల్ తన్ను జేరియు శరణన అభయమిచ్చునని
గోరియువచ్చిన యావిభీషణుడు ఆరాముని చరణద్వయమున వ్రాలెను ॥శ్రీ

పంతువరాళి - చాపు.

ప॥ శరణుశరణు శ్రీజానకిరామ శరణుశరణు జయతారకనామ ॥శ

అ॥ పరమపురుష పరంధామపరేశ నిరుపమతేజ నిను జేరవచ్చితి ॥శ

చ॥ ఇష్టదైవమని యెంచితి నాదు కష్టముబాపుము కరుణాజలధే
నష్టపడి నీచరణ పంకజముల నమ్మితి ననుబ్రోవ తరుణమిదెరామ ॥శ

(2) రాక్షసరాజగు రావణుతమ్ముడ రక్షింపుము నను రఘువరతిలక
వీక్షించి రాముని సీతనొసగి నీవు వేడుకొనుము నినుగా పాడు నంటిని ॥శ

(3) హితముదెల్పిన నాపై నతిక్రోధంబున అతిదుష్టుడు నన్నవమానించెను
సతిసుత హితధనసంపదల్ విడిచితి పతితపావన నాగతి నీవు రఘురామ ॥శ

(4) వాసవాది సంసేవిత పదకమలవరదా భక్తజన బృందమందార
భాసురాంగ నవకోసలాధిప నీ దాసానుదాసుడ దయజూడుమా వేగ ॥శ

కం॥ రవివంశాంబుధిసోమా శివసనకసనందనాది చింతితనామా
నవనీలోత్పలవర్ణా భవభయ హారభక్తలోక పరతంత్ర హరీ.

బిలహరి - ఆది.

ప॥ దయజూడుమా దశరథ రామా ॥దయ

అ॥ భయముబాపి వేగ పాలింపుమా ॥దయ

చ॥ సకలభువనపాల సాధుహృదయలోల ప్రకటిత గుణజాల పాహిమానుషలీల
సుఖద సుందరఫాల సురుచిరకపోల నిగమాగమమూల కరుణాలవాల ॥దయ

(2) శరణురఘువీర సకలకలుషదూర శౌర్యధైర్యశూర సాహసగంభీర
వరనవకోసల పురవిహార ధీర ధరణిజాప్రియ కరివరద శ్రీధర ॥ద

జోర: సకల సంపదలువిడచి రాముడె శరణని వచ్చినవానీ
అకలుషమతి విభీషణుగని రాముడు అనియెనిట్లు దయబూనీ ॥జ

(2) అసురవీరుల బలపరిమితులగు అనఘా దెల్పుమి యనిన౯
దశకంఠుని సోదరుడిటుదెల్పెను దశరథరాముని తోడ౯ ॥జ

(3) వనజాసనునిచె వరము బడసిన దనుజుని దశకంధరుని
ఘనులగు సురలు గంధర్వులు సాధ్యులు దునుమలేరు మరిని ॥జ

(4) అతనితమ్ముడు కుంభకర్ణుడు అధికబలుడు మరియు
సుతుడు నింద్రజిత్తతి చతురుడు శూరుడు, మాయలమారియును ॥జ

(5) వరపరాక్రమశాలి ప్రహస్తుడు వీరుడు సేనాపతి యాతండు
మరినిపుణులు మహాపార్శ్వ మహోదరుల్ అరిభీకరు డకంపనుడనువాడు ॥జ

(6) కోరినరూపము గలవారలు పదికోట్ల రాక్షసులు గలరా
వీరులగూడి యింద్రాదులగెల్చెను శౌర్యంబున దనుజేశ్వరు డనఘా ॥జ

వ॥ అనిన విభీషణువలుకులాలించి శ్రీరాముఁడు బాగుగానాలోచించి విభీషణా
రావణుని వృత్తాంతమంతయు యథార్థంబుగ దెల్పితివి. సంతసించితి వినుము.

సీ॥ బంధుజనంబుల౯ ప్రహస్తునితోడ రావణునమయించి రయముమీరఁ
జేసెదరాజుగ జేరిలంకకునిన్ను సత్యంబునామాట సాధుచరిత
సుతులతో హితులతో చతురంగబలములోఁ గూల్చెదరావణుఁ గ్రూరకర్ము
దివమునకేగిన భువిలోనడాగిన విడువవాదుష్టుని విబుధవైరి
ననివిభీషణు రాముఁడత్యధిక కరుణ మీర నాలింగనముచేసి ధీర నీవు
గొనుమిదైహిక సుఖములను గూర్మితోడ వినుమెటకుఁబోను రావణుదునుమువఱకు

వ॥ అనిబల్కి లక్ష్మణా !

జోర:-అంబుధి జలములుదెచ్చి యితనికి అభిషేకముజేయుమి యనుజ
    సంభ్రమమున నసురరాజ్యశ్రీకన సౌమిత్రియు బహు ప్రియమలర ॥జ

(2) గావించెను పట్టాభిషేకమును గవులందరు ముదమందా
    రావణు తమ్ముండావిభీషణుడు భావంబున నుప్పొంగ ॥జ

(3) శ్రీరఘురాముని కరుణా కటాక్షముగ జెప్పుకొనుచు మెచ్చుచును
    చేరి వానరులు చెంగలించిరి సింహనాదములు జేయుచును ॥జ

వ॥ అంత సుగ్రీవుండును హనుమంతుండును విభీషణా ! యీ సాగరంబు దాటు
    నుపాయం బెఱిగించుమన విభీషణుండు వానరవీరా ! శ్రీ రామభద్రుండు సము
    ద్రింబును శరణువేడిన మనకార్యంబు నెరవేరు ననినవిని నా రామునకుదెల్ప
    రామచంద్రమూర్తి సమర్థుండయ్యును కాలంబు ననుసరించి లక్ష్మణ సుగ్రీవుల
    యాలోచన చొప్పున,

జోర॥ సముద్రతీరమున దర్భశయ్యను శయనించెను రఘువీరుండుఁ
    కాముకుడౌ దశకంఠుని చారుడు కడువడి వేగమె పరతెంచి ॥జ

(2) రక్షోవీరుని రావణు గనియనె ఋక్షవానర సేనగ వీక్షింపుము
    పురి ముట్టడించుటకు నిదె వచ్చెదరిప్పుడు వేగగ ॥జ

(3) సింధుతీరమునందు సేనలు జేరియున్నవి వినుము
    పొందుగ రెండవ జలనిధియనగ పొర్లివచ్చె నిది గనుము ॥జ

(4) రామలక్ష్మణులు సీతనుజేరగ రయమున వచ్చెదరిపుడు
    ఈ మహినందరు మోహింతురు నిక్కము ఆ మహాత్ములను గనియు ॥జ

(5) వేగులవాని బంపు మచ్చటి విధమెల్లను గనిరాగా
    జాగుచేయక యోచింపుము మది చతురుపాయముల గెలువ ॥జ

వ॥ అని శార్దూలుండను చారుడుబలుక రావణుండు శుకుండను అసురవీరుని బిలచి
    నీవుపోయి నామాటగ సుగ్రీవునితో నిట్లుదెల్పు.

జోర:-విను సుగ్రీవా మహాబలాఢ్యుడవు ఘనుడవు రాజవు నీవు
    అనఘా మనఃజుని స్నేహంబున నీకగు లాభంబేది కనుము ॥జ

(2) వినుమో యనుజా! మనజుని రాముని విడిచిన నష్టమదేమి ?
కనుమా మనదగు పూర్వస్నేహము అనుమానింపకు మదిని ॥జ

(3) రామునిసతినే నపహరింప నీకేమి నష్టమో చెపుమా
రాముని విడచి బొమ్మపురికి కపిరాజా పగ మనకేలా ॥జ

(4) చేరలేరు వనచరులీ లంకను శూరాగ్రణి కపివీరా
ధారుణిసుతను జూడలేరుసుమి తరలిపొండు మీపురిజేరా ॥జ

వ॥ రావణుండిట్లు బోధింప శుకుండు విహంగ రూపంబున గగన మార్గంబున జని సుగ్రీవునితో రావణుని వచనంబులన్నియు బల్క విని కపులందరు మింటికెగసి శుకుని బిడికిళ్ళపొడిచి నుద్దించిన అతండు అసురకులాంతకా శ్రీరామా యీ కపులవారింపుము దూతలజంపరాదు పతియాజ్ఞ మీరినవాఁడు దూతగాఁడు రాజుచెప్పినంతయుఁ జెప్పివాడ నాయందు దోషంబులేదు రామా రక్షింపుమని మొరలిడ కరుణామయుండగు శ్రీరాముడు ఆదనుజుని విడువుండని యాజ్ఞాపించిన వారలు విడిచిరంత ఆశుకుండు భానుకుమారా ఆరాక్షసరాజు కేమిచెప్పు మనెదవు దేవా యన కపివీరుడు రావణు నుద్దేశించి

హిం:-వినుమా రావణ నాకుప్రియుండవు హితుడవు కర్తవుగా వెటుజూచిన
దనుజాధమ దయనీయుడవునుగావు ఘనుడగురాముని వైరివిగావున

(2) రామవిభునకు మిత్రుడనేను రాక్షసరాజా రణముననిన్ను
రాముడు జంపును వాలివలెను కామాంధా నీపుత్రమిత్రులతో ॥శ్రీ

(3) పాతాళంబున వరుణాలయమున బ్రహ్మలోకమున డాగినగాని
భీతిలి యింద్రునిప్రార్థించి దెచ్చిన పాపీ నిన్నుజంపక విడువడు ॥శ్రీ

(4) నీపాలిటికి కాలునిగా మదినెంచుము రాముని క్రూరా యిపుడు
కాపాడగ బ్రహ్మాదులువచ్చిన గావలేరు శ్రీరాముని కడ్డమై ॥శ్రీ

వ॥ ఇట్లు సుగ్రీవుండు చెప్పుసమయంబున అంగదుడు మహారాజా యితడు రాయ బారిగాని దూతగాడు మనలనెల్లం జోరునివలె గలయజూచుచున్నాడు వీనిని లంకకు బోనియ్యరాదన రాజాజ్ఞచే వనాటులందరు వానినిబట్టి గట్టిగా గొట్టు చుండ అనదయుంబోలె రామా రామా యని మొరబెట్టుచు కావుమయ్యా శ్రీరామా! వానరులు ననుజంపిరి దేవదేవా నేబోవ నను జ్ఞయొసంగుము కాజన్మమాదిగ జేర్చిన పాపఫలంబిప్పు డనుభవించెద రక్షింపుమన రాముడు వానిని మన్నించి విడిపించెనంత.

దో॥ర:-తూరుపు మొగమై శ్రీరఘురాముడు పారావారముగనుచు
ధీరుడు దక్షిణబాహువు దిండుగజేరిచి పరుండె దర్భలను ॥జ

(2) పరికింపగ నీయంబుధిదాటుటో మరణించుటయో యిపుడు ॥జ
స్థిరమని జలనిధి ప్రార్థించెను మది ధరణీశుడు మౌనముతోను ॥జ

(3) ఘనుడు రాము డిటు శయనించియుండగ జనియెను మూడుదినములును
వననిధి దర్శనమొసగడయ్యెను మనుజపతికి ముదమొదవంగను ॥జ

(4) అంతట రాఘవుం డంబుధిం గనుగొని యధికక్రోధము మీర
చెంతనున్న సౌమిత్రినిగాంచి వచించెను శౌర్యముతోడ ॥జ

(5) ఎంతటిగర్వమొ దర్శనమియ్యడు యీ యంబుధి మన కిపుడు
ఇంతగ దుర్మదు వేడుట మనకును హీనతగాదే యనుజా ॥జ

(6) పరికింపగ శమమార్జవమును ప్రియమును పనికిరావు దుష్టులయెడను
మరియు మూఢులు సాధువులంగని మదినెంతురు దుర్బలులనుచు ॥జ

(7) సామంబునను గీర్తిగలుగదు చక్కబడదు కార్యంబు
సౌమిత్రీ నే క్షమజూపగ శక్తిహీనుడని దలచె జలనిధియు ॥జ

(8) కావున నాశితశరమున జలనిధి గర్వమణచెదను గనుమా
కావరమణచి శోషింపజేసెద ఘనమగు నావిల్లిటు తెమ్మా ॥జ

(9) ఇంకించెద బాణాగ్నిచె నముద్రము శంఖశుక్తి జలజంతువులు
శంకలేదు వెలిబడునటుజేసెద సర్వప్రాణులిటు నడువగను ॥జ

వ॥ లక్ష్మణా ! యింక నీసముద్రముగతి జూడుము పొంగిపొరలు జలముల నింకించి క్షోభగలిగించెద నని కోపారుణితలోచనుండై ధనుస్సును చేకొని ప్రళయకాలానలుని పోల్కి మండుచు ఉగ్రంబులగు బాణంబులు ప్రయోగింప నాబాణంబులు సముద్రంబులో ప్రవేశించి మకరంబులు మున్నగు జలజంతువులకు భయంబు గలిగించుచు శంఖములు ముత్యంబులతోనొప్పు నావననిధి పొగతోగూడి గొప్ప అలలచే నతిభీకరంబై యుండె నప్పుడు.

దో॥ర:-మకర కమఠ మత్స్యంబులతో మందరగిరివలె నెగయ
తకతకమని జలసత్వములన్నియు తాళలేక తపియింప ॥జ

(2) సన్నాహంబున బ్రహ్మాస్త్రము వేయ నున్న రాముని గనియు
అన్నా మానుము మానుమనుచును అన్న కరముబట్టె లక్ష్మణుడు ॥జ

వ॥ అంత శ్రీరామవిభుం డాసరిత్పతింగని కోపంబుదీపింప బ్రహ్మాస్త్రంబు నభిమంత్రించి ధనుస్సు ననుసంధించి విడువనున్న తఱి.

జోర:- భూమ్యాకాశము బ్రద్దలయ్యెను భూతజాలములు వడకెగ్
ధూమము రేగి దిక్కులు తెలియక గ్రమ్మె చీకటులు వేగ ॥జ

(2) ఘనముగ సూర్య చంద్ర తారకలు కాంతిమాసె నపుడు
ఒనరంగ తోక చుక్కలు పెక్కులు వినువీధిని గనపడెను ॥జ

(3) పిడుగులుపడెను భూరిరవంబున కడుభీకరముగ మేఘములు
వడిగురియగ నప్పుడు నిప్పులవర్షము గురిసెను భువియందునను ॥జ

(4) వృక్షపంక్తులను విఱిచి ప్రభంజను డాక్షణ మద్రుల గూల్చెగ్
యక్షరాక్షసులాదిగ ప్రాణులు రక్షకులెవరని భయమందెగ్ ॥జ

(5) కనుపడి కనపడనట్టి జంతువులు కడుభీకరముగ నరచుచును
తనువులెఱుంగక పడియుండెను భువి తల్లడిల్లి శోకంబునను ॥జ

వ॥ ఇవ్విధంబున లోకంబంతయు నాకులపాటునంద రాముని బాణపాతమునకు భీతిలి

హిం:- జలమునుండి వెడలివచ్చెను సముద్రుడు శ్రీరఘురాముని జేర
సలలితముగ మేరుశిఖరముపైని జలజాప్తుం డుదయించినరీతి ॥శ్రీ

(2) సురుచిరమగు వైడూర్యకాంతిచే సుందరమగు గాత్రంబున ముత్య
సరములు రత్నాభరణముల్ వెలుగగ తరుణార్కసన్నిభ వస్త్రధారుడై ॥శ్రీ

(3) సాగరుడా రఘువీరునిజేరి సత్వరముగ నంజలి ఘటియించి
ఆగమవినుతా రామభద్రాయని అతిమోదంబున బలికె నిట్లు ॥శ్రీ

(4) సరసగుణాఢ్యా త్రిభువనములలో సంచరించెడు సర్వభూతములు
అరయగ వాని స్వభావముదప్పి చరియించునె మరి పరమపురుష రామ ॥శ్రీ

5) అటులనె నాదు స్వభావముదప్పక అగాధతలముగ నుండెద దేవా
కుటిలుడగాను కరుణించుము నవకోనల పురవాసా శ్రీరామా ॥శ్రీ

వ॥ మరియు కామలోభభయ కారణంబుచే సకలజంతు సంకులంబగు ఉదకంబును ఎన్నిసమయంబునను స్తంభింపజేయరాదు. అయిన దేవా వానరబలంబులు దాటుటకు దారినొసంగెద నాపై కోపంబుమానుము అనిన రఘువరుండు.

సీ॥ ఈ యమోఘశరంబు నేనెచట విడతు ననిన శ్రీరామునికి బల్కె నబ్ధి యిట్లు
పరగ ద్రుమకుల్యమున విడు బాణమిపుడు ఘోరపాతకులున్నారు గూలుదురట

వ॥ రామా నాకు ఉత్తరభాగమున ద్రుమకుల్యమను ప్రసిద్ధిచెందినచోటు కలదు. అందు కిరాతులు నీరు పానముజేసి చాలాయిబ్బందులు పెట్టుచుందురు. వారిబాధ సహింపజాలకున్నాడను. నీయస్త్రం బాపాపాత్ములపై విడువుమనిన రాముం డట్లుగావించె. ఆయస్త్రంబు ప్రయోగించిన ప్రదేశము మరుకాంతారమని ప్రసిద్ధిగాంచినది. సముద్రమధ్యంబు దహించిన యాభూమికి రాముడిట్లు వర మొసంగె.

తే॥ పశువులకు హితముగా మంచికసువు గలిగిపాలుదధియును తేనెయు ఫలములమరి ఓషధులు చాలగల్గి నదియు రామచంద్రుని వరముచే రమ్యమగుచు

తే॥ జలజనిధి నేను శ్రీరామ యీనలుడు బలుడు విశ్వకర్మ సుపుత్రుండు వీనిచేత వారిగట్టింపు మిప్పుడు వనరుహాక్ష భారమును బూనువాడనే పరమపురుష

వ॥ అనిచెప్పి సముద్రుం డంతర్హితుండయ్యె నంత నలుండు శ్రీరామునకు నమస్కరించి.

సీ॥ దండమునగాని రామ యీధరణిలోన చక్కబడ దెట్టి కార్యమ్ము సాధువృత్తి చేత వినుము దండమునగాదె దీనుడగుచు లోతుజూపెను దా నబ్ధి భీతిపొంది

కీర:- శ్రీరఘువర యీజలనిధిమధ్య సేతువు నిర్మించెదను
పినుడు మజ్జననీడు వరమిచ్చెను విశ్వకర్మ దయతోను ॥శ్రీ

(2) మరియు నాజనకునివలె నాకు శిల్పనిపుణత గలదు
శూరతగట్టెద సేతువునిప్పుడు జూడుము రామా యనుచు ॥శ్రీ

(3) సముద్రుడు చెప్పగ జ్ఞప్తివచ్చె నాజనకునితో సమబలుడన
ప్రముఖంబున నగములుతే నిప్పుడె పంపుము కపిబలముల ననిన ॥శ్రీ

(4) రాముని యాజ్ఞను కపులందరు నతి రయముమీరగ నపుడు
భూమియు నభమును నద్రువ నడవులను భూరుహములు దెచ్చియును ॥శ్రీ

(5) పరుగులెత్తుచు వనచరులందరు పర్వతములు దెచ్చియు[illegible]
పరమాహ్లాదముతో సాగరమున బడవైచిరి మోదంబునను ॥జ

(6) నూరామడ దూరమువరకును సరిగ నూలుగట్టి కొందరును
చేరికొందరు శిలలను సరిగ జేర్చిరి మరి కొందరును ॥జ

(7) వేనవేలు కపులందరు బోయి నానావిధ వృక్షములన్
పూనియు గుల్మలతాదులదెచ్చి వననిధివేయగ నంతన్ ॥జ

(8) జలములెగసి గగనంబునిండెను జలచరములు భీతిని పరువిడెను
నలుడుగట్టెను గిరితరులతలను జలనిధిమధ్యను సేతువును ॥జ

సీ॥ ప్రథమదినంబున పదునాలుగామడ సేతువుగట్టిరి శీఘ్రమునను
చేరి రెండవనాడు సేతువగట్టిరి యిరువదామడ కపు లింపుమీర
మూడవదినమున వేడుకన్ వనచరు లిరువదొక్కామడ వెలయగాను
మరియు నాల్గవదిన మిరువదిరెండు యోజనములుగట్టిరి జవముమీర

తే॥ చేరి పంచమదినమున వీరులంత నిరువదియుమూడు నామడ లింపుగులుక
సేతువునుగట్టె నలుఁడుదా చిత్రముగను వనచరుల్ తోడుగా నిల్వ వనధిమధ్య

హిం:-కాంతియుక్తమై మనోహరమగు ఘనమగు నాసేతువు జూడగోరియు
అతి మోదంబున అమరులు సిద్ధులు ఆకాశంబున నిలచియుండిరి ॥శ్రీ

(2) నూరామడలు నిడివిగల్గియు అరయగ పదియోజనముల వెడల్పుగ
నేరుపుతో నిర్మించెను నలుడు ధీరుడు తండ్రికి సరివచ్చునని మరి ॥శ్రీ

(3) సాధ్యంబగునె యెవ్వారికైన సాగరమధ్యను వారిధి గట్టగ
వేద్యముగాదిది పరమాద్భుతమని వినుతించిరి శ్రీరాముని కృపయని ॥శ్రీ

(4) సర్వజ్ఞుని దయగంటిమి నేడని సర్వభూతములుఁ సంతసించుచును
గర్వమడంగెను దశకంఠునకని కాకుత్స్థుని మనమారగ బొగడిరి ॥జ

(5) వనచరులందరు ఆడుచు పాడుచు వాదములాడుచు గంతులువైచుచు
వననిధిగనుచు వారిధి పరువిడుచు ఘనముగ కేకలు వేయుచుండి రపుడు ॥శ్రీ

వ॥ అతివిశాలంబుగ సముద్రినికి పాపట దీర్చినటువలె నొప్పుచుండె. అంత గదా
ధరుండై మంత్రులతో దక్షిణతీరంబున శత్రువుల జంపుటకై నిలచియుండె

నప్పుడు సుగ్రీవుండు శ్రీరామచంద్రునిగని అత్యద్భుతంబుగ సేతునిర్మాణం బయ్యె. త్వరితంబున సైన్యయుతంబుగ నవ్వలితీరంబు జేరుదమనవుడు శ్రీరామ చంద్రమూర్తి సంతుష్టాంతరంగుండై నలునికొనియాడి సుగ్రీవుని సేననడిపింపు మనవుడు.

జోర:-హనుమంతునిపై రామమూర్తి మరి అంగదుపై లక్ష్మణుడున్
వనరుగనెక్కి వననిధిదాటుడి వనచరులందరు నిపుడు ॥జ

(2) సంతసమున శ్రీరామ లక్ష్మణులు చాపముబట్టియు వేగన్
చెంతను రవిజుడు సైన్యముతోడ చేరి కపు లిరుప్రక్కల నడువంగన్ ॥జ

(3) చేరి వనాటులు ముందర వెనుకను బారులుదీరి శీఘ్రమునన్
పారావారము నీదుచు కొందరు జేరిరి యవ్వలితీరమునన్ ॥జ

(4) అందరు నిట్లుబోవుచుండు ధ్వని యంబుధిరవమును మించి
ఎందుఁజూచినను నిండియు సేనలు వేగమెదాటెరి జలనిధినీ ॥జ

(5) భానుజుతోడ రామలక్ష్మణులు సేనలుగొల్వగ వింతన్
ఆనందంబున సేతువుదాటి యావలితీరము జేరిరి యంతన్ ॥జ

కల్యాణి – రూపకము.

ప॥ అభిషేకము గావించిరి ఆనందంబున శ్రీరామునకు ॥అ

అ॥ శుభముహూర్తమునను వేడ్క సురముని బృందములుగూడి ॥అ

చ॥ ధీరా శ్రీరఘువీరా వైరులదెగటార్చి వేగ
పారావారా వృతధీర పాలింపుమని యపుడు ॥అ

(2) సారెసారెకు సన్నుతించి సమ్మోదమున నర్పించి
నారాయణాచ్యుతయని నవకోసలవానునకు ॥అభి

తే॥ రామవిభుడంత లక్ష్మణున్ రయముమీర గ్రుచ్చి కౌగిటజేర్చుచు గూర్మితోడ
అనఘ అపశకునములయ్యె దనుజులకును మనకు శుభశకునములయ్యె కనుముపత్స

వ॥ మనమిప్పుడె లంక ముట్టడింపవలయుననన కపిసేనలతో సుగ్రీవ విభీషణాదులు యుద్ధసన్నద్ధులై రట్టిరొండ.

దో:-వారలశక్తియు భక్తియు ధైర్యము వారిచేష్టలను గనియు
ధారుణిసుతపతి సంతసించి మది మరియును లంకధ్వని వినియు ॥జ

(2) సీతను దలచుచు దుఃఖంబునబలికె రాముడు ఘాతుకు రావణుచేత
భూతలసుత జిక్కియు ఈపురమున బొక్కుచున్నది గతిలేక ॥జ

(3) అని చింతించుచు నిట్టూర్పుల అనుజునిగని యిట్లనెను
అనఘా యీపురి విభవము పొంకము ఆశ్చర్యము చిత్రము గనుము ॥జ

వ॥ అనుచుండె నట దశముఖుండు శుకునివలన రాముడు సముద్రంబుదాటి సువే లాద్రిచేరియున్న చందంబు విని సౌధంబుపై జేరి సమరసన్నాహ యుతులును, సేనాధిపతులగు ప్లవగోత్తముల సావధానంబుగ జూచి ప్రతిపక్ష బలంబుల బ్రశంసించుచున్న శుకసారణుల నధిక్షేపించి మేడదిగి విద్యుజ్జిహ్వుని రావించి రహస్యకృతంబగు కార్యంబుదెల్పి పొమ్మన నన్నిశాచరుండు రావణుని యాదే శంబున,

దో:-శ్రీరాముని చాపంబును శిరమును జేసి మాయచే నతడు
ధారుణిసుతకు జూపగ నప్పుడు తల్లడిల్లె శోకముతోను ॥జ

(2) హా రఘువీర హతుండైతివె యని జానకి యవనినిబడి పొర్లగను
కూరిమి సీతను డగ్గరి సరమ యూరడించి యిట్లనెను ॥జ

(3) జననీ రాముని మాయాశిరమిది దనుజుల కృత్యంబిదియు
ఘనుడు రాముడున్నాడు సుఖముగ ననుజునితోడను వినుము ॥జ

(4) ఈ లంకాపురి ముట్టడించె కపివీరులగూడియు నివుడు
బాల చంద్రముఖి శోకింపకు రావణుఁ బరిమార్చు నిక్కమిది గనుము ॥జ

వ॥ అని విభీషణుని పత్నియగు సరమదెల్పిన సీత శోకంబుమాని యుండెనంత, రావణుండు మాల్యవంతునిమాట విననైతినని మదిలో చింతించుచుండె. ఇట రాముడు విభీషణునివలన రమణీయంబగు లంకానగర విశేషంబులెఱింగి తూర్పు ద్వారంబునందుండు ప్రహస్తునికొరకు నీలుని దక్షిణద్వార రక్షకులగు మహోదర మహాపార్శ్వులకు ప్రతి విజయ ధౌరేయుండగు తారేయుని, పడమటి ద్వార పాలుడగు ఇంద్రారికి ప్రతినిధిగా పరాక్రమవంతుండగు హనుమంతుని, విరూ పాక్షునికొఱకు విభీషణ సుగ్రీవ జాంబవంతులను, నియమించి, దశముఖునివలన గుప్తమైన యుత్తరగోపుర ద్వారంబున రాముడు తమ్మునితో ధనువునారో

పించి బలంబులుగొలువ నిరోధించి యుండెనంత, వనచరులచే నాకులమగు లంకను గని రావణుని యనుచరులు భయభ్రాంతులై యుండిరప్పుడు.

జోర:- వనచరవాహిని పరివృతుడయ్యె మనుకులతిలకుం డపుడు
ఘనత్రికూటగిరి శిఖరంబున వెల్గెడు లంకను గాంచెను మోదముతోను ॥జ

(2) అందొక యున్నతసౌధంబున నుండెడు అసురుని రావణుగాంచి
పొందుగ సుగ్రీవుడు కుపితుండై యట బోయి వేగ దశకంధరునీ ॥జ

(3) వరకిరీటమును నెగసివన్ని యది ధరణిని బడద్రోసియును
మరియు వానితో బోరి కొంతవడి జేరవచ్చె రాముని చెంతకును ॥జ

(4) అంతట మంత్రుల యాలోచనమున రఘురాము డంగదునిఁగనియు
సంతసమ్మున రాయబారము సలుపుము కపివర యిపుడు ॥జ

(5) తూరా లంకకు బోయి రావణుని జేరియు వేగంబునను
ధీరా నేనిపు డాడిన మాటలు దెల్పుము నిర్భయముగను ॥జ

(6) అని రాముడు వచియింపగ నప్పుడు అంగదు డతివేగముతోను
జని రావణుసౌధంబున వ్రాలెను సాహసంబు మీరగను ॥జ

(7) తనమంత్రులతో గూడియుండిన దశకంఠు జేరి యంగదుడు
వినుపించెనిటు శ్రీరాముడు చెప్పిన హితసూక్తుల వివరంబుగను ॥జ

ఖరహరప్రియ ఏక.

ప॥ రఘుకులాంబుధిచంద్రుడైన రాముదూతను
అగణితబలుడ వాలిసుతుడ అంగదుండను ॥ర

చ॥ ఘనుడు రాము డని పనన్ను వినుము రాక్షసా
అనిసేయనేల నిపుడు అసురనాయకా ॥ర

(2) సుతహిత సచివాళితో నిల బ్రతుకగోరుము
వనితను నిన్నేలును రఘుపతియు ముదమున ॥ర

(3) ధరణితనయ దెచ్చి రాఘవు శరణనివేడ
కరుణించును రావణా సురమునులు బొగడగ

(4) మెచ్చుగ నీ లంకనేలు ముచ్చటలరగ
మచ్చిక నవకోసలపతి మాటలు వినుమిదా ॥ర

హిం:-పరదారలను దొంగిలినట్టి పాతకివైనను దానవనాథా
శరణని నాదు చెంతజేరియు జానకినొసగిన మన్నించెదరా ॥శ్రీ॥

(2) సుతహిత మంత్రి పురోహితులతో నీ వతిసౌఖ్యంబుల ననుభవింపగా
మతిగలదేని నా హితమాలింపు దుర్మతివై కులము నాశముజేయకు ॥శ్రీ॥

(3) ఉత్తమకులమున బుట్టినవాడవు చిత్తజరిపుపద సేవారతుడవు
ఇత్తఱి యిహపరసుఖముల బొందగ నెంచుము మదిని ఆలోచింపుము ॥శ్రీ॥

వ॥ ఇట్టివచనంబులు వీనులసోక కనులెఱ్ఱజేసెడు రావణాసురునితో శ్రీరాముని మాటలుగా మరియు నిట్లనె.

హిం:-ఓరీ భ్రష్టా కులనాశకుడ క్రూరా నీ వతిమోహముచేత
నారీమణులకు నీలోకంబున చేరియు ద్రోహముచేసిన మూర్ఖుడ ॥శ్రీ॥

(2) వనజాసనుని వరగర్వంబున తనువెరుంగక తారసిల్లెదవు
గనుమా నీదు కావర మణగు కాలమువచ్చెను నీచా వినుము ॥శ్రీ॥

(3) నినుశిక్షింపగ లంకవాకిట నిలచియున్న వాడు దండధరునివలె
దనుజాధమ బలముండిన నీకు అనిచేయుటకు రమ్మా వేగ ॥శ్రీ॥

(4) కాదేని మరి సీతనుదెచ్చి గావుమనుచు నను శరణనుమటుల
కాదా లోక మరాతిసమగునటు గావించెద నాశరజాలముల ॥శ్రీ॥

(5) ధర్మచిత్తుడు శాంతుడు నీదు తమ్ముడు రక్షోనాథుడు వినుమి
నిర్మలచిత్తుడు నీతికోవిదుడు నిక్కము యేలును లంకారాజ్యము ॥శ్రీ॥

(6) అమరవందితుడు పూజ్యుడు ఘనుడు అసురకులోత్తము డార్యసమ్మతుడు
ప్రమదంబున నన్నాశ్రయించె నిక బడయును సకలభోగభాగ్యములు ॥శ్రీ॥

(7) వినరా దుష్టా ధర్మపథంబును విడచిన పాపివి గావున నీవు
క్షణకాలంబిక రాజ్యముచేయగ జాలవు జిక్కితివిప్పుడు నాచే ॥శ్రీ॥

(8) పొగరణగియు గనుపించక నీవెటుబోయిన విడువను అసురాధమ నే
జగములనెందు జొచ్చినగానీ చావుదప్పదిది నిక్కము నమ్ముము ॥శ్రీ॥

(9) కావున హితమాలింపుము నీదు జీవముజిక్కెను నాచే మూఢా
నీవలచినయవి గనుమీపురిని జీవముండునపుడే శీఘ్రముగాను ॥శ్రీ॥

వ॥ శ్రీరామవిభుం డిట్లు నీకెఱింగించుమనె ననిపలుక, ఆ పరుష వాక్యంబులువిని రావణుడు కోపారుణిత లోచనుండై దురాలాపంబులాడు వీని బట్టుడు కొట్టుడు చంపుడన ఘోరరక్కసులు నల్వురంగదుపై బడ వారలకు జిక్కినట్లు నటించి తటాలున తనచంకలలో నిరికించి మేడపై కెదుమిక అచ్చటినుండి విదలింప నారక్కసులు చచ్చిపడిరంత అంగదుడు, దశకంఠుడు చూచుచుండ, ప్రాసాదశిఖరంబు పాదంబున నేలగూలదన్ని పరాక్రమంబుమించి యిట్లనియె.

తే॥ వచ్చినాడను రావణా వాలిసుతుడ రాఘవవిభు బంటు నేనంచు రయముమీఱ
వచ్చినిలచెను శ్రీరఘువరుని చెంత చేరి కపివరుల్ ముదమునఁ జెలగుచుండ.

వ॥ శ్రీరాముడంత లంక ముట్టడింప సేనల కాజ్ఞాపించిన కొండవలెనుండు సేనాకాండముతో లంక నాలుగు గవకుల సుషేణుండు జుట్టుచుండె. రణంబుసల్పు నుత్సాహంబున ఆయుధములుబూని యార్భటించు వానరసమూహంబుగని దానవులు వెఱచి బఱచి రావణునిగాంచి అగచరులు లంకనంతయు నిరోధించిరని తెల్పిన కనలి మరల సౌధంబునెక్కి యావిధమంతయు పరికించి,

తే॥ దురమునం గపుల నెట్టులు దుంచువాడ ధరణి నాకసమును మ్రింగదలచు వీరి
అనుచు చింతించె రావణు డాత్మయందు సీత దలపోయుచుండె శ్రీరాముడిచట.

వ॥ రావణుండంత యుద్ధంబున కాజ్ఞనొసంగుటయు అట్టహాసంబుగా పెడబొబ్బలిడుచు కపిసేనం దాకి తమతమ పేరు లుగ్గడించుచు దనుజసైన్యంబులు ఘోరంబుగ యుద్ధంబుజేయ వానరులు చెలరేగి జయజయ సుగ్రీవ జయశ్రీరామ యని కేకలు వేయుచు బోరునెడ భూమి రక్తసిక్తముతో మాంస పంకిలమై యొప్పియుండె నట్టియెడ రామవిజయంబుగోరి వనచరులును రాక్షస విజయంబుగోరి రక్కసులును రోష భీషణాకారులై పోరుసల్పు చుండిరి.

తే॥ భానుడటు గ్రుంకె నసురుల బలము హెచ్చె రండి చావండి కపులార రండియనుచు
చేరి యార్భాటములు మరి చేసి వేగ రామచంద్రుని దాకిరి రభసమునను.

వ॥ అంత రామచంద్రు డమోఘమగు శరములం బ్రచండమూర్తియై యారక్కసుల నుక్కడంచిన మహాపార్శ్వ మహోదర మహాకాయులాదిగాగల భీమబలులు చావుదప్పి వెరచి పరతెంచిరంత యింద్రజిత్తు యారాక్షసులపాటు గని తన విలాస విక్రమమ్ము చెలగ, ప్లవగ వీరుల గవిసిన, వాలిసుతుడు వాని నవలీల హతాశ్వుగావించి, సారథింజంపి విరథుంగావించిన,

జో॥ర:-ధీరుండనుచు బొగడిరి మునులు శక్రారిని నొంచె నటంచు
చేరి విభీషణ రామలక్ష్మణులు శూరాగ్రేసరుడని మెచ్చిరి ప్రియమునను ॥జ

(2) మచ్చరంబు మీరగ రక్కసుడు మాయనుగైకొని యపుడు
అచ్చట నేరికి గానరాకను అస్త్రజాలములు గురిపింపగను ॥జ

(3) అదిగని రాముడు వనాటులతోననె నీ యసురు డసాధ్యుడుగాన
చెదరక రవిజుని చెంతనుండుడీ యేమఱకుడు మీరింత ॥జ

వ॥ అని బల్కునంత యింద్రజిత్తు మింటికెగసి విశ్వభయదుండై ఎరికింగానరాక పిడుగుల వడువున బాణవర్షంబు గురియింపఁ గీశసంఘము దిగ్భ్రమజెంది దూలి సోలి వ్రాలియుండి రయ్యెడ నయ్యసురుండు శ్రీరామ లక్ష్మణుల యెదుటనిల్చి కదనంబు జేయజాలమి మాయచే శరబద్ధుల జేయనెంచి,

తే॥ అస్త్రజాలంబులను ముంచి యగచరులను బాణవర్షంబు గురిపింప భానుకులులు
కనులు విప్పంగనేరక గాఢహతుల నలిగి నెత్తుటఁ దోగుచు నిలను బడిరి

తే॥ కాలుచేయాడ కంతట కనులుమూసి వీరశయ్యను బడియుండు వారిగాంచి
వానరులు శోకసంతాపవార్ధి మునిగి క్రిందుమీదును జూచుచు నుండిరపుడు

వ॥ అట్టియెడ విభీషణ సుగ్రీవు లచటి కరుదెంచి స్మృతిదప్పి పడియున్న రామలక్ష్మణులంగని యా దురవస్థకు వగచుచు తికమకపడుచు మిన్నుజూచు చుండ మాయావేదియగు విభీషణుండు మాత్రము వానిం గనుగొనియె నంత మేఘనాదుండు,

జో॥ర:-తనువులెఱుంగక శరబాధితులై ధారుణి తల్పముగాను
అనుజనితో బడియుండు రాముని గని ప్రియమున రావణియు ॥జ

(2) ఖరదూషణ త్రిశిరాది రాక్షసుల ఖండించిన వారిపుడు
మరియు కపులతో వారిధిగట్టిన దొరలను జూడుడి మీరు ॥జ

(3) అట్టివారి నాగాస్త్ర బంధములఁ గట్టివైచితినే నిపుడు
కట్టులూడి బ్రతికింప జాలరిల కపులు గిపులు నిర్జరులు ॥జ

(4) ఈ రాఘవుడీలక్ష్మణుండు నీరాణువచేసినదెల్ల
అరయగ నిప్పుడు నిష్ఫలంబుగా నయ్యెను బ్రతుకిక కల్ల ॥జ

వ॥ అని యింక ప్లవగవీరుల పనిపట్టెదఁ జూడుండని జాంబవదంగదాది కపిసత్తముల అగ్నిజ్వాలల భోలు శరపరంపరల నొప్పించి, యట్టహాసంబుచేయుచు, నేలబడి

యుండు రామలక్ష్మణుల రాక్షసులకుజూపి చచ్చిరని బల్కిన యారక్కసులు
గర్జించుచును, సంతసించి వానిపూజింప నతఁడును సంతోషంబున లంక ప్రవేశించె.
ఇట సుగ్రీవుండు రాజపుత్రుల యున్కిఁ గాంచి, కనుఁ జడిగొన బాష్పంబులు
గార, శోకసంతప్త చిత్తుండై యుండ, విభీషణుండు

హిం:- అనఘా నీవిటు ప్రాకృతునింబలె కనఁగవ బాష్పపూరముల్ గార్చకు
మనమున శోకము మానుము, ధైర్యము బూనుము గతిమాలిన నను దేర్పుము॥ శ్రీ

(2) మనకును భాగ్యవిశేష మున్నచో జనపాలురు నీఘనులు మహాత్ములు
అనఘులు మూర్ఛ దొలగుదు రికను అపమృత్యు భీతిలేదని పల్కుచు ॥ శ్రీ

(3) మంత్రిజలంబుల కనులను దుడిచి చింతించుటకిది కాలముకాదు
భ్రాంతిమానుము రామచంద్రుడే ప్రాపనినమ్మిన దళముల జూడుము ॥ శ్రీ

(4) జనవరేణ్యులు లబ్ధసంజ్ఞులై మనయడలెల్ల దీర్ప సమర్థులు
గనుమా వీరి వదనకమలముల్ కాంతిని నొప్పియున్నవి మిత్రమ ॥ శ్రీ

(5) భానుజ నాగపాశబంధము వీరి బాధింపదు మరి ప్రాణభయములేదు
భూనాయకులకు స్మృతిగలుగువరకు పూనికనిట గాపాడుము వారిని ॥ శ్రీ

వ॥ మఱియు నీకపిసైన్యంబు దీనవదనులై, పలాయనలగుటకు గుసగుసలాడుచున్న
వారు. వారి భయంబుదీర్పుమని భానుజు నూరడించి వనచరుల ననునయ వాక్యం
బులదేర్చె, నిట యింద్రజిత్తు రావణుని జేరి నమస్కరించి, రఘువీరులు హతులై
రని విన్నవించెనంత

తే॥ పీఠముననుండి దుముకుచు ప్రీతిమీర కౌగిటనుజేర్చి కొడుకును గారవించి
రాఘవుల వధవిధమంత బాగవినియు మెచ్చి శిరమును మూర్కొనె మచ్చికలర

వ॥ ఇట హనుమ దంగద నల నీల గజగవయ గవాక్షాది వనాటులు దుఃఖితులై
రామునిచుట్టునిలచి, జాగ్రత్తగలవారై తృణంబు గదలినను రాక్షసులని భీతిల్లు
చుండిరంత రావణుండు సీతకు గాపున్న రాక్షసస్త్రీలను రావించి రామలక్ష్మ
ణు లింద్రజిత్తుచే నీల్గిరని యెఱింగించి యాదేవిని పుష్పకంబున నిడి వారల
జూపుడు. ఎవ్వరు ప్రాపనినమ్మి నన్నులక్ష్యపెట్టదో అట్టివారు చచ్చిరిగాన
నన్నింక తనకుదానె కైకొనుగావున పొండనిన వారు పుష్పకంబున సీత నిడు
కొని పోలికలనికి దోడ్కొని చనిరంత పొంగుచుండెడు రక్కసులను కుంగు
చుండు వనచరులను శరతల్పంబున బడియుండు రామలక్ష్మణులనుగని దుఃఖా
ర్ణవమగ్నయై

నీలాంబరి—చాపు.

ప॥ పతితపావన రామ పాపియింద్రారిచే బడితివే యిలపైని భవ్యగుణాఢ్య ॥ప

అ॥ అతులిత వైభవము లనుభవించెదవని అవనిసురులు పల్కుటదియు వ్యర్థంబయ్యె॥ప

చ॥ మతిమంతులైన దైవజ్ఞులు దెలిపిరి క్రతుశత నిరతుడైన
వ్రతనిష్ఠునకు నీవు సతివై సుఖియింతువనిరి హతుడౌ నీపతియని అనరైరి వారలు

(2) అతిశయ భాగ్యసంపదల బొందెదవనుచు నార్యులు వచియించిరీ
పతి మృతియగునని బల్కరైరి బుధులు క్షితి నవకోసల శ్రీరఘుకులవీర ॥ప

తే॥ పద్మరేఖలు పాదాలబరగునట్టి సతికి సౌభాగ్యసంపద చాలగలుగు
పట్టమహిషియునగునని పల్కుచుండు నాదుదౌర్భాగ్య మివియన్ని నాశమయ్యె.

వ॥ సర్వాంగ లక్షణంబులుగల నాకిట్టి దుర్దశ గల్గునని ఏమహాత్ములు దెల్పరైరి హాదైవమాయని ఆర్తనాదంబున దుఃఖించుచుండ త్రిజట సీతాదేవితో అమ్మా దుఃఖింపకుము నీపతి ప్రాణయుతుండై యున్నవాడు. ఏలయన పతిహతుండైన భటుల ముఖంబుల సంతసంబు గానరాదు గావున వీరి ముఖంబుల ముదంబు గొల్పెడి దిదియునుం గాక వీరు ప్రాణహీనులైనచో ఈపుష్పక విమాన మిందు నిన్ను దోడితేదు. భయంబువలదు నే నసత్యంబాడను. వీరలు మూర్ఛమునింగి జీవించియున్నవారు వీరి ముఖకాంతి మారదు చూడుమా యను త్రిజటంగని సీత తల్లీ నీవుచెప్పినట్లే యగుగాతమని యంజలిగీలించె నంత విమానంబు సీతను యథాస్థానంబుజేర్చుటయు భూపుత్రి రాజకుమారుల దలంచి దుఃఖించుచుండె నిట శ్రీరామువిభుండు మూర్ఛదేరి నెత్తురుగారు మేనితో భూమింబడి యున్న తమ్మునింగాంచి శోకదందహ్యమానుండై

హిందూస్తాని తోడి—రూపకం

ప॥ శ్రీరఘుకుల వీరా సుకుమార శూరా యిల బడితివోర ॥శ్రీ

అ॥ ధీరా నాతండ్రి లక్ష్మణా ! కూరిమియనుజ నిన్ గోల్పోతినకట ॥శ్రీ

చ॥ దురమున నీవిటు సొరిగిపడియున్న ధరణియేటికి ధరణిజ యేటికి
మరి నాప్రాణమేటికి పురుషవర్య భోగభాగ్యమేటికి ॥శ్రీ

(2) సీతకు సమమా నాతిదొరకును నీతో సముడెందు దొరకు సోదరా !
నాతోడునీడ లేవరా ! నవకోసలనిలయ విహార ॥శ్రీ

జో॥:-ఏమందు నమ్మకు సుమిత్రకు నేనేమందును కైకకును
సౌమిత్రి యిచట హతుడైనాడని భరత శతృఘ్నుల కెటు దెల్పుదును ॥జ

(2) అన్నకు సాయంబుగ బొమ్మని నాతోడ అనుజా నిను బంపెను జననీ
యెన్నగ రణమున హతుడయ్యెను నీసుతుడని యెట్లు దెల్పుదును మరినీ ॥జ

(3) అని దుఃఖించుచు సుగ్రీవునిగని తానిట్లనియెను రఘువీరుండు
ఇన తనయ కిష్కింధకు బొమ్మి యిందుండదగదు వేగంబు ॥జ

(4) జేయదగిన దంతయు జేసితివి పాయకనాపై కూర్మిగ
ధీయుత దైవబలంబులేమిచే నాయెనిట్లు శోకింపంగ ॥జ

(5) వానరులార మిత్రకార్యము పూని చేసితిరి మీరు
మానసమున మెచ్చితిపొండి యథేచ్ఛను ఆనతి యిచ్చితి మీకిపుడు ॥జ

(6) అనవిని వనచరులందరు కన్నులు వాయఃనేడ్చుచు నపుడు
తనువులు మరచి దుఃఖాంబుధిని తల్లడిల్లు చుండగను ॥జ

వ॥ ఇంతలో గద ధరించి విభీషణుం డరుదెంచిన ఇంద్రజిత్తను భయంబున కపులు వెఱచి పఱువు లిడుచుండ సుగ్రీవుడు జాంబవంతునిగని యీ వానరులు ఈ విభీషణుని రావణియని పరువిడుచున్నవారు వారల మరలింపుమన నతండట్లు గావించిన వానరులు భీతిమాని యుండిరంత విభీషణుం డటవచ్చి శోకారుణిత లోచనుండై శ్రీరామలక్ష్మణుల జూచుచు,

జో॥:-క్రూరుడు రావణి రణరంగంబున గూలదోసె వీరలను
ధీరుల నుదధిగంభీరుల శూరుల దినకరాన్వయుల వీరులను ॥జ

(2) అని దుఃఖించెడు నావిభీషణుని దనకౌగిటి జేర్చియును
ఇనతనయుం డిటు లూరడించెను దనుజేంద్రా వినుమనుచు ॥జ

(3) పాలించెద వీలంకా రాజ్య శ్రీలం బొందెదవు నిజము
జాలి బొందకుము రామలక్ష్మణులు సప్రాణులు మోదము గనుము ॥జ

(4) అనుచును చెంగటనున్న సుషేణునిగని యిట్లనె సూర్యజుడు
అనఘా రఘువీరుల కిష్కింధకు గొనిపొమ్ము వేగమున నేను ॥జ

(5) రావణు పుత్రమిత్రులతోడ రణమున గూలిచి వేగ
నేవచ్చెదననిబల్క సుషేణుడు భావించిబల్కె విను మనఘా ॥జ

వ॥ రవిజా సంజీవకరణి విశల్య కరణియు దెప్పింపుము వీరలు సజీవు లయ్యెదరు క్షీరాంబుధి ప్రాంతంబునం గలదు మున్నమరగురుం డాయోషధులచే దేవతల ప్రాణంబులు గాపాడెనని పల్కు సమయంబున,

ఆ॥ జలధి ఘోషంబువలె ధ్వని చెలగగాను మింట చరియించు గరుడుని మేనిఛాయ నాగబంధములూడె నానరపతులకు బడియెలవణాబ్ధి నపుడె యాపన్నగములు.

జోర:-ఘనులగు కాకుత్థ్సులగని యలరుచు వినతాతనయుండంత తనువులు నిమిరెను కరమనుర క్తిని వ్రణములు మాననగనంత ॥జ

(2) బల ముత్సాహము వీర్యము తేజము గలిగెను రెట్టింపుగను వెలుగుచుండిరి మేనికాంతుల నలరుచుండి రంతటను ॥జ

(3) వినతాతనయుడు రఘుకుమారకుల బిగికౌగిటంజేర్చ అనియె రాముడిటు లయ్యా నీదయ అహిబంధముల్ వీడెనువేగా ॥జ

(4) నినుజూడగ మా జనకుని గనినటు మా మనము లమరెదే వేడ్యా దినకర తేజంబున నుండెదు నీవెవ్వరో వినుపింపుము ప్రియమలర ॥జ

(5) అనవుడు ఆనందాశ్రులు గురియగ ననె వినతాతనయుడ నీకు అనుగు కింకరుండ గరుత్మంతుడని అందురు విను నాపేరు ॥జ

(6) చనుదెంచితి నిటు రామచంద్ర నే సాహాయ్యము చేయగ మీకు అనిమిషదానవ గంధర్వాదులు ఆపలేరు అహిబంధములు ॥జ

(7) అసురుడిందు తన మాయాబలమున అహిజాలము పుట్టించీ దశరథనందన మిముగట్టు టెఱిగియు తరలివచ్చితిని మరిసీ ॥జ

(8) వీడజేసితిని నాగపాశముల వీరవర్య జయ రామా వోడిమిగనే బోయివచ్చెద పురుషోత్తమ జాగ్రతమీర ॥జ

వ॥ రామా అసురులకు మాయయె బలము మీకు ఋజుత్వమే బలము. రాక్షసుల నమ్మరాదు. నేను కింకరుండ నైతినని దలంపకుము. ఆవిధము యుద్ధానంతర మెఱుంగవచ్చు. బాలురు వృద్ధులుదక్క నీ లంకలో రక్కసుల నందర వధించి శీలవతియగు సీతను దోడ్కొని పురంబుజేర గలవు ఆజ్ఞ యొసంగుము నేం బోయివచ్చెదనని బల్కి ప్రదక్షిణంబు గావించి గగనమార్గంబు గరుత్మంతు డరిగెనంత దాశరథుల గని కపులు సంతోషిత స్వాంతులై గర్జించుచు వాలం

బులు వినరుచు కోయని యార్చుచు శంఖంబులు పూరించుచు మునుపటివలె
రాక్షసుల మార్కొని రంత రావణుం డాకోలాహలంబు విని

జో:-ఏమి హేతువో హర్షంబునకు నీకపీంద్రులకు నిపుడు
రామలక్ష్మణులు ధరబడియుండగ రంజిల్లు టదేమొ గనుడు ॥జ

(2) అన విని కొందఱు జనివేగంబున వనచరులను రఘువరులకా
గని తమగుండె గభిల్లన దనుజులు జని రావణుగని వేగకా ॥జ

(3) శ్రీరఘువీరులు నాగపాశములు చెదరగొట్టి మోదమున
మీరిన సంతోషంబున కపులను జేరినారు వినుమునిన ॥జ

వ॥ రావణుం డామాటలువిని విషణ్ణ హృదయుండై చింతార్ణవంబున మునిగి దరి
గానక హా ఏమిది బ్రహ్మవర ప్రతిపాదితములైన సర్పశరంబు లెన్న డేనియు
వ్యర్థంబులుగా విదేమిచిత్రము అట్టిబాణంబులచే విడివడి రింక నాబలంబెల్లు నన్ను
రక్షించు నమ్మంజాలనని రోషతామ్రాక్షుండై ధూమ్రాక్షుని యుద్ధంబున
కనిపిన వాని కనేకములైన యపశకునంబులయ్యెను వాడునువచ్చి పెక్కండ్రు
కపులతో బోరి హనుమంతునిచే జచ్చె అదివిని దశకంఠుడు వజ్రదంష్ట్రునిబంపె
వాడును వానరసేనతో బోరి అంగదునిచే హతుండయ్యె. అంతరాజాజ్ఞ నకంప
నుండు కదనంబునకు వచ్చి అనేకదుశ్శకునంబుల బొడగని సరకుచేయక యుద్ధం
బుగావించి హనుమంతునిచేగూలె నప్పుడు రావణుండు ప్రహస్తునిబంప వాడును
అపశకునంబులు గణింపక రణంబుగావించి నీలునిచే కాలునిపాలికిం బోయె నది
యంతయు విని రావణుండు శోకాకుల మానసుండై క్రోధంబు వహించి యుద్ధ
సన్నద్ధుండై వెడలె. ననుదాకి జయించువాడెవడు రామలక్ష్మణులన నెంత యని
వచ్చు రావణునిగని రాముడు విభీషణా నానాకేతు వితానములతో వచ్చెడు
నీగొప్ప సైన్యం బెవ్వరిది తెల్పుమన నతండిట్లనియె.

తే॥ అధికమగు సేనలనుగూడి యమరవైరి రావణుఁడు వచ్చుచున్నాఁడు రామ వీఁడె
చూడుమాతని సేనల సొంపు పెంపు ననుచు వేర్వేరఁజూపెను దనుజవరుల.

వ॥ ఇట్లు జూపిన సేనాపరివృతుండగు రావణునిగాంచి యాశ్చర్యంబున శ్రీరాముం
డిట్లనియె.

సీ:-ఔరా వీని తేజము రూపము ధీరత్వంబు బలము శౌర్యము
దేరిచూడగ సాధ్యముగాదు దివిజవరులకు నరులకు జగతిని ॥శ్రీ

(2) శైల తుల్యులు ఆయుధ ధరులు సమరాజేయులు శూరులు వీరు
చాల పరాక్రమశాలులు రావణు జేరివచ్చెదరిదె కదనంబునకు ॥శ్రీ

(3) సీతాహరణ దోషంబున నీ పాతకి దైవవశంబున నాదు
చేతజిక్కె నిక జచ్చును నిజము ఘాతుకుండు కులద్రోహి నీచుడు ॥శ్రీ

వ॥ రామచంద్రుండంత ధనువుగైకొని సంగరంబుచేయ తమ్మునితో నిలచియుండె నంత రావణుం డనుచరులంగని మనమందర మిటవచ్చి యెటింగి యిదె సమయం బని యివ్వనాటులు లంకజొచ్చి ధ్వంసంబు గావించెదరు గావున మీరు లంక జేరుండని యాజ్ఞాపించి మహోత్సవంబు సొచ్చి మానుచందంబున గీశసైన్య సాగ రంబు ప్రవేశించె నప్పుడు సుగ్రీవుడు రోషతామ్రాక్షుండై శైలంబుగొని రావణుపై వైచిన నతండలిగి సునిసిత కార్ముకంబులు విడిచి నతని వధియింప పావక తేజంబును వాయువేగంబుగల బాణంబు లతనిపై వైచిన నవి దారుణం బులై సూర్యసుతుని వక్షంబుదాక నతఁడు కూతవేయుచు క్రిందబడిన రాక్షస సైన్యంబులు అట్టహాసంబు గావించిరంత భానుజుపాటుజూచి శాఖామృగంబులు దశకంఠుని దాకిన నిశితమార్గణంబుల వానరుల తనువులు జల్లెడ కంతలుజేసిన వానరులు భూమిపయింబడి రావణు నెదిరించువారు లేక అగచరులు భీతిలి రాముని శరణుజొచ్చిన ఆ కరుణాపయోనిధి కేల చాపంబుగొని వానితోఁబోర నుద్యుక్తుండై యున్న యన్నకు నమస్కరించి లక్ష్మణుం డిట్లనియె

తే॥ అన్న నాకాజ్ఞయిమ్ము నేనసురుఁజంపి వచ్చెదను నీవు నన్మది మెచ్చునట్లు
అనిన రాముడు సమ్మతిగొనియు ననియె బొమ్ముతమ్ముడ యసురులనమ్మరాదు

తే॥ గాన నీవతి జాగ్రత్తగలిగి మెలగు వాని ఛిద్రంబులను గనుము బాగుగాను
అనిన నన్నకు మ్రొక్కి దా నధికభక్తి వెడలె సౌమిత్రికలనికి వేడ్కమీర.

వ॥ అట్టియెడ లక్ష్మణుండు వచ్చుటజూచి హనుమంతుండు రావణునిగొట్టి వానిచే వేటుబడి దిమ్మదిరిగి మరల వానినొక గుద్దు గుద్దిన నాదెబ్బచే సురారి భూ కంపంబువలె గిరగిరం దిరిగి వచ్చుచుం బోవు ప్రాణంబులతో వ్యధజెంది గాసి పడిన రాక్షసరాజుం గాంచి వనచరసురమునీంద్రులు సంతసించి రప్పుడు రావ ణుడు తెప్పిరిలి హనుమంతునిగని,

డోర:-మెచ్చితి నిన్ను మేటిమగండని మేలుమేలు హనుమంతా
ముచ్చటాయెనన హనుమంతుండనె మూర్ఖా నను మెచ్చెదవేరా ॥జ

(2) వేటిపోటిది రావణ నాభుజబల మేలను ఛీ ఛీ యిపుడు
కాటికిబోవక తప్పిబ్రతికితివి కాల్పనె నాశౌర్యమును ॥జ

(3) ఈతరి నొకపోటున నినుబంపెద యినతనయునిపాలికి నవగ
అతరి దనుజుడు గ్రుద్దిన హనుమ అదరి దద్దరింపా ॥జ

వ॥ రావణుండింతలో నరికి యీసున నీలునిం దాకి నిరువురు జవలాఘవమున బోరుచు అనిలాస్త్రంబు చేకొని యీ యస్త్రంబు నిన్ను విడువదని దాని నీలునిపై ప్రయోగింప నతండు స్మృతిదప్పి భూమిపై బడియె నంత రావణుం డహంకృతితో లక్ష్మణునిదాకి గుణధ్వని చెలగ అడ్డంబువచ్చినవారిని ద్రోయుచుండు వానింగని లక్ష్మణుండు నిశాచరాధమ బక్క కోతుల జంపుట శూరధర్మంబు గాదు నాయెదురనిల్చి కదనం బొనర్పుమన రావణుడు కినుకతో సుమిత్రి పట్టింగని,

జో౯ర:-ఎంత భాగ్యముగల్గెను లక్ష్మణ విపరీతబుద్ధివై యిపుడు
అంతకు చెంతకు బోవవచ్చితివ అమరులు మదిగుందగను ॥జ

(2) అని యిటుబల్కెడు అసురునితోననె వినరా మూఢా నీవు
ఘనబలుండనని ప్రజ్ఞలుగొట్టుచు కారుమాటలాడెదవు ॥జ

(3) ఎరుగుదురా నీబలము ప్రతాపము ఎరుగనివాడనుగాను
శరచాపాదులు సాధనములుగొని సంగరమున కిటురమ్మా ॥జ

(4) అనవుడు క్రోధపరీతచిత్తుడయి అస్త్రజాలములు గురిపింపన్
ఘనుడు లక్ష్మణుం డాశరములను దునిమివైచె వేగమునన్ ॥జ

వ॥ సౌమిత్రియు వానిపై క్రూరనారాచంబులు నిగుడించె నిరువురు నిట్లొకరిపై నొకరు బాణజాలంబులు వర్షింపుచు లక్ష్మణుండంత మూడు బాణంబుల రావణుని గుండె వ్రయ్యలువార నేసిన రక్తసిక్తాంగుండై స్మృతిదప్పి అంతలో తెలివొంది మున్ను తనకు పరమేష్ఠి యొసంగిన అమోఘంబగు శరంబుగైకొని సౌమిత్రిపై వైచిన అది భీమణాకృతిన్ వచ్చి యతనివక్షంబు నాటిన రఘుకుంజరుడు మూర్ఛిలి ధరణి నొరంగె నప్పుడు మేరుమందర హిమాలయాది పర్వతంబుల నెత్తజాలు మహాబలుండగు రావణుడు సౌమిత్రి నెత్తుకపోవ గమకించి యా మహాత్ముని గదల్పలేక పంగటించి పెదవుల బిగియించి అతిబలాఢ్యుడైన సౌమిత్రి నెత్తజాలక పెనగుచుండె నా సమయంబున

హిం:-పరుగునవచ్చి వాయుతనూజుడు పంక్తికంఠుని రొమ్మున దన్నిన
జరజర నెత్తురుగారగ నసురుఁడు చేష్టలుదక్కి సోలెను రథమున ॥శ్రీ

(2) దశకంధరు డరచావు చచ్చిన ఋషులును సురలు సంతోషించిరి
పొసగగ కపు లుప్పొంగి గంతులిడి భూరిబలుండని అనిలజు బొగడిరి ॥శ్రీ

(3) అంత సుమిత్రానందను హనుమ ఆదరంబున కరముల నెత్తుక
సంతోషంబున శ్రీరఘురాముని చెంత నిలిపెను శీఘ్రంబునను ॥శ్రీ

(4) సరసిజాసనుని శక్తియు నప్పుడు సౌమిత్రిని విడిచిపోయె నంతట
నరవరతనయుడు బడలికదీరి సురుచిరలీల లేచెనప్పుడు ॥శ్రీ

వ॥ అంత సురవైరి తెప్పిఱిలి కార్ముకంబు ధరియించి మరల కయ్యంబునకు గడంగ
నప్పుడు

జోర:-మారుతి నధిరోధించి రాముడు పారజూచి రావణుని
ఓరి నిశాటా నిలునిలు నిచ్చట పారిపోకుమిక మూఢా ॥జ

(2) ఎందు జొచ్చినను విడువను దుష్టా యిపుడే నినుబట్టియును
గొందును ప్రాణముల్ పొంగెద వేల క్రూరా దివిజులు జూడగను ॥జ

(3) అసురాధమ యెవ్వని మూర్ఛలజేసితి నని త్రుళ్ళెద వౌర యిపుడు
అసమానబలుండు నీతో నిప్పు డనిసేయవచ్చెడు గనుము ॥జ

(4) జనస్థానంబున నెనిమిదారువేల్ దనుజుల దుంచుట వినవే
మనుజాసన నీ మదగర్వంబు మాన్పెద గనుమా యిపుడే ॥జ

వ॥ రఘురాముండిట్లు వలుక రావణుం డాగ్రహంబున ప్రళయకాల సన్నిభంబు
లగు బాణంబుల బ్రహరించిన రోషారుణిత లోచనుండై అనేక మార్గణంబుల
దశకంఠుని గాత్రంబు వ్రణితంబు గావించి వాని ధ్వజవాజి ఛత్రసూతాదుల
దునిమి అస్త్రశస్త్రంబులన్నియు తుత్తుమురుగావించి ఘోరనారాచంబుల
వాని వక్షంబు నాటవేసియ నెట్టివారికైన చలింపని వీరుడు రామబాణార్తిచే
వడకుచు ధనువువిడిచి వీతచేష్టుండై కొంతవడికి లేచి

జోర:-కోరలుదీసిన పామన వేడి యారిన యర్కుఁనివలెను
ధారుణి నిలచె నిరాయుధుడగుచును దనుజుడు మదముడిగియును ॥జ

(2) దయామయుండగు రాముడు యుద్ధధర్మము దలచియు నపుడు
భయవిహ్వలుఁడై యున్నవానిగని బల్కెనిట్లు రాఘవుడు ॥జ

(3) ఇంతదనుక కదనంబున నిను హతవీరునిగా జేసితినీ
ఎంతయు డస్సినవాడ వనుచు నిను విడిచితి మూర్ఖా యిపుడు ॥జ

(4) పొమ్మీ లంకకు నాజ్ఞయిచ్చితిని బోయి సేదదీర్చుకొని
రమ్మీ పదపడి కదనంబునకు రథికుడవై విలు బూని ॥జ

(5) చూచెదవపుడు నాదగు శౌర్యము శూరత్వము గలదేనీ
నీచా! దుర్మతి ఛీ ఛీ యన నట నిలువక పరువిడె పురికి ॥జ

(6) దారుణ కర్ముండగు రావణు డిటు దర్పముచెడి పురి జొరగ
శ్రీరఘువరుడు తమ్మునితో హరవీరుల శ్రమలుడిపెను దయచేకూర ॥జ

(7) సంతోషించెను సర్వభూతములు సాధులు మౌనులు యపుడు
మంతనములను బొగడుచు రాముని చింతవీడి రమరులును ॥జ

(8) రామశరంబుల దలచి దలచి యట రక్షోవీరుడు మరియు
వేమరు భీతిలి మేనుసోకినటు రామబాణముల మది గనియు ॥జ

(9) తోడి రాక్షసులతో నిట్లనె నతిదుఃఖంబున నూర్పులు మీరా రా
వీరులార శ్రీరాముని శౌర్యము వినగ నభయమగునని లోనా ॥జ

యదుకులకాంభోజి — ఆది

ప॥ వినుడీ శ్రీరాముని బలశౌర్యముల రక్షోవీరులార మీరు ॥వి

అ॥ సునిసిత శరము లెటుజూచిన నా తనువున నంటెను దలకెడు నామది ॥వి

చ॥ అకటకట నాతపమంత వ్యర్థంబయ్యె వికలంబై పోయె మనసు
ప్రకటితముగ నామహేంద్రుని గెల్చిన బలశాలి నేనిటు భంగపడితినయ్యో ॥వి

(2) మానవు భయము మర్త్యునిచే నీ కనుచు పూని మును పల్కె బ్రహ్మ
గాననాకిపు డీ కష్టముగల్గెను భూనాయకుండై హరి బుట్టె నను దుంచ ॥వి

(3) వరములుగొనుతరి నరులగణింప నైతి నెరుగనైతి నిటులౌట
పరికింప నిపుడు నాప్రాణహరణమునకు ధరణిజదెచ్చి నే యురివేసికొంటిని ॥వి

(4) కాలమెంతకు దెచ్చె కదనంబున నరుడీ లీలదర్పోద్ధతుడై
కాలుని పోలిక దూలగొట్టె నను శ్రీలోలుడు నవకోసలనాథుడు ॥వి

జోర:-మనకులోత్తము డనరణ్యుడు అనిలోగూలుచు నపుడు
దనుజాధమ విను మాకులంబున జనియించియు శూరుం డొకడు ॥జ

(2) నిను వధియించును పుత్రమిత్రులతో నేలను గూలెద వనుచు
జనియె దివమున కామాట సూటిగ సంభవించె నా కిపుడు ॥జ

(3) ఇదిగాకను మును వీరతపస్విని వేదవతిన్ మునికన్యన్
మదినొవ్వగ నవమానించితి గావున సుదతీమణి యీరీతిన్ ॥జ

(4) నీకులంబు నిర్మూలము చేసెద నీచా ! యని శపియించెన్
ఆ కమలాక్షియె సీతయగుచును నీకరణిబుట్టె ననుజంపన్ ॥జ

(5) గిరివరసుత రంభావరుణిని కన్యయు మరి శపియించిరి నన్నిట్లు
జరుగుచున్నది ఋషులవాక్యములు స్థిరములయ్యె నది యిపుడు ॥జ

వ॥ శాపకారణంబుచే నిట్లు జరుగుచున్నది నే నెరుంగుదు అయినను మీరలు జాగ్రత్తగలవారలై పట్టణంబుగాంచి యుండుడు

కం॥ పాపవర్తనుండు పలలాశి యిట్టులు తాపమునను బొరలి తల్లడిల్లి
కోపమొదనుమీరి కుంభకర్ణుని నిద్ర లేవుడనియె నసకు బ్రాపుగాంగ.

వ॥ అహా ప్రహస్తుడాదిగాగల యుగ్రరాక్షసులు హతమైరి నేను పరాజితుడనైతి నింక నాకెవరుదిక్కులేరు గావున ఘటకర్ణుండొక్కడే శాత్రవుల హతంబు గావించునని పల్కి

జోర:-కాలచోదితుడనై నేనిపుడీ లీలనుండు టెరుగకను
వాలాయము నిద్రించెడు హాయిగ మేలుకొలువవలె వేగంబునను ॥జ

(2) అతడు మేలుకొని వచ్చినంత నా కాపదలన్నియు దీరున్
సీతాపతిచే బడిన బన్నములు చేరి తొలగు సుఖియింతున్ ॥జ

(3) వాసవతుల్య బలుడుండియు నాగాసి మాన్పకున్న
వాసిగ నాకతడుండియు లేదని యాశ విడతు నిక్కముగా ॥జ

వ॥ రావణుండిటు వచింప రక్కసులు భక్ష్య భోజ్య పానీయంబులుగొని యెటుజూచి నను యోజనాయుతంబగు కుంభకర్ణుని గుహజొచ్చి వాని నేశియూర్పులకు

మోములువాడ విషసర్పంబువలె బుసగొట్టుచు నిద్రించు కుంభకర్ణుని గాంచి మేరుమందర తుల్యంబులగు మహిషాది మాంసంబులను మద్య రక్త ఘటంబులను పక్కనిడి గంధమాల్యాది పరిమళ ద్రవ్యంబుల నిమిరి ధూపంబులు వేసి పణవ భేరీశంఖ నినదంబులు భూనభోంతరములునిండి ప్రతిధ్వనులియ్య సింహనాదం బులు గావించిన నయ్యసురుండు మేల్కొనడయ్యె నంత అసురులు బల వంతులయ్యును విసిగి వేసరి వాని నాసికారంధ్రముల వెడలు సమీరంబునకు నిలువజాలక నిశాటులు భూరినాదంబులు జేయుచు అంకుశంబుల బొడిచియు, కట్టెలతో గొట్టియు గుఱ్ఱంబుల ద్రొక్కించియు ఇనుపగుదియల కత్తుల గండ్ర గొడ్డండ్ర సుత్తెల నడచియు, బొడిచియు లేవకున్న గొరుకుచు తలవెండ్రుకలు బట్టి లాగుచు కర్ణరంధ్రముల జలంబులుబోయుచు భేరులుగొట్టుచు మదించిన ఏనుగులచే ద్రొక్కించిన నీల్గి దోమసోకినట్లు మేల్కొని కన్నులుదెరచి ఆవ లించి కాలుచేతులాడించి నోరుదెరచి అచ్చటనున్న మద్య మాంస భక్ష్య భోజ్యాది పదార్థము మెక్కి తృప్తుడైయున్న వానింగాంచి డాగియుండిన రక్క సులు చుట్టునిలచినవారింగని కుంభకర్ణుడు, నన్నేల నిద్రలేపితిరి రావణున కేమిభయంబువాటిల్లె నన యామాత్యుం డతని నిద్రలేపిన కారణం బెఱింగించి రావణునిజూడ వేగమరమ్మన నతండరుగు నెడ శ్రీరాముడు విభీషణునిగని యీ తండెవ్వడు ఎఱుంగింపుమనిన ఈ మహాబలుండు కుంభకర్ణుండని దెల్పుచుండ నతండు రావణునిజేరవచ్చె నప్పుడు నీలునిగని రామవిభుండు నీవు కుంభ కర్ణునితో సమరంబునకు సన్నద్ధుండవై యుండుమనె నంత కుంభకర్ణునిజూచి రావణుడు తనపాటంతయు నెఱింగించిన కుంభకర్ణుం డిట్లనియె.

హిం:-దురితము చేసినవారలు వినుమ నిరయంబున బడుచుందురీతిగ
అరయగ నీవొనరించిన పాపఫలము అనుభవించెదవు చేసేతను మరి ॥శ్రీ॥

(౨) తొలుతను నీవు ఎవ్వరితోను జలుపవు యోచన శౌర్యమదంబున
దలపవు విపద్దశ గల్గుననుచు మది దానవాధిపా ధర్మమెరుంగవె ॥శ్రీ॥

(౩) మును నీకనుజుడు దెల్పినట్టి యాపనిజేయుమి యది పరమ హితంబౌ
వినుమా నామత మిదియేగాన నీ మనసెటులోయటు జేయుమావల ॥శ్రీ॥

వ॥ అని హితంబు వల్కిన ఘటకర్ణునిగని దశకంఠుడు కోపించి బొమలు ముడివడ నిట్లనియె. సకల సద్గుణ గరిష్ఠుండైన యాచార్యునివలె నను శాశించెదవా చాలు చాలు నీయుపన్యాసంబు తెలియమిచేతనో పొరబడియో గతించిన పనికి వగవం బనిలేదు నాపై నీకు స్నేహంబుగలచేని శౌర్య సాహసంబులుజూపి నావిపద్దశ తొలగింపు మన కుంభకర్ణుం డిట్లనియె

డోర:-చాలును నీమది తపియింపకుమిటు సంతసింపుమో రాజా
వాలాయము శ్రీరామ లక్ష్మణుల వధియించెద కపులను రవితేజా ॥జ

(2) అనుభవింపుము నీమది కోర్కెల ఆనందంబున నిపుడు
జనియెద నేను కదనంబునకు శౌర్య ధైర్య వీర్యము లడరగను ॥జ

(3) రాముడు నన్ను రణమున దునిమిన రావణ విడువడు నిన్ను
శ్రీమహితుడు హతమొనరించును వేగ జెప్పితి నిక్కము నమ్ము ॥జ

(4) రమణీమణియగు సీతనుగూడి రామవిభుడు ముదముననను
అమితోత్సాహముమీర సౌఖ్యముల ననుభవించునని బల్కగను ॥జ

వ॥ మహోదరుండంత కుంభకర్ణుని పల్కులు ఖండించి నేనొక్కడనే కదనంబున తమ్మునితోడ రాముని వధించెదనని అనేక ప్రగల్భంబులాడ ఘటకర్ణుండు వాని నిందించి అన్నచే నను జ్ఞగొని యుద్ధంబునకు వెడలి కపిసైన్యంబుపై గవిసిన వానరులు భయభ్రాంతులై పరువిడుచున్న అంగదుండు వారల కిట్లనియె

తే॥ బలపరాక్రమశాలులు ప్రాణభీతి వెరచి పరువిడదగ దిటు మరలిరండి
అనిన ధైర్యంబునను కపు లసురుదాకి నిలువజాలక పఱచిరి నిమిషమచట.

వ॥ కుంభకర్ణుం డంత వారలంబట్టి మ్రింగుచున్నంత కొందరు ముక్కులనుండి మరి కొందరు చెవులనుండి బయట వచ్చుచుండి రంత అంగదుండు వానితో బోరి వినంజ్ఞుండై నేలం బడియె నప్పుడు సుగ్రీవుండును యుద్ధంబుజేసి మూర్ఛిల్లిన కుంభకర్ణుండు వాని నెత్తుకొని ప్లవగవిభుడు నాచేజిక్కె తక్కిన వానరులం దరు జిక్కినట్లెయని సంతసించి లంకకు బోవుచుండ కపులందరు చెల్లాచెదరై రంత హనుమంతుం డిట్లు యోచించె. అసురునిచే సుగ్రీవుండు జిక్కె విడిపించుట యెట్లు. అయినను సైన్యము చెదరకుండునట్లు చేసెద అతని కతడే తప్పించుకొని వచ్చునని బెదరిన వనచరులం జేర్చుచుండె ఘటకర్ణునిచేత జిక్కిన సుగ్రీవుం డెట్టకేలకు మూర్ఛదేరి రాజమార్గంబున తన్నెత్తుకొని బోవుటగని వీని కేమి ప్రతీకారంబు చేయుదునని వాని ముక్కుచెవులు గొరికి చంకనుండిజారి పైకెగసి శ్రీరాముని సన్నిధి జేరెనప్పుడు

డోర:-మత్తుండై యాకుంభకర్ణుడు మరియు వనాటుల మ్రింగక
మొత్తంబుగ శైలంబులు తరులు నెత్తివేసి రసురుని మీదక ॥జ

(2) చుట్టును జేరియు కపులు దనుజుని బట్టి యూగుచు నపుడు
దిట్టుచు పైబడి గొట్టుచు రక్తం బట్టె స్రవించగ నపుడు ॥జ

(కి) అంతట వాడు నూర్వుర నూర్వుర అట్టే దిగమ్రింగుచును
పంతసమునను మ్రింగగ కపులు శరణు జొచ్చిరి శ్రీరఘురాముకే ॥జ

వ॥ అదిగని లక్ష్మణుండు క్రూరబాణంబుల వానింగొట్టిన లక్ష్మణు వలనుంజూడక రాముని గదిసిన శ్రీరాముడు రౌద్రశరంబుల వానివక్షంబు గొట్టిన అదరి నోరు దెరచి గగనంబు పగులునట్లు భయంకరారావంబున అరచుచు ప్లవగవీరులదెస పొరలి దరుముచు రాముని బాణమ్ము లురమ్మున నాట చేతికైదువు జారి నేలం బడిన కాలంజేతుల యుద్ధంబు గావించుచు అంతకాకారుండై

తే॥ పర్వతం బొండు శ్రీరాముపైన వేయ దాని చూర్ణము గావించె దనుజవైరి
అంత వానరయూధంబు లతనిపైని నెక్కత్రొక్కిరి క్రోధంబు పిక్కటిల్ల

తే॥ తనువు విదలించి వారల ధరణిద్రోయ గనియు శ్రీరామచంద్రుండు ఘనశరముల
దనుజు విదళించి దరిమియు మనుజవిభుడు బలికె మూర్ఖుడ నిన్నిప్డు బట్టిద్రుంతు

తే॥ రమ్ము దుఃఖంపవలదు నేరాఘవుండ చాపమూనియు వేగ నిన్ జంపువాడ
కాలుపాలికి బంపుదు లీలననగ అట్టహాసంబుజేసి వా డనియె నిట్లు

హిందూస్థాని తోడి - ఏక.

ప॥ కుంభకర్ణుడ ఘోరరణశూరుడ వినుము శ్రీరామచంద్ర ॥కుం

అ॥ జంభారి వినుత సంగ్రామముననా సరసనిల్చిపోర శౌర్యమున్నదె దెల్పు ॥కుం

చ॥ కాను విరాధుడ గాను ఖరుడ గాను నేవాలియు గానుకబంధుడ
మానవేంద్రనను మార్కొనలే రెవరు మౌనీంద్రపూజిత నవకోసలవాస ॥కుం

వ॥ రామా ముక్కుచెవులు లేవని నన్ను హాసింపవలదు యవి తెగిపోయిన నాకు బాధలేదు నా బలంబుజూపి నీబలశౌర్య విభవం బేను గాంచెదనన శ్రీరాముడు వాయువ్యాస్త్రంబుచే వాని కాలుచేతులు ఖండించిన నతడు పొరలి పొరలి రామునిపై బ్రాకుచుండ ఐంద్రాస్త్రంబు సంధించి వేసిన కుంభకర్ణుని శిరంబు కుండలంబులతోడ ధరణిగూలె నప్పుడు యప్పురంబులోని గోపురంబులు గృహాంబులు కొన్ని వానిశిరంబుక్రిందబడి చూర్ణంబులయ్యె దేవ బ్రాహ్మణద్వేషి నీల్గినంత దేవతలు హర్షించిరి రాక్షసులు దుఃఖించి రట్టియెడ హతశేషులు రావణున కీవృత్తాంతం బెరింగించిన దుఃఖార్ణవ మగ్నుండై

జోర:-వీరరత్నమా హతమై యిప్పుడు జేరబోతివా యమునీ
కూరిమి విడచుట నాయమ నాదు కూరిమితమ్ముడ మరినీ ॥జ

(2) అని శోకింపగ త్రిశిరాది రాక్షసులు దనుజేశ్వర దుఃఖింపకుమా
మనుజేశ్వరుని సైన్యయుతంబుగ దునిమి వచ్చెదము గనుమా ॥జ

వ॥ అని బల్కి దుఃఖోపశమనంబు గావింప రావణుడు దేవాంతక నరాంతక అతికాయ త్రిశిర మత్త యుద్ధోన్మత్తులగు వారిని యుద్ధంబునకుబంపిన వారు వెడలివచ్చిరంత వానర రాక్షససేనలు గలసి ద్వంద్వయుద్ధంబుగావించి రప్పుడు అంగదునిచే మహోదరుండు హనుమంతునిచే దేవాంతక నరాంతక త్రిశిరుడు నీలునిచే మహోదరుడు ఋషభునిచే మత్తుడు హతంబై రంత అతికాయుండు

ద్విర:-తనతోబుట్టులు పినతండ్రులు దెగ తల్లడిల్లి వేగమున
ఘనుడసురుడు శరవర్షముగురియుచు వనచరుల దరుమగ నంత ॥జ

(2) మరలివచ్చెనో ఘటకర్ణుండని మదిలోభీతిలి వేగ
పరువిడి రాముని శరణుచొచ్చి రాప్లవగులు దుఃఖముగదురా ॥జ

(3) అంతట రాముం డతికాయునిగని యనియె విభీషణుతోడ
వింతగొల్పెడు ఘనకాయుడు వీడెవ్వడు తెల్పుమి యనిన ॥జ

(4) రామా యీతం డతికాయుండు రావణాత్మజుడు వినుమా
భీమబలుండు తండ్రినిబోలును భూమీశా రణశూరుండు ॥జ

(5) పరమేష్ఠిని మెప్పించి తపంబున బడసెను దివ్యాస్త్రములు
సురల కజేయుడు అస్త్రవిత్తముడు దారుణకర్ముండితడు ॥జ

వ॥ దేవ రాక్షసులకెల్ల మేటియైన వీని వధియింప శీఘ్రంబున యత్నంబుగావింపు మను నంతలో వాడు భూచక్రంబు గంపింప భూరిశరంబుల హరివీరుల నొప్పించిన వారు విచ్చలవిడి పారిపోవ దొడంగిరి. అతికాయుండు సుమిత్రిపట్టి చెంతజేరి గర్వంబుమీర నీసేనలో నాతోయుద్ధంబుజేయ సమర్థుండుగలడేని నిలువుండనిన లక్ష్మణుండు వానికెదురునిల్చి రక్కసులగుండె లదుర జ్యాఘోషం బుగావింప అతికాయుం డతివిస్మితుండై యిట్లనియె

ద్విర:-బాలకుండవు రణముసల్పగజాలవు నాతోసరిగ
కాలునిపాలికి బోవవలదుపో గాదనిన నిల్వు నాకెదుర ॥జ

(2) అని నా రాచము వింటగూర్పగ విని సౌమిత్రియు నపుడు
మనమున రోషము పొంగ నంత నా దనుజునితో నిట్లనెను ॥జ

(3) దురమున నీదు శౌర్యముజూపుము దుర్మద జల్పమిదేలా
కరమున శరములదాల్చి నిల్చితి కదనముజేయగ నే నసుర ॥జ

(4) బాలుడనుచు హేళన సేయక బాలుడనో వృద్ధుడనో
నా లాఘవము నీకిపుడు గూల్చెద పరీక్షింపుము బాలిశయనుడు ॥జ

(5) అతికాయుం డతి రోషవివశుండై అస్త్రజాలములు వర్షింపగ
వరుసగ ఖండించుచు సౌమిత్రి శరవర్షము గురిపింపగ ॥జ

వ॥ ఇట్లిద్దఱును అనేక దివ్యాస్త్రంబు లొకరిపై నొకరు వేయుచు పరస్పర జయకాంక్షం బోరు సల్పుచున్నంత లక్ష్మణుం డుగ్రమూర్తియై వేనవేలు శరపరంపర లతికాయునిపై నేసిన నవియన్నియు వాని బాధింపక భూమిం బడి వ్యర్థమగుచుండ పవనుండు లక్ష్మణుం గాంచి వీడు బ్రహ్మాస్త్రంబునం గాని జావడు బ్రహ్మవరం బిడినగాన బ్రహ్మాస్త్రంబు వేయుమనిన సౌమిత్రి చాపమున బ్రహ్మాస్త్రంబు సంధించి విడిచిన వాడు జగియక దారుణాస్త్రంబులు బరపిన వానినన్నింటిం భస్మంబు గావించుచు

తే॥ అంత ప్రళయాగ్నివచ్చి కాలాగ్నివలెను గూల్చె నాతనితల ధర ఘోరముగను
బ్రహ్మాస్త్రమది రక్కసుల్ పశువులిడగ కపులు పూజించి సౌమిత్రి గదిసి పొగడ

తే॥ అంత వను కేగు సుతుండిటు హతుండాయెగుటవినియు దుఃఖంబు మీరగ నని యొనిట్లు
ఘోరవిక్రములు శూరులు వీరవరులు బోవుచే కాని రాగ్గ్రెది పొలిసిరకట.

బిలహరి — ఆది.

ప॥ శ్రీమన్నారాయణుం డవతరించెను శ్రీరాముండై రఘువంశమున ॥శ్రీ

అ॥ భూమిభారము దీర్ప పుండరీకాక్షుడు భూరివిక్రముడు పురుషార్థ్యత్ముడు ॥శ్రీ

చ॥ మునిసేవితుడు అసురసంహారుడు శూరుడు ధీరుం డతిగంభీరుడు
ఏకుడు నవకోసలపురవిహారుడు వరముడు శాంతుడు సర్వశరణ్యుడు ॥శ్రీ

వ॥ రావణుండిట్లు దలపోసి లంకాద్వారంబుల కాపుండ నియమించి తమ్ములు తన యులు దెగిన శోకంబున వివశుండై యున్న తండ్రినిగని ఇంద్రజిత్తు.

జోర:-తనయుడ నేనుండగ జనకా నీవిటు వనటగుందగనేలా
మునిసితశరముల రాము లక్ష్మణుల దునిమెద సందియమేలా ॥జ

(2) అని యహంకారబల్కియు దశకంఠుని యాజ్ఞనుచేకొని యపుడు
దనుజవీరుడు యుద్ధమునకు జనవలయు పౌరుషమునను ॥జ

వ॥ ఇంద్రారియు నల్లమేకమాంసం బగ్నిలో హోమంబుగావించి యాదేవుని తృప్తి బరచి అగ్నిదత్తి సైంధవ చాపంబులుగైకొని రథంబుపైనెక్కి దివికెగసి అదృశ్యుండై రక్కసుల బురికొల్పిన వానర దానవులకు పోరు ఘోరంబయ్యె నింద్రారి సుగ్రీవాది వనచరులను రామలక్ష్మణుల బాణవర్షంబునముంచిన పెక్కండ్రు వానరులు హతులయిరి. అత్తఱి శ్రీరాముడు తమ్మునిగని

తే॥ పరగ బ్రహ్మాస్త్రబలమున ప్రబలి వీడు మనల పీడించుచున్నాడు మారులేక
కలన వీనివధింపగగలమె యెట్లు అజుని బాణంబు వారింప నలవియగునె

వ॥ అని వల్కుచుండ జాంబవంతు ననుజ్ఞచే నాంజనేయుండు సంజీవిదెచ్చిన దానిచే వానరులు పునర్జీవితులై సుగ్రీవునాజ్ఞ కపివరులు లంకగాల్చి మెలంగుచుండ అకంపనుఁడు ప్రజంఘునుడును కుంభనికుంభనులు యుద్ధంబునకువచ్చి అంగదునిచే అకంపనుండును ప్రజంఘునుండును సుగ్రీవునిచే కుంభుండును హనుమంతునిచే నికుంభుండును శ్రీరామునిచే మకరాక్షుండును హతులయిరి. అంత ఇంద్రజిత్తు మరల కపిసైన్యంబుల శ్రీరామ లక్ష్మణులను అదృశ్యుండై నొప్పించు నతండు మాయసీతను నిర్మించి హనుమంతుండున్న దిక్కునకేగి యతడు చూచుచుండ నా మాయసీతను వధించిన హనుమంతుండు రణంబు చాలించి శ్రీరాముని సన్నిధి జేరబోవుచు

తే॥ రామచంద్రునిసతిజంపె రక్కసుండు పరగ నసురుల జంపిన ఫలమికేమి
అనుచు జింతించుచును బోవునవసరమున జేరి యింద్రారి నికుంభిల శీఘ్రముగను

వ॥ రాక్షసుల కావలియుంచి హోమంబు గావించుచుండె మరియు రాక్షసుల భీషణారావములు మిన్నుముట్టె నప్పుడు శ్రీరాముడు జాంబవంతునిగని ఆంజనేయుడుండు దిక్కున రక్కసుల ధ్వనులు మిక్కుటంబయ్యె గావున నీవతనికి తోడుపొమ్మన నతండటు పోవునప్పుడు హనుమంతుం డెదురై నిలువుమని యిరువురు శ్రీరామవిభుని జేరి అతిశయితంబగు దుఃఖంబున

జోర:- రామా మేము పోరుచునుండగ రక్షోవీరుం డిపుడు
భూమితనూజను దెచ్చివధించెను భువనరక్షణా వినుము ॥జ

(2) అనవిని రాముడు అధికశోకమున అవని వ్రాలెనంత
వనచరులందరు దుఃఖాంబుధిలో మునిగిరి విడువని చింత ॥జ

(౩) ఘనుడు లక్ష్మణుడు శోకించుచు రాముని గాగిలించి ప్రియమునను
అనఘా నీవు ధర్మరతుండవు మనుకుల వర్ధన వినుము ॥జ

(4) ధర్మాచరణము వ్యర్థమనుచునే దలచెద మదిలో దేవా
ధర్మముకంటె ధనమే ఘనమగు దాశరథీ రఘురామా ॥జ

(5) ధనవంతుండే బలవంతుండు ధనవంతుడె ధర్మరతుండు
ధనహీనుడు దలపోసిన కార్యము కొనసాగదు నిక్కము గనుము ॥జ

(6) పాపవర్తనులు సకల సౌఖ్యములు బడయుచుందు రిలనెపుడు
ఆపదలను గుందుచు కష్టంబుల ననుభవించెదరు ధార్మికులు ॥జ

(7) జనకుని నీవు సత్యవాదిగ జలుపబూని శ్రీరామా
ననుజుడు సీతను గొనిపోవగ కష్టము లనుభవించెదవు గుణధామా ॥జ

(8) గతమేటికి నింద్రారికి ప్రతిక్రియ గావింపుము రఘువీరా
హితమతి వాని వధింపగ నన్ను వేగబంపుము ధీరా ॥జ

వ॥ మహాత్మా రథాశ్వకుంజర సహితంబుగ రక్షోవీరుల హతంబుగావించి వచ్చెద నని అన్న నూరార్చుచుండ నచ్చటికి మంత్రులుగొల్వ విభీషణు డరుదెంచి వానర సహితంబు కనులనీరుగారు సౌమిత్రిని వ్యసనార్తుండగు శ్రీరాముని గని శోకించుటకు కారణం బేమనిన లక్ష్మణుం డిట్లనియె

దో:- అవనీవరసుత యింద్రజిత్తుచే హతయయ్యె ననుచు నిపుడు
పవనాత్మజు డెఱిగింప రాముడు పరితపించు నిటులనుడు ॥జ

(2) మనుజేశ్వర నమ్మగరా దనుజుని మాయోపాయం బిదియు
జనకజ జంపడు నొంపడు రావణి సత్యము నమ్ముము మరియు ॥జ

(3) ఎంత వేడినను నావాక్యములను వినడయ్యెను మూర్ఖుండు
పంతగించెను సీతనియ్యనని పరమపాపి రావణుడు ॥జ

వ॥ రామా సామదానభేద దండోపాయంబులచే సీతిచెంతకు బోయి జూడజాలరీ రక్కసులు గాన యింద్రజిత్తు మాయాజాలంబున కపులతో మిము మోహ పరచి నికుంభిలజేరి హోమంబు గావించు చున్నవాడు. అది పూర్ణమైన వాని నింద్రాది దేవతలకైనను జయింప సాధ్యంబుగాదు గావున హోమంబు విఘ్నం బు గావింప వానరుల బంపుము. దుఃఖంబు మానుము. ఈ మేఘనాథుండు జెగిన రావణుండు హిత బాంధవులతో హతుండయ్యెనని దలంపుమనిన శ్రీ రాముడు సౌమిత్రినిగని,

తే॥ అఖిల సైన్యంబులనుగూడి యనిలసుతుని జాంబవంతుడు నీ విభీషణునితోడఁ
బోయి సవనంబు జెఱిపియు పోడిమిఁగను అతని వధియించి రావయ్య అనుజయనిన

వ॥ లక్ష్మణుండంత యుద్ధ సన్నద్ధుండై కవచంబు ధరించి ఖడ్గ శరాది సాధనంబులు
గొని అన్న పాదంబులకు ప్రణమిల్లి యింద్రజిత్తు వధించి వచ్చెదనని బలికి
అంగద హనుమ జ్జాంబవత్ప్రముఖ వానరవీర పరివృతుండై విభీషణునితోడ
నికుంభిలకుఁజని దూరంబున విశాలంబుగ శత్రుభయంకరంబై దీప్తిమంతంబునై
యున్న యారాక్షసవీరుని సైన్యంబుగని విభీషణుండు లక్ష్మణునకు జూపి,

జోర:-అనఘా గనుమీ సేనలమధ్య అతిక్రూరుడు ,వంచకుడు
దనుజేంద్రుని తనయుడు సవనము జేయుచు గనుపించక నున్నాడిపుడు ॥జ

(2) గావున పాయలుపాయలుగాను సేనల బడగొట్టుము వేగ
దేవా గననగు దివిజవైరిని దినకరాన్వయా యనగ ॥జ

వ॥ అంత లక్ష్మణుండు అరిసైన్యంబుల చెల్లాచెదరు గావించు చుండ కపిసైన్యంబు
లాగ్రహంబున బోరుచుండ హనుమంతుండు దనుజసేనల నురుమాడు చుండ
నప్పుడు ఇంద్రజిత్తు హోమంబు చాలించి రథారూఢుండై హనుమంతుని దాకి
సకలాయుధంబులు ప్రయోగింప నతండవి దట్టివైచె నప్పుడు విభీషణుండు
సుమిత్రానందనునిగని,

జోర:-కవిసిన వాడిదె హనుమంతునిపై కడురోషముతో నిండారి
జవమున నీదు తీవ్రశరంబుల సంహరింపుమి యిపుడు ॥జ

(2) కనుమా వటవృక్షంబదె లక్ష్మణ దనుజాధిపుసుతు డిచట
ఘనముగ సవనముగావించెడుతల మచటికి జనకుండగ జంపుము వేగమున ॥జ

(3) అనవుడు లక్ష్మణు డటులనె యనుచు గుణధ్వని గావింపగను
అనలవర్ణమగు నరదము నెక్కి జనుదెంచె లక్ష్మణునకెదురు ॥జ

(4) వచ్చిన దనుజుని గని లక్ష్మణుడనె వచ్చితిరా నినుజంప
కుత్సితుడా నీమాయలింక నిట కొనసాగవు దుర్మద పోపోరా ॥జ

(5) అనిపల్కెడు సౌమిత్రిమ్రోల తనపినతండ్రిని గనుగొనియు
కనుఁగవ నిప్పులురాల కోపమున మనమెఱియగ రోషముతోను ॥జ

(6) అనుజుడ నీవు నాజనకునకు పినతండ్రివిగావున నాకు
దనుజాధమ ననుజంపగ నీమది దలచితి క్రూరముగాను ॥జ

(7) తనవారల విడనాడియు వైరుల దగ్గరజేరియు నీచా
వనమున ప్రేమముమాని స్వజనముల మరణము గోరెదవారా ॥జ

(7) అని యిటులాడెడు అన్నకుమారున కనియె విభీషణుడిటులు
గుణమున నేను దనుజుడగాను గుణము ప్రధానము గనుము ॥జ

(9) పరధనముల పరదారల సతతము హరియించెడు పాపాత్ముల్
అరయగ ధర్మరతుండెటు వాని ననుసరించుకెటు క్రూరాత్ముల్ ॥జ

(10) అనుచితమైనవాక్కు లాడునే అన్నయైన వాడిటులు
అనుజునివెడలంగ గొట్టునె సభలో అంధుండై గర్వముతోను ॥జ

(11) చేటుకాలమువచ్చెను నీవిక చెసెదవేమి చెపుమి
యేటికి రజ్జులాడెద విపుడె యిలగూల్చు లక్ష్మణుడు వినుమి ॥జ

(12) జనుటిక కల్ల సైన్యముతోడ దనుజాధమ లంకకు నిపుడు
ఘనుడులక్ష్మణుని భూరిశరంబుల కాలునిపురి చేరెదవు ॥జ

వ॥ ఇంద్రజిరి యామాటలాలించి కోపించి ప్రళయాంతకునివలె గన్పట్టుచు, ఆయుధధరుండై హనుమంతునిపై నారోహించియున్న సౌమిత్రినిగని ఘోరనారాచవృష్టిని పై గురిపించుచు,లక్ష్మణా! నీవారలతో నెట్లునిల్చెదవో చూచెదగాక! అహిపాశబంధంబుల జిక్కియుండుట మరచితివా! లేవై యమునిమందిరంబు జేరబోవ వచ్చితివేయన క్రుద్ధుండై లక్ష్మణుండిట్లనియె నిశాచరా! నిన్ను నీవె పొగడుకొనుచు ప్రగల్భంబులాడెదవు చోరునివలెడాగి యుద్ధంబుచేయుట శూరత్వంబుగాదు పౌరుషంబుగలదేని నాయెదురనిల్చి నీ శౌర్యంబుచూపుము! వ్యర్థమైనమాటలతో ఫలంబులేదనిన వాడు కోపాటోపంబున లక్ష్మణునిపై నిశితశరపరంపరలు గురిపించి రక్తసిక్తాంగుండగు నతనిగని గగనంబువగుల నార్భటించుచు నాబాణంబుల నీ ప్రాణంబులుగొందు నేలంగూలిన నిన్ను కుక్కలు నక్కలు పొడిచి తినుచుండ దుర్మతివై రాఘవుడు చూచుగాత యని మత్తుండై పల్క సౌమిత్రి వానికిట్లనియె

హిం:-పలువారి త్తగు పల్కులివేటికి పల్కిన ప్రజ్ఞలు నలుపగవలయును
నిలువుమిచట సాకరకుబాణముల నీ తల నొరగించెద ధరణీతలమున ॥శ్రీ

(2) అని బల్కుచు నా యసురునిరొమ్మున సునిసితశరములు వేయగ నప్పుడు
దనుజుడు నొచ్చియు రోషకలితుడై ఘనమగు బాణముల్ వేసెనతనిపై ॥శ్రీ

(3) భూరిబలాఢ్యులు వీరవరేణ్యులు శూరు లస్త్రశస్త్రకోవిదులిద్దరు
చారువిక్రములు రణదుర్జయులు పోరుసల్పిరి దివిజులు వెరగంద ॥శ్రీ

(4) సింగము సింగముదాకిన భంగిఁ బెనంగిరి వా రతిపౌరుషయుతులై
సంగరంబు గావించిరి నిరువురు లొంగక నడలక యుగ్రంబుగను ॥శ్రీ

వ॥ ఇట్లొకరిపై నొకరు దివ్యాస్త్రంబులు ప్రయోగించుచు పొంగుచు జెలంగుచు రాక్షసుండు లక్ష్మణుబాణంబుల నొచ్చియు, జలింపక కదనంబుగావించుచు పూచిన బూరుగుల చందంబున నిరువురు రక్తసిక్తాంగులై అతిఘోరంబుగ రణంబుసల్పిరి. లక్ష్మణుం డాయసురుని సారథిని బరిమార్చి చాపంబు ద్రుంచిన మరియొక చాపంబుగైకొని తానే రథంబునడుపుచు పోరుచుండ సౌమిత్రి యా చాపంబుద్రుంచి బాణపరంపరలు నిగుడించిన రక్కసుం డుక్కుసెడి అంగలార్పు వానింగని సకలభూతంబులు సౌమిత్రిని గొనియాడుచుండి రప్పుడు కపులు నల్వురు వానిపై కెగసి విక్రమించి సైంధవంబుల దునిమి రథంబు చూర్ణంబు గావించి లక్ష్మణునిజేరి రంత వాడు భూమిపై నిలచి సితసాయకంబు లొకరిపై నొకరువేయుచు బోరునెడ వానరులును, రాక్షసులును వారివారి ప్రాపున ఘోరంబుగ బెనగుచుండి రప్పుడు వారల మోసగించి పురంబుజేరి రథంబు నారోహించి వచ్చి మరల వానరుల నొప్పించుచు రణంబు గావించుచుండ లక్ష్మణుండు దివ్యాస్త్రంబులు ప్రయోగించిన వాడును అనేకబాణంబులు ప్రయోగింప నిరువురు ఘోరంబుగబోరుచు లక్ష్మణుం డమోఘంబులగు విశిఖంబు లతనిపై వేయ నతండు ప్రత్యస్త్రంబులనన్నియు హతంబుగావించె నంత వారి యుద్ధంబు భయావహంబై యాశ్చర్యంబుగనుండె నాసమయంబున సుర ముని సంఘంబులు లక్ష్మణునికి జయంబుగోరుచుండిరి. అప్పుడు సౌమిత్రి దుస్సహంబైన ఐంద్రాస్త్రంబు వింటనంధించి.

ముఖారి — ఆది.

ప॥ సారసమిత్ర కులశేఖరుడౌ శ్రీరాముడు సత్యసంధుడైన ॥సా

అ॥ కారుణ్యమూర్తి ధర్మాత్ముడేని గాల్చు నీశరము రావణాత్మజుని ॥సా

చ॥ సతతము సీతాపతి పాదసేవ సత్యముగ సల్పువాడనేని
అతులిత సౌఖ్యము లమరులకుగల్గ క్షితిని గూలు నితడు నవకోసలరాముని దయ॥సా

హిం:-అనియిటు శపథము జేసి లక్ష్మణుడు అస్త్రము వేయగ రావణసుతుపై
జని సూర్యప్రభ సన్నిభమై యది దనుజుని శిరము ద్రుంచె నప్పుడు ॥శ్రీ

(2) ధరపై రక్తధార లొలుక వాని శిరము బడెను వజ్రకుండల యుతముగ
సురగంధర్వ మునివరులప్పుడు పరమ హర్షమున కేకలు వైచిరి ॥శ్రీ

(3) అమరులతో దేవేంద్రుడు వచ్చి హతుడై యున్న అసురుని గాంచి
ప్రమదంబున సౌమిత్రిని మెచ్చి హర్ష మెసంగగ వినుతించెను చాల ॥శ్రీ

(4) విరుల వర్షము గురిపించిరి సురలు సరసత నచ్చరలాడిరి వేడుక
పరగ గంధర్వులు పాడిరి మింట మొరసెను దుందుభి రవములు ఘనముగ ॥శ్రీ

(5) సర్వలోక భీకరుడైనట్టి శక్రవైరి హతుండగుటను విని
సర్వభూతములు సంతోషించి శ్లాఘించుచు దీవించె లక్ష్మణుని ॥శ్రీ

(6) పవన తనూజుడు జాంబవంతుడు ప్లవగవీరులు నావిభీషణుడు
దివిజవైరి వధియించిన లక్ష్మణు దివిజులు మెచ్చగ సంస్తుతించిరి ॥శ్రీ

(7) అఱచుచు దోకలాడించి దుముకుచు నఱుకుచు అటునిటు జయము జయమని
బరువిడి లక్ష్మణుజుట్టి నిలచిరా ప్లవగవీరు లుప్పొంగి చెలంగుచు ॥శ్రీ

(8) ఇంద్రారిని వధియించి ముదంబున వేడ్కతో కపులను గూడియు రామ
చంద్రునిజేరి సాష్టాంగ నమస్కృతి సౌమిత్రియు భక్తిగావించి యిట్లనె ॥శ్రీ

(9) అన్నా రావణి హతుడయ్యెనన ఆలింగన మొనరించి యనుజుని
మన్ననమీర నంకమున నునచి మరి మరి శిరము మూర్కొని మెచ్చుచు ॥శ్రీ

నారాయణ కాపి — ఆది.

ప॥ సర్వజగములకు మేలుజేసితివి సాధు కీర్తనీయ శక్రవైరిఁ దునిమి ॥స

అ॥ సర్వభూతములు సంతసింపగాను నిర్వహించితివి నీవీ కార్యము ॥స

చ॥ అని సేయలేరు అతని యెదురనిల్చి అమరవరులు యక్షరాక్షసులైన
అనఘ వానిగెల్చి యశము బొందితివి ఆనందముగల్గె నవకోసలమున ॥స

వ॥ అని పల్కుచు,

జోర:-తనువెల్లను నిమురుచు మాటిమాటికి తమ్మని దేహమునందు
వ్రణములజూచి మనమున వగచుచు అనఘా అలసితివే యనియు ॥జ

(2) అనిచేసియు మూడహోరాత్రములు అమరవైరి జంపితివి
తనయుని చావు విని రావణుడు తల్లడిల్లుచు మదినీ ॥జ

(8) కదలివచ్చు నిజబలములు గొలువగ మదమోహితుడై యిపుడు
కదనంబున జచ్చెను నిక్కముగనాచే గర్వాంధుడు రావణుడు ॥జ

వ॥ అనిబల్కి సుషేణునిగాంచి యీ మహామతియగు సౌమిత్రి శరీరంబున అమ్ముల ములుకులు నాటియున్నవి గావున స్వస్థచిత్తునిగాజేసి యటులనే విభీష ణుని ఋక్షవానర సమూహంబుల స్వస్థచిత్తుల గావింపుమన నతండు సారతరం బగు ఓషధి సౌమిత్రికొసంగ దాని మూర్కొనినంత ములుకులన్నియు వీడి గాయంబులుమాని సుఖస్థితి నుండె. వనచరులకు విభీషణునకు చికిత్సజేయ బాధలడంగి సంతసించి యుండి రిట రావణుని సచివులు ఇంద్రజిత్తు వార్తవిని దుఃఖించుచు రావణునకు నెరింగింప నతండు పుత్రమరణంబు విని వివశుండై భూమిపై బడి కొంతవడికి లేచి,

జో:-హా పుత్రా నాపాలి భాగ్యమా హా రాక్షసవీరా ధీరా
ప్రియని నమ్మితి తనయా నన్ను బాసిపోతివే రణశూరా ॥జ

(2) వాసవు నంతటివాని జయించిన వరకుమార నీవిపుడు
వాసిచెడితివే నరునికిలోగి వమ్మయ్యెనె నీ బలము ॥జ

(3) నీవిటు గూలుటవిని ఋషివరులు దేవేంద్రాదులు సురలు
భావమలర నిద్రింతురు సుఖముగ నా జీవరత్నమా యిపుడు ॥జ

(4) అని వల్కుచు దుఃఖావేశంబున జనకజ జంపెద ననుచు
తన పరాక్రమం బసురులు పొగడగ జనియెను మైథిలి కడకు ॥జ

(5) ఆయుధ ధరుడై వచ్చువానిగని అడలుచు ధరణీ సుతయు
కాయమువంచి హాయని యేడ్చెను ఘనుని రాముని దలచియును ॥జ

(6) హనుమంతుని మాటలువిని నేనతని మూపునను గూర్చుండి
జని శ్రీరాముని యంకమందున మనియుండనె యిటులేడ్వక మరిని ॥జ

(7) అని యిటులేడ్చెడు సీతాదేవిని గని సుపార్శ్వుం డపుడు
దనుజాధిపయిటు తరుణిని జంపుట తగదు తగదు నీకిదియు ॥జ

(8) ఔరా బ్రహ్మకులంబున బుట్టిన ధీరుడవును శూరుడవు
పారము ముట్టగ శ్రుతులను జదివిన పండితుడవు పుణ్యుడవు ॥జ

(9) శ్రీరాముని వధియింపుము కోపము దీరగ రాక్షసరాజా
నారీమణిఁ జేకొనియు సౌఖ్యముల ననుభవింపు మనవేగా ॥జ

వ॥ ఆమాటలువిని దుష్టుండైన రావణుండు గృహంబున కరిగి సభాస్థానంబుచేరి మూలబలంబుల యుద్ధంబున కనుప వారు జని వానరులతో ఘోరంబగు పోరు సల్పుచు కపివీరుల బారదోలిన, వారలార్త శరణ్యుండగు శ్రీరాముని శరణు జొచ్చి రంత రాముడు కోపోద్దీపిత మానసుండై శరాసనంబు చేకొని శత్రు కోటిలోజొచ్చి బాణవర్షంబు గురిపించుచున్న రివ్వునవచ్చి యాబాణంబులు రొమ్మునాటుటయె తోచునుగాని శ్రీరాము నెందును గానక అగ్నింబడు మిడు తల చందంబున రక్కసు లుక్కడగుచుండి రంత శ్రీరాముడు గాంధర్వాస్త్రంబు ప్రయోగింప దాన మోహితులై యారక్కసులు

ఆఠాణ – ఏక.

ప॥ ఎందుజూచిన రఘువీరుడు ఇదె వచ్చుచున్నాడని
ఔందంబుల దలచి దలచి డీకొనిరవు డొకరినొకరు ॥ఎం

చ॥ ఈ కరితురగముల దున్రించెడు నీతడె శ్రీరాముండని
యీ ఖడ్గము ధరియించిన యీవీరుడె శ్రీసీతాపతియని ॥ఎం

(2) ఈ పదాతుల బడగూల్చెడు నితడె రాఘవుడనుచు
దాపైవచ్చె మనకిపుడు ధరణీసుత కాంతుడు ॥ఎం

(3) ఈశరవర్షము గురియు నితడె నితడే దశరథరాముడు
శ్రీశుడు నవకోసలపతి శ్రీరాముడు కోదండపాణి ॥ఎం

హిం:-జగమంతయు శ్రీరామమయంబుగ సకలదిక్కుల నిండియుండగని
మగటిమిజూపుచు రాక్షసవీరులు మడిసిరి యొక్కరి నొక్కరుదాకి ॥శ్రీ

వ॥ మూడు ముక్కాలు గడియలో శ్రీరాముండొక్కడు మూలబలంబుల హతంబు గావించె నతని దేవఋషి బృందంబులు స్తోత్రంబులు గావించి రంత రాక్షసాం గనలు పతిసుత బాంధవులు హతులైరని దుస్సహంబైన శోకంబున.

జోర:-ఏటికెబోయెను చుప్పనాతి రఘువీరుని చేరగ బాగా
చేటుదెచ్చెలంకకు మనవారల కాటికిబంపెను వేగ ॥జ

(2) నిజగళపాశం బవనీసుతయని యెరుగక దశకంఠుండు
అజరుదార్చితుండగు శ్రీరాముచే హతుడయ్యెడు మూర్ఖుండు ॥జ

(3) వినయవివేక నీతిశాలి యా విభీషణుండు ధన్యుండు
అనుసరించె శ్రీరామచంద్రుని అఖిలసుఖంబుల గాచు ॥జ

వ॥ మరియు నీ రావణుని బాధలకోర్వజాలక అమరులు విరించితో మొరలిడ శ్రీమ
న్నారాయణుండు నరుండై యవతరించి యొక స్త్రీనిమిత్తంబున రాక్షసనాశంబు
గావించుననుట వినియున్నాము. ఇప్పుడట్టివినాశకాలంబు ఘటియిల్లెనని పల
వించు రాక్షసస్త్రీల రోదనధ్వనులువిని రావణుండు దుఃఖభరంబున నూర్పులు
బుచ్చుచు కనులుద్రిప్పి పండ్లుగొరుకుచు విరూపాక్ష మహాపార్శ్వ మహోదరుల
గాంచి నేను రామలక్ష్మణుల వధించి కపిసైన్యంబుల తుండతుండంబులుగా
చెండి వేసెదనని తన శౌర్యంబు ప్రకటించుకొనుచు వారల యుద్ధంబున కనిపి
తాను రథంబెక్కి చావక మిగిలియున్న రక్కసులు ఆయుధధరులై వెంటనరుదేర
సమరంబున కరుగు సమయంబున

జోర:-కూ్రరంబుగను ఖగములుగూసెను గుంపులుగూడియు నపుడు
చేరి ఉకెక్కమున గ్రద్దవ్రాలెను ధారుణివణకెను మరియు ॥జ

(2) వాజులు కాళ్ళు జారిపడ్డెను వామనేత్ర భుజమదరెన్
తేజముమాసెను మోమున నతనికి దీనతబొందెను స్వరమున్ ॥జ

(3) అపశకునము లెన్నైనగణింపక వారిసేనల గవిసియును
కపివీరుల నురుమాడుచుండె లయకాలునివలె రౌద్రంబుగను ॥జ

(4) గుండెలు నమయఁగ శిరములు పగులఁగఁ గూలిరి కొందరు మరియు
ఖండించుచును కాళ్ళుచేతులన్ చెండాడెను కపుల రావణుడు ॥జ

(5) పక్కలు డొక్కలు ముక్కులు చెక్కులు పగిలి విరిగి వాలములు
మొక్కపోయిన యంగంబులతో దిక్కుదోచక కగచరులు ॥జ

(6) పారిపోయిరి మూలకొక్కరుగ పోరుదొలంగియు నపుడు
చేరవచ్చె శ్రీరామచంద్రుని చెంతకు దశకంధరుడు ॥జ

వ॥ సుగ్రీవుం డానమయంబున రాక్షసానీకంబుల సంహరించుచు విరూపాక్ష మహో
దరుల హతులఁగావించె అంగదుచే మహాపార్శ్వుండు నీల్గె. మరియు రావణుడు
కపుల బొలియింపుచుండ రాముడు తమ్మునితోడ కపులచేబెరింగి కేల ధనువు
బట్టి నిలచియుండు మహాత్ముని రావణుడుగదియ రాముడు వానింగని కోప
రక్తాక్షుండై చాపమెత్తి భూమిగంపింప గుణధ్వనిగావించిన వానర రాక్షసులు
గుములై భూమింగూలి రప్పుడు.

తే॥ ఆ నిశాటునిపైని రామానుజుండు అనలసంకాశ శరజాల మపుడువైవ [ము
భళియుడగు రావణుడు బాణములనుబట్టి తుంచి ఝంపట ఘనవృష్టిముంచెరా

డోర:-శితవిశిఖంబు లనేకము వేసిన శ్రీరామవిభుం డన్నిటినీ
హతముజేసి ఘననారాచంబుల యసురునిపై వేయుచును ॥జ

(2) కదిసి పరస్పర జయకాంక్షల రణకౌశల మేర్పడ నవ్వుడు
కదన మొనర్చిరి రామరావణులు కడుభీషణోగ్రులై మరియు ॥జ

వ॥ ఇట్లొకరిపై నొక రనేక బాణపరంపరలు నిగుడించుచున్నతఱి రావణు డొక్కొ మొగి పెక్కుబాణంబుల శ్రీరామునిపై నేయ నతం డవియన్నియు అనలాస్త్రంబున హతంబు గావించిన నయ్యిరువురు రోషభీషణాకారులై దివ్యాస్త్రంబుల బోరుచుండి రయ్యెడ.

డోర:-అంత లక్ష్మణు డన్నకు సరిగా నసురుడు బోరుట గనియు
వింతయయ్యె రఘువీరుని మోల నిత డింతదవ్వు నిల్చుటయు ॥జ

(2) అని దలపోసియు బాణవృష్టిని అసురుని ముంచియు వేగ
ఘనమగు వాని చాపముద్రుంచెను తునియలుతునియలు గాగ ॥జ

(3) తురగంబుల బడగూల్చె విభీషణు డురుజవమున దానవుడు
ధరణీస్థలికి దుమికి రావణుడు తమ్ముని జంపెద ననుచు ॥జ

(4) భయదాకృతియగు శక్తిని గైకొని రయమున తమ్ముని వ్రేయగ
నయవిదుఁడగు సౌమిత్రి దానిని నడుమనె తున్కలు జేయగ ॥జ

(5) అనఘా విను నాతమ్ముని చావుకు అడ్డమువచ్చితి విపుడు
నినుమెచ్చితి నాయెదుర నిల్వుము మనజాలవింక నిశ్చయము ॥జ

(6) అని పల్కుచు ఘోరంబగు శక్తిని గైకొని లక్ష్మణుపై వ్రేయగ
గని శ్రీరాముడు స్వస్తిపల్కుచు అనుజుని జూచుచు నుండగ ॥జ

(7) అతివేగంబున లక్ష్మణుగదిసి యామహోగ్ర శక్తియును
అతిబలశాలి వక్షమునాటిన అవనివ్రాలె మూర్ఛిలి యతఁడు ॥జ

(8) తన తమ్ముని దుస్థితిగని రాముడు కనులనీరు నించుచును
మనమున శోకము మీఱగ నప్పుడు కనలుచు క్రోధంబునను ॥జ

(9) కాలముగాదిది దుఃఖించుటకని ఆలము సేయగఁబూని
కేలను విలుగొని రావణు జంపగ కృతనిశ్చయుడై మరిని ॥జ

వ॥ రావణుండిదే సమయంబని బాణవర్షంబు గురిపింప అధైర్యపడక యాశక్తి నతలీల బెరికి దుంచి తమ్ముని కౌగిటంజేర్చి సుగ్రీవాది వానరుల గాంచి,

డోర:-కపులార నాతమ్ముని జాగ్రత్తగను గాచియుండుడీ మీరు
  యిపుడే రావణు దున్రించెద నమ్ముడు వినుడు నాదు పల్కులును ॥జ

(2) ఘనముగ రాజ్యలక్ష్మి బోవుటయు వనమున జరియించుటయూ
  జనకజ నీ మూర్ఖుడు గొనిపోవుట అనుజు డవని గూలుటయు ॥జ

(3) ఇన్ని దుఃఖములు బాసెద నిపుడే యీదశకంఠుని వధియించీ
  ఎన్నగ నాదు దృష్టికి బడి యితడెట్లు బ్రతుకునిక భువినీ ॥జ

(4) వనచరులార యిందునిలబడి కనుడి నాదు శౌర్యంబు
  వనజముఖ సురముని బృందంబులు గనుచుందురు రాముని బలవీర్యంబు ॥జ

(5) నచరాచర లోకంబు లుగముగా సన్నుతింప నే నిపుడు
  అచిరకాలమున నీరావణుని హతునొనరించెద గనుడు ॥జ

వ॥ కపులార నేనేనిమిత్తమ్మున వాలిని దున్రించి సుగ్రీవునికి పట్టంబుగట్టి మిమ్ముం
  గూడి సేతువు బంధించి లంకం జొచ్చితినో యట్టి రావణుండిప్డు నాకంటం బడెం
  గావున వీనింబట్టి వధించెదనని సువర్ణ భూషితంబులగు విశిఖంబుల రావణునిపై
  వేసియు వాడును రామునిపై ననేక బాణంబులు గురిపింప రాముడు వానినన్నిం
  టిని భగ్నంబుగావించి క్రోధంబున నిప్పులు గురియు బాణంబులు కోట్లుకోట్లుగ
  ప్రయోగించిన దశవదనుడు నిలువజాలక దీనుండై లంకలోనికి పరువిడియె
  నంత రఘువీరుండు,

తే॥ రక్తసిక్తాంగు డగుచును రణమునందు బడిన తమ్ముని గని రామభద్రు డంత
  దుఃఖభరమున మాటలు తొట్రుపడగ ప్లవగవరుడౌ సుషేణుని బలికెనిట్లు

డోర:-ఈ సుగుణాంబుధి నాదు తమ్ముడు విక్రమనంతుం డితడు
  భాసురగాత్రుం డిలబడిపొరలెడు పాముకై వడి న్నిపుడు ॥జ

(2) ఈతని జూడగ నధికతాపము హెచ్చెను నామదియందు
  నాతరమౌనె యుద్ధముజేయగ భ్రాతపాటుగని యుందు ॥జ

(3) కూరిమి తమ్ముం డిటులుండగ కనులారజూడ నాకెవుడు
  దీరె నింకేనా యాశలన్ని చెయి జారె చాపబాణములు ॥జ

(4) అవశుండై దుఃఖించుచు రాముడు అనుజుని మరిమరి గనియు
  భువనమోహనా తండ్రీ లక్ష్మణ భూరివిక్రమా యనుచు ॥జ

పున్నాగ — చాపు.

ప॥ అనుజ నినుబాసి నే నరనిమిషమోర్వజాల ॥అ

అ॥ మనియుండుటెట్లు భువిలోన నా తనువున ప్రాణము నిల్పియు నేను ॥అ॥

చ॥ ఏలా రాజ్యంబు నేలనీ సీతయు నేలానాకీ యుద్ధము
బాలేందుముఖ నీవీలీలబడియుండ కాలుపాలుగాక కటకట యున్నాను ॥అ

(2) నాముద్దుతమ్ముడ దశరథు కూర్మిపట్టి నరపాలవరరత్నమా
ఏమీ భోగము భాగ్యమేలా నాకీబ్రతుకు ఏదారిదోపదు, ఇనకులతిలకా ॥అ

(3) అరయ నూరూర సతులు బాంధవులు దొరకుదురుగాని మరియు
దొరకునె సోదరు డేదేశములగాని మారసుందరాకార నవకోసల రణశూర ॥అ

వ॥ ఇట్లు నిట్టూర్పులు నిగుడించుచు భూమిం బొరలుచు కన్నీరుగార్చుచు పలవించు
చుండు రఘువీరుంగాంచి సుషేణుం డూరడిలం బల్కుచు రామా,

జో॥:-మృతుడుగాడు మన లక్ష్మణుడిపుడు ఈతని ముఖ లక్షణముగ
చతురత గనుము కాంతి దొరగదు సాధుచరిత శోకముమాను ॥జ

(2) కనులయందు తేజము మారదు కనుమా హృదయంబునను
గననయ్యెడి కంపన ముచ్ఛ్వాసము అనఘా మోదము గనుము ॥జ

వ॥ సుషేణుండిట్లు రామునకుదెల్పి హనుమంతుని గాంచి వాయుతనూజా నీవు
మందులకై బోవవలయు. ద్రోణాచలంబున దక్షిణదిక్కునం గలవు

హిం:-కలదచ్చట సౌవర్ణ సంధానకరణి గలదు సంజీవకరణి విశల్యకరణి
నిలువకపోయి గొని తెమ్మిప్పుడు సలలితముగ సౌమిత్రి మనుటకై ॥శ్రీ

(2) అనవిని హనుమ అతివేగంబున అటజేరియు నాయోషధు లెరుగక
ఘనమగు నీగిరి గొనిపోయెదనని మనమునదలచి మారుతి యంత ॥శ్రీ

(3) నేనిట జాగుచేయుచుండిన నిక్కము కీడు సంభవించునని
వానరోత్తముడు ఆపర్వతమును వారక ముమ్మారూచి పెకలించి ॥శ్రీ

(4) వినవీధికి నెగసి పూలచెండువలె ఘనమగు కుధరము నెగురవైచుచు
అనిలతనూజుడు దెచ్చి నిలిపెనా వనచరాళిమధ్య మనమున పొంగుచు ॥శ్రీ

(5) అంత సుషేణుని గని యిట్లనెను అనఘా యిందలి మందులు దెలియక
వింతగ నీకొండ న్పెకలించి నీచెంతకు దెచ్చితి శీఘ్రంబునను ॥శ్రీ

(6) అనిన మెచ్చియు అంజనసుతునీ అనువుగ ఓషధుల్ దీసి ముదమున
ఘనుడు సుషేణుడు లక్ష్మణు డగ్గరి అనురాగము మది నుప్పతిల్లగ ॥శ్రీ

(7) ఆమహౌషధిని మూర్కొనజేసిన అంతలోను వ్యథలేమియు లేక
ధీమంతుడు సౌమిత్రి లేచెను సంతసమున గొనియాడిరి హనుమను ॥శ్రీ

వ॥ అంత బ్రతికిలేచిన తమ్మునింగని రామవిభుండు,

ఆనందభైరవి — ఆది.

ప॥ రారా నాసోదర రాజకుమార ॥రా

అ॥ ధీరా మంగళాకార సుందర రఘువీర ॥రా

చ॥ ఎంతటి పుణ్యం బొనరించితినో సంతసమున నిను జూడగ గంటిని ॥రా

(2) వింతగాదె యమునిబారింబడియు వెడలి వచ్చితివి ముద్దులతమ్ముడ ॥రా

(3) అనుజా నీవు లేకను నాకిల జనకజవేల నాజీవితమేల ॥రా

(4) దనుజుని జంపుట జయము చేకొనుటేల అనఘా నవకోసల పురవర ॥రా

వ॥ ఇట్లుపల్కు అన్ననుగని మాటలు తడబడ లక్ష్మణుం డిట్లనియె.

జోర:- రావణు దునిమి విభీషణునకు నీరాజ్యం బిచ్చెద ననుచు
భూవల్లభ ముని ప్రతిజ్ఞజేయవె భూరిబలాఢ్య యిపుడు ॥జ

(2) పలికిన ప్రతిన తప్పదురా భువి ప్రాజ్ఞులు శ్రీరఘురామా
వలవదు కార్యము నిలుపకు వేగమె వధియింపుము రావణు రణభీమా ॥జ

(3) జలజాప్తుం డస్తాద్రియందున జనుటకుముందే రామ
ఖలుని రావణుని హతునిజేయు జగమలరగ సద్గుణధామ ॥జ

వ॥ అన్నా సింగంబున కెదురైన గజంబుచందంబున దశకంఠుడు నీకనుల యెదుర
బడి నిలువంగలడే గాన నావచనంబుగైకొన నీకిష్టముండెనేని వానిఁబొలియింపు
మని పల్కు తమ్ముని వాక్యములకు సంతసించి రఘువీరుం డంతట ధనువు
గైకొనిన రావణుండును రథారూఢుండై సూర్యునిపై చీకట్లుగ్రమ్మినట్లు
రామచంద్రుని వజ్రసన్నిభంబులగు బాణంబుల ప్రహరించిన సీతేశుం డగ్ని
జ్వాలలంబోలు శరంబుల వాని శరీరంబు వ్రణంబుగావించె. అప్పుడు.

హిం:- రథికుండై యట రావణుండును రాముడు ధరనిలచి కదనముచేయగ
యిదిసరిగాదని సురముని బృందముల్ యింద్రుడు తనరథమంపె రామునకు ॥శ్రీ

(౨) కాంతియు క్తమై రత్నఖచితమగు కనకరథముగొని యవనికివచ్చి
మాతలి రఘువరు పదములవ్రాలి మానవేంద్రసీకుబంపె నింద్రుడు రథము ॥శ్రీ

వ॥ దేవా యీరథంబుపై నారోహించి కవచఖడ్గ శరాది సాధనంబులుగొని నేను సారథినైయుండ రణంబుగావించి రావణుని వధింపుము జయంబు గొనుమన రాముం డటులనే యని రథారూఢుండై రణంబొనర్ప రావణుడు మహోగ్రుండై రామునిపై గాంధర్వశరంబు వేయ రాముడు గాంధర్వశరంబునను దైవశరంబువైవ దైవశరంబునను దుంచిన రాఘవుపై రావణుడు రాక్షసాస్త్రంబువేయ నాతఁడు దాని గరుడాస్త్రంబున హతంబుగావించె నిట్లు తనసర్వాస్త్రంబులు వ్యర్థమైన రావణుం డుగ్రశరంబులు రామునిపై సారథిపైవైచి కాంచనకేతుం బడవైచి అశ్వంబు పీచంబడంచె నప్పుడు.

జోర:-వాని యసాధ్యము విజృంభణ రామునిదీనత గనియు
వానరులుఁ మరి విభీషణుండును వావిరిగుందిరి మరియు ॥జ

(౨) దేవ నభశ్చర సిద్ధచారణులు భావించియు మరి మునివరులు
భూవల్లభుఁడౌ రామభద్రుగని పొక్కుచుండిరి యపుడు ॥జ

(౩) దనుజుడు విజృంభించుట గనుగొని తనవారలు వెవ్వెలబోవ
గని శ్రీరాముడు రక్తనేత్రుడై మనమున రోషముమీఱ ॥జ

(౪) భానువంశజుడు రాక్షసనాథుని భస్మముచేయు నటులు
ఆననమున క్రోధానలము నిండగ అడలె సర్వభూతములు ॥జ

(౫) పుడమి వడంకెను సత్వయుతంబుగ భూధరములు గడగడవడకెఁ
పిడుగులు రాలెను దశకంధరుడు భీతిలె రాముని గనియుఁ ॥జ

వ॥ కల్పాంత సమయంబునుంబోలె భయంకరంబైన యుద్ధంబుగని సుర సిద్ధ సాధ్య విద్యాధరాది ఋషివర్గంబు మింటనిలచి రఘురాముని విజయంబు గోరుచుండిరి. దైత్యదానవులు రావణుని జయంబుగోరుచుండిరంత రావణుడు కోపాగ్ని పెచ్చుపెరుగ శ్రీరాముని సంహరింతునని వజ్రసారంబును రౌద్రంబును భయావహంబైన శూలంబుకేలంబూని మండిపడుచు రాక్షసులు సంతసింప జలధిక్షోభింప జగంబులదర శ్రీరామా నిమిషమాత్రంబిక బ్రతుకజాలవు నిలుమని యాశూలంబు రామునిపై విసరివైచిన రాము డనేకబాణంబులు దానిపై వేసిన యది వానినన్నిటిని గూల్చి తనపైకివచ్చుచుండ బలమర్దనుడుబంపిన మహాశక్తిచే నాశూలంబును నేలగూల్చె నప్పుడు

(2) కాంతియు_క్తమై రత్నఖచితమగు కనకరథముగొని యవనికివచ్చి
మాతలి రఘువరు పదములవాె్రలి మానవేంద్ర సీకుబంపె నింద్రుడు రథము ॥శ్రీ

వ॥ దేవా యీరథంబుపై నారోహించి కవచఖడ్గ శరాది సాధనంబులుగొని నేను సారథినై యుండ రణంబుగావించి రావణుని వధింపుము జయంబు గొనుమన రాముం డటులనే యని రథారూఢుండై రణంబొనర్ప రావణుడు మహోగ్రుండై రామునిపై గాంధర్వశరంబు వేయ రాముడు గాంధర్వశరంబునను దైవశరంబువైవ దైవశరంబునను దుంచిన రాఘవుపై రావణుడు రాక్షసాస్త్రంబు వేయ నాతఁడు దాని గరుడాస్త్రంబున హతంబుగావించె నిట్లు తనసర్వాస్త్రంబులు వ్యర్థమైన రావణుం డుగ్రశరంబులు రామునిపై సారథిపై వైచి కాంచనకేతుం బడవైచి అశ్వంబు పీచంబడంచె నప్పుడు.

ఘోర:-వాని యసాధ్యము విజృంభణ రామునిదీనత గనియు
వానరులుగ మరి విభీషణుండును వావిఁగుందిరి మరియు ॥జ

(2) దేవ నభశ్చర సిద్ధచారణులు భావించియు మరి మునివరులు
భూవల్లభుడౌ రామభద్రుగని పొక్కుచుండిరి యపుడు ॥జ

(3) దనుజుడు విజృంభించుట గనుగొని తనవారలు వెవ్వెలబోవ
గని శ్రీరాముడు రక్తనేత్రుడై మనమున రోషముమీర ॥జ

(4) భానువంశజుడు రాక్షసనాథుని భస్మముచేయు నటులు
ఆననమున క్రోధానలము నిండగ అడలె సర్వభూతములు ॥జ

(5) పుడమి వడంకెను సత్వయుతంబుగ భూధరములు గడగడవడకెగ
పిడుగులు రాలెను దశకంధరుడు భీతిలె రాముని గనియుగ ॥జ

వ॥ కల్పాంత సమయంబునుంబోలె భయంకరంబైన యుద్ధంబుగని సుర సిద్ధ సాధ్య విద్యాధరాది ఋషివర్గంబు మింటనిలచి రఘురాముని విజయంబు గోరుచుండిరి. దైత్యదానవులు రావణుని జయంబుగోరుచుండిరంత రావణుడు కోపాగ్ని పెచ్చుపెరుగ శ్రీరాముని సంహరింతునని వజ్రసారంబును రౌద్రంబును భయావహంబైన శూలంబు కేలంబూని మండిపడుచు రాక్షసులు సంతసింప జలధిక్షోభింప జగంబులదర శ్రీరామా నిమిషమాత్రంబిక బ్రతుకజాలవు నిలుమని యా శూలంబు రామునిపై వినరివైచిన రాము డనేకబాణంబులు దానిపై వేసిన యది వానినన్నిటిని గూల్చి తనపైకివచ్చుచుండ బలమర్దనుడుబంపిన మహాశక్తిచే నాశూలంబును నేలగూల్చె నప్పుడు

శ॥ కపులు సంతోషభరితులై గంతులిడిరి సురలు ముదమందిరంత భూవరుడువాని
తురగముల జవమునుమాన్పి దోర్బలమున నతనియురమునుబగులంగనడచెనపుడు

శో:- బాణవేదన సహింపలేకను పరితపించుచు నపుడు
దీనుండగుచు భిన్నగాత్రుడై రవికులవైరి రోషంబునను ॥జ

(౨) ఘనసాయకముల రాముని వేయగ కంపింపక తానపుడు
సునిశిత బాణంబుల దుంచుచు దనుజునితో బెనగెను దర్పంబునను॥ జ

(౩) ప్రళయాదిత్యునిబోలి రాఘవుడు బాణవృష్టిచే వాని
బలశౌర్యంబు లడంచిన యప్పుడా ఖలుడు మదాంధుడు మరిని ॥జ

(౪) శితసాయకములు గురిపించెను వాడతిసాహసమున మీర
చతురత రాముడు చిరునవ్వున నిట్లనె మతివిహీన యిదె వినరా ॥జ

అరభి — రూపకం.

ప॥ ఏరాచోర ఎదుట నిల్వర శూరుడవైతే ॥ఏ

అ॥ క్రూర మద్విరహిత సతి దెచ్చితివి ఘోర దుర్మద అసురకులాధమ ॥ఏ

చ॥ పరసతులను కామించు నీచా పరమద్రోహి చెనటి ఛీ ఛీ
దురమున నిను దునిమెదనురా దూరీకృత ధర్మ దనుజా ॥ఏ

(౨) సీతను దొంగిలితివీవు సిగ్గులేకనో రాక్షసా
నీతిహీన ఛీ ఛీ నిలువు నిలువుమిట నవకోసలుడనే ॥ఏ

హిం:-ఎంతటి భాగ్యమొ మూఢా రావణ యిన్నిదినములకు గంటిని నిన్ను
అంతకుచెంతకు బంపుదు నిలువుము అసురాధమనీ శిరస్సుల గూల్చెద ॥శ్రీ

(౨) అతి శూరుడనని జెప్పుకొనకుమిక బ్రతుకజాలవు పడియెద విలపై
చతురత మీరగ కాకగృధ్రములు సత్వరముగ నీయురము జీల్చి తినును ॥శ్రీ

వ॥ శ్రీరామచంద్రుడిట్లు పల్కుతరి శుభలక్షణంబుల విజయంబు సూచింప నుత్స
హించి తీవ్రశరంబుల వాని యురంబు నాటవేసిన రావణుండు గుండెలు పగిలి
రక్తము స్రవింప డీల్పడి గ్రుక్కలు మ్రింగుచు శరచాపములు పట్టుకొనంజాలక
తనపై దుముకు బాణపరంపరల ప్రతిఘాతంబు గావింపనేరక విస్మితుండై యున్న
దశకంఠునిస్థితిగని సారధి రథంబావల తొలంగించె నంత రావణుడు సారధినిగని

డోర:-ఏమిటికిటు యీరధము దెచ్చితివి నామది చొప్పెరుగకను
ఏమయ్యెనో నా అస్త్రశస్త్రముల్ మరి యేమాయెనో నాబల శౌర్యములు ॥జ

(2) పరువంతయును పాడుచేసితివి పాపీ మూఢా నీచా
చిరకాల సమార్జితమగు నాయశము జెరిచితివి దుర్మతి యనినా ॥జ

(3) మతిమాలిటు బల్కెడు రావణుగని హితమతి నిట్లనె సూతుండు
సతతము నీదు మేలు గోరుదునే నతిసాహస విను నామనవియును ॥జ

(4) వెఱచినవాడను గానయ్యామై మరచినవాడనుగాను
గొరమాలిన వాడగాను కానుకల్ గొనినవాడనేగాను ॥జ

(5) బడలిక గల్గిన భారంబునను భ్రాంతుని కై వడియున్న
కడుడస్సియు అశ్వంబులు నున్నను గనుగొని హితమతినంత ॥జ

(6) దేశకాలము లెరుగుచు సారధి తేరు నడుపవలయు
గాసిలియున్న రధికునిజూచి గాపాడవలెను ధర్మంబిదియు ॥జ

(7) కావున నీదు రథ మావలికి గడపితి నిప్పుడు దేవా
భావింపగ నీమేలు మరువనే బాలిశుండనే యనిన ॥జ

(8) సారధి వాక్యముల్ విని యాతడు వెయితీరుల మెచ్చుచు నపుడు
ఆ రఘువీరుని కెదురుగ వేగమె అరదము దోలు మటనుచు ॥జ

(9) సంతసమున హస్తాభరణంబులు సారధి కొసగె నతండు
అంత నతడు భూకాంతుని చెంతకు హయములు మరలించెను మరియు ॥జ

(10) గగనంబున నిలిచి యుద్ధము గనుచుండెడువారలలోను
అగస్త్యమహర్షి రాముని జేరి అనియెనిట్లు కృపతోను ॥జ

ఆనందభైరవి–చాపు.

ప॥ ఆదిత్యహృదయము వినుమ రామ అఖిలార్థసిద్ధి చేకొనుమా ॥ఆ

అ॥ సాదరంబున జపము సేయగ సర్వపాపక్షయము పుణ్యము
మోదమును రిపుజయము శుభము ముక్తిప్రదము మంగళమునా ॥ఆ

చ॥ ఆయురారోగ్య మైశ్వర్యం రామ ఆనంద మత్యంత సుఖదం
బాయక సేవించు వారికి భానుడొసగు భుక్తి ముక్తిని
ధ్యేయమై పరతత్వమై మరి దివిజులు ప్రార్థించుచున్న ॥ఆ

(2) అక్షయ ఫలమిచ్చునదియు రామ: అఖిల సంపత్కరము మరియు
సాక్షియై వెలుగొందుచున్న సవితృని భాస్కరుని మిత్రుని
నీక్షితి నవకోసలేశ వేడ్కతో భజియింపుమయ్యా ॥అ

(3) ఏకాగ్ర మనస్కుడవగుచు రామ లోకరక్షణు దేవదేవుణ్
ప్రకటంబుగ పూజించి భక్తిచే ముమ్మారు చదువ
జేకురు సకలార్థములును శ్రీకర రఘురామచంద్ర ॥అ

హిం:-పూనికతో నీ మంత్రరాజమున్ మానస మలర పఠియింపుమనఘ
ఈ నిమిషంబున దశకంధరుని భూనాయక నీవు సంహరించెదవు ॥శ్రీ

2) అని పల్కియు శ్రీరామభద్రునకు ఆదిత్యహృదయము నుపదేశించి
మునివల్లభుడు అంతర్హితుడయ్యె నంతట జానకీరమణుడు వేగ ॥శ్రీ

(3) భానుమండలము జూచుచు నప్పుడు పఠియింపగ ముమ్మారు మంత్రమున్
ఆనందంబున ప్రసన్నుడై రవియు అనుగ్రహించి జనె రావణుద్రుంప ॥శ్రీ

వ॥ శ్రీరామచంద్రుం డంత సంతోషస్వాంతుండయ్యె నప్పుడు,

తే॥ బంగరురథంబుపై వీరభటులుగొల్వ అవనివణకంగ దార్జన్య మతిశయిల్ల
వచ్చెఁగలనికి నసురుఁడు వైభవమున అతనిగని మాతలికి రాముఁ డనియెనిట్లు

వ॥ మహేంద్రసారథీ యీ రావణుడు చావునకు సిద్ధమై అపసవ్యంబుగ వచ్చు
చున్నవాడు, గాన నీ వతిజాగ్రత్తతో మెలంగవలయు కార్యభరంబు నీయం
దేగలదనుమీ యన నతండు ప్రీతుండై అసురపతి రథం బపసవ్యంబగునటుల
తేరునడుప, రావణుండు రామునకెదురై తండోపతండంబులుగా బాణంబులు
ప్రయోగించిన శ్రీరాముడు రోషభీషణాకారుండై, వజ్రచాపంబుగొని భాను
రశ్మిగల సాయకంబులు వానిపై నేసిన,

జోర:-రామరావణులు జయకాంక్షల నిరువురు రణముసల్పుచునుండ
వ్యోమవీధిని నిలిచి యమరులా భీమబలుల జూచుచు నిండా జ॥

(2) రావణవధయు రామజయము దమభావంబుల గోరుచును
దేవేంద్రాదులు మునిబృందములు గీర్తించుచు రామునినుండగను జ॥

(3) రావణురథమున గ్రద్దలువ్రాలెను రక్తవర్షములు గురిసెన్
భావింపగ నపశకునముల్ ప్రబలి ప్రతికూలవాయువుల్ వీచెన్ జ॥

(4) రామునిమదికి మోదముగల్గగ రంజిలెలోకంబులును
క్షేమావహములునై యొప్పెడు శుభచిహ్నము లగపడెనపుడు జ॥

(5) ధరణీకాంతుడు హర్షోల్లాస దరహాసితాననుడగుచు
శరవర్షము గురిపించుచుండ నా సురవైరియు రోషముతోడ జ॥

వ॥ దివ్యాస్త్రంబులు రామునిపై ప్రయోగించుచుండె సంగ్రామంబు జగద్భయం కరంబైయుండె. దనుజ వానరసైన్యంబులు రామరావణులజూచుచు నివ్వెరపడి సాలభంజికలవలె నిలచియుండి రప్పుడు, రఘువీరుండు దశకంఠుని ధ్వజంబు నరికి గుఱ్ఱంబులఁ గూల్చిన రావణుండు రోషించి రామచంద్రునిపై గుట్టగుట్టలుగా అస్త్రంబులేయ, రాముడు భీకర నారాచంబుల వానిగాత్రము తూట్లుబోవ గొట్టుచుండె.

తే॥ శూరవరులును వీరులు ధీరమతులు శౌర్యధైర్యపరాక్రమ సాహసముల
భీమముగ పోరుసల్పి రుద్దామబలులు రామరావణులిరువురు రభసమలర

జోర:- గురితప్పక యొండొరులు బాణములు వరపుచు వేగంబునను
నిరువురు మరి సవ్యాపసవ్యముల దిరుగుచు రౌద్రంబుగను జ॥

(2) డాయుచు బాయుచు గదియుచు వారు తలగక నొవ్వకయపుడు
వేయువిధంబుల చిత్రగతులను వెలసిరి కదనంబునను జ॥

వ॥ ఇట్లు ముహూర్తకాలంబు ఘోరంబుగ బోరునెడ భూమికంపించె సముద్రము క్షోభిల్లె. సూర్యచంద్రులకాంతి మాసె దేవదానవ గంధర్వ పరమ ఋషిబృందంబులు, దిక్కుదోచక దిగులొంది యిట్లనిరి.

శ్లో॥ గగనం గగనాకారం। సాగరస్సాగరోపమః
రామరావణయోర్యుద్ధం। రామరావణయోరివ॥

హిం॥ అరయ గగనమునకు గగనమేసాటి అటువలెనంబుధి కంబుధిసాటియగా
పరికింపగ రామరావణయుద్ధము సరిపోల్పగ రామరావణ యుద్ధమగా ॥శ్రీ

(2) సకలజగములకు గోబ్రాహ్మణులకు స్వస్తియగుంగాకయని పల్కుచును
జగదీశుడు శ్రీరామభద్రునకు జయముగల్గునని జపముజేయుచు

(3) గరుడగంధర్వ సురమునివరులు గములుగట్టి సంగ్రామముజూడ
ధరణీకాంతుడు దశరథరాముడు నరికెవానితల కుండలయుతముగ ॥శ్రీ

తే॥ ధరనుబడగూల్ప దశకంఠుతలలనపుడు మొలచె నెప్పటియట్టుల తలలుమరల
అట్టులే నూరుశిరముల నవనిగూల్ప మొలచుచునువచ్చె నచ్చెరువొలయ నపుడు

వ॥ రామచంద్రుండదిగని యిదియేమిచిత్రంబు ఖరదూషణ మారీచాది రక్కసుల తుత్రిటిలో సంహరించితిని ఈనీచుండు చావకుండుటకు కారణం బెద్దియోయని చింతించునెడ మాతలి శ్రీరామవిభునితో

జోర:-ఏమి యెరుంగనివానిమాడ్కి నీ వేవో యస్త్రములనేయగ
ఏమి ఫలము బ్రహ్మాస్త్రం బిపుడే వేయుము రఘువరవేగ ॥జ

వ॥ అన విని రామచంద్రుండంత, బ్రహ్మ, మున్ను అగస్త్యున కొసంగినట్టి మహనీయంబైన బ్రహ్మాస్త్రంబుబట్టి రావణుని తలలను బడగూల్చిన, నాయస్త్రంబు వాని వక్షంబు ఛేదించి భూమిపై బడియె.

జోర:-ప్రాణముబోవగ రావణు చాపము బాణము బడె నిలపైన
ప్రాణము బాసిన ప్రభుగని ఏడ్చుచు బడి రసురులు బహు దుఃఖమున ॥జ

(2) లంకకు బోయిరి రక్కసు లందరు బింకము వీడియు నంత
ఝుంకారంబులు సల్పుచు కపులు జయమని బొగడిరి వేడ్క ॥జ

(3) దుందుభి రవములు చెలగె మింటను గంధర్వులు బాడిరివేడ్క
బృందారకులు పువ్వులు గురిసిరి పొందుగ రాముని మీద ॥జ

(4) శాంత మనస్కులై సజ్జనులందరు సంతోషించిరి మరియు
చింతలు వీడిరి దిక్పాలకులు శ్రీరాముని బొగడుచు నపుడు ॥జ

(5) ఘనముగ కమ్మని గాలివీచెను కడు వెలిగె మింట భాస్కరుడు
జనులు దిరిగిరి విచ్చలవిడి తమ మనముల భయములు వీడియును ॥జ

(6) ఆదమరచి నిద్రించిరిలోకులు హర్షించె సర్వభూతములు
అదశకంఠుని మరణంబునకు మోదమందె భువనములు ॥జ

(7) అంతవాయుసుతు డర్కతనయుడా లక్ష్మణుగూడియుసీతా
కాంతునిజేరి ప్రస్తుతించిరి కడువేడ్కతోడనంతా ॥జ

వ॥ విభీషణుం డట్టియెడ రావణునిజేరి కన్నుల జలంబుల కాల్వలై పాఱ రోదనంబుజేయుచు అన్నా, వీరుండవై యింద్రాదుల జయించిన నీకిట్టిదశ సంప్రాప్తంబయ్యెనే! నేలపాలైతివే ఎన్నియోమార్లు నేదెల్పినను మోహాంధకార మగ్నుండవగు నీకు రుచింప దయ్యెనే! కుంభకర్ణుండు నీతిదెలుప వినవైతివి. ఇంద్రజిత్తు ప్రహస్తుడాదిగాగల రాక్షసుల దుర్మోభఫలువిని యిట్టిఫలం బనుభవించితివి. నేచెప్పినదంతయు వృధయయ్యె, కాలంబుదప్పింప వశంబెవ్వరికగు రాక్షసరాజా! అన్నాయని విలపింప, నాతనితో శ్రీరామభద్రుం డిట్లనియె.

తే॥ ఏలనిటు లేడ్చెదవు నీతిహీనుమాడ్కి చాల బలశాలి యుద్ధవిశారదుండు
జంకకింతయు బోరిలోఁ జచ్చి యిపుడు
చేరె స్వర్గంబు మీాయన్న చింతవిడుమి

తే॥ పడయగోరియు పరలోకవరమ సుఖము శూరు లిల నల్పుకురుగాదె పోరులిట్లు
గెలుపు నోటమి వారికిఁ దెలియఁదరమె వీరులగువారి చావుకై వెతలివేల?

వ॥ కావున తత్వార్థంబెఱింగి దుఃఖంబు మానుమనిన శ్రీరామునింగని విభీషణుం
డధికశోకంబున దేవా యీా రావణుం డనేక ధర్మంబు లాచరించినవాడు వేద
వేదాంగవిదుడు. గురుదైవంబుల భక్తిశ్రద్ధలతో గొల్చువాడు దీర్ఘతపంబు
లొనర్చినవాడు. అయినను నీయిట్టి లోకోత్తర చరితునకు దత్తరపాటొదవించి
న యీా యుద్వృత్తునకు నేనుత్తరక్రియ లాచరింపనేరనన శ్రీరాముడు మిత్రి
మూా! వైరము లామరణాంతములుగాని యటుపై నుండదగినవికావని యె
ఱుంగవే? కావున నీ వీ మహనీయున కౌర్ధ్వదైహిక క్రియలు వేగమ నెరవేర్పు
మని యానతిచ్చె నట్టియెడ రావణునిసతులు

ద్విపద:- విరిసినజడలు పూసరములతోడ । తరుణులు శోక సంతాపంబుమీార
ఉరములు శిరములు మరిమోదుకొనుచు। పరమదుఃఖంబున పతిజేరవచ్చి
హారాజరాజేంద్ర హాప్రాణనాథ । వీరవరాక్రమ విబుధేంద్రవైరి
చేరితే దివిని దేవారిని వ్విడిచి । ఏరీతితాళుదు మిలయందుమేము
గొనివచ్చితివిభూమికూతు నీమృతికి । వినజాలవైతివి వినయపూరిత
లనుజునిపలుకుల నాగ్రహంబునను । వినక యాఘనునూరు వెడలగొట్టితివి
సీతనిచ్చియు రాముచెల్మిసేయకను । ఈతీరుగూలితి వేమందుమింక
మాతలవ్రాతిది మహనీయ తేజ । పాతకివైతివి సీతనువిడక
హతమైతికులమును హతముజేసితివి । పతిహీనలై మేము బ్రతుకంగవలసె
అనుచు రావణుజుట్టి అతిదుఃఖమునను । కనులబాష్పంబులు కాల్వలై పాఱ
వనవుచు నేడ్వ పడతులందరును। వనితమండోదరి పలికెశోకమున

జోర:-దనుజేశ్వర యిటు గూలితివే యిల ధర్మము దప్పియు నీవు
ఇనకులోత్తముండగు రామునిచే మనుజాసన కాముక యిపుడు ॥జ

(2) ధీరుని శాస్త్రాస్త్రకోవిదుని చేరియు రణరంగమున
యేరీతి నిను దుంచె నరుడహా యెంతచెట్టయిది తలఁప ॥జ

(3) ఖరాసురాదుల జనస్థానంబున బరిమార్చుట వినిపుడె
యెరిగితి రాముడు నరుడుగాడని పరమపురుషుడని నాడే ॥జ

(4) కరువలితనయుఁడు లంకఁజొచ్చియు గాల్చిననాడే మదినీ
పరితపించితిని లంకకు చేటుపాటిలు ననుచును మరినీ ॥జ

(5) వనచరులందరు వారిధిగట్టి వచ్చి లంకను జొరగా
నరమాత్రుఁడు గాడని శ్రీరాముని నమ్మితి హరియని మదిలోనా ॥జ

(6) కాలుడు రాముని రూపంబున నిను ఖండించెను రణశూరా
నేల బడియు పెనుధూళినుండు నిను నెటుజూచెద రక్షోవీరా ॥జ

వ॥ అని యేడ్చుచు మరల నిట్లనియె.

శహాన - ఆది

ప॥ పరాత్పరుడు నారాయణుడు భక్తవత్సలుడై యవతరించె ॥ప

అ॥ కరుణాకరుడు కకుత్స్థకులభూషణుడై నిరతిశయ నిరుపమ నిత్యకల్యాణుడు ॥ప

చ॥ శంఖచక్ర గద పద్మాది సాధనుడు శాశ్వతుడు
పంకజనాభుఁడు పరంధాముడు భద్రమొసగ మునిసురవరులకు ॥ప

(2) శ్రీనిలయుడు శ్రీవత్సలాంఛనుడు శ్రితజన మందారుడు దేవాదిదేవుడు
మానుషవేషమున కోదండరాముడై! మహినివెలసె నవకోసలమున ॥ప

తే॥ వానరులఁగూడియును జగద్వల్లభుండు అసురవీరులతో నిన్ను హతముజేసె
హితము గావించె లోకాలకెల్ల నిపుడు మానవాకృతితోడ, నీమహినిబుట్టి॥

వ. ఇంద్రియ జయంబులేని నిన్ను పగచే నాయింద్రియంబులు గెలిచె. ప్రాణనాథా యని విలపించుచు మరల నిట్లనియె.

జోర:-పగ రామునితో వలదని నీతో బల్కనె మును రాజేంద్రా
తగునని మైథిలి దొంగిలితెచ్చియు ధరనుగూలితివి దనుజేంద్రా ॥జ

(2) పతివ్రత సాధ్వి భర్తృవత్సల పరమపావనీ సీతా
సతిని దెచ్చి యిటు దగ్ధమైతివి సమరంబున రామునిచేతా ॥జ

(3) అనుభవించితివి పాపఫలంబిటు అసురేశ్వరా నీకెందు
అనురూపంబగు వనితలు లేరె ఘోరా విధిబలమేమందు ॥జ

వ. నాథా పాపం బొనర్చినవారు పాపఫలం బనుభవింపక తప్పదు. శుభం బొనరించిన సుఖం బనుభవింతురు. విభీషణుండు పుణ్యరతుండై సుఖించె. పాపశీలివిగాన నీవిట్టి కష్టంబులపాలైతివి. ప్రాణేశా! నిను విడిచి నేనెట్లు జీవించెద

అని రావణుని వక్షంబుపైఁబడి మూర్ఛిల్లిన సపత్నులా సుందోదరింజుట్టి, హా నాథా నాథాయని బాష్పధారలు గురియ నేడ్చుచుండిరంత, శ్రీరామభద్రుండు విభీషణునిగని,

తే॥ అనఘ యీస్త్రీలఁబన్పు మవ్వలికి నిపుడు
అన్న కొనరింపు సంస్కార మాదరమున
అనిన యోచించి రాముని కనియెనిట్లు
ధార్మికుఁడు విభీషణు డంత ధర్మమరసి॥

హిం॥ కరుణాహీనుడు ధర్మవిదూరుడు కలుషచిత్తుడు కల్లరివాగు
పరస్త్రీ సక్తుడు వైరియు నాకు అరయగ నుపద్రవకారి జగములకు ॥శ్రీ
(2) వీనికి నిపుడు విధిహితముగ నే నెటుల జేసెద సంస్కారాదులు
పూనియు నేను జేయకున్నమరి పుడమి జనులు దిట్టరె నీచుండని ॥శ్రీ
(3) అనవుడు నాతని పల్కులు వినియు ఘనుడు శ్రీరాముడు కరుణ నిట్లనియె
వినుమా నాకు ప్రియమగు కార్యము అనఘా జేయుము జయమగు నీకు ॥శ్రీ
(4) ఎరుగుదు నేను ధర్మాధర్మము హితమెఱిగించితి వివిధకృత్యములు
అరమరలేక చేయుము వేగ మరణాంతమున వైరములేదు ॥శ్రీ
(5) అవినీతుండు అయిననుగాని అతిబలవంతుడు వీర్యవంతుడు
వివరింపగ దశకంఠుడు కేవలు డేవెరవడు ధీరుడు రణశూరుండు ॥శ్రీ

వ॥ అను రామునివాక్యంబు లాలించి విభీషణుండు చందనకాష్ఠంబుల చితిపేర్చి శాస్త్రోక్తంబుగ దశకంఠుని గంధమాల్యాదులగైసేసి నూతనవస్త్రంబుగప్పి చితిపైనునిచి కన్నీరుగార అగ్ని సంస్కారంబుగావించి స్నానంబాచరించి ఆర్ద్రవస్త్రంబుతో తిలోదకంబులువిడచి మొక్కి రావణుసతుల నూరార్చి నగరి కనిపి శ్రీరామవిభునిజేరి నిలచియుండెనవ్వాడు.

జోర:- రామచంద్రుడు సైన్యయుతంబుగ సౌమిత్రిభానుజులు గొలువన్
భీమబలుండగు వృత్రునిజంపిన వృద్ధశ్రవువలె వెలుగన్ ॥జ
(2) రామవిక్రమము రావణువధయును రాక్షసవానర రణమున్
సౌమిత్రి శౌర్యము భానుజుమైత్రియు వేమరు బొగడుచునపుడు ॥జ
(3) సురమునివర్యులు వెడలిపోయిరి హర్షంబున పొంగుచును
కరుణను రాముడు మాతలిసింద్రుని పురికనిపెను ప్రియమలరగను ॥జ

(4) వనచర సేనలు గొల్వ రాముడు ఘనుడా లక్ష్మణుబిలచి
వినవమా మన కతిభక్తుడు రక్తుడు దనుజవీరుడు మరినీ ॥జ

(5) మన కుపకృతి గావించినవా డీఘనుడు విభీషణుడు
అనువుగ గావింపు మభిషేక మితనికి అనుజా లంకాపురము ॥జ

(6) పరమాభీష్టం బిదియె నాకన హర్షంబున లక్ష్మణుడు
పురికిం జనియె విభీషణుగూడియు మురియుచు కపివర్గము గొలువగను ॥జ

(7) కనకకలశముల సింధుజలంబులు గొని తెచ్చిరి కపు లతివేగ
అనువుగ అభిషేకము గావించె లక్ష్మణుడు అసురవీరునకు మోదమున ॥జ

(8) సంతసింపగ సచివవర్గము సర్వజనులు వినుతింప
మంత్రాక్షత లిడి రసురముఖ్యులు మరి లాజలు సుమములతోడ ॥జ

(9) రామదత్తమా రాజ్యము గైకొని రక్షోనాథుం డపుడు
ప్రేమను కానుకలుగొని చని శ్రీ రఘురాము జేరె వినయంబునను ॥జ

వ॥ శ్రీరామచంద్రుం డంత సంతోషితస్వాంతుండై ఆంజనేయునిగని, నీవు లంకకు బోయి మద్విజయంబు రావణుని మరణంబును, పృథ్వీసుత కెరిగించి, యాదేవి సందేశంబు గొని రమ్మనిన, రాము నాజ్ఞ శిరసావహించి, అశోకవనంబు ప్రవేశించి, సీతాదేవింగాంచి, నమస్కరించి,

తోడి_ఆది

ప॥ అమ్మా శ్రీరామచంద్రుడు హరివీరులు గొల్వ వేడ్క ॥అ

అ॥ తమ్మునిగూడి యున్నవాడు ధరణితనయ జయము చేకొని ॥అ

చ॥ తరుణీమణి శ్రీరాముడు దశకంఠుని బరిమార్చెను
పరమప్రీతి తనవిజయము నీ కెరుగదెల్పి రమ్మనెనను ॥అ

(2) ఆవిభీషణు సాయంబున రావణుపుత్రమిత్రులతో
దేవీ వధియించె నిపుడు ధీరుడునవకోసలేశుడు ॥అ

జోర:- జననీయిట మద్భాగ్యవశంబున మనియున్న దానవు నిపుడు
జనకతనయ జయకాలమువునకిది సత్కీర్తిగలై జగమందు ॥జ

(2) సరసిజాక్షి శోకంబునువిడచి స్వస్థచిత్తవుగమ్మా
పరమపావనీ లంకారాజ్యము భావింపగ మనదే నికనమ్మా ॥జ

వ॥ తల్లీ శ్రీరాముని యాజ్ఞానుసారము నిన్నుజూడ విభీషణుండింకు వచ్చుననిన, చంద్రబింబాననయగు సీత దిగ్గనలేచి మాటలాడక నిలచియున్న గని హను మంతుండు, దేవీ నాతోపలుక వెందులకనిన సీత గద్గదకంఠయై

హిం:- ప్రాణేశ్వరుని విజయముదెల్పెదు పావని నీ ప్రియవాక్యంబులువిని
ఆనందంబున పరవశనైన నే హనుమంతా బల్కజాలనైతిని ॥శ్రీ॥

(2) అనఘామత్ప్రియ మెరిగించినసీకు అర్హావస్తువే మర్పించెదనని
మనమున నెంతో యోచించితిగాని యొనరగ నీడైనది లేదీయిల ॥శ్రీ॥

(3) వివిధమణులుగాని విశ్వంబునగల వెండియుపసిడి కొండలుగాని
పవనజ నీమమాటకు సాటి భావింపగ భువిగల్లదు నెద్దియు ॥శ్రీ॥

(4) అనవుడు ప్రాంజలియగుచు పావని వినయోక్తుల నిట్లనియెను భక్తిని
జననీ పతిహితకారిణి వగునీకు అనువగునిట్టి మధురోక్తుల బల్కగ ॥శ్రీ॥

(5) పతివిజయంబు బల్కినవానికి భావింపగ సర్వావస్తు వొసంగ
క్షితినిగననంచు బల్కితివమ్మ స్నేహపూర్ణమై సారయుక్తంబుగ ॥శ్రీ॥

(6) దివ్యసన్మణి వితతులకంటె దివిజరాజ్య శ్రీవిభవముకంటెను
అవ్యయువిజయోత్సాహుని రాముని హర్షంబున సేవించుటె మిన్న ॥శ్రీ॥

వ॥ అతిమధురంబగు హనుమంతుని వాక్యంబులకలరి సర్వలక్షణశోభితంబగు మా టలాడ నీవనేర్తువని,

హిం.-అనిలసుతుండవు అతి ధార్మికుడవు ఘనబల శౌర్య వీర్య పరాక్రమ
వినయ వివేకాది ప్రశస్తగుణంబులు అనఘా నిన్నే యాశ్రయించినవి ॥శ్రీ॥

(2) ఆవచనంబులువిని హనుమంతుడు హస్తయుగ్మములుమోడ్చి అతి వినయంబున
జననీ యిపుడీ రాక్షసవనితల అనుజ్ఞ యిచ్చితివేని హత మొనరించెద ॥శ్రీ॥

(3) పతియె దైవంబని భావించెడు నిను అతి క్రూరత నదలించి బెదరించి
క్షితివరతనయా దుఃఖపెట్టిరిగాన హతముజేసెద వీరి ననవిని మైథిలి ॥శ్రీ॥

(4) అపకారము గావించిన వారి కుపకారము జేతురు సజ్జనులు
అపకృతి జేయరు ఎట్టివారికిని ఆర్యులమతమిది సత్యసంపన్న ॥శ్రీ॥

వ. అనిన హనుమంతుండు రామునికి దగిన పత్నివని కొనియాడి దేవీ! శ్రీరాముని సన్నిధానమునకు బోయెద నీవేమి చెప్పెదవనుడు, నాయనా! శ్రీరాముని జూడ గోరెదనన, లక్ష్మణాన్వితుండును, హతవైరియు, శరణ్యుండగు శ్రీరాముని

శీఘ్రంబున జూచెదవని పల్కి నమస్కరించి, అతి వేగంబున శ్రీరామచంద్రుని
జేరంజని, యిట్లనియె.

జోర:- శోకాకుల మానసయై సతతము సురిక్కుచు నుండెడు సాధ్వి
ఆకర్ణించియు నీదు విజయము ఆనందించెను మరిని ॥జ

(2) మనుపతి పరిచయమున జనకాత్మజ నను నమ్మియు వేగమున
అనఘా లక్ష్మణసహితుండగు నిను గనగోరెను అతిమోదమున ॥జ

(3) అన విని రాముడు కనుగవనీరు గ్రమ్మగ నిట్టూర్పునను
మనమున చింతగదుర విభీషణు గని యిట్లనె శీఘ్రంబునను ॥జ

(4) సీతను మూర్ధస్నాతనుజేసి శీఘ్రమె దోడ్కొని రమ్మనిన
చేతోముదమున అత డంతఃపురస్త్రీలతో జని సీతనుగని మోదమున॥

(5) అంగరాగము అలదుము దివ్యాభరణంబులు దాల్పుమి యిపుడు
పొంగుచు పతివీక్షింపగోరె నిను బోదము వేడుక ననుడు ॥జ

(6) వినిజానకి యిట్లనియె హర్షమున అనువుగస్నానాదులను
గానన్నొల్లను నే శ్రీరామచంద్రుని గనువరకును ననవినియు ॥జ

(7) ఆవిభీషణుండనెనిటు జననీ భూవిభునాజ్ఞనుజేయు
దేవీ నీకు అర్హమ యన మది భావించియు ప్రియమలర ॥జ

(8) పతియేదైవంబని భావించెడు భక్తిశీలగావునను
సతి తానప్పుడు వల్లెయనగను జలకమార్చి ముదముననను ॥జ

(9) అలంకరించియు వస్త్రభూషణా లతివకు నిడి వేగమున
చెలువముమీరగ మేలిముసుంగిడి శిబికనెక్కించియు మోదమున ॥జ

(10) రాక్షసాంగనలు గొలువజానకిని రయమున దోడ్కొనియపుడు
రక్షోనాథుండగు విభీషణుడు రాముని జేరవచ్చె శీఘ్రంబు ॥జ

(11) జనకజవచ్చుట నెరిగిరాముడు ధ్యానస్థితి నుండగను
గనివిభీషణుడు సీతవచ్చెనని వినయంబున బలుకగను ॥జ

తే॥ చాలకాలంబు రక్కసునదనమందు నుండిమైథిలి రాఁగఁదా బెండుపడియు
హర్షరోషవిషాదంబు లంకురింప అసురనాథునిగని పల్కె నవనివిభుడు

తే॥ సీతదోడ్కొని రమ్మిటజేరననిన వినిమహీసుత తోడ్తెచ్చె దనుజవిభుఁడు
భార్యాదీరియు కంచుకుల్ చేరి యచట తలఁగుతలఁడని కవులసుదఱుముచుండు

జోర:-వానరవీరులు ఘోరముతోఁలగుచు నపుడు వారిరవము జేయఁగ
జానకివడి యాసంభ్రమముఁగని సదయతకోపముతోడఁ

(2) ఏలవిభీషణ జను లేచెదరిటు నేటికినలయింపంగ
చాలింపుము నీయత్నము నాకు స్వజనులు వీరందరు గనుగొనగ ॥జ

(3) చేలంబులు తెరలడ్డముగట్టగనేల విభీషణవినుము
స్త్రీలకు శీలమెసంరక్షణమగు చాలవిపరీతములుమరియు ॥జ

(4) సమరంబుల వ్యసనంబుల యాగనమయంబులను మరి నీ
ప్రమదంబున స్వయంవరములయందు పడతులగాంచుట కార్యముగాదు ॥జ

(5) కావున సుహృజ్జనయుతుఁడగు ననుగన కాంతనియ్యెడకు రమ్మనుమ
నావుడుమది శంకించుచు సీతాదేవిని దోడ్తెచ్చెను వేగమున ॥జ

(6) రామునిపల్కులు ముఖచిహ్నంబులు రవిజుడు వాయుసుతుండు
సౌమిత్రియు దలపోయుచుండి రిది ఏమోనని వ్యాకులమునను

(7) జనకజ సిగ్గునుభయమును బెనగొన దనుజేంద్రుని వెనువెంటఁ
వనజదళాక్షివచ్చి నిలచె నా ఘనుడు రాఘవుని చెంతఁ ॥జ

వ. అంత నా సాధ్వీమణి దీనవదనయై ప్రాణనాథాయని బలిచి బిగ్గరగ నేడ్చుచుండ సీతను దీర్ఘకాలము ముఖంబెత్తి జూడకుండు నాథుని ముఖపంకజంబాలోకించుచుండె నప్పుడు, రఘువీరుండు కోపంబు దీపింప, తన ప్రక్క నిలిచియున్న సీతతో సిట్లనియె.

సీ॥ కంటకుండౌ దశకంఠుని దునిమి నే గైకొంటి నిన్నిప్డు కమలనయన
కీర్తివహించితి నార్తిదొలంగె నామగటిమిజూపితి జగములెరుగ
పల్కిన ప్రతినయు బాగుగ నొనరించితి నే స్వతంత్రుడనైతి నెలతవినుము
భూసుత నాసరి భూపాలకులలోన దలయెత్తి దిరుగంగ గలిగెనాకు
పరిభవముగల్గ దానిని బాపుకొనక
యున్న పురుషుఁ డధము డీ యుర్విలోన
గాన నేలేనితఱివచ్చి దానవుండు
నిన్ను గొనిపోయె దైవికం బెన్నఁదరమె?

వ. సీతా ! యట్టి దోషంబంతయు నావలన నివారితంబయ్యె. సముద్రంబు దాటుటయు లంక భంగముగావించి, రాక్షసవాహినీ సహితుండగు రావణుని సంహరించుటయు సుగ్రీవ హనుమ దంగద విభీషణ వనాటుల శ్రమంబంతయు

సఫలంబయ్యె ననునవాక్యంబులు వినుచు సీత కన్నుల నశ్రుధారలు గురియు చుండె. రాముం డాజ్యాహుతి యందు నగ్నిహోత్రునివలె క్రోధంబుమీర బొమలు ముడివడ జనకసుతను కనులెత్తిచూడక

జోర:- హితులగూడి నే శత్రువీరుల హత మొనరించుటయిపుడు
సతి నీకొఱకై కాదని తెలియుము సత్యముదెల్పితివినుము ॥జ

(2) కులగౌరవమును గాపాడుటకిలదెలియగ నాశీలంబుగ
దొలగింపగ నపవాదము కీర్తినిలుపగజేసితి సమరంబుగ ॥జ

(3) కావునశంకితచరితవు నీవికబోవుమి యెచ్చటికైనా
దేవీనాసన్నిధినిలువకు మాజ్ఞయిచ్చితి తరలుము వేగమున ॥జ

(4) ఉత్తమపురుషుండగు వాడెవ్వడు శత్రుసదనముననున్న
యత్తరుణిని గ్రహించునె మరల అతివదెల్పు లోకమున ॥జ

(5) దుష్టుడు తనయంకంబున నిడినను దోషపుచూపుల జూడగ
భ్రష్టవైతివి చేకొనుటెట్లు శిష్టుఁడనగు నేభువిలోనా ॥జ

(6) మానహానికరమగు కార్యమురాముడు మానినిచేయుండెపుడు
పూనియు దశకంఠుని దునిమితినిపుడు భూసుతనీపై మోహములేదు ॥జ

దేవగాంధారి—ఆది

ప॥ నీకై నే నీరధిదాటలేదు నిక్కము వినుజానకీ

అ॥ లోకకంటకుండగు రావణు దునిమి లోకాతీతంబౌ భుజబలమును దెలిపితి ॥నీ

చ॥ దనుజు నింట నున్నదానవు గాన ధర్మముగాదు గైకొననిన్ను
మనమున నింతయు మరులులేదునీపై జను మెటకైన సుఖముండుచోట ॥నీ

(2) భరత శత్రుఘ్నుల భర్మహార్మ్యములకో భాస్కరతనయుని పట్టణమునకో
అరుగుము లేక అసుర విభుచెంతకో అవనిని నవకోసలాధిపు దలచుచు ॥నీ

వ. దేవీ దివ్యరూపంబున మనోభిరామవై తనయింట జిక్కియున్న నిన్నుచూచుచు దశకంఠుండా చాలకాలమోర్చి యూరకుండెనా గాన నిన్ను నేనొల్ల. రాము కుడగాను నీయిచ్చవొలది జనుమన అప్రియంబులు పల్క విభుని పల్కులు విని గడగడ వడంకుచు

తే॥ రోష నిష్ఠురములు బహుభాషణములు నిండుసభబల్క విభుగని నెలతయపుడు
లజ్జచేతను తలవంచి లలితశీల కనులబాష్పంబు లొలుకంగఁ గరముకుంది

తే॥ భర్త గనుగొని పల్కెడాఁ బరమసాధ్వి దుష్టుఁడగు వరుఁడిలను దుర్మార్గయువతి
బలుకు రీతిని బల్కుట భావ్యమగునె సందియంబేలకల్గె నాయందు నాథా

డోర:-నీతివిహీనులు సతులందరునని యెంచితివేమదిరామా
యీతీరునశంకింపనేటికి నెరుగవె నాశీలము జయరామా ॥జ

(2) నేవివశగబడియుండునపుడు నావపువంటెను రావణుడు
దైవంబే కారణమగు దీనికి తథ్యము నాథావినుము ॥జ

(3) ఏటికిదాచితి వింతిదాకనిటు వివరింపక మర్మముతోను
బూటక మాహానుమంతుని బంపుల భూరివిక్రమ వినుము ॥జ

(4) అనఘానీవప్పుడెదెల్పిన నా తనువువిడువనే చెపుమా
అనుజునిగూడి హితులతో కష్టములనుభవింపనేటికి సమరమున ॥జ

(5) మేలుకీడులుగా దలపక నీచుని పోలికబల్కెదఘోర
చాలుచాలు నావలపు సువృత్తము ఏలదలపవిటు మదిలోనా ॥జ

కమాను చాపు

ప॥ ఏలనిట్టిశంకగల్గె ఇనకులాంబుధి చంద్రినాపై ॥ఏ

అ॥ బాలప్రాయమునుండి నా భావమెరిగియు రఘురామ ॥ఏ

చ॥ దైవమునీవని దలచియుండగాను
దయమాలియిటులనుట ధర్మమానా దెల్పు ॥ఏ

(2) ఇరువుర మొక్కటై చరించుట నీవు మరచితివా కష్టసుఖముల ప్రాణేశా

(3) ధరణి నవకోసలధామ నాపై నీదు దయయున్న నదేచాలు దశరథనందన

వ. ఇట్లు పల్కుచు దుఃఖాక్రాంతయై సీత డగ్గుత్తికతో చింతాసాగర మగ్నురాలై
యున్న మరదింగని లక్ష్మణా విను:

ఉ॥ భూమిని నాడు పుట్టుకయు పుట్టనె పుట్టగరాదు
పుట్టుచో నీమహిభర్తగూడి సుఖమెంతయు సంశత మొందగావలెన్
కామినికన్నఁ జూడఁ గొఱగాని పదార్థము లేదులేదిలన్
రాముడు సాక్షిగా నిజము రామలజన్మము నీచమారయన్॥

చ॥ జనకుడు మామయు స్మగడు శాంతుడు దాంతుడు
కంతుడైననే వనితకు సర్వసౌఖ్యములు వావిరియుండిన

ప్రాప్తమా దినమదియేదియో దెలియ చేవతలైనను
గానరొక్కొ నా మనము విపాదమందె ఫలమింతయులేదు మఱంది లక్ష్మణా॥

కం॥ అక్కట శ్రీరఘువీరుడు మక్కువ విడనాడి నాదుమదిని నొవ్వంగన్
చిక్కులబెట్టఁగ జెల్లునె యిక్కటిక తనంబు నితని కెటుగలైనో॥

తే॥ చెట్టు పుట్టలగు చుచేరిపుట్టగవచ్చు మట్టుమీరి యాడుపుట్టుకయును
పుట్టరాదు భువని బుట్టితి పణతినై పుట్టినట్టిఫలము పొందగంటి॥

వ॥ దయారహితుండైన నను మన్నాథుండగు రాముని విడిచి బ్రతుకజాలకావున.

ఝోర:-అనఘా చితి నేర్పరచుము వేగమె అందుజొచ్చెదను వినుమి
పెనుశోకంబున కౌషధం బిది ప్రాణమునిల్పజాల నిక భువిని ॥జ

(2) అని జనకాత్మజశోకభరంబున ఆడినమాటలు వినియు
ఘనుడగురాముని వదనముజూచి అనుమతించుటయు గనియు ॥జ

(3) అంతట చితినేర్పరుప లక్ష్మణుడు అవనిజ రాముని కపుడు
ఎంతయుభక్తినివలగొని యగ్ని చెంతజేరి జానకియు ॥జ

వ॥ సురముని ద్విజబృందంబులకు నమస్కరించి చేమోడ్పు గీలించి

దర్బారు–ఆది

ప॥ పావకావందనమిదె ॥పా

అ॥ భావించిశ్రీరాముని పదసరోజముల్
పదిలంబుగ నామదినిల్పియుంటినేని కావుమునను కరుణను ॥పా

చ॥ త్రికరణశుద్ధిగ నాప్రాణేశుని సతతంబు గొల్చు దాననేని
ప్రకటితముగ ననుపాలింపుము ధర్మమరసివేగ ॥పా

(2) భువనరక్షకుడగు రఘువీరుని మనసెరిగియునే జొచ్చెద నగ్నిని
నవకోసల పురవాసులు బొగడగ నరసుర మునిగణములు సన్నుతింప ననుబ్రో[వుము ॥పా

ఝోర:-సూర్యచంద్రులు దిక్కులు వాయువు సురముని బృందంబులును
ఆర్యులుఘనులు నాదుశీలము నెరుగుదురేని మరియు ॥జ

(2) అనుమానము నాయెడలేదేని అఖిలజనము లెరుగంగన్
ననురక్షింపుము హవ్యవాహనయనుచు మొక్కివేగమునన్ ॥జ

(3) అతిభక్తిని ప్రదక్షిణంబు దానాచరించియపుడు
చతురత ధగధగమండెడు నగ్నిలో సాధ్వి జేరె శీఘ్రంబునను ॥జ

వ॥ ఆబాలవృద్ధసహితంబుగ శోకార్ణవమగ్నులై భీతిలుచుండిరి; ఆ మహానుభావు రాలగు భూసుత అగ్నిలోబడినంత మూడులోకంబులు గడగడవడంకె మహాధ్వరంబునంబడు నాజ్యంబోయన ఆదేవి వికారశూన్య మానసయై అగ్నిజొచ్చియున్నగని అచ్చటమూగియున్న స్త్రీపురుష దేవదానవ గంధర్వ యక్ష నాగకిన్నర మిథునంబులు కపిసమూహంబులును అసురులును హాహాకారంబులు సేయుటయు ఆశబ్దంబు నింగిముట్టి సర్వభూత భయావహంబయ్యె నప్పుడు

జోర:-ఆరావము విని శ్రీరఘురాముడు అశ్రులు కన్నులగారగ్
ధీరుండయ్యును ముహూర్తకాలము దిగ్భ్రమజెందెను చింతగ్॥

(2) వనజాసనుడాదిగ దిక్పతులు కనుచును గగనమునుండి
దినమణి సన్నిభమగు విమానముల మునుకొనియుండిరి వెంశీ ॥జ

(3) అందరు రాముని సన్నిధిజేరి వందనములు గావించీ
సుందరమూర్తిని శ్రీరఘురాముని స్తుతియించిరి భక్తిని మించీ ॥జ

(4) దేవదేవ శ్రీరామచంద్ర హరిదీనరక్షసర్వేశా
నీవెఱుంగని దేమున్నది భువి నిర్వికార పరమేశా ॥జ

మత్తకోకిల:-నీవె విష్ణువు బ్రహ్మ రుద్రులు నీవె సర్వజగంబులున్
నీవె సూర్యుడు నీవె చంద్రుఁడు నీవె కారణమంతకున్
నీవిటుల్ దలపోయుచుండుట నీతియే నృపకుంజరా
గావుమా కరుణాపయోనిధి కంజనాభరమాపతీ॥

మత్త:-జగములన్నియు చంద్రసూర్యులు
సమయునప్డా కరుండవై త్రిగుణహీనుఁడవై వెలింగెడు
దివ్యరూప పరాత్పరా దగునె ప్రాకృతభంగి నీవిటు ధరణిజన్
విడనాడఁగా నిగమగోచర జనకపుత్రిని నెయ్యమారఁగ నేలుమా॥

వ. అత్తఱి విరించి యిట్లని వచించె.

సౌరాష్ట్ర—ఆది

ప॥ శ్రీరామ జయరామ శ్రితజనకామ కారుణ్యాంబుధిసోమ కల్యాణరామ ॥శ్రీ

చ॥ వేదాంతవేద్యాహరి విశ్వవినోదా ఆదికారణశౌరి అఖిలలోకేశ
  శ్రీధరకేశవ చిదచిదాకార మాధవగోవింద మంగళాకార ॥శ్రీ
(2) మత్స్యకూర్మ వరాహా నారసింహరూప అచ్యుత వామనహరి శ్రీరఘురామ
  నిశ్చల నిర్గుణ నిరుపమతేజా నిరతిశయానందా నిరవధి సుఖద ॥శ్రీ
(3) శ్రీ మహావిష్ణుడవు శ్రీలక్ష్మియె సీతా యీమహిని బుట్టితిరి విబుధులువేడా
  కౌమారిప్రియసుత కౌసల్యరామ స్వామీనవకోసలధామా జయరామ ॥శ్రీ
జోర:-మానుషవేషము దాల్చి రావణుని మర్దించితివీ రణభీమా
  దీనావన మాకోరికలన్నియు దీరెను దశరథరామా ॥జ
(2) నీవీర్యంబు బలమును శౌర్యము నీపరాక్రమము
  దేవానీదుదర్శనంబును భావింప నమోఘము ఘనము ॥జ
(3) పాలింపుము బహుకాలము భూమిని పరమానందముమీర
  ఆలింపుము మా మనవిప్రియంబున ఆదిదేవ కృపతోడ ॥జ
(4) నీపై భక్తిగల నరులెపుడు నిర్మలాత్ములగుచు
  తాపత్రయములబాసి సుఖింతురు ధన్యులగుచు సతతంబు ॥జ

హంసధ్వని—ఆది

ప॥ శ్రీజానకీ చిత్తాబ్జభృంగం శ్రీరాఘవం దయాంతరంగం ॥శ్రీ
అ॥ రాజరాజేంద్ర సురపూజితం రాజీవనేత్రం రమణీయగాత్రం ॥శ్రీ
చ॥ శివసనకాదిసేవిత చరణం శ్రీరఘుకుల వరభూషణం
  నవకోసలనాథ శ్రీరమణం నారాయణం భవభయహరణం ॥శ్రీ
శ్లో॥ నమస్తే పద్మనాభాయ కౌసల్యాహర్ష కారిణే
  నమోరాజీవనయన నమస్తే లక్ష్మణాగ్రజ
  నమోనమస్తే కాకుత్స్థ నమోదామోదరాయచ
  విభీషణ పరిత్రాత ర్నమ స్సంకర్షణాయచ॥

హిందోళ_ఆది

ప॥ వరదాఖిల లోకబంధూ వాత్సల్యఘనసింధూ ॥వ
అ॥ పరిజనపాల యువిభూ భక్తార్తిహరణ పాహిపాహిశ్రీ రామప్రభూ
చ॥ పరమకల్యాణ గుణాలయ పాలితభూవలయ కరుణార్ద్రహృదయ
  కాకుత్స్థకుల సదయ వరనవకోసల నిలయ వాతాత్మజ సేవితప్రియ ॥వ

హిం.- అని యిటు మంగళకర వాక్యములను వినుతించునెడ వనజాననుండు
జనకసుతను తన యొడిపై నిడికొని జనుదెంచె వైశ్వానరుడు నరుండై ॥శ్రీ॥

(2) బాలసూర్య రుచిఫాలముతోడ బంగరు భూషణములు మెరయగను
నీలకుంచిత కేశజాలముల నిరుపమ తేజముగల జానకినీ ॥శ్రీ॥

(3) వాడని పుష్పాభరణము లలరఁగ వీడని మేని కాంతి నొప్పుచును
జూడగ మునుపటి రూపంబునను సురుచిరగాత్రియౌ రాముని పత్నిని ॥శ్రీ॥

(4) జాతవేదుడా లోకమాతను సంతోషంబున నొడిలోనుంచుక
భూతలేశు శ్రీరామునిజేరి భూసుత నొసఁగుచుఁ బల్కె నిట్టులని ॥శ్రీ॥

(5) ఇదె వైదేహి యినకులచంద్ర యీకోమలియెడ దోషములేదు
మదిలో కలతను మానుము సువ్రత నదమలచరిత నీయాజ్ఞమీర దెపుడు ॥శ్రీ॥

(6) ఘోరాటవిని నీవులేనితరి ధారుణిసుత నీ దనుజుడు దెచ్చియు
క్రూరుడు నిజగేహంబున నునచియు ఘోరరాక్షసుల కావలి యుంచెను ॥శ్రీ॥

(7) బెదరించెను మరి ధిక్కరించెను అదలించెను గడు నాసలు గొలిపెను
మదమత్తుని లక్షింపక యీసతి మదిలో నిన్నే దలచు సంతతము ॥శ్రీ॥

(8) శ్రీ రఘురామ శుద్ధమానస భూమిజాత యే పాపమెరుంగదు
నా మాటనుబట్టి యేలుమీదేవిని భూమీశ్వర అడ్డమాడకు మిప్పుడు ॥శ్రీ॥

వ॥ పావకుని పల్కులాలించి శ్రీరామ విభుండు ప్రీతుండై నేత్రంబుల జలంబు
లొలుక కొంత తడవు చింతించి ప్రీతిహోత్రునింగని,

జోర:- జనకజ పరమభక్తురాలని సాధ్వీరత్నంబనినా
మనమున నెరుగుదు జాతవేద యనన్యమతియని బాగా ॥జ

(2) మానవతియు పరిశుద్ధురాలు సీమానిని అయిననుగానీ
దానవు నింటను దీర్ఘకాల మీ తరుణి యుంట నేనిపుడు ॥జ

(3) ఊరక యే చేకొనిన గనుగొని ధారుణి జనులందరును
శ్రీ రఘురాముడు బుద్ధిహీనుడని దూరరె కాముకుడనియు ॥జ

(4) జనములు నమ్మఁగఁ జేయుటకొరకు సతినిటు పోనాడితిగ
అనఘా సత్యవ్రత యీసీత వినుతశీల భూజాత ॥జ

(5) పూతచరిత్ర పరమ పతివ్రత పుణ్యచరిత్రయుఁ జుమీ
సీతను విడచియుందునె నే సురసత్తములారా ఘరినీ ॥జ

(6) మీరలు అపుడన జేయుకుండునే ధీరులార యనుచు
ధారుణిసుతను గైకొనె నర్థిని దశరథాత్మజుం డపుడు ॥జ

(7) ఎంతయు ప్రీతి నాదరించెను పంతసమున ధరణిజను
అంతట శివుడు రాముని వాక్కుల కలరుచు దానన నిట్లుల ॥జ

మ. ఖారి-ఆది

ప॥ మా భాగ్యమున శ్రీరామచంద్ర మహాకార్యమును సల్పితివి దేవ ॥మా

అ॥ ఘోర రాక్షసుల హతుఁజేసి నీవు బారదోలితివి భయములనెల్ల ॥మా

చ॥ సురమానవులకు సకలలోకములకు కోరికదీరె శ్రీ రఘువీర
సరసిజమిత్రవంశాబ్ధిచంద్రా కారుణ్యసాంద్ర యోగి మానసేంద్ర ॥మా

(4) అనఘా భరతుని ఆశ్వాసింపుము ఘనముగ నేలుమి సాకేత పురిని
జనని కౌసల్య సుమిత్రాదులకు మనమలరగాను నవకోనలేశ ॥మా

జోర:-సలుపుము అశ్వమేధముల్ ప్రీతిని నిలుపు కీర్తి జగములను
చెలువము మీర పాలింపుము భువి శ్రీరఘువర ముదమునను ॥జ

వ॥ పుత్రరత్నంబవగు నీమహిమచే నింద్రలోకంబున నీజనకుడు సుఖంబున్నవాడు ఇప్పుడు నిన్ను జూడఁగోరి విమానంబుపై వచ్చి గగనంబున నిలచియున్నవాడు సౌమిత్రితోడ తండ్రికి వందనములు గావింపుమనిన పరమశివుని పలుకులాలించి జనకునకు దండ ప్రణామంబు లాచరింప రామా! నిన్ను విడచివచ్చిన కతంబున నీస్వర్లోక సౌఖ్యములు నాకు రవంతయైన సంతస మొదవింపఁ జాలకున్నవి.

హిం:-నిను బొడగనుట నామన ముప్పొంగెను అనఘా పూర్ణకాముడనైతిని
దనుజుల దుంచి దివిజులు ముదమంద జనకజబొంది జయము చేకొంటివి ॥శ్రీ

(2) కానల నిన్ను దోయుమనుచును కైకవచించిన నిష్టుర వాక్యముల్
మానసమందు నాటియున్నవి మరపురాదు నీకొనర్చిన యపకృతి ॥శ్రీ

(3) అనఘా నిన్ను లక్ష్మణ సహితుఁగ గనియును ప్రియమున కౌగిట జేర్చి నా
మనమున నాటిన దుఃఖము బాసితి దినమణి మంచును మించినరీతిగ ॥శ్రీ

(4) రావణువధగోరి దేవతలందరు గావించిరి యభిషేక విఘ్నముగ
దేవదేవుడవు పురుషోత్తముడని దెలిసితిపుడు నామదిలో తంగ్రశీ ॥శ్రీ

(5) వనమునుండి మరలివచ్చిన నిను నీ జననిగనియు కడుధన్యురాలగు రామ
జనసంఘములు రాజగు నినుగని మనమున సంతోషమగ్నులై యుందురు ॥శ్రీ

(6) వినయవివేక విక్రమశాలి నీఅనుజుడు భరతుడు అతి భక్తుండు
అనురక్తుండు గావున నిరువురు మనమలరగ గలసి మెలగుచుండుడు పుత్ర శ్రీ॥

వ॥ నాయనా పదునాల్గు వత్సరంబులు సీతా లక్ష్మణులంగూడి వనంబున కాలంబు గడపి ప్రతిజ్ఞ నెరవేర్చి రావణుని బరిమార్చి సురమునిసంఘంబుల కష్టంబు లెడబాపి సత్కీర్తి బొందితివి. పట్టాభిషేకమహోత్సవంబు గావించుకొని తమ్ములతో దీర్ఘాయుష్మంతుడవై మను మని దీవించిన శ్రీరామవిభుం డిట్లనియె: తండ్రీ కైకమ్మను తమ్ముండగు భరతుని కరుణింపుము. కొడుకుతోడ నినువిడచితినను శాపవాక్యంబు తొలంగుంగాత మనిన యతం డట్లెయని కేలుమోడ్చి నిలచి యున్న సౌమిత్రింగని

కాఫీ - రూపకం.

ప॥ ధన్యుడవైతివి ధరణిలోన తనయ లక్ష్మణా ధ॥

అ॥ అన్యవర్తనములరోసి అవనిజపతి యండజేరి ॥ధ

చ॥ పురుషోత్తముని పూజ్యుని రాముని పుండరీక దళాక్షునీ
చరణసేవజేసి నీవు సత్కీర్తిని బొందితివి ॥ధ
సురముని బృందము దెల్పిరి నాకు పరమాత్ముడు శ్రీరాముడనియు
వరనవకోసలమునందు వరప్రదు రఘువరుని గొల్చి ॥ధ

వ॥ అని సౌమిత్రి నూరడిలంబల్కి భూపుత్రింగాంచి.

హిం:- కోపగింపకు మమ్మా నీపతిసేతకు కోమలి జగతి విఖ్యాతిజెందితివి
నీపతివ్రత మహిమనెంచగ దరమె సాపరాధుడుగాడు సైపుముజానకి శ్రీ

(2) క్షితిసుత నీవు పతిశుశ్రూషయు జేయుమనును నే జెప్పగనేల
పతికన్నను భువి పరదైవంబు సతులకు లేరు సాధ్వీతిలకమ ॥శ్రీ

వ॥ అని కోడలి నూరడించి దశరథుండు స్వర్గంబుజేరె నంత సురేంద్రుండు శ్రీరామచంద్రునిగని మేము ప్రీతిజెందితిమి నీకిష్టమెయ్యదియో సెలవింగింపుమనిన శ్రీరాముడు సీతా లక్ష్మణులంగూడి నమస్కరించి దేవ కరుణగలదేని మృతవానరభల్లూకంబుల బ్రతికింపుము. వారందరు తమతమ యాలు బిడ్డలంగూడి సుఖంబుండునట్లును కాలంబు గాకున్నను వారుండుచోట వివిధఫల జలసమృద్ధిగలిగి

యుండవలయునని కోరెదనన దేవేంద్రు డట్లనే యగుంగాకయని వారలనెల్ల బ్రతికించె నంత నిద్ర మేల్కాంచునటుల లేచి వారందరు రాముసకు నమస్కరించిరి.

జో॥ర:-సురలందరు పరిపూర్ణ హృదయుడౌ నరపతి రాముని గాంచి
అరుగు మయోధ్యకు జనకజగూడి హర్షముమీరగ పయనించి ॥జ

(2) గారవమున సీతల్లుల నందర నూరడింపు మోదేవ
కూరిమితోడ భరతుని దేర్పుము కోమలాంగ రఘువీర ॥జ

(3) అభిషేకము గావించుకొనుము భువి నఖిలజనులు ముదమందా
శుభకర శ్రీరఘురామా యనిబలికి సురలు చనిరి మోదముతోడా ॥జ

(4) సురలటుబోవ రామవిభుండు సొంపు బెంపు చెలువమర
పరమహర్షమున వనచరులనుగూడి మురియుచుండె ప్రియమలర ॥జ

వ॥ ఇట్లు సుఖముగ నారాత్రిగడపి ప్రాతఃకాలంబున విభీషణుండు శ్రీరామభద్రుని గని దేవదివ్యతీర్థంబుల స్నానంబుచేసి బంగారు పట్టు పీతాంబరములు ధరించి పుష్ప గంధ భూషణాదు లలంకరించుకొనుమన శ్రీరాముం డిట్లనియె

జో॥ర:-ఇనతనయాదుల స్నానముజేయగ వేడుము రాక్షసరాజా
ఘనుడు భరతుడు నానిమిత్తమై వనలజెంద నేమమునా ॥జ

(2) మనసెటులొప్పును సర్వసౌఖ్యములు అనుభవింప నాకిచటన్
అనుజుని జూడక అభ్యంజనాదులన్ గొననొల్ల నలంకారములన్ ॥జ

(3) కాననంబున బోవలె మేము కష్టముగావున వినుమా
దానవనాథా కదలెదమిప్పుడె తడయుటేల యిక చెపుమా ॥జ

(4) అని పల్కగ యిటు రామచంద్రునికి నిట్లనియెను రాక్షసవిభుడు
జనకసుపుత్రితో నాగుము నేడిట యాశ్రితావన రామా ॥జ

శంకరాభరణము చాపు

ప॥ శ్రీరామ నా మనవి వినుమా శ్రితపారిజాత ॥శ్రీ

అ॥ కారుణ్యసాగర కమనీయ శుభచరణ వారిజాసనవినుత వరద పద్మదళాక్ష ॥శ్రీ

చ॥ స్వామిం నవకోసలధామ కోదండరామ కామితార్థప్రద కౌసల్య వరతనయా
భూమిజ ప్రియ దివ్యపుష్పక మిటగిలదు కమలాప్తతుల్యము కామగమనమదియు

(2) శ్రీ మనోహర మిమ్ము వేడ్కను జేర్పను నొక పగ లయోధ్యను
ధీమహిత నా కోర్కె దీర్పుము దేవదేవ నమస్కరించెద ॥శ్రీ

వ॥ అని మరియు నిట్లనియె.

జో॥ర:-మిమ్ము సపర్యల దన్పగోరెదను మిత్రకులోద్భవ రామ
సమ్మతిగొనుమ వేడెద నిప్పుడు సాధువినుత జయరామ ॥జ

(2) అనవిని రాముడు రక్షోవిభుగని అతిప్రియ నయములు జూపుచును
అనఘా నీ వచనంబులు వినని అతి కఠినచిత్తుడని దలచకుము ॥జ

(3) హెచ్చగు నుపకారము సచివత్వము మచ్చికతో మాకిపుడు
మెచ్చగజేసితి విక నొదవేమి మిత్రసత్తమా వినుము ॥జ

(4) భరతుడు చిత్రకూటంబున నను బ్రతిమాలి పాదముల బడియు
పురికి రమ్మన నిరాకరించితిని తరుణముగాదని యపుడు ॥జ

(5) కావున సోదరుజూడగ నామది కలవరమందెడు గానన్
భావమలర నాతల్లుల మిత్రుల బంధుజనుల గనుగొనగన్ ॥జ

శహాన-ఆది.

ప॥ తనవారి నెల్లజూడ తమిగల్గె విభీషణా ॥త

అ॥ కినుకబూనకు కీర్తిశీల ఘనుడా భరతుని గనుగొనవలయు ॥త

చ॥ అరసియు నీ వొనర్చిన సపర్యలు హర్షమొప్ప గైకొంటిని
పురుషవరేణ్య ముదమున లంకాపురి నుండుము ననుధ్యానించుచు మది ॥తన

(2) వనవాసవ్రతముదీరె మనసెంతయు నిల్వదిందు
వనరుగ మమ్ముబంపుము వేగ వరసవకోసలపురిజేరగ ॥తన

వ॥ అని పల్కిన రామభద్రు నాజ్ఞ శిరసావహించి లంకకుంజని పుష్పకవిమానంబు దెచ్చె నప్పుడు.

తే॥ ఆవిమానముగని రాము డతిముదమున చేరి వైదేహి నంకాన జేర్చియపుడు
విల్లుచేబూని సౌమిత్రి వేడ్కమీర చెంతనిలువంగ నందు నాసీనుడయ్యె

వ॥ అంత రామభద్రుడు వానర రాక్షసవీరులంగని అనేక విధంబుల వారల మన్నించి.

హిం:-వనచరులార మీావలన నిప్పుడు ఘనముగ కాగల కార్యముల్ దీరెను
అనఘులార నాకై గాసినొందితిరిక జనుడీ మీా మీా సదనంబులకు ॥శ్రీ

(2) ఇన తనయా నీవు ధర్మముదప్పక యొనరించితివి మిత్రకార్యమును
వనచరులనుగూడి కిష్కింధకుబోయి అనుభవింపుము అత్యంత సుఖమును ॥శ్రీ

(3) నేనొసంగిన రాజ్యముగైకొని దానవనాథ లంకలో నుండుము
పూనియు సకల సౌఖ్యంబులను బొందుము సతీసుత హితులనుగూడి ॥శ్రీ

(4) ధారుణిసుతతో తమ్మునిగూడి జేరబోయెదను అయోధ్యను మీారలు
కారుణ్యంబున సెలవు నొసంగుడి కూరిమి నాదు మిత్రవర్గములార ॥శ్రీ

(5) రాముండిట్లు పల్కగ నపుడు రాక్షసరాజును కపిరాజునిటు
స్వామీ మీాయభిషేకము జూడగ మేము గోరెదము మీాపురి వేడుకల్ ॥శ్రీ

వ॥ ఎవ్వరికేమి యుపద్రవంబు గలుగనీయక మీాపురంబున సంచరించెదము మరి యును పరమపావనియైన మీాజననింగని పట్టాభిషేక మహోత్సవంబు కన్నులారంగాంచి మా యిండ్లకు బోవువారము గాన మమ్మనగ్రహింపుమని వేడిన వారలంగని శ్రీరామచంద్రుం డిట్లనియె.

సారంగ-ఆది

ప॥ ప్రియముకన్న నధికప్రియము గల్గెనాకు జయముచేకొని మిత్రులతోజన ॥ప్రి

అ॥ జయజయరవముల్ చెలగ ముదముతోడ రయముమీార రండి హితులార ॥ప్రి

చ॥ ఈ విమానమున నెల్ల కపులతో ఇంపుగ సుగ్రీవ యధిరోహింపుము
భావమలరజేరు పుష్పకంబున భద్రచరిత రక్షోనాథ మంత్రులతో ॥ప్రి

(2) భరతుని మనోరథము దీర్పమనము పరమానందమున జేరబోవుదము
సరగున నవకోసలమునకు సంతసంబుగా నభ్రవీధిని ॥ప్రి

వ॥ అంత మహదానందంబున శ్రీరామచంద్రునితోడ పుష్పకంబు నారోహించిరి జానకీ సౌమిత్రులతో కోటిసూర్య ప్రకాశంబున శ్రీ రామచంద్రుండు సుఖాసీనుండై యుండె.

తే॥ అంత నాపుష్పకం బప్పుడభ్రవీధి కేగసె హంసాన్వితంబునై సొగసుమీార
రామచంద్రుండు వెలుగొందెరమణితోడ వానరులు దానవులుగొల్వ వైభవమున

వ॥ అత్తతి శ్రీరామభద్రుండు వసుంధరాతనయం గని,

తోడి-ఆది.

ప॥ రమణీ జానకీ గనుమిదె లంకాపురిఁ ॥ర

అ॥ రమణీయంబుగ నిర్మించెను మును విశ్వకర్మ దీనిఁ ॥ర

చ॥ ఘనత్రికూట శిఖరంబున కమనీయంబై వెల్గుచు
కనకగోపుర ప్రాకారంబుల కడు విస్మితమై యొప్పుచుండు ॥ర

(2) ధరణి సుపుత్రి యొరులకు జొరరాక వరుణాలయము జుట్టియున్నదదె
వరవర్ణిని నిను మనమునఁ దలఁచుచు వాతాత్మజుడు దాటెను దీనిని ॥ర

(3) ఇందువదన కుందరదన చెందమల రగనఁగాను మిపుడు
సుందరాంగి నవకోసల రాణి జనకసుపుత్రి ॥ర

శోర:-హరి వీరులతో పురిజొచ్చియు నే అరసియు దనుజుల దునిమి
తరళాక్షి నే జయమును బొందితి పరమ పవిత్ర నినుచేకొంటి ॥జ

(2) రణరంగంబిదె కనుగొను మబల రావణు ద్రుంచితి నిచట
ఘనులగు ఘటకర్ణుడు మొదలగు దనుజుల గూల్చితి నచట ॥జ

(3) అనఘుడు సౌమిత్రియు నింద్రారిని హతుజేసె జుమ్మిందు
సునిసిత శరముల బలువురు రాక్షసులను దునిమితిని నేనిందు ॥జ

వ॥ దేవీ! రావణుని పట్టపురాణియగు మండోదరి వలవించిన చోటిది సతీమణి నేను కపులతో సముద్రంబుదాటి యీ రేయి నిన్నుదలంచి దుఃఖించుచు నిందుంటిమి అదె సాగరంబున నీకై సేతువు నిర్మించితిని సీతా యీ సాగరమధ్యమున బంగారు శిఖరంబుల నొప్పు మైనాకుండను పర్వతంబదె గనుగొను ఆంజనేయుండీ సముద్రంబుఁదాటు సమయంబున జలంబునుండి వెలికివచ్చి యతని నాదరించె మరియును జానకీ రాక్షసరాజగు విభీషణుండు నన్నుజేరి శరణుజొచ్చిన చోటిది కిష్కింధానగరం బల్లదె నేనిందు వాలినివధించి సుగ్రీవుని రక్షించితి నన సీత భయ నయంబులతో శ్రీరామచంద్రునిగని దేవ

హిం:-విన్నపమొక్కటి ఆలకింపుము వేడుక తారాది సతులనుగూడి
క్రిన్ననసాకేత నగరముజేర మన్ననతో నాజ్ఞయొసగుము నాథా ॥శ్రీ

(2) అనవిని రాముడా విమానమునిల్పియు యినతనయా యీజనకజ తోడుగ
వనచరసతులను నీనతి దోడ్కొని అనఘారమ్ము అయోధ్యకు బోవగ ॥శ్రీ

(3) అంత సుగ్రీవుడు శీఘ్రమె తారాది కాంతలజేరి కడు సంభ్రమమున
ఇంతీ జానకితోడ నయోధ్యకు వెడలుము వనచర సతులనుగూడీ ॥శ్రీ॥

(4) శ్రీరాముని వాక్యం బిదియనగ తారముదంబున వనచరసతులతో
జేరవచ్చి యాజానకి చెంతను కూరిమిమీర విమానము నెక్కెను ॥శ్రీ॥

వ॥ అంత నాపుష్పకం బతి త్వరితగతిం బోవుచుండ శ్రీరామచంద్రుడు సీతాదేవిం
గాంచి మరల నిట్లనియె.

సీ॥ అదె ఋశ్యమూకమో యతివ భానుజుతోడ సఖ్యంబుజేసితి సకియ యిచట
పంపాసరస్సిదె పంకజాక్షిరో చూడు వివిధవృక్షము లింపు వేడ్కగూర్చు
నినుబాసి విరహాన వనజాక్షి నేనిందు వనట జెందితి నీరు కనులగార
సద్ధర్మచారిణి శబరి గంటిమి యిందు దను కబంధుని ద్రుంచితిని జూమి యిటు
అదె జనస్థానంబునందు జటాయుని భూరుహంబదె గను భూమిజాత
హాతులజేసితి ఖరదూషణాదుల నిట అబల మనమున్న యాశ్రమంబదియె కనుము
నిన్ను గొనిపోయె సురవైరి నెలత యిచట నీవు పెంచిన చెట్లవే నీరజాక్షి.

రగడ:

నలినాక్షి గోదావరి గనుమిదె । అలకలశజు నాశ్రమమిదె జూడుము
యాసుతీక్ష్ణుని యాశ్రమమిదుగో । భాసురాంగి శరభంగు నాశ్రమము
యామహాత్ముని నాదరింపగ । నామహేంద్రుడిట కరుదెంచెను గాదె
ఆవిరాధునిట హాతముజేసితిని । దేవిగను మత్రిమునీంద్రునాశ్రమం
అనసూయను గనుగొంటివిచ్చట । వనితామణి చిత్రకూటం బిదియె,
నను నిజపురి కిగొనిపోవగ వేగ । ఘనుడు భరతుడు నట గలసిన చోటిది
మనమున దీనిని మఱవచ్చునె । యమునానదియిదె అంబుజపాణి
మునిపుంగవు భరద్వాజు నాశ్రమం । గనుమా అదిగో గంగానదియు
శృంగిబేర పుర మది గను గుహుడు । మంగళాంగి గనవచ్చెను మనల
పరమకల్యాణి సరయూనదిని । అరయుమిప్పుడు జానకి మనపురి
గనగలైనుమరి ఒనరింపుము నమస్కార మయోధ్యకు

వ॥ శ్రీరామచంద్రుండిట్లు సీతకు పరిచితస్థలంబుల చూపుచు అయోధ్యానగరంబిదె
జూడుమని పల్కునెడ హార్మ్యప్రాకార యుక్తంబును బహు రమణీయంబునగు
అయోధ్యాపట్టణంబును వానరులు లేచిలేచి తొంగితొంగి చూచుచుండి రంత
నవ్విమానంబు భరద్వాజాశ్రమంబుజేర పదునాల్గు వత్సరంబులు పరిపూర్ణంబైన
శ్రీరాముం డవ్విమానం బందు డించి మునినాథునకు మ్రొక్కి యిట్లనియె.

తే॥ మాపురంబు సుభిక్షమా మానిచంద్ర భరతుడున్నాడె సుఖితుడై ప్రజలతోడ
బ్రతికియున్నారె తల్లులు భద్రకీర్తి తెరుగబల్కుమి యవ్వార్త లిద్ధచరిత.

వ॥ అనిన భరద్వాజుండు మందహాస సుందరవదనారవిందుండై ఎల్లవారు సుఖం
బున నున్నవారు భరతుండు నారచీరలు జడలుధరించి నీ రాక కెదురుచూచుచు
నీపాదుకలు సేవించుచు నున్నవాడు రాఘవేంద్ర మరియును

సీ॥ జనకుని ప్రీతికై సర్వసౌఖ్యమువీడి యడవుల నిడుములు బడుచు నీవు
ధర్మంబుతోడుగ ధరణిజ సౌమిత్రి గూడియు కొండల గుహాలయందు
గాల్నడ దిరుగుచు గందమూలంబుల కాయలు నట కూడుగాగ దినుచు
కైకమాటల నిట్లు కష్టియా నినుగని కటకటాయని వంతగలుగునాకు
సంతసముగల్గె నిప్పుడు సత్యచరిత మిత్రసౌమిత్రి సీతానమేతునిన్ను
గాంచినంతనె ముదముదయించె మదిని దండకాటవిదిరుగుట ధరణిసురుల
రక్షణముకొరకుగాదె శ్రీరామచంద్ర

వ॥ ఖరదూషణాదుల ఖండించుటయు మారీచ దర్శనము సీతాపహరణంబు కబం
ధుని దున్ముచుటయు పంపాదర్శనంబు అర్కజు సఖ్యంబు వాలివధంబు సీతాన్వే
షణంబు హనుమంతునిచే జానకి వృత్తం బెరుంగుటయు సేతుబంధనంబు పుత్ర
మిత్ర సహితంబుగ దశకంఠుని బరిమార్చుటయు తపోబలంబున నేనంతయు
నెఱుంగుదు. శ్రీరామ వరముగోరు మిచ్చెద ఈదినం బిందుండి పోవలయునన
శ్రీరాముండు వల్లెయని, మునీంద్రా

హిం:-ఏ కాలంబుననైన నయోధ్యకు వెడలిపోయెడు మార్గమునందు
శ్రీకరముగ ఫల పుష్పంబులతో చెలగుచుండవలె సకల వృక్షంబులు ॥శ్రీ

(2) రామునినాథా యీవరమొసగుము నాకన వినియుల్లైయాగా కన ముని
ఘనముగ పూవుల ఫలములతోడ మనము లలర యాభూజము లొప్పెను ॥శ్రీ

(3) ఫలకుసుమంబుల కల్పతరులవలె ప్రబలియుండె చిగురు జొంపంబులతో
నలలితముగ మోడు వృక్షములన్నియు వెలసెను చిగురుటాకుల పిందెల ॥శ్రీ

(4) ఎటు జూచిన మూడామడదూరము వెలసె తరులు ఘనఫల పుష్పంబుల
నిటులుండెను నాతరువుల నెక్కి విహరించిరి కపుల్ ఫలముల మెక్కుచు ॥శ్రీ

వ॥ అంత శ్రీరాముడు హనుమంతుని జేరంబిలచి ఆంజనేయా విను,

తే॥ నీవయోధ్యాపురిజేరి యెల్లవారి క్షేమ మరసియు రమ్మతిక్షిప్రమునను
బోవు తోవను గుహుడను భోయరేడు కలడతనికి దెల్పుమా గఘన మనఘ

వ॥ ఆశ్మ్మె సఖుండుగాన సంతసించి నీవు అయోధ్యకుబోవు మార్గం బెరింగించు. అంత
నీవు భరతునిజేరి నాక్షేమంబుదెల్పి నామాటగా నిట్లనుము

జోర:-జనకుని శాసన మెల్లను దీర్చియు అనుజ జనకజలతోడన్
జనుదెంచెను రాముండని దెల్పుము సరసగుణా మోదముమీరన్ ॥జ

(2) దనుజుడు ధరణిజ గొనిపోవుట రవితనయునిగని సఖ్యంబున్
బొనరించుటయు వాలిద్రుంచుట భూతనయను వెదకుట మరియు ॥జ

(3) అనఘా నీవు సముద్రముదాటి జనకజగని వచ్చుటయు
వననిధిజేరి సేతుబంధనం బొనరించి అసురు ద్రుంచుటయు ॥జ

(4) సురలచె వరములు గొనుటయు జనకుని పరికించుట నీశ్వరుకరుణన్
హరి నాయకులను గూడివచ్చుట నెరిగింపుము తమ్మునితోడన్ ॥జ

వ॥ ఆంజనేయా నీవుదెల్పునెడ నతని ముఖచిహ్నంబును చూపులవిధంబును భావంబు
చక్కగ నెరుంగుము చిరభోగంబు లనుభవించుటచే రాజ్య కాంక్షితుండయ్యెనేని
రాజ్యం బతండే యేలుగాక మేము దూరంబున నున్నయప్పుడే మునుముందు
వచ్చి ఎఱుగింపు మనిన హనుమంతుండు గగనంబున కెగసి గరుడునిరీతి అతి
త్వరిత గమనంబున శృంగిబేర పురంబుజేరి గుహునిగాంచి అయ్యా శ్రీరాముడు
కృత కృత్యుండై వచ్చుచున్నాడని యెరింగించి, అటగదలి నదనదీ వనప్రదేశం
బులను జనపదంబులుదాటి సాకేతంబు డగ్గరి నంది గ్రామంబున నాశ్రమం
బొంకుగాంచి అందు తపసివేషమ్మున జడలుదాల్చి ఖిన్నుండై శుష్కించి
యున్న కాయంబుతో,

తే॥ కావి వస్త్రముల్ ధరించి కందమూల ఫలము లశనంబుగాగొను బ్రహ్మతేజు
పాదుకలు ముందునిడుకొని భక్తిమీర సచివ వర్గంబు పౌరులు సరసగొలువ
రాజ్యతంత్రంబు నడిపెడు రాజపుత్రు గనియె భరతుని నంజనా తనయుడంత
ప్రణతు లొనరించి పల్కెను బ్రమదమెసంగ నతని చిరతరమైన వాంఛితమునిట్లు

వ॥ ఆర్యా నీవెవ్వని రాకక్కై నిత్యము నెదురుచూచుచుంటి వట్టి మీయన్న
శ్రీరామచంద్రుడు జానకీ సహితుండై తమ్మునింగూడి,

జోర:-సేనలుగొల్వగ మిత్రకోటితో జేరవచ్చె శీఘ్రంబు
కానలనుండి వచ్చెడు వానిని గాంచెద వీక్షణ మందు ॥జ

(2) ఆ మాటలు విని హర్షంబున భరతుడు భూమినిబడి మూర్ఛిలియు
ధీమంతుడు తెలివొంది లేచి మరి సామీరినిగని ప్రియముననను ॥జ

(3) గ్రుచ్చి కౌగిటనుజేర్చి యతని గ(డు కూరిమిమీరగ నపుడు
సచ్చరిత వనదేవతవో నరుడవో సంతోషవార్త దెలిపితి విపుడు ॥జ

(4) నూరువేలు గ్రామంబుల గోవుల సుధీవర నీకొసగెదను
కూరిమి భర్మాభరణంబుల కన్యల చేరియిచ్చెదను గొనుము ॥జ

(5) అని పల్కుచు శ్రీరాముని రాక అద్భుతమని పొంగుచును
ఘనుడగు శ్రీరఘురామచంద్రుని గనువేడుక మీరగను ॥జ

(6) వీనుల విందుగ రాము నుదంతము వినగల్గె నిన్నిదినములకున్
తనువున ప్రాణము లుండిన శుభములు గనగల్గుననుట సత్యము నేడున్ ॥జ

(7) అనఘా శ్రీరఘురామచంద్రునకు వనచరులకు స్నేహంబున్
ఘనముగ నెట్లుగల్గెనొ నాకు వినిపింపు మనం గపివరుడున్ ॥జ

వ॥ దేవ మీతల్లి వరంబుచే శ్రీరాము డరణ్యంబు చేరుటయు మీ తండ్రి దివంబున కరుగుట నీవు రాజ్యంబొల్లనని చిత్రకూటము జేరి శ్రీరాముని ప్రార్థించుట అతడు తండ్రియాజ్ఞ మీఱనని పాదుక లనుగ్రహించుట మీరవి గైకొని వచ్చుట ముందు ఎరింగిన విషయమే గద అటుపైన జరిగినదంతయు నెరింగించెద.

ద్విపద:-అంత రాముడు సీత యనుజుడుగొల్వ । చింతగుచున్నట్టి విపినంబుజొచ్చి
ఘోరుడైన విరాధు గూల్చి మానులను । చేరిరక్షించుచు కారుణ్యమునను
ఒనర జనస్థానమున చుప్పనాతి । ఘనులను డాయ నావనితనుబట్టి
ముక్కుచెవుల్ గోసి రక్కజంబుగను । ఖరదూషణాదులు కినియగా నంత
శరవర్షమున వారి సమయించె ఘనుడు । అంత లంకకు బోయి యా చుప్పనాతి
వంతగుందుచును రావణుని దాగాంచి । రాముని సతి సీత రామాలలామ
కామించి తెమ్ము లంకకు దాని ననిన । విని దశకంఠుడు వేడుకమీర
బనిచె మారీచుని జనకజంజేర । కనక మృగమ్మాచు గనిపింపదాని
గొని తెమ్మనుచు సీత గోర రాఘవుడు । పనిబూని దానిని బట్టబోవంగ
దనుజాధముండావె దరిజేరి యపుడు । జనకజ నెత్తుక జనుచుండె నంత
ఘనుడు జటాయు నీ జనకుని మిత్రుడు । డనిచేసి మృతినొందె నసురునిచేత
దనుజుండు లంకలో నునిచి జానకిని । అనునయములుబల్క వినక భూసుతయు
తృణముగ రావణు మనమున నెంచె । అచట రాముండు మాయామృగమ్ము ణచి
వచ్చి దాగానక వైదేహినందు । అరయుచు శోకాన హతుడై జటాయు
ధరబడినవాని దహనంబుచేసి । తరుణిని వెదకుచు దశరథ సుతులు
తరణి సుతుగని ప్రేమదనర నెయ్యంబు । గావించి వాలిని దుంచె రాఘవుడు

భూవరు దేవిని బొలుపార వెదుక । వనచరులను బంప వనధిని దాటి
చని లంకను నశోకవనమున గాంచి । ఆనవాలిచ్చియు నతి మోదమునను
మానిని యిచ్చిన మణి గొనివచ్చి । శ్రీరాము కొసంగితి చిత్తముప్పొంగ
జలజాప్తసుతుతోడ సంద్రమ్ముజేరి । అల విభీషణునకు నభయం బొసంగి
సేనల గూడి సేతువుగట్టి । దానవ వీరులన్ దశకంఠు దునిమి
జానకిగై కొని సంతోషముగను । వనజజాదులచేత వరములు పొంది
జనకుని గనుగొని సంభ్రమంబునను । ఘనుడు పుష్పకమున వనచరుల్ గొలువ
వచ్చుచు కిష్కింధన్ వనచరసతుల । మచ్చిక సతిగోర మరియు వారలను
బిలిపించి సీతకు ప్రియముదలిర్ప । అలరి భరద్వాజు నాశ్రమంబునను
నిలచి యున్నారిప్డు నిజముగా నీవు । ఇనకులాంబుధి చంద్ర వినుత గుణాఢ్య
వినపించితిని రామవిభు నుదంతంబు.

వ॥ అని పల్క భరతుం డానందమగ్నుండై యెన్నాళ్ళకు నాకోర్కె కొనసాగె నని శత్రుఘ్నునిగాంచి అనుజా మనపురంబునగల దేవతాగృహంబుల పూజలొనర్పునట్లు జేయుము పురాణస్తుతి నటన గాయకుల రప్పింపుము భటవర్గంబుతోడ పూర్ణచంద్రముఖ కమలుండగు శ్రీరామచంద్రుని దర్శింపబోవలయు కాగల కార్యంబులన్నియు కొరతలేక దీర్పుమనవిని శత్రుఘ్నుండు అయోధ్య మొదలు నంది గ్రామమువరకు మిట్టపల్లంబులులేక సమతలంబు జేయించి.

జోర:-ఒనరంగ పురమున ధ్వజపతాకములు నునచియు వేడుకతోను
ఘనముగ పచ్చల తోరణంబులన్ గట్టియు ప్రమదంబునను ॥జ

(2) మృగమద జలములు జల్లియు ఆణిముత్యపు ముగ్గులుబెట్టి
అగరుధూపము లు వేసియూ సంతట యరటికంబములు గట్టి ॥జ

(3) అలంకరింపవలె పట్టణమంతయు అర్కోదయమున కనుచు
సలలితముగ శత్రుఘ్నుండపుడు చాటబనిచి శీఘ్రంబు ॥జ

(4) ధరణిసురలు మంత్రులు బంధులు తరలియు సైన్యంబులతో
వరుసలుదీరి రథముల కరుల హరులనెక్కి వేగముతో ॥జ

(5) హర్షంబున కౌసల్య సుమిత్రయు నరిగి సవతులతోడ
సరగున నందిగ్రామము జేరిరి సకలజనులు ముదమంద

(6) పురవాసులు బ్రాహ్మణుల్ వణిజులు పుష్పాక్షతలనుబట్టి
భరతుండంత మంత్రులు వెనుకొన పాదుకలను తలదాల్చి ॥జ

(7) వందిమాగధులు కీర్తింపగ భేరీవాద్యధ్వనులు చెలంగ
అందముగ శ్వేతఛత్రముబూని అన్నజూచు తమకముమీర ॥జ

(8) చని యటు నాల్గుదిక్కుల గాంచియు జానకీపతి గానకను
హనుమంతునిగని బల్కెను భరతుం డనురాగంబొప్పగను ॥జ

తే॥ రామవిభుడేడి వనచరుల్ రారిదేమి జేరి కపిలోలబుద్ధిని జెప్పలేదె
తెలియబల్కుము నామదిగలఁతతీర ననిన భరతునికి హనుమంతు డనియె నిట్లు

వ॥ రాజేంద్రా భరద్వాజముని ప్రసాదంబున వృక్షంబులన్నియు పుష్పఫల భరితంబులై తేనెలు గురియుచున్నవి యిదియునుంగాక వనచరులు సంచరించు వనంబులందెల్ల నదేవిధంబుగ నుండునటుల మహేంద్రుండు వరంబిచ్చియున్నాడు గాన తిరుచరులు ప్రొద్దులుబుచ్చెదు అదుగో కపుల కోలాహలంబు వినవయ్యె ధూళిరేగి మిన్నంటె గోమతీనదిదాటి వచ్చుచున్నారని తోచుచున్నది మరియును.

హిం:-గను మతిదూరముగ పుష్పకమదుగో ఇనసంకాశము మనోవేగముగ
వనజభవుడు మును ధనదునకిచ్చెను గొనె రావణు డది యాతనిగెల్చి॥శ్రీ

(2) ఆ రావణుని బంధుయుతంబుగ హత మొనరించి రాఘవేంద్రుడు
ధారుణిసుతతో తమ్మునిగూడి యారోహించె యా విమానమున ॥శ్రీ

(3) ఇనసుతు డాదిగ కపులుగొల్వగ ఘనుడు విభీషణుడు సేవింపగను
మనుకులవర్ధన రాముడతండే యనవిని గగనము గనుగొన భరతుడు ॥శ్రీ

(4) అదె శ్రీరాముం డదుగోననుచు అర్రులెత్తి జనసంఘము జూడగ
సదయుడౌ రాముని పదపద్మములకు మదిలోపొంగుచు మ్రొక్కెనుభరతుడు॥శ్రీ

(5) ధరణివ్రాలె నా విమానమంతట దశరథనందను నాజ్ఞచె నప్పుడు
భరతుడు దానిపై నారోహించి ప్రణుతించె రాముని పదముల వ్రాలి ॥శ్రీ

(6) అంత శ్రీరాముడు కైకపట్టిని అంకమందిడి కౌగిటజేర్చి
యెంతయు ప్రేమను మేను నిమురుచు ఎన్నాళ్ళకు నినుగంటిని తమ్ముడ ॥శ్రీ

వ॥ భరతుండంత మానవరూపంబులనున్న సుగ్రీవాది వానరుల కౌగిటం జేర్చి కుశలంబడిగి సుగ్రీవునిగని నీవంటి మిత్రుడుగల్గ కొరంతయేమి మానల్వురిలో నీవు అయిదవ వాడవనిబల్కి విభీషణుని కౌగిలించి అనఘా నీసహాయంబునం గాదె దుష్కరమగు కార్యంబు సాధ్యంబయ్యెనని స్వాంతోక్తులు బల్కె

తే॥ భరతుండంతట లక్ష్మణుని పరమప్రీతి గదియమొక్కగ నాతని గౌగలించి
సీత లోక్తైకమాతకు ప్రీతితోడ అంజలిఘటించి మొక్కె దా నధికభక్తి.

జోర:-సీతా రాములకును సౌమిత్రికి జేసియు నమస్కారములు
చేతోముదమున అభివాదనము జేసి నిలచె శత్రుఘ్నుండు ॥జ

(2) ఘనదుఃఖంబున బొగలుచు నుండెడు జనని పాదములకు
ఘనుడు రాముడు ప్రణమిల్లుచు నిట్లనియెను వినయంబునను ॥జ

(3) విన్నైతిని నీసుతులను నాడు నను క్షమియింపుమనుచు
అనఘుడు సుమిత్రి మొదలగు అమ్మల కంటలు కెరగె ॥జ

(4) గురవు వశిష్ఠుని పదముల వ్రాలెను కూర్మిమీర రఘువరుడు
పరమప్రీతి దీవించె వశిష్ఠుడు భావమలర దానపుడు ॥జ

(5) క్షేమమునీకు రామభద్రయని చేమోడ్పులు మరి గీలించి
వేమరుపల్కరి పౌరజనంబులు ప్రేమను రామునిగాంచీ ॥జ

(6) అంతట భరతుడు పాదుకలనగొని సంతసమున రఘువీరు
చెంతజేరి పాదంబుల దొడిగి చిత్తమలర నిట్లనెను ॥జ

దేవగాంధారి - ఆది.

ప॥ వినవయ్య నా విన్నపంబును ॥వి

అ॥ గొనుమయ్య యీరాజ్యంబును దినకరతేజ ధీర శ్రీరఘువీర ॥వి

చ॥ ఘనముగ నీకరుణను భువిగాచియు నే ధన్యుడనైతి
ధనకోశబలముల్ దశగుణమయ్యె మనువంశతిలక మన్నించి బ్రోవు ॥వి

(2) అనఘా నీవేలు మీాయవనిచక్రమెల్ల ఆర్యజనహిత సీతాసమేత
వసరుహానేత్ర వార్ధిగంభీర వరనవకోసల కోదండరామ ॥వి

వ॥ ఇట్లు పల్కు భ్రాతృవత్సలుండగు భరతునింగని విభీషణ సుగ్రీవాది వనచరులును
తమ్ముండన నిట్టివా డుండవలదే యని బహు ప్రకారంబుల గొనియాడుచుండ
రఘురాముడు భరతుని తన తొడపై నునిచికొని సైన్యంబులు కొలువ యవ్వి
మాన రాజంబున తమ్ముని ఆశ్రమంబుజేరి అందు నిలచి యాపుష్పకంబును
నీవు కుబేరుని జేరబొమ్మని సెలవొసంగ నవ్విమానంబు కుబేరుని జేరె నంత
నందరు పీఠంబులపై నాసీనులై యుండ భరతుడు రామవిభునితో నిట్లనియె.

తే॥ అన్న నాతల్లి వాక్యంబు లాదరించి యిచ్చితివి రాజ్యమును నాకు విమలచరిత
నీ వొసంగిన దట్టులే నిపుడుమరల నేనొసంగెద గైకొను నెమ్మితోడ.

క॥ భరియింపజాల రాజ్యము కరుణించుము నీవె మరల గైకొనుమయ్యా
వర దానపాల శ్రీకర అరవిందదళాక్ష రామ ఆనందమునన్

వ॥ అనిపల్కు తమ్ముని వాక్యంబులకలరి రాఘవుం డియ్యకొనియె నంత భరతుడు ప్రముదితాంతరంగుడై యుండె రాముడును గురునాజ్ఞ తమ్ములతో జడలు విడదీసి క్షౌరకార్య మభ్యంజనాది కృత్యంబులు గావించె నప్పుడు,

హిం:-ఘనుడు రామునకు సౌమిత్రికిని మనమలరగ అలంకారము జేసెను
అనువుగ గంధమాల్యంబులతో మనమున పొంగుచు జననియు వేడుక ॥శ్రీ

(2) అంతట దశరథపత్నులు సీతను సంతోషంబున శృంగారించి
యెంతయు ప్రేమను వనచరసతులను వేడుకల్ మీరగ నలంకరించి రంత ॥శ్రీ

(3) ఘనుడు సుమంత్రుడు శత్రుఘ్నుని యానతి దినమణి సన్నిభమగు స్యందనమున్
గొనితెచ్చిన యారథము పైనెక్కి యనుజులతోడ తరలె రాఘవుడు ॥శ్రీ

(4) రమణీయంబగు చామరంబులుపట్టి రాముని వెంట సుగ్రీవు డుమారుతి
ప్రమదంబునను కదలిరి మరిని భూమిజతోడ వనచర సతులు ॥శ్రీ

వ॥ దశరథుని మంత్రులు ముందె అయోధ్యచేరి పురోహితులంగని ప్రజానురాగంబుగ రామునకు పట్టాభిషేక మహోత్సవంబు గావింపవలెనని చెప్పి మరల శ్రీరామచంద్రుని దర్శింప పురబాహ్యంబునకు వచ్చి రట్టియెడ రథారూఢుండై రాజమార్గంబున వచ్చు శ్రీరామభద్రునిగని పౌరాంగన లానంద భరితలై యిట్లనిరి.

సీ॥ ఈ సుకుమారుడే యెండగాలులకోర్చి యడవుల నిడుముల బడినవాడు
ఈ మోహనాంగుడే వేడ్క రక్కసిబట్టి ముక్కుచెవుల్ చెక్కిన చక్కనయ్య
ఈ కృపాజలనిధి యెలమి వాలినిద్రుంచి సుగ్రీవునేలిన శూరుడౌర
ఈ రాజసింహమె వేగ రావణు డాది రాక్షసులను దునుమాడిన యసమయశుండు

దశరథుని తపము ఫలమును దలపనితడె మరియు కౌసల్యగర్భశుక్తికామౌక్తికంబు
భూమిసుత భక్తినోచిన నోముపంట ముదముతో రారె చూడరే ముదితలార!

హిం:-భరతుడు పగ్గముల్ బట్టి రథమునడుప బరమాత పత్రంబు బట్టె శత్రుఘ్నుండు
హర్షంబున సౌమిత్రి విభీషణుల్ ఇరుపార్శ్వంబుల చామరంబులువీవ ॥శ్రీ

(2) అమరులు నిలచి యాకాశంబున ప్రియసంబున నుతియించెదరదుగో
విమల చరిత్రుడు సుగ్రీవుంగు ఇదుగో వచ్చెడు పట్టపేనుగుపై ॥శ్రీ

(3) మానవ రూపముల్ దాల్చియు కపులు భూనాథుడు శ్రీరామునితోడ
ఏనుంగులపై వచ్చెదరదిగో వివిధ భూషణాంబరములు దాల్చి ॥శ్రీ

వ॥ ఇట్లు పౌరజానపదులు పల్కు సమయంబున

హిం:-శ్రీ రఘురాముని జేరియు మంత్రులు కూరిమితో దీవించగ వారిని
గారవమున మన్నించె తమ్ములతో గదలిరి రాముని వెనుకొని మంత్రులు ॥శ్రీ

(2) మంగళ తూర్యరవంబులు చెలగ సంగీతంబులు బాడగ కొందరు
అంగనమణులు హారతులివ్వగ పొంగుచు రాముడు పురముజేరెను ॥శ్రీ

(3) ఇనసుతు చెల్మియు అనిలజు మహిమ దనుజేశ్వరుడు దనుజేరుటయు
వనచరుల్ జేసినపనుల్ విశదంబుగ తనమంత్రులతో నను శ్రీరాముడు ॥శ్రీ

(4) పచ్చ నక్షతల్ బట్టి బ్రాహ్మణులు వరగ గోవులు కన్యలుగొలువ
ముచ్చటమీర తండ్రి మందిరము జొచ్చెనురాము డుత్సాహముతో ॥శ్రీ

తే॥ తల్లులకుమ్రొక్కి యుల్లంబు పల్లవింప భరతునితో బల్కెనిప్పుడే భానుసుతుని
నాదు భవనంబు జేర్పుమా నయముమీర ననిననతడట్లు చేర్చెనాయర్కసుతుడు

వ॥ ఇట్లు ప్రవేశపెట్టి యాతనితో మహాత్మా శ్రీరామచంద్రునకు పట్టాభిషేకం
బొనర్ప పుణ్యతీర్థంబులందుగల జలంబులు గొనితెచ్చుటకు దూతల కాజ్ఞాపింపు
మనిన కపివీరుల నల్వురంజూచి బంగరు మణిమయంబులగు పాత్రలు వానిచే
నొసంగి సుగ్రీవుం డిట్లనియె.

హిం:-మీరలు బోయి సాగర జలమును కూరిమిచేగొనిరండు ముదంబున
శ్రీరామునకు అభిషేకంబు జేయవలెనుగాన శీఘ్రంబునను ॥శ్రీ

(2) అనవిని వారలు అతివేగంబున జని యొక ముహూర్తకాలములోన
గొనితెచ్చిరి వారు సముద్రోదకముల్ ఘను లతిబలులు సంతోషమున ॥శ్రీ

(3) చెలగి సుషేణుడు తూర్పు సముద్రపు జలముదెచ్చె మణిహేమ కలశమున
అలరుచు ఋషభుడు దక్షిణవార్ధి జలముదెచ్చె రత్నకలశముతో వేగ ॥శ్రీ

(4) పడమటి జలనిధి యుదకము గవయుడు బంగరు కుంభముతో గొనివచ్చెను
కడువడి నలుడుత్తరదిక్కు కడలి తీర్థముదెచ్చె వజ్రకలశంబున ॥శ్రీ

(5) అనువుగ నైదుసూర్ల నదులను ఘనమగు పుణ్యసలిలమ్ములను
గొని తెచ్చియు కనకకలశంబులతో వనచరు లందరు వరుసగ నిల్చిరి ॥శ్రీ॥

(6) వనచరు లిటు దెచ్చిన జలముల గని శత్రుఘ్నుడు మోదమ్మునను
ఘనుల పురోహిత మంత్రి సామంతుల గని యిట్లనె మనమలరగ వారికి ॥శ్రీ॥

(7) శ్రీ రఘురామున కభిషేకంబు జేయుడి మీ రతిశీఘ్రంబనిన
ధారుణిసుతులను గూడి వశిష్ఠుడు దశరథసుతునకు ఆనందమున ॥శ్రీ॥

రగడ:-వనజభవుడు మును నిర్మించి నట్టిదియు । మనువంశజు లభిషేక సమయముల
వంశక్రమమున వసియించు నట్టిదియు । సకల మహాజన సంశోభితమై
సుఖదాయకమై సుందరతరమై । కాంచనమణిమయ కాంతియుక్తమై
యెంచరాని విభవాలంకృతమా । సభయందున దేదీప్యమానమగు
సొబగుమీరు రత్నపీఠముపైనా వేంచేసియున్న శ్రీరామభద్రుదు సీతాసమేతుగ
గాంచుచు వేడ్క

తే॥ చేరి మంగళవాద్యముల్ చెలగుచుండ శాస్త్రయుక్తంబుగను రామచంద్రునపుడు
అర్చితుని జేసి పిదప నానంద మొప్ప ఋత్విజులతో వశిష్ఠుడు చిత్తమలర

హిం:-మణిపీఠంబున జనకజతోడ ఘనుడు రాము డతివైభవమున నుండ
కనక కలశముల జలములు చేకొని కడువేడుకతో నావశిష్ఠుడు ॥శ్రీ॥

(2) గౌతమ కాత్యాయన జాబాలి కశ్యప విజయ వామదేవులుగ
సంతసమునను సకలమునీంద్రులు సచివులు కన్యలు భూసురులును గూడి ॥శ్రీ॥

(3) గంగాది సర్వతీర్థంబులను పొంగుచు అభిషేకము గావించిరి
మంగళకరముగ రామచంద్రునకు మహేంద్రుని కమరులు చేయురీతిగ ॥శ్రీ॥

సౌరాష్ట్రము - ఆది.

ప॥ శ్రీరామచంద్రుడు పట్టాభిషిక్తుడయ్యె వేడ్క ॥శ్రీ॥

అ॥ చేరి నిజభక్తులు గొల్వ శ్వేతఛత్రము శత్రుఘ్నుడుపట్ట ॥శ్రీ॥

చ॥ రమణీయముగా నిరుగడల రవిజ విభీషణు లతిభక్తి
కొమరొప్ప చామరలువేయ సౌమిత్రి భరతు డానందింప ॥శ్రీ॥

(2) పాడిరి గంధర్వులు దివిని ఆడిరి యప్సరసలు గుములై
గూడిరి సిద్ధులు సాధ్యులు భయముఖులవీడిరి మానులు వెతల్కు బాసిరి ॥శ్రీ॥

(3) దుందుభి రవములు చెలగెమింటను పొందుగ సుమవర్షము గురిసెను
అందముగా వాద్యంబులు మ్రోగెను సుందరులందరు ముదమున బొంగిరి ॥శ్రీ॥

(4) నారద తుంబురులు వీణ నాదములతో గీర్తింప
కోరికల్ మీర దివ్యమణిహారతులీయ నవకోసలమున ॥శ్రీ॥

వ॥ అట్టి సమయంబున,

హిం:-అమరేంద్రుడు బంపె పవనునిచేత అందమైన మణిముక్తాహారము
రమణీయంబగు హారముగైకొనె రామభద్రుడు ఆదరమునను ॥శ్రీ॥

తే॥ సీతతోగూడి పట్టాభిషిక్తుడగుచు సకల సురమునిబృందముల్ సన్నుతింప
కపులు నానందభరితులై కదిసిగొల్వ రామవిభుడొప్పె జగదభిరాముడగుచు

గద్య:-శ్రీమన్మహారాజాధిరాజ సకల విద్వజ్జన మంత్రి పురోహిత సామంత పౌర జానపద సభాంగణ సంసేవిత రఘుకులాంబుధిచంద్రా, దయాసాంద్రా పరమయోగీంద్ర మునిగణ సంస్తూయమాన బృందారకాది వందిత చరణారవిందా ముకుంద, మందహాస సుందరవదనారవిందా, గోవిందా, భక్తజనానందా నిత్యనిర్మల నిరతిశయ నిగమార్థ సంచార భవదూరా పారావార గంభీర చరాచరాది జగన్నిర్మాణకారణ శరీరా మానుషాకార పరాత్పర దుష్టదనుజమదవిదార రణశూర సుకుమార మాణిక్యమకుట రత్నకుండల హారకేయూరాది భూషణాద్యలంకారా మంగళాకార సాకార నిరాకార సగుణనిర్గుణ సత్యజ్ఞానానందస్వరూపా భానువంశప్రదీప అనంతకల్యాణ గుణగణ తేజోవిరాజిత స్వయంప్రకాశా జగదీశ శ్రీరమేశ కరుణాకటాక్షవీక్షణ భక్తజనమానసోల్లాస సాకేతపురనివాస హృత్తోషా సద్భాషా దీనజనపోషా సీతాసమేత నవరత్నమణిగణస్థగిత హేమసింహాసనాసీనాదాసావనాసుగ్రీవాంగదనలనీలజాంబవదాది వనచరవాహినీప్రముఖ విభీషణాది సాధుజనసేవితపదకమలా సకలలోకపాలా రమాలోలా ఛత్రచామర సహిత భరత శత్రుఘ్న హనుమత్సమేత పట్టాభిషేక మహోత్సవా దేవదేవా మహానుభావా దివ్యప్రభావా పరవాసుదేవ శ్రీరామపుత్రీ రుక్మిణీ హృత్కమలమిత్రా సురమునిస్తోత్రా పరమపవిత్రసుచరిత్ర శ్రీరామా జగదభిరామా జయరామా నీలనీరద ఘనశ్యామ సద్గుణస్తోమ పావననామ పట్టాభిరామ నవకోసలధామ కోదండరామ నమస్తే నమస్తే నమః॥

మంగళహారతి.

ప॥ శ్రీరామచంద్రాయ సీతామనోహరాయ కారుణ్యసాగరాయ ధీరమంగళం ॥శ్రీ॥

(2) రాజాధిరాజాయ రంజితపదాబ్జాయ రాజీవలోచనాయ రామ మంగళం ॥శ్రీ॥

(3) సౌమిత్రి హితకరాయ శతృఘ్నవందితాయ
స్వామి రవికులోద్భవాయ శౌరి మంగళం ॥శ్రీ

(4) భరతమనోభీష్టదాయభక్తపరిపాలనాయ వరద రఘువీరాయ పరమమంగళం॥శ్రీ

(5) దేవాదిదేవాయ దినకరసుత రాజ్యదాయ భావజసుందరాయ దేవ మంగళం ॥శ్రీ

(6) వేదాంత వేద్యాయ విభీషణ వరప్రదాయ
మాధవ మధుసూదనాయ మహిత మంగళం ॥శ్రీ

(7) స్మితరుచిరాననాయ చిత్తనానందాయ శ్రితజన చందనాయ శ్రీశ మంగళం ॥శ్రీ
(8) నవకోసలనాథాయ నారదాదిపూజితాయ పవనతనయ సేవితాయ భవ్యమంగళం

హిం:-పరమప్రీతి శ్రీరామభద్రుండంత కరితురగంబుల లక్షగోవులఁ
వరమణిరత్న హేమాంబరములు మరియును ముప్పదికోట్ల నిష్కములు ॥శ్రీ

(2) పరికింపగ వివిధ భూషణంబులు ధరణిసురులకు దానమిచ్చియు
పరమప్రీతి దివ్యరత్నఖచితమా బంగరుమాలా భానుజు కిచ్చెను ॥శ్రీ

(3) శృంగారంబై కాంతియుక్తమగు అంగదములు నవరత్న ఖచితములు
అంగదునకును సీతారమణుడు అతిదయమీర నిచ్చె మోదమున ॥శ్రీ

(4) పూర్ణచంద్ర సంకాశంబగుచు ఆణిముత్యముల మణిమయహారము
జానకి కొసగెను శ్రీరఘువీరుడు సంతోషంబున మది నుప్పొంగుచు ॥శ్రీ

(5) అంతట భూసుత పతిగనుచును రత్నాభరణములుఁ దుకూలచేలములు
సంతసమున నాహనుమంతునకు సాధ్వీమణి దా నిచ్చె ప్రియంబున ॥శ్రీ

సీ॥ ఇచ్చియుప్రీతి నింతి జానకి యంత మనమున తృప్తిని గొనకయపుడు
తనకంఠమున యందు తళతళ మెరసెడు ఆణిముత్యపుహార మతివ దీసి
హారంబుచేకొని హరుల వీక్షించుచు మాటిమాటికి విభుమగువజూడ
సీత డెంద మెఱింగి శ్రీరాముడిట్లనె అలివేణి నీకిష్టమైనవాని
కిమ్మి యీనవ్యహారంబు నింతి యనగ అనిలతనయునికొసగె నాహార మతివ
దాని ధరియించి ధరణిజ దాపునుండు శ్వేతపర్వతమా యన చెలగె నతఁడు

వ॥ అంత రామచంద్రుడు మైంద ద్వివిద నల నీల సుషేణ జాంబవదాది ప్లవగాధి
పులనెల్ల యథార్థముగ గౌరవించి వస్త్రభూషణ సువర్ణంబుల తృప్తుల గావిం
చిన కపులందరు దివ్యభూషణాంబరాదుల దనిసి రామునకు నమస్కరించి అనుజ్ఞ
గొని సుగ్రీవునిగూడి కిష్కింధానగరంబు చేరిరి. విభీషణుండును రఘువీరునిచే

కానుకలుగొని లంకకు జేరె నిట రాఘవుండు రాజ్యభారంబువహించి సౌమిత్రితో నిట్లనియె

డోర:-ధరణీభారము. నాతో సరిగ తమ్ముడ యేలుము నీవు
అరయగ రఘుకుల ధర్మంబిదిసూ యావరాజ్యమువడసి ప్రజఁగావు ॥జ

(2) ఎంత జెప్పినను యువరాజ్యము గొనుటకు వినడయ్యెను లక్ష్మణుడు
అంత భరతుని యువరాజ్యమునకు అభిషేకించిరి యపుడు ॥జ

వ॥ రాముడు ప్రజానురక్తుడై తమ్ములగూడి రాజ్యంబు పరిపాలించుచు

డోర:-అశ్వమేధ యాగంబులు నూరు ఆచరించి రఘువరుడు
శాశ్వతంబులగు భూరిదక్షిణల సత్కరించె విప్రులను ॥జ

(2) పదివేలేండ్లు ప్రజలను దయతో పాలించెను రాఘవుడు
సదయుడు పెక్కులు వాజిమేధములు సలిపెను భువనహితుండు ॥జ

(3) ఆధులు వ్యాధిబాధలులేవు అరయగ జనులకు నెపుడు
వైధవ్య దుఃఖము నెరుగరు వనితలు వనరుహాక్షు రాముని రాజ్యంబునను ॥జ

(4) జారచోరుల బాధలులేవు సతతము నరులకు నెపుడు
శ్రీరాముని దలచుచు ధర్మపరులయి చెలగుచుందురు జనులు ॥జ

(5) పిన్నలకెన్నడు ప్రేతకార్యములు పెద్దలు జేయరు భువినీ
ఎన్నగ ప్రజలు బహుపుత్రికులై విలసిల్లిరి ముదమున నాపురినీ ॥జ

(6) చేరియు జను లన్యోన్య మైత్రిని క్షేమంబున దనరారీ
ధారుణి నాయురారోగ్యంబులు గలిగి దమ మనముల మోదముమీరీ ॥జ

హిం:-రామరామ శ్రీరామ యనుచును రంజిలుచును భూప్రజలు
రాముని కథలు వినుచును సతతము పామరములు బాసిరి మరియు ॥శ్రీ

(2) ఫల పుష్పంబుల శాఖోపశాఖలై అలరు జొంపముల వెలసెను తరువులు
మలయమారుతము వీచెను సుఖముగ కాలముదప్పక వర్షించె పర్జన్యుడు ॥శ్రీ

(3) బ్రాహ్మణ క్షత్రియుల్ బరగ వైశ్యులు ధర్మనిరతులై ధర జరియించిరి
నిర్మల మతులై లోభదూరులై ధర్మజ్ఞులునై మెలగిరి శూద్రులు ॥శ్రీ

(4) పైరులు పంటలు నిండియుండె భువి పరమభక్తి నవకోసల వాసులు
హరిభజనలచే పొద్దులు బుచ్చుచు ఆనందంబున చెలగుచు నుండిరి ॥శ్రీ

ద్విపద:-ఆదికావ్యంబగుచు నమరునీకథను మోదాన రచియించె మున్నువాల్మీకి
ధన్య మాయుష్యంబు ధర్మార్థదంబు గణ్యంబు నృపులకు ఘనజయావహము
దీని పఠించిన దీరుపాపములు ధనకాములకు చాల ధనము లభించు
సుతకాములకు మంచి సుతులు గల్గుదురు అతులిత సౌఖ్యంబు లందుదురు మరియు
రామాభిషేకంబు కామించివిన్న నీమహి సుజనాళి యీగు దుర్దశల
ఈ మహాకావ్యంబు వినువారలెపుడు రాముని కరుణను రంజిల్లు చుందు్రి
నరపతి విన్నచో ధరను జయించు పరదేశగతుఁడిహాపర సౌఖ్యమందు
తరుణీమణులువిన్న వరసుతుల గాంతు్రి పరగపూజించుచు పఠియించునంత
దురితములు దొరగును శిరియునుగలుగు ఈ శుభకావ్యంబు నెలమి నాలించి
శ్రీశురాముని మదిజేర్చినవారు ఆయురారోగ్య మైశ్వర్యముం గల్గి
బాయుదుర్భవపాశబంధముల్ గాన భక్తితో నరు లిది పఠియింప భుక్తి
ముక్తి గల్గియు హరిభక్తు లయ్యెదరు.

క॥ ఒనరఁగ ఋషి విరచితమగు ఘనమగు రామాయణంబు కడుభక్తి జనుల్
వినిన పఠించిన వ్రాసిన వినుతింగాంచెదరు రామవిభు కృపచేతన్

క॥ శ్రీమద్రామాయణకథ రాముని కర్ణము జేసి రంజిల్ల భువిన్
ధీమహితు డాంజనేయ స్వామిదయన్ వ్రాయగల్గె నదమల భక్తిన్

క॥ హరికేశవ పరమాత్మా సరసిజ భవప్రముఖ స్తోత్రి సజ్జనవినుతా
నిరవధిక సుఖద మునినుత వరదా కోదండరామ వరసుగుణనిధీ.

మంగళము.

తరుచరులనుగూడి దశరథతనయుడు శరనిధి బంధించి శరణన్న విభీషణుని
కరుణించియు లంకాపురిజేరి దశకంఠుని బరిమార్చి సురలచే వరములుగైకొన్న శ్రీ

(2) ధరణిజవిభునియాజ్ఞ దహనుని జేరగ కరుణతో పావకు డాకాంతనుచేకొని
పరమపావనిసీత పాలింపుము రామాయనిన హర్షమునగైకొని అంకమున ఉనచినట్టి

(3) కూరిమిమీర తన్ను జేరియు కపులుగొల్వ ధారుణిసుతనుగూడి తమ్ములుగు సేవింప
ధీరుడు పుష్పకంబు నారోహించియువేడ్క జేరియు సాకేతము శ్రీమీరగనపుడు

(4) పరమోత్సాహంబున పట్టాభిషిక్తుడై పరమప్రీతిని ప్రజల పాలనజేయుచు
నిరతిశయానంద నిరుపమ తేజుడౌ వరనవకోసల వాసునకు భక్తినీ ॥శ్రీ

ద్విపద:-ధర నవకోసలపురవరమందు । పరమ ధార్మికుడు నిష్పాపుఁడు జాత
బెజవాడ వంశాబ్ది విధుఁడు శాంతుండు । సుజన విధేయుండు సుఖదాయకుండు

పట్టాభిరామాఖ్య బ్రిధితుఁడౌరెడ్డి । యిష్టబాంధవులతో వెలయుచు నుండు
అతని సహోదరి అతివ రామమ్మ । వితరణ ఖనియును విమలచరిత్రి
దీనవత్సల రామధ్యానతత్పరయు । జ్ఞానముదితచిత్త గర్వవిహీన
మానవతీమణి మత్సరదూర । వనర నూకలపాటి వంశపావనియు
అనిశంబు సాధుల కతిభక్తి నలుపు । నతికి హరిభక్తుండు సాధుసమ్మతుడు
మతిమంతుడును జ్ఞాని మహిత యశుండు । సేతురామారెడ్డి చెలఁగుచుఁనుండు
అతని ప్రియపత్నియైన రామమకు । సామీప్య సాలోక్య సాయుజ్యమొసగి
రామభద్రుడు బ్రోచు ప్రేమదలిర్ప । ఆ పుణ్యవతి పుత్రియైన కామమ్మ
శ్రీపతి యామెకు ప్రాపుదాపగుచు । కాపాడు సతతంబు కామితం బొసగి॥

శ్లో॥ నమోస్తు రామాయ సలక్ష్మణాయ
నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మ భువేవరాయ
నమోస్తు వల్మీక భవాయతస్మై

గద్య.

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షవీక్షణ లబ్ధ కవిత్వ శౌనకసగోత్ర పవిత్ర
శ్రీరామపుత్రి విరచితము
నవకోసల రామాయణము హరికథ
యుద్ధ కాండము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ
శ్రీమార్పణమస్తు.

---

# అనుబంధములు

144 పుట. (వచనమున ఆసీనుం డయ్యెనంత గుహుండు,)

శ్రీమనోహరి – ఏక.

ప॥ చరణాంబుజముల నిటులనిమ్మా శ్రీరఘుకులవర నీ ॥చ

అ॥ కరుణాలయ నీపదయుగళంబుల గడిగి ధన్యుడయ్యెద ॥చ

చ॥ నీపద పరాగముల శిల నేర్పుమీర పడతియయ్యెగా
ఏపగిది తరుణిగాకుండు నీదారుమయమగు తరణి ॥చ

(2) సరోజ భవభవాది సురముని సన్నుతచరితా
ధరాధిపతి నవకోసలపుర కోదండరామ బ్రోవ నీ ॥చ

414 పుట. 3 వ జోర (అమ్మలకంపజ కెఅగె అట క్రైక.)

చక్రవాకము – అది.

ప॥ మన్నింపుము రామా అపరాధమును మానిని మాధాత్మను నను ॥మ

అ॥ కన్నన రాజ్యము గైకొని యేలుము నా కన్నులపండువుగ గాంచెదనయ్యా ॥మ

చ॥ అవివేకంబున నే నొడలెఱుగక ననిపితి కానకు నినురామా
దివిభువి వెలయ పాలించితివి దేవదేవ పితృవాక్యంబని ॥మ

(2) ఆదిపురుష నారాయణ అఖిలలోక కారణ తారణ
ఆర్తత్రాణ పరాయణ నవకోసలపుర సుజనరక్షణ భువన పోషణ ॥మ

225 పుట. మొదటిజోర (గారవింపుమా ప్రేమ) వాలి రామునకుచెప్పుట

శంకరాభరణం – చాపు.

ప॥ దేవ దేవేశ శ్రీజానకి రమణ ॥దే

అ॥ దేవ దేవేశ దీనజనబంధూ దయాసింధూ ॥దే

చ॥ కూరిమిని నాముద్దుతనయుని చేరదీయుము నానేరములెంచక నీరజాసనవినుత వీడు
కూరుడుగా డతిబలాఢ్యుడు నారాయణా చ్యుత నవకోసల ధామ కోదండరామ॥దే

227 పుట. వ. (అంగదునిగని వాలి.)

సారంగ – అది.

ప॥ ఆశ్రయింపుము శ్రీరామచంద్రు నాశ్రిత వత్సలుని ఘనుని ॥ఆ

అ॥ ఆశ్రయ మితేత్రిజగములలో నాతనికన్న మిన్నలేదు వత్స ॥ఆ

చ॥ తల్లి దండ్రి గురుడు దైవమని యెంచి ధర్మమరసి నవకోసలపతి
యుల్లమలర సేవజేసి బ్రతుకు ఒప్పుమీరగ నాముద్దు తనయ ॥ఆ

